గోదావరి సీమ

# జానపద కళలు క్రీడలు వేడుకలు



ఆంధ్ర విశ్వకళా పరిషత్తునుండి పి. హెచ్ డి. పట్టాపొందిన
పరిశోధనా గ్రంథం

**1991**



పర్యవేక్షకులు

జాతీయాచార్య డా. యస్వీ. జోగారావుగారు
ఎం.ఏ. పి.హెచ్.డి.; గౌరవ డి. లిట్ (ఆంధ్ర & అమెరికా)



**డా. పడాల రామకృష్ణారెడ్డి** ఎం.ఏ. పి.హెచ్.డి.
రంగస్థల పాఠ్య ప్రణాళికా సంఘ సభ్యులు,
ఆంధ్రా యూనివర్శిటీ.

ఈ పుస్తకము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాయముతో ప్రచురితము.

ప్రతులు : 1000

వెల : రు. [illegible]


వలయువారు :

డా. పడాల రామకృష్ణారెడ్డి ఎం.ఏ. పి హెచ్.డి.
కొంకుదురు. (వయా) పందలపాక – 533 345.
తూ॥ గో॥ జిల్లా.
ఫోన్ : 534.
STD. No. 088575

ముద్రణ :

శ్రీ రత్నా ప్రింటర్స్,
ముత్తంగివారి వీధి,
రాజమండ్రి.
ఫోన్ 76345

# ప్రముఖుల అభిప్రాయాలు



బహుకళా సురభిళ భావుక పట్టభద్రుడు

## పడాల రామకృష్ణారెడ్డి

శ్రీ రామకృష్ణారెడ్డి బహుకళా సురభిళ హృదయుడైన భావుక పట్టభద్రుడు. వృత్తిలో పరమ నాగరికుడేగాని ప్రవృత్తిలో వట్టి జానుతెనుగు జాతి జానపదుడు. వివిధ విషయాల్లో చొరవగా ప్రవేశిస్తాడు. ప్రావీణ్యం సంపాదిస్తాడు. అవగాహన చేసుకుంటాడు. అనుభవం మూటగట్టుకుంటాడు. ఆలోచించి పలుకుతాడు. పలికిన పలుకును ఆలోచింపచేస్తాడు. రెడ్డిగారి గ్రంథంలో యించుమించు మన సర్వ జానపద కళారూపాల గురించీ సంగ్రహ పరామర్శ వుంది. అతని పూనికలో ఒక ఏగాగ్రత వుంది. అవగాహనలో సమగ్రత వుంది. సకల జానపద కళాసరస్వతి సర్వాంగీణ పరిష్వంగంగా ఒక పరిశోధన నిబంధాన్ని వెలయింప సమకట్టేవారికి మార్గదర్శకం కాగల లక్షణాల గ్రంథమని ఘంటాపథంగా చెప్పగలను. పలికిన పలుకల్లా రంగస్థల ప్రవేశం చేసిన పాత్రధారి పలుకులా వుందిగాని వట్టి నేపథ్య ప్రవచనంలాగునా, ఆకాశభాషితం మల్లేనూ లేదు. అప్పుడప్పుడు రెడ్డిగారు చెణుకులు విసురుతాడు. అబ్బ! అవి ఒక్కొక్కప్పుడు వట్టి చెణుకులు కావు— గట్టి చురకల్లా ఉంటాయి. చూడ్డానికి సుందర ముఖారవిందుడేగాని అతని విమర్శనాదృక్పథం మాత్రం మొగమాటం లేనిది. రచనకూడా సుగ మార్ధవచసంగానూ, చమత్కార చరణంగానూ ఉంటుంది. మనసారా ఇతనికి నా ఆశీస్సహకృతాభినందన చందనతాంబూలాలు అందిస్తున్నాను.

— జాతీయాచార్య **డా. యస్. వి. జోగారావు.**
ఎం.ఏ. పిహెచ్‌డి. డి. లిట్ **(Hon)** ఆంధ్ర, అమెరికా,
ఆంధ్రా యూనివర్సిటీ.

## జానపద కళలకు ఎన్‌సైక్లోపిడియా

పడాల రామకృష్ణారెడ్డిగారి సిద్ధాంతగ్రంథం తెలుగు జానపద కళలపై ఒక "ఎన్‌సైక్లోపిడియా" అని చెప్పాలి. (విజ్ఞాన సర్వస్వము) జానపదుల కళలు - వారి జీవితాలు - సంఘం - ఆచారాలు - పండగలు - మందులు - వృత్తులు - విశ్వాసాలు - దేవతలు - ఆటలు ఇలా ఎన్నో విషయాలపై మంచి పరిశోధన గావించబడిన గ్రంథం. దీనిలో శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, నాట్యం, కవిత్వం మొదలగు లలితకళలు కూడా శాస్త్రీయ దృక్పధంతో పరిశీలనచేసి చెప్పారు.

తెలుగు సంస్కృతికి, ప్రత్యేకించి తెలుగు జానపద కళలకు ఈ విధంగా వీరు చేసిన మహత్తరమైనసేవ బహుధా ప్రశంసనీయం. గ్రంథం ప్రారంభంనుంచీ అంతం వరకూ ఆసక్తికరంగా నడిపించిన రచనాకౌశలము నిస్సందేహంగా అభినందించదగింది. అట్లాంటి ఉత్తమ పరిశోధన చేసిన శ్రీ రెడ్డిగారిని అవశ్యం మెచ్చితీరాలి.

**— డా. పి. వేణుగోపాలరావు, M.A. Phd.**
రీజినల్ డైరెక్టర్, అమెరికన్ ఇనిస్టిట్యూట్
ఆఫ్ ఇండియన్ స్టడీస్, మద్రాసు.

## రెడ్డిగారి గ్రంథం జానపద కళలకు బహుమానం

ఈగ్రంథంలోని 3 వ భాగంలో జానపదకళలు, ఆచారాలు, అలవాట్లు, విద్య, వైద్యం వగైరా ఎన్నో విషయాలు చక్కగా చెప్పేరు. వ్యాధుల నివారణకు ప్రకృతి సిద్ధమైన వస్తువులతో నేటివ్‌వైద్యం ఎలా చేస్తారో చక్కగా సేకరించి చెప్పారు. నిజంగా ఇది అభినందించదగినంత గొప్పగా వుంది. ఆరవఛాప్టర్‌లో జానపదకళలతోపాటు లలితకళలను పోల్చి చూపించి రచయిత ఉభయపక్షాలపై తనకున్న ఆధిక్యతనూ, అధికారాన్నీ, శక్తినీ నిరూపించుకున్నారు. 2వ ఛాప్టర్‌లో జానపదుల అలవాట్లు, ఆచారాలు వగైరాలు సవిమర్శతో పరామర్శించి "ఇవన్నీ వారిని సుఖవంతులుగానూ, శాంతివంతులుగానూ చేయడానికి ఏర్పాటు చేసినవే అనే రచయితమాట అక్షర

సత్యం. ఈ గ్రంథం చాలా సరళసుందరంగా వ్రాయబడింది. ఇంత సమాచారం సేకరించిన రచయిత కృషి అద్భుతం. ఇంత పెద్ద విషయాన్ని చేబట్టి ఛేదించడం రచయిత పట్టుదలకు ఆసక్తికి నిదర్శనం. ఇది జానపద కళారంగానికి ఒక గొప్ప బహూమానమనే చెప్పాలి. ఒక్క జానపద కళారంగానికేకాదు తెలుగు సాహితీ సాంస్కృతీమతల్లి మెడలో చేరిన మరో మంచి మణిహారం.

— ప్రొఫెసర్ డా. షేక్ మస్తాన్, M.A. Phd.
అలిఘర్ యూనివర్సిటీ.

## అభినందార్హమైన గ్రంథం రామకృష్ణారెడ్డి థీసిస్

శ్రీ పడాల రామకృష్ణారెడ్డిగారు ఆచార్య యస్. వి. జోగారావుగారి వంటి బహుముఖ ప్రజ్ఞాధురీణుల పర్యవేక్షణలో సాగించిన ఈ పరిశోధన చరిత్రలో నిల్చిపోతుంది. ఈ సిద్ధాంత గ్రంధంలోని ఈ క్రింది అంశాలు ప్రస్తుతించదగినవిగా పేర్కొనాలి.

ఎన్నుకొన్న విషయం పండితులకు, సాధారణ పాఠకులకు ఉత్సుకతను, అభిరుచిని కలిగిస్తోంది. అంశాలన్నీ అందరికీ అందికలో ఉండి మనసును రంజింపచేస్తున్నాయి. ఎన్నుకున్న విషయాన్ని విభజించిన తీరు ఎంతో బాగుంది. విషయ విశ్లేషణ ప్రశంసనీయం. "జానపదుల నిసర్గ విజ్ఞాననిధి" అనే అధ్యాయంలో చర్చించిన వివిధ అంశాలు విజ్ఞానదాయకంగా విషయ వివరణాత్మకంగా ఉన్నాయి. అదేవిధంగా 8, 9, 10 అధ్యాయాలు అభిరుచిని ప్రేరేపిస్తున్నాయి. విషయ సేకరణలో శ్రమ, దీక్ష కన్పిస్తున్నాయి. విషయానికి తగిన సులభ సుందరమైన భాషలో వ్రాయటం జరిగింది. మొదలు పెట్టింది లగాయితు చివరివరకు విడిచి పెట్టకుండా ఎంతో ఉత్సుకతతో చదివిస్తున్న ఉత్తమమైన పరిశోధన గ్రంథం. రచయితకు నా అభినందనలు.

— ప్రొఫెసర్ డా. మద్దూరి సుబ్బారెడ్డి M.A.Phd.
శ్రీ వెంకటేశ్వరా యూనివర్సిటీ - తిరుపతి.

## ఆలోచనకు ప్రేరణ కలిగించే వ్యక్తి రామకృష్ణారెడ్డి

నాటకకర్తగా, అనేక జానపద కళారూపాల రచయితగా శ్రీ పడాల రామకృష్ణారెడ్డి సుప్రసిద్ధులు. రచనతోపాటు నటనలోకూడా సముచిత ప్రావీణ్యం ఉండడంవల్ల ఆయన నాటకాలు మరింత రక్తికట్టాయి. ఆలోచనకు ప్రేరణ కలిగించేవ్యక్తి. తెలుగు జానపద కళారంగంలోని అన్ని అంగాలగురించి (రంగాలగురించి), అంశాలగురించి రసవత్తరమైన శైలిలో వ్రాశారు. తెలుగువారికే తెలియని కొన్ని జానపద కళలగురించీ, ఆటపాటల గురించీ వీరు వ్రాసిన గ్రంథం యీ రంగంలో ఎత్తిన మరో మణిదీపం.

పాటైనా మాటైనా ప్రతిభావంతంగా పలికే రామకృష్ణారెడ్డికి నా అభినందనలు.

- జ్ఞానపీఠఅవార్డు గ్రహీత, పద్మభూషణ, పద్మశ్రీ, ఆచార్య

**డా. సి. నారాయణరెడ్డి**

వైస్ ఛాన్సలర్, తెలుగు యూనివర్సిటీ.

## అభినంద్యులు రామకృష్ణారెడ్డి

తెలుగువారి జానపదకళలు, వేడుకలు, సంబరాలు, ఆటలు, పాటలు మాటలు మొదలైన వాటిగురించి మీరు చాలా సమాచారం సేకరించారు. ఇన్నిటి గురించి ఇంతవరకూ ఎవ్వరూ ఒక్కచోట సంగ్రహించలేదు. మీ కృషి ప్రశంశాపాత్రం. మీరభినంద్యులు. నాగరికత పెరిగిన కొలదీ యీ కళలు మరుగుకుపోతాయి. దీపముండగానే యిల్లు చక్కదిద్దుకోవాలి. కొన ఊపిరితోనున్న యీ కళలగురించి భావితరాల వారికి తెలియటానికైనా మీ పుస్తకం బాగా ఉపకరిస్తుంది. ఇది గొప్ప సిద్ధాంత గ్రంథం.

ఒకవైపు ఉద్యోగధర్మం నిర్వహిస్తూ, మౌలికమైన, రచనలుచేస్తూ తీరిక చూసుకొని జానపద కళారూపాలగురించి పరిశోధనాత్మక గ్రంథం అందించినందుకు మిమ్ము అభినందిస్తున్నాను.

— ప్రొఫెసర్ **డా. బిరుదు రామరాజు**

ఎం.ఏ., పిహెచ్.డి. ఉస్మానియా యూనివర్సిటీ.

## పండిత పామర జనరంజకం రామకృష్ణారెడ్డి రచన

బాధ్యతగల ఉద్యోగం నిర్వహిస్తూ ఇటువంటి పరిశోధనాత్మక గ్రంథం వ్రాయటమనేది సామాన్యమైన పనికాదు. మీరు చెప్పిన చాలా విషయాలు ఆయా కళారంగాలలో నిరంతరం పరిశ్రమచేస్తున్న వారికి కూడా సంపూర్ణంగా తెలియవేమో !

మీది ప్రగాఢమైన లోతైన సాంస్కృతిక దృష్టిగల రచన. అందునా జానపదకళలను శాస్త్రీయ స్థాయికెత్తి వాటికి పండితలోకంలో ప్రామాణికత సాధించడానికి మీ గ్రంథం ఎంతైనా ఉపకరిస్తుంది.

విషయం చెప్పే తీరు పండిత పామరులందరికీ హృదయంగమంగా ఉండుట మీ రచనలోని మరొక విశేషం. మీది ప్రతిభా పాండిత్య పరిశీలనలు ముప్పిరిగొన్న సాహిత్య వ్యాసంగం. మీకు నా హార్దిక శుభాకాంక్షలు.

**డా. వి. వి. యల్. నరసింహారావు,**
ఎం. ఏ. పి. హెచ్. డి.
డైరెక్టరు, ఆం. ప్ర. ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం.
హైదరాబాదు.

## శ్రీ రామకృష్ణారెడ్డిగారి పరిశీలన గ్రంథం అనర్ఘరత్నం.

శ్రీ రెడ్డిగారు జానపదకళల గూర్చి, వాని స్వరూప స్వభావాల గూర్చి, వాని హీనస్థితినిగూర్చి పరిశోధనాత్మకంగా తేటతెల్లంగా యీ గ్రంథంలో ప్రకటించారు. తెలుగు నాటక వికాసం గురించి, పౌరాణిక నాటకాల దుర్గతి, దుస్థితి గురించి నిరూపించి తమ బాధను వ్యక్తం చేశారు. అంతేగాక వివిధ శీర్షికలలో వారు వివరించిన అంశాలు అద్భుతాలు సహజ దర్పణాలు.

శ్రీ రెడ్డిగారి పరిశోధనా సమగ్రతకు, విషయ వివేచనకు యీ గ్రంథం అనర్ఘరత్నం అనడంలో సందేహంలేదు ఇట్టి రచనలు మరింతగా యీ రచయిత లేఖినిద్వారా వెలువడాలని ఆశించడంలో అత్యాశలేదు.

– ప్రొఫెసర్ **డా. యం. ఆర్. అప్పారావు,** నూజివీడు.
అధ్యక్షులు ఆంధ్రనాటక కళాపరిషత్.

## సరస్వతీ పుత్రుడు రామకృష్ణారెడ్డి

మీ కలం నుండి వెలువడిన ప్రతి అక్షరం, మీ నోటినుండి వచ్చిన ప్రతి ఉపన్యాసం ఒక క్రమప్రకారం రూపుదాల్చి శ్రోతలనాకట్టుకుంటాయి. ఇది అందరికీ లభ్యమయ్యేది కాదు. మీరు సరస్వతీ కటాక్షం పొందిన మహనీయులు. మీ హృదయం కళాహృదయం. అసలు మీ రూపమే కళాస్వరూపం. మీ ఓర్పు, మాటలకూర్పు మరొకరికుండవేమో అనిపిస్తుంది. అన్ని కళలూ మీలో యిమిడిపోయాయి. మీ తంబుర కథ విని ముగ్ధుడనయ్యాను. సర్వసమర్థులు మీరని ఆ కథ ఋజువు చేసింది. అంత రక్తిని, ఆసక్తిని కలిగించిన కథాగానం నా నలభై సంవత్సరాల అనుభవంలో తమది మాత్రమే. ప్రదర్శనలో ప్రావీణ్యముంది. రచనలో రంజకత్వం వుంది. ఈ రెండూ సమపాళ్ళలో రంగరించి పోసి సరస్వతీ మాత మీలో తన రూపాన్ని చూసుకుంటుందని భావిస్తున్నాను.

— గాన కళారాధక బుగ్గా పాపయ్యశాస్త్రి

## ఏక్టర్ రెడ్డికి - డాక్టరేట్

ఏక్టరు పడాల రామకృష్ణారెడ్డి మహాశయులకు డాక్టరేటు రావడం ఆప్తమిత్రాదులకు ఆనందదాయకమైన విషయం. పదవిలో ఉంటూ పలు సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొంటూ సాహితీక్షేత్రంలో కృషీవలునివలె లేఖినిపట్టి సాహితీసౌరభాన్ని సృష్టించడమేగాక ప్రజల ఆదరాభిమానాల పాత్రుడైన ఉత్తమనటుడు రామకృష్ణారెడ్డి ధన్యజీవి. అధికారంలో ఉండి డాక్టరేటు పొందినవారు మన జిల్లాలో వీరే ప్రథములని నా భావన.

— ఆంధ్రా నయాగరా, ప్రొఫెసర్ బి. వి. యస్. పాత్రుడు

# కృతజ్ఞతలు

1972లో ఎం. ఏ. పాసైనా నాలో విద్యాతృష్ణ తీరలేదు. కాని ఉద్యోగం వదలుకోలేను. పి. హెచ్.డి. ప్రయివేటుగా చేద్దామనేది నా తపన. మునిసిపల్ కమీషనరు ఉద్యోగంలో యిది సాధ్యపడేదికాదన్నారు అందరూ. రాజమండ్రిలో ఒక మీటింగులో ఒకసారి ప్రొఫెసరు యస్వీ. జోగారావు గారితో యీ ప్రస్తావనతేగా తప్పక యూనివర్సిటీకి అప్లయిచేయండి, ఈ సబ్జక్టుకు మీరు ఫిట్ కేండిడేటు అన్నారు. అలాగే ఆంధ్రా యూనివర్సిటీ ఎగ్జంప్షన్ యిచ్చింది. కాని నేనున్నది నూజివీడు. అంతదూరంనుండి దీన్ని సాగించడం అసాధ్యం, నాకోరిక తెలపగానే ప్రభుత్వం దయతో నన్ను భీమ్లీ కమీషనరుగా ట్రాన్స్ఫర్ చేసింది, భీమ్లీ మంచి వాతావరణం ఇక్కడికి వచ్చేసానండి అని చెప్పగానే ప్రొఫెసర్ జోగారావుగారు ఎంతో ఆనందించి తనదగ్గర అవకాశంకల్పించి ఆరు మాసాలలో ప్రీ పి. హెచ్.డి. పూర్తిచేయించి, సంవత్సరం తిరక్కుండానే పి. హెచ్.డి. కి యీథీసెస్ సమర్పించేటట్టు చేశారు. వారిచ్చిన ఉత్సాహం, ప్రోత్సాహం యీ పరిశోధనలో నేనుపడ్డ కష్టాన్ని మరపించేది. ఆయన ఉత్తమ గురువు. నన్ను శిష్యుడుగా గాక స్నేహితుడిగా అభిమానించారు. వారికి నా నమస్కృతులు.

ఈ థీసెస్ని మెచ్చి నాకు డాక్టరేట్ పట్టా యివ్వడానికి సిఫార్సు చేసిన ఆంధ్రాయునివర్సిటీ తెలుగుడిపార్టుమెంటు అధ్యాపకులకూ, యీ గ్రంథంపై నాకు డాక్టరేట్ యివ్వమని అమూల్యాభిప్రాయం అందించిన యితర యూనివర్సిటీల ఎడ్జుడికేటర్సుకూ నా వందనాలు.

ఈ పరిశోధన ప్రజలకు సంబంధించినదికావడంవల్ల యీ పేరుమీద ఎందరో వృద్ధ కళాకారులను, అజ్ఞాతమేధావులను కలిసేభాగ్యం కలిగింది.

ఇది నాకు ఎనలేని శక్తిని, ఆసక్తిని, అన్నికళలపట్ల అవగాహనని పెంపొందించి ప్రజలు ప్రీతితో "సకల కళాసాగర", "లలితకళాభిజ్ఞశేఖర", "జానపద కళాపరిపూర్ణ" వంటి బిరుదులిచ్చి గౌరవించేటట్లు చేసింది. ఆ మేధావులకి, ఆ కళాకారులకి, ఆ అభిమానులకి నేనెంతో ఋణపడి వున్నాను. వారికి నా అభివాదములు.

పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయమందించిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా కృతజ్ఞతలు.

భవదీయుడు

డా. పడాల రామకృష్ణారెడ్డి ఎం.ఏ. పి.హెచ్.డి.



# విషయ సూచిక

# ప్రస్తావన

* " మా తెలుగు తల్లికీ మల్లె పూదండ
మా కన్న తల్లికీ మంగళారతులు
గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయీ
మురిపాల ముత్యాలు దొరలుతాయీ...."

గోదావరీ, కృష్ణా, తుంగభద్రానదుల పావన జలాలతో పునీత మౌతున్న తెలుగునేల ఒకనాడు వెలనాడు, వేంగినాడు, సప్పినాడు, ములికి నాడు, పల్నాడు, పాకనాడు, పొత్తపినాడు, కమ్మనాడు మొదలగు నాడులుగా విభజింపబడింది. స్వాతంత్రావతరణ నాటికి అది వేర్వేరు ప్రభుత్వాలక్రింద ఆంధ్రా, తెలంగాణా, అని రెండుగా విభజింపబడివుంది. బ్రిటిషువారి మూసలో చరిత్రకారులు సర్కారులు, రాయలసీమ, తెలంగాణా అని మూడు ప్రాంతాలుగా విభజించి పరామర్శించారు. సాహిత్యకారులు తమ కావ్యాలలో రాయలసీమ, పలనాటి సీమ, వెలనాటిసీమ, నెల్లూరుసీమ, గుంటూరుసీమ, దివిసీమ, కోనసీమ, కళింగసీమ వగైరా పేర్లతో ఆయాప్రాంతాలను పేర్కొనడంతో సీమల పేరుతో మరొక ప్రాంతీయ విభజన కనిపిస్తోంది. ఇంతకీ ఎవరు ఎలా విభజన చేసినా మొత్తంగా —

" తెలుగు జాతి మనది
నిండుగ వెలుగు జాతి మనది
తెలంగాణా నాది
రాయలసీమ నాది
నెల్లూరు నాది
సర్కారు నాది
అవన్నీ కలిసిన తెలుగునాడు
మనదే మనదే మనదే "

అన్న సి.నా.రె. గీతం యీ జాతికి వేదం
అంతా తెలుగుసీమ అనేది యీ పూలదండలో దాగున్న దారం.

---

* శంకరంబాడి సుందరాచార్యులు

"వేదంలా ఘోషించే గోదావరి
అమరధామంలా శోభిల్లే *రాజమహేంద్రి"

అనే ఆరుద్ర పాటలోని గోదావరి ఘోష ఆ తల్లి తన స్తన్యమిచ్చి పండించే ధాన్యరాసుల గలగలారావమే.

---

* In the Map South Asia in the Age of Ghaznavids, Cahamanas, Later Chalukyas and Cholas C. 975 - 1200 (Page 32 plate IV - 2) Rajahmundry, the present name is identified as 'Rajamahendri',

The Map South Asia in the time of Khalgis and Tuglags, C. 1290-1390 is showing Rajahmundry as Raja mahendri Page 38 plate V 2.

In the Map South India C. 1390-1485 Rajahmundry is appearing as Rajamahendri (page 38 plate V - 3CC)

In the Map South India C. 1485 - 1605, also follow ing the suit stating Rajahmundry as Rajamahendri (page 40 plate V 4 CC).

In the Map Religious and Cultural sites C. 1200 - 1525, Rajamahendri, in the place of Rajahmundry, is pointed and underlined showing its due importance page 41. plate V-5 (A)

The Map Northern South Asia during the Reign of Akbar 1556-1605 is also bearing the evidence of Raja mahendri (Page 44 plate VI A I CC)

In the Map South Asia during the reigns of Jahan gir. Shajahan and Aurangajeb 1605 - 1707 Rajahmundry could be seen as Rajamahendri Page 46. plate VI A-3 (A)

(A Histrorical Atlas of South Asia edited by Joseph E. Schwartzberg and published by the university of Chicago and London, 1978).

'బెంగుళూరు నుండి రాజమండ్రి' రైల్వేటికెట్లపై యీనాటికీ హిందీ, కన్నడ భాషలలో 'రాజమహేంద్రి' అనే ఉంటుంది.

మద్రాసు మ్యూజియమ్‌లో ఉన్న క్రీ. శ. 100 నాటి తామ్రశాసనంలో 'రాజమహేంద్రి' అని వ్రాయబడింది.

1802 నుండి 1859 వరకు 'రాజమహేంద్రి' కేంద్రంగా 'రాజమహేంద్రి' జిల్లా వుండేది.

అనంతరకాలంలో ఆంగ్లభాషా సంపర్కంతో ఉచ్చారణ సౌలభ్యం కోసం రాజమండ్రిగా మారి ఉంటుంది.

నాసికాత్రియంబకం దగ్గర పుట్టిన గోదావరి ఉరవళ్ళు పరవళ్ళతో కొండలూ, పర్వతాలూ, లోయలలో స్వేచ్ఛా విహారం చేస్తూ, మంజీరా, మానేరు, ప్రాణహిత, ఇంద్రావతి, శబరివంటి చెలికత్తెల జతకూడి జలకాలాడుతూ జల పాతాలూ, సేలయేళ్ళూ, నదీనదాలను దాటుకుంటూ తొమ్మిదివందల మైళ్ళ సుదూర యానంచేసి నిత్య యవ్వనంతో నయగారా లొలికిస్తూ అందెల రవళులతో చిందులు వేస్తూ పరవశంతో సాగర ప్రియుని చేరే యీ పడతిసోయగం అంతర్వేదివద్ద ఒక మనోహర మధుర మంజుల సుందర దృశ్యం. ప్రజాశిల్పి కాటన్‌దొర క్రీ.శ. 1852 ప్రాంతంలో ధవళేశ్వరుని సన్నిధిలో యీ నదీమతల్లికి ఆనకట్టకట్టి, ఆయకట్ట లేర్పరచి గోదావరి పరీవాహక ప్రాంతాన్ని సస్యశ్యామలం చేశాడు. ఆ స్వర్ణభూమియే నేటి తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలు. ఈ ఉభయ గోదావరి జిల్లాలను గోదావరి సీమగా పరిగణిస్తూ యీ పరిశోధన ఆ ప్రాంతానికి పరిమితం చేయడం జరిగింది.

ఆదిలో కొండలతో, కోనలతో, రాళ్ళతో, రప్పలతో కీకారణ్యంలా వుండే యీ ప్రదేశం ధవళేశ్వర వారధితో దేశానికి గొప్ప ధాన్యాగారమయ్యింది. ఇక్కడ గోదావరి, గౌతమి, వశిష్ఠ, వైనతేయ, తుల్య, ఆత్రేయ, భరద్వాజ, కౌశికి అనే ఏడు పాయలుగా విడి సప్తసాగరంగా పిలువబడుతూ ఇరు జిల్లాలను చుట్టిముట్టి పంట కరువూ, నీటి కరువూ లేకుండా బంగారుసీమ చేసి అన్నపూర్ణలా అందర్నీ ఆదుకుంటోంది. (కోపమొస్తే అది వేరే సంగతనుకోండి; అయినా అది తల్లి కోపమే)

వేషంలో, భాషతో యిక్కడి ప్రజల తీరు సౌమ్యమైనది. ప్రసన్నమైనది. ఇక్కడ ప్రకృతి సహజ సౌందర్య సుగుణాలరాశి. కళింగసీమలో "ఎల్లిపొచ్చుండు" అంటే తెలంగాణాలో "వొచ్చిండు" అంటే, యిక్కడ "వచ్చాడు" అని వాడుక. అయినా

"వచ్చిందన్నా వచ్చాడన్నా
వరాల తెలుగు ఒకటేనన్నా"

అనే సి.నా.రె. మాట అక్షర సత్యం.

ప్రజల్లో ప్రచార సాధనాలైన సినిమాలూ, పత్రికలూ గోదావరిసీమ భాషనే వాడుతున్నారు. గనుక యిదే ప్రామాణిక భాష అనడం సరికాదుగాని సర్వులకూ అర్థమయ్యే నుడికారం యిందులో ఉందని ఒప్పుకోక తప్పదు. శ్రీకాకుళంనుంచి పాయకరావుపేటవరకూ వచ్చిన మాట తునిదగ్గర ఒక్కసారిగా మారిపోతుంది. రవిక లేని చీరకట్టు, ముఖాన పెద్ద బొట్టు, చెవికి పోగులు, ముక్కుకాడ విడిచి రవిక తొడుక్కుని చీర సింగారించుకొని చిన్న బొట్టుతో చెవికి కమతాలు ముక్కుపుడకలు ధరించి శరద్రాత్రి వెన్నెలలో ప్రవహించే గోదావరి మాతతా నిర్మలాగా సాగిపోతుంది ఏలూరువరకూ. ఏలూరు దాటిన దగ్గరనుంచి కృష్ణావాసుల పడికట్టు వేరు. మాటలో [illegible] వాడుక మాటల్లో భిన్నత్వం విచిత్రమైన వైవిధ్యాన్ని సూచిస్తాయి. గోదావరి జిల్లాల్లో 'ఉప్పట్టి' అనే ఆటను యిక్కడ 'చెడ్డాట' అంటారు. ఆపైన గుంటూరు వారిది కారంతీరు. ఇలా జిల్లా జిల్లాకు ఎంతోకొంత భిన్నత్వం కనిపిస్తుందిగాని ఉభయగోదావరి జిల్లాలలో మాత్రం ఆటల్లో, పాటల్లో, మాటల్లో, చేష్టల్లో, వేషంలో, భాషలో వీసమెత్తు తేడాకూడా కనిపించకుండడం విశేషం. ఏవో కొద్దిపాటి పట్టణాలు తప్ప యీప్రదేశమంతా పల్లెలమయమే. ఈ పట్టణాలుకూడా ఎక్కువభాగం పల్లెవాతావరణాన్నే ప్రస్ఫుటింపజేస్తాయి. ప్రస్తుత విషయమైన జానపదకళలు, క్రీడలు, వేడుకలు విజ్ఞానాత్మకములు, వినోదాత్మకములు, ఆరోగ్యసంధాయకములు, సంఘ శ్రేయఃకాములు. ఒకనాడు మూడు పువ్వులూ, ఆరుకాయలుగా జనజీవనంలో అంతర్భాగంగా అల్లుకుపోయి జ్వాజ్వల్యమానంగా వెలుగొందాయి. వీని విలువలు సమాజంమీద ఎన్నితరాలైనా తరగనివి చెరగనివి. అందుకే నేటి నాగరికులు వీనిని ఎంత వెనక్కి నెట్టుతున్నా ఏదోలాగ బయటికొస్తూ వారికి తెలియకుండానే వారిలో కూడా ప్రవేశిస్తూ తమ ప్రతిభనూ ప్రజ్ఞనూ అవిచ్ఛిన్నంగా ప్రకటించుకుంటూనే ఉన్నాయి. దీనికి కారణం యీ విజ్ఞానం సమాజంమీద వేసుకున్న ప్రగాఢమైన ముద్ర. ఇది విడివడనిది, ముడివిడనిది.

# జానపద విజ్ఞానం

జానపదమనేది జనపద శబ్దజనితం. * జనపదమనగా నైఘంటి కార్థములు గ్రామము, దేశము అని. ఇందు సాహిత్యపరంగా గ్రామమను అర్థమే రూఢి అయ్యింది. గ్రామమంటే పల్లె. కనుక జానపదమంటే పల్లె జనులకు సంబంధించినది అని చెప్పుకోవచ్చును.

జానపదమనగా దేశము, గ్రామము, గ్రామములనుండి పొందుపన్ను మొదలగు అర్థాలుకూడా ఉన్నాయి. అలాగే జానపదుడు అంటే మనుష్యుడు అనీ, జానపదులంటే పల్లెటూరివాండ్రు, మోటువారు అనీ నిఘంటువులో చెప్పబడ్డా వ్యవహారంలో జానపదులనగా పల్లెజనులనీ, జానపదమనగా పల్లెజనులకు సంబంధించిన విశేషం అని మాత్రమే స్థిరపడింది.

∠ 1 "జనపదము అనగా పల్లెటూరు. జనపదమున నివసించు జనులు జానపదులు"

∠ 1 ∠ 1 "జానపద విజ్ఞానాన్ని ఇంగ్లీషులోని ఫోక్‌లోర్‌కు సమానార్థకముగా వాడుతున్నారు. ఈ ఫోక్‌లోర్ అనే పదాన్ని డబ్ల్యు.జె.థాంస్ 1846 లో రూపొందించాడు"

∠ 1 ∠ 11 "జానపద విజ్ఞానానికి సంబంధించిన నిర్వచనము బూృన్ వాండ్ ఇలా చెప్పాడు".

"Those materials in Culture that circulate traditionally among members of any group indifferent versions whether in oral form or by means of customary example".

---

* శబ్దార్థ చంద్రిక :

∠ 1 నాట్యకళ ఫిబ్రవరి-మార్చి 1970, సంపాదకీయం. పుట 2

∠ 1 ∠ 1 ఆంధ్రుల జానపద విజ్ఞానము, డా. ఆర్.వి.యస్. సుందరం పుట 2

∠ 1 ∠ 11 డిటో పుట 5

\+ "కృత యజ్ఞశ్చ మేధావీ బుధో జానపద శ్శుచిః"
అని వ్యాసులవారు జానపదులను యజ్ఞముచేసిన వారితోడను, పండితుల తోడను సమానముగా నొనర్చిరి.

పల్లెజనులకు సంబంధించిన జ్ఞాన సంపదయే జానపద విజ్ఞానం. దీనిని స్థూలంగా రెండు రకాలుగా విభజించవచ్చు.

1) జానపదుల నిసర్గ విజ్ఞాన నిధి.

2) జానపదులకు విజ్ఞానదాయకమైన పెన్నిది.



\+ తెలుగు జానపదగేయ సాహిత్యము. ప్రవేశిక పు. 1

డా. బి. రామరాజు.

# జానపదుల నిసర్గ విజ్ఞాన నిధి

జానపదులయొక్క సహజ విజ్ఞాన నిధి పరంపరానుగతమైనది. శతాబ్దాల తరబడి వారసత్వముగా ఒకరినుండి మరియొకరికి సంక్రమిస్తూ ప్రవహిస్తున్న సజీవస్రవంతి. ఇది వారి విద్య, వైద్యం, ఆహారం, విహారం, వ్యవహారం మొదలైన రంగాలలో విశేషంగా కనిపిస్తుంది.

## విద్య :

వీరివి చాలవరకు వానాకాలం చదువులు, పల్లెజనులు సేద్యం వృత్తిగా గల రైతులు, రైతుకూలీలు. వీరికి సంవత్సరంలో వానాకాలం తీరిక. ఊడ్పులు పూర్తయి మరల పంట కోతకొచ్చే వరకూ పనిపాటులుండవు. ఇదే వర్ష ఋతువు. ఈ సమయంలో వీధుల్లో అరుగులమీద పాఠశాలలు నిర్వహించే పంతుళ్ళవద్ద ఓనమాలు ప్రారంభించి "ఓం.న,మః, శి.వా,యః" శతకాలూ, పద్యాలూ కంఠస్థం చేస్తూ, పొలాల్లో స్వేచ్ఛగా గొంతెత్తి పాడుతూ శృతిలయలు తమంత తాముగా తమ్ము వరించేటట్లు చేసుకుంటారు. సంగీత సాహిత్యాలు ఇలా వారి రక్తనాళాలలో ప్రవేశిస్తాయి. 'పెద్ద బాలశిక్ష' వీరి పారాయణ గ్రంథం. భారత, భాగవతాది పురాణేతిహాసాలు వింటూ, వానిలోని నీతులను జీర్ణించుకుంటూ వానిని తమ నిత్యజీవితాల మీదికి అనువర్తింపచేసుకొనేవారు. రాముడులాంటి కొడుకు, సీతలాంటి కూతురు వారు మనసారా కోరుకొనేది. "యద్భావ్యం తద్భవతి" అన్నట్లుగా తల్లికనుసన్నలలో మెలిగే కూతుళ్ళూ, తండ్రి అడుగుజాడలలో మెలిగే కొడుకులూ వారిసంతానం. వృత్తులలో తండ్రివృత్తే కొడుకు స్వీకరించేవాడు. సర్వులకూ వృత్తివిద్యలు శిరోధార్యం. కర్షకునిబిడ్డలు కర్షకులే అయి చెమటోడ్చి పనిచేసి ధాన్యరాసులు పండించి అన్నదాతలై అందరినీ ఆదుకొనేవారు. కమ్మరి, కుమ్మరి, కరణం, కంసాలి, సాలె, పురోహిత వృత్తుల వారు తమ పిల్లలను తమ వృత్తులలోనే ప్రవీణులగా, ప్రజ్ఞావంతులుగా తీర్చి దిద్దేవారు. "కులవిద్యకు సాటిరాదు గువ్వల చెన్నా" అనేది వారి నరనరాలలో నాటుకుపోయిన మాట. అందువల్ల వారికి నిరుద్యోగసమస్య అనేది లేదు. ఇది విద్యా విషయకంగా వారి విజ్ఞాన సిరి.

## వైద్యం :

* "Folk medicine is the substance of all the traditional view points on sickness and the healing methods applied against disease which exist among the people".

జానపదుల వైద్యం వారికి అనుభవం నేర్పిన విద్య. తమ పూర్వుల నుండి అందుకోబడిన నిధి.

ఇంగ్లీషు వైద్యం రాకముందు పల్లెసీమల్లో ఆయుర్వేద వైద్యం ప్రసిద్ధిగా సాగింది. దీనికి ఆద్యుడు 'ధన్వంతరి', 'చరకసంహిత' ప్రమాణ గ్రంథం. దీనిలో పేరెన్నికగన్న వైద్యులకు మెడల్స్ యిచ్చి, బిరుదులిచ్చి పల్లకీలమీద కూడా ఊరేగించేవారు. ఆ రోజుల్లో రాజవైద్యులుకూడా వీరే. ఇప్పటికి కూడా అల్లోపతివైద్యానికి లొంగని దీర్ఘరోగాలకూ, మొండి వ్యాధులకూ ఇదే శరణ్యం. తరువాత జర్మనీనుండి దిగుమతి కాబడిన హోమియో వైద్యంకూడా బాగా ప్రచారం పొందింది.

వీటికన్నిటికీముందు సమాజానికి గొప్ప సేవచేసింది జానపదుల అనుభవవైద్యం. ఇది నాటువైద్యమనీ, గచ్చాకు పుచ్చాకు వైద్యమనీ కొట్టిపారెయ్యడానికి వీల్లేదు. నాడిచూసి రోగం నిర్ణయించే ప్రక్రియ జానపదుల సొత్తు. వీరు చేయి పట్టుకొని నాడిచూసి వాతం, పిత్తం, శ్లేష్మం వగైరాలు హెచ్చు తగ్గులు గమనించి మందులిస్తారు. ఈ మందు కూడా అతితేలికగా లభ్యమయ్యేదే. చాలావరకు చిట్కావైద్యమే. ఉదాహరణకి తేలుకుట్టింది అనుకోండి. వెంటనే చింతపిక్క అరగదీసి కుట్టినచోట అంటిస్తే టక్కున అతుక్కుపోతుంది. పది నిమిషాలలో ఆ విషాన్నంతా పీల్చుకొని ఆ పిక్క ఊడిపోతుంది. దానితో బాధకూడా పోతుంది. దెబ్బతగిలి రక్తం కారుతుంటే దానిపై ముగ్గువేసి కిరసనాయిలు పోస్తారు. వెంటనే రక్తం కట్టడిపోతుంది. గుడ్డ కాల్చి ఆమసి అంటిస్తారు - దెబ్బ మాడిపోతుంది.

---

* Oswald A. Erich and Richard Beifle, as quoted in Folklore Folk life 1972 P. 193, 194

("ఆంధ్రుల జానపద విజ్ఞానము" నుండి గ్రహించబడినది.)

గజ్జికురుపులకు ఆముదం, సున్నం కలిపి రాస్తారు. - చీము వోడి పోతుంది, కురుపు మాడిపోతుంది. చిడుముకు మురుపిండాకు, పసుపు, ఉప్పు కలిపి నూరి రాస్తారు- తగ్గిపోతుంది. చిడుము, గజ్జి తగ్గడానికి సముద్ర స్నానం చేయిస్తారు - అదికూడా ఒక మందు క్రింద లెక్క-, ఒంటిమీద పొక్కు-లకు 'మాచపత్రిఆకు' పసరు రాస్తారు. తామరకు, చిక్కు-డాకురుద్దినా, కొబ్బరిపెంకు కాలుస్తుంటే వచ్చే చమురురాసినా తగ్గిపోతుంది. ఇలా వైద్యం తేలిగ్గాచేస్తారు. సెగ్గడలకు తెలగపిండి పెరుగులో నానబెట్టి కట్టుకట్టి పక్వానికి వచ్చాక చంద్రకాంతంచెట్టు ఆకును ఆముదంతో వేడిచేసి అంటిస్తారు. అది కోసేసి చీమునంతటినీ వోడ్చేసి మానిపోతుంది. ముఖంమీద మొటిమలకు అల్లంరసం ఆరారా రాస్తారు - తగ్గిపోతాయి. చిడుపుడి కాయలకు సున్నం, చాకలిసోడా కలిపి అంటిస్తారు- రాలిపోతాయి. సప్పికి, మాదకి పిప్పళ్ళు, మిరియాలు, దాల్చినచెక్క-, చెంబపిక్క-లు కలిపి అరగదీసి ఆ గంధం పూస్తారు. మాదకు కాకినాడ దగ్గరగల పెద్దాడలో చీట్లుయిస్తారు. ఈ చీట్లు తీసుకున్న మనిషి రోగి దగ్గరకు వెళ్ళేవరకూ అల్పాచమానంకూడా చెయ్యకూడదు. అంత కఠోరమైన నియమం. ఆ చీట్లు రోగిదగ్గర చింపుతారు. ఆ మాద తగ్గిపోతుంది. అయితే చుట్టపొగ వాసనవంటివి అయిదారు రోజుల వరకూ రోగిదగ్గరకు రానీయకూడదనే నియమం వుంది, ఈ చీట్లతోపాటు మందుకూడా యిస్తారు. అది కూడా వాడాలి.

కవుకుదెబ్బలకు ములగాకూ, వామ్మూ ఉడికించి కట్టుకడతారు నడుము నొప్పికి కోడిగుడ్డులోని తెల్లసొన గుడ్డకిరాసి సెగనుకాసి పట్టువేస్తారు, ఇరుకు నొప్పికి, బెణుకు నొప్పికి చింతపండు ఉడికించి పట్టువేస్తారు. వాతం నొప్పులకు తెల్లజిల్లేడుపాలు పొడుస్తారు. మలుగుపాము నడుంముక్క- వండిపెడతారు, కీళ్ళ నొప్పులకి (రొమెటిజం) ఉడకబెట్టిన కేబేజి ముక్క-లుముక్క-లుగా తరిగి రోగి కాళ్ళకూ చేతులకూ మర్దనా చేస్తారు. కాళ్ళూచేతులూ తిమ్మిర్లకు నీరుల్లిపాయ మెత్తగా నూరి మర్దనా చేస్తారు-తగ్గిపోతాయి, కాళ్ళ పగుళ్ళకి ఆముదంలో పసుపుకలిపి పగుళ్ళలో రాస్తారు- కొంతమంది నిమ్మకాయ తొక్క- రుద్దుతారు.

తలలో పేను కొరుకుడుకు ఎర్రమందారపువ్వు రుద్దుతారు. చుండ్రుకు మెంతులు నానబెట్టి రుబ్బి ఆ ముద్ద తలకు మర్దనాచేసి తలంటుతారు.

అంతే ఆగిపోతుంది. తలనొప్పికి ఆముదం ఆకుగానీ, నిమ్మ ఆకుగుండ కొట్టి గానీ తలపైవేస్తారు. నొసటకు మంచిగంధంగానీ, మిరియాలు ఉడికించిగానీ పట్టువేస్తారు - కొడీనాపుష్పం, హారతికర్పూరం కలిపి నుదుటికి రాస్తారు. ఇది వేడిని తగ్గించేస్తుంది. తలనొప్పికి నల్లిని చంపి వాసనచూస్తే కూడా పోతుందంటారు. శొంఠి కణతలకు రాసినా తలనొప్పి పోతుంది. పార్శ్వపు నొప్పికి కుంకుడుకాయ నురుగు కొద్దిగా వెచ్చచేసి రెండుముక్కుల్లోనూ వేస్తారు. కొందరు ముషిని చెక్కగంధం 3 సార్లు త్రాగిస్తారు.

చెవిలో పోటుకు రుద్రజడాకు పసరు పిండుతారు. కొందరు నిమ్మరసం గవ్వపొడుం పొంగించి చెవిలోపోస్తారు. గాలిబిళ్ళలు వేస్తే అవిసాకు రుబ్బి ఆ పసరు కొబ్బరినూనెలోగాని, సున్నంలోగాని కలిపి వాటికి పూస్తారు వేడి చేసి కళ్ళు మండుతుంటే చనుబాలు పిండమంటారు-లేదా సంధివర్ధనంపూలు కట్టుకట్టుకుంటారు. కండ్ల కలకకు నువ్వులనూనెగానీ, నీరుల్లిపాయరసంగానీ కండ్లలో వేస్తారు. కామెర్లకు నేలఉసిరి ఆకును కాయలతోసహా నూరి పసరు తీసి మజ్జిగతో కలిపి పరగడుపున త్రాగిస్తారు. ఎక్కువమంది చెప్పే వైద్యం కుంకుడుకాయ మూడుసార్లు పాలతో సానపై అరగదీసి గ్లాసెడుపాలలో కలిపి రోజూ రెండుపూటలా పుచ్చుకుంటే మూడు రోజుల్లో తగ్గిపోతుందని, దీనికి మరో గ్యారంటీ పసరు వైద్యంకూడా వుంది. తూర్పుగోదావరిజిల్లాలోని వెల్ల గ్రామంలో యిది ప్రతీ ఆదివారం యిస్తారు అతిచౌకగా. దీనికి దేశప్రసిద్ధి వుంది. జానపదుల్లో కొందరు కామెర్లరోగిని సూర్యోదయం ఎండలోనిలిపి సూర్యునివైపుచూస్తూ గడ్డిపరకలతో మంత్రించి మాండోరం (నేటివ్ మందు) మందుగా యిస్తారు తేనెలోవేసి నాకమని. దీనికి తగ్గిపోవడంఉంది. తూ॥గో॥ కొంకుదురులో తాడి రామన్నగారు, అనంతరం వారి కుమారుడు తాడి వెంకట కృష్ణారెడ్డిగారు యీ మంత్రం వేసి తగ్గించేవారు. ఈ మంత్రంలో ముందు రోగిని "కామర్లొచ్చిందా" ! అని అడుగుతాడు. కామెర్లొచ్చిదంటాడురోగి. ఇలా మూడుసార్లు ప్రశ్నించి పెదవులు కదుపుతూ నోటిలో ఆ జబ్బు తగ్గించమని సూర్యదేవుని ప్రార్థిస్తాడు. ఇంతకీ యీతగ్గడం మాండోరం ప్రభావమేఅంటారు.

నోటికి పూతవస్తే పటిక రాయిస్తారు-లేదా పుల్లటి మజ్జిగ పుక్కిట పట్టమంటారు, ఇగుళ్ళు రక్తంకారుతుంటే (పయోరియా) నేపాళంపుల్లతో పండ్లు తోమమంటారు. పళ్లనలుపులకు నీళ్లలో జామి ఆకులువేసి బాగా

మరిగించి ఆ నునువెచ్చని నీటితో ప్రతిరోజూ మూడుసార్లు పుక్కిలించ మంటారు. పుప్పిపళ్ళకు ఇంగువ పెడతారు.

కడుపునొప్పివచ్చినా, అన్నం అరగకున్నా వాము, ఉప్పూ కలిపి నమిలి మ్రింగిస్తారు. చెంబులో నిప్పులుపోసి కడుపుమీద కాపడం పెట్టిస్తారు. అల్లం, ఉప్పు నోట్లోవేసుకొని బాగా నములుతూ రసం మ్రింగుతుంటే అజీర్తిపోయి ఆకలి పుడుతుంది.

జిగటవిరోచనాలకు పచ్చిసపోటా రసంగాని, పచ్చి అరటికాయగాని తినిపిస్తారు. దీనికి వేడిజిలేబి తినడంకూడా మందే. రక్తవిరోచనాలకి సగ్గు బియ్యం జావ త్రాగిస్తారు. నీళ్ళవిరోచనాలకి గసగసాలపొడుం తినమంటారు. ఏ విరోచనాలకైనా వీరి అసలు సిసలు మందు సల్లమందు. విరోచనాలు కావాలంటే ప్రొద్దుటే పరగడుపున వేడినీళ్ళలో చిట్టాముదం 2, 3 చెంచాలు వేసి త్రాగిస్తారు. కొందరు 'సునామణి ఆకు' చారు కాచుకు త్రాగుతారు. మలబద్ధకం పోవడానికి ఉసిరికాయచూర్ణంతో చేసిన కషాయం వేడిపాలలో గిలకొట్టి త్రాగమంటారు.

జలుబుచేస్తే ఉపశమనానికి నల్లజీలకర్ర గుడ్డనుకట్టి పీల్చమంటారు. సలసల మరిగే నీటిలో పసుపువేసి, ఇటుకవేసి, ముఖానికి ఆవిరి పడతారు. ముక్కు దిబ్బడేస్తే ముక్కుల్లో నువ్వులనూనె గాని, కొబ్బరినూనె గాని చుక్కలు వేస్తారు-సర్దుకుంటుంది. దగ్గు వస్తుంటే కరక్కాయ బుగ్గను పెట్టు కొని ఊట మ్రింగుతుండమంటారు. కోరింతదగ్గుకు దానిమ్మకాయ పెచ్చులు బాగా వేయించి ఆ చూర్ణం చిటికెడు తేనెలో కలిపి నాకిస్తారు చంటి పిల్లలకు జలుబు చేస్తే తమలపాకు రసం రెండుచుక్కలు పాలల్లో పిండి పట్టిస్తారు.

వీరి దృష్టిలో జ్వరంవస్తే లంఖనం పరమౌషధం. జీలకర్ర, వాము కషాయం పొంగబెట్టి త్రాగిస్తారు. నరాల బలహీనతకు మొలకలొచ్చిన పెసలు గాని, శనగలు గాని తినమంటారు. శుక్ర నష్ట వ్యాధికి నేతితో చేసిన సున్నుండలు తినబెడతారు. నులిపురుగుకు (ఎమిబియాసిస్) అల్లో నేరేడుపండు మందు, చక్కెరవ్యాధికి (డయాబిటీస్) నేరేడుచెక్క కషాయం త్రాగమంటారు. అంతకంటే సులువు ప్రొద్దుటే పరగడుపున వేప చిగుళ్ళు

తినడం. దీనికి కాకరకాయకూరకూడా శ్రేష్ఠం. ఉబ్బసం ఉపశమనానికి వేడి నీళ్ళల్లో తేనెవేసి తాగిస్తారు.

బాలింతలకు చనుబాలు వృద్ధికావడానికి, దేహంలో నీటిని హరించ డానికి, వాతంనొప్పులు తగ్గించడానికి 'కాయం' అనేమందు తయారుచేసి పెడతారు. శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, పిప్పిలికట్టె, కటుకరోహిణి, జీలకర్ర, వాము, చాయపసుపుకొమ్ము, కళింగ దుంపరాష్ట్రం దోరగా వేయించి, వేడినీళ్ళలో మెత్తగానూరి లేహ్యం లాగా తయరుచేసి సున్ని ఉండలలా చుట్టి దాచబెట్టి ఓపదిహేసురోజులపాటు తినమంటారు. ఇవన్నీ పత్తి పూళ్ళల్లోనూ ప్రతి కిరాణా కొట్టులోనూ దొరికేవే.

పాలు పడకుంటే పిప్పిలికట్టె, మిరియాలు పాలతోనూరి తాగిస్తారు. రక్తపోటు తగ్గించడానికి వెల్లుల్లి ఎక్కువగా వాడిస్తారు. అలాగే నీరుల్లికూడా. ఉల్లిచేసేమేలు తల్లికూడాచేయదని వీరి వాడుకమాట. రక్తపోటుకు కొంత మంది సర్పగంధి తత్సంబంధమైన వేళ్ళను ఔషధంగా ఇస్తారు. గుండె నొప్పికి లేత కొబ్బరికాయనీళ్ళు నిత్యం త్రాగమంటారు. పక్షవాతానికి గ్లాసుడు నీళ్ళలో రెండుచెంచాల తేనె రోజు 3, 4 సార్లు తాగిస్తారు. పావురంరక్తం పక్షవాతంవచ్చిన భాగంమీద మర్దనచేస్తారు. తినేవాళ్ళని పావురం మాంసం కూడా తినమంటారు. లావు తగ్గడానికి ఉదయం లేవగానే పరగడుపున ఒక గ్లాసు గోరువెచ్చనినీటిలో సగం నిమ్మకాయరసం పిండి ఉప్పు, మిరియపు పొడికలిపి తాగిస్తుంటే కొన్నాళ్ళకు తగ్గుతుందట.

పాముకరిస్తే వెంటనే 12 ఏండ్ల బాలుని మూత్రం 150 గ్రాములు తాగిస్తే విషం విరిగిపోతుందట సాధారణంగా దీనికి వైద్యం కళ్ళకు మిరియాలగంధం కలికంపెట్టి నిద్రరాకుండా చేసి నాగముషిణి గంధం తాగి స్తారు. కొంతమంది వైద్యులు పాముకాటుకు వెంటనే కరిచినచోటికి పైన త్రాడుతో బిగించికట్టి రక్తప్రసారంకాకుండా నిలిపివేసి కాటువేసిన చోట ఏదైనా ఆయుధంతోకోసి రక్తంపిండి బయటకుకారేటట్టు చేస్తారు. తేలుకుడితే కొంతమంది గడ్డిపరకతో కుట్టినచోటరాస్తూ మంత్రం వేస్తారు. ఈ మంత్రా నికి కూడా తగ్గిందనేవారున్నారు. మడేలు మంత్రం (మళయాళ మంత్రం) అని మరో చిత్రమైన మంత్రముంది - మంత్రించి అది కుట్టింది

నిన్ను కాదు ఆ గోడని అంటారు-వెంటనే ఆ గోడ బెల్లు విరిగిపడుతుందట-ఇక్కడ నొప్పి తగ్గిపోతుందట. చెయ్యిగానీ, కాలుగానీ తెగితే వెంటనే గుంటకలవరాకు కట్టుకడతారు - మానిపోతుంది. కొండనాలుక పెరిగితే ఉప్పు, పసుపుపెట్టి నొక్కుతారు-తగ్గిపోతుంది. వ్రణాలకు పలాస్త్రి పట్టు వేస్తారు. పిల్లల అనాసలకు కోనసీమలోని పుల్లేటికుర్రు గ్రామంలో సేటిప్ మందిస్తారు-అనాస తగ్గిపోతుంది.

ఇలాగ ఇంకా ఎన్నో జబ్బులకు పెరట్లోమొక్కల పసర్లతోనూ. ఇంట్లో వస్తువులతోనూ ఖరీదులేని వైద్యంచేసే పెద్దవాళ్ళు ఆడా, మగా గ్రామగ్రామాన ఎందరో వుండేవారు. ఫీజులేని ప్రిస్క్రిప్షన్. వీరేగ్రామానికి శ్రీరామరక్ష. నిజానికి వీళ్ళలో చాలామంది అక్షరజ్ఞానమున్న వాళ్ళుకూడా కాదు. వినికిడిద్వారానూ, అనుభవంద్వారానూ అలవడిందే అంతా. వీళ్లు కొన్నింటికి ఈ మందుతోపాటు మంత్రంకూడా వేస్తారు. ఈ మంత్రం పూర్తిగా సైకలాజికల్ ట్రీట్‌మెంటు. వాళ్ళు ఉచ్చరించే మంత్రమల్లా "దేవుడా ! పరమేశ్వరా ! ఇతనికి ఈజబ్బు వెంటనే తగ్గించు తండ్రీ- ఈ మంత్రంతో ఈ జబ్బు తగ్గుగాక !" అని పలుసార్లు నోటితో అంటుంటారు. ఆలోచిస్తే ఇది నేటి హిప్నాటిజమ్‌పద్ధతికి మూలరూపమే. డాక్టర్లు, నర్సులు అక్కర్లేకుండా ఎరుకులసానులే పురుళ్ళుపోస్తారు. ఒక్కోసారి వాళ్ళలో పెద్ద వాళ్ళుకూడా పురుళ్లుపోస్తారు - ఎరుకులసాని బొడ్డు కోస్తుంది అంతే. ఇంతా చేస్తే పురిటిఖర్చు తనుకట్టుకునే పాతచీర ఒకటి ఆమెకు బహుమతిఇవ్వటమే.

కాలక్రమంలో ఈ అనుభవవైద్యం ఆయుర్వేదిక్, హోమియోపతిక్, అల్లోపతిక్‌లమధ్య మరుగుకుపోయింది. అయినా ఈ నాటికీ ముసలమ్మలు ఈ వైద్యాలు చెప్పుతుంటారు అక్కడక్కడ. పేదలపాలిటి పెన్నిధివంటి ఈ వైద్యం కాలగర్భంలో కలిసి పోకముందే సేకరించి పరిరక్షించడం తక్షణ కర్తవ్యం. ప్రతి చిన్నజబ్బుకీ డాక్టర్లు వ్రాస్తున్న మందుల జాబితా తట్టు కోలేక ఆక్రోసిస్తున్న సామాన్యుడికి ఇది ఎంతో ఉపశమనం.

జానపదులలో మరోవైద్యం ఉంది. అదే భూతవైద్యం, సాధారణంగా పురటాలు బలవంతంగా చచ్చిపోతే దెయ్యమౌతుంది అని నమ్మకం.

అలాగే నూతిలోపడి, చెరువులోపడి, కాలువలోపడి బలవంతంచావు చచ్చిన వాళ్ళు (పురుషులైనాసరే) భూత, ప్రేత, పిశాచాలవుతారని విశ్వాసం. ఆ చనిపోయినవాళ్ళు ఆయింట్లోవారినిగాని ఆ వీధిలోవారినిగాని బంధుమిత్రులను గాని ఆవేశించి తమకోర్కెలుచెప్పి అవి చెల్లింపచేసుకుంటారు. దెయ్యాలు ఆవేశించినవారి చిటికెనవ్రేలిగోరు నొక్కితే ఆ దెయ్యం వొదిలేస్తుందట. కొంతమందికి నవాసారద్రావణం వాసనచూపిస్తే ఆ భూతము వొదిలేస్తుంది. కొంతమంది సాంబ్రాణిపొగవేసి ఆ దెయ్యం కోరికలు చెప్పించి అవి తీరుస్తారు. కొంతమంది అనారోగ్యానికి గురైనప్పుడు ఎక్కడో ఏదో చూసి జడుసుకున్నారని అక్కడి శక్తి పట్టుకుందని ఆ అనారోగ్యక్షీణానికి అది కారణమని భూతవైద్యుని దగ్గరకు తీసుకువెళ్తారు. అతడు వరిపిండితో పిశాచి బొమ్మవేసి ముగ్గువేసి అందులో ఆ రోగిని కూర్చుండబెట్టి ఓం, హ్రీం, క్రీం అని గట్టిగా అరుస్తూ పట్టుకున్న శక్తిని వదలిపొమ్మని చెప్తూ కోడిపెట్ట కాలిగోరుకోసి ఆ రక్తంలో రోగిని [illegible]. నిమ్మకాయలు సగానికి కోసి రోగి తలచుట్టూ దిగదుడిచి పారేస్తారు. మంత్రించి వేరుముక్క కట్టి విభూతి, కుంకం ఇస్తారు నిత్యం బొట్టుపెట్టమని. ఈ వైద్యానికి భూతం వదలేసి తగ్గిపోయిందనే వారూ ఉన్నారు. ఇది సైకలాజికల్ ట్రీట్‌మెంట్ అనేవారూ ఉన్నారు. ఈ భూతవైద్యులకు తూర్పుగోదావరి జిల్లాలోని వడిసిలేరు, లక్ష్మీనరసాపురం, లొల్ల గ్రామాలు ప్రసిద్ధి. ఈవైద్యులు పేకబెత్తం ఝుళిపించి ఆవేశించిన భూతాన్ని మాట్లాడిస్తారు రోగిద్వారా, ఇందులో నిజమెంత ఉన్నా జానపదవైద్యంలో దీనికున్న ప్రసిద్ధిని కొట్టి పారెయ్యడానికి వీల్లేదు. ఈ భూతవైద్యుల్లో కొందరు మాత్రరూపంలో మందులిచ్చి విడిపోయిన జంటలను కలపడం ఉంది. మనిషిని వశం చేసుకోవడానికి మందు పెట్టడంఅనేది ఉంది. ఈ మందులు మైదెరకల స్త్రీలు ఇస్తుంటారు. ఎవరైనా ఒక పురుషుడు మరో స్త్రీ పట్ల మరీ మక్కువ చూపిస్తుంటే ఆమె మందో, మాకో పెట్టిందనటం జానపదుల రివాజుమాట. భూతవైద్యానికి కొంతమంది ముస్లింలు ఖురాను మంత్రాలు వ్రాసిన రక్షరేకులు. తాయెత్తులు కడతారు. దీనికోసం వీరుతీసుకొనే డబ్బులు కూడా తక్కువ. పసిపిల్లల జబ్బులకు వైద్యులదగ్గరికి వెళ్ళడానికి బదులు ముందుగా వీరిదగ్గరకే పరిగెడతారు. వారు ఉరుదూ లిపిలో ఉన్న పుస్తకంలో ఆ డబ్బులుపెట్టించి ఆ డబ్బులు పెట్టిన పేజీలోఉన్న విషయముతో ఆ జబ్బునుచెప్పి దాని నివారణకు

మంత్రించిన తాయెత్తును ఇచ్చి మొలకో, మెడకో, చేతికో కట్టమని చెప్పి, ఆ సాయంకాలం ఎఱ్ఱనీళ్ళు, పచ్చనీళ్ళు దిగదుడిచి ఊరావల నలుగురూ నడిచే రోడ్డుపై పార బోయమంటారు.

కొందరు నాలుగుబాటలు కలిసినచోట దిగదుడిచిన బల్యాన్నం పోయిస్తారు. ఈ భూతవైద్యంతోబాటు ఇంటిదగ్గర మామూలుగా గచ్చాకు పుచ్చాకు వైద్యంకూడా చేయిస్తుంటారు. దేనికి తగ్గుతుందో తెలియదు కాని మొత్తంమీద భూతవైద్యానికికూడా గిరాకీ ఎక్కువే. దీర్ఘరోగాలకు నల్ల కోడిపెట్టను దిగదుడిచి కోస్తారు. ఇంకా రోగం బలీయమైనదైతే పందితోనూ, డప్పులతోనూ మిట్టమధ్యాహ్నం వేళ దిగదుడుపు పెడుతుంటారు. వీధిలో అది తీసుకెళ్ళేటప్పుడు ఎవరైనా చూస్తే ఆ భూతం ఆ రోగిని వదలి చూసినవారిని పట్టుకుంటుందని దిగదుడుపు తమ వీధి దాటేవరకూ అందరూ తలుపులు మూసేసుకుంటారు. అయినా జాగ్రత్త కోసం ముందుగా ఒక మనిషి దిగదుడుపు వస్తుందని వీధిలో చెప్పుకుంటూ ముందు వెళతాడు. కాకినాడదగ్గర పెదపూడిలోనూ, గొల్లలమామిడాడలో నున్న మార్కెట్టు షెడ్‌లోనూ ప్రతి ఆదివారం, లక్ష్మివారం ఒక ముస్లిం యీ భూతవైద్యం చేస్తాడు. చాలమందికి అతనిమాట నమ్మకం

పశువులకు జబ్బుచేస్తే కూడా జానపదులు తమ జ్ఞానవైద్యంతోనే బాగుచేసుకుంటారు. కీళ్ళనొప్పులు, వాతం నొప్పులకు గుర్రులేయిస్తారు. అంటే అక్కడ వాతలేస్తారు. ఆకలిపెంచడానికి ఉప్పు, నల్లేరు కలిపి కారం నీళ్ళతో గొంతులో గొట్టంతోపోస్తారు. దొమ్మరోగానికి కొఱ్ఱగంజి పోస్తారు. ఆవులు, గేదెలుఈనినపుడు బాలింతరాలికి పాతబియ్యం అన్నంలాగే పాత వడ్లు, ఉలవలు ఉడకేసి పెడతారు, పశువులకు సాధారణంగా వచ్చే పారుడు రోగం, కాళ్ళకుగాళ్ళు తగలడం, గొంతువాపు. గురకరోగం మాద, కురము, వాతం ఇలాంటి జబ్బులకూడా వీరు తమ నాటువెద్యం తోనే తగ్గింపచేస్తార.

## ఆహారం :

చేలో పండించుకున్న వడ్లు దంచుకుని చక్కగా బియ్యం చేసుకుని వండుకుంటారు. ఇది తవుడుతో కలిసివుంటుంది. 'బి'విటమిన్ సంపూర్ణంగా

మినుములూ, పెసలూ చేలోనూ, కంది చేను గట్లమీద పెంచి మినప్పప్పుతో మినపరొట్టె, పెసలతో పెసరపప్పు, కందులతో కందిపప్పు వండుకుతింటారు. అంటే వారికి కావలసిన ఆహారం వారిచేతులో ఉన్నట్టే. కొందరు ఉదయం చోడిఅంబలిలో మజ్జిగ, ఉప్పు కలుపుకు త్రాగుతారు. ఇది వారి ఉదయం టిఫిన్ అన్నమాట. చాలామంది చద్దన్నం తింటారు. సాయంత్రం ఉప్పు కలిపిన ఉమ్మగంజి త్రాగుతారు. ఇది వారి సాయంత్రం కాఫీ. ఇవి చవకగా లభ్యంకావడమే కాకుండా దేహానికి తుష్టినీ పుష్టినీ కలిగించే బలిష్ఠమైన ఆహారం. వీనిలో విటమినుల విలువ ఎక్కువ. అందుకే వారిలో నగరజీవుల లాగ నరాల బలహీనతలు, రక్తహీనతలు తక్కువ. వారు పండించే పంటకు ఎరువు వారి యింటి పెంటే. * "కుక్కపిల్ల, సబ్బుబిళ్ళ, అగ్గిపుల్ల, కాదేదీ కవితకనర్హం" అన్నట్టు వీరికి పనికిరాని వస్తువులేదు. పైగా ఈ పెంటతో పెంచబడ్డ పంట ఆరోగ్యానికి మంచిదంట. వీరు వంటకు కాల్చిన మట్టికుండలు వాడతారు. ఇది ఖరీదు తక్కువేకాకుండా యితర పాత్రలలోలాగ వేడి తగిలినప్పుడు వంటపదార్థంలో మరో రసాయనిక సంయోగం జరగదు. అందువల్ల ఆరోగ్యానికే హానీ ఉండదు. వంటకేకాకుండా నీళ్ళుతెచ్చుకోవడానికీ, చల్లకూ మట్టికడవలనే వాడతారు. ఖరీదైన పాత్రలుకాదు గనుక దొంగతనాల బెడద ఉండదు. వేదంలోకూడా "మృణ్మయం దేవపాత్రం" అనివుంది. 'సాధుడు పల్లియకేగి ఘటింపకున్కి భరితంబయి అట్టుకనట్టుకట్టి మొప్పనోవనంబొసగె తదాజ్ఞనం గ్రావమూకుటన్" (పాండురంగమహాత్యం) అటకలోని అన్నంబు మట్టిమూకిట (చిప్పలో) తెచ్చి వడ్డించెనని అర్థం. ఈ మట్టికుండల వినియోగం అతి పురాతనమైనది. జానపదులలో పాడి సమృద్ధి ఇంటికొచ్చిన అతిథికి మజ్జిగ దాహం యిచ్చి మర్యాద చేస్తారు. వ్యవసాయానికి ఎద్దులూ పోతులూ, పాడికి ఆవులూ గేదెలూ వారి జీవిత భాగస్వాములు. కాఫీ, టీల కంటే మజ్జిగ సేవనం మనిషికి ఆరోగ్యం.

ఇక కావలసిన కూరా నారా యింటి పెరట్లోనే పండించుకుంటారు. ఈ జానపదుల పెరటితోట నిజానికి ఆరోగ్య ఐశ్వర్యాల మూట.

---

* మహా ప్రస్థానం — శ్రీశ్రీ

ప్రతియింటికీ పెరటిలోతోట పల్లెటూళ్ళలో కనుపించే ఒక సుందర దృశ్యం. ఇవి ఆహారవిహారాలకే కాకుండా ఆదాయాన్ని కూడా సమకూరుస్తాయి. అందులో నాటిన ప్రతిమొక్కా ఆరోగ్యరీత్యానో ఔషధపరంగానో ఏదో ఒక పరమార్థం కలిగివున్నదే. ముఖ్యంగా తులసి, ములగ, పసుపు, ఉసిరిక, కరివేపాకు, బొప్పాయి, నిమ్మ, అరటి, కొబ్బరి చెప్పుకోతగ్గ చెట్లు - అలాగే దొండ, కాకర, బీర, ఆనప, పొట్ల, గుమ్మడి, వంకాయ బెండకాయలాంటి కూరగాయలు, బచ్చలి, తోటకూర, గోంగూర, పొన్నగంటికూర వంటి ఆకుకూరలు విస్తారంగా పెంచుతారు.

## తులసి

దీనిని పూజిస్తే పుణ్యం పురుషార్థం వస్తుందనేది ఒక అలౌకికదృష్టి. సైన్సుదృష్ట్యా యిది దోమల నివారిణి. దీని ఆకు జీర్ణకారి. పైత్యవికారం తగ్గిస్తుంది డజను తమలపాకులూ రెండు మిరియపుగింజలూ కలిపితింటే పడిశం తగ్గుతుంది. తులసిఆకు పసరు చర్మంమీది తెల్లమచ్చలకు, కురుపులకు దివ్యౌషధం.

పౌరాణికంగా యీ దళానికి ఒక విలువుంది. కృష్ణ తులాభారంలో దీనిపాత్ర అపూర్వం. శ్రీకృష్ణుని బరువు తూయడానికి సత్యభామనగలన్నీ చాలలేదట- ఒక్క తులసిదళంతో సరితూగాడట. రామదాసు శ్రీరాముణ్ణి 'చారు తులసీదళధామ' అంటాడు. చిలకమర్తి వారి 'గణపతి' దీనికి అర్థం 'చారులో తులసిదళంవేసుకొని త్రాగడం' అని చెప్పినప్పుడు నవ్వువస్తుంది కానీ పైత్యవికారం ఎక్కువగాఉన్నప్పుడు తులసాకు ఏరూపంలోతిన్నా పైత్యాన్ని తగ్గిస్తుంది.

## ములగ

ములగకాడలో విటమిన్ 'ఎ' ఎక్కువ. ఖనిజలవణాలు, మాంసకృత్తులు సకృత్తుగా గల బలవర్ధకాహారం. అమ్మవారికి నైవేద్యం పెట్టేటప్పుడు ములగాకు, తెలగపిండి కూరవండి పెడతారు ఆపేరుమీదనైనా ప్రసాదంగా అదితిని బలవంతులవుతారని. రాలిపోయిన ములగపువ్వు ఏరి, పప్పులోవేసుకు వండుకుంటారు. ములగచెట్టు బెరడు గుండకొట్టి

గుడ్డలోకట్టి జలుబు చేసినప్పుడు ముక్కు దగ్గర పెట్టుకుపీలిస్తే ఉపశమనం కలుగుతుంది. నడుము నొప్పికి, ఇరుకు నొప్పులకి ములగాకు, వామ్మ్రకట్టు గొప్పగా పనిచేస్తుంది.

## పసుపు

ఇది క్రిమిసంహారిణి. ఆరోగ్యానికి అత్యంతావశ్యకం. సెప్టిక్‌ను నిరోధిస్తుంది. పూర్వకాలంలో మగవాళ్ళు పాముకోళ్లు, పాదరక్షలు ధరించి నట్లుంది గాని స్త్రీలు ధరించినట్లు లేదు. అందువల్ల కాలికి ఏదైనా దెబ్బతగిలినా సెప్టిక్ కాకుండా ముందుజాగ్రత్తగా పాదాలకు పసుపు పారాణి రాసేవారు. లివర్ జబ్బులకు మంచిమందు. స్త్రీలకు రోమనివారిణి జానపదస్త్రీలు ముఖానికి నిండుగా పసుపు రాసుకుంటారు. నాగరికులు పౌడర్ల మోజుల్లో దీన్ని విస్మరించడంతో చాలామంది స్త్రీలకు మీసాలు చూస్తున్నాం. ఇది మంచి జీర్ణకారికూడా – అందుకే ప్రతీకూరలోనూ వేస్తారు. దీనికి మలేరియా నిరోధక శక్తివుంది. ఇళ్ళల్లో పసుపునీళ్లు చల్లడంలో శుభంమాట ఎలావున్నా క్రిములనుచంపే శక్తిగా వినియోగించడం దీని వెనుకనున్న రహస్యం.

## ఉసిరిక

దీన్ని అమృతఫలం అంటారు. దీనినిండా 'సి' విటమినే. పాత ఉసిరికాయపచ్చడి పత్యానికి మంచిది. మనకు ప్రౌఢభాషలో 'కరతలా మలకం' అనే మాటవుంది. దీనర్థం 'అరచేతిలో ఉసిరికాయ' అని. ప్రతి యింటిలోనూ యివి పెంచుతారు–కనుక సులువుగా లభ్యమయ్యేది.

'సి' విటమిను సరిపడా లేకుంటే దేహంలో వ్యాధినిరోధక శక్తి తగ్గిపోయి ఏవ్యాధి అయినా యిట్టేసోకే ప్రమాదముంది. నేటి 'ఎయిడ్స్' వ్యాధిక దీనినుండి ఏదైనా మందు కనిపెట్టవచ్చేమో ఆయుర్వేద పరిశోధకులు ఆలోచించడం మంచిది. పచ్చిఉసిరికాయ దాహాన్ని తగ్గిస్తుంది. అందుకే మండుటెండలో ప్రయాణించేవారు రాచఉసిరికాయ వెంట తీసుకొని పోతుంటారు.

## కరివేపాకు

దీనిలో విటమిన్ 'ఎ' పుష్కలంగా వుంది. పైత్యహారి - జీర్ణకారి. కాని ఇప్పుడు దీనిని విస్మరించి మనవాళ్ళు కూరల్లో చారుల్లో ఏదో సువాసన కోసం వేసినట్లు భావించి తినేటప్పుడు ఏరిపారేస్తారు. అందుకే ఎవరినైనా అవసరమున్నప్పుడువాడుకుని సమయానికి దూరంగా గెంటివేస్తుంటే వాడిది పాపం కరివేపాకు బ్రతుకురా అంటుండడం వాడుకలోకొచ్చింది.

అసలు వెంకటేశ్వరస్వామి జానపదకథలో దీనికి చాలా ప్రాముఖ్యముంది. అలివేలుమంగమ్మ సారెలో కరివేపాకు తేలేదనేగదా వెంకన్నబాబు ఆమెను ఏలుకోను పొమ్మన్నాడు !

## బొప్పాయి

ఈ పండులో మాంసకృత్తులు మెండు జీర్ణశక్తి నిండు. మాంసం తొందరగా మెత్తగా ఉడికించాలంటే రెండు పచ్చిబొప్పాయి ముక్కలు వేసిఉడికిస్తేచాలు ఇట్టే మెత్తనైపోతుంది. ఈ పండు చక్కెర వ్యాధిని తగ్గిస్తుంది.

## నిమ్మ

ఈ పండు విటమిన్ 'సి'కి నిలయం. వేడిచేసే కూరలన్నిటిలోనూ ఇది వాడతారు చలవకోసం. నిమ్మరసం ఒంటికిరుద్ది కొంతసేపయ్యాక స్నానంచేస్తే ఒంటికి మంచి ఛాయనిస్తుంది. నిమ్మకాయడిప్పలు ఎండబెట్టి నలుగుపిండిలో కలిపిరాస్తే శరీరానికి కాంతివస్తుంది. వేడిచేసినప్పుడు నిమ్మరసంలో పంచదారవేసుకొని నీళ్ళలోకలిపి త్రాగితే చల్లబరుస్తుంది. ఉదయం పరగడుపున ఒక కాయ నిమ్మరసం చెంచాడు తేనెలో కలిపిత్రాగితే ఒళ్ళు తగ్గుతుంది. ధాతుపుష్టి కలిగిస్తుంది.

మొక్కలన్నిటిలోకి యీమొక్క నీరెక్కువ త్రాగుతుంది. ఎన్ని నీళ్లుపోసినా పోసినట్టు కనిపించదు. అందుకే ఎవరైనా గుంభనంగా ఉలుకు పలుకు లేకుండాఉంటే నిమ్మకునీరెత్తినట్టు అలాగున్నావేమిటిరా అంటుంటారు.

## అరటి

అతిథులు, బంధువులు ఏ వేళొచ్చినా కంగారుపడకుండా అర్జంటుగా ఆదుకోవడానికి ఇంటిలోని అరటిచెట్టు పెద్ద అండ. చెట్టునున్న గెలనుండి కాయలుకోసి కూరవండి తృప్తిగా పెట్టవచ్చు. అరటిపువ్వు కడుపులోని అల్సర్ కి మందు. అరటిదువ్వ తింటే చలువచేస్తుంది. అరటిపండు సుఖ విరేచనకారి. అరటిపండులోని గింజలపొడరుతింటే మసూచిని దరికి రాని వ్వదు. అరటిఆకులు అన్నం, టిఫినూ తినడానికి చాలా ఉపకరిస్తాయి. అరటిపువ్వు వలిచాక చివరన మిగిలిన లింగం నమిలితే కడుపులో నులి పురుగు చచ్చిపోతుంది. (ఎమీబియాసిస్) నోటిపూతకూడా పోతుంది.

## కొబ్బరి

ఈ కాయను నారికేళఫలం అంటారు. కొబ్బరినీరు నీరుడుదోషాన్ని తొలగిస్తుంది. చలువచేస్తుంది. ఎండాకాలంలో దీని ప్రతిభ అద్భుతం. లోనిగుంజు మంచి బలవర్ధకాహారం. గాంధీగారు (మహాత్మాగాంధీ) దీన్నె ఎక్కువ భుజించేవారు. దురదలు కొబ్బరిపాలు రుద్దితేపోతాయి. కొబ్బరి పాలతో తల రుద్దుకుంటే అకాలపుతల నెరవడంరాదు. వెంట్రుకలు ఊడి పోవడాన్ని ఆపుచేస్తుంది. కొబ్బరిడొక్క పొయ్యిలోకి ఉపయోగిస్తుంది. కొబ్బరిపీచు త్రాడుగా ఉపయోగపడుతుంది. కొబ్బరి ఆకు చాపలకుపని కొస్తుంది. కాయ అమ్మకానికి విలువైనది. అందుకే కొబ్బరిచెట్టును కొంగు బంగారమన్నారు.

ఈ చెట్లవల్ల యిన్ని లాభాలుండబట్టే "సస్యశ్రీ" గారు "చెట్టు నా జట్టు" అన్నారు కవితారూపంలో.

## కూరగాయలు

దొండకాయ చక్కెరవ్యాధిమీద చక్కగాపనిచేస్తుంది. కడుపులోని కల్మషంపోవడానికి చిన్నప్పుడు దొండాకుపసరు ఉగ్గుపెడతారు. అందుకే ఏదైనా తగువొచ్చినప్పుడు, శత్రువుని కసిగా తిట్టేటప్పుడు "దొండాకుపసరు కక్కిస్తా" అంటుండడం వింటుంటాం. అంటే దాని మనుగడ అంత దీర్ఘ

కాలికమైనది. దొండాకు చలువచేస్తుంది. కాకరకాయరసం కడుపులో నులి పురుగుల్ని చంపుతుంది. చక్కెరవ్యాధికి కూడా యిదిమందే. ఆనపకాయ, బీరకాయ, పొట్లకాయలలో విటమిన్లు పుష్టిగా ఉండడమేగాక సులువుగా జీర్ణమౌతాయి. అందుకే పత్యానికి యీకూరలు వాడతారు. వంకాయ ఆరోగ్య రీత్యా మంచిచెడ్డలెలాఉన్నా ఇది రుచి రాజము. "వంకాయ వంటి కూరయు, లంకాపతివైరివంటి రాజులు కలరే" అంటాడు ఓ కవి. బెండకాయ ముదర కుండా ఉంటే మంచి ఆహారం. ముదిరితే మాత్రం ఒక ముతకసామెతుంది. "బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా ప్రమాదం" అని. అందుకే కోసేటప్పుడు యీ కాయలు ముచ్చికలు విరిచి చూసుకుంటారు.

బూడిదగుమ్మడికాయ వడియాలుపెట్టుకొని వేపుకుతింటే బలేరుచిగా ఉంటాయి. దీనిగింజలు కడుపులో పాములున్నవాళ్ళకి పాములమందే.

## ఆకుకూరలు

గోంగూరపచ్చడి తెలుగువారి ప్రత్యేకతనుతెలిపే వంటకం. దీనినిండా ఖనిజలవణాలుంటాయి. బచ్చలకూర, తోటకూర, పొన్నగంటికూర, మెంతు కూర సుఖవిరేచన కారులు మలబద్ధాన్ని తొలగిస్తాయి. పొన్నగంటికూరను సంస్కృతంలో 'జనార్నవ' అంటారు. దీనిలో బంగారుఖనిజం ఉందట. తమిళంలో 'పొన్న' అంటే బంగారం అని అర్థం. దీన్నిండా 'ఎ' విటమినే. అందువల్ల కంటిజబ్బులకు ఇది ఉపయోగకారి.

మామూలుగా యివి కడుపు నిండుకోనడానికి తింటున్నామనుకున్నా మనిషి జీవితానికి కావలసిన పోషకపదార్థాలు నిండిఉండడంతో అవి అందు బాటులోఉండేలాగఆలోచించి జానపదులు పెరళ్ళలో పెంచేవారు. ఈ పౌష్టి కాహారంతో ఆరోగ్యంగా నూరేళ్ళు బ్రతికేవారు. ఇప్పుడు చెట్లను పెంచడం మాని కొట్టేయడంప్రారంభించాం ప్రతిగజంస్థలంలోనూ యిల్లుకట్టేసి అద్దెల కిచ్చేసి ఆదాయం సంపాదించేయాలని. ఇది పల్లెలకు కూడా ప్రాకి పోయింది. అందుకే "సుజలాం, సుఫలాం, మలయజ శీతలాం, సస్య శ్యామలాం" ప్రార్థనకే పరిమితమైపోయింది. చెట్లు లేక పోవడంవల్ల

మంచిగాలి కరువు - వర్షాభావం ఏర్పడి మందినీళ్ళు కరువు-వర్షాలు లేక పోవడంవల్ల పంటలకరువు. అందుకే మరల పెరట్లో చెట్లులు పెంచడం, కనీసం మనిషికొకచెట్టు నాటడం యీనాడు అందరూ చేపట్టవలసినపని.

## విహారం

" ఆడనే చుక్కావి ఈడనే గడవేసి
పడవెక్కి భద్రాద్రి పోదామా
చలి గంగ స్నానాలు చేదామా "

జానపదులైన గ్రామీణ జంటల విహారయాత్రలు ఇవి. వీరి విహార యాత్రలలో ముఖ్యమైన తీర్థయాత్రలు అంతర్వేది, హంసల్దీవి, చొల్లంగి, కోరుకొండ, కోటిపల్లి, వాడపల్లి మొదలగు తీర్థాలకు యెడ్లబళ్ళు కట్టుకొని మూటకూళ్ళు పట్టుకొని కుటుంబాలకు కుటుంబాలు తరలి వెళతారు. దగ్గర తీర్థాలకు కాలినడకనే వెళతారు - ఇరుగు పొరుగు వారితో జట్లుజట్లుగా కూడి దూరప్రాంతాలైన తిరుపతి, సింహాచలం. అన్నవరం వగైరా పుణ్య క్షేత్రాలకు మొక్కుబడుల పేర్లతో రైలులో వెళతారు. ఈ ప్రయాణాలలో అటుకులు మూటకట్టుకొనిపోయి ప్రయాణంమధ్యలో అన్నానికి బదులు అవి నీళ్ళలో నానబెట్టుకుతింటారు. జాతర్లలో, తీర్థాలలో వీరు స్వేచ్ఛగా విహరిస్తూ మంచం పకోడీలు, జీళ్ళు, కరకజ్జం, కడ్డీలు కొనుక్కుతినడం, లక్కపిడతలు, కొయ్యబొమ్మలు కొని తెచ్చుకోవడం, స్త్రీలు రకరకాల గాజులు తొడిగించుకోవడం చేస్తూ ఎంతో ముచ్చటగా తిరుగుతారు. రంగుల రాట్నం సరదా విపరీతం. పురుషులు రంగులరాట్నంలో గుర్రాలు, ఏనుగులు, సింహాలమీద ఎక్కగా, స్త్రీలు ఉయ్యాళ్ళలో కూర్చుంటారు. రంగులరాట్నం గిర్రున తిరుగుతుంటే వాళ్ళ కళ్లు గిర్రున తిరిగిపోయి, గాలిలో తేలిపోయి ఏదో లోకంలోకి ఎగిరిపోతున్నట్లు మధురానుభూతిని పొందుతారు. ఈ రంగులరాట్నం సాహిత్యంలో అనాదికాలం నుంచీ కనిపిస్తోంది. చంద్రశేఖర శతకంలో దీని ప్రస్తావన యిలా ఉంది.

" .............. సం
ఒరపురి దెల్పుమింకొక పబావము
రంకులరాటమెక్కి నే
తిరిగిన సాటిరాదని నుతించును."

పాల్కురికి సోమనాథుని బసవ పురాణంలో యిలా వుంది -

" చటిల సంస్కృతి జీవ ఘట చక్ర కర్మ
పటు పరివర్తన భ్రమణంబు గూర్చి
కీలు వొందించి యాక్రియ రాటనముల
వాలి యాడించు నా వద్రంగియతడు"

ఈ విహారాలు పెళ్ళికానిపిల్లల పెళ్ళిచూపులకు ఒక సాధనం అవుతాయి. ఇలా ఇతరప్రాంతాలకు వెళ్ళడంలో దేశంలోని మంచి చెడులు, ప్రజల సాధకబాధకాలు అవగతమవుతాయి. ఇలా కొన్ని కుటుంబాలు కలిసివెళ్ళి ఒకరి కష్టసుఖాలు ఒకరు పంచుకొనడంవల్ల వారిలో ఒకరిపై ఒకరికి ప్రేమానురాగాలు పెరుగుతాయి. పల్లెలలో సాధారణంగా స్త్రీ పురుషులు పొలాల్లో పనిపాట్లు సాగించుకొంటూ పైరగాలి ఆశ్వాదిస్తుంటారు నిత్యమూను. ఇదే నిజంగా ఆరోగ్యకరమైన విహారం.

# వ్యవహారం

## 1. మర్యాదలు :

అతిథులువస్తే ముందుగా కాళ్ళుకడుక్కోవడానికి నీళ్ళు ఇస్తారు. వీధిలోనే వాళ్ళ కాళ్ళు కడుక్కొని లోనికి ప్రవేశించాలి. దీనివల్ల సూక్ష్మ క్రిములు వారి కాలిధూళితో ఇంటిలోనికి రాకుండా నిరోధించబడుతుంది. ఆ కడుక్కొనేటప్పుడు చిన్న పొడికూడా ఉండకుండా కడుక్కోవాలి. ఈ పొడిగానీఉంటే అందులో శని ప్రవేశిస్తుందట. దానికి జానపదులు నలదమయంతుల కథ ఉదహరిస్తుంటారు. నలుడు అన్నిట పరిశుద్ధుడేగాని ఒకరోజు కాళ్ళు కడుక్కొనేటప్పుడు మడమపై చిన్న పొడిభాగం ఉండిపోయిందట. ఎప్పుడెప్పుడా అని ఎదురుచూస్తున్న శని దీనితో అవకాశం ఎక్కి ఆవహించి అష్టకష్టాలు పెట్టాడట.

తరువాత ఉప్పుకలిపిన చల్లనిమజ్జిగ దాహంఇస్తారు. ఆపైన వాకిట్లో మంచం వేస్తారు. చాలామంది ఎంతదూరంఅయినా నడిచేవెళతారు-అందువల్ల అలసి ఉంటారు. వారు ఆ మంచంమీద కూర్చొనిగాని పడుకొనిగాని సేద తీర్చుకుంటారు. ఇందులో రాజుల మర్యాదవేరు. వెలమలు, రాజులు చాప వేసి తమరు దయచేయండంటే తమరు దయచెయ్యండంటూ అందరూ చాప చుట్టూ నేలమీదే కూర్చోవడం విచిత్రం.

## 2. పెళ్ళిభద్రత :

పిల్లల పెళ్ళి పెద్దలే నిర్ణయిస్తారు. అందువల్ల వారి నిత్యజీవితంలో వచ్చే పొరపొచ్చాలను పెద్దలు బాధ్యత తీసుకొని సరిచేస్తారు. అంటే పెళ్ళికి ఇలా సాంఘిక భద్రత కల్పించబడిందన్న మాట.

## 3. సెక్సు విజ్ఞానం :

ఇది అతి సులువుగా అందరికీ బోధపడేటట్లు దేవాలయాలపై బూతు బొమ్మలు వేయించడం ఒక పద్ధతి. పెద్దవాళ్ళు పెళ్లయి వయసొచ్చిన బిడ్డలవగ్గర అప్పుడప్పుడు మర్మ గర్భితంగా సెక్సువిషయాలు మాట్లాడటం మరొకపద్ధతి. శోభనం దినాన పెద్దముత్తైదువులు రతి విషయాన్ని రహస్యంగా వివరించి చెబుతారు స్త్రీకి. పురుషుడుకి మగవారిలో ఒకరు బోధ పరుస్తారు. ఆ దంపతుల్ని అత్యంత సన్నిహితులను చేయడానికి ఒకరు ఎంగిలిచేసిన పాలు మరొకరితో త్రాగించడం వగైరా చేయిస్తారు.

## 4. పరిశుభ్రత :

ఉదయం లేవగానే ప్రతివారూ వారి వీధితుడిచి పేడతో కళ్ళాపుచల్లి దానిపై ముగ్గులుపెట్టడం మొదటిచర్య. దీనివల్ల పరిసర కాలుష్యం నివారించ బడుతుంది. ముగ్గువల్ల వీధికి అందం రావడమేకాక సూక్ష్మ క్రిమిసంహారం జరుగుతుంది. పండుగ పేరుచెప్పి తరుచు ఇల్లు అలుకుటకూడ ఇందుకోసమే.

## 5. మైల పట్టడం :

ఇంట్లో ఎవరికైనా బిడ్డ పుట్టినపుడు పదిరోజులు మైల పాటించి పదవరోజున పురిటి స్నానం చేయిస్తారు. అప్పటి వరకూ ఆ పురిటి ఇంట్లోకి ఎవ్వరూ వెళ్ళరు. వెళ్ళినవారు వెంటనే ఆ బట్టలువిడిచి తల స్నానం చేస్తారు. ఆ పురిటిగదిలోని సూక్ష్మక్రిములు బయట ప్రపంచం

లోనికి రాకుండాఏర్పరచిన కట్టుబాటు ఇది. ఈపురిటినీళ్ళనాడు ఇరుగుపొరుగు వారు, బంధుమిత్రులు ఒక్కొక్క ఇంటినుంచి ఒక్కొక్క బిందెనీళ్ళు, నలుగుపిండి, పసుపుముద్ద పంపుతారు. అంటే ఈ పదిరోజుల మురికి పరిశుభ్రతకు నీళ్ళు, నలుగుపిండి విశేషంగా అవసరం అవుతాయి. కావున ఒకే ఇంట్లో అన్నినీళ్ళు లభ్యంకాకపోవచ్చు - అందువల్లనే ఈ సహకారాన్ని సంప్రదాయంపేరుతో యిలా అందిస్తారు.

అలాగే ఎవరైనాచనిపోతే ఆ వంశంవారు పదిరోజులు మైలపడతారు. పదవరోజున దినకార్యక్రమానికి వంశంలో ఇంటికి ఒకరు హాజరై ఊరిచివర చెరువులోగాని, కాలువలోగాని అందరూకలిసి స్నానంచేసి. శుద్ధి కార్యక్రమంలో పాల్గొంటారు. ఆ రోజు దినకార్యానికి వారందరికీ భోజనంపెట్టాలి. కారణం అందులో ఇతరగ్రామాలనుంచి వచ్చినవాళ్లుంటారు. దీనిని తట్టుకొనుటకు సహాయంగా ఆ వంశంవారు ప్రతి ఇంటినుంచి బియ్యం, ఉప్పు, పప్పు, చింతపండు, పెరుగు తమ మనిషికి సరిపడగా ఒక కావిడలోవేసి ప్రతిఊరు నుంచి, ప్రతియింటినుంచీ పంపిస్తారు. ఇది ఒక సానుభూతిప్రక్రియగానే కాకుండా ఆర్థికంగా ఆ యింటివారిని ఇబ్బంది పడకుండా చేస్తుంది.

6. రచ్చబండ తీర్పులు :

కుటుంబ తగువులు, ఇంటితగువులు, పొలంతగువులు, వ్యక్తులమధ్య తగువులు వారిలోవారే పెద్దలను నిర్ణయించుకొని వారిద్వారా రచ్చబండమీద పరిష్కరించుకుంటారు. దీనినే రచ్చబండ తీర్పులు అంటారు. అన్నికులాల వారూ ఒకరినొకరు అన్నా, బావా, మామా, అక్కా, వదినా, అత్తా అని వరసలుపెట్టి పిలుచుకుంటూ కలసి మెలసి బ్రతుకుతారు. పెద్దలు వీరి తగువులలోని లోతులు తెలుసుకొని నిష్పక్షపాతంగా తీర్పులు చెబుతారు. అందుకే అవి అందరికీ శిరోధార్యం - ఖరీదులేనివి. * "నిరక్షరాస్యులు అజ్ఞానులుకారు. జ్ఞానాన్ని సంపాదించుకోడానికి అక్షరాస్యత ఒక అవకాశం మాత్రమే. కనుకనే జానపదులు అజ్ఞానులు కారు - అనుభవజ్ఞులు. అనుభవం మనిషికి జ్ఞానాన్ని యిస్తుంది. తమ అనుభవాలవల్ల తమకు అందిన

---

* 'ఆంధ్రుల జానపద విజ్ఞానం' లోని 'తొలిపలుకు'

డా॥ ఇరువెంటి కృష్ణమూర్తి

సంస్కారంతో ఎన్నో శారీరక, సాంఘిక, మానసిక సమస్యలకు పరిష్కారాలు కనుగొని తరతరాలుగా తమకు ఎదురౌతున్న ఇక్కట్లను ఎదుర్కొంటుంటారు"

7. కులాలు :

జానపదులలో కులాలు ఉన్నాయి గాని కుల వైషమ్యం మాత్రం తక్కువ. కుల కట్టుబాట్లు, ఆచారాలు ఎవరికివారివి వేరుగా ఉంటాయి. పెద్ద కులాలలో పాతివ్రత్యం విధిగా పాటించాలి. పరపురుషసాంగత్యం భార్యను భర్త విడిచిపెట్టేదాకాపోతుంది. భర్త చనిపోతే ఆమె విధవరాలుగా జీవితాంతం బ్రతకవలసిందే. వ్యభిచారనేరానికి సంఘంలో వెలివేయడంకూడా కద్దు. ఇక మగాడిసంగతికి వస్తే ఏకపత్నీవ్రతం ప్రశంసనీయం - పిల్లలు పుట్టనప్పుడు బహుపత్నీ వ్రతం నిషేధంకాదు. ఒక కాలంలో ఉంపుడుకత్తెలను ఉంచుకోవడం వ్యక్తి గొప్పతనానికి నిదర్శనంగా ఉండేది. కొన్ని కులాలలో భార్యాభర్తలకు సరిపడకుంటే పెద్దలు విచారణచేసి కులతప్పులువేసి విడాకులు ఇప్పిస్తారు. వారు పునర్వివాహంచేసుకోవడానికి అనుమతిస్తారు. కొన్నికులాలలో స్త్రీలు అలా ఏడుమనువులవరకూ వెళ్ళవచ్చు.

## ఔదార్యం

పెద్దరైతులు తమపొలాలలోపండేపంటను వారిదగ్గరపనిచేసే పాలికాపులకు, కమతంమనుషులకు ఉదారంగాపంచిపెడతారు. అందువలన వారు తమరైతులకు లాభాలుఎక్కువరావాలని ఎంతో శ్రద్ధగా పొలాల ఆలనాపాలనా చూసి పంట ఎక్కువపండేటట్లు చేస్తారు. నిజానికి వాళ్ళస్వంతపొలాలుగా చూసుకుంటారు. రైతులు పాలికాపులకుముప్పొద్దులాభోజనంపెట్టి తమ స్వంతబిడ్డలుగా చూసుకుంటారు. అందుకే విచ్చలవిడిగావదిలేసినా పొలాలలో దొంగతనాలు ఉండవు. ఒకసారి ఒక రైతుచేలో ప్రక్కరైతు తాలూకు పాలేరు పచ్చగడ్డి దొంగతనంగాకోసేస్తే ఈ రైతుపాలేరుఅతనితో పోట్లాడి ఆ గడ్డిమోపు విడిపించుకొని రక్తసిక్తమైనదేహంతో ఆ గడ్డిమోపు తనరైతు దగ్గరకు తీసుకొచ్చాడు. అదీ వారి స్వామిభక్తి. దొంగతనం చేసినవారిని పోలీస్‌స్టేషన్‌కి పంపడం కాకుండా ఊరిపెద్దలు రచ్చబండమీద విచారించి శిక్షిస్తారు. ఇలాంటి ఆరోగ్యప్రదమైన విధానాలతో జానపదులు తమకు తామే

సరిదిద్దుకుంటారు. వ్యవసాయంచేయడంలో కొన్నిక్రమతాలు కలిసి సమిష్టిగా తమపొలాలు దున్నుకోవడం, కుప్ప నూర్పులు చేసుకోవడం చేస్తారు. పొలాలలో పంట బాగాపండినప్పుడు దానికి దిష్టితగలకుండా గడ్డితో మనిషి బొమ్మచేసి దానికి దుస్తులుతొడిగి చేనుమధ్య కర్రపాతి కొందరు మట్టి ముంతకు సున్నముతోబొట్లుపెట్టి మనిషిముఖంలాచేసి నిలబెడతారు. ఇందులో దిష్టితగలకుండాచేయుట ఒక ఆలోచన అయితే, రాత్రులు దొంగలకు ఎవరో మనిషికాపలా ఉన్నాడనే భ్రాంతికలిగించడం ఒకఆలోచన. అక్రమంగా పశువులు ఇతరుల పొలాలలో మేస్తూఉంటే దానిని అరికట్టేకట్టుబాటు బందెల దొడ్డిలో పెట్టడం.

"గట్టిగా పెంపదక్షతలేక నూరూర
బందెల పడిపోయె పశుగణంబు" (మనుచరిత్ర)

దీనినిబట్టి ఈ బందెల దొడ్డి అనేది 16వ శతాబ్దినాటికే ఉందన్నమాట.

**9. వృత్తులు :**

మేదరులు బుట్టలు, తట్టలు అల్లుతారు. తాపీపనివారు ఇళ్ళుకడతారు. కరణాలు లెక్కలువ్రాస్తారు. పురోహితులు గ్రామంలో ఇంటింటికీవెళ్ళి శుభా శుభాలుచెపుతుంటారు. కమ్మరులు రైతుకుకావలసిన నాగళ్ళు, కొడవళ్ళు, గునపాలు, పారలు వగైరాతయారుచేస్తారు. కంచరులు చెంబులు, బిందెలు, డేగిశాలు, వగైరా తయారు చేస్తారు. కంసాలి వెండి, బంగారు ఆభరణాలు తయారుచేస్తారు. చాకళ్ళు బట్టలు ఉతుకుతారు. మంగళ్ళు క్షురకర్మచేస్తారు. మాదిగలు చెప్పులు కుడతారు దేవాంగులు బట్టలునేస్తారు. కోమట్లు అంగళ్ల నడుపుతారు. ఇలా ప్రతిగ్రామంలో రైతులతోపాటు ఈవృత్తులవారు ఉండుట వలన ఏగ్రామానికాగ్రామం స్వయంపోషకం అయ్యేది.

**10. నిత్యజీవనం :**

ఎండకూ, వానకు తలపై గొడుగులు వేసుకొని తిరుగుతారు. ఇవి తాటాకుగొడుగులు. వానకు జమ్ముతో తయారుచేసిన గూడచాపలుకూడా వాడతారు. గాలికోసం తాటియాకు విసనకర్రలు, కూర్చొనుటకు తుంగచాపలు జానపదుల వ్యవహార సామాగ్రి.

### 11. సంఘ జీవనం :

కలిగినవాళ్ళలో స్త్రీలు కాళ్ళకు కడియాలు, నడుముకువడ్డాణం, దండకు కడియం, చేతులకు మురుగులు, మెడలో కాసులపేరు, నాను, పట్టెడవగైరా వెండి, బంగారు ఆభరణాలు ధరిస్తారు. వివాహిత స్త్రీలుమెడలో బంగారంతో చేసిన మంగళసూత్రాలు కట్టుకుంటారు. నిర్ధనులు పసుపుకొమ్ము కట్టుకుంటారు. భర్తే స్త్రీకి సర్వస్వం. దీనివల్ల గృహజీవితం నిరపాయం. వీరిది సమష్టికుటుంబపద్ధతి. కలిసి శ్రమించడం కలిసిజీవించడం వీరి జీవన సరళి.

### 12. ఇళ్ళూ వాకిళ్ళూ :

వీరి ఇళ్లు మండువాలోగిళ్లు. వీరిది సమష్టికుటుంబపద్ధతి. ఒకే గర్భాన పుట్టినసోదరులు పెరిగపెద్దవాళ్ళై వివాహముచేసికొని పిల్లల్నికంటున్నా ఆస్తిని పంచుకొని వేరేకాపురాలుపెట్టక, కలిసిమెలిసి ఆ ఇంటిలోనే కాపురం ఉంటూ జ్యేష్ఠసోదరుని పెత్తనంమీదనే నడుచుకుంటారు. మనుమలూ, మునిమనుమలూపుట్టినా చాలా కుటుంబాలలో ఏకకుండ కూడే. ఇంటిముందు అరుగులు, ప్రక్కనవాకిలి, వెనుకవైపు పెరడు సాధారణంగా వీనిలో తీర్చి దిద్దబడతాయి. సామానులుదాచుకోవడానికి అటకలు, మిద్దెలు వేసుకుంటారు. బట్టలుఆరబెట్టుకొనడానికి దండెంకడతారు. ప్రతిఇంటికీ కోళ్ళగూడు, దాలి గుంట, పశుశాల ఉంటాయి. ఆకోడిగ్రుడ్లు, మాంసము వీరికి ఇంటసిద్ధంగా నుండే కూరపదార్థాలు. దాలిగుంటలో పాలుకాచుకుంటారు. అంటే ఎండు పిడకలు గుండ్రంగాపేర్చి, దానికి అగ్నిముట్టించి దానిపై పాలు కాయడం, పప్పువండడం పరిపాటి. పొయ్యిమీదవంటయితే పిడకలు, పుల్లలు వాడతారు. ఇలా అన్నీ అందుబాటులోఉంచుకొని తృప్తిగా జీవనంసాగిస్తారు జానపదులు.

### 13. ఆచారాలు :

నిత్యజీవితంలో అలవాటుగాచేసేపనులు తరతరాలుగా ఆచరించబడటం వల్ల ఆచారాలుగా పిలవబడుతున్నాయి. జానపదులది కర్మసిద్ధాంతం. చెట్లుల్నీ, పుట్టల్నీ, రాళ్ళనీ, రప్పల్నీ, సూర్యుణ్ణీ, విగ్రహాల్నీ అత్యంత భక్తితో పూజిస్తారు. రావిచెట్టుకు, వేపచెట్టుకు పెళ్ళిచేసి పుణ్యకార్యంచేసినట్లు భావిస్తారు. ఈ చెట్లు ఔషధపరంగా చాలా విశిష్టమైనవికదా ! ఆ విశిష్టతను గుర్తింపచెయ్యడానికే యిలాంటి క్రతువు లేర్పరచడం. వేపచెట్టు ఔషధప్రక్రి

యకు ఎన్నో రీతుల ఉపయోగించే వృక్షం - దాని ఆకులు, ఈనెలు, బెరడు, లోపలిచెక్క, వ్రేళ్లు అన్నీ క్రిమిసంహారాలే. ఇక రావిఆకు - దానిమీద ఏదికలిపినా రసాయనిక సంయోగం పొందనిది. అందువల్ల ఔషధసేవనంలో తేనె మొదలగు అనుపానాలతో భస్మాలను ఈ ఆకులలోనే కలిపినాకుతారు. పురుషులు తల పైపాగా, మూతికిమీసం, కాళ్ళకు కిర్రుచెప్పులు ధరిస్తారు. పాగా తలకు ఎండతగలకుండా కాస్తుంది. పైగా తలకు ఏదెబ్బా తగలకుండా చేస్తుంది. మీసం ఉచ్ఛ్వాస నిశ్వాసలలో గాలిని చల్లబరుస్తుంది. పొలాలలో పాములు, పురుగులు ఈ కిర్రుచెప్పుల శబ్దానికితప్పుకుని దూరంగాపోతాయి. అందుకని పొలాల్లోతిరిగేవారు ఈ కిర్రుచెప్పులు తొడుక్కొని తిరుగుతారు. స్త్రీలు ముఖానికి పసుపు, కళ్ళకు కాటుక, కాళ్ళకు పారాణి రాసుకుంటారు. పసుపు ముఖానికి మెరుగుఇచ్చి రోమాల్నిహరిస్తుంది. కాటుక కంటికి అందాన్నికూర్చుటే కాకుండా కంటిరోగాలనుకూడా చేరకుండా చూస్తుంది. పారాణి సూక్ష్మక్రిములనుదూరంచేస్తూ ఇనుపముక్క వగైరాగుచ్చు కున్నప్పుడు సెప్టిక్ కాకుండాకాస్తుంది. ఈఆచారాలలో అంతర్గతంగా కొన్ని ఆరోగ్యసూత్రాలు ఇమిడిఉన్నాయి.

ముత్తైదువలెవరైనా తమఇంటికివస్తే వెళ్లేటప్పుడు పుణ్యస్త్రీ అయిన ఆఇంటామె కుంకుమతో తాను ముందు బొట్టుపెట్టుకొని తరువాత ఆమెకు బొట్టుపెడుతుంది "దీర్ఘ సుమంగళీ భవ" అని. ఇక్కడ అతిధికి బొట్టుపెడితే చాలదా, తనుముందు బొట్టుపెట్టుకోవడం దేనికీ అనేప్రశ్న రావచ్చు. విధవరాండ్రు బొట్టుపెట్టుకోరాదు. వారు ఇతరులకు బొట్టుపెట్టడంకూడా అమంగళం. అందువల్ల తాను ముందు బొట్టుపెట్టుకోవడం ఎదుటివారికి తానుకూడా పుణ్యస్త్రీనే అని తెలియచెప్పడమన్నమాట.

## 14. చావు బ్రతుకులు :

మనిషి మంచం మీద చనిపోవడం అరిష్టమని జానపదులు మనిషి చచ్చిపోతాడనుకొన్నప్పుడు మంచంమీదనుంచి క్రిందికిదించి ఎండు గడ్డిలోపడుకోబెడతారు. ఈ గడ్డిలో పడుకోబెట్టడంవల్ల చల్లబడ్డ దేహం వేడెక్కి మరల ప్రాణం పుంజుకొనే అవకాశం ఉంటుందేమో అనే ఆశ. అంతేకాకుండా ప్రాణం పోయేముందు తులసాకు పసరు పిండి నోట్లో పోస్తారు. ఇది ఆఖరిమందుగా ప్రయోగించడ మన్నమాట.

తులసాకు శక్తివంతమైన ఓషధికదా! మనిషి చచ్చిపోయినపుడు మరీ వృద్ధుడైతే శ్మశానానికి ఊరేగింపుగా తీసుకెళతారు. ఈ ఊరేగింపులో బాజా బజంత్రీలుకూడా పెడతారు పెళ్ళిఊరేగింపులాగ - కానీ, పెళ్ళిబాజా వేరు, చావు బాజావేరు. చావుబాజాకు వీరణంమీద "టమకటట్టమక, టమకటట్టమక" అని ఒకేలా వాయిస్తారు. ఇంకేవరసలూ వాయించరు. దీన్నిబట్టే చావుబాజా అని తెలుసుకోవచ్చు చూడక్కరలేకుండానే. వివాహంకానివారిని తాటియాకు చాపలోచుట్టబెట్టి ఏకకర్రకుకట్టి శ్మశానానికి మోసుకెళ్తారు. వివాహితులైతే కటుకుకట్టి, దానిపై పరుండబెట్టి, పైన ఏడుకట్టులు బిగించి మోసుకెళతారు. కటుకులంటే రెండు వెదురుగడలు రెండుఅడుగులదూరంలో ఎదురెదురుగా పెట్టి ఏడుచోట్ల రెండేసి వెదురుముక్కలు కత్తెరలాపెట్టి ఆరెండుగడలనూ కలుపుతూ కట్టబడేళయ్య. దీనినే 'పాడె' అనికూడా పిలుస్తారు. ఇలా తీసికెళ్ళేటప్పుడు దారిలో అక్కడక్కడ మూడుచోట్ల దింపి, కాసేపు ఉంచి, మరల భుజానికిఎత్తుకొని మోసుకెళ్తారు. ఈ ప్రదేశాలనే దింపుడుకళ్లాలంటారు. ఇలా అక్కడక్కడ దించడంలో ఒకఉద్దేశం ఇమిడి ఉంది. ఆ మోసుకురావడంలోని ఊపులో మరల గుండెకదలి కొట్టుకోవడం ప్రారంభిస్తుందేమోననే ఆశ. దీనినే దింపుడుకళ్ళం ఆశ అంటారు. శవాన్ని తీసికెళ్ళేటప్పుడు సానుభూతిగా బంధువులు, మిత్రులు, ఇరుగువారు, పొరుగువారు అందరూకూడా వెళతారు. శవంమీద పూలూ, బుక్కా డబ్బులు చల్లుతుంటారు. ఈ ఏడుకట్లకొయ్యలసవారికి కొన్నికులాలలో వేరేపద్ధతి ఏర్పాటు చేసి మోసుకెళ్తారు. విశ్వబ్రాహ్మణులు, దేవాంగులు రెండుకర్రలమీద గుడిలాకట్టి, గుడ్డతో మూడువైపులా మూసేసి, ఎదుటవైపు కనిపించేలా అందులో శవాన్ని కూర్చోబెడతారు. గుడిపై ఇత్తడిచెంబు పెడతారు. దానినే "అనంతశయనం" అని పిలుస్తారు. నలుగురూ నాలుగువైపులా భుజాలమీద ఈ కర్రలు పెట్టుకొని మోసుకొని తీసికెళ్ళి పాతిపెడతారు. ఈ శవాన్ని కూడా ఊరేగింపుగా తీసికెళతారు. కుదుపుకి అనంతశయనంలోని శవంతలకాయ అటుయిటూ ఊగుతుంటే వీరణంవాయిద్యం "తట్టాం గొయ్యి తియ్యి, వాడబ్బు వాకియ్యి" అన్నట్టు వినబడుతోందని ఆ వాయిద్యాన్ని అలా వాగ్రూపంలో పిల్లలు అనుకరిస్తుంటారు, క్షత్రియుల విషయానికొచ్చేసరికి వారిచావులో ఒక విశేషం చెబుతారు. "రాచపీనుగ తోడు లేకుండా

చావదట". ఈ మాట ఎలాపుట్టిందో పరిశోధించవలసివుంది. ముస్లింలు, క్రైస్తవులు శవాలను పెట్టిలలోపెట్టి మోసుకెళ్ళి పాతిపెడతారు. తురకల శ్మశానంలో హిందువులను పాతిపెట్టనీయరు. దీనిమీద తూర్పుగోదావరి జిల్లాలో ఒకచిత్రమైన జానపదగాథకూడా చెపుతుంటారు. దోమాడకరణం చచ్చీ సాధించాడు బ్రతికి సాధించాడు అని. ఆ కరణం బ్రతికి ఉన్నప్పుడు పన్నులవసూల పేరుతోనూ, లంచాల పేరుతోనూ ఆగ్రామస్తులను కాల్చుకు తినేవాడట. అయితే చచ్చిపోయేముందు ఊరివారందరినీ పిలిచి తానుచేసిన పనికి పశ్చాత్తాపపడుతున్నానని కళ్ళనీళ్ళు పెట్టి తన చివరికోరికఒకటి తీర్చ మని దీనంగా కోరాడట - ఏమంటే తురకల శ్మశానందగ్గర తనను ఖననం చేయమని. ఓస్ ఇంతేగదా అనివారు తీసికెళ్ళి ఆశవాన్ని అక్కడపాతిపెట్టా రట. దానితో తురకలంతా తిరగబడి వీళ్ళమీదకి కత్తులు దూస్తే అదోపెద్ద యుద్ధరంగంగా మారిందట. పైగా చట్టప్రకారం న్యాయస్థానం ఆ కప్పెట్టిన వారికి శిక్షలు వేసిందట.

మిగిలినజాతులు శవాన్ని కట్టెలతో కాల్చి బూడిదచేస్తారు - పెండ్లి కానివారిని మాత్రం యిలా దహనంచేయక ఖననం చేస్తారు. మూడవరోజున 'చిన్నదినమని' ఆరోజు అన్నం, పాయసం వగైరా మృతునికి, ఇష్టమైన పిండివంటలుచేసి ఆకులోఉంచి మదురుమీద పెడతారు.

"గృధ్ర వాయసాది రూపేణ ఉపభుంక్ష్వ" అంటే చనిపోయినవారు కాకిరూపంలోనో గ్రద్దరూపంలోనోవచ్చితింటారని అర్థం. అవి కాకులు ముట్టు కోకపోతే మృతునికి కావలసినది ఇంకా ఏదో మిగిలిపోయిందని భావిస్తారు.

## 15. దాన ధర్మాలు :

ఇంటికి బిక్షానికివచ్చిన ముష్టివారిని పొమ్మనకుండా దోసెడు బియ్యం వేస్తారు. రాత్రులు "మాదాకబలం బాబయ్యా" అంటూ వచ్చే గంగిరెడ్లవారు వగైరాలకు గిన్నెతోతెచ్చి అన్నంముద్దలువేస్తారు. చారు, కూరలు, మజ్జిగ కూడా పోస్తారు. 'లేదుపో' అనడం ఎక్కడోగాని ఉండదు. అలాగే పంట కాలంలో బిక్షకులకు పొలాల్లో వరిమోపులు, వరిపనలు దానంచేస్తారు. దీనిలో

కూడా ఒక పరమార్థం ఇమిడివుంది. ప్రత్యక్షంగా అది దానంలాకనిపించినా పరోక్షంగా వారిదృష్టి తమ సొత్తుమీదపడకుండా చూసుకోవడం. ఇలా కలిగినవారు దానధర్మాలు చేయకుంటేవారు ఆకలిబాధకు తాళలేక వీరిఇండ్లపై పడి ఏ అఘాయిత్యంఅయినా చెయ్యవచ్చు. పొలాలలో పంట యింటికి చేరక పోవచ్చుకూడా. తమమీద వ్యతిరేకభావాలు వాళ్ళలోకలగకుండా యిలా సముదాయించడం అనే విజ్ఞానం ఈ దానాలలో దాగిఉందనిపిస్తుంది.

## 16. నోములు :

* "మాంగల్యసంరక్షణ, మూసినముత్తెంవలె అత్తవారింట సంచరించగలుగుట అనే లక్ష్యసాధనపై ఎన్నియో నోములు ఆచరణలోనికివచ్చినవి. బాలికలను ముద్దియలును, పెరిగి పెద్దవారగు లేతవయస్సునందు వారికి సౌశీల్యము, మితభాషిత్వము, పులుగడిగిన ముత్తెంవలెనుండుట మొదలగు ప్రశంసనీయమైన లక్షణములునేర్పుటకివి ఎంతయో తోడ్పడునను నిర్వివాదాంశము".

** "ఆడపిల్లలు ఎప్పటికైనను తాము జన్మించినచోట ఉండక మరియొకచోటకి పోవలసినవారే కదా ! క్రొత్తవారినడుమ కొత్తకొత్త గృహమర్యాదలతోమెలగవలసిన కొత్తడి ఎంతమెలకువతో అణకువతో మెలగవలసియుండునో ? అట్లు కొత్తఇంట మెలగవలసిన నడవడులు నేర్పవలసిన బాధ్యత ఎవ్వరిది ? తల్లిదే. అయితే ఆపద్ధతులు అన్నియు కాగితముపై వ్రాసి వల్లెవేయించిన బాలిక అట్టి మర్యాదలు నేర్చుకొనగలదా ? అది శిక్షణ మార్గమగునా ? కాదు. అందు ఆకర్షణలేదు. ఉత్సాహం లేదు. ఆనందం లేదు. ఒక పాటగనో, పద్యముగనో, కథగానో, వ్రతముగ్గానో ఉన్న అది చిత్తాకర్షకముగా ఉండగలదు. ఇతరులఇంట అణకువతోమెలగవలసిన బాలలకు సదాచారసంపత్తియందు సుశిక్షణమొసగుటకే మనప్రాచీనులు ఆడబిడ్డలకు చిన్నతనముననే నోములు పట్టించు ఆచారము ఏర్పరచిరి."

---

* ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి పుట 83 (ఆచార్య ఖండవిల్లి లక్ష్మీ నిరంజనం)

* * విజ్ఞాన సర్వస్వము, తెలుగు సంస్కృతి.

## 1. ఉదయ కుంకుమ నోము :

బాలికకు వివాహమైన సంవత్సరమున మాఘమాసంలో రథసప్తమి నాడు తులసికోటవద్ద ఏరుపిడకలతో పాలుపొంగించి సూర్యునకు ప్రీతికరంగా, పొంగలితయారుచేసి, ఆపైన గౌరీపూజచేయించి నివేదనపెట్టి మొదటిగా ఈ నోము పట్టిస్తారు. ఈ నోముపట్టిన బాలిక ప్రతిరోజూ ఉదయమేలేచి ముఖం కడుక్కొని, బొట్టుపెట్టుకుని, మరొక ముత్తైదువకు బొట్టుపెట్టాలి, ఇలాసంవత్సరంవరకూచేసి ఆఖరున ఒకముత్తైదువకు తలంటినీళ్ళుపోసి సకల భోజ్యములతో భోజనంపెట్టి చీర, రవికలగుడ్డ, కుంకుమతో నిండిన బరిణె, దక్షిణతాంబూలాదులతో వాయనం ఇచ్చి ఉద్యాపన చేసుకోవాలి. ఈ నోముతోపాటు చిట్టిబొట్టునోము, కాటుక గౌరినోము, నిత్యశృంగారనోము, పువ్వులు-పండ్లు-తాంబూలం నోము మొదలగు నోములు పట్టిస్తారు.

ఈ నోములన్నీ బాలికజీవితారంభానికి తొలిపాఠాలు అని చెప్పవచ్చు.

## 2. చిట్టిబొట్టు నోము :

ఈ నోము పట్టినబాల ఉదయమేలేచి కాలకృత్యాలుతీర్చుకుని తల దువ్వి జడవేసుకుని, స్నానంచేసి, ఉతికిఆరవేసిన మడిబట్టలు కట్టుకుని, బొట్టూ కాటుకా పెట్టుకుని, పసుపూ గంధంపూసుకుని అక్షతలు పట్టుకుని -

" చిట్టిబొట్టు పట్టవలె సిరిగలఇంట పుట్టవలె
పట్టుపుట్టము కట్టవలె పసిడినగలు పెట్టవలె
ఏడుగురన్నలతో పుట్టవలె ఏకచక్రం ఏలవలె
పదుగురన్నలతో పుట్టవలె పట్టభద్రుని చేపట్టవలె "

అనికథ చెప్పుకొని అక్షతలు పైనవేసుకోవాలి. తరువాత అయిదుగురు ముత్తైదువలకు పసుపురాసి, కుంకం బొట్టుపెట్టి, గంధంరాసి, బొట్టుకు క్రిందుగా గంధంచుక్కపెట్టి, దానిపై రెండుఅక్షింతలు అంటించి, అక్షతలు వారిచేతులోపెట్టి, పాదాలకుమ్రొక్కి అక్షతలు తలపైవేయించుకొని వారి దీవెన పొందుతారు.

దీనివలన బాలికలకు సౌభాగ్యచిహ్నాలైన హరిద్ర, కుంకుమలయెడ శ్రద్ధాభక్తులు, పెద్దలయెడ వినయవిధేయతలు ఏర్పడతాయి.

3. కన్నెతులసమ్మ నోము :

ఇది పెండ్లికానిబాలికలు ఆచరిస్తారు. ప్రొద్దుటేలేచి స్నానంచేసి, తులసమ్మదగ్గర ముగ్గులుపెట్టి, ఐదుఒత్తులు వెలిగించి, శివరాత్రినాడు ప్రారంభించి ఏడాదిపాటు ప్రతిరోజూ ఇలాచేస్తారు. ఆఖరున ఒక కన్యకు ఉద్యాపన చేస్తారు.

ఉద్యాపన అంటే వ్రతసమాప్తి. ఆరోజున పూజించి ఆమెకు భోజనం పెట్టి దానధర్మాలు చేస్తారు. దానితో ఆ చిన్నవయస్సులోనే వారిలో ఒక క్రమశిక్షణ, దానబుద్ధి అలవడతాయి. వివాహం ఆలస్యమైన కన్నెలకు వివాహంలో సౌభాగ్యంకల్గిగించునని కొందరివిశ్వాసం.

4. నిత్య శృంగార నోము :

ప్రతిరోజూ సాయంకాలం ఒకముత్తైదువకాళ్ళకు పసుపురాసి, పారాణి పూసి, నమస్కరించి, తాంబూలంఇచ్చి, దువ్వెనతో తలసవరించి, అద్దంచూప దం దీని విధానం. ముగ్ధలకు అందంగాఅలంకరించుట అంతర్లీనంగా ఇది నేర్పుతుంది.

5. మూగనోము :

దీపావళి మొదలు కార్తీకశుద్ధపూర్ణిమవరకూ బాలికలు దీనినినోస్తారు. వాఙ్నియమము వారికి అలవరుచుట దీనిఉద్దేశం. జానపదులవి సమిష్టికుటుం బాలుకదా ! సమిష్టికుటుంబాలలో మెలగవలసిన పడతికి ఇది శీల పోషకం. ఇలాంటివే శ్రావణమంగళవారంనోము, బొమ్మలనోము వగైరా ఎన్నో నోములు బాలికలను, యువతులను తీర్చిదిద్దు విజ్ఞానంతో కల్పించబడి అనాదిగా జానపదులలో అజరామరంగా నిసర్గవిజ్ఞాననిధిగా సాగివస్తున్నాయి. నోముఅంటే నియమం. శారీరక, మానసిక క్రమశిక్షణ యీ నోముల్లో కని పిస్తుంది. వీవిలో కొన్ని ఆరోగ్యానికి సంబంధించినవి కూడా ఉన్నాయి. సూర్యునకు సంబంధించినవి, పసుపు, కుంకుమలకు సంబంధించినవి, తులసి చెట్లు, రావిచెట్లు, వేపచెట్లులకు సంబంధించినవి యీ బాపతే. కొన్ని శాస్త్రీయ

మైనవి. శ్రావణమంగళవారంనాడు పసుపుకొమ్మను పూజించి దానిని కర్పూరంతో అరగదీసి గౌరీప్రసాదంగాస్వీకరించి దీనితో స్నానంచేయడం ఒక వ్రతనియమం, దీనివల్ల తరుణవయసుపిల్లకు శరీరదుర్గంధం, రోమములు, ఋతుబాధలు పరిహరించబడతాయని శాస్త్రాలు చెబుతున్నాయి.

* "వీనిని కన్యకలు అయిదవతనమునిమిత్తమును, ఐశ్వర్యంనిమిత్తమును, సవతిపోరు లేకుండునిమిత్తమును ముఖ్యముగా నోచుకొనుచూవచ్చిననూ, వీనిఆచరణలవలన సదాభ్యాసములు, దైవభక్తి, ఆస్తికభావములు, పాపభీతి, ధర్మానురక్తి కలిగి బాలికలకు చక్కని శిక్షణ ఏర్పడెడిది. వీనిలో కొన్ని స్త్రీలనేకులు కలిసి నోచుకొనునవీ, ఆచరించునవీ అగుటచేత ముందు ముందు సమిష్టికుటుంబంలో భాగస్వామినియగు బాలికకు పరస్పర సహకారము, ప్రేమ, మైత్రి మొదలగు బీజములుగానాటి ఆమెలో ఉత్సాహమును పెంపొందించుచువచ్చినవి."

ఈ నోములనేవి పదకొండవశతాబ్దినాటికేఉన్నవి అనేవి నన్నయగారి మహాభారతంలో శకుంతలోపాఖ్యానంలోని ఈ క్రిందిపద్యంవల్ల తెలుస్తోంది.

" నుడుపులు వేయు నింకేల యిప్పాటి
నోముల దొల్లి కడగి నోచితిని గాకేమి "

## వ్రతాలు

ఆర్తజనులకు అభయహస్తాలు జానపదుల వ్రతాలు.

మానవజీవితం సహజంగా కష్టాలపుట్ట. కొందరికి ఆకలి బాధ - కొందరికి ఆరోగ్య బాధ-కొందరికి సంసారబాధ-కొందరికి సంతాన బాధ. ఇలా ప్రతిమనిషికీ ఏవోబాధలే. శ్లేష్మంలోపడ్డ ఈగలాగ యీప్రపంచంలో కొట్టుమిట్టాడే మనిషికి దుఃఖోపశమనంకోసం ఏదోఒక ఓదార్పు కావాలి. ఆ ఓదార్పులే యీవ్రతాలు. ఈవ్రతాలకు ఆరాధ్యుడు దేవుడు. ఆ దేవుని అనుగ్రహానికి పెద్దవాళ్లు చెప్పిన యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధివంటి పద్ధతులను ఆచరించడం సామాన్యుడికి సాధ్యం

* విజ్ఞాన సర్వస్వము, తెలుగు సంస్కృతి ౧

కాదు. అందువల్ల సూక్ష్మంలో మోక్షంగా యీ వ్రతాలు అవతరించాయి. వీనికి విశ్వాసం ప్రధానం. జానపదులు ఎంతో భక్తివిశ్వాసాలతో వీనిని ఆచరించి మనస్సును తేలికపరుచుకుంటారు తమభారం దేవుడిమీదపడేసి. నిజానికి యీదేవుడనే అదృశ్యశక్తి సృష్టింపబడకుంటే యీ కష్టాలకడలిలో మనిషిమనుగడ ఎంతబాధాకరం ! అందుకే దేవుడికంటే దేవుణ్ణి సృష్టించిన వాణ్ణి మెచ్చుకోవాలి.

సహజంగా జానపదులు కులమత వర్గ వివక్షతలేకుండా ఆరాధించే దేవుడు తిరుపతి వేంకటేశ్వరుడు. ఆపదమొక్కులవాడు. కొండకొస్తానని, తలనీలాలిస్తానని మొక్కుకుంటేచాలు ఆపని జరిగిపోతుందనేది ప్రతీతి. "తట్టుడి - తెరువబడును, పిలువుడి - పలుకబడును" అన్నంత తేలిక. అందుకే నిత్యం వేలాదిమంది ఆదేవుణ్ణి దర్శిస్తూ మొక్కులుచెల్లిస్తుంటారు. అట్లాంటి దేవుడే సత్యనారాయణస్వామికూడా.

## సత్యనారాయణ వ్రతం

తూర్పుగోదావరిజిల్లాలో ప్రత్తిపాడుదగ్గర అన్నవరంలో పంపానదీ తీరాన రత్నగిరిపై వెలిశాడు శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామి. దరిద్ర బాధలుతీరడానికి యీస్వామివ్రతం దివ్యౌషధంగా భావిస్తారు. ఈ వ్రత సందర్భంలో బంధుమిత్రుల కట్నాలూ, చదివింపులూచూస్తుంటే లౌకిక పరంగాకూడా యిది నిజమే అనిపిస్తుంది. (ఈ మధ్య అధికారులు, డాక్టర్లు, లాయర్లు, అధిక సంపాదనకు ఇది సాధనంగాకూడా వాడుకుంటున్నారను కోండి). ఈ స్వామి సన్నిధిలో మొక్కుకున్న పెళ్ళిళ్ళెక్కువ. ఖర్చు తక్కువ. ఈ దేవుని వ్రతం సామాన్యుని పాలిట కల్పవృక్షం. సాగిన వాళ్ళు కొండకెళ్ళి చేసుకుంటారు. సాగలేనివాళ్లు యింటిదగ్గరే చేసుకుంటారు. ఇందులో ప్రతిభాగానికి ప్రత్యేక విశేషముంది. వ్రతఫలంలో ప్రేక్షకుడికి కూడా భాగస్వామ్యంవుంది కథాప్రారంభంనుంచి ప్రసాదం తీసుకొని భుజించే వరకూ, కథాప్రారంభంఅయ్యాక మధ్యలోలేచిపోతే కీడు జరుగుతుందట. ఆఖరున ప్రసాదం భుజించకుండాపోయినా అపరాధంచేసినట్టే. కాబట్టి

అడిగైనా యీ ప్రసాదం తినమన్నారు. సాహిత్యసభలకి, సత్యనారాయణ స్వామి వ్రతానికి ఆహ్వానం అక్కరలేదంటారు.

ఇది మాఘమాసంలోగాని, వైశాఖమాసంలోగాని, కార్తీక మాసంలో గాని పుణ్యదినాలలో చేస్తారు. ముఖ్యంగా ఏకాదశి, పౌర్ణమి దినాలలో ఎక్కువ. ఈ వ్రతం స్కాందపురాణంలో చెప్పబడింది. ఈ పురాణకథలు చాలవరకు నైమిశారణ్యంలో శౌనకాదిఋషులకు సూతమహాముని చెప్పినట్లు ప్రారంభమౌతాయి. నారదుడు భూలోకంలో మానవులకష్టాలు చూసి జాలిపడి విష్ణువుదగ్గరకెళ్ళి దీనికి తరుణోపాయం చెప్పమని వేడుకున్నాడట. దానికి విష్ణుమూర్తి సత్యనారాయణవ్రతం చెప్పాడట. దీన్ని పరీక్షించడానికి నారదుడు భూలోకానికి వచ్చి భిక్షమెత్తుకునే ఒక పేదబ్రాహ్మణునికి యీ వ్రతం తెలిపాడట. వెంటనే అతను వ్రతం చెయ్యడానికి సంకల్పించుకున్నాడు. ఆనాడు ఎక్కువ బియ్యం దొరికాయట. దానితో వ్రతంచేస్తుంటే ఒక కట్టె లమ్ముకునేవాడొచ్చి అంతాచూసి ఆ ప్రసాదం తిన్నాడట. ఆరోజు అతనికి రోజూకంటే మూడింతలు ఎక్కువ అమ్ముడుపోయాయట.

'ఉల్కాముఖుడనే' రాజు, 'భద్రశీల' అనేభార్యతో ఏటిఒడ్డున యీ వ్రతం చేస్తుండగా 'సాధువు' పేరుగల వైశ్యుడుచూసి యీ వ్రతం ఎందుకు చేస్తున్నారని అడిగితే సంతానంకోసం అన్నాడట. ఆ వైశ్యునికికూడా సంతానం లేదు. ప్రసాదంతీసికొనితిని తనకుసంతానంకలిగితే వ్రతం చేస్తానని సంకల్పించాడట. అంతే - భార్య 'లీలావతి' గర్భం ధరించింది. అందాలభరిణ అమ్మాయిపుట్టింది. 'కళావతి' అని పేరుపెట్టారు. అయితే తీరికలేనిపనుల్తో వ్రతాన్ని వాయిదావేసుకున్నాడు ఆమెపెళ్ళయ్యాక చేద్దామని. ఆమెకు రత్నాకరుడనే వైశ్యశ్రేష్ఠునితో వివాహంజరిగింది. మామాఅల్లుళ్ళిద్దరూ వ్యాపారం నిమిత్తం సింధునదీ తీరంలోని 'రత్నసానుపురం' వెళ్ళేరు. అక్కడ వ్యాపారం జోరయ్యింది. ఆ ఆనందంలో 'సాధువు' సంకల్పించిన వ్రతం సంగతే మరచిపోయేడు. స్వామికి కోపంవచ్చింది. ఒకరోజురాత్రి దొంగలు ఆ దేశపు రాజైన చంద్రకేతు మహారాజు గారింట్లో దొంగతనం చేసి భటులు తరుముకొస్తుంటే భయంతో ఆ వస్తువులు ప్రక్కనున్న యీ వైశ్యులున్న అరుగుమీద పడేసి పారిపోయేరు. రాజభటులు యీ షావుకార్లను దొంగలని తీసుకుపోయి జైల్లోపడేశారు. అక్కడ యింటిదగ్గర

దొంగలుపడి సర్వం దోచేశారు. తల్లీకూతుళ్ళు అన్నవస్త్రాలకుకూడా కరువై అటుక్కోవడం మొదలెట్టేరు. ఒకనాడు కళావతి బిక్షాటనచేస్తూ ఒకబ్రాహ్మణ యింట యీవ్రతం చేయడంచూసి తల్లికిచెప్పింది. ఆమెకువెంటనే గతం జ్ఞాపకంవచ్చి పశ్చాత్తాపంపొంది ఆ వ్రతం చేస్తాననిసంకల్పించి భర్తనూ అల్లుణ్ణీ క్షమించమని ప్రార్థించింది. అక్కడ చంద్రకేతుమహారాజు కలలో సత్యనారాయణస్వామి కనబడి వీరు చోరులుకారనీ తెల్లవారేసరికి విడిచిపెట్ట మనీ చెప్పేడు. ఆరాజు విడిచిపెట్టడమేగాక సిరులిచ్చి మరీ సాగనంపేడు. వారు ఓడలో ఆధనరాసులు వేసుకువస్తుంటే స్వామివారిని పరీక్షింపదలచి ముసలిబ్రాహ్మణుడుగావచ్చి సత్యనారాయణవ్రతం చెయ్యబోతున్నానని ధన సాయం చెయ్యమని అడిగాడు. వైశ్యుడు తమదగ్గర ధనంలేదు పొమ్మన్నాడు. బ్రాహ్మణుడు ఓడలోఉందికదాఅన్నాడు. వైశ్యులు ఓడలోనివి తీగలు, ఆకులు అన్నాడు. అట్లేఅగుగాక అని బ్రాహ్మణుడు వెళ్ళిపోయాకచూసు కుంటే తీగలూ ఆకులే ఉన్నాయి. వెంటనే పరుగుపరుగునవెళ్ళి అతనిపాదాలు పట్టుకుంటే అతడు సత్యదేవునివ్రతం గుర్తుచేశాడు. 'సాధువు' చెంపలేసు కుని ఇంటికివెళ్ళగానే వ్రతంచేస్తానని సంకల్పించాడు. తీగలూ, ఆకులూ రత్నరాసులుగామారాయి. ఓడ రత్నపురానికి వచ్చింది. ఆ సమయంలో వైశ్యునియింట కళావతి సత్యనారాయణవ్రతంచేస్తోంది. భర్తా, అల్లుడూ వచ్చారని తెలియగానే లీలావతి కుమార్తెను వ్రతం పూర్తిచేసుకురమ్మని తాను ఏటిఒడ్డుకు ఎదురెళ్ళింది. కుమార్తె కళావతి భర్తఆగమనానికి ఆనంద పడిపోతూ ప్రసాదంతినకుండాపరుగెత్తింది. అంతే - అక్కడ ఓడ నీటిలో మునిగిపోయింది. కళావతిభర్త కూడా అందులో మునిగిపోయేడు. కళావతి దుఃఖంతో భర్తను అనుసరించబోగా ఆకాశవాణి వ్రతప్రసాదం భుజించ కుండావచ్చిన ఆమెతప్పిదానికి యీ ప్రమాదం జరిగిందని చెప్పగా ఆమె వెనుకకువెళ్ళి ప్రసాదంతిని తీసుకొచ్చింది. ఓడ, భర్త తేలి పైకొచ్చారు.

ఒకసారి అంగధ్వజుడనేరాజు అడవిలో మృగములవేటాడుతూ ఒక చోటికివెళ్ళేసరికి, అక్కడ కొందరు గొల్లలు సత్యనారాయణస్వామివారివ్రతం చేస్తున్నారట. వారు ప్రసాదం యివ్వబోగా రాజు తూష్ణీభావంతో తిరస్కరిం

చాడు. వెంటనే తన వందమందికొడుకులూ మరణించినవార్త వచ్చింది. ఇది సత్యదేవునిమహత్తే అని తెలిసికొనివ్రతం చేసుకుంటాను అని సంకల్పిం చాడు- వాళ్ళు బ్రతికారు.

ఈ వ్రతానికి ఎర్రగోధుమరవ్వ, బెల్లం కలిపిచేసే ప్రసాదం ప్రత్యేకత. ఖర్చు యిలా యీ ప్రసాదం ఖరీదూ, వ్రతంచేయించిన పురోహి తునకిచ్చే సంభావనామాత్రమే. అందరికీ అందుబాటులో ఉండే వ్రతం- జానపదులలో బాధామయజీవితాలకు సేదతీర్చే వ్రతం.

## త్రినాథ వ్రతం

ఇదికూడా దరిద్రనివారణకుచేసేవ్రతమే. బ్రహ్మ, విష్ణు, మహేశ్వ రుల పూజ. వారికి ప్రతీకలుగా మూడు కలశాలుపెట్టి పూజిస్తారు. ఈ వ్రతాన్ని 'మేళ' అనికూడా అంటారు. ఇది సాయంత్రం పూజ. త్రిమూర్తు లకు గంజాయిధూపం యీవ్రత ప్రత్యేకత.

పూర్వం ఉజ్జయినీనగరంలో ఒకబ్రాహ్మణుడు కటికదరిద్రంతో బాధ పడుతూ జీవిస్తున్నాడు భార్యతో. ఒక కుర్రవాడు పుట్టేడు. తల్లికి పాలులేవు. ఎలాగో తంటాలుపడి బిక్షమెత్తి ఒకఆవుసుకొన్నాడు పాలకోసం. ఒకరోజు అది తప్పిపోయింది. దానినివెదకడానికి బయలుదేరిన ఆ పేదబ్రాహ్మణుడు చూరతీరాలుకూడా గాలించాడు. దొరకలేదు. ఇంటిస్థితిని తలుచుకుంటే పాలు లేక పిల్లవాడి ఏడుపు-సముదాయించలేక తల్లిఏడుపు - ఇదంతా ఆలోచిస్తూ భగవంతుడా ! ఏమిటినాకీనరకం అని దుఃఖిస్తుంటే జాలితలచి దివ్యతేజ సంపన్నులైన ముగ్గురుమూర్తులువచ్చి త్రినాథవ్రతంచేస్తే దరిద్రం తొలగి పోతుందని చెప్పివెళ్ళిపోయారు. వారే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. అలాగే చేస్తాననిసంకల్పించి ఇంటికి బయలుదేరేసరికి దారిలో ఆవుదొరికింది. భార్యతోకలిసి వ్రతంచేశాడు. అష్టయిశ్వర్యాలూ వచ్చాయి. ఇది తెలిసికొని ఆ రాజ్యంలో యితరులుకూడాచేసి శ్రీమంతులవుతున్నారు.

ఈ పట్టణరాజుకు అందరూఅలా శ్రీమంతులుకావడం యిష్టంలేదు. అందుకని తన రాజ్యంలో యీవ్రతంచేస్తే శిక్షిస్తానని శాసనంచేశాడు. రాత్రులు

మారువేషంలోతిరిగి ఎవరైనాచేస్తున్నట్టుతెలిస్తే వారిని మరునాడు దండించే వాడు. ఒకరోజు అకస్మాత్తుగా రాజుగారికోట అగ్నికాహుతై పోతోంది. భార్యాబిడ్డలుకూడా అందులో గతించారని వార్త వచ్చింది. అప్పుడు త్రిమూర్తులఆగ్రహంవల్ల యిలాజరిగిందని గ్రహించి యీవ్రతం తానుచేస్తానని మనఃపూర్వకంగా నమస్కరించాడు. వెంటనే కోట మామూలుగా కనిపించ సాగింది. భార్యాబిడ్డలు ఎదురొచ్చారు.

ఇది ఏపురాణాల్లోనూ ఉన్నట్టులేదు. ఇది పూర్తిగా జానపదులు కల్పించుకున్న కథ. ధూపానికి గంజాయి ఖర్చు, చూడవచ్చిన వారికి ప్రసాదంగా పంచడానికి కొబ్బరికోరు, పంచదార ఖర్చు తప్ప మరేఖర్చు లేనిదిది. జానపదులు దీనినికూడా చాలా భక్తిశ్రద్ధలతో చేస్తారు. ఈవ్రతం మనకు ఉత్కళదేశంనుండి దిగుమతయింది.

## హనుమద్ వ్రతం

ఇది పురాణాంతర్గతమైనది. భవిష్యత్పురాణంలో చెప్పబడింది. ఇష్టార్ధములిచ్చేవ్రతం అని, గ్రహబాధలు, రోగములు పలాయనమౌతాయని దుష్టగ్రహములు తొలిగిపోతాయని, సర్వకార్యసిద్ధియని యీ వ్రతం చేస్తారు. ఇది మార్గశిర శుక్ల త్రయోదశినాడు జరిపిస్తారు. వీలుంటే పంపానదీతీరాన చేస్తారు. ఇతర చోట్లచేస్తే 'హేమకూటగిరి ప్రాంతజాతాం' వంటి పురాణ మంత్రాలచేత పంపానది పూజచేసి తరువాత హనుమద్వ్రతానికుపక్రమిస్తారు.

చేతికి పదమూడుముడుల తోరం కట్టుకుని 'ఓంనమోభగవతే వాయునందనాయ, అనే మంత్రం జపిస్తూ అక్షతలతో షోడశోపచార పూజచేసి 13 అప్పాలు (నేయి, గోదుమపిండితో చేసినవి) దక్షిణ తాంబూలాదులతో పురోహితునకు వాయినం యిస్తారు. ఇలా చేసినవారికి ఆంజనేయుడు సహకారిగా ఉంటాడట. మూలమంత్రంతో సాంగోపాంగంగా వ్రతం పూర్తిచేసి మూడుసార్లు గంధం అభిమంత్రించి చేతులకు పూసుకున్నా, లలాటాన ధరించినా జనవశీకరణ వస్తుందట.

ఈ వ్రతంకూడా నైమిశారణ్యంలో శౌనకాదిమునులకు సూతుడు చెప్పిందే. పాండవులు ద్వైతవనంలో ఉండగా వ్యాసుడు పరామర్శించ

డానికివెళ్ళాడు. ధర్మరాజు వ్యాసుని తామిలారాజ్యభ్రష్టులగుటకు కారణ మేమనిఅడిగాడట. పూర్వం శ్రీకృష్ణుడుచెప్పగా జయము కోరి ద్రౌపది యీవ్రతంచేస్తుండగా అర్జునుడుచూసి నాజెండామీది మృగమును పూజించుట నాకవమానమని కోపంతో ఆమెచేతితోరమును త్రెంచివేయమని ఆజ్ఞాపించాడట. పతివ్రతయగు ద్రౌపదీ భర్త ఆదేశానుసారం వ్రతతోరం త్రెంచివేసి దీక్షను విరమించింది. పదమూడు ముళ్ళుగల తోరం తెంపివేసినందున పదమూడు సంవత్సరాలు అరణ్యావాసం వచ్చింది అనిచెప్పేడు. తరువాత యీ వ్రతంచేసి ధర్మరాజు రాజ్యం పొందాడని కథాభాగం. విద్యార్థులు విద్యలో విజయం పొందాలని యిది చేస్తారు.

108 అప్పాలు హనుమంతునిమెడలో దండగుచ్చివేస్తారు. తేతతమల పాకులతో పూజచేస్తారు. ఆ ఆకులు భక్తులకిస్తారు. ప్రసాదంగా అవి కాడ కూడా పారెయ్యకుండా నమిలి మ్రింగాలి, అదే దీని విశిష్టత, అంత నిష్ఠతో చేస్తారు. జానపదులు.

## వరలక్ష్మి వ్రతం

ఇది ముఖ్యంగా ఐశ్వర్యాభివృద్ధికోసం చేసేవ్రతం. స్త్రీలే చేస్తారు. శ్రావణ పౌర్ణమికి ముందువచ్చే శుక్రవారం దీనికి నిర్దిష్టమైన రోజు. 'అస్మాకం సహకుటుంబానాం క్షేమ స్థయిర్య విజయాయురోగ్య ఐశ్వ రాభివృధ్యర్థం, ధర్మార్థకామమోక్ష చతుర్విధఫల పురుషార్థ సిద్ధ్యర్థ్యం, సత్సంతాన సౌభాగ్య ఫల ప్రాప్త్యర్థం' అని సంకల్పం చెప్పుకుని చెంబుకు గంధం అద్ది, కుంకుమ బొట్టుపెట్టి, నీటితో నింపి, గంధపుష్పాక్షతలు వేసి మఱ్ఱిచిగుళ్ళు, మామిడి చిగుళ్ళు మొదలగు పంచపల్లవములు, తామర పువ్వు, కొబ్బరికాయ అపాత్రపై నిలిపి, దానిపై వరలక్ష్మీదేవి రూపు ఉంచి, (చిన్న బంగారు బొమ్మ) కుడిచేత్తో ఆ కలశం పట్టుకొని వరలక్ష్మి దేవిని 'సర్వమంగళ మాంగళ్యే విష్ణు వక్షస్థలాలయే, అవాహయామి దేవీత్వం సుప్రీతాభవసర్వదా, శ్రీ వరలక్ష్మి మావాహయామి' అని ఆవాహన చేసి 'పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే, నారాయణ 'ప్రియేదేవి సుప్రీతాభవ సర్వదా' అనే శ్లోకంతో అర్ఘ్య పాద్యాదుల అష్టోత్తరశతనామాలతో షోడశోపచారపూజచేసి, ప్రదక్షిణ నమస్కారాలతో

పూజిస్తూ, తొమ్మిది ముడులుగల రెండుతోరాలు అమ్మవారివద్దవుంచి, 'బధ్నామి దక్షిణ హస్తే నవసూత్రం, శుభప్రదం పుత్రపౌత్రాభివృద్ధ్యంచ దేహిమేరమే'అని తోరపూజచేసి ఒకతోరంతీసి కుడిచేతికి కట్టుకుంటారు. తరువాత నానావిధభక్ష్య భోజనముల నివేదనచేసి ముమ్మారు ప్రదక్షిణచేస్తారు.

దీనికికూడా ఒకకథవుంది. ఈ కథ చెప్పేముందు అందరికీ అక్షతలు యిస్తారు. కథానంతరం అందరూ అవి దేవిమీదచల్లి తమ తలలమీద చల్లుకుంటారు. పూజానంతరం పురోహితుని గంధపుష్పాక్షతలతో పూజించి 12 కుడుములు వాయనమిచ్చి, దక్షిణ తాంబూలాదులతో సత్కరించి నమస్కరించి ఆశీర్వాదంపొందుతారు. ఆ తరువాత ప్రసాదం అందరికీపంచిపెడతారు. ఈ వ్రతంకూడా సూతుడు శౌనకాది మునులకు చెప్పిందే. ఒకనాడు పార్వతీదేవి ఏంచేస్తే స్త్రీలు పుత్రపౌత్రాదిసంపత్తితో సర్వసౌఖ్యాలూకలిగి సుఖంగా ఉంటారో చెప్పమంటే పరమేశ్వరుడు యీ వ్రతంచెప్పేడట. మగధదేశంలో కుండిన మహానగరంలో చారుమతి అనే బ్రాహ్మణస్త్రీవుంది. ఆమె మహా పతివ్రత. ఆమెయందు లక్ష్మీదేవికి అనుగ్రహంకలిగి కలలో కనిపించి శ్రావణశుక్లపౌర్ణమికి ముందువచ్చే శుక్రవారం తననుపూజిస్తే కోరిన వరాలిస్తాననిచెప్పిందట. ఆరోజురానేవచ్చింది. ఆమె బంధుమిత్రులతో వరలక్ష్మీదేవిని పూజించి, తొలిప్రదక్షిణ చేసేసరికి వారికాళ్ళల్లో మువ్వలరవళి వినిపించిందట. చూసుకుంటే కాళ్ళకు బంగారుగజ్జెలు. రెండవ ప్రదక్షిణచేసేసరికి చేతులకు నవరత్నఖచితమైన ఆభరణాలు వచ్చాయట. మూడవప్రదక్షిణ ఆయ్యేసరికి అందరూ సర్వభూషణాలంకృతులయ్యారట. ఈ వ్రతాలు చేసేవాళ్ళకేగాక విన్నవారికీ, చదివినవారికీ కూడా యిష్టకామ్యములు సిద్ధిస్తాయని ఆఖరున ఫలశ్రుతి చెప్పబడుతుంది. ఇలాంటిదే యిష్టకామ్యార్థసిద్ధికోసంచేసే మరొక వ్రతం 'వినాయక వ్రతం'.

వీనిలో పుణ్యంపురుషార్థాలమాట ఎలావున్నా అత్యల్పమైన ఖర్చుతో బంధుమిత్రులసమాగమం, తన్మూలంగా సమాజంలో సమత, మమత, అనురాగం, అభిమానం అభివృద్ధిజరిగే అవకాశముంది. పైగా వీని నిర్వహణలో

మనిషికి నియమనిష్ఠలు, క్రమశిక్షణ, ఏకాగ్రత అలవడతాయి. సంతానం కోసం, సంపదలకోసం ధనాఢ్యులు చేసే పుత్రకామేష్టి, రాజసూయం, అశ్వమేధంవంటి క్రతువులకు, యజ్ఞయాగాదులకు యివి ప్రతిరూపాలు. సామాన్యులకుకూడా ఆ ఫలంమీద కోరికుంటుంది గదా ! అందుకని అవి అతని స్థాయికిసరిపడగా సరళంచేయబడి, యిలా వ్రతాలరూపంలో అందించబడ్డాయి. ఈ అణుయుగంలోకూడా యిప్పటికీ జానపదులు పల్లెలలో యీ వ్రతాలను ఎంతో వేడుకగాచేసుకుంటూ ఆయాదేవతల ఆశీర్వాదంపొందుతున్నట్టు అనుభూతిని పొందుతుండడం గమనార్హం.

* "ఈ వ్రతములందు నిగూఢమైన మొదటిధర్మము వితరణ. వ్రతంపేర కలిగినంతలో పండో, పత్రమో, వస్తువో, వస్త్రమో, ధనమో, ధాన్యమో, భోజనమో ఇతరులకు అందజేయుట అనునది ముఖ్యలక్షణముగా కనిపించుట. దానములేనివ్రతములేనేలేదు. రెండవప్రయోజనము భగవద్భక్తి ప్రార్ధనాశీలత". అందుకే వ్రతకథలలో ఎత్తిమరీచెబుతారు -"శక్తిలోపమైనను భక్తిలోపము కారాదు. కథలోపమైనా వ్రతలోపముకారాదు" అని.

** " నోములు, వ్రతాలవలనకలిగే లాభాలుఏమిటి అని ఆలోచిస్తే మొదట నలుగురూచేరి సంతోషముగా కాలం గడుపుట అని చెప్పవచ్చు. బీజమునందు వృక్షగుణధర్మములన్నియు గర్భితములై ఉన్నట్లు ఈ వ్రతములందు దయ, సత్యం, శౌచం, నీతి, ఆరోగ్యం, మోక్షం మొదలగు సంప్రదాయములన్నియు గర్భితమైయున్నవి".

## విశ్వాసాలు :

చంద్రుడి దగ్గరగుడికడితే దూరపువానలనీ, దూరంగా గుడికడితే దగ్గరవానలుపడతాయనీ జానపదులవిశ్వాసం. గుడి అంటే చంద్రబింబానికి చుట్టూ కొంతదూరంలో అప్పుడప్పుడు చక్రంలా కనబడే కాంతివలయం.

---

* విజ్ఞాన సర్వస్వము, సంస్కృతి పుట, 908, 910

** ఆంధ్రుల జానపద విజ్ఞానము పుట 315, డాక్టర్ ఆర్.వి.యస్. సుందరం.

పిల్లిమాయదొరికితే అది యింటిలోపాతిపెడితే ఆఇంటిలో బంగారం తులతూగుతుందట.

ఇంటిమీద తీతువుపిట్ట అరిస్తే ఆఇంటికి అరిష్టమట. ఆ ఇంట్లో చావు బ్రతుకుల్లో ఉన్న రోగి ఎవరైనాఉంటే ఖాయంగా చచ్చిపోతారని దానిఅర్థమట. అలాగే వీధుల్లో కుక్కలు చేరి మొయ్యోమని మోరపైకెత్తుకుని అరుస్తుంటేకూడా ఆ వీధిని ఎవరింట్లోనైనా చావుబ్రతుకులలో మనిషిఉంటే ఇక చచ్చిపోతాడని నిర్ధారణచేసుకొంటారు. అతనిప్రాణాలు తీసుకెళ్ళడానికి వచ్చిన యమకింకరులు ఆ కుక్కలకు కనిపించి అలా అరుస్తుంటాయని వారి భావన.

ఆకాశంలో తోకచుక్క పొడిస్తే దేశంలో గొప్పవాళ్ళు ఎవరో చచ్చిపోవడంగానీ, ఏదైనా ఉపద్రవంరావడంగానీ జరుగుతుందట.

ప్రయాణంవెళ్ళేటప్పుడు ఒకతుమ్ముతుమ్మితే కార్యనాశనం. రెండు తుమ్ములుతుమ్మితే విజయం అని విశ్వాసం. అలాగే వెనుకతుమ్ము ముందుకు మంచిది అంటారు. (ఈ వెనక అనేది బయలుదేరిన తరువాతనా లేక వెళ్ళేవారివెనకనా అనేది పరిస్థితినిబట్టి సరిపెట్టుకుంటారు).

గ్రహణకాలంలో ఏమైనాతింటే కడుపులో శూలపోట్లువస్తాయని గ్రహణ సమయానికి ముందుగానే భోజనాలు పూర్తిచేస్తారు. గ్రహణ సమయంలో గర్భవతులుకదిలితే పిల్లలు గ్రహణంమొర్రుతో పుడతారట. దేవుడుగుడికివెళ్ళి దైవదర్శనంచేసిన తర్వాత సరాసరి వచ్చేయక కాస్సేపు ఆలయంలో కూర్చోవాలట.

మనిషినెత్తిమీద పిట్ట రెట్టవేస్తే మేలు జరుగుతుందంటారు. ప్రయాణ వాహనంమీద కుక్క మూత్రవిసర్జనచేస్తే ఆ ప్రయాణం విజయం అంటారు.

చావుపరామర్శకు వెళ్ళినప్పుడు పరామర్శించి నేరుగా తిరిగి ఇంటికి వచ్చేయాలిగాని మధ్యలో ఎవరిఇంటికీ వెళ్లరాదంటారు. కాళ్ళు బారచాపుకు కూర్చున్నవాళ్ళ కాళ్ళుదాటితే మళ్ళీ ఇటువైపుకు దాటమంటారు. ఇలాచేయకుంటే ఎవరికాళ్ళుఅయితే దాటారో వారు స్త్రీఅయితే భర్త, పురుషుడయితే భార్య చనిపోతారనేది ఒక వాడుక.

పొలకమారితే ఎవరో కావలసినవాళ్లు తలచుకుంటున్నారంటారు. ఏపనికైనా ముగ్గురుబయలుదేరితే అది ముక్కలైపోతుందట. (కార్య నాశనం). కాకిఅరిస్తే బంధువులు వస్తారంటారు. గడపమీద తుమ్మితే వారి తలమీద, గడపమీద పసుపునీళ్ళుచల్లుతూ 'చిరంజీవ' అంటారు.

ఇంట్లో మొండిచేయి మొలిస్తే (పుట్టుగొడుగు మొండి చేయిలా మొలిస్తే) ఆ యింటికి అరిష్టమంటారు.

వీనిలో నిజమెంతున్నా, అబద్ధమెంతున్నా వారి జీవితగమనానికి జానపదులు ఏర్పాటుచేసుకున్న లక్ష్మణరేఖలు ఇవి.

వర్షాలు కురవకుంటే ఒకబాదురుకప్పను పట్టుకొని పసుపురాసి బొట్టెట్టి పసుపుగుడ్డలోకట్టి రోకలికికట్టి ఆ రోకల్ని యిద్దరు పిల్లలుమోస్తూ యింటింటికీ ఊరేగింపుగాతీసుకెళితే గడపగడపకూ పళ్లాలతో పసుపు, కుంకుమ పువ్వులు పెట్టి పంపిస్తారు. దీనికూడా పిల్లలు పుల్లలతో కోలమీదవాయిస్తూ.

"కప్పలతల్లి నీళ్లాడే
కడవలనిండా వానాకురిసే"

అని పాడుతూ ప్రతి గుమ్మానికీ తీసికెళతారు. ఇలా కప్పనుపూజిస్తే వాన వస్తుందనేది జానపదుల విశ్వాసాలలో ఒకటి.

ఈ వర్షాలకోసం ఊరంతా శివాలయంలో హోమాలు చేయించి ఆఖరున శివునితలమీద వేలాది బిందెలనీళ్లు గుమ్మరించి గుడినింపేస్తారు. వెంటనే వర్షంపడుతుందని వారివిశ్వాసం. దీనికోసం దేవుని ముందర వంద లాది కొబ్బరికాయలుకూడాకొట్టి ఆ నీళ్లతో అభిషేకిస్తారు. ఈ కొబ్బరికాయ కొట్టడంలో ఒక జానపదవిజ్ఞాని చెప్పినమాట. క్షుద్రదేవతలకు నోరున్నజంతు వుని బలియిస్తారట - సాత్విక దేవతలకు నోరులేని జంతువుని బలియివ్వడ మట యిది. కొబ్బరికాయ మొక్కవస్తుందిగనక అది ప్రాణే. ఆకాయలోని నీరు శరీరంలో రక్తంలాంటిదని, గుంజు మాంసంలాంటిదని, పైపెంకు చర్మం లాంటిదని, అందువల్ల ఒక కొబ్బరికాయ పగలగొట్టడమంటే ఒకప్రాణిని బలివ్వడమే అని భావమట. చంద్రవంకలో ఉత్తరంకొమ్ము ఎక్కువుంటే

ఉప్పుధర పెరుగుతుందని, దక్షిణంకొమ్ము పెచ్చుంటే ధాన్యంధర పెరుగుతుందని భావిస్తారు. కొత్తయింటికి దృష్టిదోషం తగలకుండా బూడిదగుమ్మడి కాయ ఇంటిముందు వ్రేలాడదీస్తారు. దెయ్యాలు మీదపడకుండా పిల్లలమొల త్రాడుకు తోలుముక్క కడతారు. ఎక్కడికైనావెళ్లేటప్పుడు ఎక్కడికని ఎవరైనా అడిగితే వెళ్లేపనిజరగదంటారు. తలమీద చేతులు పెట్టుక్కూర్చుంటే దరిద్రమట.

పసిపిల్లలకు అద్దంచూపిస్తే మీదపళ్ళొస్తాయట. మీదపళ్ళొస్తే మేనమామలకుకీడని నూనెమండిగలో ఆబిడ్డముఖం నీడచూపించి చాకుతో ఆబిడ్డ బొట్టునీడపై పొడిపించి రోలుమీద కొబ్బరికాయలు, వెలక్కాయలు కొట్టిస్తారు. తెల్లవారుజామునవచ్చిన కలలు జరుగుతాయంటారు. దీపాలుపెట్టాక ఇల్లుతుడిస్తే లక్ష్మిపోతుందట. ఏకాదశి, మహాశివరాత్రి, సంక్రాంతి, భోగి, మకరసంక్రమణం రోజుల్లో చనిపోతే పుణ్యలోకాలు వస్తాయంటారు. ఒంటిమీద సాలెపురుగు ప్రాకితే కొత్తబట్టలు తొడుగుతారంటారు. పిడుగుపడేటప్పుడు అర్జున, ఫల్గుణ, పార్థ, కిరీటి, శ్వేతవాహన, సవ్యసాచి, భీభత్స, కృష్ణ, విజయ, ధనుంజయ అని అర్జునుని పదిపేర్లూ చదివితే పిడుగు దగ్గరకురాదట. ఇంటిలో బూరుగుచెట్టు, కుంకుడుచెట్టు, ఉసిరిచెట్టు ఉండరాదంటారు. గ్రహణసమయంలో ఆహారపదార్థాలమీదా, ఊరగాయలమీదా దర్భముక్కలు వేసుకోవాలంటారు-లేకుంటే వానిలో పాము విషంక్రక్కుతుందట. పిల్లలకు దృష్టిదోషం తగిలిందనుకున్నపుడు 3 ఎండు మిరపకాయలూ, ఉప్పూకలిపి దిష్టితీసి మండుతున్న పొయ్యిలోవేస్తారు. ఆ మిరపకాయలుకాలి ఘాటురాకుంటే దిష్టితగిలినట్టు లెక్కట.

గ్రద్దగాని, తీతువుగాని యింటిమీదవాలితే అశుభం. ఆంజనేయదండకం చదివితే దెయ్యాలు దగ్గరకురావట. చెప్పులూ, చీపుర్లూ తలదగ్గరపెట్టుకు పడుకుంటే దెయ్యాలు మీదపడవట. అరటిగెల కోసేసిన వెంటనే ఆచెట్టును కొట్టేయ్యకుండాఉంచితే చూసిన పుణ్యస్త్రీలకు వైధవ్యం వస్తుందట. సాయంకాలం పసిపిల్లల్ని వాకిళ్లలో పడుకోబెట్టిన పిట్టరూపువస్తుందని, అలా వచ్చినవాళ్ళకి ఆరూపు మార్చడం కోసం ఆబిడ్డని తూములో ప్రవేశపెట్టి వెలికి తీస్తారు.

# దయ్యాలు - భూతాలు

జానపదులు చేలకు నీరుకట్టడానికి, పంటలు దొంగలపరం కాకుండా చూసుకోవడానికి రాత్రులు పొలాల్లో తిరుగతుంటారు. రాత్రి తమకు కొరివి దయ్యం కనిపించింది అంటుంటారు. ఈ కొరివిదయ్యాలు మండుతున్న కొరివిలాగ, లాంతర్లు పట్టుకునడుస్తున్న మనుషుల్లాగ దూరంగా కనిపిస్తూ గాలిలో తేలియాడుతుంటాయి.

తూర్పు గోదావరిజిల్లా కొంకుదురులో వీనినిగురించి ఆసక్తిదాయకమైన ఒకకధచెబుతారు అది నిజంగాజరిగిందంటూ. రెండు తరాల క్రితం కవళయ్యగారనే ఒకపెద్దమనిషి వీధిలో మంచంవేసుకు పడుకొని నిద్రపోతుంటే కొరివిదయ్యాలు ఆయన్ని మంచంతోపాటే "వోం వోం కవళాబొజ్జా" అంటూ మోసుకుపోయి ఊరవతల ఆ మంచంతోబాటే నక్కలపాటి రావిచెట్టుదగ్గర రావిచెట్టుపైన పెట్టాయట. అలాతీసుకు వెళ్ళేటప్పుడు ఆ అర్ధరాత్రి ఆమాటలు వినబడుతున్నా అవి దయ్యాలనిభయపడి ఎవ్వరూ ఇళ్ళలోనుంచి బయటకిరాలేదట. మంచంమీద మనిషికి మెలుకువవచ్చి కూడా మాట్లాడితే ఏంచేస్తాయో అని నోరుమూసుకుని పడుకున్నాడట. తెల్లవారాకా చెట్టు దిగొచ్చాడట.

ఈ దయ్యాలూ భూతాల మీద అక్కడే మరొకకధకూడా చెప్పుతారు నిజంగాజరిగిందని. ఓ ఏభై ఏళ్ళక్రితం ఆవూరి దేవాలయందగ్గర ఒకబ్రాహ్మణ కుటుంబంఉండేదట. ఆ బ్రాహ్మణకుటుంబంలో అన్నగారు మంత్ర తంత్రాలు ఎరిగినవాడు. తమ్ముడు నూనూగు మీసాల నూతనయవ్వనంలో మిసమిసలాడుతున్న గొప్ప అందగాడు - పైగా బ్రహ్మచారి. వారికి వ్యవసాయముంది. అందువల్ల తమ్ముడు ప్రతీరాత్రీ పొలంలో పంటకాపలాకు అరపవేసుకొని దానిపై పడుకునేవాడట. ఒక అర్ధరాత్రి ఒక అపురూపసౌందర్యరాశిఅయినసుందరివచ్చి అతనిని నిద్రలేపి సంభోగానికి ప్రోత్సహించిందట. ఆమె సౌందర్యానికి ముగ్ధుడైనఅతను ఆమెను రమించాడట. తెల్లవారకముందే ఆమెవెళ్ళిపోయింది. ఇలాగే ప్రతీరోజూ జరుగుతుండేదట. పది రోజులు పోయే సరికి అతను చాలానీరసపడిపోయి పడిలంఖణాలు చేసిన మనిషిలాగ అయిపోయేడట. ఇలాగ పీడ ముఖం పడిపోయిన తమ్ముణ్ణి గమనించిన అన్నగారు తమ్ముణ్ణిప్రశ్నిస్తే జరుగుతున్నవ్యవహారంచెప్పాడు.

ఆ రాత్రి తమ్ముని వెళ్ళకుండా ఆపుచేస్తే అర్థరాత్రి ఆమెవచ్చి తలుపు కొట్టిందట. అన్నగారు లేచివచ్చి తన మంత్రశక్తితో ఆమెను నిజరూపంలోకి మారిస్తే ఆమె కామపిశాచి అని తేలింది. వెంటనే ఆభూతాన్ని తరిమికొట్టాడట. అలాగ తమ్ముని రక్షించుకోగలిగాడనీ, లేకుంటే మరో పదిరోజులకి ఆమె రాక్షస రతిమూలంగా అతను చచ్చిపోయి ఉండేవాడని చెప్పుతుంటారు. (కాశీమజిలీ కథలలో మదిరి సుబ్బన్నదీక్షితకవి గొల్లభామ కథల్లాంటివి ఇలాంటి వానిని వినే వ్రాసుంటారు). దయ్యం పట్టుకున్న వాళ్ళనుంచి దయ్యాల్ని వదిలించడానికి భూతవైద్యులు పేకబెత్తంతో దయ్యం పట్టిన మనిషినికొట్టడం, అతని తలవెంట్రుకనొకదాన్ని తీసి సీసాలోపెట్టి సీసా మూత బిరడాతోబిగించి లోపలగాలి బయటకు రాకుండాచేసి ఊరికిదూరంగా భూమిలో పాతిపెట్టడం చేస్తారు. అంటే ఆభూతం భూస్థాపితం అయిపోయి బయటకు రాలేదన్నమాట. ఈ భూతాన్నే గాలిపట్టడం అంటారు - గాలిలా దీనికికూడా రూపంలేనందువల్లనేమో ! దయ్యాలు మూతులు ఎర్రగాఉంటాయనీ, పాదాలు వెనక్కితిరిగి ఉంటాయని ప్రతీతి. జానపదులు ఈ భూతాల తృప్తికోసం బలులు ఇస్తుంటారు. రైతులు పంటకోసేముందు కోడినికోసి ఆ రక్తం అన్నంలోకలిపి మూడుముద్దలు చేలోవేసి భూతశాంతి చేస్తారు. కొన్ని ఊళ్ళల్లో గ్రామస్థులంతా సహకారంగా ఊరుమ్మడి డబ్బుతో మేకను కొని అమ్మవారి గుడిముందు తలనరికి ఆ రక్తం అన్నంలోకలిపి ఆ ముద్దలు ఆకుల్లోవేసి తీసుకెళ్ళి తమతమ పొలాల్లోచల్లి కోతప్రారంభిస్తారు. దీనినే పంటదేవత జాతర అంటారు.

ఇంతకీ శాస్త్రవేత్తలు కొరివిదయ్యాల గురించి చెప్పే సిద్ధాంతంవేరు. చనిపోయినవారి ఎముకలలోని భాస్వరం గాలిలో కలిసినప్పుడు మండుతూ గాలివాటాన్ని బట్టి అటూఇటూ కదులాడుతుంటుందట. అందుకే అవి ఎక్కువ శ్మశానాలలోను ఆ పరిసర ప్రాంతాలలోనే కనిపిస్తాయి. ఇక భూతావేశాన్ని గురించి వారు చెప్పేది - ఇది మానసికమైన ఒక రుగ్మత అనీ, భూతాలతో సంచరించామనేమాటలు కట్టుకథలనీను.

## చేతబడి

జానపదులలో దీనిమీద విశ్వాసమెక్కువ. ఇది తంత్రవిద్యకు సంబంధించింది. తంత్ర విద్యంటే భూతాలు, దయ్యాలు, పిశాచాలకు సంబంధించిన విద్య. శత్రువులను సాధించాలనుకున్నప్పుడు అతనినాశనాన్ని కోరుకుంటారు- ఆ నాశనానికి అజ్ఞాతంగాచేసే ప్రక్రియే చేతబడి లేక ప్రయోగం. ఈతంత్ర శక్తిగలవారు చాలా అరుదుగా ఉంటారు. ఇవి కొండదొరలుకూడా చేస్తారు.

ఎవరికైతే కీడు తలపెడతారో అతని తలవెంట్రుకగాని, గోరుగాని, మూత్రంగాని దొరికితేచాలు. దానితో ఈ ప్రయోగం చేస్తారు. ఆ మనిషి రూపుతో ఒకబొమ్మనుచేసి 'అబ్రకదబ్రా' వంటి మంత్రాలతో దానితలమీదా, కాళ్ళమీదా ముళ్ళుగుచ్చి అతనినుండి సంపాదించగలిగిన తలవెంట్రుకగాని, మూత్రంగాని, గోరుగాని, మూత్రంకలిసిన మట్టిగాని దానికికట్టి ఇంతకాలంలో ఆ వ్యక్తి చనిపోవాలనినిర్దేశించి దూరంగా శ్మశానంలో పాతిపెడతారు. వెంటనే అకారణంగా. అకస్మాత్తుగా ఆ వ్యక్తికి తలనొప్పి, కీళ్ళనొప్పి లాంటివిప్రవేశించి క్రమంగా అనారోగ్యానికిలోనై పీడముఖంపడి ఆ నిర్దేశించిన సమయానికి చనిపోతాడు. అలా పీడముఖం పడుతుండడం గ్రహించిన కొందరు పెద్దవాళ్ళు అది చేతబడి అని భావించి ఒక తంత్రిగాడిని ఆశ్రయిస్తారు. అతడు రోగిస్థితి గ్రహించి అది చేతబడే అని నిర్ణయించి ఆరోగిని గాని, రోగికి నమ్మకమైన వ్యక్తినిగాని అమావాస్యనాడు అర్ధరాత్రి చీకట్లో ఒక్కణ్ణీ రమ్మని, బొమ్మ పాతిబెట్టబడ్డచోటికి తీసుకెళ్ళి వివస్త్రంగా త్రవ్వమంటాడు. అలా త్రవ్వగా ముళ్లు గ్రుచ్చబడి మంత్రింపబడిన బొమ్మ కనిపిస్తుంది. దానిని పైకితీసి, ఆముళ్ళు వగైరాలు తొలగించి, మంత్రం జపించి, కొబ్బరికాయకొట్టి, ఆబొమ్మను నాశనంజేసేసి, రోగిస్తోమతసుబట్టి సొమ్ము వసూలుచేసుకుంటాడు. క్రమంగా ఆ వ్యక్తికి ఆజబ్బు తగ్గిపోతుంది. చేతబడి తీయడమనేది ఎక్కువగా ముస్లింలే చేస్తారు. తూర్పుగోదావరి జిల్లాలో 'దుళ్ళ' గ్రామంలో ఒక ముస్లిం ఈ విద్యలో ఆరితేరినవానిగా ప్రసిద్ధి పొందాడు. దీర్ఘకాయిలా రోగులు చేతబడి అనుమానమొస్తే ఒక కొబ్బరికాయ తీసుకొని అతని యింటికి వెళితే అతను ఆ కొబ్బరికాయ మన ఎదురుగానే ఒక కాళీ చెంబుపై పెడతాడు.

రెండునిమిషాలకు ఆచెంబునుండి "ఝుమ్" అని శబ్దంవస్తుంది. దానితో అతను మనకు తెలియని పిశాచిభాషలో మాట్లాడతాడు. తరువాత మాట్లాడిన విషయం మనకుచెబుతాడు. కొంతమందికి అది చేతబడికాదని సమాధాన మొచ్చిందని, ఎక్కడో జడుసుకున్నాడని, అక్కడ ఒకపిశాచి వెంటపడిందని చెప్పి దానిని వదిలించడానికి పదిరూపాయలుతీసుకొని వేరుముక్కకట్టి పంపిం చేస్తాడు. కొందరికి చేతబడిప్రయోగం జరిగిందని దానినితీయడానికి డబ్బు మాటాడుకొని అమావాస్యఅర్ధరాత్రి అతనినిరమ్మని, శ్మశానంలో త్రవ్వించి, ఆప్రయోగం చేసిన బొమ్మని పైకితీయిస్తాడు. ఆప్రయోగం చేసినవాళ్ళని మాత్రంచెప్పడు. అది ఆ రోగి, ఆరోగి బంధువులు ఊహించుకోవలసిందే శత్రువులెవ్వరో. ఇలా తీసేసినతరువాత అతనికి ఆజబ్బు నయమయి పోతుంది. ఆశ్చర్యం : చేతబడులనేవి అసలు లేనేలేవని అనేవారు దీనికి చెప్పేదేమిటంటే రోగితనను కలిసాక ఆతంత్రగాడే ఒకబొమ్మనుచేసి దానికి మెంత్రుకలుచుట్టి, ముళ్ళుగుచ్చి ఒక స్మశానంలో ఒకచోట పాతిపెట్టివచ్చి, ఆతరువాత అమావాస్యనాడు అర్ధరాత్రి అతనిని అక్కడకుతీసుకెళ్ళి త్రవ్వించి దానిని తీయిస్తాడని. మరి రోగమెలాతగ్గుతుందయ్యా అంటే సైకలాజికల్ ట్రీట్మెంటని అంటారు. పచ్చనిచెట్లకుకూడా ఈ ప్రయోగంచేస్తే ఆచెట్లు ఆకులురాల్చి మాడిపోయి చచ్చిపోతాయని జానపదులు చెబుతుంటారు. ఈ జిల్లాలోనే 'లొల్ల'లోనూ, 'వడిశలేరు'లోనూ, కోనసీమలోనూ ఈ చేత బడులు తీసేవారు ఉన్నారు. ఇలాంటివే చెడుపు, చిల్లంగి అనేవికూడ.

## గృహవాస్తు

జానపదులు ఇండ్లనిర్మాణంలో యీక్రింది నియమాలు పాటిస్తారు-ఆగ్నేయం పెరకం(పెరిగి) ఉండకూడదట - అలా ఉంటే ఆయింటిలోవారికి దరిద్రమట.

దక్షిణం, పడమర మెరకగా ఉండాలి-

తూర్పు, ఉత్తరం పల్లంగా ఉండాలి-

అలాఉంటే ఆయింటిలోనివారు వృద్ధి పొందుతారు.

ఆగ్నేయంలో పొయ్యి, ఈశాన్యంలో నుయ్యి, నైరుతిలోశయ్య, వాయు వ్యంలో గొయ్యి ఉండాలంటారు-అలా ఉంటే శుభం. సింహద్వారానికి ఎదు

రుగానుయ్యిగాని, గొయ్యిగాని ఉండకూడదు-ఉంటే అరిష్టమట. అలాగే వీధి శూలకూడదంటారు. వీధిశూలంటే వీధిలో రోడ్ల ఆద్యంతాలకు అభిముఖంగా గుమ్మం ఉండరాదు- ఇది వినాశ హేతువట. వాడకంనీరు తూర్పుభాగాన తూములోంచి పోవాలి. అలాచేస్తే ధనాభివృద్ధి అవుతుంది. మరుగుదొడ్డి దక్షిణ-నైరుతీ భాగాల మధ్యగాని, ఆగ్నేయ-దక్షిణ భాగాల మధ్యగాని ఉండాలి. అలా ఉంటే సర్వత్రా శ్రేయస్సు ఈశాన్యం తెరిపి వుండాలి- అంటే ఈశాన్యమూల కప్పులేకుండా ఉండాలన్నమాట. మూతవేస్తే ఆ కుటుంబం మసి అయిపోతుందట. ఇంటినానుకొని కాళీస్థలం వదలడంలో దక్షిణంకంటే ఉత్తరం ఎక్కువుండాలి. పడమరకంటే తూర్పుఎక్కువుండాలి. సింహద్వారంతో మూడు వరుసగుమ్మాలుంటే శివదృష్టి - సర్వనాశనం అంటారు. గర్భంలో గుమ్మాలు ఎనిమిదిగాని, పన్నెండుగాని ఉంటేటట్లు చేస్తారు. మొత్తంమీద అన్నిస్వరూపాలూకలిపి సరిసంఖ్యలో ఉండాలంటారు.

'గ్రిహస్థితి కంటే గృహస్థితి గొప్పది' - గ్రిహస్థితి సరిలేకుంటే నష్టపోయేది ఆఒక్కవ్యక్తే. గృహస్థితి సరిలేకుంటే ఆయింట్లో ఉన్నవారం దరికీ నష్టం కలుగుతుందని వారిభావం. గృహనిర్మాణంలో 'విష్ణు పృష్టం, శివదృష్టి' పనికిరావంటారు. - అంటే విష్ణాలయానికి వెనుక, శివాలయానికి ముందు ఉండే యిండ్లు శోభించవని, గృహచ్ఛిద్రాలు, దరిద్రంవంటివానితో సర్వనాశనం అవుతాయని అంటారు. అలాగే ధ్వజస్తంభం నీడపడ్డ యిళ్ళు కూడా వృద్ధినొందవని చెబుతారు. వీరు నాగరికుల్లాగ ఫేషన్‌కోసం కాకుండా గృహాలను ఉపయోగంకోసమే కడతారు. ఖర్చు తక్కువగా ఉంటేటట్టు మట్టి, సున్నం, ఇటుక (పచ్చి యిటుక కూడా) వాడి ఎక్కువగా పెంకుటిళ్ళే కడతారు. మరీ పేదలు పూరిగుడిశలు తాటాకుతో నిర్మించుకుంటారు.

* "Folk Architecture may be said to be traditional Architecture. It is concerned with all traditional aspects of building, the shapes, sizes and Lay outs of buildings all kinds"

---

* Warren E. Roberts, "Folk Lolorer Folk life" (Ed Richard M. Dorsa) ⸤81.

(ఆంధ్రుల జానపద విజ్ఞానం పు 434 నుండి గ్రహించబడింది.)

## శకునాలు

జానపదులు ఎక్కడికైనా ప్రయాణం బయలుదేరి వెళ్ళేటప్పుడు ఒంటిబ్రాహ్మణుడు, పిచ్చివాడు, గుడ్డివాడు, కురూపి, పొదితో మంగలి మురికిబట్టలమూటతో చాకలి, తెలుకల మనిషి, గర్భిణిస్త్రీ, విధవరాలు, తల విరబోసుకున్న స్త్రీ, తోళ్ళు, బొగ్గులు, ఉప్పు, నూనె, నువ్వులు, మినుములు, దూది, కట్టెలు, కొత్తకుండ, ఊక, మలం, మజ్జిగ, ఇనుము, పిడకలు, పిల్లి, పంది ఎదురొస్తే దుశ్శకునములుగా భావిస్తారు. దీనికి ప్రాయశ్చిత్తంగా ప్రయాణం ముందుకుమాని వెనక్కివచ్చి కాళ్ళూ చేతులూ ముఖమూ కడుక్కొని కాసేపుకూర్చుని అప్పుడు ప్రయాణం బయలుదేరతారు.

ఈ శకునాలు ఏడడుగులలోపులో వస్తేనే వర్తిస్తాయనేది ఒక సవరణ కూడా వుంది.

ఇక ఇద్దరు బ్రాహ్మణులు, పుణ్యస్త్రీ, వేశ్య, ఉతికిన బట్టలమూటతో చాకలి, నీరు, పాలు, పెరుగు, నెయ్యి, పువ్వులు, పండ్లు, మాంసం, శంఖం, మంగళారవం, శవం, ఆవుపేడ, ఆవు, గుర్రం, ఏనుగు, పుస్తకాలతో విద్యార్థి ఎదురొస్తే సుశకునములుగా భావిస్తారు.

## బల్లి పతనం

బల్లి చాలా కంగారుకీటకం. ఇళ్ళల్లో అస్తమానూ గోడలమీద పురుగులవేటలో తిరుగుతూఉంటుంది. అప్పుడప్పుడు అటూ యిటూ తిరగడంలో అప్రయత్నంగా మనిషిమీదపడుతుంటుంది. బల్లి కొన్ని అవయవాలమీద పడితే కీడు, కొన్ని అవయవాలమీదపడితే మేలు కలుగుతుందని జానపదులు అనాదిగా విశ్వసిస్తున్నారు. ఫలితాలు యిలాగుంటాయట.

కీడులు :- నడినెత్తిమీద - రోగం
ముంగురుల మీద - హాని
జడమీద, తల ముసుగుమీద - వైధవ్యం
చెవిమీద - దుర్వార్త వినుట
ముక్కుమీద - కార్యహాని
గడ్డం మీద - అపమృత్యువు

మెడమీద - మరణ భయం
నడుంమీద - బుద్ధి నాశనం
గుండె మీద - అధైర్యం
బొడ్డు మీద - భయం
బొడ్డుకు దిగువన - రోగం
కుడి చేతి మీద - సహాయ నాశనం
మణికట్టున - గర్వభంగం
వెన్నున - శత్రు భయం
తొడ వెనుక - విష భయం
స్త్రీకి తొడమీద - వ్యభిచారం
మోకాలిసందులో - వాహన భ్రష్టత్వం
మోకాలిక్రింద - వైద్యం మూలంగా ధనవ్యయం
కాలివేళ్ళ మీద - రోగం

మేళ్లు :- ఫాలభాగాన, కనుబొమ్మలమీద - ధనలాభం
చెంపల మీద - శుభం
ముక్కుప్రక్క - మిత్రలాభం
మీసంమీద - అధికార లాభం
బొమ్మలమీద - జయం
కడుపుమీద - పుత్రి లాభం
కడుపుప్రక్కన - ఆరోగ్యం
భుజాలమీద - సహాయం
అరచేతిమీద - ద్రవ్యలాభం
నడుమువెనుక - వస్త్రలాభం
పిరుదలమీద - శయ్యా సౌఖ్యం
ముందుతొడమీద - సౌఖ్యం
మోకాలిమీద - వాహనలాభం
పిక్కలమీద - కార్యలాభం
మోకాలి క్రిందిఎముకమీద - వ్యాపారలాభం
పాదంమీద - కళ్యాణం

## అవయవాలు అదరడం

అప్పుడప్పుడు అవయవాలు అదరడంఅనేది పశుపక్ష్యాదులలోనూ మనుష్యులలోనూ కనిపిస్తుంది. మనుష్యులలోకనిపించే యీ అదరడానికి అదిరే ప్రదేశాన్నిబట్టి యిలాగ శుభాశుభాలు చెప్పుతుంటారు.

కుడిప్రక్క అదిరిన మేలు, ఎడమప్రక్క మధ్యమఫలం. నడినెత్తిన మృష్టాన్నం, నొసట మేలు. కుడిచెంప రాజభయం, ఎడమచేయి ఉద్యోగం, రెండుకన్నులూ అదిరిన మేలు, ముక్కు రోగం, పై పెదవి కలహం, క్రింది పెదవి భోజన సౌఖ్యం, గడ్డం లాభం, కుడి చెక్కిలి ధనలాభం, ఎడమ చెక్కిలి దొంగలభయం, కుడి భుజం సంభోగం, ఎడమభుజం కీడు, రొమ్ము ధనలాభం, చేతులు వాహనలాభం, అరచేయి సంతానం, కుడితొడ రాజ భయం, మోకాళ్ళు జాడ్యం, మీగాళ్ళు ధాన్య లాభం, అరికాళ్ళు సౌఖ్యం.

ఆడవాళ్ళకు కుడికన్నదరినా, మగవారికి ఎడమకన్నదరినా అశుభ మంటారు. మగవారికి కుడికన్ను, ఆడవారికి ఎడమకన్ను అదరడం శుభం.

ఈ అవయవాలుఅదరడాన్ని వైద్య శాస్త్రజ్ఞులు పైత్యం ఎక్కువవడంవల్ల, నరాల బలహీనతవల్ల జరిగేపనిమాత్రమే అని చెబుతారు.

## గ్రామ దేవతలు :

ఆంధ్రదేశంలోవైష్ణవాలయంగానీ శివాలయంగాని లేనిఊరు అరుదు. ఒకవేళ అవిలేకున్నా గ్రామదేవతలేనిఊరు వుండదు. ఊరిలోని గ్రామ దేవతే వారిఊరును రోగాలనుండీ, క్షామాలనుండీ కాపాడుతుందనీ ఇష్ట కామ్యాలు నెరవేరుస్తుందనీ జానపదులవిశ్వాసం. అందుకే ఆమెకు మొక్కుకుంటూ ఏటేటా పెళ్ళమని ఉత్సవాలు జరిపిస్తుంటారు. ఈ ఉత్సవాలనే జాతర్లంటారు. ఈ అమ్మవార్ల ఆరాధనాపద్ధతే వేరు. త్రిమూర్తులలో శాప వశాన బ్రహ్మకు ఎలాగూపూజలేదు. ఇక శివకేశవుల ఆరాధన సాత్వికారాధన. వీరికి నైవేద్యం పళ్ళూ, ఫలహారాలూ చాలు. కాని యీ గ్రామ దేవతల ఆరాధన క్షుద్రదేవతారాధన. నరుని దగ్గరనుంచి కోడివరకూ బలి కోరతాయి.

ఆదిమమానవుడు ప్రకృతిశక్తులతోపాటు చెట్టునీ, పుట్టనీ, రాయినీ, రప్పనీకూడా ఆరాధించేవాడు. భూగర్భంలోనూ, జలగర్భంలోనూ దొరికిన కొన్నిరాళ్ళు గ్రామదేవతలుగా వెలశాయి. ఈ యోగంకూడా అన్ని రాళ్ళకూ పట్టదు-కొన్నిరాళ్ళకే. అందుకే స్థలభోగం, శిలాభోగం అంటుంటారు పెద్దలు. ఆంధ్రదేశంలో ఎక్కడచూసినా పోతురాజులూ, పోలేరమ్మలూ కోకొల్లలు (ఇవి మంత్రులు పాతిన శంకుస్థాపన రాళ్ళంటారనుకోండి కొందరు రాజకీయ చతురులు).

ఇంతకీ యీగ్రామదేవతలు ఎవరూ అనేది ఆలోచిస్తే ప్రతి చిన్న దేవతవెనుకాకూడా ఒక పెద్దకథ ఉంటుంది. సాధారణంగా ఆ వూరికోసం ఏదైనా త్యాగంచేసిన పేరంటాలో, బ్రతికుండగా ఏవైనా అతీతశక్తులు ప్రదర్శించిన స్త్రీయో, అత్తమామల ఆరళ్ళతోనో భర్తపోరుతోనో బల వంతాన చనిపోయిన పడుచో అయివుంటుంది.

ఇలాంటిదే రాయలసీమలో అనంతపురంజిల్లాలో బుక్కరాయ సము ద్రందగ్గర ముసలమ్మ. బుక్కరాయచెరువు కట్టతెగింది. ఊరు మునిగిపోయే ప్రమాదమొచ్చింది. ఆవూరిలోని ముసలమ్మ అనే వనితను బలియిస్తే తన్ని వారణ జరుగుతుందని ఊరి పోలేరమ్మ పూని పలికిందట. గ్రామశ్రేయస్సు కోసం నవయవ్వనవతి, సుందరాంగియైన ముసలమ్మ ప్రాణప్రదులైన భర్తను, అత్తమామలను విడిచి అందులో దుమికి ఆత్మార్పణ చేసింది. కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణం' కావ్యం యిదే. ఈ ముసలమ్మ అందాన్ని వర్ణిస్తూ పసుపు పూసుకు స్నానమాడేటప్పుడు 'తల మీద చెట్లుకురిసిన లలితసుమ పరాగమునవెలయు లతిక'వలె ఉన్నదంటారు. ఆత్మబలిదానం యివ్వడానికి జలప్రవేశం చేసేటప్పుడు -

"జ్వలదగ్ని శిఖలపై నెలనవ్వుతోబోవు
ధాత్రి మహాదేవి తనయయనగా"

అని వర్ణించి తెలుగుసాహితీ చరిత్రలో ఆమె స్థానాన్ని అజరామరం చేశాడు. ఇలా గ్రామాన్నికాపాడిన తల్లిగా, అక్కడ గ్రామదేవతగా వెలసి పూజలందుకొంటుంది.

చిత్తూరు జిల్లాలో "గంగమ్మ" గ్రామదేవత చరిత్ర మరోరకం. తాళ్ళపాకలో గంగమ్మ అనే బాలిక ఒక యింట ఆడపడుచుగా పుట్టింది. ఆమె ఎదిగేకొద్దీ రాత్రులు గ్రామంలో ఒక శక్తి తిరుగుతూ అందర్నీ భయభ్రాంతుల్ని చేస్తోంది. ప్రజలు రాత్రిలు వీధుల్లో తిరగడమే మానివేశారు. ఒక రోజు తిరుపతినుండి ఒక బాటసారి ఆవూరి మీదనుండి వెళుతూ చీకటి పడడంతో ఆవూళ్ళో ఆగిపోయాడు. అతడు బ్రాహ్మణుడు కావడంవల్ల ఊళ్లోవాళ్లు స్వయంపాకం చేసుకోవడానికి ఉప్పులూ, పప్పులూ, బియ్యం యిచ్చారు. భోజనమయ్యాక అతను వీధిలో రచ్చబండమీద పడుకోబోతుంటే ఆ వూళ్లోరాత్రిలు శక్తి తిరుగుతుందనీ, బయటపడుండడం ప్రమాదమనీ,తమ యింటిలోకి వచ్చి పండుకోమనీ ఆహ్వానించారు. అయితే ఆసంగతేదో తను చూస్తానని ఆ రచ్చబండచుట్టూ మంత్రించి అక్షతలుచల్లి అర్ధరాత్రివరకూ అలాగ మెలకువగా చూస్తూనే వున్నాడు. అనుకున్నట్టు అర్ధరాత్రి పెద్దరాక్షసి అట్టహాసంచేస్తూ వచ్చింది. కాని రచ్చబండను సమీపించలేకపోతోంది. అప్పుడా బ్రాహ్మణుడు తన మంత్రశక్తితో ఆమెను నిజరూపంలోకి మార్చివేసి పొద్దుట అందరికీ చూపించాడు. ఆమె గంగమ్మ. ఆమెను తిరుపతి తీసుకువచ్చాడు. యవ్వనవతియై భర్త కావాలంటే ఊరిలో ఒకాయనకు పెళ్ళి చేశాడు. గర్భాదానంగదిలో ఆమె తన అసలు పిశాచరూపంలో రతికుపక్రమించగా భర్త భయపడిపారిపోయాడు ఆమె అతన్ని వెంటాడి ఎంత వెదికినా దొరక్క ఆ బ్రాహ్మణుని దగ్గరకొచ్చి తనకామం తీరడానికి మరో పెళ్ళిచేయమని అడిగింది. అతను అలాగే చేస్తానని రాయిచేసి వేశాడట. నాటినుండి ఆమె దేవతగా వెలిసింది తిరుపతిలో. తమపిల్లాపాపల్ని ఆమె చల్లగా చూడాలని తిరుపతి పరిసరాలలోని పల్లెప్రజలు ప్రతియేటా ఆమెకు వారంరోజులు జాతరచేస్తారు. ఈ వారంరోజులూ కొందరుయువకులు స్త్రీ వేషాలు ధరించి తిరుపతి వీధుల్లో తిరుగుతుంటారు. ఇవి గంగమ్మ వేషాలు (ఈ జాతర రోజుల్లో ఎవరైనా తిరుపతి వెళితే వీళ్లు కొజ్జాలేమో అనుకుంటాం). కొందరు మగరాక్షసుల్లాగ వొళ్ళంతా మసిపూసుకుని వేషం వేసుకుని వేపరొట్ట చేతపట్టుకొని ఒకో గంగమ్మనూ ఒక్కొక్కరు చొప్పున వెంటనంటి తిరుగుతుంటారు. రోగాలూ, కష్టాలూ వచ్చినపుడు యిలా వేషాలు వేసి జాతరలో పాల్గొంటామని మొక్కుకుంటారట అక్కడివారు. "పచ్చిబూతులు యీమెకు సమారాధన (కామంతో తపించిపోయిందిగామరి!)

తూర్పుగోదావరిజిల్లాలో ఏలేశ్వరందగ్గర గొల్లాలమ్మ చరిత్రకూడా విచిత్రంగాఉంటుంది. పెద్దాపురం తిమ్మజగపతి మహారాజు అక్కడ చెరువు త్రవ్వించారు. అయితే లింగంపర్తి వైపు గట్టు ఎప్పుడూ తెగిపోతుండేదట. బండ్లకొద్దీ మట్టివేసి ఏనుగులచేత త్రొక్కించి గట్టుబిగించినా కొట్టుకుపోయేదట. అప్పుడు రాజుకు కలలో దేవతకనిపించి అక్కడికి నిత్యం పాలుతెచ్చే గొల్లాలమ్మ అనే ముసలిదాన్ని అక్కడ నిలిపి ఆమెపై గట్టువేసేస్తే ఆగట్టు నిలుస్తుందని చెప్పిందట. గ్రామ రక్షణార్థం ఆ అవ్వ అందుకు సిద్ధపడిందట. అలాగే ఆమెను నిలబెట్టి మట్టితోకప్పేసి గట్టువేశారు. గట్టునిలిచిపోయిందట. నాటినుండీ ఆమెను దేవతగాకొలుస్తారు. ఆమెకు మదుం కట్టించారు. అదే గొల్లాలమ్మ మడుం. ఆ మదుందగ్గర "గొల్లాలమ్మా!" అని పిలిస్తే 'ఓ' యని ప్రతిశబ్దం వస్తుందట. ఆమె జాతరరోజున మొక్కుబళ్ళు కోళ్ళూ, మేకలూ, విశేషంగా కోస్తారు. మొక్కుకుంటే కోరిక తీరుస్తుందట. ఈ జాతరకి చుట్టుప్రక్కల గ్రామాలప్రజలు తండోపతండాలుగా వస్తారు. విశేషమేమంటే ఉదయంనుంచీ మంచిజోరుగా వచ్చేజనం ప్రొద్దుగూకేటప్పటికి ఒక్కరుకూడా కనబడరు. రాత్రికి అక్కడ ఉండరాదని అమ్మవారి ఆదేశమట. అది అసలే అడివి ప్రాంతం. పాములు, మండ్రగబ్బలు విశేషం. ఆ అమ్మవారి పేరు తలిస్తే అవి ఏమీ కరవవని అక్కడి వాళ్ళనమ్మకం.

ఇలాంటి వానిలో తూర్పుగోదావరిజిల్లాలో కాండ్రకోట నూకాలమ్మ, పెద్దాపురం మరిడమ్మ, రాజమండ్రి సోమాలమ్మ, కొప్పవరం ముత్యాలమ్మ మారేడుబాక మావుళ్ళమ్మ, తునిదగ్గర తలుపులమ్మ, రాయవరం పోలమ్మ, వానపల్లి పల్లాలమ్మ, కొంకుదురు గంగాలమ్మ, చింతలూరు నూకాలమ్మ, పెద్దాపురం పరదేశమ్మ, నిడదవోలు కోటసత్తెమ్మ, ఏలేటిపాడు ముత్యాలమ్మ, మల్లప్పదిబ్బ పెద్దింటమ్మ, మండపాక ఎల్లారమ్మ, బోడసకుర్రు పైళ్ళమ్మ, అమలాపురం సుబ్బాలమ్మ, రఘుదేవపురం దుర్గమ్మ యిలా ఊరూరికీ ఉన్నాయి. నిత్యనైవేద్యాలందుకుంటున్నాయి. ఈ గ్రామదేవతల పేర్లు స్త్రీలకే కాకుండా పురుషులకుకూడా పెడతారు పోలయ్యని, పల్లయ్యని, ముత్యాలయ్యని, మావుళ్ళయ్యని, మరిడయ్యని యిలాగ. అంటే జానపదులు గ్రామదేవతలని అంత భక్తితో కొలుస్తారు. ఇవి దుర్గాదేవి అపరరూపాలని

ఆ అమ్మవార్ల పాదాలక్రింద మహిషాసురుని చిత్రిస్తారు. గ్రామస్థులకు కష్టాలువచ్చినపుడు యీ దేవతలకు మొక్కుకుంటారు వారకల్లు, గండదీపం కావడికోళ్ళు యిస్తామని. వారకల్లు అంటే తాటికల్లు ముంతలతోతెచ్చి అమ్మ వారికి యివ్వడం. గండదీపం అంటే మండిగలోనూనెపోసి వత్తివేసి వెలిగించి నెత్తి మీదపెట్టుకుని ఊరేగింపుగావెళ్ళి అమ్మవారిగుడిలోకి యివ్వడం.

కావడికోళ్లుఅంటే ఒకకర్రకు ఇరువైపులా రెండుకోళ్లు కట్టుకుని ఆ కర్రను భుజంమీద కావిడిలాపెట్టుకుని ఊరేగింపుగాతెచ్చి అమ్మవారి గుడికివ్వడం (ఇవన్నీ ఆసాదుల పరం)

సాధారణంగా కోడినిగాని, మేకనుగాని, గొఱ్ఱెనుగాని బలిస్తామని మొక్కుతారు. ఆ కష్టాలు తొలిగిపోతే ఆ విశ్వాసంతో ఆ అమ్మవారి జాతర సమయంలో వానిని కోస్తారు. (వీనిని అమ్మవారి పేరుచెప్పి కోసినా తినేది వీళ్ళే అనుకోండి.)

కాండ్రకోట నూకాలమ్మకు పూర్వం ఎనుబోతును బలియిచ్చేవారట. అలాగే కొండదేవతలకు నరబలులుకూడా యిచ్చేవారట. పెద్దాపురం మరిడమ్మ తీర్థం నెల్లాళ్ళుచేస్తారు. ఆ నెల్లాళ్ళలో ప్రతి ఆదివారం మంచి ప్రిబలంగా వుంటుంది. ఈ ఉత్సవానికి బండ్లమీదవేషాలు ప్రసిద్ధి. రాజమండ్రి సోమాలమ్మజాతరకు యిపుడు నాగరికంగా నాటకాలువేయిస్తూ ఉత్సవకార్యక్రమాలు నడుపుతున్నారు. చివరిరోజు అ.్నరకాల జానపదకళారూపాలతో ఊరేగింపు చేస్తారు. తునిదగ్గర తలుపులమ్మ లోవ (లోయ)లోని తలుపులమ్మకు (తలపులమ్మ) యిప్పటికీ జంతుబలులు జరుగుతునే ఉన్నాయి. ముఖ్యంగా క్రొత్తగా కార్లూ, లారీలూ, ట్రాక్టర్లూ కొన్నవాళ్ళు తప్పనిసరిగా అక్కడకి తీసికెళ్ళి ఆమెకు మేకనుగాని, కోడినిగాని బలియిచ్చి ఏ ప్రమాదాలూ రాకుండా కాపాడమని ప్రార్థించుకుంటారు. రాయవరం వంతెనదగ్గర పోలమ్మ ఒక చెట్టుక్రింద వుంది. ప్రతి ఏటా బ్రహ్మాండమైన జాతర చేస్తారు బాణా సంచాతో. పూర్వం భోగంమేళాలతోకూడా జాతర జరిపేవారు. కొప్పవరం ముత్యాలమ్మజాతర ఉగాదిముందు చేస్తారు. ఇది పిల్లల తీర్థం. ఈ తీర్థంనాడు తల్లిదండ్రులు తమపిల్లల్ని తీసికెళ్ళి అమ్మవారికి పళ్ళిప్పిస్తారు. ఆమె పిల్లల ఆరోగ్యాన్ని కాపాడిరక్షించే తల్లి అని ప్రతీతి. ఈమె లీలలు విచి

త్రంగా ఉండేవట. ఒకరోజు మట్టమధ్యాహ్నంవేళ చక్కనిపడుచుగా తయారై వీధిలోపోతున్న గాజులవానిని పిలిచి గాజులేయించుకుని ఒక యింటిలోకి పోయిందట డబ్బులు తెస్తానని. ఆమె ఎప్పటికీ రాకపోయేసరికి అతను ఆ యింటివారిని పిలిచి అడిగాడట. వాళ్ళు ఆమె ముత్యాలమ్మ అని గ్రహించి ఆ డబ్బులిచ్చి పంపించేశారట. ఇలాగే మరిణమ్మ మీదకూడా గాజులకథ వుంది. ఆమె గాజులు వేయించుకు వెళ్ళిపోతే గాజులమల్లయ్య నాడబ్బులో అని కేకలుపెడుతుంటే అతన్ని అక్కడ రాయిని చేసేసిందట. దానిని గాజుల మలారం రాయి అంటారు.

ఇక కొంకుదురు గంగాలమ్మ అక్కడి చెరువులో దొరికితే గట్టునబెట్టి గుడికట్టించారు. పంటలు ఎక్కువ పండాలని, గ్రామంలో మసూచి, కలరా వంటి వ్యాధులురాకుండా కాపాడాలని యీ అమ్మవారికి కోళ్ళూ, మేకలూ కోసి ఏటేటా జాతరచేసి తీర్థంచేస్తారు. ఆపదల్లో ఆమెకు మొక్కుకుంటారు. ఊళ్ళో ఎవరు పెళ్ళిచేసుకున్నా తప్పనిసరిగా ముందు యీఅమ్మవారికి చలి విడి పానకాలు పోస్తారు. ఈ అమ్మవార్ల తీర్థాలకు గారెలు, బూరెలు వగైరా పిండివంటలుచేసి అమ్మవారికి నైవేద్యాలు పెడతారు. పొరుగూరి బంధువులను కూడా పిలుచుకుని పండుగలా జరుపుకుంటారు. ఈ అమ్మవార్ల ప్రతి రూపాలు గరగలు. జాతరలో ఆసాదులు (పూజారులు-మగవాళ్ళు) పరికిణీ వేసుకొని, ఒక పంచి పైట చెరగులా వేసుకొని (అమ్మవారు స్త్రీ గదా. అందుకని స్త్రీ వేషాలు) గరగలు నెత్తిమీదపెట్టుకుని డప్పులమోతకు అనుగుణంగా ఎగురుతూ (ఈ మధ్య దీనినికూడా నాట్యం అనేస్తున్నారనుకోండి) చేతిలో వేపాకుతో ఆశీర్వదిస్తుంటారు. ఇంటింటా వారికాళ్ళమీద బిందెలతో నీళ్లుపోసి బియ్యం, పసుపు, కుంకుమ, ఫలహారం పళ్లెంలో పెట్టియిచ్చి హారతియిస్తారు. తీర్థంనాడు రాత్రి గుడిదగ్గర మొక్కుకున్నవాళ్లు మేకలూ, కోళ్ళూ కోస్తారు. ఈ గంగాలమ్మకు కూడా ఒక గాథవుంది. ఈమె పడాల వారి ఆడబడుచు అనీ, మరణం సంభవించినా మమకారం చావక అక్కడ గ్రామదేవతగావెలిసి ఆవూరిని కాపాడుతుందనీను. అందుకే జాతర సమయంలో యీనాటికీ కూడా ఆమెకు పడాలవారు మొదట చీర, రవికలగుడ్డ పెట్టి గరగెత్తితేగాని జాతర లేవదీయరు.

మరో గ్రామదేవత నేరేళ్లమ్మకథ మంచి ఆసక్తికరంగా వుంటుంది. ఆమె ఆగ్రామంలో ఒక రైతుయింటపుట్టింది. బాలికగా ఉండగా తల్లి ఎంత తిండి పెట్టినా సాయంత్రం శ్రమపడి యింటికొచ్చిన తండ్రికి తల్లి కూడు పెట్టలేదని ఫిర్యాదు చేసేదట. అన్నం కుండెడువార్చి పెట్టినా తినేసి పెట్టలేదని గోలపెట్టేదట. ఒకరోజు తండ్రి పరీక్షిద్దామని మిద్దెక్కి దాక్కొని తల్లి కుండెడు కూడుపెట్టడం చూసేడట. సాయంత్రం ఆపిల్ల మామూలుగానే తల్లి తిండిపెట్టలేదని ఫిర్యాదుచేసిందట. వెంటనే తండ్రి అది ఏదో పిశాచిఅని పట్టరానికోపంతో పలుపుతాడు తీసికొని కొట్టడానికి వస్తుంటే ఆపిల్ల పారి పోవడం మొదలెట్టింది. వెంటబడి తరుముతుంటే కొంతదూరంవెళ్ళి మాయ మయిపోయిందట. తరువాత ఆ గ్రామదేవతగా వెలిసిందట.

ఓపిగ్గా సేకరిస్తే ప్రతిగ్రామదేవత వెనకా ఒకగాధ దొరుకుతుంది. కాలక్రమంలో యీదేవతలకు ఆదరణ తగ్గుతోంది. ఈ గ్రామదేవతకు బదులు ఇప్పుడు ఊరూరా క్రొత్తగా గ్రామదేవతలు వెలిసారు. వారే ఊరి సొమ్మును ఊరికే మింగేసే పెత్తందార్లు. రాజ్యాంగం ప్రకారం వీళ్ళ జాతర అయిదేళ్ళకొకసారి.

## జోస్యాలు

మనిషిజీవితం వ్రాసినడైరీ అంటారు. ఆ డైరీలో ఏమి వుందో తెలుసుకోవాలనేకుతూహలం ప్రతీవ్యక్తికీ వుంటుంది. ఈ కోరికను సొమ్ము చేసుకుంటారు జ్యోతిష్కులు. జానపదులలో ఈ జోస్యాలపట్ల మక్కువ మరీ ఎక్కువ. ఈ జ్యోతిష్కులు అనేక రకాలు. ముఖ్యంగా అనాదినుంచీ మనకు కనిపించేవాళ్ళు కొండదొరలు, చిలకజోస్యులు, శివచెప్పేవాళ్ళు, ఎరుకలసానులు, సోదెకత్తెలు, సాముద్రికులు, చక్రంవేసేవాళ్లు, ఉపాసకులు, బాబాలు, దేవుడమ్మలు, సిద్ధాంతులు వగైరా వగైరా వగైరా. వీరు చెప్పే దానిలోని పిజావిజాల జోలికి పోకుండా గుడ్డిగా నమ్మిపరికిస్తే ఏవో అద్భుతాలుగా కనిపిస్తాయి.

### కొండదొర

"శ్రీరాముడు, కొండదేవర, పోశేలమ్మ, పైడితల్లి, బూరాలమ్మ, సుంకులమ్మ, కొండమారెమ్మ ఆజ్ఞ. అయ్యగారి ఆలోసన గొప్పది - మనసులో అనుకుంటున్న పని మూడునెలల్లో అయిపొద్ది, తానం మంచిది-

ముందుకెళ్ళాల్సిన లైనుంది. కొండదేవర ఆజ్ఞ" అని కొండయాసతో మాటలు పట్టిపట్టి గుమ్మంలో కనిపించినవాళ్ళను ఉద్దేశించి పలుకుతుంటారు కొండ దొరలు. నుదుట కుంకంబొట్టు. ముక్కుమీద పసుపు. చెవికి రాగిరింగులు, తలపై సిగ, సిగపై పక్షిఈకలు, మణికట్టుకు రాగిమురుగు, మెడలో పులి గోరుత్రాడు, పూసలదండలూ, వీపుమీద అమ్ములపొది పొదిలో బాణాలు, కర్రకు తగిలించినపూట వెనక్కి వేలేసుకొని జ్యోతిషం చెబుతామంటూ అప్పుడప్పుడు వస్తుంటారు. వీళ్ళు నామకః చెయ్యి చూపమంటారే తప్ప చెప్పేదంతా ముఖంచూసే.

ఈ చెప్పేవాటిలోనివి చాలావరకు సామాన్యంగా అందరికీ వర్తించే పైపై పడికట్టు మాటలే. "ఆకర్షణ గొప్పది, కపటంలేని జల్మ, కడుపులో ఆలోసన గలబుర్ర, లచ్చిమి ఇదురు లేదు, అమ్మ 'స్టారు' గొప్పది, నీ నసీబు పెద్దది. కాని నరదృష్టి కొట్టేసి అంతా సున్నా అయిపోతుంది. ఈ నరఘోష తొలగిపోయి పెద్దమెట్టులో కెళ్ళడానికి ఒక్క ముక్కచెబుతా" అని కాగితంముక్కమీద కలంతో కొన్నిగీతలుగీసి అందులో పసుపూ కుంకుమావేసి పొట్లంకట్టి మంత్రించి ఇస్తాడు. ఎదుటివాడి లొంగుబాటుచూసి ఏమీఇవ్వక్కరలేదంటూనే తావీదుకట్టి, పాతచొక్కా, పాతపంచె, ఐదు సోలల బియ్యం, అయిదురూపాయిలు ఇలా వారి వశీకరణనుబట్టి వసూలు చేస్తుంటారు. వీళ్ళు చెప్పేదానిలో ఏదోఒకమాట బలంగా హృదయానికి పట్టేసి చెప్పించుకొనేవాళ్లు ఆకర్షితులవుతుంటారు. అందులో ముఖ్యంగా పై మెట్టు కెళతావనగానే పొంగిపోయి లొంగిపోతారు. తావీదు ఇచ్చేటప్పుడు కూడా ఒక తమాషాచేస్తారు. సంచిలోంచి అమ్మవారిఫోటోతీసి తావీదు దాని మీదపెట్టి ఒక అడుగుదూరంలో దోసిలిపట్టి 'రా' అనమంటారు. అలా "రా" అనగానే అది ఎగిరివచ్చి దోసిట్లో పడుతుంది. దానివెనుక మంత్రమేఉందో, తంత్రమే ఉందో అర్ధంకాదు. వీళ్లు అక్కినేని నాగేశ్వరరావు, ఎన్.టి. రామారావు, కృష్ణ, శోభన్‌బాబు, జమున, జయసుధ, జయప్రదవంటి మేటి సినీనటులతోనూ, నెహ్రూ, మొరార్జీ, ఇందిరాగాంధీ, సంజీవరెడ్డి, గిరి, జైల్‌సింగ్‌వంటి పెద్ద పెద్ద రాజకీయ నాయకులతోనూ తీయించుకున్న ఫొటోలుచూపుతారు. దానితో మనకు వాళ్ళమీద మరింతగట్టినమ్మకం కుదురు తుంది. వీళ్ళపేర్లు కత్తుల కృష్ణారెడ్డి, కృష్ణమరాజు, రామరాజు యిలాగ

చివర రాజు, రెడ్డి పేర్లతోనే ఉంటాయి ఎక్కువగా. వచ్చి వెళ్ళేలోగా అల్లూరి సీతారామరాజు పేరు అరడజనుసార్లయినా ఉచ్చరిస్తారు. వీరు చింత పల్లి, సీలేరు, భద్రాచలం మొదలైన కొండ ప్రాంతాలనుంచి వస్తుంటారు.

## చిలక జోస్యం

ముఖాన రూపాయిబిళ్ళంత కుంకంబొట్టు, ముంజేతులకు మురుగులు, నెత్తిమీద గొడుగు, కాలికి కడియం, చెవులకు పోగులు, చంకన చిలక పంజరం పెట్టుకొని వీధులవెంట జోస్యం చెబుతామంటూ తిరుగుతుంటారు కొంతమంది. ఆసక్తికలవారుపిలిచి చెప్పమంటే పంజరంక్రింద పెట్టి, బిచాణా పరచి, దానిమీద పదిపన్నెండు కవర్లు వరుసగాపేర్చి పావలాపుచ్చుకొని ప్రశ్న అడిగేవారిపేరు ఉచ్చరిస్తూ పంజరం తలుపుతీసి చిలుకను బయటకు పిలుస్తాడు. ఆ చిలుక వయ్యారంగా బయటకువచ్చి ఓరగా యజమానినిచూస్తూ కవర్లలో ఒక్కొక్కటే ముక్కుతోతీసి ప్రక్కనపెడుతూ ఒక్కడో ఒక కవరువద్దగర ఆగి దాన్ని కరచిపెట్టి తెచ్చి అతనికి ఇస్తుంది. ఆ కవరులోని కార్డులపై వెంకటేశ్వరస్వామి, సత్యన్నారాయణమూర్తి, ఆంజనేయస్వామి, పార్వతీపరమేశ్వరులు, సీతారామలక్ష్మణులు, దుర్గ వగైరా దేవత బొమ్మ లలో ఏదో ఒకటి ఉంటుంది. మరోకాగితంమీద "మీరు అనుకుంటున్న పని ఆరునెలల్లో నెరవేరుతుంది, వచ్చే అమావాస్య వెళ్ళినదగ్గరనుంచీ మీ జాతకం మారిపోతుంది. ఆకస్మిక ధనలాభం, ఎవరితోనూ శతృత్వం మంచిదికాదు" వంటి ఎవరికైనా వర్తించేటటువంటి మూడు నాలుగు వాక్యాలు అచ్చుకాబడి వుంటాయి. అతడు అవిచదివి పృచ్ఛకుని కోరికకు అన్వయించి చెప్పి అందు లోని బొమ్మలు అతనిపై ఎలా అనుగ్రహం చూపుతున్నాయో నప్పించి చెబుతాడు. ఈ చెప్పడంలోని నేర్పే మనల్ని సంభ్రమాశ్చర్యాలలో ముంచె త్తుతుంది. ఆపైన ఆ జ్యోతిష్యుని వ్యాఖ్యానపూర్వకమైన వాక్కు సమ్మో హితులను చేస్తుంది. ఈ చిలకజోస్యాలకు రాజమండ్రి జంతర్ మంతర్ రోడ్డు మంచి ప్రసిద్ధి. (మునిసిపల్ ఆఫీసు ముందు రోడ్డు)

## శివం

పల్లెటూళ్ళలోనూ, పట్టణాలలోనూ అక్కడక్కడ వీరభద్రుడు గద్దెలనిఉంటాయి. చచ్చిపోయిన తమబిడ్డ వీరభద్రుడయ్యాడని యీగద్దెలపై

నిలుపుతుంటారు కొందరు తల్లిదండ్రులు. ఇక్కడ వీరభద్రుడుగా ఒకపెద్ద విభూతిపండు, అతనిభార్య భద్రకాళిగా ఒక లక్కబొమ్మ పెడతారు. ఇలా ఒక్కో గద్దెమీద 40, 50 దాకా వీరభద్రులుంటారు. వీనికి నిత్యపూజాది కాలు ఆ గద్దె నిలిపిన గణాచారి చేస్తుంటుంది.

ఇళ్ళల్లో ఎవరికైనా నలతగాఉన్నా, దీర్ఘరోగాలు వదలకున్నా, కష్టాల్లో ఇరుక్కుపోయినా, చేతబడి అనుమానాలున్నా, అర్ధరూపాయి దిగ దుడిచి ఆ మనిషి బంధువులెవరన్నా, (మేనత్త వరసవాళ్లు) ఈ గణాచారి వద్దకువెళ్ళి ఇచ్చి ఎదురుగాకూర్చొని సాంబ్రాణి పొగవెయ్యగానే గణాచారి పెద్దగా నాలుగైదుసార్లు ఆవులించి, మూడు నాలుగుసార్లు త్రేన్చి, తలవిర బోసుకుని శివం చెప్పడం ప్రారంభిస్తుంది గోవిందా గోవిందా అంటూ. శివంటే పూనకం. ఆ వచ్చినవాళ్ళ తాలూకు వీరభద్రుడుగాని, వాళ్ళతాలూకు చచ్చిపోయిన పెద్దలుగానీ, వెంకటరమణమూర్తిగానీ, సత్యనారాయణస్వామి గానీ, ఆ గణాచారిని ఆవేశించి వీళ్ళప్రశ్నలకు జవాబులుచెబుతారు. ఈ శివంకి వెళ్ళినవారి ముందు పరిచయంలోనే వారువచ్చిన విషయంగ్రహించేసి శివంలో వాళ్లడక్కుండానే సమాధానాలు చెప్పేస్తుంది. అలారానప్పుడు వెళ్ళిన వాళ్ళే ఆ ఆవేశించిన శక్తిని సూటిగానే ప్రశ్నించి సమాధానాలు రాబట్టు కుంటారు. ఈ శివంలో చచ్చిపోయినవాళ్ళూ, దేవుళ్ళూవచ్చి మాట్లాడడం, వాళ్ళతో వెళ్ళినవాళ్ళు మాట్లాడడం చూస్తే బలే గమ్మత్తుగా ఉంటుంది. ఇందులో మాటమీద నమ్మకం కలుగజేసేది గణాచారి వాగ్ధాటిమాత్రమే. ఏడుకొండలవాడో, మరోదేవుడో వంకర చేసారనేది వీళ్ళు సాధారణంగా చెప్పేది. వంకర అంటే వీళ్ళు ఏదో అపచారం చేయడంవల్ల ఆ దేవుళ్లు ఆగ్రహించి కీడు కలిగించడం, చివరన గణాచారి ఆ కీడు తొలగిపోవడానికి, రోగం నయంకావడానికి విభూధి మంత్రించి యిస్తుంది వాళ్లకి బొట్టుపెట్టమని. పల్లెల్లో యీ శివంమీద ప్రజలకు చాలా విశ్వాసం. ఈ గద్దెలకు తూర్పు గోదావరిలో కుతుకులూరు, కొంకుదురు, ప్రత్తిపాడు, రాయవరం ప్రసిద్ధి.

## ఎఱుక

ఆదిదేవుడు పరమేశ్వరుడు ఎరుకలసాని వేషంవేసుకొని పార్వతికి ఎఱుకచెప్పినట్లు, వెంకటేశ్వరస్వామి ఎఱుకత వేషంతో వెళ్లి పద్మావతికి

జోస్యంచెప్పినట్లు పురాణగాథలున్నాయి. అంటే ఎఱుక అంతపురాతనమైన దన్నమాట.

పల్లెటూళ్లల్లో 'ఎఱుకలు' అని ఒక జాతి ఉంది. ప్రభుత్వం వీరిని షెడ్యూల్డ్ తెగల జాబితాలో చేర్చింది. వీరు పందులను మేపుతుంటారు. అంతే గాక మగవాళ్లు ఉండేలు బద్దలతోనూ, నాటుతుపాకీలతోనూ పిట్టలనుకొట్టి అమ్ముతుంటారు. ఆడవాళ్లు పురుళ్లుపోస్తారు మంత్రసానుల్లాగ. కొందరు ఎఱుక చెబుతారు.

తలపై కొప్పు, ముక్కున ముక్కెర, నెత్తిన ఎఱుకలబుట్ట, బుట్టలో వసుపురాసిన చిన్న చేట ఇవీ ఆమె సామాగ్రి. ఇంటిలో ఎవరికైనా అనారోగ్యంగాఉన్నా, పిల్లలకు బాలగ్రహాలు పట్టుకున్నా ఈమెను పిలిపించి ఆడవాళ్లందరూ చుట్టూచేరి మూడుదోసిళ్ల బియ్యం ఆమెచేటలో పోసి సోదె చెప్పమంటారు. ఆమె పెద్దాపురం మరిడమ్మ, కాంద్రకోట నూకాలమ్మ, బెజవాడ కనకదుర్గమ్మ వగైరా దేవతలపేర్లు తలచి సోదెచెప్పడం ప్రారంభిస్తుంది. ఎందుకు పిలిపించారో, అనారోగ్యం ఎవరికో వారి మాటలవల్ల ఆమె ముందేతెలుసుకుంటుంది. దానికి చిలవలు పలవలుచేర్చి చిత్రమైన బాణీలో పూనకంవచ్చినట్టు ప్రతివాక్యం గడగడా చెప్పుకుపోతుంటే అందరూ నిశ్చేష్టులైవింటూ ప్రశ్నలువేస్తూ, చెప్పేతీరునుబట్టి ఆ సమాధానాలునమ్మి ఆమె ఆదేశించినట్లు చేస్తారు. రోగనివారణకు సాధారణంగా కోడితోగాని, పందితోగాని దిగదుడుపు పెట్టాలంటుంది. దిగదుడుపంటే మూడుతవ్వల బియ్యం అన్నం వండి బుట్టలోపెట్టి, ములగకూర, తెలగపిండి కలిపి వండిన కూర దానిలోకలిపి, కొంచెం అన్నంపిసికి చిన్న ప్రమిదలాచేసి దానిలో నూనెపోసి దీపవత్తువేసి వెలిగించి, నల్లకోడిపెట్ట పీకకోసి ఆ రక్తంతో రోగినుదుట బొట్టుపెట్టి, ఆకోడినీ ఆ అన్నం బుట్టనీ రోగితలచుట్టూ మూడు సార్లుత్రిప్పి ఆ బుట్ట ఊరవతల పారేయిస్తుంది. కోడిని ఎఱుకత తీసుకుపోతుంది. రోగతీవ్రతనుబట్టి ఆ తుడపం డప్పులతోకూడా పోయిస్తుంది. అంటే ఆబుట్ట తీసుకువెళ్ళేటప్పుడు డప్పులువాయిస్తూ తీసుకువెడతారన్న మాట. పందితో దిగదుడుపంటే పందియొక్క పీకకాకుండా దాని కాలివేలి చివరరక్తం వచ్చేలాకోసి, ఆ రక్తం అన్నంలో కలుపుతుంది. ఆపంది ఆమెదే. దాన్నలా వినియోగించినందుకు కొంతడబ్బు వసూలుచేస్తుంది.

రోగం చిన్నదయితే రంగుదారాలతో వేరుముక్క కట్టి రెండు రూపాయలు పుచ్చుకుంటుంది. ఈ వేరుముక్కలకీ, దిగదుడుపులకీ ఆ జబ్బులు తగ్గిపోతాయని చాలామంది నమ్మకం.

## సోది

"సోదోయమ్మ సోది, సోదడగరండమ్మా సోది" అని మిట్ట మధ్యాహ్నము వేళ చిన్న ఏక్తార తంబురనొకదాన్ని చేత్తో మీటుతూ ఆ శృతిలో గొంతుకలిపి పాటలా మాటలు పలుకుతూ సోదికత్తెలు వీధుల్లో తిరుగుతుంటారు. సోది చెప్పించుకునేఆమె చేటలో మూడు సోలల బియ్యంపోసి ఎదురుగాకూర్చొని చెయ్యిచాపుతుంది. సోదికత్తె ఆమెచేయి స్పృశిస్తూ, ఆమెకు సంతానం, పిల్లలు, పెళ్ళిళ్ళు, ప్రయాణాలు, భార్యాభర్తల సంబంధం, ఆర్థికపరిస్థితులు వగైరా ఎన్నోవిషయాలు ఎడతెగని వాగ్ధోరణితో చెప్పుకుపోతుంటుంది. మగవాళ్ళని పుంజనీ, ఆడవాళ్ళని పెట్టనీ, పుంజంటే గడ్డం, పెట్టంటే బొట్టు అని పలికే సంజ్ఞా పరిభాష వీళ్ళదే. ఆమె ఆ చెప్పడంలోనే చెప్పించుకునేవాళ్లనుండి తనకు కావలసినసమాచారం రాబట్టుకు చెబుతుందనేది ప్రతీతి. ఏమైనా వీళ్ళుకూడా ఆడవాళ్లని బాగా ఆకట్టుకొని బియ్యం శేర్లకొద్దీ దండుకు పోతుంటారు. ఇందులో ఎక్కువగా పనిచేసేది పరేంగిత జ్ఞానం.

## జాతక చక్రాలు

ఈపద్ధతి కాళిదాసు కాలంనుంచీ కనిపిస్తోంది. గుప్తరాజుల స్వర్ణకాలంలో వరాహమిహురుడు దీనిపై ఒకసిద్ధాంతమే ప్రతిపాదించాడు. పుట్టినతేదీ, నక్షత్రం ఆధారంగా రాశి చక్రంవేసి లగ్నంకట్టి, గ్రహస్థానాలు నిర్ణయించి, ఆ గ్రహాల ఆ గ్రహానుగ్రహాలననుసరించి ఏతేదీకి ఏది కలిసొస్తుందో, ఏసమయానికి ఏచెడు జరుగుతుందో, శుభాశుభాలు, ఉద్యోగాలూ, పెళ్ళిళ్ళూ ఒకటేమిటి సమస్తమూ చెబుతారు. అవి జరగటం జరగకపోవటం అటుంచితే యిది ఒక సిద్ధాంతం ప్రాతిపదికగా చెప్పబడే శాస్త్రం అని తెలుస్తోంది.

ఇది సంస్కృతంనుండీ తెలుగులోకి వచ్చింది. పుట్టిన సమయపు నక్షత్రాన్నిబట్టి చక్రంవేసి దశాశేషంకట్టి గ్రహచలనాన్ని రవి 6 సం. చంద్ర 10 సం. అంగారక 7 సం. బుధ 17 సం. గురు 16 సం. శుక్ర 20సం. శని 19 సం. రాహువు 18 సం. కేతువు 7 సంవత్సరాలుగా మొత్తం పురుషాయుఃప్రమాణం 120 సంవత్సరాలు లెక్కించి ఈ దశల్లో మరల అంతర్దశలు విభజించి వానిప్రభావాల ఫలితాలు చెబుతారు. ఇది శాస్త్రీయమని అన్నా చెప్పినవన్నీ జరుగుతున్నాయా అనేది సందేహాస్పదమే. వివాహాలకు లగ్నాలూ, శుభకార్యాలకు ముహూర్తాలూ దీన్ని ఆధారంచేసుకొనే పెడు తుంటారు. చెప్పింది జరగకపోతే అది పార్వతీదేవి శాపమంటారు.

## సాముద్రికం

జీవితరేఖ, హృదయరేఖ, శిరోరేఖ, అదృష్టరేఖ, విద్యారేఖ, కుజ రేఖ, వివాహరేఖ, గురు, శని, రవి, బుధ, చంద్ర, శుక్ర, కుజస్థానములు, బొటనవ్రేలు, అరచేతిరంగు వగైరా ఆధారంగా హస్తసాముద్రికం చెబుతారు.

ఎలక్ట్రానిక్, ఆటమిక్, శక్తులతో పురోగమిస్తున్న అమెరికావంటి పాశ్చాత్యదేశాలలో కూడా దీనికి గొప్ప గిరాకీవుంది. ఇంగ్లీషులో షీరో, బెన్హామ్ అనే పండితులు పామిస్ట్రీ గ్రంథాలు వ్రాశారు. తెలుగులో వీని కనువాదాలేగాక సూర్యసాముద్రికం వంటి స్వతంత్ర గ్రంథాలు కూడా ఉన్నాయి. కాకపోతే ఇంగ్లీషు పద్ధతికి, తెలుగు పద్ధతికీ ముఖ్యమైన తేడా - వాళ్ళు హృదయరేఖ అనేదాన్ని మనవాళ్ళు జీవితరేఖ అంటారు. ఇంగ్లీషు వాళ్ళ శాస్త్రం అరచేతికి పరిమితం. మనవాళ్ళశాస్త్రం వ్రేళ్ళకు కూడా విస్తరించారు. (వ్రేళ్ళ కణుపులను రాసులుగా నిర్దేశించడం, వ్రేళ్ళపైభాగాలలో శంఖుచక్రాలు గుర్తించడం), ఇరువురికీ రేఖలూ, గ్రహస్థానాలూ ఆధారాలు. మగవారికి కుడిచెయ్యి, ఆడవారికి ఎడమచెయ్యి చూస్తారు. చదువు, వివాహం, సంతానం, విదేశయానం గండాలు, లాటరీలు, ఎగుడు దిగుళ్ళు వగైరా విషయాలు భవిష్యత్తులో ఏఏ సంవత్సరాలలో ఏమేంజరుగుతాయో చెబుతుంటే చెప్పించుకొనేవాళ్ళు మంత్రముగ్ధులై వింటుంటారు, వాళ్ళు

చెప్పిన ప్రకారం రాబోయే అదృష్టాన్ని తలచుకుంటూ మురిసిపోతూ రూపాయి చెల్లించేసి రాజాలా పోతుంటారు. రాజమండ్రి జంతర్‌మంతర్ రోడ్డులో ఇంగ్లీషు తెలుగుల్లో ప్రవాహంలాంటి సాంకేతిక పదోచ్ఛారణతో సైకిలు ప్రక్క నిలబడి చెప్పే యీ సాముద్రికుల చుట్టూ ఎప్పుడూ జనమే.

## ఉపాసకులు

వీరిలో దేవీ ఉపాసకులు, హనుమదుపాసకులు, క్షుద్రదేవతారాధకులు అనేక రకాలు. దేవీ ఉపాసకులు కాళికాదేవినిగాని, లలితాదేవినిగాని, దుర్గనుగాని ఉపాసిస్తారు. హనుమదుపాసకులు వీరాంజనేయంపూజ చేస్తారు. క్షుద్రదేవతారాధకులు భేతాళుడు, ఎర్ర మారికమ్మ, కర్ణపిశాచి వంటి క్షుద్ర దేవతలను మద్యం, మాంసం, రక్తం నివేదనచేసి ఆరాధిస్తారు. కొందరు అర్ధరాత్రి స్మశానాలలో కపాలాలమధ్యా పూడ్చిపెట్టిన శవాలమీదా కూర్చుని జపాలుచేస్తారు. ఈ క్షుద్రదేవతలు అలాకోడినో, కుక్కనోకోసి ఆరాధించినంతకాలం వాళ్ళప్రభ ఫెళ్ళున ఫేలించేస్తాయట. నివేదన ఏరోజున చెయ్యకపోతే ఆరోజున వాళ్ళనే తినేస్తాయట అన్నాడు మాతాత ఒకసారి. ఇది విన్న మాఅన్న "అయితే రాజకీయనాయకులు కూడా క్షుద్రదేవతలే" అన్నాడు. కారణం వాళ్ళుకూడా వాళ్ళభజనచేస్తూ తిరిగినంతకాలం పైకెత్తేస్తారట. ఎప్పుడు మానేస్తే అప్పుడు తొక్కేస్తారట.

ఇంతకీ వీరంతా ఉపాసనా బలంతో జోస్యం చెబుతారు. ఇందులో వాక్శుద్ధి ముఖ్యం. వీరు మనిషినిచూసి అతని గతం, భవిష్యత్తు కళ్లకు కట్టినట్లు చెబుతుంటారు చెప్పేవాటిలో ఒకటి రెండు గట్టిగా తగిలింది హత్తుకుంటాయి. దానితో చెప్పించుకునేవాడు దాసోహమనేస్తాడు. వీరిది ప్రధానంగా 'ఇన్‌ట్యూషన్' అంటారు. ఇళ్ళల్లో చిన్నా పెద్దా దొంగతనాలు జరిగినప్పుడు దొంగలెవరో తెలుసుకోవడానికి పోలీసుస్టేషనుకంటే ముందు వీళ్ళదగ్గరకే పరుగులెడుతుంటారు. చాలామంది. కొంతమంది ఎదుటివారి

జేబులో డబ్బులెన్నోకూడా లెక్కచెప్పేస్తారు. (దీనికి బిక్కవోలు ఆకుల సత్యనారాయణ మంచి ప్రసిద్ధిపొందేడు) ఈ మధ్య పట్టణాలలో లాడ్జింగుల్లో కూడా వీళ్ళు మకాంపెట్టి జోస్యాలు చెబుతున్నారు. వీళ్ల చెప్పే రాజకీయ జోస్యాలు పత్రికల్లోకూడా ప్రముఖంగానే వస్తున్నాయి. పెద్దపెద్ద దేశనాయకులే వీళ్ళ వెంటబడుతున్నారు.

ఒకసారి ఒక కాళీ ఉపాసకుడు ఒకరిని మీ ఇంట్లో ఈశాన్యభాగంలో మూడువిలువుల లోతులో లంకెలబిందులున్నాయి జపహోమాలకు వెయ్యి రూపాయలు తెస్తే తీసిస్తానన్నాడట. ఇతను వెంటనే ఆవెయ్యా మీరే పెట్టేసుకుని ఆబిందెలు మీరే తీసుకు పట్టుకుపోండన్నాడట. అంతే ఆయన యిక ఆ ప్రసక్తితెస్తే ఒట్టు.

సాధారణంగా కష్టాల్లో ఉన్నవాళ్లూ, జీవితంలో నిరాశా, నిస్పృహలకు లోనైన వాళ్లే యీ జోస్యాలకు వెళుతుంటారు. ఈ జోస్యులు వాళ్లకి భవిష్యత్తులో బంగారు జీవితాన్నిచూపి వాళ్లలో నూతనోత్తేజాన్నీ, ఉత్సాహాన్నీ కలుగజేస్తున్నారు. ఇంతవరకూ వీళ్లు చేస్తున్నది మేలేగాని యీ పేరుమీద కొందరు అమాయకుల్ని దోపిడీచేస్తుండడం మాత్రం దారుణం.

ఇక బాబాలు, దేవుడమ్మలు, సిద్ధాంతులు కూడా ఉపాసకులేకాని కొంచెం కాలజ్ఞానులుకూడా. భక్తిప్రబోధం వీళ్ల పరమార్థం. పోతులూరి వీరబ్రహ్మంగారిదగ్గరనుంచీ మనకు ఈ బాపతు కనిపిస్తున్నారు. వీళ్లల్లో నేడు ముఖ్యంగా సత్యసాయిబాబా, బోసుమద్ది రామలింగ సిద్ధాంతివంటివారలు తమ భక్తులనుండి విరాళాలరాబట్టి ధర్మకార్యాలకు వినియోగిస్తూ ప్రజాసేవకు పూనుకోవడం శుభపరిణామం.



# సాగరతీర జానపదులు

గోదావరి సీమలో సముద్రతీరాన్ని ఆనుకొనియున్న ఉప్పాడ, చొల్లంగి, కోరంగి మొదలగు తీరంవెంబడిఉన్న అన్ని పల్లెలలోనూ కనిపించే గంగపుత్రులే యీ సాగరతీర జానపదులు. వీరి ఆచారవ్యవహారాలు, సాంఘికజీవనం ఇతర జానపదులకంటే కొంచెం భిన్నంగా కనిపిస్తాయి.

అనాదికాలంలో భారతంలో శంతనమహారాజు మత్స్యగంధిని చూసి మోహించి వివాహంచేసుకున్న సంగతి మొదటగా మత్స్యకారుల ఉనికిని మనకు ప్రత్యక్షంచేస్తుంది. అంటే అంత ప్రాచీనత, ప్రాచుర్యం కలిగిన జాతి ఇది. వీరిలో జాలారులని, అగ్నికుల క్షత్రియులని, బెస్తలని, బల్లీలని, పల్లెవారని అనేక తెగలున్నాయి. అయితే ఈ తెగలన్నిటికీ వృత్తి ఒకటే - ఏటిలో చేపలవేట. వీరి ఆచారవ్యవహారాలు కూడా ఇంచుమించు ఒకటే. పురుషులు సముద్రంలో చేపలుపట్టి తెస్తే స్త్రీలు వాటిని తట్టలతో పట్టుకెళ్ళి మార్కెట్‌లో అమ్ముతారు. వీరి చేపలవేట ఏటి మీదైతే మోచేత్తో వలలువిసురుతారు. సముద్రంలోనైతే ఒడ్డువలలు (పెద్దవలలు) వేస్తారు. వీరు చేపల్నిపట్టితేవడం 'పాటు' అంటారు. ఈ పాటు సముద్రం ఆటు పోటుల్నిబట్టి ఉంటుంది. 'ఆటు' అంటే సముద్రం తీతలో ఉందన్నమాట. 'పోటు' అంటే సముద్రం గట్టుకు పొడుస్తుందన్నమాట. ఆటులోనే చేపలు పుష్కలంగా దొరికేది. అందువల్ల ఆటులోనే వలలు వేసుకుని నావలలో సముద్రంలోకెళతారు. అయిదారుగురు జట్టుగా వలవిసిరేముందు "తాతల నాడు తల్లి, కాలంనాడు కర్ర, పెద్దలనాడు పెట్టె, పన్నెండు యోజనాల పాతాళపుట్ట, ఏడుయోజనాల ఇలగోలపుట్ట, పాములాడిచేతి పారిజాతమ్మ, ఉత్తమాజలగంధీ ముద్దుకోడలా, కదలిరావమ్మా - మేము వేసిన వల మా జాతికి-జాలారికులంలో వన్నెకెక్కిన వాడకులంలో అందరికంటే ఎక్కువైన చేపలు నా వలలో పడాలి" అని మొక్కుకుని వల విసురుతారు.

వీరి జీవితాలు సముద్రంలో నిత్యప్రమాద సంభరితాలు. తుఫాను తాకిళ్ళకి, సముద్రపు పోటళ్ళకీ ఒక్కోసారి అతీగతీకూడాలేకుండా పోతుంటారు. అందుకే సముద్రం మీదకెళ్ళేటప్పుడు వారి భార్యలు, పిల్లలు సముద్రపు ఒడ్డుకు వచ్చి వారికి బరువెక్కిన గుండెలతో వీడ్కోలు చెప్పి, వెళుతున్న నావ కనిపిస్తున్నంతవరకూ ఆ గట్టున అలా నిలబడి చూస్తూనే ఉంటారు కన్నీరు కళ్లలో గ్రుక్కుకుంటూ, అవును - తిరిగి రాకకు గ్యారంటీలేని పయనం అది. అందుకే మనసుల్ని దిటవు చేసుకోవడంకోసం క్షేత్ర దేవతల్ని మూఢంగానూ, గాఢంగానూ కొలుస్తూ తమ భర్తలకి క్షేమంచేయమని వేడుకుంటారు. ఇంటింటా, పైడితల్లో, యల్లమ్మో, పత్తెమ్మో, నూకాలమ్మో, కొర్లదేవరో ఎవరో ఒకదేవతను నిలిపి పూజిస్తారు. ఇవి వారి ఇలవేలుపులు. ఇక పేటంతటికీ మరొక దేవతను ప్రతిష్టిస్తారు ఆమె కులవేలుపు ప్రతి సంవత్సరం సముద్రపు ఒడ్డుకివెళ్ళి సామూహికంగా గంగపూజ చేస్తారు. ఆ తల్లేగదా వారికి రక్ష (వారిని భక్షించినా, రక్షించినా).

వారిపాటులో ఇన్నోవంతు అని అమ్మవారికి వాటా పెడతారు. సంవత్సరమంతా అలాతీసి ఆ డబ్బుతో ఉగాదికి అమ్మవారి జాతరచేస్తారు. వారు ఇలవేల్పును నిలిపేవిధం బహు చోద్యంగా ఉంటుంది. ముందురోజు ఒక పుట్టదగ్గరకువెళ్ళి పుట్ట శుభ్రంచేసి ఉపాసనచెప్పి వస్తారు. మరునటి రోజు 5 డప్పులు, 12 మంది పోతురాజులు (ఆటగాళ్లు), 5 గురు వంబులతో ఊరేగింపుగా వెళ్ళి (వీళ్ళంతా వాళ్ళ కులంవాళ్ళే) ఆ పుట్టమట్టితీసి జంగిడిలో వేసి ఆ ఇంటామెనెత్తిమీద పెట్టి ఊరేగింపుగా తీసుకొచ్చి ఇంటిలో ప్రతిష్టిస్తారు. ఈ అమ్మవార్ల పూనకాలు బలే చిత్రంగా ఉంటాయి. వీరిలో ఒకదాసుడుంటాడు. అతను ఆ ఇంటివారిలో ఒకరిమీదకు అమ్మవారిని ఆవేశింపచేస్తాడు. ఆ ఆవేశం పొందిన ఆమె వారు చేయవలసిన కర్తవ్యాన్ని తెలుపుతుంది. ఆమెచెప్పేది వారు వాస్తవంగా నమ్ముతారు. ఇలా ఎక్కువగా నమ్మకాలమీద సాగిపోతుంది వీరి జీవనయానం. ఏదైనా జబ్బు చేస్తే

వీరు డాక్టరు దగ్గరకు బదులుగా దాసుతుదగ్గరకి పరుగెడతారు అమ్మవారి అభిప్రాయం తెలుసుకోవడానికి. వీరు అమాయకత్వం నిండుగా తొణకిస లాడే మాయమర్మమెరుగని సంతృప్తజీవులు. పాటున్న రోజున పొట్టనిండా తిని. లేనిరోజున కడుపులోకాళ్లు పెట్టుకుని పడుకోవడమే తప్ప దొంగతనాలు, దేవురించడాలు చూడం.

వీళ్లలో కొందరు దశావతారాలు, అమ్మవార్ల కథలు చెబుతారు గరిడీలు వాయిస్తూ, కోలలు తిప్పుతూ, వీరి గరిడీలనేవి పెద్ద ఇత్తడితాళం చిప్పలు. ఈ కథలు పాటరూపంలో ఉంటాయి. ఈ చెప్పేవాళ్లు దశా పదకొండవతారాలూ విష్ణుమూర్తి ఎందుకెత్తేడంటే అని ప్రారంభిస్తుంటే పంచపాండవులు మంచంకోళ్ళలా నలుగురు అనే జోక్ గుర్తుకొస్తుంది. యల్లమ్మ కథ చాలాచక్కగా చెబుతారు. పూర్వం ఏడుగురు అంతకా సురులు, ఏడుగురు తారకాసురులు ఒకరిపై ఒకరు యుద్ధం చేసుకుంటు న్నారట. అంతకాసురులు బహుక్రూరులు వారిభార్యలు మహాపతివ్రతలు. వీరి పాతివ్రత్యమహిమవల్ల అంతకాసురులు ఓటమి లేకుండా పోరాడు తున్నారు. తారకాసురులు అన్యాయంగా మరణిస్తున్నారు. అందుకని విష్ణు మూర్తి మారురూపంలో వచ్చి అంతకాసురులు యుద్ధంలో మరణించారనే. ఆ దగ్గరున్న మర్రిచెట్టునుచూపి వారి భార్యలు దానిని కౌగిలించుకుంటే వారు తిరిగి బ్రతుకుతారని చెప్పేసరికి వారు ఏడుగురూ ఆ చెట్టును కౌగి లించుకున్నారట. ఆచెట్టులో విష్ణుమూర్తి ప్రవేశించి వారిని రమించేడట. వారు ఏడు గడియల్లో గర్భందాల్చి ఏడుగురు శిశువుల్ని ప్రసవించారట. అయితే ఆ పిల్లల్నిచూసి భర్తలు సందేహిస్తారని వారు ఆ పిల్లల్ని అక్కడే వదలి వెళ్ళిపోయేరట ఆ బాలలు కేర్ కేర్ మని ఏడుస్తుంటే పార్వతీ పరమేశ్వరులు భూమి పరిపాలించడానికివచ్చి వాళ్ళని చూసేరట. పార్వతి వారిని లాలించి పెంచిందట. వారే నూకాలమ్మ, పరదేశమ్మ, పైడమ్మ వగైరా దేవతలు. వారిలో ఆఖరిపిల్ల యల్లమ్మ అని చెప్పి ఆమె

మహిమలు, తన్ను నమ్మి మొక్కుకున్నవాళ్ళను ఎలా అనుగ్రహించేది చెబుతుంటే ఆ కథ విని ప్రతివారూ అక్కడికక్కడే మొక్కులు మొక్కేసుకుంటుంటారు.

ఇక పెళ్లిళ్ల దగ్గరకొస్తే వీరు మంగళసూత్రాలకు బదులు పసుపు తాడు కడతారు. ఆ పేటవారికి పెళ్ళికిముందు భోజనాలు పెడతారు. దీనిని వారు 'ధూళిఆమెత' అంటారు. ఊరేగింపుకు వాడేది పల్లకీకాదు అశ్వం. పెళ్లికొడుకునీ, పెళ్లికూతుర్నీ గుర్రంమీద ఎక్కించి సాయంత్రం 4 గంటల నుండి వీధుల్లో ఊరేగిస్తారు.

వీరికి కులపెద్ద ఉంటాడు - అతని ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ. కులపెద్ద అనేది ఎన్నిక ద్వారాకాదు. వంశపారంపర్యంగా వస్తుంది. వ్యభిచారంలో స్త్రీ, పురుషులలో ఎవరు పట్టుబడ్డా కులపెద్ద తప్పువేస్తాడు. ఆ డబ్బుతో సారా తాగేసి ఖుషీ చేసుకుంటారు.

తమ వలలు తామే అల్లుకుంటూ, వచ్చినకొద్ది ఆదాయం కల్లు, సారాలకు పోసేసి నిర్భాగ్యులుగా సాగరతీరాల పూరిగుడిశల్లో జీవనం సాగించే ఈ సాహసవీరుల జీవనగతిలో కొత్తజ్యోతులు వెలిగించాల్సిన అవసరం ఎంతైనాఉంది. అప్పుడే దేశం నిజంగా పురోగమించినట్టు.



# గిరిజన జానపదులు

గిరిజన జానపదుల తీరుతెన్నులు వేరు. గోదావరిసీమ గిరిజనులలో వాల్మీకులు, కొండరెడ్లు, లంబాడీలు, కోయలు ఎక్కువ. వాల్మీకులు హరిజన కుటుంబాల వారు. ఈ అడవి పల్లెలకు 'ముఠాలని' పేరు. ఈ ముఠాలకు అధిపతులను ముఠాదారులంటారు. వీటికి ముఠాగుమస్తాలు కూడా ఉండేవారు. వీరు మన మునసబు కరణాల వంటివారు. ముఠాదారునిమాట ముఠావాసులకు సుగ్రీవాజ్ఞ. ఎవరైనా అధికారులు వెళితే ఆ ముఠాదారునే కలవాలి. అతనికి కావలసిన సదుపాయాలు చేసి, మరోముఠాకి వెళ్ళవలసిఉంటే భద్రతకోసం మనుషులనుఇచ్చి అవతలిముఠాదారుదగ్గరకు పంపేవారు. అడవిలో కాలిదార్లు తప్పిస్తే బండిబాటలుకూడా కనబడవు. దట్టమైనఅడవి, భయంకర జంతువుల అరుపులు - వీనిమధ్య ఒంటరి ప్రయాణం బితుకు బితుకు మంటుంటుంది. అందువల్ల ముఠాదార్లు మనుషులనుతోడిచ్చి పంపుతుండేవారు. ఈ మనుషులు మనసామానులుకూడా భుజానవేసుకొని మోసుకువస్తారు ఉచితంగానే. ఇక్కడ వారినిజాయితికి దేశం గర్వపడాలి. ఆ అడవి మధ్యలో నాలుగుతన్ని మనలనుదోచుకుంటే అక్కడ దిక్కూ మొక్కూ ఉండదు. కాని వారికి ఆతలంపే ఉండదు. విల్లు, బాణాలు ధరించి దారిలో ఏజంతువునుంచైనా ప్రమాదంకనిపిస్తే వాటిని చీల్చిచెండాడి మార్గం సుకరం చేస్తారు.

## వాల్మీకులు - కొండరెడ్లు

తూర్పుగోదావరిలో రంపచోడవరం దగ్గరనుండి కుట్రవాడ. పాములేరు వరకు రెడ్ల ఆధిపత్యం (కొండరెడ్లు.) పాములేరుఆవల చెట్లవాడనుండి వాల్మీకుల ఆధిపత్యం. పాములేటికిఈవల ముఠాదార్లు రెడ్లు. వాల్మీకులు నౌకర్లు. ఇక్కడ వాల్మీకులు రెడ్డిగారు, రెడ్డిగారు అనిరెడ్లను కొలుస్తారు. పాములేరు ఆవల వాల్మీకులుది అగ్రకులం. ఇక్కడ వాల్మీకులు ముఠాదార్లు. రెడ్లు వారినౌకర్లు. ఇక్కడ వాల్మీకులు "ఒరే రెడ్డీ" అని పిలుస్తారు.

ఏటికి ఇవతల, అవతల ఫర్లాంగుదూరం తేడాలో ఈ భేదం బలే ఆశ్చర్యంగా ఉంటుంది. వీళ్ళ ఆహారం పిట్టమాంసం, జీలుగుకల్లు. పిల్లా, పాపలతో అందరూ ఉదయం జీలుగుచెట్ల దగ్గరకుపోయి ఆ చెట్ల కల్లుతీసి త్రాగి, కొట్టుకొని తెచ్చిన పిట్టమాంసం కాల్చుకుతిని ఆమత్తులో సాయంత్రం వరకూ అక్కడే నిద్రపోతారు. సాయంత్రం ఇళ్ళకు వస్తారు. ఇల్లు అనేది కఱ్ఱ ముక్కలతోను, ఆకులతోనూ వేసుకున్న అల్పమైన చిన్న గుడిశ. సాయంత్రం కాగానే చలి విపరీతం. 'లగిడి' వేసుకొని దానిచుట్టూ పడు కుంటారు. 'లగిడి' అంటే ఒక లావుపాటి దుంగకు నిప్పు ముట్టించి అది కాలుతుంటే ఆ మంటచుట్టూ పడుకుంటారు. వీళ్ళు ఆవులను, గుఱ్ఱాలను, మేకలను పెంచుతారు. వీరి ఆతిధ్యం మేకపాలు, కారుకోడి మాంసం. కారు కోళ్లు, నెమళ్ళు ఆ ఇళ్ళచుట్టూ చెట్లమీద తిరుగుతునే ఉంటాయి. ఆశ్చర్యం ! పులులు, సివంగులు క్రూరజంతువులుకూడా ఆ ప్రాంతాలలో తిరుగుతూనే ఉంటాయి. కాని వారిఇళ్ళల్లోకిరావు. దానికివాళ్ళు ఏదో మంత్రం వేస్తా రంటారు. వీరు దారాలమ్మ, పోలేరమ్మ వంటి వనదేవతల జాతరలు దివిటీల వెలుగులో ఎంతో కోలాహలంగా చేస్తారు. కౌజు, అడవిదున్నల వంటి పెద్దజంతువులను బలిఇచ్చి, తిని, తాగి వేడుక చేసుకుంటారు. వీళ్ళ మంత్రశక్తి అపూర్వం. ఎవరికైనా మండ్రగప్ప కుడితే వీరిలో మంత్రగాడు ఆ కుట్టిన ప్రదేశంలో నొక్కి మంత్రం చదువుతాడు. వెంటనే తగ్గిపోతుంది. ఆ మంత్రగాడి చేతిలో ఆకుపసరు ఉంటుందని ఆ పసరువల్లే అది తగ్గు తుందని కొందరంటారు పాము కరచినాకూడా అలాగే తగ్గించుకుంటారు. అక్కడ వారికి ఆధునిక వైద్యసౌకర్యాలు ఏవి ? వారిరోగాలకు అక్కడి పసర్లతోనే వైద్యం చేసుకొని రోగనిర్మూలన చేసుకుంటారు. ఈ పసరుల వైద్యం వీరిలో చాలామందికి తెలుసు.

వీరు చాలా అమాయకులు. అరసోలెడు ఉప్పుకోసం అరవైమైళ్ళ దూరం నడిచివచ్చి (పుల్లంగినుంచి మారేడుమిల్లి సంతకు) అడవిలో తాము సేకరించిన మడపాకులు, సీకాయ, కుంకుడులు, చీపుళ్ళు తెచ్చిఇచ్చి ఉప్పు,

పాతబట్టలు, కరకజ్జం, జీళ్ళుపాకం కొనుక్కొని తింటూపోతారు. వీరిది డబ్బులతో బేరం కాదు - వస్తువులతో బేరం (బార్టరు సిస్టమ్). ఇందులో పాపం వీరు పూర్తిగా దోచుకోబడతారు.

వీరు వస్త్రధారణ నామమాత్రం. స్త్రీలు ఒకచిన్నగుడ్డను మానం కాపాడుకోవడానికి మొలకు చుట్టుకొని, స్తనాలు కనబడకుండా మరోగుడ్డ పీలిక పైటలాగ వేసుకుంటారు. అడ్డబాస ప్రతీ స్త్రీకి ఉంటుంది. మగవాళ్లు చిన్నగుడ్డ గోచీలాగ పెట్టుకుంటారు. కొందరు సంతలో కొనితెచ్చుకొన్న పాతచొక్కాలు తొడుక్కుంటారు. తలలు కొబ్బరినూనె సంస్కారము ఎరగవు. వారి మంచితనం, అమాయకత, సంతృప్తి చూస్తే వీళ్ళే నిజమైన మానవులనిపిస్తుంది.

## లంబాడీలు

ఈ గిరిజనజానపదులలో లంబాడీతెగ ఒకటి. పశ్చిమగోదావరి జిల్లాలో జంగారెడ్డిగూడెం, బుట్టాయిగూడెంలలో వీరి తండాలున్నాయి. వీరి జనపదాలను 'తండా' లంటారు. తాడేపల్లిగూడెం సంతలో ప్రతి ఆదివారం కనిపిస్తుంటారు. వీరి ఆభరణాలు, ఆచార వ్యవహారాలు బహుచోద్యంగా ఉంటాయి.

అద్దాలుపొదిగిన రంగురంగుల పరికిణీలు, వీపులేని దళసరి జాకెట్లు, చేతినిండా దంతపు గాజులు, తలనుండి ముందుకు వేళ్ళాడే ఇత్తడిజూకాలు, వెనక్కి వేలాడే ముతకదుప్పటి ముసుగు ధరించే యీ స్త్రీలను చూస్తుంటే నాగరికత వీళ్ళకి ఎన్ని ఆమడలదూరంలోఉందో అనిపిస్తుంది. బహుళ ప్రాచుర్యం పొందిన "లంబాడోళ్ళ రామదాసు" పాటవింటుంటే ఆజాతి అమాయకత, ఆర్ద్రత, నిస్సహాయత హృదయాన్ని ద్రవింపజేస్తుంది.

ఇంతకీ మీరెవరమ్మా అని తొంబది ఏండ్ల ముదుసలిఅయిన లంబాడీ స్త్రీ బాణావతు దుర్గమ్మను ప్రశ్నించగా ఆమెచెప్పిన సమాధానం చాలా ఆసక్తికరంగావుంది. ఆదిలో మార్వాడీలూ, తామూ ఒకే తండ్రిబిడ్డలమనీ,

ఆ తండ్రి మొదటిభార్యసంతతి లంబాడీలనీ, రెండవభార్యబిడ్డలు మార్వాడీలని చెప్పింది. అయితే మార్వాడీలకామహర్దశ ఏమిటి మీకు యీదుర్దశ ఏమిటి అని ప్రశ్నిస్తే చెప్పినకథ యిది - ఆ తండ్రి ఆస్తిపంపకాలప్పుడు బంగార మంతా పెంటకుప్పల్లోనూ, పేడ కుప్పల్లోనూ దాచి వానిని ఒకవాటాగాను, గొడ్డూగోదా వగైరా పశుసంతతి ఒకవాటాగానూ పెట్టి కావలసిన వాటాతీసు కోమంటే మర్మమెరుగని వీళ్లు పెంటకుప్పలు, పేడకుప్పలు తమకువద్దని పశువుల్ని తీసుకున్నారట. నాటినుంచీ వీరు అడవిప్రాంతాలలో పశువుల్నీ మేకల్నీ మేపుకుంటూ అడవి భూముల్లో జొన్న, సజ్జ వగైరాలు పండిస్తూ వానినితీసుకొచ్చి పరిసరగ్రామల్లోఅమ్ముకుంటూ చాలీచాలనిఆదాయంతో పిల్లా జెల్లా పోషించుకుంటూ జీవనయాత్ర సాగిస్తున్నారు. వీరు కొండప్రాంతా లలో అక్కడక్కడ గుంపులు గుంపులుగా ఉంటుంటారు. ఈ గుంపులనే తండాలంటారు.

వీరి ఆచారాలు చాలా విచిత్రంగా ఉంటాయి. వీళ్ళలో భర్త చచ్చి పోతే మరిదిని పెళ్ళిచేసుకుంటారట. ఈ సంప్రదాయమెక్కడిదని అడిగితే తమది వాలి సుగ్రీవ వంశమని చెప్పింది. (అవును, వాలి చనిపోతే తార మరిది సుగ్రీవుణ్ణి పెళ్లి చేసుకుందిగా !) ఆంజనేయుడు వీరికి మేనల్లుడట వీళ్ళ ఆరాధ్యదైవాల్లో ఆంజనేయుడిది పెద్ద పీట. వీళ్ళల్లో కులాలు లేవు- గోత్రాలు మాత్రం కోకొల్లలు-బాణావత్తు, భూక్యా, ధరావత్తు, భరోతు, వాంకుడోతు, పాత్రియా, జర్పలా, అంగోతు, కొత్తకేడతు యిలాగ ఎన్నో గోత్రాలున్నాయట. కాని సగోత్రికుణ్ణి పెళ్ళిచేసుకోకూడదనేది వీళ్ళ కఠోర నియమం. ఇలాగ స్వకులస్తుల్ని పెళ్ళిచేసుకోగూడదని మనవాళ్ళుకూడా ఒకశాసనంపెట్టిస్తే దేశానికి కులాల బెడదేలేకుండాపోను.

వీళ్ళ పెళ్ళిళ్ళలో మరో విచిత్రం పెళ్ళిరోజంతావీళ్లు ఏడుస్తారు. కారణం, తమ అమ్మాయి ఆరోజు తమనువీడి అత్తవారింటికి వెళ్ళిపోతుం దనట. దానికి అంతగా ఏడవాలా అంటే వీరిలో అత్తవారింటికి వెళ్ళిన

అమ్మాయి తిరిగి పుట్టింటికి రాకడం అరుదట.!అప్పుడప్పుడు బజార్లలో మనం చూస్తూంటాం లంబాడీస్త్రీలు ఒకరినొకరు కావలించుకు ఏడుస్తుండడం అలా ఏడుస్తూకనిపింపారంటే అక్కడ అనుకోకుండ ఎంతోకాలం తరువాత ఆ తల్లీ కూతుళ్లుగాని, ఆత్మబంధువులుగాని కలిసేరన్నమాట. ఇది సంచార జాతి గదా ! వీళ్ళ పెళ్ళితంతులో ముఖ్యమైనది పెళ్ళికూతుర్ని ఎద్దుపై నిలబెట్టి "బోరాయేతోతో, హనహనకరతో" "దియా.........రే, రే.........మా......... రీ.........అన్ వో...............కే............జీ, ఇందా............ నే............డి"

అని విషాదంగా పాటపాడుతూ అందరూ ఏడుస్తూంటారు. - అప్పుడు ఆ ఎద్దుకూడా ఏడుస్తుందట. అంత కరుణరసాత్మకంగా పాడతారన్నమాట. అది మన అప్పగింతలపాటలాటిది. ఈ భాషబాగా పరిశీలిస్తే అక్కడక్కడ హిందీకీ, కొన్నిచోట్ల మూలద్రావిడ భాషకూ కొంత చేరువుగా కనిపిస్తోంది. అన్నను 'బియా' అంటారు. (హిందీలో-భయ్యా) తండ్రిని 'బా' అంటారు (ద్రావిడ భాషా జన్యమైన తెలుగులో జాన పదులు తండ్రిని బాబా అని పిలవడం కద్దు).

పెళ్ళినాడు మరదలువరసపిల్ల పెళ్లికొడుకుచెవులు చిల్ల పెంకులతో గట్టిగానొక్కుతుంది. అప్పుడు ఎంతబాధకలిగినా అతడు అబ్బా ! అనడానికి వీల్లేదు. అంతేకాకుండా పెళ్ళికికట్టుకునేకొత్తపంచి నీటిలో తడిపి మరదలు పిల్ల పెళ్ళికొడుకుమెడమీదవేసి దానిపై రోకలిబండతో కుడివైపు మూడు దెబ్బలు, ఎడమవైపు 4 దెబ్బలూ కొడుతుంది. ఎంత గట్టిగా కొట్టినా అబ్బా! అనకూడదు. ఈ బావా మరదళ్ళ మోటు సరసం పెళ్లికొడుకుసహనానికి పరీక్షలాంటిది. మరో విచిత్రం పెళ్లి పందిరికి మనం మామిడాకులతోరణాలు కడతాంకదా ! వీరు పందిరికి జిల్లేడుమడమలు కడతారట - దీని ప్రాశస్త్య మేమిటోమరి !

ఇక వీరివి వరకట్నాలుకావు - కన్యాశుల్కాలు. పెండ్లికొడుకు ఆడపిల్లతండ్రికి 3 గిత్తలు యివ్వాలి (ఎద్దులు) - వోలిగా 50 రూపాయలు

యివ్వాలి. ఆడపెళ్ళివారు తమపిల్లకు తమస్థాయినిబట్టి ఇత్తడిజూకాలు, వెండికుచ్చులు, ముక్కుపోగు వగైరా లంబాడీ ఆభరణాలు పెడతారు. పెళ్ళి పెళ్ళికూతురింటి దగ్గరే చెయ్యాలి. గర్భాధానం మాత్రం పెళ్ళికొడుకు ఇంట చేస్తారు. పెళ్ళిలో మొదటితంతు పెళ్లికూతురుదండకు ఆడబడుచులు దంతపు గాజులు తొడగడమట. ఇది మన మంగళసూత్రధారణ లాంటిది. కాళ్ళకు వాంకిణి (కడియాలు) తొడుగుతారు. తలవెంట్రుకలకు జూకాలు తగిలిస్తారు. ఇవి ఉంటే ఆ స్త్రీకి పెళ్ళయి భర్త ఉన్నట్టులెక్క. భర్త చనిపోయినప్పుడు యివి తీసేస్తారు.

వీళ్ళలో స్త్రీవ్యభిచారం నేరం. ఇతర జాతులవారితో వ్యభిచరిస్తే ఆమెను వెలేస్తారు. స్వజాతి వారితో అయితే తండాపెద్ద తప్పువేస్తారు. వీరిలో బహుభార్యాత్వం తప్పుకాదు. బహుభర్తృత్వమే తప్పు. ఈజాతిలో ఒకరికొకరు సాధారణంగా పిల్లల్ని పెంపకంయివ్వరు. అందువల్ల పిల్లలు లేనివాళ్లు యానాది వగైరా యితరకులాల పిల్లల్ని పెంచుకుంటారు. కాని 3 తరాలవరకూ వారిని తమజాతిలో కలుపుకోరట. మరి అప్పటివరకూ వాళ్ల పెళ్లిళ్లు ఎవరితోజరుపుతారు అంటే అలాగే పెంచబడిన పిల్లల్ని వెతికి చేస్తారట. ఆమూడోతరంపిల్లల్ని కంచుకంచంలో నెయ్యి, పరమాన్నంకలిపి, తండానాయకులుతిని, ఆ ఎంగిలివి ఆ పిల్లలచేత తినిపించి జాతిలో కలుపు కుంటారట. వివాహ భోజనాలలో వీరికి వేటమాంసం (మేక మాంసం) ముఖ్యం. దానిలోనికి మంచినీరు మద్యం.

రంగస్థలం మీద ఈనాటి జానపదనృత్యాలలో లంబాడీ డాన్సుకు మంచి ప్రసిద్ధివుంది. (కాకపోతే కొందరు లంబాడీడాన్స్ అని కోయడాన్సు వేస్తున్నారనుకోండి అవగాహన లేక) తండాలో మగవాళ్ళు డప్పులు వాయిస్తుంటే ఆడవాళ్లు కాళ్లకు గజ్జలుకట్టుకొని జట్లు జట్లుగా లయానుగుణంగా రమ్యంగా నృత్యం చేస్తారు. ఇది చూడడానికి చాలా ముచ్చటగా వుంటుంది. ఈ నృత్యానికి కూడా ఒక పద్ధతి వుంది. ఇది వాళ్ళ సంప్రదాయ

పద్ధతి. పెద్దవాళ్ళు చిన్నవాళ్లకి నేర్పుతారు. ప్రత్యేకంగా 'హోలీ' పండుగ నాడు "చారెబెజారతే హోలీ ఆయా" అని పాడుతూ ఆనందోత్సాహాలతో వీరు చేసే యీ నృత్యం చూసితీరవలసిందే. మందు హుషారులో మగ వాళ్ళూ, స్వేచ్ఛగా పురివిప్పిన నెమళ్ళలా ఆడవాళ్ళూ తారస్థాయిలో యీ ప్రదర్శన చేస్తున్నప్పుడు చూసే వాళ్ళ మేను పులకరించిపోతుంది. అలాగే దీపావళిరోజున వీరి దివిటీల ప్రదర్శనకూడా మనోహరదృశ్యం.

పగటివేషగాళ్ళు వీరి వేషాలువేసి జనాన్ని బలే ఆకట్టుకుంటారు. అంటే వీళ్ళ వేషంలో, భాషలో అంత విలక్షణత ఉందన్న మాట.

వీరి ఇలవేల్పు "తులజాయాడి" - పిల్లలకు పుట్టువెంట్రుకలు తీసే టప్పుడు యీమెకు జోడు మేకపోతులు బలియిచ్చి సారాతో జాతర చేసుకు తింటారు. ఇతర గిరిజనులలాగే మారెమ్మ, గంగమ్మ, దుర్గమ్మ, దారాలమ్మ వగైరా కొండదేవతలను జంతుబలులతో ఆరాధిస్తారు. అలాగని సాత్వికారాధన లేదనుకోరాదు- బాలాజీ (వెంకటేశ్వరస్వామి) మీద వీరికి మక్కువ ఎక్కువ. అలాగే ఎన్నో వ్యయప్రయాసలకోర్చి కోటప్పకొండ తిరునాళ్ళకువెళ్ళి భక్తిశ్రద్ధలతో స్వామికి మొక్కులు చెల్లించుకుంటారు.

వీరు పశ్చిమగోదావరిలో గొల్లమందల, చింతలపూడి వగైరా ప్రదే శాలలో ఎక్కువగా కనిపిస్తుంటారు. వీరినే సుగాలీలంటారు. స్వాతంత్రం వచ్చాక వీరిలోకూడా చైతన్యం వస్తోంది. కొద్దికొద్దిగా నాగరికత ప్రపం చంలోప్రవేశించి నాగరికుల పద్ధతులలోనికి మారుతున్నారు. ఇప్పుడిప్పుడే కొంతమంది విద్యాధికులై ప్రభుత్వంలో ఉద్యోగాలు, పదవులూ చేబడుతూ ముందుకొస్తున్నారు. ఇది దేశానికి శుభ పరిణామం.

## కోయలు

గిరిజన జానపదులలో కోయలుకూడా ముఖ్యులు. వీరిలో అనేక తెగలున్నాయి 'డోలీలు' ఒకతెగ. వీరు నృత్యాలకు డోలువాయిస్తారు.

కొమ్ములవారు మరొకతెగ. వారు కొమ్ము ఊదుతారు - ఇలా చేసే పనిని బట్టి వీరిశాఖలేర్పడ్డాయి. ఆదిలో కులాలు కూడా యిలా ఏర్పడ్డవేగా !

## భూమిపండుగ

వీరికి 'భూమిపండుగ' ప్రధానమైనది. ఈ పండుగ కాలంలో కోయ మహిళలు పాటలుపాడుతూ ప్రయాణీకుల్ని ఆపుచేసిమరీ కానుకలు తీసుకుంటారు. సరిగాచెప్పాలంటే మీదబడి జేబులోచెయ్యిబెట్టి తీసేసుకుంటారు. వాళ్ళు అలామీదపడడం వీళ్ళకి సరదా - వీరుపాడే ప్రతిపాటలోనూ 'రేలా, రేలా' అనే పదంవుంటుంది. ఈ రేలా పదానికి అర్ధమేమిటని ఒకకోయ పడుచునడిగితే ఫక్కునన వ్వి పారిపోయింది. వయసుమీరిన కోయసీతమ్మ నడిగితే ముసిముసిగా నవ్వి ఓకథ చెప్పింది. భారతకాలంలో భీముడు గిరిజన కన్య హిడింబితో అడవుల్లో ప్రేమాయణం సాగించినప్పుడు వాళ్ళిద్దరూ వెదురు పొదలమాటున, రెల్లుదుబ్బులు చాటున చేస్తున్న రతిక్రియచూసి కైపెక్కిన పాటిగిరిజన కన్యలుతాపంతో 'రేలా, రేలా' అని పాడేరట. ఆనాటినుంచీ వారు యువకులతో శృంగార పరిహాస మాడదలుచుకున్నప్పుడు ఇలా 'రేలా, రేలా' అంటూ పాటలు పాడతారట-ఇంతకీ 'రేలా రేలా' అంటే వాళ్ళ భాషలో రతికార్యక్రమం తాలూకు కవ్వింపు బూతుమాట. ఇది యీ జాతికి ఆనందం - అయినా పెద్ద విషయం ఏజాతికానందంకాదు !

## పెళ్ళిళ్ళు

వీళ్ళ పెళ్ళిళ్ళవ్యవహారం చాలా చిత్రంగాఉంటుంది ఆడా, మగా, పెద్దా, చిన్నా అంతా సంతలకీ తీర్థాలకీ వెళుతుంటారు. ఆదారిలో యువతీ యువకులు ప్రేమించుకోవడాలు, యువతిని యువకుడు ఎత్తుకుపోవడం ఆ తరువాత ఆవైపుపెద్దలూ, యీ వైపు పెద్దలూ చేరి సఖ్యపరచి పెళ్ళి చెయ్యడం-ఇదీ పద్ధతి వీళ్ళు ఓలిగా గాడిదల్ని, పందుల్ని యిస్తారు-ఇదేగా వారిసంపదమరి ! వీరిలో వ్యభిచారం తప్పుకాదు - అందుకే వీరిలో హత్య లుండవు. విడిపోవాలనుకుంటే గూడెం నాయకుడి దగ్గర తగువెట్టుకుంటేచాలు. అతను తప్పేసి విడాకులిప్పిస్తాడు. మరల వాళ్ళు తమకిష్టమైనవాళ్ళను పెళ్ళి చేసుకోవచ్చు. తప్పంటే జరిమానా ఆ జరిమానాసొమ్ముతో ఆరోజు గూడెం పెద్దలు మందేసుకుని మజా చేసుకుంటారు.

ఇది సంచారజాతి. అందుకని వాళ్ళసామాన్లుమొయ్యడానికి గాడిదల్నీ, తినడానికి పందుల్నీ పెంచుతారు. తాగడానికి మంచినీళ్ళు సొరకాయగుల్లలో పట్టుకొని కూడాతీసుకుపోతుంటారు. (అవి మోసుకెళ్ళడానికి తేలిగ్గాఉంటాయి గనుక.) వీరిది దివామైథునం - వీరి దృష్టిలో రాత్రి మైధునం శవసంభోగం. వీరి దేవత కొండమ్మ. నాలుగుపుల్లలు నిలబెట్టి, పైన నాలుగుపుల్లలుపెట్టి క్రింద కొండదేవతనునిలిపి జాతర చేస్తారు. ఆ జాతరలో ఆడామగా నృత్యంచేస్తూపాడేపాటలలో 'రేలా, రేలా' అనేమాట ప్రముఖంగా చోటు చేసుకుంటుంది.

## నృత్యాలు

వీరుచేసేనృత్యాలకు సహకారులు డప్పు, డోలు, ఫ్లూటు వాయిద్యాలు. తలపై కొందరు కొమ్ములుకట్టుకుంటారు - అది జంతువు వేషమన్నమాట. జంతువు ఎలా వేటాడుతుందో వీరినాట్యంలో కళ్ళకు కట్టినట్టు కనబడుతుంది. అలాగే వీళ్లు జంతువుల్ని వేటాడే విధంకూడా కనిపిస్తుంది. మగవాళ్లు డోళ్ళువాయిస్తుంటే ఆడవాళ్ళు చెయ్యీచెయ్యీ పట్టుకుని వలయంగా తిరుగుతూ లయానుగుణంగా నాట్యం చేస్తుంటారు-వీరి సహజదుస్తులతోచేసే యీనాట్యం ఎంతోఆకర్షణీయంగా ఉంటుంది.

ఈ మధ్యవీరి 'ధింసా' నృత్యం దేశప్రఖ్యాతి పొందింది. ఇందు ఆడా మగా ఒకరినకుమువొకరు పట్టుకుని వలయంగానిలుచుని లయతో అడుగులువేస్తూ ముందుకి వెనక్కీ నడుస్తూ జట్టులు జట్టులుగా విడుతూ రక రకాలవిన్యాసాలతో నృత్యాభినయంచేస్తుంటే మొన్న ఢిల్లీయే దిమ్మెరి పోయిందట రిపబ్లిక్ దినోత్సవాలలో. ఇంతకీ వీరిది ఒక కళగా గుర్తించి గౌరవించడం ఆనందింపదగినవిషయం. మారుతున్న ప్రపంచంతో వీరుకూడా

మారుతూ నేడు విద్యార్ధులై ఉన్నతోద్యోగాలలోకి వస్తున్నారు ఉన్నత పదవుల నధిష్టిస్తున్నారు. ఇది దేశ ప్రగతికి చిహ్నం.

కోయలు పశ్చిమగోదావరిజిల్లాలో పోలవరం, బుట్టాయగూడెం, కొయ్యలగూడెం, జీలుగుమిల్లి, జంగారెడ్డిగూడెం మండలాలలో విశేషంగా ఉన్నారు.





# జానపదుల విజ్ఞాన దాయకమగు

# ఏల్లిధి



# జానపదుల విజ్ఞాన దాయకమగు పెన్నిధి

ఈ పెన్నిధి అనేది వీరి జానపద వాఙ్మయము, కళలు, క్రీడలు, వేడుకలలో ఉన్నది. మేధస్సంపన్నమైన నేర్పు, ప్రజ్ఞ, పుష్కలంగా కలిగి ప్రదర్శనీయమైనవి కళలు. వాస్తవానికి వాఙ్మయము కూడ ఒక కళే గాని ఇది ప్రత్యేకించి రచనాసౌలభ్యంకూడా కలిగియుండుట వల్లా, ఇతర కళలవలె ప్రదర్శనాత్మకము కాకుండుటవల్లా విడిగా చర్చించడం జరిగింది.

క్రీడలుకూడా కళలలోని భాగమే అయినా సూక్ష్మంగా పరిశీలిస్తే దీనిలో కళాస్పర్శ ఉన్నప్పటికీ బుద్ధిగతంకన్నా అధిక శాతం భౌతిక శక్తికే ప్రాముఖ్యత యివ్వబడినందువల్ల క్రీడల్ని ప్రత్యేకంగా విడదీసి చెప్పడం జరిగింది. ఇక వేడుకలను నేర్పుతో సంబంధంలేదు. కళాత్మకాలుకావచ్చు గాని వీనిలో కళకంటే కౌటుంబిక సామాజికవిషయాలు తాలూకు ముచ్చట్లు, మురిపాల పర్వమే హెచ్చుగాన వీనినికూడా విడిగాపరామర్శించడం జరిగింది.

## జానపద వాఙ్మయం

*"సాహిత్యము, సారస్వతము, వాఙ్మయము అనుపదములు మూడును కొంచెము ఇంచుమించుగా సమానార్థకములుగానే వాడబడు చున్నవి. కాని సూక్ష్మముగాపరిశీలించినచో వాని అర్థవిస్తృతిలో కొంత భేదము కన్పించును. ఈ మూడుపదములలో వాఙ్మయము అనునది మిగి లిన వానికంటే కొంత విస్తృతతరమైనది. వాగ్రూపమైన సర్వమును ఈ జాతికిచెందునని చెప్పవచ్చును. సారస్వతము అను పదమంత విశాలమైనది కాదు. లిఖితమైన లేక ముద్రితమైన గ్రంథజాలమంతయు ఈజాతికి చెందును. దీనినిబట్టి శాస్త్ర గ్రంథములను సైతము సారస్వతము అని పిలువ వచ్చును సాహిత్యమను పదము వైశాల్యమున పై రెండింటికంటెను

* ఆంధ్ర వాఙ్మయ చరిత్ర (ప్రవేశకము) ఆచార్య దివాకర్ల వెంకటావధాని

సంకుచితమైనది. రస ప్రధానములును, ఆనందప్రదములునగు కావ్యములను మాత్రమే ఈ నామముతో పిలువవచ్చును".

జానపదులది అనుస్మృతంగాను, అనుశ్రుతంగాను ఒకరినుండి ఒకరికి అందిన సంపద. గ్రంథములుగాగాని, లిఖితములుగాగాని ఇది లేదు. అంతా వాక్మయమేగనుక దీనిని వాఙ్మయమనవచ్చును. ఇందు ఆనందరససిద్ధులు కూడా కలవుగనుక దీనిని సాహిత్యమని కూడా పిలువదగును. ఇది పేరు ప్రతిష్ఠలు ఆశించని అజ్ఞాత కవుల సాహిత్య సంపద. ఇదే జానపద సాహిత్య విలక్షణత.

## కళలు

ఇవి మానసికప్రజ్ఞకు సంబంధించినవి. ఇందులో కొన్ని వినోదాత్మకాలు, కొన్ని విజ్ఞానాత్మకాలు, కొన్ని విజ్ఞాన వినోదాత్మకాలు. గోదావరిజిల్లాలలో జానపదకళాకారులు ఎందరోఉన్నారు. వారు వారి ప్రదర్శనల ద్వారా నిత్యం జనాన్ని మెప్పిస్తూ ఉదరపోషణ జరుపుకుంటూ తమకళలద్వారా ప్రజలకి విజ్ఞానవినోదాల నందిస్తున్నారు. ఇతర ప్రాంతాల జానపద కళాకారులకూడావచ్చి ఈ జిల్లాలలో నెలల తరబడిపర్యటించి తమ ప్రదర్శనలతో జానపదుల్ని మెప్పించి విజ్ఞాన సిరులందించి, సౌభాగ్యసిరులు స్వీకరించి వెళుతుంటారు.

ఈ కళాసంపద ఎన్నోరూపాలలో సాక్షాత్కరిస్తుంది. వీనిలో ముఖ్యంగా తోలుబొమ్మలాట, యక్షగానం, వీధి నాటకం, హరికథ, బుర్రకథ, జముకులకథ. తంబుర కథ, పంబకథ వంటివి ప్రజలమీద ప్రత్యక్ష ప్రభావం కలిగినటువంటివి. విద్యాగంధం పండితులకే పరిమితమైపోయిన రోజుల్లో జానపదులను విజ్ఞానవంతుల్ని చేసిన ప్రక్రియలు ఈ కళారూపాలే. ఇవి విజ్ఞానాన్ని విరజిమ్మడమేగాక ఆనందవీచికల విహరింపచేస్తూ ప్రజల్లో శౌర్యసాహసాల్ని నూరిపోస్తూ అవసరసందర్భాల్లో కార్యోన్ముఖుల్ని చేయగలిగిన అత్యంతశక్తివంతమైన సాధనాలు అందుకే ఇప్పటికీ ఇవి చిరంజీవులుగానిలుచున్నాయి. బొమ్మలాట, గంగిరెద్దాట వంటివి వినోదాత్మకాలు. పురాణం విజ్ఞానాత్మకకళకు ఉదాహరణ.

## క్రీడలు

జానపదుల క్రీడలు (ఆటలు) స్వాభావికమైనవి. ఖర్చులేనివి. ఆరోగ్య ఆనందాలకు ఆటపట్టులు. ఇవి మానసికంగానేకాక దైహికంగా కూడా ఆరోగ్యప్రదాయినులు. మనిషికి తెలియకుండానే దేహ పరిశ్రమ చేయిస్తాయి. బాలలనుండి వృద్ధులవరకూ చిరునవ్వులు చిందింపచేస్తూ ఈ ఆటలలో పాల్గొనేటట్టుచేసేఆకర్షణకలిగిన అయస్కాంతశక్తి వీనిలోఉంది. అందుకే ఇవి నేటికీ సాగివస్తున్నాయి.

## వేడుకలు

ఈ వేడుకలు పండుగులలోనూ, పెళ్ళిళ్ళలోనూ, పర్వదినాల్లోనూ విశేషంగా చూస్తాం. ప్రతిహృదయం పులకరించవలసిందే. ఏ ముఖంచూసినా ఆనందోత్సాహాల సుందర మందిరమే. మాటల్లో, చేష్టల్లో, చూపుల్లో చమత్కారాల్లో వీని సందడి సామాన్యులదగ్గరనుండి అసమాన్యుల వరకూ మరో లోకంలోవిహరింపజేస్తాయి. కాబట్టే నాగరికత ఎంత పెరిగిపోయినా ఈ వేడుకలతుషారం పన్నీటిజల్లుల్లా జానపదుల హృదయాల్ని కవ్విస్తూనే ఉంటుంది.

* • *

# జానపదం-నాగరికం

"కృత ప్రజ్ఞశ్చ మేధావీ. బుధో, జానపదశ్శుచిః" అన్నాడు జానపదుల్ని వాచస్పత్యకారుడు.

జానపదమనగా పల్లెటూరు - పల్లెటూరుజనులకు సంబంధించిన ఆచారవ్యవహారాలు, అలవాట్లు మొదలగుపద్ధతులూ, విశేషాలు జానపదాలని నిర్వచించుకోవడంజరిగింది ఇంక నగరంలో నివశించు జనులు నాగరికులు అని నిర్వచించుకుంటే నగరవాసుల జీవితానికి సంబంధించిన విశేషం నాగరికం అని చెప్పుకోవచ్చు. దీనినే 'నాగరికత' అని కూడా పిలుస్తారు.

* "ఈనాడు మనము "సివిలిజేషన్" అన్న మాటకు సమానార్ధకముగా 'నాగరికత' అన్న పదం వాడుతున్నాం. నగరవాసి నాగరికుడు, తద్భావం నాగరికత. ఆ దృష్టిలో నయితే జనపదబహుళమైన భారతదేశంలో నాగరికత తక్కువనేచెప్పాలి. కాని నాగరికత అంటే ఏదో మేడమిద్దెలమీది టాబుల టాబులు, వేడుకలు, వేషబములు చీని చీనాంబరాడంబరాలు అనిగాక మానవత్వాల్ని సుప్రతిష్ఠితంచేసి దాన్ని తరతరాలుగా సంరక్షించేటటువంటి, జాతిని జాగృతంచేసి దానిని సత్కార్యాచరణాభిముఖంగా నడిపించేటటువంటి, నిరాడంబరమైన చిత్తశుద్ధికి నికషోపలమైనటువంటి, ఒకవంక జాతియొక్క ప్రాభవ ప్రత్యేకతలను నిరూపిస్తూనే మరొకవంకదాన్ని విశ్వమానవ సమాజైకతానమయిన భావనకు సన్నిహితంచేసేటటువంటి ఒకఉన్నతమైన మనస్తత్వాన్ని కలిగించేపరిస్థితిగాగ్రహిస్తే అలాంటిఉత్తమసంస్కృతికి ఉనికి పట్టులు మనదేశంలోని ప్రాచీనతపోవనాలు జనపదాలు" అన్నారు జాతీయాచార్య శ్రీ యస్. వి. జోగారావుగారు.

ఐతే ఆంగ్లేయులు మనదేశమందునెలకొల్పిన విద్య, వారి దుస్తులు, ఆచారాలు ప్రజల్నిఆకర్షించాయి. పలువురు పాశ్చాత్య విద్యనభ్యసించి ఉన్నతపదవులుపొందారు. ప్రభుత్వం వారికి గౌరవమర్యాదలు అందించింది.

---

* నేదునూరి గంగాధరంగారి జానపదగేయ సాహిత్య వ్యాసావళి పీఠిక. పుట 1

ఈ రకమైన విద్యాగౌరవాలు పొందినవారు నాగరికసంపన్నులుగా పరిగణించబడ్డారు. పాశ్చాత్యులతోఏర్పడిన సన్నిహితంవల్లనేర్చుకున్న ఆచారవ్యవహారాలే నేడు నాగరికతగా చలామణిఅవుతున్నాయి

ఇక చరిత్రకొస్తే మనకు అనాదినుండీ వాడుకలోనున్న పదములు పల్లె, గ్రామము, పురము, పట్టణము, నగరము అనేవి. పల్లె, గ్రామము పల్లెటూరుకు సమానార్థకాలు. ప్రస్తుతం పురము, పట్టణము, నగరము నగరశబ్దానికి పర్యాయ పదాలుగా వాడుతున్నారు. కాని చరిత్రపరికిస్తే ఆదిలో జనజీవనం నదీతీరాల వెంబడి సాగింది. కారణం - మానవుడికి గాలి ఎంత ముఖ్యమో నీరుకూడా అంతేముఖ్యం గనుక. ఈ ప్రాముఖ్యాన్ని సుమతీశతక కారుడు ఇలాచెప్పాడు.

'అప్పిచ్చువాడు, వైద్యుడు,
నెప్పుడు నెడతెగకపారు నేఱును, ద్విజుడున్
జొప్పడిన యూరనుండుము
జొప్పడకున్నట్టి యూరజొరకుము సుమతీ'.

నదులు కొండలగుండా కోనలగుండా ప్రవహిస్తుంటాయి. ఆహారం కూడా ఆకొండకోనల్లోనున్న చెట్లనుండీ పశుపక్ష్యాదులనుండి సులువుగాలభ్యమవుతుండి. అందువల్ల కొంతమంది గుంపుగా నదీతీరంవెంబడి ఒక్కోచోటచేరి స్థావరాలు ఏర్పాటుచేసుకొనేవారు - అవే పల్లెలు గ్రామాలుగా పిలువబడుతుండేవి. ఇవి సంఖ్యకు ఎక్కువ - జనసంఖ్య తక్కువ. ఇక సముద్రతీర ప్రాంతాలవెలసినఊళ్ళు పట్టణాలుగా పిలువబడుతుండేవి. ఉదాహరణకు కళింగపట్టణం, భీమునిపట్టణం, కాకినాడపట్టణం, విశాఖపట్టణం, మచిలీపట్టణం, చెన్నపట్టణం వగైరా. ఈ ఊళ్ళు పెరిగిపెద్దవై రేవుపట్టణాలుగాతయారై దేశ విదేశీయుల రాకపోకలతో నాగరికస్వభావాన్ని సంతరించుకున్నాయి.

రాచరికపువ్యవస్థలో సాధారణంగా సంస్థానాధీశులుగాని, సామంత రాజులుగాని ఉండే ఊళ్ళకి ఎక్కువగా పురము అని వాడారు. ఉదాహరణకి రామచంద్రపురం, పెద్దాపురం, అమలాపురం, పిఠాపురం, రాజమహేంద్రవరపురం, హేలాపురం, వేంగిపురం వగైరా. ఐతే ఈ పురమనేదానికి

నిఘంటువులో స్త్రీలుండే గృహభాగంగా కూడా చెప్పబడింది. దీని నుంచే అంతఃపురమనే మాటవచ్చింది. నగరమనగా రాజులు (పాలకులు) ఉండే ఊరు. అదే రాజధాని. ఉదాహరణకు భాగ్యనగరం, విజయనగరం మొదలగునవి. దీనికి పాలనాసంబంధమైనవిషయాలపైనా, వ్యాపార వ్యవహారాది విషయాలపైనా దేశవిదేశీయులూ, వివిధ ప్రాంతాలవారూ, వివిధ జాతులవారూ రావడం పోవడం జరుగుతుండేది. వీరివల్ల అక్కడ నిసర్గజాతి ఆచార వ్యవహారాలూ, సంస్కృతి ప్రభావితమై కొత్తపుంతలు తొక్కాయి అదే నాగరికత అనిపించుకుంటూ, మొత్తంమీద గ్రామాలూ పల్లెలూ తాలూకు విశేషాలు జానపదముక్రిందా, పురమూ పట్టణమూ నగరముల తాలూకు విశేషాలు నాగరికముక్రిందా లెక్కించబడ్డాయి. సమైక్యం, అభిమానం, సహకారం, కట్టుబాట్లు, నియమాలు, జానపదుల అమూల్య సంపదలు. ఇవి లిఖితం కాలేదు. వాక్ నిబద్ధతతో జీవిస్తున్నాయి. నిర్మలత్వం, నిష్కాపట్యం, నిరాడంబరత్వం, జనహితం నిండుగా గూడు కట్టుకున్న గుండెలువీరివి. తిండిలేని ప్రక్కవాణ్ణి చూసిభరించలేని దాక్షిణ్యం వీరి సహజప్రకృతి. ఇంట్లో ప్రతి చిన్నశుభకార్యానికి పదిమందినీపిలిచి వేడుకగాజరుపుకోవడం వీరిముచ్చట. వీరిదృష్టిలో అన్నం పరబ్రహ్మ స్వరూపం, తాముయింతతింటూ ప్రక్కవారికి యింతపెడుతూ మమతానురాగాలతో మనసులు పండించుకుంటారు.

"Love thy neighbour" అనే భావం అంతరాంతరాల్లో జీర్ణించుకున్న మానవతామూర్తులు జానపదులు.

పోర్చుగీసువారు, డచ్చివారు, ఆంగ్లేయులు మనదేశానికి వచ్చిన తరువాత మన నగరాలు, పట్టణాలు, పురములలోని మనజాతి సంస్కృతి సంకరమై నాగరికతపేరుతో కృత్రిమస్వరూపంలోనికి మారిపోయింది. వీరినివాసాలు ఆ పట్టణాలకే పరిమితమైనందున అక్కడే నవ్యతపేరుతో ఈనాగరికత పరిఢవిల్లి జాతి సహజసంస్కృతిని పరిహసించటం ప్రారంభించింది. నాగరికులలో పరస్పర విశ్వాసం కరువు-మనిషిని మనిషి నమ్మడు-అన్నీ రాతకోతలమీదే వ్యవహారం-కోర్టులే పరిష్కారం. ఒకరి అవసరానికి ఒకరు సాయపడరు. ఎవరికి వారే యమునా తీరే అన్నట్టు.

జానపదులలో ఒకరింట ఎవరైనాచనిపోతే ఊరంతావెళ్ళి సానుభూతి చూపుతూ ఆ శవం శ్మశానానికివెళ్ళేవరకూ ఎవరింటా పొయ్యిలో నిప్పు కూడా వెయ్యరు - అంటే అన్నంకూడా వండుకోరన్నమాట. ఇదే పట్టణాలలోఅయితే నాగరికులు పక్కవాటాలో మనిషి చచ్చిపోతే కూడాపట్టించుకోరు. తనకు సంబంధంలేనట్లేవ్యవహరిస్తారు. ఇది పూర్తియాంత్రికజీవితం. తల్లీ పిల్లలుగాని, తండ్రీ బిడ్డలుగాని మనసు విప్పి మాట్లాడుకోవడం అరుదు ఎవరి దారి వారిది. ఎవరిష్టం వారిది. ప్రతివారి తాపత్రయం డబ్బు సంపాదించటం - విలాసాలకూ కులాసాలకూ ఖర్చుపెట్టుకోవడం. పేదసాదలకు దానధర్మాలు అనేది కంచుకాగడాతో వెతికినా కనిపించదు. పేరుప్రతిష్ఠలు వస్తాయనుకుంటే నాయకత్వం గురించి ఇచ్చే చందాలు మాత్రమే కనిపిస్తాయి. ఇవి దానధర్మాలు అనుకుంటే అధర్మం. ప్రతిఫలాపేక్షకలిగినవి దానధర్మాలుఎట్లా అవుతాయి ? నాగరికప్రపంచంలో వంచన, మోసం ఎక్కువ. ఏమాత్రం అవకాశం చిక్కినా పక్కవాని సొమ్ము అన్యాయంగా బొక్కడానికి ఏమాత్రం సంకోచించరు.

జానపదులది నేటినిగురించే ఆలోచన - నాగరికులది రేపటిగురించి ఆలోచన. అయితే నాగరికుల ప్రత్యేక విశేషం అందరూ విద్యారంగంలో నిమగ్నులు కావడం, తార్కికవాదంతో సైన్స్‌పై దృష్టినిల్పి మానవజీవితంయొక్క భౌతికసుఖభోగాలను సమకూర్చుకొనుటకు నిరంతరం అన్వేషణ - మరి జానపదులు కోరేది మానసిక సౌఖ్యం. అది ఆధ్యాత్మికమైనది. నడవడి సహజసిద్ధమైనది. - నాగరికుల నడవడి పూర్తిగా పరాయి అనుకరణే. నాగరికులు ప్రతీపూటా కూరలు, పచ్చడి, రసం, పెరుగు, అన్నం టేబిల్ మీద పళ్ళాలలోపేర్చుకొని స్పూనులతోనూ, ఫోర్కులతోనూ ఎవరికివారే వడ్డించుకొనితింటారు కొంతకొంతవదిలేస్తూ, కొంతకొంతతింటూ అదొక ఫేషన్‌లాగ. జానపదులలో తల్లిగాని, భార్యగాని అన్నంవడ్డించగా అచ్చట్లూ, ముచ్చట్లూ చెప్పుకుంటూ భోజన సమయాన్ని తమ కలబోసిన ఆలోచనల వేదికగాచేసుకుంటారు. తాము తినేది కడుగుపులుసుతోనైనా అది అల్పంగా భావించరు. పచ్చడి కూడే పరమాన్నంగా భుజిస్తారు.

నాగరికులలో పండగలకి, పర్వాలకి ప్రాముఖ్యం నామమాత్రం - భక్తికూడా అంతంత మాత్రం. వారి చూపు మానవచేతనమీదే. ఏదో సాధించాలన్న తపన - దానికై నిత్యాన్వేషణ - విజ్ఞాన పురోగతికై ఆలోచన. ఇవీ నాగరికుల జీవనగతులు. సంఘకట్టుబాట్లు, కులకట్టుబాట్లు, మతకట్టుబాట్లు వంటివానికి వీరుకట్టుబడరు. మన సంస్కృతిపై చిన్నచూపు. పాశ్చాత్య సంస్కృతిపై పెద్దమోజు. జానపదులది కల్లీ లేనిమాట - సూటిగామాట్లాడడంఅనేది నాగరికులకు దూరం. అది గొప్ప తెలివిక్రింద లెక్క. నాగరికులలో ఇంటికి ఎవరైనాబంధువులు వస్తేతొందరగా పంపివేయడం ఎలాగ అనేది ఆలోచన-జానపదులు బంధువులువస్తే పదిరోజులుండమని బలవంతంచేసి పెద్దపెద్దవిందులతో ఆనందింపచేస్తారు. జానపదులసంస్కారం హృదయగతం. నాగరికుల సంస్కారం బుద్ధిగతం. నాగరికులు మేధాసంపన్నులు. జానపదులు హృదయసంపన్నులు. నాగరికులు బండ్లమీదో, రిక్షాలమీదో, కారులమీదో, మోటారుసైకిళ్ళమీదో తిరగడం తప్పిస్తే కాలినడక అనాగరికంగా భావిస్తారు. అందువల్ల వారికి శరీర పరిశ్రమ తక్కువ, రోగాలెక్కువ. ప్రతిచిన్న జబ్బుకూ సూదిమందులు, బిళ్ళలు వీరి వాడకం. (అల్లోపతి వైద్యం). జానపదులు కాలినడకకే ప్రాధాన్యత ఇస్తారు. కొందరు వందలాది మైళ్ళుకూడా కాలినడకనేప్రయాణంచేస్తారు. అందువల్ల దేహపరిశ్రమ జరుగుతుంది - దీర్ఘాయువు కలుగుతుంది. నాగరికులు కాఫీ, టీ లకు దాసులు. వీరి అతిధి మర్యాదలలో మొదటిది 'టీ' యిచ్చి మాట్లాడడం, (భోజనం చేయమనడం తక్కువ). జానపదులు అతిధులకి చల్లనిమజ్జిగ ఇచ్చిమాట్లాడతారు. భోజనంచేస్తేగాని వదలరు. నాగరికులది ఉదయం ఖరీదైన బడాహోటళ్ళలో టిఫిన్ కాఫీలు. మధ్యాహ్నం రాత్రి భోజనం - జానపదులది ముప్పొద్దు భోజనం. ఉదయం చద్దన్నం. (చాలామంది తరవాణీపోసుకుని ఉల్లిపాయనంజుకుని చద్దన్నంతింటారు.) నాగరికులు కనీసం ప్రక్కవారితోకూడా మనసు విప్పి మాట్లాడరు. వారికి స్నేహితులు టి.విలు, రేడియోలు, సినిమాలు మాత్రమే - ఇక జానపదుల దగ్గరకువస్తే ఊరిముందర గలగల పారే సెలయేరు, ఏటిగట్టు, చెట్టుమీద కూర్చున్న పశువులు కాచే పిల్లవాని పిల్లన గ్రోవి సాదరంగా స్వాగతంపలుకుతాయి, నగరంలో అయితే స్వాగతం పలికేది యంత్రాలరణగొణధ్వనిమాత్రమే. నాగరికులు విద్యుత్‌కాంతుల్లోగాని విహరించలేరు. జానపదులు అరికెన్‌లాంతర్లు కిరస

నాయలుబుడ్లు, ఇలాయి దీపాలలోకూడా పనులు చక్కబెట్టుకుంటారు. నగరాలలో అద్దెఇండ్ల కాపురాలు. అందుకే వాటిలో కీచులాటలు ఎక్కువ. అన్నిటికి యింటి యజమానుల అదుపులు, ఆంక్షలు - వీనిమధ్య ఎప్పుడు ఇల్లుమారవలసివస్తుందోఅని నిరంతరఆందోళన. జానపదులు పాకల్లో నివసించినా స్వంతకొంపల్లో స్వేచ్ఛాజీవితం వారిది. నాగరికుల ప్రభుత్వ కుళాయిలదగ్గర కీచులాటలు పట్టణవీధులలో ప్రభాతదృశ్యం. జానపదులు కోనేటికో, కాలువకో వెళ్ళి నీలాటిరేవుల్లో నీరుముంచుకొని గుంపులు గుంపులుగా కబుర్లాడుకుంటూ సరదాగా జలకాలాడి బిందెలతో మంచినీళ్ళు తెచ్చుకుంటారు - ఎండుగతో నీరు శుభ్రపరుచుకుంటారు. ఎండుగ అంటే-ఎండుపుకాయ గంధంతీసి నీటిలోగలిపితే ఆనీటిలో ఉన్న మలినం పోతుంది. పూజలు, పుణ్య కార్యాలంటే జానపదులకు మక్కువ ఎక్కువ. నాగరికులు అదొక అనాచారం క్రిందచూస్తారు. నగరంలో అన్నీ రాచకార్యాలే. పల్లెలలో అన్నీ ప్రజాకార్యాలే. పొద్దుపోతే పట్టణం తొందరగా నిద్రపోతుంది. పల్లెలకో పొద్దుపోయినా ఏదోసందడే. మరల కోడికూతతో పల్లె మేలుకుంటుంది. ముసలివాళ్లు ఏవో తత్వాలు పాడుతుంటారు. యువకులు బయలుదేరి పొలాలకు వెళతారు. స్త్రీలు వీధులలో పాచితుడిచి, కళ్లాపిచల్లి ముగ్గులలో నిమగ్నలవుతారు. పట్టణం తెల్లవారి బారెడు పొద్దెక్కినతరువాత లేస్తుంది. పని మనిషివచ్చిలేపాలి లేదా పాలవాడు లేపాలి. అక్కడనుండి అంతా అడావిడే. పల్లీయులు తాపీగా పనులు సాగిస్తారు తొందర దేనిలోనూ ఉండదు. పల్లెలలో పశుసంతతి ఎక్కువ - పట్టణాలలో జనసంతతి ఎక్కువ. జానపదులు తమపనులు తాము స్వయంగా చేసుకుంటారు. నాగరికులకు పని మనుషులురావలసిందే. వాళ్ళులేనిదే పనులు జరగవు. వాళ్లురానిరోజు వీళ్ళ ఇళ్ళల్లో వొళ్లువంగక అన్నీ రుసరుసలు, బుసబుసలే మనకు దర్శనమిస్తాయి. నీళ్ళకఱువు, పాడి కఱువు, గాలి కఱువు, ఇదీ నగరజీవితం-ఇవి పుష్కలం పల్లెజీవితంలో. పట్టణాల్లో అంతా చదువులు, సినిమాలు, పరిశ్రమలు, ఆఫీసులు, వ్యాపారాలు, రాజకీయాలు, (రాచకయ్యాలు) సందడి తప్ప మరే కళాభిరుచీ కనబడదు. ఇక్కడ ప్రతిహృదయం అలజడి, ఆందోళనలతో నిండి ఉంటుంది - పల్లె నిర్మలంగా నిద్రపోతుంది. కళలు, కథలు, సహకారం, సౌజన్యం, సౌభాగ్యాలతో ఆనందసందోహంతో చిందులువేస్తుంది. పచ్చనిపైరుపొలాలతో చిగురించేతరులతలతో ప్రకృతి సౌందర్యం పరవ

సౌందర్యం పరవశిస్తూ ఉంటుంది - మరి నగరాల్లో అంతస్తులమీద అంతస్తుల నిర్మాణాలతో ఆకాశాన్ని అందుకోవాలనేతాపత్రయం అధికంగా కనిపిస్తుంది. నినాదాలు, ఉద్యమాలు అనుదినపర్వాలు. యజమానుల కూలీల పోరాటాలు పట్టణాలలో కనిపిస్తే రైతుకూలీల సామరస్యం పల్లెల్లో కనిపిస్తుంది. ఎంత కూలిచ్చినా తృప్తిలేదంటాడు మిల్లుయజమాని. మా కండలు కరిగించిన శ్రమంతా యజమాని దోచుకుంటున్నాడంటాడు కూలీ. ఇది పట్టణాలలో కనిపించే అనుదిన పోరాటం. ఇది నాగరికత.

నాగరికులజీవితాలు జీతనాతాలపై బ్రతుకులు - జానపదులు వారి స్థిరచరాస్తులపై వచ్చే ఆదాయంతో రెక్కలుకష్టంచేసి బ్రతుకుతారు. జానపద స్త్రీలు పంటీవిందాచీర, పొడుగుచేతులరవికెలు ధరిస్తారు. నాగరిక స్త్రీలు గౌనులు, స్లీవ్‌లెస్‌జాకెట్‌లు వగైరా పాశ్చాత్య వస్త్రధారణతో మురిసి పోతారు. జానపదులలో పురుషులు పంచె, జుబ్బా, తలపాగ ధరిస్తారు. నాగరికులు ధరించేవి ప్యాంటు, షర్టు, సూటులో విదేశీప్రభావంతోవచ్చే రకరకాల మోడల్స్. జానపదులు మూతిమీదమీసం రోషానికి చిహ్నంగా పెంచుతారు. మీసంమీద నిమ్మకాయ నిలబెట్టడం వారి పౌరుష చిహ్నం - నాగరీకులు అసలు మీసాలే ఉంచరు. అదే నాగరికత. చాకలి బట్టలుతకడం, మంగలి క్షవరంచేయడం, మాదిగ చెప్పులుకుట్టడం, కోమట్లు వ్యాపారంచేయడం, మేదరి తట్టలుఅల్లడం, బ్రాహ్మణులు పౌరోహిత్యంచేయడం, రైతులు పంటలు పండించి ఆ పంటను వారికి పంచడం జానపదుల జీవనసరళి. ఇక్కడ ఊరంతా ఒక్క కుటుంబం - పట్టణంఅంతా యంత్రాలమీదేనడక. వృత్తికి కులంనిమిత్తంలేదు. నేర్పరితనం ప్రధానం. సంపాదనే ముఖ్యం నాగరికులు మార్గకవితను అభిమానిస్తారు జానపదులు దేశకవితను ఆరాధిస్తారు. జానపదులు విస్పష్టంగా ఉన్న విషయాన్ని కుండబద్దలుకొట్టినట్లు మాట్లాడతారు - కుతంత్రాలతో మనిషిని పడగొట్టడం మేధావంతుడైన నాగరికుడు చేసే పని. నాగరికులది వ్యష్టిజీవితం - జానపదులది సమిష్టి జీవితం. నాగరికులు బుద్ధిజీవులు, జానపదులు అమాయకులు.

ఇది ఒకనాటిమాట. ఈనాడు నాగరికత పల్లెల్లోకూడా ప్రాకి జానపదులు నాగరికలక్షణాలు అలవాటుచేసుకుంటున్నారు. ఇప్పుడు నాగరికులు జానపదులు అనేభేదంలేదు. జానపదం నశిస్తోంది - నాగరికం సర్వత్రా నాట్యం చేస్తోంది.

# కళలు - వానిలోని తరగతులు

"యోగః కర్మ సుకేశలమ్" (గీత)

ఏ విద్యయందైనా సరే ప్రదర్శింపబడే కౌశలాన్ని కళ అంటారు. ఇక్కడ కౌశలమనగా నైపుణ్యం. ఈ నైపుణ్యం వ్యక్తి మేధాశక్తినుండి ఉద్భవిస్తుంది. ఇది సృష్టికి ప్రతిసృష్టి చేయడంలో కావచ్చు, లేదా సృష్టికి మించిన సృష్టి చేయడంలో కావచ్చు - కళల గురించి కొందరు పండితులు యీ క్రింది రీతి నిర్వచించారు.

T "కళ అన్నది మానవబుద్ధి జన్యమై, చాతురీ మహితమై, సృష్టికి ప్రతిరూపమై భాసించే రూప విశేషం. అంటే ప్రతి కళలోనూ మనుష్యుని పని తనం, బుద్ధి వైశద్యం వెల్లడి కావలసి వుంది. అట్లా ఉంటేనే అది కళ అనిపించుకుంటుంది."

TT "సృష్టియందంతర్నిహితమైయున్న సంపూర్ణత్వ మును సౌందర్య సునిశిత సత్యరూపమును అభి వ్యక్తపరచు సాధన సంపత్తియే కళలు"

"Art is imitation"
(కళ అనుకరణ)
ఇక్కడ అనుకరణ అంటే ప్రకృత్యానుకరణ
'అరిస్టాటిల్'

"Art is an interpretation, not an imitation"
(కళ అనుకరణకాదు, వివరణ) - 'ఆర్థర్ దేవింగ్'

అనుకరణ కళ అయితే ఛాయాగ్రహణం ఉత్తమ కళ కావలసి ఉంటుంది. కారణం ఇది యథాతథంగా గ్రహిస్తుంది గనుక. కాని దీని నెవ్వరూ కళగా భావించలేదుగనుక అనుకరణే కళకాదని వీరి మతం.

---

T జానపదగేయాలు - సాంఘికచరిత్ర (పీఠికనుండి)
డా. బిరుదురామరాజు, డా. నాయని క్రిష్ణకుమారి.

TT "నాట్యకళ" ఫిబ్రవరి - మార్చి 970 సంచిక సంపాదకీయం నుండి గ్రహించబడినది.

అరిష్టాటిల్ కళలను Fine Arts అని,
Useful Arts అని రెండుగా విభజించాడు.
ఆయన దృష్టిలో Fine Arts అంటే యివి -
1. Music 2. Drama 3. Poetry 4. Sclupture
5. Agriculture

Useful Arts - అంటే ఇంజనీరింగు, వడ్రంగం, కమ్మరం, కుమ్మరం వగైరాలు. Fine Arts కి ఆనందాన్నందించడం ప్రధాన గుణం. useful Arts ఆనంద జనకము కూడా కావచ్చు. ఉదాహరణకు కుమ్మరం, వడ్రంగం వంటి వానిలో వారు తయారుచేసిన వస్తువులపై చెక్కే నగిషీలు ఆనంద జనకములే గదా! ఫైన్ ఆర్ట్సు ముఖ్యంగా ఆనందజనకములే. వీనిలో జీవితోపయోగం కూడా ఉండవచ్చు. ఉదాహరణకు ఒక శిల్పిచక్కని శిల్పాన్ని చెక్కుతాడు. చూపరులకు ఆనందం కలిగించడం దాని పరమ ప్రయోజనం. అది అమ్ముడుపోయే అవకాశం కూడా ఉంది. అయినా ఈ అమ్ముడుపోవడమనేది ఔపచారికం. భారతీయ పండితులు కళలు 64 అన్నారు. T వాత్స్యాయన కామసూత్రమందలి చతుష్షష్టి కళా వివరణమును యీ క్రింద ఉదహరించుచున్నాను. (శ్రీ మేడిచర్ల ఆంజనేయశాస్త్రి గారి అనువాదము)

1. గీతము - ఇది స్వర ప్రధానముగా, పద ప్రధానముగా, లయ ప్రధానముగా, మనస్సుయొక్క అవధానము ప్రధానముగా లోలోపల గానము చేయబడునదిగానుండును.
2. వాద్యము - ఇది తత - ఘన - అవనద్ధ సుషిరభేదములచే నాలుగు విధములు
3. నృత్యము - భావాభినయము
4 ఆలేఖ్యము - చిత్రలేఖనము
5. విశేషకచ్ఛేద్యము - తిలక - పత్రభంగాది రచన
6. తండుల కుసుమ బలివికారము - బియ్యపు పిండితో, పూలతో భూత తృప్తి కొరకు పెట్టెడి ముగ్గులు

T "నాట్యశాస్త్రము అనువాదము" పు 699-701
డా॥ పోణింగి శ్రీరామ అప్పారావు.

7. పుష్పాస్తరణము - పూల శయ్యలను, ఆసనములను ఏర్పరుచుట.
8. దశనవసనాంగరాగము - దంతములకు, వస్త్రములకు రంగులు అద్దుట.
9 మణిభూమికాకర్మ - మణులతో బొమ్మలను నిర్మించుట.
10 శయనరచనము - ఋతువులను శీతోష్ణపరిస్థితులను అనుసరించి శయ్యలనుకూర్చుట.
11. ఉదక వాద్యము - జలతరంగిణి.
12. ఉదకాఘాతము - పిచికారుతో నీరు చిమ్ముట (వసంతకేళియందు)
13. చిత్రయోగములు - రకరకముల వేషములతో సంచరించుట.
14 మాల్యగ్రథన వికల్పములు :- చిత్రవిచిత్రములైన పూలమాలికలను కూర్చుట.
15. శేఖరకాపీడయోజనము :- పూలతో కిరీటమును, తలచుట్టును అలంకరించుకొనెడి పూలనగిషీని కూర్చుట.
16. నేపథ్యయోగములు - అలంకరణ విధానములు.
17. కర్ణపత్ర భంగములు - ఏనుగు దంతముతోను, శంఖములతోను చెవులకు అలంకారములను కల్పించుకొనుట.
18. గంధయుక్తి :- అత్తరువులు మొదలగునవి చేసెడు నేర్పు.
19. భూషణయోజనము :- సొమ్ములు పెట్టుకొను విధానము.
20. ఇంద్రజాలములు :- చూపరుల కనులను భ్రమింపజేయుట.
21. కౌచుమారయోగము :- సుభగం కరణాది యోగములు.
22. హస్తలాఘవము :- చేతులలో ఉన్న వస్తువులను మాయంచేయుట
23. విచిత్రశాఖ యూషభక్ష్య వికారక్రియలు :- రకరకముల తినుబండారముల వండుట.
24. పానకరసరాగ స్వయోజనము :- పానకములు, మద్యములు చేయుట
25. సూచీవానకర్మ :- గుడ్డలు కుట్టుట
26. సూత్రక్రీడ :- దారములను ముక్కలుచేసి, కాల్చి మరల మామూలుగా చూపుట
27. వీణాడమరుక వాద్యములు :- ఈ వాద్యములందు మంచినేర్పు.

28. ప్రహేళికలు:- సామాన్యార్థము మాత్రము పైకి కనబడునట్లును, గంభీరమైన అర్థము గర్భితమగునట్లును కవిత్వము చెప్పుట.

29. ప్రతిమాల:- కట్టుపద్యములు చదువుట.

30. దుర్వాచక యోగములు:- విలాసముకొరకు క్లిష్ట రచనలను చదువుట

31. పుస్తకవాచనము:- అర్థవంతముగా చదివెడు నేర్పు.

32. నాట్యకాఖ్యాయికాదర్శనము:- నాటకములకు, కథలకు సంబంధించిన జ్ఞానము

33. కావ్యసమస్యాపూరణము:- పద్యములతో సమస్యలను పూరించుట.

34. పట్టికావేత్రబాణవికల్పములు:- పేముతో కుర్చీలు, మంచములు అల్లుట.

35. తక్షకర్మ:- విలాసముకొరకు బొమ్మలు మొదలగునవి చేయుట

36 తక్షణము:- కర్రపని యందలి నేర్పు

37 వాస్తువిద్య:- గృహాది నిర్మాణశాస్త్రము.

38 రూప్యరత్న పరీక్ష:- రూపాయలలోను, రత్నములలోను మంచి చెడుగులను పరిశీలించగల్గుట

39. ధాతువాదము:- లోహములుండెడి ప్రదేశములను కనుగొనుట

40. మణిరాగాకరజ్ఞానము:- మణుల గనులను కనిపెట్టుట

41. వృక్షాయుర్వేద యోగములు:- చెట్లవైద్యము

42. మేషకుక్కుటలావక యుద్ధ విధి:- పొట్టేళ్ళు, కోళ్ళు, లావకపక్షులు మొదలగు వానితో పందెములాడుట

43. శుకశారికా ప్రలాపనము:- చిలుకలకు, గోరువంకలకు మాటలు నేర్పుట

44. ఉత్సాదన సంవాహన కేశమర్దనములందలి కౌశలము:- ఒళ్ళుపట్టుట, పాదములొత్తుట, తల అంటుట మొదలగు వాని యందలి నేర్పు.

45. అక్షరముష్టికా కథనము:- అక్షరములను మధ్య మధ్య గుర్తించుచూ కవిత్వము చెప్పుట.

46. మ్లేచ్ఛిత కవికల్పములు:- సాధుశబ్దమును కూడ అక్షరప్రత్యయము చేసి అసాధువని భ్రమింపజేయుట.

47. దేశభాషావిజ్ఞానము:- బహుదేశ భాషలను నేర్చియుండుట.

48. పుష్పశకటిక :- పూలతో రథము, పల్లకి మొ॥నవి కట్టుట.

49. నిమిత్తజ్ఞానము :- శుభ - అశుభ శకునములను తెలిసియుండుట.

50. యంత్రమాతృక :- యంత్రనిర్మాణాదులు.

51. ధారణమాతృక :- ఏకసంధా గ్రహణము.

52. సంపాఠ్యము :- ఒకడు పఠించుచుండగా వానిని గుర్తించి పలువురు వల్లించుట.

53. మానసీక్రియ :- కావ్యములను రచించుట.

54. అభిధానకోశఛందోవిజ్ఞానము :- నిఘంటు-ఛందశ్శాస్త్ర పరిజ్ఞానము.

55. కావ్యక్రియాకల్పము :- కావ్యములను రచించుట.

56. క్రియాకల్పము :- కావ్యాలంకార శాస్త్ర పరిజ్ఞానము.

57. ఛలితిక యోగములు :- మారువేషముతో ఇంకొకవ్యక్తివలె చలామణి అగుట.

58. వస్త్ర గోపనము :- వస్త్రములను మాయజేయుట మొదలగుపనులు.

59. ద్యూత విశేషములు :- జూదమునందలి విశేషములను తెలిసికొనియుండుట.

60. ఆకర్షక్రీడలు :- జూదమునందలి భేదములు.

61. బాలక్రీడనకములు :- పిల్లల ఆటలయందలి నేర్పు.

62. వైనయికీజ్ఞానము :- గజ, అశ్వశాస్త్ర పరిజ్ఞానము

63. వైజయకీవిద్యలు :- విజయసాధనోపాయములను తెలిసియుండుట.

64. వ్యాయామకీజ్ఞానము :- వ్యాయామపరిజ్ఞానము.

వీనిలో విశిష్టమైన ఈ క్రింది నాలుగింటిని లలితకళలన్నారు.

1. సంగీతం, 2. కవిత్వం, 3. చిత్రలేఖనం, 4. శిల్పం.

కొందరు నాట్యం కూడా లలితకళలలో చేర్చారు. నాట్యం గురించి యిలా చెప్పబడింది. "నృత్తం తాళలయాశ్రయమ్, ఆద్యమ్ భావాశ్రయమ్ నృత్తమ్ నాట్యం రసాశ్రయ" దీనినిబట్టి మూడు కళల సమాహారంగా కనిపిస్తోంది. వాడుకలో నాట్యం కూడా లలితకళలలో అయిదవదిగా వ్యవహరింపబడుతోంది.

ఈ లలితకళల్ని చిత్రకళలు, విలాసకళలు అనికూడా పిలుస్తారు. లాలిత్యం ప్రధానమైనవి గాన లలితకళలనీ, రూప చిత్రణగానీ, రస చిత్రణగావి, భావచిత్రణగాని కలవిగాన చిత్రకళలనీ, ఆనందం ప్రధానం గాన విలాసకళలనీ అన్నారు.

కాళిదాసు రఘువంశంలో లలితకళాశబ్దమే వాడేడు. జయదేవుడు గీత గోవిందంలో విలాసకళాశబ్దాన్ని వాడేడు.

లలితకళ అనేది మూడు అంశములతో ముడివడివుంది.

1. సృష్టి, 2. అనుకరణ, 3. నేర్పు.

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము కావ్యహేతువులని చెప్పబడింది. కవిత్వంకూడా లలితకళలలో ఒకటికనుక పైనచెప్పబడిన హేతువులు కళలన్నిటికీ వర్తిస్తాయి.

## ప్రతిభ

T "ప్రతిభను" గూర్చి అభినవగుప్తుడు -

"ప్రజ్ఞా అపూర్వవస్తు నిర్మాణక్షమా" అన్నాడు. అంటే - క్రొత్త క్రొత్త వస్తువులు నిర్మించునేర్పు అని అర్థం.

భామహుడు - ప్రజ్ఞానవనవోన్మేషశాలినీ ప్రతిభామతీ" అన్నాడు.

ఈ ప్రతిభనే ఆధునికులు భావనాశక్తి అనీ, ఇంగ్లీషులో 'పవరాఫ్ ఇమేజినేషన్' అనీ వ్యవహరిస్తున్నారు.

## వ్యుత్పత్తి

"నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్" అని పండితులు చెప్పారు.

వ్యుత్పత్తి లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణ వలన ఏర్పడుతుంది. అనగా సర్వతోముఖమైన పాండిత్య విశేషము 'వ్యుత్పత్తి' అని అర్థం ప్రతిభ నైసర్గిక - వ్యుత్పత్తి సంపాదితం.

---

T కావ్యాలంకార సంగ్రహము పు. 19.

# అభ్యాసం

అభ్యాసం గురించి రాజశేఖరుడు "నిరంతర కృత్య వస్తు పరిశీలనమే అభ్యాసమని, దీనివలన అనన్య సామాన్యమైన నేర్పు కలుగుతుందని వివరించాడు.

"అభ్యాసోహి కర్మణాం కౌశల మావకంతి'' అంటే నిరంతరమగు అభ్యాసమువలన కౌశలముకలుగును అని. సామాన్య భాషలో దీనిని చెప్పాలంటే అనగననగరాగ మతిశయిల్లుచునుండు" అని -

పైన చెప్పబడిన "సృష్టి"కి ప్రతిభ ముఖ్యం. ఇందు అపూర్వత స్వతంత్రత నిండి ఉంటుంది. "అనుకరణ" అనేది ప్రకృతి అనుకరణ- 'సృష్టికి ప్రతిసృష్టి'. దీనికి ప్రపంచ విజ్ఞానం చాలా అవసరం. కనుక వ్యుత్పత్తిపై ఆధారపడి ఉన్నట్టిదిది.

"నేర్పు" అభ్యాసంవల్ల అలవడుతుంది. అందుబాటులో ఉన్న సామాగ్రితో ఆనందకరంగాకూర్చగలశక్తియే నేర్పు.

ఈ లలితకళలు మరల శ్రవ్యము, దృశ్యము అని రెండు రకాలుగా విభజించబడ్డాయి. "రమ్యాణివీక్ష మధురాంశ్చ నిశమ్య శబ్దాన్ " అను శ్లోకంలో కాళిదాసు ఈ విభజన సూచించాడు. శ్రివణేంద్రియ ములద్వారా ఆనందం కలుగజేసేవి. శ్రవ్యకళలు. ఇలాచూసినప్పుడు శిల్పం, చిత్రలేఖనం దృశ్య కళలు. సంగీతం, కవిత్వం శ్రవ్య కళలు.

శిల్పం :- ఇది రూపప్రధానమైనది ఒక వస్తువుయొక్క రూపాన్ని చెక్కడం, రాగి, రాయి, మట్టి, కర్ర - మొదలైన విగ్రహ విశేషాలన్నీ ఇందులోకి వస్తాయి.

చిత్రలేఖనం :- ఇదికూడా శిల్పంవలె దృశ్యమానమే. దీనిలో రంగులు, కుంచె, గోడ మొదలగునవి ముఖ్య పదార్థాలు శిల్పంలో చూప లేని ప్రకృతి వైవిధ్యంకూడా ఇది చూపగలదు.

సంగీతం :- సంగీతం అపాత మధురం. కానీ కంటికి కనిపించదు. నిరాకారం.

కవిత్వం :- కవిత్వం కేవలం అక్షరరూపం. శిల్పం, చిత్రలేఖనం దృశ్యమానములు. చూసిఆనందించేవి. అందువలన వీనిని దృశ్యకళలన్నారు. సంగీతం, కవిత్వం శ్రవణగోచరాలు గాన వానిని శ్రావ్య కళలన్నారు. నాటకం, నాట్యం వంటివి సమాహారకళలు. వీనిలో దృశ్యం, శ్రవ్యం కూడా వుంటాయి.

కళలను గురించి :- "ఆర్ట్ ఫర్ ఆర్ట్‌సేక్" అనేది ఒకవాదం, "ఆర్ట్ ఫర్ ది పీపుల్" అనేది ఒకవాదం అనాదిగా అనంతంగా సాగివస్తున్నాయి.

"ఆర్ట్ ఫర్ ఆర్ట్ సేక్" (కళ కళకోసమే) అనేది వైయక్తికం. దీనికి ఆత్మానందం ప్రధానంగాచెప్తుంటారు. కాని వాస్తవానికి కళాకారుడు ఎటువంటి ప్రలోభాలకీలొంగక తానుదర్శించిన సత్యాన్ని ప్రదర్శించడమనేది దీనిలోని భావం.

"ఆర్ట్ ఫర్ ది పీపుల్" అనే వాదంలో కళ ప్రజలకు చైతన్యవంతులుగా చేసే ఉపకరణంగా ఉపయోగపడాలనేది వీరి వాదం.

కళ భావాత్మకమైన మానవసృష్టి. సృష్టిలోనున్నదానిని యథాతథంగా అనుకరించుట, ఉన్నది ఉన్నదున్నట్టుగాక తన మనోనేత్రానికి గోచరించునట్లుగా చిత్రించుట, సృష్టిలో పొందలేకపోయినదానిని తన భావనతో ఉత్తమమైన, ఉన్నతమైన జగత్తును సృష్టించుట అనునవి కళారూపకారకాలు.

లలితకళల ప్రయోజనాల గురించి పలువురు పండితులు ఈ క్రింది విధంగా అభిప్రాయాలు వెలిబుచ్చారు.

(*) "కళ మానవుని జీవితమును మాధురీ మహితమును, సమరసమందిరమును ఒనర్చును.

---

(*) శ్రీ మారేమళ్ళ నాగేశ్వరరావు

"కళాకారుడు - సమాజము" వ్యాసంనుండి.

"కష్టసుఖాదికాత్మకమైన ద్వంద్వ ప్రకృతినుంచి
తట్టుకొనలేని హృదయమునకు గిలిగింతలు పెట్టి
కళ మానవుని లాలించి పాలించును. తన
సృజనాశక్తి యాధారముగా జీవితమును
మానవుడు లలిత మధురంగా చేసుకొను
యత్నమునందే కళ ఉద్భవించినది"

"మానవుడు ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక రంగాలలో మాత్రమే వికాసం చెందితే ఆర్థికపుష్టి, సాంఘికగౌరవం, విజ్ఞానదీప్తి, అభివృద్ధి చెందుతాయేమోగాని జీవితంలో ఒక శుష్కత్వం, ఒక నీరసభావం, ఒక నిరానందం మాత్రం తొంగిచూస్తూనేవుంటాయి. కళారంగం ఈ లోటు తొలగిస్తుంది." — సంజీవదేవ్

(**) అందమివ్వడమే కళకు ఉద్దేశం. కళలో పాతా, కొత్తా, ముందూ, వెనుకా ఇవేమీలేవు. ఇంకా దీని ప్రయోజనమేమిటనిఅడగడం గుడ్డితనం. అంత ప్రయోజనకారి ఇంకఉండదు. గంతలుకట్టుకొని నువ్వు వాంఛించే ప్రయోజనాన్ని నెరవేర్చలేదుకనుక దానివలన ప్రయోజనం లేదనడం చాలా సంకుచితం."

"కవి, గాయకుడు, ఫిలాసఫర్ వీళ్ళకి స్వేచ్ఛలేని దేశం, కాలం, ఘోరం. చాలాత్వరలో మనుషులు మరలు, కీలుబొమ్మలు, రాక్షసులు, రాబర్టులుగా తయారవుతారు."

"ఒకదేశ ఔన్నత్యాన్ని ఎత్తిచూపేవి కళలు మాత్రమే. గ్రీకు, రోము దేశాలు హోమరు, వర్జిల్ కావ్యాలవల్లే పేరుపొందాయి. కాళిదాసు, భవభూతి వంటి కవులవల్లా, అజంతా, ఎల్లోరా శిల్పాలవల్లా, తాజ్‌మహల్ వంటి కళాఖండాలవల్లా తాన్‌సేన్, త్యాగరాజులవంటి సంగీతవేత్తలవల్లనే భారతదేశం జగత్ప్రసిద్ధి పొందింది. అలాగే రఫేల్, బెతోవన్, షేక్స్‌పియర్ వంటివారు జన్మించడంవల్లే ఆయాదేశాలు నలుగురు నోళ్ళల్లోను ఘనంగా కీర్తించబడుతున్నాయి."

---

(**) శ్రీ గుడిపాటి వెంకటచలం "చలం - కళ" నుండి.

కళ సంస్కారాన్ని సంక్రమింపజేస్తుంది. సంస్కారం సూక్ష్మదృష్టి కలిగిస్తుంది. విజ్ఞానాన్ని పంచడం, వివేకాన్ని పెంచడం, ఆనందాన్ని అందించడం లలితకళల పరమావధి. జీవితం ఆటుపోటులను అధిగమించి ఆనందంగా జీవించడానికి కళలుతోడ్పడతాయి. కళకు కులమతభేదాలు లేవు. ప్రాంతీయవిభేదాలు లేవు.

ఆడామగావివక్షలేదు. అన్నిటికీ అతీతం కళ.

## శిల్పం

"శిలలపై శిల్పాలు చెక్కినారూ....మనవాళ్ళు సృష్టికే అందాలు తెచ్చినారూ...."

ఒకజాతి చరిత్ర, సంస్కృతులను తెలియజెప్పేవి ఆ కాలంలో వెలసిన కళలే. అందులో శిల్పకళ ప్రత్యేకత మరింత. వ్రాత కందని చరిత్రను కూడా యీ రాతిప్రతిమలందిస్తున్నాయి. ఏకళఅయినా ఆదిలో ప్రకృతి అనుకరణతోనే ప్రారంభమయ్యింది. శిల్పికూడా తాను చూసింది రాయిలో చెక్కేడు. అవే వన్యమృగాలైన ఏనుగులు, జింకలు, లతలు, పక్షులు, వృక్షములు వగైరా. తరువాత మతప్రభావంతో దేవతా ప్రతిమలు సృష్టించాడు. తరువాత సౌందర్యారాధనలో మధుర మంజుల మనోహర మోహనాకృతులైన ఊహాసుందర సుందరీమణుల సజీవ మూర్తులుగా సృష్టించి చరిత్రకే విశిష్టతనుచేకూర్చాడు.

ప్రకృతిలోని ఎనభైనాలుగులక్షల జీవరాశులను ఒకదానికొకటి పోలికలేని కోట్లాదిరూపాలతోసృష్టించిన మహాశిల్పి బ్రహ్మ అనుకుంటే ప్రాణందక్క మిగిలినదంతా ప్రతిసృష్టిచేసిన మహామేధావి మానవశిల్పి. పురాణకాలంలో పేరెన్నికగన్న గొప్ప శిల్పి 'మయుడు' ఉన్నది లేనట్లు గానూ, లేనిది ఉన్నట్లుగానూ సృజించి దుర్యోధనసార్వభౌముడంతటివాడినే సంభ్రమాశ్చర్యాలలోముంచెత్తేడు. వాస్తవిక ప్రపంచంలో యిప్పటివరకూ నేలతల్లి ఒడిలో దాగియున్నబడిన శిలాప్రతిమల ఆధారంగాపరిశోధిస్తే ఈజిప్టు, చైనా, గ్రీస్, రోమ్, ఇండియా వగైరా దేశాలలో క్రీస్తుపూర్వం ఎన్నో శతాబ్దాలకు ముందే అద్భుత శిల్పకళా సంపద పెంచి పోషింపబడినదని తెలుస్తోంది ఇండియాలో క్రీస్తుపూర్వం మూడువందల సంవత్స

రాలనాటి మొహంజొదారో, హరప్పా శిథిలాలలోబయల్పడిన శిథిలశిల్పాలు ప్రాచీనభారతీయ నాగరికతకు ప్రతిబింబాలు.

తెలుగుసీమలో యీశిల్పకళావైభవాన్ని వేనోళ్ళచాటే అమూల్య సంపద పుణ్యక్షేత్రాలను, ఆరామాలను అంటిపెట్టుకొని విదేశీయుల్ని సహితం విభ్రాంతుల్ని చేస్తోంది వీనిలో ముఖ్యంగా అమరావతి, నాగార్జునకొండ, హనుమకొండ, ఓరుగల్లు, రామప్పగుడి, అలంపురం, కాళహస్తి, శ్రీశైలం, సింహాచలం, దాక్షారామ లేపాక్షి, ఆంధ్రశిల్ప కళావైభవానికి నివాళులర్పిస్తున్నచోట్లు.

భారతీయశిల్పాలకు ఎక్కువగా గుహలు, కొండలూ, దేవాలయాలూ, కోటలూ, స్థూపాలూ స్థావరాలూ. అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటా గుహల శిల్ప సౌందర్యం ప్రపంచశిల్పసంపదకే తలమానికం. గ్రీస్‌లో 'పయిడీస్ చెక్కిన ఏడు నిలువుల ఎత్తుగల 'జుపిటర్' విగ్రహం ప్రపంచ వింతలలో ఒకటనుకుంటే, రోమ్‌లోని సీజర్ విగ్రహం, అమెరికాలోని వాషింగ్‌టన్, లింకన్ విగ్రహాలు నిడివిలో గొప్పతనాన్ని చాటుకుంటుంటే, (ఒక్కొక్కదాని పొడవు 465 అడుగులు) మాస్కోలోని లెనిన్ పాలరాతి విగ్రహం సహజత్వానికి దర్శనీయమనుకుంటే, మన అజంతాసుందరి జగదేక సౌందర్యానికి విశ్వవిఖ్యాతి పొందింది. ప్రాచీనకాలంలో భారతీయశిల్పం రాజులఆదరణలోనూ, మతాలపరిపోషణలోనూ మూడుపువ్వులూ ఆరుకాయలుగా వికసించింది. అశోకుడు. కనిష్కుడు, హర్షవర్ధనుడు యిచ్చిన చేయూత అనల్పం. గుప్తరాజులకాలము దీనికి స్వర్ణయుగమే. ఆనాడు హిందూ బౌద్ధశిల్పాలు రెండూ శరవేగంతో పురోగమించాయి. అశోకుని కాలంలోని సాంచీ, బుద్ధగయ స్థూపాలూ, కనిష్కుని కాలంలోని తక్షశిల స్థూపాలూ, గుప్తుల అజంతాశిల్పాలూ వారికళాభిరుచికి ప్రతీకలు.

గ్రీకులదండయాత్రలో కనిష్కునికాలంలో క్రీ. శ. 1వ శతాబ్దిలో బౌద్ధశిల్పం, గ్రీకుశిల్పం కలిపి గాంధారశిల్పమనే క్రొత్తరూపాన్ని ధరించింది. ప్రతిమలో వాస్తవికత ప్రతిబింబించడం దీనిప్రధాన లక్షణం. కట్టుకున్న బట్టమడతలుకూడా యధాతధంగా చెక్కబడతాయి. భారతీయశిల్పంలో తెలుగుశిల్పాలబాణీ "ఆంధ్రశిల్ప" మని ఒక ప్రత్యేకత గడించుకున్నది. అదే అమరావతి శిల్పం.

## అమరావతి

"అమరావతీ గుహల అపురూప శిల్పాలు" అనే పాట దేన్నిదృష్టి ప్రాకారోగాని అక్కడ గుహలులేవు. బౌద్ధస్థూపంమాత్రం వుంది. ఆ ఫలకాలపై బుద్ధుని జననంనుండి నిర్యాణం వరకూగల గాథలు, జాతక కథలు లోకోత్తరంగాచెక్కబడ్డాయి. బుద్ధుని ధ్యానముద్ర, బోధివృక్షం, ధర్మచక్రం దివ్యశిల్పకళావిలసితాలు. వీనితోపాటు నాటి తెలుగు నాగరికతా చిహ్నాలైన ఏనుగులు, సింహాలు, వివిధ మృగాలు, పూర్ణకుంభం అతి సహజంగా మలచబడ్డాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ చిహ్నంగాస్వీకరించబడినది యీ పూర్ణకుంభమే. ఇవేగాక వివిధ నాట్యభంగిమల్లో చెక్కబడ్డ పలువురునృత్యకాంతలు వివిధవాయిద్యాలతో మనోహరంగా కనిపిస్తారు. సభతీర్చిన బుద్ధుడు, శ్రద్ధతో వింటున్నభక్తులు గల ఫలకం మనల్నికూడా శ్రద్ధాళువుల్నిచేస్తుంది.

ఈ అమరావతి ఒకనాటి ఆంధ్రరాజధాని ధాన్యకటకం _ అదే ధరణికోట. ఇక్కడి కళాఖండాలు లండన్ మ్యూజియమ్‌లోకి కొన్ని, మద్రాసు మ్యూజియమ్‌లోకి కొన్ని, కలకత్తా మ్యూజియమ్‌లోకి కొన్ని తరలించబడ్డాయి. మిగిలిన శిల్పాలను శిథిలమైపోతున్న స్థూపంనుండి తొలగించి ప్రక్కనే మ్యూజియమ్‌లో అమర్చారు చూపరులదర్శనార్థం. ఈ శిల్పం ఆంధ్రశాతవాహనరాజుల గారాలబిడ్డ. తెలుగుశిల్పాల రత్నకిరీటానికి కలికితురాయి.

"మూడువందల యేడుల మోఘతపము చేసి
సృష్టించిరీ స్థూపశిల్ప కృతులు
సిద్ధహస్తులు మన తెల్గు శిల్పివరులు
తమ కళాశక్తులన్నియు ధారబోసి"

అని శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులుగారు తమ 'అమరావతి' కావ్యంలో ప్రస్తుతించారు. ఈ శిల్పాలు క్రీ. పూ. 2వ శతాబ్దినుండి క్రీ. శ. 1వ శతాబ్దివరకూ మూడు శతాబ్దాలపాటు చెక్కబడ్డాయట.

## నాగార్జునకొండ

ఇక్ష్వాకులకాలంలో నాగార్జునుని ప్రోత్సాహంతో తెలుగు శిల్పులు చెక్కిన చక్కనిశిల్పాలకు కాణాచి యిది. అమరావతికి అనుంగుసోదరి,

అక్కడవలె యిక్కడకూడా బుద్ధుని వివిధగతి రూపాలు, జాతకకథలు దేదీప్యమానంగా చెక్కబడ్డాయి. ఈనాటికీ సకలసౌందర్యవిలసితాలై చూపరులను చకితుల్ని చేస్తున్న యీ శిల్పాలుచెక్కిన ఆ మహా తపస్వియైన ఆంధ్రస్థపతి యెవ్వరోగదా !

"ఈ నల్లని రాలలో ఏ కన్నులు దాగెనో,!
ఈ బండల మాటునా ఏ గుండెలు మోగెనో !"

## రామప్పగుడి

కాకతీయరాజులు శిల్పకళాప్రియులు. తెలంగాణాలోని రామప్పగుడి, ఓరుగల్లుకోట, హనుమకొండలోని వేయి స్తంభాల మండపం వీరి ఉత్తమ కళాపోషణకు తార్కాణాలు. హైందవశిల్పం అద్భుతంగా పెంచి పోషించబడింది వీరిహయాంలోనే. వానిలో రామప్పగుడిలోని శిల్పచాతుర్యం కళాకారుణ్ణి కదిలిస్తుంది. రచయితను ఉద్రేకపరుస్తుంది. నాట్యరాణులను నర్తింపజేస్తుంది. సామాన్యుణ్ణి చకితుణ్ణి చేస్తుంది. దేశప్రసిద్ధిగన్న బేలూరు, హొయసల శిల్పాలు చెక్కిన అమరశిల్పిజక్కన్నకు సమఉజ్జీ ఈశిల్పి. ఇందలి నాట్యకత్తెల సౌందర్యం వర్ణనకు అందనిది. నిలువెత్తు విగ్రహాలు, స్తన జఘన లావణ్యం రమణీయం - సర్వాంగసుందరం. వీరి నృత్యరీతులు, శివతాండవం చూపరులను పులకింపజేస్తాయి. అత్యంతసుందరమైన నగ్ననాగినిప్రతిమ ఓ ప్రత్యేకత. నందివిగ్రహం కనులకు విందు. స్తంభశిల్పానికి విస్తుపోవలసిందే. ఇవి ఆంధ్రశిల్పానికి కీర్తి స్తంభాలు. వీనిలో మననీడలు కనిపిస్తాయి. ఆంధ్రసంస్కృతికి, ఆంధ్రశిల్పకళానైపుణ్యానికి రామప్పదేవాలయశిల్పాలు మణిదీపాలు.

## ఓరుగల్లు

ఇదే నేటి వరంగల్లు. ఇక్కడి కోట, కోట ద్వారాలు, ద్వార తోరణాలు తెలుగుశిల్పకళామతల్లికి ఆభరణాలు. కోటలోని నంది కాకతీయుల కళాతృష్ణకు నికషోపలం.

"ఓరుగల్లున వీరలాంఛనముగా పలు శస్త్రశాలలు నిల్పినారు" అని ఆంధ్రపౌరుషప్రశస్తిలో తెలిపిన శస్త్రశాలలు కాలగర్భంలో కలిసిపోయినా కాకతీయుల పౌరుషప్రతాపాలకు ప్రతీకలుగా శిలల్లో మలిచిన సింహాలూ, ఏనుగులూ యిప్పటికీ దర్శన మిస్తూనే ఉంటాయి.

ఇక్కడకు దగ్గరలోనేగల హనుమకొండ వేయిస్థంభాల మండపం తెలుగుశిల్పసరస్వతికి కంఠాభరణం.

## అలంపురం

కర్నూలుకు 20 మైళ్ళదూరంలో తెలంగాణాలోగల యీ ఊరి జోగులమ్మగుడి చరిత్రప్రశిద్ధమైనది. బాదామి చాళుక్యుల కాలంలో క్రీ. శ. 6వ శతబ్దిలోవెలసిన ఆలయమిది. గుడిలో అడుగడుగునా గూళ్ళలో అనేక ప్రతిమలు అమితాశ్చర్యాన్ని కలిగిస్తుంటాయి. ఇక్కడి ఆలయాలలో నవ బ్రహ్మలు, జోగులాంబ, బాలబ్రహ్మేశ్వరస్వామి, గణపతి, వీరభద్రుడు, శివుడు, చతుర్ముఖ బ్రహ్మలు శిల్పి చాతుర్యానికి మచ్చుతునకలు. ఆలయ కుడ్యాలపై రకరకాల జంతువులు, మానవ మిధున ప్రతిమలు, దశావతార ములు, గరుడ, గంధర్వ, కిన్నెర, కింపురషాదులు మనోహరములు. మహిషాసుర మర్దిని, నటరాజు, నందిప్రతిమలు నయనానందకరములు. ఇక్కడ ప్రత్యేకంగా శిరస్సులేని దిగంబరభూదేవి యోనిదర్శనం గొడ్రాళ్ళకు సంతానప్రాప్తి కలిగిస్తుందని ప్రతీతి.

## లేపాక్షి

"లేపాక్షి బసవయ్య లేచి రావయ్య" రాయలసీమలో రమణీయ శిల్పాన్నిచిందిస్తున్న చోటిది. అనంతపురంజిల్లా ఇందుకూరుతాలూకాలో యిది కుగ్రామమైనా కళావైశిష్ట్యంతో పెద్దపట్టణాలకులేని ప్రశస్తిపొందింది. ఇరవయ్యేడడుగుల పొడవు, పదిహేనడుగుల ఎత్తుగల బసవయ్య సాలం కృత వీకరాతి విగ్రహం విజయనగరంరాజుల కళాప్రియత్వానికి అద్దంపడు తుంది. ఇక్కడి పూర్ణపురుషుడు, పద్మినీజాతిస్త్రీ ప్రతిమలు శిల్పకళాదంగా వికే వజ్ర కిరీటాలు.

## సింహాచలం

కళింగాంధ్రలో విశాఖకు 9 మైళ్ళదూరంలో కొండమీదవెలసిన పుణ్యక్షేత్రమిది. కళింగాంగగంగుల ఆదరణతో ఆవిర్భవించిన అద్భుతశిల్పం యీగుడిలోనిది గుడిలోనిదేవుడు వరాహనరసింహస్వామి నిత్యచందనాలం కృతుడు. ఇక్కడిశిల్పాలలో విశేషంగాకనబడేవి వివిధబంధనాలలో మైధున ప్రతిమలు. చతుష్షష్టికళల్లో రతికూడ ఒకకళగాభావించిన పూర్వులు శిల్పంలో కూడా దీనికి స్థానంయిచ్చి ఆనందప్రదంచేశారు. ఇవి జీవకళామూర్తులు. హిరణ్యకశిపుని పొట్టచీల్చుచున్న ఉగ్రనరసింహమూర్తి, వరహావతార రూపం శిల్పాలు చూసేమనిషిని నిలేస్తాయి. అన్నిటికీమించి యిక్కడి శిలా మండప స్తంభాలమీది శిల్పం అత్యంతమనోహరం. వీనిపై దశావతారాలూ, భిన్న నరసింహమూర్తులూ, సుందరాంగుల నాట్యముద్రలూ, లతలూ నేత్ర పర్వం. రధమండపానికికూర్చిన అశ్వాలు మనహృదయాలలో శాశ్వత ముద్ర వేసుకుంటాయి. కళ్యాణమండపం 84 స్తంభాలతో నిర్మించారు. ఈ స్థంభాలుమ్రోగిస్తే సరిగమలుపలుకుతాయంటారు. శిల్పిఎంతమర్మజ్ఞుడోమరి!

## దాక్షారామ

చాళుక్యుల అండదండలతోనిర్మించబడిన భీమేశ్వరాలయంలో శిల్ప ప్రత్యేకతకంటె రాతి కట్టడపుపని, గోపురప్రాకారాలు, వివిధ దేవతల ఉనికీ, మనికీ చూడవలసిందే. ఈగుడి దేవతలు ఒక్కరాత్రిలో కట్టేరని జనశ్రుతి- అంటే యిది దేవతానిర్మాణంలాగుంటుందన్నమాట. ఇందులోని భీమేశ్వర లింగం రెండు నిలువులఎత్తువుంటుంది. ఈపాటి నిడివిలింగం తంజావూరు బృహదీశ్వరాలయంలోనూ, అమరావతి అమరేశ్వరాలయంలోనూ మాత్రమే కనిపిస్తుంది పైగా ఇది ఒకపైపు తెలుపు, ఒకవైపు నలుపు. నలుపు భాగం ఈశ్వరుడనీ, తెలుపుభాగం పార్వతి అనీ, అర్ధనారీశ్వర లింగంగా గుర్తించబడింది. అందుకే అభిషేకజలం నలుపు వైపే వెడుతుందట. (ఈశ్వరుని పైపు)

## శ్రీశైలం - కాళహస్తి

"శ్రీశైలం శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అంటారు. ముక్తి మాట ఎట్లావున్నా యిక్కడిశిల్పకళకు ముగ్ధులుకాని వారుండరు.

కాళహస్తిగుడిలో ప్రవేశించగానే ఏదో అలౌకికానందం కలుగుతుంది ఆ మండపాలూ, ఆ స్తంభాలూ ఆ కట్టడాలూ మనఊహాల్ని ఎక్కడికో తీసుకుపోతాయి. ఇక విజయవాడదగ్గరగల ఉండవిల్లి గుహలలోని శేషశాయి విగ్రహంకూడా చూడదగ్గ విశేషమే. నిజానికి తెలుగునాట నలుమూలలా పల్లెల్లో కనిపించే పోతురాజులూ, పోలేరమ్మలూ చాలావరకు మన ప్రాచీన శిల్పసంపద అవశేషాలే.

ప్రపంచప్రఖ్యాతిబడసిన మహాబలిపురం ఏకశిలారథాలు, అజంతా గుహల ఆదినిర్మిత అద్భుతశిల్పాలు, హంపీవిజయనగర మహోన్నత రాతిప్రతిమలు, సాంచీస్థూప ద్వారతోరణాలు, కోణార్కం, భువనేశ్వరాల జీవశిల్పకళామూర్తులు ఆంధ్రశిల్పుల ఉలి మెరుగులే. ఇంత కళానైపుణ్యం చిందించిన యీ మహాశిల్పులు ఎవరు ? వారి నామరూపాలేమి ? అంతా అజ్ఞాతమే. అందుకే యివి దేవతల నిర్మాణాలని కథలు వింటుంటాం. నిజానికి పేరుకాశించని మానవదేవతలు వీళ్ళు. మహాకవి శ్రీశ్రీ "తాజమహలు నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?" అన్నదానిలోని కూలీలు యీ అజ్ఞాత శిల్పులే. అసలు తాజమహలు నిర్మించిందికూడా తెలుగు శిల్పులేనట. జాషువాగారు యీ విషయాన్ని తమ "తాజమహలు" ఖండకావ్యంలో యిలా వివరించారు.

"మగని బొమ్మన కుంపటి రగులబెట్టి
కాయము త్యజించెనే మొగలాయిరాణి
తెలుగు శిల్పుల పనివానితనము నొకటి
కుప్పవోయింప వలె ననుకొనియెనేమొ !"

తూర్పుగోదావరిలో ద్రాక్షారామ దేవాలయంలోనేగాక సామర్లకోట దగ్గర భీమవరం, సర్పవరం, బిక్కవోలు మొదలగు గ్రామాలలోగల గుడులలోకూడా అపురూపమైన శిల్పకళాసంపద వెల్లివిరుస్తోంది.

పైకి కనిపించే యివేగాకుండా భూగర్భంలో యింకా ఎన్ని కళాఖండాలు దాక్కున్నాయో ! త్రవ్వకాలలో వెలికితీయించి ప్రదర్శనశాలల్లో పదిలపరచుట పురావస్తుశాఖవారి విధి. ఈ శిలాప్రతిమలెన్నో పర పరిపాలనలో పరదేశాలకు తరలింపబడ్డాయి. స్వాతంత్ర్యానంతరం వీవి గిరాకీ

మరింత పెరిగి చోరులచేత సత్కరించబడి విదేశాలకు రహస్యంగా రవాణా కాబడుతున్నాయి. దీనినరికట్టి ఇతరదేశాల్లోనూ, ఇతర రాష్ట్రాల్లోనూవున్న మన శిల్పసంపదను తిరిగి తెప్పించుట తెలుగు ప్రభుత్వ కర్తవ్యం.

## జానపద శిల్పం

శిలలతోనూ, మట్టితోనూ, కొయ్యతోనూ చేసే బొమ్మలన్నీ జానపద కళాకారుని సృష్టియే. దేవతా విగ్రహాలు, వాహనాలు, దేవాలయాల మీద మకరతోరణాలు, మిధునప్రతిమలు, ఇతరబొమ్మలు, ధ్వజస్తంభాలు, తులసి కోటలు, సమాధులమీది శిల్పం, పాత్రలమీది డిజైన్లు, వెండి బంగారు ఆభరణముల మీద చెక్కడాలు, ధనికుల భవంతులమీద చెక్కబడేశిల్పాలు జానపదకళాఖండాలే. పల్లెలలో విశ్వబ్రాహ్మణులు, కుమ్మర్లు, కమ్మర్లు, తాపీపనివారు ఈ శిల్పకళాప్రవీణులు.

## చిత్రలేఖనం

ఆదిమానవుడు తనభావాల్ని వ్యక్తంచెయ్యడానికి నాలుగుపద్ధతుల నవలంబించాడు. నోటితోఅరిచాడు, గొంతుతోకూశాడు, చేతితో సంజ్ఞలు చేశాడు. పసరులతో బొమ్మలుగీశాడు. అరుపు సాహిత్యమయింది. కూత సంగీతమయింది. సంజ్ఞ నాట్యమయింది. బొమ్మ చిత్రలేఖనమయింది. ఇవే లలితకళలు. వీనిలో సాహిత్యం, చిత్రలేఖనాల పరస్పర సంబంధాన్నిగూర్చి ఒకకవి యిలాఅన్నారు.

"కవిత్వం మాట్లాడేచిత్తరువు
చిత్తరువు మూగపోయిన కవిత"

ఆదిలో చిత్రలేఖనం ప్రకృతిఆరాధనలో కనిపిస్తుంది. ఆనాటి మానవుని నిత్యజీవితం అడవిజంతువులవేట. అందుకే లేడిని బాణంతోనో, వన్యమృగాన్ని ఈటెతోనో కొడుతున్నఆదిమవాసి, పులితో బాహాబాహిపోరాడుతున్న ప్రాక్తనమానవుడు, వనసౌందర్యాన్ని చూపే వృక్షాలు యివి మన మొదటి చిత్రలేఖనాలు.

వైదికకాలంనాటికి దేవతారాధన వచ్చింది. చిత్రలేఖనంలోకూడా దేవుడిబొమ్మలు రావలసివచ్చింది. అయితే యీదేవుళ్ళనెలా గియ్యడం?

అడవులు, వేట అంటే అవి చూసినవిగనుక చిత్రించారు - ఇవెలాగ ? రాముడెలావుంటాడు ? కృష్ణుడెలావుంటాడు ? నలుపా, తెలుపా ? ఆభరణాలేమిటి ? మెడలో పూలదండా ? పూసలదండా ? చేతిలో ఏముంటుంది ? ఇక్కడే చిత్రలేఖనం సాహిత్యంవైపు చూడవలసివచ్చింది. ఉదాహరణకు సాహిత్యంలో కృష్ణుడిలా ఉంటాడనిచెప్పారు.

"కస్తూరీతిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రేనవమౌక్తికం కరతలేవేణుం కరేకంకణం
సర్వాంగే హరిచందనం చ కలయం కంఠేచ ముక్తావళీం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణీ !"-

ఇలాంటివాటిని పరిశీలించి కృష్ణునిబొమ్మ గీసాడు. ఇలాగే సాహిత్యంనుండి చిత్రలేఖనంసృష్టిజరిగినట్లే అటు చిత్రలేఖనంనుండి కూడా చాలా సాహిత్యసృష్టిజరిగింది.

అనాదినుండి యిలా కవిత్వం, చిత్రలేఖనం పరస్పర ప్రభావాన్ని కలిగి సహచరత్వాన్ని నెరపుతున్నాయి. కారణం ఇవి రెండూ భావప్రధానమే గనుక. రెంటికీ స్థానం హృదయమేగనుక. సింహాన్నిచూస్తే భయపడతాం, సింహంబొమ్మల్నిచూసే ఆనందిస్తాం. అది చిత్రలేఖనంయొక్క గొప్పతనం. ఇది అందరికీ అలవడేదికాదు.

భారతదేశంలో చిత్రలేఖనంగురించిఆలోచిస్తే పూర్వం ఎందరో రాజులూ,రాణులూకూడా యిందులో నిపుణులు, నిష్ణాతులూ అయివుండేవారని తెలుస్తుంది. రాత్రి కలలోకనిపించిన రాకుమారుణ్ణి రాజకుమార్తె ప్రేమించి అతని రూపరేఖావిలాసాల్ని కుంచెతో చిత్రించడం, రాజాతని వెతికితెచ్చిపెళ్ళిచెయ్యడం ఎన్నోవిన్నాం. ఉషాఅనిరుద్ధులకథ యిదేగా, ఆధునికకాలంలో జాతీయ అంతర్జాతీయ ప్రఖ్యాతిబడసిన 'రవివర్మ' (తిరువాన్కూరు రాజు) చిత్రాలలో జీవకళ ఉట్టిపడేటట్టు చిత్రించిన గొప్ప చిత్రకారుడు. రాముని బొమ్మవేస్తే సజీవుడై రాముడు కదలివస్తున్నట్టే. దేవతాపరంగావృద్ధిపొందిన యీచిత్రకళ నవీన ప్రపంచంలో ఒక క్రొత్త మలుపు తిరిగింది. ఈనాడు ఆర్థిక, సాంఘిక, రాజకీయ, కళారంగాలలో పేరుకుపోయిన కాలుష్యాన్ని కడిగివెయ్యడానికి గొప్పఆయుధంగామారింది. ఆ పరిణామమే యీనాటి కార్టూనులు.

# కార్టూనులు

శంకర్ "శంకర్స్‌వీక్లీ" ద్వారా రాజకీయవ్యంగ్యచిత్రాలతో దేశాన్నీ, ప్రపంచాన్నీ కూడా ఊపేశాడు. "తుగ్లక్" పత్రికా సంపాదకుడు "చో రామస్వామి" తనహాస్య వ్యంగ్య కార్టూనులతో తమిళనాట బ్రహ్మాండమైన సంచలనం సృష్టించాడు అప్పుడు కార్టూనుబొమ్మలులేని పత్రికలేలేవు. విషయాన్ని సూటిగా, గుండెలకు హత్తుకునేలాచెప్పేశక్తి దీనికే వుంది. ఒక చిత్రంలో ఆకాశం, నేలనుండి ఆకాశానికి ఎగిసిపోతున్న నక్షత్రాలు, ఆ నక్షత్రాల పొట్టలలో ఒక్కో నిత్యావసరవస్తువులువేశాడు. ధరల పెరుగుదలను వ్యంగ్యంగాచెప్పిన కార్టూనిది.

తెలుగులో అడివి బాపిరాజు, దామెర్ల రామారావు తమతమ చిత్రాలలో ఒకరమణీయతను సృష్టించి చూపరులను ఆనందపుటంచులకు తీసుకుపోయారు. జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'కరుణశ్రీ'కి ఘంటసాల గానంతో ప్రాణంపోస్తే, వడ్డాది పాపయ్యగారు అది చిత్రాలుగాచిత్రించి దానిని పామరజనంలోకికూడా తీసుకుపోయేరు. ఈనాడు సాహిత్యంలో ఆధునిక రీతులుఅని చెప్పుకొనేవానిలో చాలావరకు చిత్రలేఖనంనుండే పుట్టుకొచ్చాయి. అందులోముఖ్యంగా ఇంప్రెషనిజం, సింబాలిజమ్, క్యూబిజమ్, సర్రియలిజం నిజానికి చిత్రలేఖనంనుండే పుట్టుకొచ్చాయి. సహజంగా చిత్రాలు స్వాభావికంగావేస్తారు. అది రియలిజం. ఉదాహరణకు దూరంగాఉన్న ఒకఅడవి చిత్రించాలంటే చెట్లు ఆకుపచ్చ రంగులోనూ, నీడలు నల్లరంగులోనూ చిత్రిస్తారు. ఇది సంప్రదాయం - కాని ఇంప్రెషనిజంలో ఆ చెట్లను ఎరుపురంగులోనూ, నీడలు నీలిరంగులోను చిత్రిస్తారు. కారణం-దూరానికి అడవి అలా కనిపిస్తుంది కనుక. ఇక్కడవాటి అసలు ఆకారంకాదుకావలసింది, అవి మనకంటికి ఎలా కనిపిస్తాయో అనేది. ఇక 'క్యూబిజానికి' 'పికాసో' నాయకుడు. నీగ్రో కళ ప్రభావంతో వెలువడిన ఉద్యమం యిది. ఇందులో దృశ్యాన్ని కోణాకృతులుగా విడదీసి చిత్రిస్తారు. ఒకపెద్దరాయి వేస్తాడు. ప్రక్కనే ఒకచిన్నరాయి వేస్తాడు. అంటే అవి తల్లీ పిల్లలన్నమాట. రెండూ సమానమైన రాళ్ళువేస్తే ప్రేయసీప్రియులన్నమాట. 'సర్రియలిజం' ఫ్రాయిడ్ మనోవిశ్లేషణనుండి ఉదయించిన ఆలోచనాసరళి. నాలుగు

గీతలూ అనేకవంకరలతో గీస్తాడు. అది హృదయస్పందనాన్ని తెలుపు తుంది. 'సింబాలిజం' అంటే ప్రతీకవాదం. ప్రపంచంలో బలవంతులు బల హీనుల్ని ఎలాకబళించివేస్తున్నారో చెప్పడానికి గోడమీద బల్లిచే తినబడు తున్న పురుగులు వేస్తారు. బల్లి బలవంతునికీ పురుగులు బలహీనులకీ ప్రతీకలు. బొమ్మల భాష అని మరోరకంపద్ధతివుంది. "కొండపిల్లి భాస్క రుడు" అనే వ్యక్తి పేరు వ్రాయడానికి బదులు కొండ, పిల్లి, సూర్యుడు బొమ్మలు వేస్తున్నారు. అన్ని కళలలోలాగే యిందులోకూడా అస్పష్టత చోటుచేసుకున్న చిత్రాలు లేకపోలేదు. అలాంటివాటిమీద ఒకజోక్‌కూడా వుంది. ఒకాయన బొమ్మగీశాను చూడమన్నాడట. చూసే ఆయన ఏమిటిది? అన్నాడట. ఆవు గడ్డితినడమన్నాడట గడ్డేది ? అన్నాడట ఆవు తినేసిం దన్నాడుట. ఆవేది ? అన్నాడుట. తినేసి వెళ్ళిపోయింది అన్నాడుట.

ప్రస్తుతం ఆంధ్రదేశంలో బాపు, బాలి, చంద్ర, గోలిశివరాం మొద లగు ప్రఖ్యాతచిత్రకారులు తమ కార్టూన్‌లతోనూ, రేఖాచిత్రాలతోనూ చిత్ర రంగాన్ని సుసంపన్నంచేస్తున్నారు. ఇందులో బాపూ "స్కూల్ ఆఫ్ థాట్" ఒక ప్రత్యేకబాణీ; అక్షరాలు సుంద్రంగా వ్రాసే దశనుంచి వంకరటింకర అక్షరాల దశకు మళ్ళింది.

ఏ కళఅయినా సమాజానికి అద్దంపట్టి చూపాలి. సంఘంలో గల అత్యాచారాలు, అనాచారాలు అరికట్టాలంటే దానికి చిత్రలేఖనమే గొప్ప ఆయుధం. ఈనాడు సమాజంలో దెయ్యాలు వేదాలు వల్లిస్తున్నాయి. నీతి అవినీతిని వెక్కిరిస్తోంది. ధర్మం అధర్మానికి దణ్ణం పెడుతోంది. వినాయకులు పందికొక్కులై గాది క్రిందే మెక్కేస్తున్నారు. ఈ అన్యా యాలూ, అక్రమాలు చిత్రాల్లో ప్రతిబింబించాలి. నేడు గీయవలసిన చిత్రాలు రాజులు, రాణులు, వారి ఆభరణాలూకాదు. సమాజంలో పతితలు, భ్రష్టులు బాధాసర్పదష్టులు, దీనులు, హీనులు, కూడులేని గూడులేని పక్షులు, భిక్షులు, వారి జీవితాలను, మేడలమీద మేడలు, అంతస్తులమీద అంతస్థులు కట్టేస్తూ విలాసాల్లో కులాసాల్లో కులుకుతున్న శ్రీమంతుల క్రీడలు, ఆగడాలు - తినడానికి తిండిలేక మలమల మాడిపోతూ పుల్లిస్తరాకుల్లో ఎంగిలిమెతుకులకోసం కుక్కలతో సమానంగా పోరాడుతున్నమానవులు కామంధైపులో కళ్ళుమూసుకుపోయి నడిరోడ్డుమీద యిల్లాళ్ళను చెరుస్తున్న

కీచకాధములు నేటికళాకారుని కుంచెనుండి వెలువడవలసిన దృశ్యాలు. శ్రీశ్రీగారన్నట్లుగా "నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చా" నన్నట్లు అప్పుడే కొందరు చిత్రకారులు యీ ఉద్యమానికి అంకితమై కృషి చేస్తుండడం హర్షణీయం.

## జానపదచిత్రలేఖనం

జానపదులలో ముచ్చువారు అనే ఒక తెగవారున్నారు. వీరు అమ్మవారి విగ్రహాలకు కుంచెలతో, వివిధరంగులతో ప్రసన్నరూపం గాని, భీకర రూపంగాని, వరద, అభయ ముద్రలలోగాని చూపరులకు అచ్చెరువుకలిగేలా రూపురేఖలుదిద్దుతారు. వీరి ఏకాగ్రత, పవిత్రత, ఆత్మశుద్ధి ఈ బొమ్మలను సజీవమూర్తులుగా చిత్రీకరింపచేస్తాయి.

పెండ్లిసమయాలలో కుమ్మర్లు అవిరేడుకుండలపై వివిధరంగులతో చిత్రించేబొమ్మలుకూడా జానపదహృదయరంజకచిత్రలేఖనాలే.

మనం నిత్యంచూసే చీరలమీది అద్దకాలు పని (కలంకారి) జానపద చిత్రకారునికళానిపుణతకు అద్దంపడతాయి. అలాగే చీరలనేతలో కరక్కాయంచు, కాకరకాయంచు, మామిడిపిందెలు వగైరా అద్భుతంగా రూపొందిస్తారు నేతపనివారు.

"పచ్చబొట్టూ చెరిగి పోదూలే నారాజా"—

అన్నిటినీమించి జానపదుల పచ్చబొట్టు విచిత్రచిత్రలేఖనం. ప్రాచీనకావ్యాలలోకనిపించే మకరికాపత్రరచన ఇదే. ఈ పచ్చబొట్టు జానపదులు చేతులమీద, కాళ్ళమీద, వీపుమీద, ఆనందంగా పొడిపించుకుంటారు. అందులో సీతారాములు, రాధాకృష్ణులు, గణపతి, ఆంజనేయుడు, వెంకటేశ్వరస్వామి వంటి దేవతలబొమ్మలు, కళ్యాణంబొట్టు, ముగ్గులు, చేప, సింహం వంటి ఇష్టమైనబొమ్మలు వేయించుకుంటారు కొందరు స్త్రీలు తమ భర్తపేరుగాని, శ్రీరాములు అనిగాని పచ్చబొట్టు పొడిపించుకుంటారు. ఈ పచ్చబొట్టు వాతనొప్పులకు మందుగాకూడా ఉపయోగపడుతుందట. సూదిని మెల్లమెల్లగా గుచ్చుతూ బొమ్మనుగాని, అక్షరాన్నిగాని రూపుదిద్ది దీనికి ఉద్దేశించిన పసరుతో ఆ రంధ్రాల్ని నింపుతారు. కొంతసేపటికి ఆ పసరులోనికిఇంకి

బొమ్మ పచ్చగాకన్పిస్తుంది. ఎక్కువమంది ముఖంమీద బొట్టుగా వేయించు కుంటారు. అందుకే దానిని పచ్చబొట్టు అంటారు ఇది శాశ్వతమైనది. తుడి చినాపోదు చెరిపినా చెరగదు. ఆషాఢమాసంలో చేతులకు స్త్రీలు పెట్టుకొనే గోరింటాకు కూడాచిత్రకళసంబంధితమే. అరిచేతిమీద వీరు పద్మరూపం లోనూ, కలువ రూపంలోనూ, అర్ధచంద్రాకృతిలోనూ వివిధమగు చిత్రాలు అద్భుతంగావేస్తారు. ఇవేగాక రోడ్లపైన మసిబొగ్గతో వేంకటేశ్వరస్వామి, ఏసుక్రీస్తు, ఆంజనేయస్వామివంటి బొమ్మలుగీస్తూ పిచ్చివాడిలా కనిపించే కళాకారుడుకూడా జానపద చిత్రకారుడే.

ఇక పెండ్లిండ్లకు, పండగలకు పల్లెపడుచులు యింటిముంగిళ్ళలోనూ, వాకిళ్ళలోనూ, వీధుల్లోనూ తీర్చిదిద్దే రంగవల్లులు జానపదచిత్రకళకుపట్టే నీరాజనాలే. ఈ ముగ్గుల్లో పువ్వులు, ఆకులు, లతలు, చెట్లు, దేవాలయాలు, రథాలు, సూర్యచంద్రాదులు, చిలకలు, పక్షులు మొదలగు ప్రకృతిసంబంధిత రూపములు పచ్చ, నీలం, పసుపు వగైరా రకరకాల రంగులతో మనోహరంగాతీర్చిదిద్దుతారు. తోలుబొమ్మలాటలవారు తయారుచేసే బొమ్మలు కూడా జానపదకాళాకారుని ప్రావీణ్యతను బయటపెట్టే సృష్టి. ఇందు అతని చిత్రలేఖనానైపుణ్యం అద్భుతం అని చెప్పాలి.

## సంగీతం

సృష్టికిముందు నాదంపుట్టింది. అదే "ఓం అనే ప్రణవం. Silence is un-natural to man" అంటాడు 'లిండ్'. అంటే మనిషి నిశ్శబ్దాన్ని భరించలేడన్నమాట. అందుకే అర్ధరాత్రి మనిషికిభయం. మానవుడు ఆదినుండీ సుఖ, దుఃఖ, భయ, సంతోషాలతో నవ్వాడు, ఏడ్చాడు, అరిచాడు, పిలిచాడు; ఈ శబ్దాల ఆరోహణావరోహణ క్రమస్వరూపమే సంగీతమయింది. మానవుడేకాకుండా ప్రకృతిలో ప్రతిజీవి శబ్దంచేస్తుందని ఈమధ్య శాస్త్రజ్ఞుల పరిశోధనలలో బయటపడింది. జంతువులఅరుపులు, పిట్టల కూతలు. క్రిమికీటకాలుచేసే శబ్దాలు అందరికీ వినబడేవే, కాని వృక్షాలుకూడా సంగీతం పాడతాయనీ, వింటాయనీ వృక్ష శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

ఇందులో విజ్ఞానవంతుడైన మానవుడు ఈ కూతలను, అరుపులను, ధ్వనులను, శృతిబద్ధంచేసి సప్తస్వరాలుగా స్వీకరించాడు-అవే సరిగమలు. సప్తస్వరాలు అంటే ఏడుస్థాయిలలో వినిపించే నాదభేదం. వీనికి షడ్జమం, రిషభం, గాంధారం, మధ్యమం, పంచమం, దైవతం, నిషాదం అని పేర్లు. ఈ పదాల మొదటిఅక్షరాలే "సరిగమ పదని" అనేవి. ('ష'కు బదులు సరళ ఊష్మం 'స' వాడారంతే) షడ్జమం అంటే నెమలికూతా, రిషభం అంటే వృషభధ్వని, గాంధారం అంటే చింబోతు (మేకపోతు) అరుపు, మధ్యమం అంటే క్రౌంచపక్షి లేక బాతు పలుకు, పంచమం అంటే కోకిలరవం, దైవతం అంటే గుర్రపుసకిలింపు. నిషాదం అంటే ఏనుగుఘీంకారం. ఇవి నాభి హృత్కంఠ రస నాసాదులయందు ఉద్భవిస్తాయి.

ఈ స్వరాల ఆరోహణ అవరోహణక్రమాల భిన్నత్వాన్నిబట్టి రాగాలు ఏర్పడ్డాయి. ఉదాహరణకి 'సరిగమ పదనిస, సనిదప మగరిస' అనే స్వరం 'మాయామాళవగౌళ' రాగం అనీ, 'సరిగ పదసా సదపా గరిసా' అనే స్వరగతిని "మోహన" రాగం అనీ యిలా స్వరభేదాన్నిబట్టి వివిధ రకాలుగావిభజించి వివిధరాగాల పేర్లుపెట్టారు. బాగాఆలోచించి చూస్తే చాల వరకు ఈ రాగాలపేర్లు ఆ స్వరం ప్రసిద్ధిపొందిన ప్రాంతం పేరుమీదో, ఆ రాగంఉండే గుణం పేరుమీదో, లేక ఆ రాగాన్ని సృష్టించిన వ్యక్తి పేరు మీదో ఏర్పడినట్టు కనిపిస్తుంది. ఉదాహరణకు భూపాల, (నేటిభోపాల్) కాంభోజ, (కంబోడియా/కంపూచియా) గాంధార, (ఆఫ్ఘనిస్తాన్‌లోని కాందహార్) కన్నడ అనేవి భారత ఇతర దేశాల్లోని కొన్ని ప్రాంతాల పేర్లు. మోహన, హంసధ్వని, కామవర్ధని, మేఘరంజని అనేవి గుణముల పేర్లు, కళావతి, రత్నాంగి, కనకాంగి, నీలవేణి, కళ్యాణి అనేవి వ్యక్తుల పేర్లు. విశిష్టవ్యక్తులమీది గౌరవంతో రాగాలకు ఆయా వ్యక్తులపేర్లుపెట్టడంకూడా కద్దు. ఈ మధ్య శ్రీమతి ఇందిరాగాంధీ పేరుమీద "ప్రియదర్శిని" అని క్రొత్తరాగాన్ని సృష్టించడం మనందరికీ తెలిసిందే. ఈ రాగాలు స్థితిప్రేరకాలు, రసప్రవాహకాలు. ముఖారి, సావేరి, అసావేరి, శహనావంటి రాగాలు విషాదాన్ని ఒలకబోస్తే, భైరవి, శ్రీరాగం, అఠాణాలాంటివి కోపాన్ని, ఉద్వేగాన్ని ప్రస్ఫుటింపజేస్తాయి. కళ్యాణి, మోహనలాంటివి ఆనందాన్ని, సంతోషాన్ని వ్యక్తీకరిస్తే, ఆనందభైరవి, శ్యామ వంటివి శాంతభావాన్ని ఉద్దీపింపజేస్తాయి.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయం" అన్నారు పెద్దలు. దీనికోసం వారు ఒకవేదాన్నే సృష్టించారు. "సామవేదసారము సంగీతము సాహిత్యమేగా!" సామవేదంలో సంగీతమర్మాలన్నీ వివరించబడ్డాయి. ఆధునిక సంగీతదృశ్యకావ్యమైన "శంకరాభరణం" లోని "అద్వైతసిద్ధికి అమరత్వ లబ్ధికి గానమె సోపానము....," అనేమాట అక్షరసత్యం. త్యాగరాజాదులు గానంతోనేగా తరించారు! ప్రపంచంలో కుల మత వర్ణ వర్గ భాషా భేదాల కతీతమైనది సంగీతం. మొత్తం ప్రాణికోటిపై దీని ప్రభావం అపారం. 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసంఫణిః.' శిశువులూ, పశువులూ, పాములూ కూడా సంగీతానికి పరవశిస్తాయట. నిజమే. "జో అచ్యుతానంద జోజో ముకుందా" అని జోలపాడితే పరవశించి పసిపాప తల్లి ఒడిలో నిదుర పోతుంది. కృష్ణుని మురళీరవాన్ని పశువులు పరవశించివినేవని పురాణాలు చెబుతున్నాయి. నాగస్వరం ఊదుతుంటే నాగుబాము పడగవిప్పి ఆడటం మనం చూస్తూనేఉన్నాం. ఈమధ్య పరిశోధకులుచెబుతున్న కొత్తవిషయం ఏమిటంటే సంగీతంవినిపిస్తుంటే పశువులు పాలెక్కువిస్తున్నాయట, పంటలు బాగా పండుతున్నాయట. ఈ రాగాలతో ఎన్నో రోగాలుకూడా పోగొట్ట వచ్చునంటున్నారు పాట్నాకు చెందిన డాక్టర్ వింధ్యాచర్ త్రిపాఠీ. అయితే అవి (ఆరేసుకోబోయి పారేసుకున్నాను లాంటి పాటలు కాకపోవచ్చు) ఎన్నికచేసిన చక్కని సంగీతం ద్వారా అనేకరోగాలను నయంచేయవచ్చు నని ఈ రాగాల డాక్టరు పరిశోధనలో తేలిందట. ప్రపంచంలో గాలిపీల్చని ప్రాణి లేనట్లే కూనిరాగంతీయని మానవుడు ఉండడు. దీనికి అనురక్తుడు కానివాడెవడైనా ఉంటే అతడు జడముతో సమానమన్నారు మహాకవి 'షేక్స్పియర్' "మర్చంటాఫ్‌వెన్నీస్" నాటకంలో.

నిబద్ధ సంగీతమని, అనిబద్ధ సంగీతమనీ సంగీతం రెండువిధాలు. ఈ నిబద్ధసంగీతాన్నే శాస్త్రీయసంగీతమనిపిలుస్తారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశంలో ఉధృతంగాసాగుతున్నసంగీత స్రవంతిని నాలుగురకాలుగా విభజించవచ్చు.

1. శాస్త్రీయ సంగీతం, 2. లలితసంగీతం, 3. ప్రాశ్చాత్య సంగీతం, 4. సినిమా సంగీతం.

# శాస్త్రీయ సంగీతం

ఇది మరల కర్ణాటకసంగీతం హిందూస్తానీసంగీతం అని రెండు పాయలుగా ప్రవహిస్తోంది. దక్షిణాదిరాష్ట్రాలవారి బాణీ కర్ణాటక సంగీతం. ఉత్తరాదివారి బాణీ హిందూస్తానీ. సంగీతంలో స్థాయీ భేదాలు మూడు. దీనినే 'త్రిస్థాయి' అంటారు. మందరం, మధ్యమం, తార. మందరానికి హృదయం, మధ్యమానికి కంఠం, తారకు మూర్ధము స్థానాలు. "శృతిలేని పాట మతిలేని మాట" అని సామెత. దీనినిబట్టి సంగీతంలో శృతికి ప్రాధాన్యమెంతటిదో గ్రహింపవచ్చు. ఈ శృతిని సాధనచేసే ఉపకరణాలు స.ప.స.లు. ఇవిషడ్జమం 'స', పంచమం 'ప', తారస్థాయి "స"లు.

శాస్త్రీయసంగీతానికి స్వరం ప్రాణం, రాగం దేహం. సంపూర్ణస్వరం కలిగిన రాగాలను "మేళకర్త" అంటారు. వీనిలో సరిగమ పదనిసలు పూర్తిగాఉంటాయి. ఈ మేళకర్తలు 72. మామూలుభాషలోచెప్పుకోవాలంటే ఇవి మూలరాగాలన్న మాట. వీనినుంచి కొన్ని స్థాయిలులోపించి ఉద్భవించినవానిని జన్యరాగాలంటారు. అంటే వీనిలో స రి గ మ ప ద ని స లు అన్నీ వుండవు. ఉదాహరణకు "స రి గ ప ద సా, స ద ప గ రి సా" అనే మోహనరాగంలో "మ" "ని"లు లుప్తం. అందువల్ల ఇది జన్యరాగం. దీనికి "మేళకర్త" హరికాంభోజి. ఈ జన్యరాగాలు లెక్కకుమిక్కుటం - కాని వాడుకలోఉన్నవి యించుమించు వందలోపుమాత్రమే. శాస్త్రకారులు యీ సంగీతంలోని గీతాలనూ, వానిలోని స్థితిగతులనుబట్టి స్థూలంగా పిళ్ళారీ గీతాలు, వర్ణాలు, కృతులు, కీర్తనలు, పదాలు, అష్టపదులు, జావళీలు అని విభజించారు.

# సరళీ స్వరాలు

సరళీస్వరాలలో సాహిత్యముండదు. పూర్తిగా స్వరసంచారమే. స్వరసంచారమంటే ఆ రాగంలో ఉండే స్వరాన్ని పైనుంచి క్రిందికి, క్రింది నుంచిపైకి భిన్నగతులలో ఆలాపనచేయడం. ఉదాహరణకు "సరిగమ సరిగమ సరిగమ పదనిస సనిదప సనిదప సనిదప మగరిస".

## పిళ్ళారీ గీతాలు

పిళ్ళారిగీతాలలో స్వరం సాహిత్యంలో ప్రవేశిస్తుంది. ఉదాహరణకు, "సరిమాగరి సరిగరిస" అనే స్వరానికి 'లంబోదర లకు మికరా' అనే పాట కూర్చారు. ఇవి ఎక్కువ గణపతి పరంగానే వ్రాసినవి గనుక వీనిని పిళ్లారీ గీతాలన్నారు. "పిళ్ళారి" అంటే గణపతి.

## వర్ణాలు

వర్ణాలలో పల్లవి, అనుపల్లవి, చరణం, స్వరం ఉంటాయి. ఇవి శృంగారరస ప్రధానంగా వ్రాసినవి. అందువల్ల మేజువాణీల్లో ఎక్కువ వాడేవారు. "సామినిన్నేకోరి చాలా మరులుకొన్నదిరా" వంటివి వర్ణాలు.

## కృతులు

కృతిలో ప్రక్రియ అంతా వర్ణంలాగే ఉంటుంది. భావం మాత్రం భగవంతుని పరంగాఉంటుంది. దీనిగతి సంగతులతోను, గమకాలతోనుకూడి నడుస్తుంది. సంగతులంటే పాడేటప్పుడు మధ్య మధ్య రంజకత్వానికై రాగ తాళాలనుఅనుసరిస్తూనే భావసంపత్తిలో హెచ్చుతగ్గులు చూపడం. గమక మంటే రకరకాలఊపుల్తో వినువారికింపు కలిగించేటట్లు పదాలువిరుస్తూ చేసే విన్యాసం. ముద్దుస్వామి దీక్షితులుగారి "వాతాపి గణపతింభజే" అనేదీ. "సామజ వరగమనా", "మరుగేలరా ఓరాఘవా", "ఎందరో మహానుభావులు" వంటి త్యాగరాజకృతులు దీనికుదాహరణలు.

## కీర్తనలు

కీర్తన పల్లవి, చరణం కలిగి మధురమైన సంగీతరచన కలిగి ఉంటుంది. సాహిత్యం భక్తిప్రధానం. సదాశివ బ్రహ్మేంద్రముగారి "మానస సంచరరే బ్రహ్మణి" అనేది, "పలుకే బంగారమాయెనా" వంటి రామదాసు కీర్తనలూ ఇందుకుదాహరణలు.

## తరంగాలు

భక్తి శృంగార రస ప్రధానంగాఉంటాయి తరంగాలు. ఇందు కృష్ణ లీలలు వర్ణితాలు. నారాయణతీర్థులవారి "కృష్ణలీలాతరంగణి"లోనివన్నీ తరంగాలే. బహుళప్రాచుర్యంపొందిన "బాల గోపాల" తరంగంలోనిదే.

## పదములు

దేవతాసంబంధమై, శృంగారరసప్రధానంగా నాయికా నాయక లక్షణాలకు సంబంధించివుంటాయి పదములు. "ఇంత రావు చేసితే నేనెట్లలోర్తునే ఇంతి" వంటి క్షేత్రయ్య మువ్వగోపాల పదాలు ఇందుకుదాహరణలు. ఘనం శీనయ్యగారి "శివదీక్ష పరురాలనురా" అనే పదం అందరూఎరిగినదే.

## అష్టపదులు

అష్టపదులు శృంగారరస ప్రధానం. ఇందులో అన్నీ చరణాలే. ఇవి ఎనిమిదిపాదాలుగా ఉంటాయి. అందుకే అష్టపది అన్నారు. ఇవన్నీ జయదేవుని "గీతగోవిందం" లోనివి. విద్వాంసులందరినోటా విరివిగావినబడే "చందన చర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ" అనేది ఒక అష్టపది.

## జావళీలు

జావళీలు పదములవలెనే శృంగారరసంతో, నాయికా నాయక లక్షణాలతోనిండి గ్రామ్యభాషాపదబంధం కలిగిఉంటాయి. మనందరికీ చిరపరిచితమైన "మధురానగరిలో చల్లలమ్మబోదు" అనేది జావళీయే.

ఇవిగాక అభ్యాసగతిలో జతిస్వరాలు, స్వరజతులు అనేవి ఉంటాయి. ఇవి పిళ్ళారిగీతాల తరువాత చెబుతాను.

## జతిస్వరాలు

నృత్యానికి అనుగుణంగా జతులుంటాయి. జతులంటే తకిట తకధిమిత తకిట తధికిణతోం" లాంటివి. దీనికే స్వరపల్లవి అని కూడా మరో

పేరు. దీనిలో పల్లవి, అనుపల్లవి, చరణాలుఉంటాయి. సాహిత్యముండదు. కాని ఈమధ్య 'రారవేణు గోపబాల, రాజిత సద్గుణ జయశీల' వంటివి వినవస్తున్నాయి.

## స్వరజతులు

స్వరజతులలో పల్లవి, చరణాలు ఉంటాయి. సాహిత్యముంటుంది. సాహిత్యం భక్తిరసంతోగాని, వీరరసంతోగాని, శృంగారరసంతోగాని నిండి ఉంటుంది. "సాంబశివాయనవే" అనేది దీనికి ఉదాహరణ

ఈ ప్రక్రియలన్నిటికి శ్రుతితోపాటు తాళంకూడా ముఖ్యం. "శ్రుతిర్మాతా లయః పితః" అన్నారు. శ్రుతి తల్లిలాంటిది. లయ తండ్రిలాంటిది. లయ అంటే తాళం. విలంబనకాల ప్రమాణాన్నిబట్టి తాళాన్ని చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణాలని అయిదుజాతులుగావిభజించారు. ప్రతిజాతిలోనూ మరల ధ్రువ, మధ్య, రూపక, జంపు త్రిపుట, అట, ఏక అని సప్త తాళాలుంటాయి. సంగీతసభలలో తాళం చేత్తో ఎడమచేతిమీద వేస్తుండడం, వేళ్ళు ముడుస్తుండడం చూస్తుంటాం - ఒక దెబ్బ చేతిమీద కొట్టి, ఒక దెబ్బ వెనక్కి గాలిలోకి విసిరితే ఆ చేతిమీద కొట్టిన దెబ్బకు "ఘాత" మనీ, గాలిలోనికి విసిరినదానికి "ఉసి" అనీ సంగీతంలో సాంకేతికమైన పేర్లు. తాళాలన్నీ ఈ పరిభాషలోనే తెలుపుతారు ఈ తాళానికి షట్కాలాలు చెప్పబడినా ఇప్పుడు నాలుగుకాలాలలోనే నడుపుతున్నారు. "సరిగమ పదనిస" అనే అక్షరాలునడిపే వేగాన్ని కాలం అంటారు. మొదటి కాలంలో ఒక్కదెబ్బమీద ఒక్కఅక్షరమే నడపబడుతుంది. అంటే ఒకదెబ్బమీద "స", ఒక దెబ్బమీద "రి" ఇలాగన్నమాట. రెండవకాలంలో ఒక దెబ్బమీద రెండక్షరాలూ, మూడవకాలంలో నాలుగక్షరాలూ, నాలుగవ కాలంలో ఎనిమిదక్షరాలూ నడపబడతాయి. అంటే కాలం పెరిగేకొద్దీ స్వరం వేగం పుంజుకుంటుందన్నమాట

శాస్త్రీయసంగీతానికి చాలా సాధనకావాలి. పూర్వం గాయకులు తెల్లవారుజామున గడగడవణికించే చలిలోకుండనిండా చల్లనినీళ్ళుపోసి దానిని కావలించుకుని అకారసాధనచేసేవారట గాత్రసౌలభ్యం కోసం. కొందరు చెరువులలో పీకలోతునీటిలో అభ్యాసం చేసేవారు. ఆకాలంలో "మేఘరంజనీ" రాగం పాడితే వర్షాలు కురిసేవట.

ఒకసారి నారదుడు, తుంబురుడు సంగీతంలో నేను గొప్పంటే నేను గొప్పని పోట్లాడుకుని తీర్పుకోసం ఆంజనేయుడిదగ్గరకు వెళ్ళేరట. ఆంజనేయుడు ఒక రాగంపాడి అక్కడున్న శిలను కరిగించి వారి తంబురనందులో పెట్టి మరోరాగంపాడి మరల శిలచేసివేసి దానిలోంచి ఆ తంబురను తీసుకోమన్నాడట. ఎంత శ్రమపడ్డా అది వారియిద్దరివల్లాకూడా కాలేదట. అంటే సంగీతంలో ఆంజనేయుడు అంత గొప్పవాడన్నమాట. ఈ సంగీతస్వరాల మీద నేటికాలానికిసంబంధించి తమాషా అయిన చెణుకులుచాలావింటుంటాం.

ఒకరాజాగారు ఒకసాని వలలోపడి, రాణిని విస్మరిస్తే ఆ రాణి ఆస్థాన విద్వాంసుడికి మొరపెట్టుకోగా అతడు రాజుమనస్సును సానివైపు నుండి మరల్చి ఆరోజుకచేరీలో రాణికి యీ సమాచారం స్వరం ద్వారా యిలా అందించాడట - "సరి, దానిపని సరి, సాని దాని పని సరి" అని.

ఒకసారి ఒకసంగీతంమేష్టారు ఒకమ్మాయి సంగీతపాఠంచెబుతున్నారట - మాష్టారు "సరిగమ" అన్నారట. ఆ అమ్మాయి "సరిగమ" అందట. మాష్టారు "పద" అన్నారట - ఆ అమ్మాయి "ఎక్కడకీ? ఉండండి మానాన్నతో చెబుతామీసంగతి" అని లేచిపోయి తండ్రిని తీసుకొచ్చిందట.

రాగాలసంగతితెలియని ఒక సినీనిర్మాతతో సంగీతదర్శకుడు "అయ్యా! ఈ పద్యానికి కాఫీరాగం వాడమంటారా?" అన్నాడట. దానికా ప్రొడ్యూసరు "ఇంతడబ్బు నీకిచ్చింది కాఫీరాగాలు వాడమనా? అదేమీ కుదరదు" అన్నాడట.

సంగీతం గాత్రమేకాకుండా వాయిద్యాలమీదకూడా అభ్యసిస్తారు. వయొలిన్, వీణ, సన్నాయి, ఫ్లూటు, మృదంగం, డోలు యిప్పుడు వాడుతున్న శాస్త్రీయసంగీతవాయిద్యాలు. తెలుగువారిలో గాత్రానికి మంగళంపల్లి బాలమురళీకృష్ణ, వీణలో ఈమని శంకరశాస్త్రి, చిట్టిబాబు, వయొలిన్‌లో ద్వారం వెంకటస్వామినాయుడు, మృదంగంలో యల్లా వెంకటేశ్వరరావు, మాండలిన్‌లో మాష్టర్ శ్రీనివాస్ ప్రపంచప్రఖ్యాతి పొందడం తెలుగుజాతికి గర్వకారణం

## లలితసంగీతం

దీనికి శృతిజ్ఞానం, లయజ్ఞానం ఉండేచాలు. కాకుంటే గాయకునికి చక్కని గాత్రంమాత్రంకావాలి. గేయాలు, తత్వాలూ, పాటలూ యిందులో ఎక్కువ కనిపిస్తాయి. హార్మోనియం దీనికి బాగావాడతారు.

## పాశ్చాత్య సంగీతం

పియానో, మేండలిన్, క్లారినెట్, అకార్డిన్, గిటార్, డోలక్, డ్రమ్ములు మొదలగునవి వాద్యాలు. బార్‌లలోనూ, బడా హోటళ్ళలోనూ చిన్ని వెలుతురులో మంద్రస్థాయిలో యిది వినిపిస్తూండడంకద్దు మత్తు మత్తుగాఉండడానికి. దీనిలో ఓ చిత్రమైన ఉత్తేజంవుంది. కేబెరా డాన్సు లకి, డిస్కో-డాన్సులకి, బ్రేక్‌డాన్సులకి ఇది చక్కటిబేగ్రౌండ్. ప్రాశ్చాత్య పద్ధతిలో దీనికీ ఒక మీటరుంది. నేటి యవతరం దీనికే ఎక్కువ ఆకర్షింప బడుతుండడం గమనార్హం. దీని ప్రచారం ప్రపంచవ్యాప్తం.

## సినిమా సంగీతం

చాలావరకు సామాన్యుని రంజింపచేయడమే లక్ష్యంగా కూర్చబడే సంగీతం యిది. అన్నిరకాలవాయిద్యాలూ వాడతారు. కాదేదీ దీని కనర్హం. రాగ మిశ్రిమాలు, తాళ మిశ్రిమాలు, శృతిమిశ్రమాలు కోకొల్లలు. అలా గని దీన్ని తేలిగ్గా కొట్టిపారెయ్యడానికి వీల్లేదు. ఆ కూర్చడంలో ఔచిత్యం కూడా ఉంటుంది. గొప్ప గాత్రమాధుర్యం ఉండేగాని ప్రతివారూ యిందులో పనికిరారు. ఇందు దేశప్రశస్తి పొందినవారు తెలుగువారిలో ఘంటసాల, యస్. పి. బాలసుబ్రహ్మణ్యశర్మ, సుశీల, జానకి మొదలగువారెందరో ఉన్నారు. ఈ సినిమా పాటల అనుకరణతో దేశంలో అనేక మ్యూజిక్ పార్టీలు వెలిశాయి. అందులో రాజమహేంద్రవరం జిత్‌మోహన్‌మిత్రా పార్టీ కాకినాడ గంగాధంపార్టీ, బాజీపార్టీలు రాష్ట్రంలోనే ఎంతో పేరు ప్రఖ్యాతులు పొందాయి.

ఈనాడు దేశంలో నడుస్తున్న కార్యక్రమాన్నిబట్టిచూస్తే బహు జనాదరణతోసాగుతున్నది సినిమాసంగీతం, ఆ తరువాత లలితసంగీతం.

ఇక శాస్త్రీయసంగీతందగ్గరకొస్తే దీనికి ఆదరణ యించుమించు కరువైపోతు న్నట్టే. రేడియోవాళ్ళు అండలేకుంటే యిది ఏనాడో మ్యూజియంలోకి పోయుండేది. ఇందు ఎవరితప్పూలేదు - యుగధర్మం.

## జానపద సంగీతం

పల్లీయుల నిత్యజీవితంలో ప్రతిపనిలో ఏదొకరూపంగా లయాన్విత మైనగానం మిళితమై ఉంటుంది. కూనిరాగం తీయనివాడు, వానలో తడవని వాడు ఉండడు. వ్యవసాయపనులలో ఊడ్పులు, కలుపుతీతలు, కోతలు, నూర్పులు వగైరాపనులలో పాటలు, జోలపాటలు, లాలిపాటలు, ఉయ్యాల పాటలు, పెళ్లిపాటలు, గొబ్బిపాటలు, పిల్లల ఆటలపాటలు, దంపుళ్ళ పాటలు, పడవలాగువారి పాటలు, రోడ్డుకూలీల పాటలు, తత్వాలు మొద లగు జానపదగేయాలలో పండించే సంగీతమే జానపదసంగీతం. బుర్రకథ జముకులకథ, తంబురకధ, తోలుబొమ్మలాటల వారి బాణీలూ, నేటి పౌరా ణిక పద్యరాగాలూకూడా జానపదసంగీతసంబంధులే. ప్రకృతిధత్తంగా వచ్చిన శృతే దీనికి జీవం. ఇవన్నీ గాత్రానికిసంబంధించినవి. ఇక జానపద వాద్య సంగీతనికొస్తే ఇవి చర్మసంబంధమైనవి, తంత్రీసంబంధమైనవి, లోహ సంబంధమైనవీను. ఇవి వారే తయారుచేసుకుంటారు. భేరి, మృదం గం, డప్పు, బుడబుక్క, తప్పెట, వీరణం, రాండోలు, కంజరి, డోలక్ మొదలగునవి చర్మ సంబంధమైన వాద్యాలు. జేగంట, తాళాలు, గజ్జెలు, అందెలు లోహసంబంధమైనవి. పిల్లనగ్రోవి, కోలాటంకర్రలు, చిరతలు కొయ్యసంబంధమైనవి. అసలు శాస్త్రీయసంగీతానికి మూలం యీ జానపద సంగీతమే.

* "జానపదుల సంగీతం, సాహిత్యం వేరువేరుకాదు. చంద్రునితో వెన్నెలలా కలిసేఉంటాయి. వారి నిత్యజీవితంలో ప్రతిఘట్టమూ అమాయక అకల్మష హృదయతంత్రుల్ని యిట్టేస్పందింపజేస్తాయి. ఆయా సందర్భా లనుబట్టి, చేసే పనులనుబట్టి, తగిన నడకలతో, లయతో రసానుగుణంగా

---

* జానపదగేయ సాహిత్యం, నేదునూరి గంగాధరం. పుట. 4,
(జానపద సాహిత్యం)

సంగీత సాహిత్యములు ఏకకాలంలోనే ఉబికివస్తాయి. కలుపుతీత, గొప్పు తవ్వు, ఊడ్పులూ చేస్తున్న పల్లెపడుచులు వారివారి వృత్తిఏతాళంలో జరుగుతూఉందో అదే చతురశ్రగతిలో అప్రయత్నంగా పాడుతుంటారు. మగవారు తరువులు మోయుట, నూర్పిళ్ళు, ఎగుమతి దిగుమతి సందర్భాల లోనూ తమకు శ్రమ తెలియకుండా ఆపనికిసరిపోయే లయతాళబద్ధాలుగా బృందగీతాలుపాడుతూఉంటారు. ఈ సాహిత్యంలో సంగీతం ఉట్టిపడుతుంది".

## నాట్యం

* "ప్రకృతియందలి సర్వ వస్తువులయొక్క చలనమునందు 'లయ' అంతర్నిహితముగానున్నది. దానికితోడుగా ప్రకృతియందు వివిధ రూపము లలో మధురశబ్దోత్పాదనము పాదుకొనియున్నది. నిత్యజీవితమున ప్రతి యంశమునందును, ఏదోఒకరూపమున లయాన్వితశబ్దస్ఫూర్తి యుండుటను ఆదిమానవుడు గుర్తించియుండును. దానికొక యాకారమునిచ్చుచు ఆతడను కరించినవిధానమే నృత్యకళగా భాసించినది."

చతుష్షష్టికళలలో నాట్యకళ విలక్షణమైనది. మొదట ఆదిమ మాన వుడు తనభావాలనుతెలియజేయడానికి సౌంజ్ఞలుచేసేవాడు. ఆనందం కలిగి నప్పుడు గంతులువేసేవాడు. అవి లయబద్ధమై నాట్యమయింది. పెద్దలు దీనిని పంచమవేదమన్నారు. ఋగ్వేదంనుంచి సాహిత్యం, సామవేదంనుంచి గానం, యజుర్వేదంనుంచి అభినయం, ఆధర్వణవేదంనుంచి రసం తీసుకొని బ్రహ్మ అయిదవవేదాన్నిసృష్టించాడని, భరతుడు దీనిని ప్రవర్తింపచేశాడని ప్రతీతి. ఇందులో మహానటుడు పరమేశ్వరుడు.

"ఆంగికం భువనం యస్య
వాచికం సర్వ వాఙ్మయం
ఆహార్యం చంద్ర తారాది
తం వందే సాత్త్వికం శివం"

---

* తెలుగు జానపద గేయకథలు. పు. 1 డా. నాయని కృష్ణకుమారి.

ఆంగికం, సాత్త్వికం, ఆహార్యం, వాచికం అని అభినయాలు చతుర్విధాలు. రూప ప్రధానమైనది ఆహార్యం - అంటే వేషధారణ. తాళానుగుణంగా, భావానుగుణంగా కదలికలు, ముద్రలు ఆంగికం. నోటితో ఉచ్చరించేది వాచకం. రోమాంచ కంపస్వేదాదులు సాత్త్వికం - నాట్యనిర్వహణ ఎలా ఉండాలి అనేది ఈ క్రిందిశ్లోకంలో చెప్పబడింది.

"యతో హస్త స్తతో దృష్టిః
యతో దృష్టి స్తతో మనః
యతో మన స్తతో భావః
యతో భావ స్తతో రసః"

(హస్తము, దృష్టి, మనస్సు, భావము ఒక దానిమీద ఒకటి లగ్నమై రస నిష్పన్నత నొందాలి)

"కంఠే నాలంబయేద్గీతం
హస్తే నార్థం ప్రదర్శితం
చక్షుర్భ్యాం దర్శయద్భావం
పాదాభ్యాం తాళమాచరేత్."

(కంఠముచే గానము, హస్తముచే అర్థము, నేత్రముచే భావము, కాలిచే తాళము నడుపబడాలి) నాట్యానికి ఇవి అంతఃప్రాణాలు. ఇకబహిఃప్రాణాలు-

"మృదంగశ్చ సుతాళశ్చ
వేణు గీతి స్తతస్తుతిః
ఏక వీణాంకింకిణీశ్చ
గాయకశ్చ సువిశ్రుతః"

మంచితాళం, మృదంగం, పిల్లనగ్రోవి, పాట, వీణ, గజ్జెలు, ప్రఖ్యాతమైన నటుడు - ఇవి బహిఃప్రాణాలు. ఇవన్నీ శాస్త్రీయనాట్యాలకు మూలసూత్రాలు. నాట్యాన్ని శాస్త్రీయంగా నృత్తము, నృత్యము, నాట్యము,

తాండవము, లాస్యము అని అయిదుభాగాలుగా పేర్కొన్నారు. ఇందు చతుర్విధాభినయాల్లో ఆంగికానిది అగ్రతాంబులం. మానవశరీరమునకు సంబంధించిన ప్రధానఅంగములచేష్టలే ఆంగికము. శిరస్సు, చేతులు, రొమ్ము, పార్శ్వము, పాదములు యిక్కడ ప్రధానఅంగాలుగా చెప్పబడతాయి. ఈ ఆంగికంలో హస్తాభినయముద్రలప్రాముఖ్యం అత్యధికం. ఒక చేతితోపడితే అసంయుతముద్ర, రెండుచేతులతోపడితే సంయుతముద్ర. యిక మూడవది మిశ్రమముద్ర. వీని నిర్వహణా కౌశలమే యీ కళకు గీటురాయి.

ఇప్పుడు ఆంధ్రదేశంలోప్రఖ్యాతిగా నడుస్తున్న నాట్యప్రదర్శనము అయిదు విధాలుగా విభజించవచ్చు.

1 శాస్త్రీయ నృత్యం, 2. జానపద నృత్యం, 3. రికార్డింగ్‌డాన్సు, 4 డిస్కోడాన్సు. 5. కేబెరాడాన్సు.

శాస్త్రీయ నృత్యం :- భరతనాట్యం, ఆంధ్రనాట్యం, కూచిపూడి ఈ తరగతిలోకి వస్తాయి. వీనికి శాస్త్రపడికట్టు ఆయువుపట్టు. తెలుగువారిలో నటరాజు రామకృష్ణ, వేదాంతం సత్యనారాయణశర్మ, వెంపటి చినసత్యం, కోరాడ నరసింహారావు, పసుమర్తి కృష్ణమూర్తి యీ నాట్యాలకు ఖండాంతర ఖ్యాతి తెచ్చి పెడుతున్న జాతిరత్నాలు.

జానపద నృత్యం :- గిరిజనులయొక్క, పల్లీయులయొక్క సంప్రదాయకరీతి నాట్యాల అనుకరణఇది. కోయడాన్సు, లంబాడీడాన్సు, కోబ్రాడాన్సు, కోతిడాన్సు పాములవాడు, జాలరివంటివి ప్రదర్శింపబడుతున్నాయి. "మొక్కజొన్నతోటలో" లాంటి జానపదగీతాలకు రూపకల్పనచేసి, కొన్ని భావగీతాలకు అభినయంకూర్చి శాస్త్రీయం కాకున్నా వీనికికూడా సభాగౌరవం తెచ్చారు మనవాళ్ళు.

రికార్డింగు డాన్సు :- సినిమాలలో నటీనటులుచేసే సినిమాడాన్సుల్ని అనుకరిస్తూ, ఆ పాట రికార్డువేసుకొనిచేసే నృత్యప్రదర్శనలు రికార్డింగు డాన్సులు. ఈ ప్రదర్శనలఉనృతం ఒకనాడు పౌరాణికనాటకరంగాన్నికూడా

ప్రక్కకునెట్టేసింది. రాజమండ్రి చక్రవర్తి, ఉదయకుమార్‌ల రికార్డింగు డాన్సులు చూసి అసలు సినిమానటులే అదిరిపోయారట.

డిస్కోడాన్సు :- ఈమధ్య మహోజ్వలంగా వెలిగిపోతున్న మరో డాన్సు డిస్కోడాన్సు. పాశ్చాత్యసంగీతం బేగ్రౌండ్‌గా, ఆ లయలో కాళ్ళూ, చేతులూ, వొళ్ళూ ముందుకూ వెనక్కూ ఊపుతూ యువతను బాగా ఆకట్టుకుంటున్న నృత్యాలివి. డిస్కోలైటింగుకూడా జోడించి చూపిస్తుంటే యువలోకానికి ఇవి సుందరస్వప్నాలే. ఇప్పుడు ఉధృతంగావస్తున్న బ్రేక్‌డాన్సులుకూడా ఈ కోవలోవే.

కేబెరా డాన్సు :- ఇవి పూర్తిగా సెక్సుడాన్సులు. సినిమాల్లో జ్యోతిలక్ష్మి, జయమాలిని, సిల్కుస్మిత, అనూరాధ చేస్తుంటారు. క్లబ్బుల్లోనూ, ఖరీదైన బడాహోటళ్ళలోనూ, ఎమ్యూజ్‌మెంటుపార్కుల్లోనూ వీనివెలుగు వర్ణనాతీతం. వీనిలో ఏదిగొప్ప అనేది ప్రశ్నకాదు. దేనిప్రేక్షకులు దానికున్నారు. ఓటింగుకుపెడితేమాత్రం శాస్త్రీయనృత్యానికి డిపాజిట్టుగల్లంతే.

## జానపదుల నృత్యాలు

* "ప్రజలమధ్యనే పుట్టిపెరిగే నృత్యం, సంగీతం, చిత్రలేఖనం మొదలైన జానపదకళలకు స్వతస్సిద్ధంగాఉండే విలువమాట అలా ఉంచి, పరిణతి చెందే కళాకారులకు, ఆకళల తొలిరూపాలకు గల సంబంధం వ్యక్తపరచగలవి ఈ జానపదకళలుమాత్రమే."

శాస్త్రీయకళలలోకంటే జానపదకళలలో ప్రజాజీవితం, ప్రజలజీవితంలోని కష్టసుఖాలు, ఎత్తుపల్లాలు, సుఖదుఃఖాలు ఎక్కువగా ప్రతిబింబిస్తాయి.

---

* కమలాదేవి ఛటోపాధ్యాయ "భారతీయ జానపద నృత్యాలు" ముందుమాట. పుట. 1

ప్రజలభావోద్వేగం పొంగిపొరలడంవలనఏర్పడినవి జానపద నృత్యాలు. శాస్త్రీయ నృత్యం కట్టుబాట్లలో ఉంటుంది. జానపదుల నృత్యం స్వేచ్ఛాప్రవృత్తికలది. ప్రజలు రోజూచేసే పనిపాట్లలోని అవయవసంచలనమే జానపదనృత్యాలకు ప్రేరణ అంతేగాక ప్రకృతిలోని జంతువుల గమనానుకరణంకూడా వీరికి ప్రేరకాలు. ఉదాహరణకు మబ్బునుచూసిఆడే నెమలి గంతులు, వేటగానినిచూసి తప్పించుకోవడానికీ, మీదబడటానికీ పులి, ఎలుగుబంటివంటి జంతువులచేష్టలు, ఆడమగ పక్షులూ, జంతువులూ శృంగారాభిముఖంగాచేసేచేష్టలు ఈ జానపద నృత్యాలకు పునాదులు. ఇది పాటకంటేకూడా ప్రాచీనమైంది. ఇవి శాస్త్రీయ నృత్యాలలా ఏకవ్యక్తినిష్టములు కావు. సమిష్టిప్రాధాన్యం కలవి. అంటే యివి సామూహికనృత్యాలేగాని ఏకవ్యక్తికాలు కావు.

పల్లెలలో, జాతర్లలో, తిరునాళ్ళలో, అమ్మవారి సంబరాల్లో, దేవుడి ఉత్సవాల్లో ఎలుగుబంట్లనృత్యం, బుట్టబొమ్మల నృత్యం, కోయనృత్యం, భోగం మేళాలనృత్యం, వీధిభాగవతుల నృత్యం, పులివేషాలనృత్యం, తప్పెటగుళ్ళనృత్యం, వీరముష్టివారినృత్యం, గంగిరెడ్లనృత్యం, పండరీభజన నృత్యం, కోలాటంనృత్యం, గారడీలనృత్యం, గరగాట, చెక్కభజనలలోనివి జానపదనృత్యాలే. చెంచునాటకాలు, జముకులకథ, బుర్రకథ, హరికథలలో ప్రదర్శించే నృత్యం, పిల్లల ఆటలలోని చెమ్మచెక్క, ఒప్పులకుప్ప వంటి పాటలకు అణుగుణంగా ఎగిరేనృత్యం కూడా జానపదనృత్యాలే.

## కవిత్వం

ప్రపంచంలోని మాటలసముదాయం వాఙ్మయం. దానిలోని ఒకభాగం సాహిత్యం. "సహితస్యభావం సాహిత్యమ్" అన్నారు పెద్దలు. అంటే హితముతోకూడినది అని. భావమంటే రసమనికూడా అర్థంవుంది. ఇందులోని కళాత్మకభాగమే కవిత్వం. ఇది ఇలాగుంటుందని చెప్పడం ఎలా ? పివిశెట్టి 'దత్తత' నవలలో ఒకనాస్తికుడైనకొడుకు పూజచేసుకుంటున్నతల్లిని ఎందుకమ్మా ఈపూజలు అసలు దేవుడనేవాడు లేంది ?

అంటాడు. ఉన్నాడునాయనా అంటుంది. ఎలాఉంటాడో చెప్పు అంటాడు. ప్రక్కనున్న మేనకోడలు బావా ! బెల్లం ఎలాగుంటుంది ? అంది. తియ్యగా ఉంటుంది అన్నాడు. తీపెలాగుంటుంది ? అంది. అతడు అవాక్కయ్యాడు. తీపికి రూపంఏమిటి ? అలాగే కవిత్వంకూడా. అయినా పెద్దవాళ్ళు దీన్ని నిర్వచించడానికి కొంత ప్రయత్నం చేశారు.

"Emotions Recollected in Tranquility" అంటాడు వర్డ్సు వర్తు. నిశ్చలస్థితిలో పరిపూర్ణమైనఆవేశంతో హృదయంనుంచి వెలువడే వాక్ప్రవాహం కవిత్వమన్నమాట. దీనికి వాల్మీకి "మానిషాద" శ్లోకమే సాక్ష్యం. అతని రామాయణ మహాకావ్యమే నిదర్శనం.

"Poetry is musical thought" అంటాడు కార్లయిల్. అంటే "గాన సమన్వితమైన ఆలోచన కవిత్వం" అనిఅర్థం. దీనికి ప్రఖ్యాత కవి 'కీట్సు' వ్రాసిన "గ్రీషియన్ అర్న్" అనే ఖండిక ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఇందులోని "Heard melodies are sweet, but those unheard are sweeter, Ye, soft Pipes Play on" "వినిపించేగానం మధురం, వినిపించనిగానం మధురాతిమధురం, మ్రోయించ వోయ్ మురళి" అనే దానిలో ఒక తూగుఉంది. భావప్రకటనలో అంతరాంత రాలను కదిలించే ఒకశక్తి ఉంది. ఇదే గాన సమన్వితమైన ఆలోచన. ఇది ప్రపంచప్రసిద్ధిపొందిన కవిత.

ఇంతకీ "పొయట్రీ" అంటే నైఘంటికార్థం కవిత్వంకాదు పద్యం. మరి పద్యమే కవిత్వమనుకుంటే పై లక్షణాలు కలిగిఉన్న వచనము కవిత్వం కాదా ? అందువల్ల "ప్రొయట్రీ అనేపదానికి కవిత్వం అనే అర్థం కూడా వ్యవహారంలో వచ్చింది. భారతీయ పండితులుకూడా కవిత్వాన్ని నిర్వ చించలేదు - కావ్యాన్ని నిర్వచించారు. "కవయతీతి కవిః తస్యకర్మ కావ్యం" అన్నారు. అంటే కవిత్వంచెప్పేవాడు కవి, అతను వ్రాసింది కావ్యం అని. దీన్నిబట్టి కవిత్వస్వరూపం కావ్యం గనుక కావ్యం అంటే కవిత్వం అని సిద్ధాంతంచారు.

"రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యమ్" అన్నాడు జగన్నాథ పండితరాయలు. అందమైనఅర్థాన్ని స్ఫురింపజేసే శబ్దమే కవిత్వమని దీని అర్థం. దీనికి ఆధునికంగా ఒక ఉదాహరణపేర్కొనవచ్చు. రంగమ్మ అనే ఆమెకు రంగన్న అనే ఒక కొడుకున్నాడు. అతనిచిన్నప్పుడే తండ్రి చచ్చిపోయాడు అంటూ సామాన్యంగాచెప్పుకొనేవిషయాన్ని "రంగన్న రంగమ్మకొడుకు, రంగమ్మ రంగుచీరకట్టడం రంగన్న ఎరగనే ఎరగడు" అనిచెబితే ఎంత రమణీయంగా ఉంటుంది! ఇలా రమణీయార్థన్నందించే శబ్దాలకూర్పే కవిత్వం అని పండితరాయలమతం.

"వాక్యమ్ రసాత్మకం కావ్యమ్" అన్నాడు విశ్వనాథుడు. అంటే రసస్ఫూర్తికలిగిన వాక్యమే కవిత్వం. ఇది ఏరసమైనా కావచ్చు. బసవరాజు అప్పారావుగారు వారి పసిబిడ్డ చనిపోయినప్పుడు దుఃఖోద్వేగంతో "కాపుర మొచ్చిన కన్నెపాపాయి యిల్లు కాళీచేసి వెళ్ళిపోయాడు" అని కరుణ రస భరితంగా వ్రాసినవాక్యం ఒకఉదాహరణ. అలాగే "లీలాశుకుని" "కృష్ణకర్ణామృతం"లోని యీ క్రిందిశ్లోకం మరొక ఉదాహరణ—

"రాధా పునాతు జగదచ్యుత దత్త చిత్తా, మంధాన మాకలయతే
దధిరిక్త పాత్రా, తస్యాస్తన స్తబక చంచలలోలదృష్టిః దేవోఽ
దోహన ధియావృషభం నిరుంధన్".

శ్రీకృష్ణుడు పాలుపిదుకడానికి గోశాలకువెళ్ళాడట - అక్కడికి గవాక్షంలోనుంచి గదిలో చల్లచేయడానికిఉద్యుక్తురాలౌతున్న రాధకనిపించిందట - ఆమెనుచూసినకృష్ణుడుమైమరచి ఆవుకువేసేబంధం ఎద్దుకువేస్తున్నాడట-కృష్ణునిచూసినరాధ పరవశించిపోయి కాళీకుండలో కవ్వంపెట్టి చిలికేస్తోందట. ఇది శృంగారరస సమ్మిశ్రితమైన వాక్యం. వాక్యంఅంటే ఒక్క వాక్యమే అనికాదు అర్థం - వాక్య సముదాయమని. అలాగే శబ్దంఅంటే శబ్దసముదాయమని అర్థం.

"శబ్దార్థౌసహితౌ కావ్యం" అంటాడు భామహుడు. మనిషికి సౌందర్యాన్నికూర్చేనగలలాగ శబ్దార్థాలతో కూడినశరీరానికి అలంకారాలు సౌందర్య హేతువులనీ ఆ సౌందర్యమేకవిత్వమనీ అంతరభావం. ఉదాహరణకి కాళిదాసు "రఘువంశం"లో-

"సనైన్య పరిభోగేన గజదాననుగంధినా
కావేరీసరితాం ప్రత్యశ్శంకనీయామ్ కరోత్"

అని వ్రాసాడు. రఘుమహారాజుసైన్యాలు దక్షిణదేశదండయాత్రకు బయలు దేరి కావేరీనదినిదాటుతున్నాయట - ఆ మదించినఏనుగులు నదిలో నీళ్ళు త్రాగుతుంటే వానిగండస్థలంనుండికారినమదజలం నదిలో కలిసిందట - కావేరి సముద్రుణ్ణి కలిసినప్పుడు "ఏమిటీవాసన ? ఎవరిదగ్గర కెళ్ళొచ్చావ్?" అన్నాడట. ఇందులోకూర్చిన అలంకారం ఇంగ్లీషులో 'పెర్సానిఫికేషన్' అంటారు. అంటే మానవేతర ప్రాణులకు మానుషత్వం ఆపాదించి లోకరీతిని మాట్లాడించడం.

"ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం" అన్నాడు క్షేమేంద్రుడు. అంటే ఔచిత్యంకలిగినదే కవిత్వం. దీనికి ఉదాహరణగా "బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్య కన్యకన్" అనే దానిని తీసికోవచ్చు. లలితసుందరమైనకావ్యం అనిచెప్పడానికి "కావ్యకన్యక" అనడంలోనే ఎంతో సుకుమారత్వం వెల్లివిరుస్తోంది. దానికి కోమలకూడా చేరింది -ఆ కోమలం కూడా నవపల్లవకోమలం - అంటే లేచిగురువంటి కోమలం - అదికూడా రసాలసాల నవపల్లవ కోమలం. అంటే గున్న మామిడిలేచిగురువంటి కోమలం. దానికిముందు బాల కూడాచేర్చడం ఔచిత్యపోషణకు పరాకాష్ట. వింటుంటే ఒక అనిర్వచనీయానందం కలుగుతుంది. ఈ ఔచిత్యశిల్ప సౌందర్యాన్నే కవిత్వమంటాడు క్షేమేంద్రుడు.

"వక్రోక్తి కావ్యజీవితం" అన్నాడు కుంతకుడు. వక్రోక్తి అంటే చెప్పదలచినదానిని సూటిగాచెప్పకుండా భంగ్యంతరంగాచెప్పడం. ఉదాహరణకి తిరుమలరాయని వర్ణిస్తూ ఒక కవి చెప్పిన పద్యం ఇది -

"అన్నాతి గూడ హరుడౌ
అన్నాతిని గూడకున్న అసుర గురుండౌ
అన్నా తిరుమలరాయా
కన్నొక్కటిలేదుగాని కంతుడు గాడే !"

తిరుమలరాయుడు భార్యదగ్గర ఉంటే పరమేశ్వరుడివలెఉంటాడట - ఆమె దగ్గరలేకుంటే దేవగురువు శుక్రుడులాఉంటాడట - మరో కన్ను

ఉంటేనా! మన్మధుడేనట. అంటే అతనికి ఒకకన్నులేదన్నమాట. (ఏకాక్షి) దీన్నే వ్యంగ్యమనికూడా అంటారు. ("కన్నొకట్టిటి లేకయున్న కౌరవ పతిపే" అనే పాఠాంతరంకూడావుంది.

"ధ్వని కావ్యాత్మ" అన్నాడు ఆనందవర్ధనుడు. ధ్వనిఅంటే విషయం వాచ్యంకాకుండా ధ్వన్యాత్మకంగా మరోఅర్థాన్ని స్ఫురింపజేయడం. ఉదాహరణగా కావ్యాలంకార సంగ్రహంలోచెప్పిన ఈక్రింది పద్యాన్ని పేర్కొనవచ్చు -

"ఇచట మా యత్తపండు, నేనిట పరుండు
పగటనే లెస్సగని గుర్తుపెట్టుకొనుము
ఓ నిశాంధుడా పాంథుడా ఒప్పుదప్పి
పడకుమీ మాదు మంచాలపైన రేయి"—

ఇది ఒకప్రోషితభర్తృక తన ఇంటికివచ్చిన బాటసారితో అన్నమాటలు. పైకికనిపించేఅర్థం ఇక్కడ మాఅత్తమంచంఉంటుంది - ఇక్కడ నామంచం ఉంటుంది - రాత్రి ఏదైనాఅవసరంకలిగి బయటకువెళ్ళాలంటే చీకట్లో ఈ మంచాలమీదపడతావు జాగ్రత్త అని హెచ్చరిస్తున్నట్లుంది. కాని ధ్వని రూపంగా అతనికందించే సమాచారం-

"రాత్రి నామంచం ఇదిగోఇక్కడుంటుంది. తిన్నగాచూసి గుర్తుంచుకొని దానిమీదకురా - సరిగాచూచుకోకుండా నామంచం అనుకొని మాఅత్త మంచంమీదపడ్డావా కొంప మునుగుతుంది" అని. ఇలాంటిదే మరొకటి -

"ఇక దిరుగ వచ్చునిట న
మ్మకముగ, నో పూజారీ, పరిమార్చెను సుమ్మీ
వికటోద్ధతమగు గోదా
వికుంజగత సింహమొకటి నేడా కుక్కన్"—

ఒక కులట తాను ప్రియునితోకలిసేఉద్యానవనంలో పూలుకోసుకోడానికి వచ్చేపూజారితో అన్న మాటలివి. పైకికనిపించే అర్థం "ఓ పూజారీ! ఇక్కడకుక్కను ఇవాళ సింహంతినేసిందిలే, ఇక కుక్క భయంలేదు,

ధైర్యంగాతిరగవచ్చు అని కాని ధ్వన్యర్థం ఇక్కడ భయంకరమైన సింహం తిరుగుతోంది, కనిపి స్తే తినేస్తుంది, రా బోకు అనిభయపెట్టడం. (అతనిఅడ్డు తొలగించుకోవడానికి.)"

"నహి చమత్కార విరహితస్య కవేః కవిత్వం, కావ్యస్యవా కావ్యత్వమ్ " అన్నాడు మరోప్రాచీనకవి "క్షేమేంద్రుడు" కవికంఠాభరణములో. అంటే చమత్కారం కవిత్వం అని. దీనికి ఉదాహరణగా ఈ క్రిందిపద్యం చెప్పుకోవచ్చు.

సర్వజ్ఞ నామధేయము
శర్వునకేచెల్లురావు సింగజనపాలునకే
యుర్వింజెల్లెడి నితరుని
సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే"——

రెడ్డిరాజుల ఆస్థానకవియైన శ్రీనాథుడు ఒకసారి వారికిశత్రువైన సర్వజ్ఞసింగ భూపాలుని స్తుతిస్తూ 'సర్వజ్ఞుడనేపేరు ఒక్కయీశ్వరునికే చెల్లుతుంది, రావుసింగ భూపాలునకే భూమిపై చెల్లుతుంది, ఇతరులెవరినైనా సర్వజ్ఞుడంటే కుక్కను ఏనుగన్నట్టే" అని పద్యం చెప్పాడు. దానికి ఆనందపడి ఆ భూపాలుడు బ్రహ్మరథంపట్టి సన్మానం చేసాడట. తిరిగి శ్రీనాథుడు రెడ్డి రాజుల ఆస్థానానికివచ్చినప్పుడు మనశత్రురాజుల పొగడి మనకు అవమానం తెచ్చిన ఇతనికి ఏమిశిక్ష విధించాలని ఆలోచిస్తుంటే తానేమీ పొగడలేదనీ, నిజానికి నిందించాననీ అదేపద్యం ఒక్కఅక్షరంకూడా పొల్లుపోకుండా చదివి వినివించాడట ఇలాగ -

"సర్వజ్ఞ నామధేయము
శర్వునకే చెల్లు, రావు సింగ జనపాలునకే
యుర్వింజెల్లెడి ? నితరుని
సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే" అని -

చిన్న ప్రశ్నార్థకంతో అంత స్తుతీకూడా నిందార్థంలోకి మారిపోయింది. సర్వజ్ఞుడనేపేరు ఈశ్వరునకేచెల్లుతుంది. రావుసింగభూపాలునకెక్కడ చెల్లుతుంది ? శివునికాకుండా మరెవర్నయినాసర్వజ్ఞుడంటే కుక్కను ఏనుగన్నట్టే. అంటే సింగభూపాలుని కుక్క అన్నాడన్నమాట.

పూర్వ నిర్వచనాలిలా ఉండగా ఆధునికంగా మహాకవి శ్రీ శ్రీ—

"కదలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేదీ
పెనునిద్దుర వదిలించేదీ
మునుముందుకు సాగించేదీ" కవిత్వమంటాడు.

అంటే ప్రజలను ఉత్తేజితులనుచేసి ముందుకునడిపించేది కవిత్వమని. దీనికి ఉదాహరణగా ఆయన "మహాప్రస్థానం" లోని ఈ దిగువగేయం పనికి వస్తుంది.

"పతితులార భ్రష్టులార
బాధాసర్ప దష్టులార
శనిదేవత రథ చక్రపు
టిరుసులలో పడి నలిగిన
దీనులార హీనులార
కూడులేని గూడులేని
పక్షులార భిక్షులార
ఏడవకం డేడవకండి
వస్తున్నా యొస్తున్నాయ్
జగన్నాథ జగన్నాథ
జగన్నాథ రథ చక్రా
లవిగవిగో వస్తున్నాయ్".

ఇలా ఎవరేవిధంగాచెప్పినా అవన్నీ తమతమకోణాలనుండిచెప్పిన నిర్వచనాలే. అందువల్ల తామునిర్వచించినదేకవిత్వం అనడం మాత్రం సరికాదు. నిజానికి ఇందులోఏనిర్వచనాన్నిఅనుసరించివ్రాసినా ఒకమెరుపువస్తుంది. ఆ మెరుపే కళ – ఆ కళే కవిత్వం.

* * * * * *

# జానపద వాఙ్మయము

T " జానపద వాఙ్మయం మాడ్చేఎండలు, కురిసేవర్షాలు, వాణికించే చలి, పంటపొలాలు, పెళ్ళిళ్ళు, పేరంటాలు, పండుగలు, పబ్బాలు, పూజలు, వినోదాలు, ప్రతీసంఘటనా, ప్రతీసన్నివేశం పురస్కరించుకొని జానపద ఆబాలగోపాలం కవితావేశానికి కల్పించిన రూపకల్పనే వాఙ్మయం. అందు వల్ల దీనిలో జాతీయభావములు, జానుతెనుగు, తేనెసోనలూరే పదభావ సన్నివేశములు వెల్లివిరుస్తుంటాయి".

"రామాలాలీ.... మేఘ శ్యామా లాలీ, తామరసానయనా దశరధ తనయలాలీ........" అని బిడ్డను జోలపాడతారు పల్లెసీమల్లోతల్లులు ఇలా ఉగ్గుపాలతోనే రంగరించిపోస్తారు పసిహృదయాలలో ఈ సాహిత్యాన్ని.

సులభగ్రాహ్యంకావడం, సరళపదాలతో జానపదులరసనాగ్రాల మీద సహజంగాదొర్లడం, అంతర్లీనంగా చక్కనితూగుకలిగి ఉండటం ఈ సాహిత్య లక్షణం. పాశ్చాత్యదేశాలలో వారివారి జానపదవాఙ్మయ సేకరణలో చాలాకృషిజరిగింది. కాని భారతీయభాషలలో మాత్రం ఇది అంతంత మాత్రం - తెలుగులో మరీఅత్యల్పం. శ్రీ నేదునూరి గంగాధరంవంటి ఏ కొద్దిమందోతప్ప దీనిమీదదృష్టిసారించినవారు తక్కువ.

ఈ సాహిత్యం అజ్ఞాతకర్తృత్వం. అనాదినుండి ఆనోటినుండిఆనోటికి ఆనోటినుండిఆనోటికి పరంపరానుగతంగావచ్చిందిమాత్రమే. రాతకోతలు లేవు. కవిఎవరోతెలియదు. బహుశా వారికిమనలాగ పేరుమీద మక్కువ తక్కువేమో ! ఎవరువ్రాశారో తెలియనట్లే ఏకాలంలో వ్రాసిందీ అసలేతెలియదు. దీనిపుట్టుక చాలాసహజమైనది. మనిషి కాలక్షేపానికికూనిరాగం తీసుకున్నట్లే కష్టాల్లోనూ సుఖాల్లోనూ విందుల్లోనూ వినోదాల్లోనూ విలాసాల్లోనూ కలాసాల్లోనూ తనకుకలిగిన అనుభూతిని తానెరిగిన భాషలో ప్రవచించిఉంటాడు. అందులోశిష్టమైనది కాలంతోపాటు మార్పులు చేర్పులు

---

నాట్యకళ 1970 ఫిబ్రవరి - మార్చి
నేదునూరి గంగాధరం పుట 163

పొందుతూసాగివస్తోంది. అందుకే భాషపుట్టినప్పుడే ఈసాహిత్యం పుట్టిఉంటుం దని భావించవచ్చు. 6వ శతాబ్దికో 'విప్పర్ల' శాసనాన్నిబట్టి మన తెలుగు భాష నన్నయకుముందేఉందని తెలుస్తోందికనుక తెలుగుజానపదసాహిత్యం మనగ్రంథాలు రాకముందేఉందనేది నిర్వివాదం. ఇది పాటలు, మాటలు, తిట్లు, ఒట్లు, కథలు, సామెతలు మొదలైన దేశిరూపాలలో ఎక్కువగా కనిపిస్తుంది. పగటివేషాలు, తోలుబొమ్మలాటవంటి కళారూపాలలోఉన్నది కూడా ఈ జానపదసాహిత్యమే. * మన జానపద వాఙ్మయంలో కావల సినంత కవిత్వంతోపాటు ఘనమైనగంభీరత్వం, ప్రాచీన సమీచీన విజ్ఞాన సంస్కృతులు, సమయ సంప్రదాయాలు, వినోద చమత్కారాలు బోలెడు న్నాయి. తెలుగు పలుకుబడితరబడి నుడిగారమునిగారముల నిండుకుండ ఆ వాఙ్మయము. అంతేకాదు ఆ వాఙ్మయములోని సరససంగీత రీతుల్లో అనా హిత ప్రకృతి గానమాధురీధురీణములు, గిరిఝరీ పరీవాహ స్వరసంహితలు వివిపిస్తాయి. గీర్వాణవాణీవరహాసము మీసందీర్పంగా, గీర్వాణంలో కులికే గాథప్రతిభులైన ప్రౌఢపండితకవులకునైతం సునిశిత భావనాసాధ్యములైన రసమార్గాలను సుళువుగా భావించి, సుగమంగా పయనిస్తారు తెనుగుమీరిన జానపదకవులు. సంగీత సాహిత్య ఉభయ కళాసురభిళము; అచ్చమైన సర స్వతీప్రసాదమీ వాఙ్మయము. ఇలాంటి ఇంతలాంటి ఈ మహావాఙ్మయం తరతరాల శిష్టాచారపు మడిచాపుల పిడికుచ్చెళ్ళు పోసుకుని, ముడిచిబిగించు కున్నపండితుల నిరాదరణకు గురిఅవుతునే పురివిడుతునే ఊపిరినిలుపుకుంటూ వచ్చింది."

## గేయాలు

ఇప్పటివరకూ మనకులభ్యమౌతున్నదాన్నిబట్టి ఈ వాఙ్మయంలో "గేయరచనే" ఎక్కువ. పాటలో నోటనిలిచిపోయే గుణముందికనుక అదే అనాదినుండీ అనంతంగా పల్లెపడుచుల గళాలలోనూ, శ్రామికజనుల జిహ్వా గ్రాలలోనూ, ముసలమ్మలబోసినోళ్ళలోనూ సజీవస్రవంతిగా సాగివస్తున్నది. లాలిపాటలు, జోలపాటలు, పెళ్ళిపాటలు, శోభనంపాటలు, చందమామ

---

* జాతీయాచార్య డా. యస్. వి. జోగారావుగారు
(నేమసూరి గంగాధరంగారి జానపదగేయసాహిత్య వ్యాసావళి పీఠిక) పుట 3

పాటలు, దంపుళ్ళపాటలు, పిల్లలపాటలు. కోలాటంపాటలు, శ్రామికగీతాలు భజనగీతాలు, వెన్నెలపదాలు, తుమ్మెదపదాలు ఇలాఎన్నోరకాలు. 'పాల్కురికి సోమనాథుడు' ఈ క్రింది దేశిగీతాలు ఉటంకించాడు.

"పదములు తుమ్మెద పదములో ప్రభాత
పదములు.... .... .... .... .... .... ....
పదములు వెన్నెల పదములు" —

దీనినిబట్టి జానపదగేయప్రాచీనత పాల్కురికిముందు ఏనాటిదో ! ఈ గేయములపై మొదటగా పరిశోధన చేసిన మార్గదర్శకులు డాక్టర్. బిరుదు రామరాజుగారు.

* "పల్లెసీమలలోఊడ్పులు మొదలు, నూర్పులవరకూగల పొలము పనులన్నింటియందును పాటలు ప్రధానస్థానమాక్రమించుచున్నవి. పిండి విసిరినప్పుడునూ ధాన్యమునుదంపు సమయముననూ కపిలెతోలునప్పుడూ కలుపుతీయువేళలందునూ కంకులుకోయుకాలముననూ కళ్ళములలో పని చేయుసందర్భముననూ పొలముపుట్రల పొంత, చెట్టుచేమలచెంత సమిష్టిగా చేయు కృత్య సామ్యమునందునూ వ్యష్టిగాచేయుపనులలోనూ పాటలకు గల ప్రాచుర్యమత్యధికము. ఉల్లాసమునకు, ఉత్సాహమునకు పని సులువుగా, చురుకుగా సాగివచ్చుటకు ఇవి యావశ్యకములు".

## జోలపాటలు

"జో అచ్యుతానంద జోజో ముకుందా
లాలి పరమానంద రామ గోవిందా జో....జో...."

అని జోకొట్టి నిద్రపుచ్చుతుంది తనగారాలపట్టిని తల్లి.

"చందమామరావే జాబిల్లి రావే
కొండెక్కిరావే కోటివేలుతేవే
బండిమీదరావే బంతిపూలుతేవే
అన్నిటినీతేవే అబ్బాయికివ్వావే"

---

* జానపద కళా సంపద పుట – 5 ఆచార్య తూమాటి దొనప్ప.

అని సాయంవేళ చందమామనుచూపిస్తూ గోరుముద్దలు తినిపిస్తుంది మరోతల్లి.

"ఏడవకుఏడవకు వెర్రిమాతల్లి
ఏడిస్తే నీకళ్ళు నీలాలు గారూ....
నీలాలుగారితే నేజూడలేను
పాలైనగారవే బంగారుకళ్ళు జో జో...."
"అమ్మణ్ణికన్నుల్లు తమ్మిపువ్వుల్లూ
తమ్మిపువ్వుల్లోని కమ్మతేనెల్లూ........జో....జో"

అని తల్లి పాడుతుంటే ఏడుపుమాని పాప తల్లి ఒడిలో హాయిగానిద్రిస్తుంది.

"జీర్ణంజీర్ణం వాతాపిజీర్ణం
గుర్రంతిన్న గగ్గిళ్ళుజీర్ణం
ఏనుగుతిన్న వెలక్కాయజీర్ణం
భీముడుతిన్న పిండివంటజీర్ణం
అర్జునుతిన్న అప్పడాలుజీర్ణం"

అని తల్లి బిడ్డకుఉగ్గుపెట్టి తనకోర్కెను పాటలోమిళితంచేసిపాడి, అరగ దానికి చిన్న వ్యాయామంగా ఆ పసికందు చేతులూ, కాళ్ళూ రెండుసార్లు అటూయిటూఊపి నిమురుతుంటే ఆ శిశువు బోసినవ్వులుకురిపిస్తూ తల్లిని మురిపిస్తుంది.

## బాలానందం

ఇక పిల్లలఆటలలో పాటలు :- మరీచిన్నపిల్లలు ఉత్సాహంగా ఒకరిపిడికిళ్ళమీద మరొకరిపిడికిళ్లుపెట్టి పైపిడికిలి మధ్యఖాళీలో వేలుపెట్టి త్రిప్పుతూ 'గుడిగుడి గుంచం గుండారాగం' అని పాటలాపాడుతూ బలే ముచ్చటగామురిసిపోతూ పరవశిస్తుంటారు.

అలాగే పిల్లలందరూ ఒకరిప్రక్క ఒకరుకూర్చొని కాళ్ళు బారచాపుకొని 'కాళ్ళాగజ్జీ కంకాళమ్మ' పాటతో ఆ కాళ్ళను ఒకటొకటిగా పండించు

కుంటూ ఆడుకుంటుంటారు ఆనందంగా. ఇందులో తమకాళ్ళుముందు పండా లనే తపన ఆ లేతహృదయాల్లో జీవితంలో అన్నింటా తాము ముందుండా లనే మన స్తత్వానికి బీజమే స్తుంది. ఈ పాటలో 'కాళ్ళగజ్జికి' ఏదో వైద్యం చిట్కాకూడా ఉందట.

పాటలో మరో అందమైనఆట ఎవరోఒకరినెత్తిమీద వెనుకనుంచి ఒకచిన్న ఆకో, సాలిగూడో వారికితెలియకుండా వేసి

"ఒకమ్మగారినెత్తిమీద గోరింక
చెప్పకు చెప్పకు చినపాప
చెబితే నీకళ్ళోతాయి"

అని వేసినవాళ్ళుపాడుతుంటే కూడాఅందరూపాడుతూ వినోదిస్తుంటారు. అసలు మనిషి అదితెలిసికొని తీసివేసుకునేవరకూ.

"తప్పట్లోయ్ తాళాలోయ్
దేవుడిగుళ్లో బాజాలోయ్,
పప్పూబియ్యం దేవుడికోయ్
పాలూనెయ్యీ బాలుడికోయ్"

అని పాటపాడుతూ అందరూ ఒకేమాత్రావ్యవధిలో చప్పట్లుకొట్టడం చిన్న ప్పుడే తాళాన్ని నేర్పుతుంది.

చిన్నగా వానతుంపరవస్తుంటే పిల్లలు వీధుల్లో చేతులుబారజాపుకొని తమచుట్టూతాము గిరగిరాతిరుగుతూ అహ్లాదంగా—

"వానావానా చెల్లప్పా, వాకిలుతిరుగూ చెల్లప్పా
తిరుగూతిరుగూచెల్లప్పా, తిరగాలేనూ చెల్లప్పా"

అంటూపాడుతూ ఆతిరగడంలో కళ్ళుతిరిగి గాలిలోకితేలిపోతున్నట్టు చిత్ర మైన అనుభూతినిపొందుతుంటారు. ఇలాతిరిగేటప్పుడు కొన్నిచోట్లపిల్లలు—

"వానల్లూ కురవాలి వానదేవుడా
వరిచేలూ పండాలి వానదేవుడా
గాదుల్లూ నిండాలి వానదేవుడా
మాబొజ్జా నిండాలి వానదేవుడా"

అని వర్షాన్ని ఆహ్వానిస్తారు. బాలవాక్కు బ్రహ్మవాక్కుగదా ! మరీచిన్న పిల్లలు 'వానాలప్పా, తిరగాలప్పా" అంటూ గిర్రునతిరుగుతూ తేలిపోతున్న అనుభూతిని ఆస్వాదిస్తుంటారు. కొన్నిచోట్ల "వానొచ్చె వరదొచ్చె బుడుగో బుడుగో" అని పాడుతుంటారు.

"కొక్కొరోకోయని కోడి కూసింది
తెల్లవారింది కాకిఅరిచింది
అమ్మ లెమ్మంది ఆడుకోమంది" —

అనేపాట పిల్లలకు వేకువజామునే లేవాలనే ఒకమంచి అలవాటును అజ్ఞాతంగా ఉద్బోధిస్తుంది. ఇది Cocks crow in the morning అనే ఆంగ్లగేయానికి దగ్గరగా ఉంటుంది.

పిల్లలకు ఎవరిమీదనైనా కోపంవచ్చినప్పుడు ఆ మిత్రబృందమంతా జట్టుగాఏర్పడి ఎదుటివారికులాలమీదా, వృత్తులమీదా, పేర్లమీదా ఇలా ఎద్దేవా చేస్తూ పాడతారు.

"కోమటి" మీద -

"కోమటి కోమటి కొత్తబెల్లం,
కొంటే డబ్బుఖర్చు, తింటే కడుపునొప్పి"

"బ్రాహ్మడు" మీద -

"బేమ్మడు బేమ్మడు బెడ్డముక్క
చేల్లోపడితే చేపముక్క, ఒడ్డునపడితే గడ్డిమొక్క"

"కాపుల" మీద -

"కాపులు కాపులు కయ్యాలు, తెల్లారితే స్తేదెయ్యాలు"

కాపులకు వారిలోవారికి పడదట. వారిపై ఒకసామెతకూడా ఉంది.

"కాపులసంఘం పీతలమంగం" అని. 'మంగ' అంటే పచ్చితాటాకు మిఠాయిపొట్లంలా చుడతారు – అందులో 'మావు' లలో దొరికిన చేపలు, పీతలువేసి మూతికట్టి ఇంటికితెస్తారు. ఆమూతికట్టు విప్పడం తరువాయి పీతలు తలోవైపుకి పరుగులుతీస్తాయి. కాపులుకూడా ఇలాగే ఏదైనా జల వంతంమీద కొంతసేపుపట్టుగాఉన్నా మళ్ళీవిడిపోతారనేదానికి ఈ సామెత. అదే లీలగా ఈ గేయంలోకూడా కనిపిస్తుంది. "మావు" అంటే పల్లెలలో రైతులు తమచేలలో నీరువచ్చేబోదులదగ్గర అడ్డంగా ఎదురుచువ్వలతో పెట్టెలాచేసికట్టిన చేపలబోను. ఈ చువ్వలు అరంగుళం దూరంతో కొబ్బరి నారతాడుతోకట్టి, చేపలు అందులో ప్రవేశించడానికి క్రింద చిన్న కన్నం పెడతారు. దానిద్వారా నీటిలోవస్తున్న చేపలు, పీతలు లోపలికివెళ్ళి మళ్ళీ తిరిగిరాలేవు. ఇది జాలరి వల లాంటిదన్నమాట.

"ఉపాధ్యాయుని"మీద కోపంవస్తే –

"మేష్టారు మేష్టారు మెట్టొంకాయ్
మేష్టారిపెళ్ళాం నీటొంకాయ్" అని పాడతారు.

మరీఘటికులైన కొంటెపిల్లలు దసరాపాటల్ని అనుకరిస్తూ యిలా పాడు తుంటారు–

"గిలగల్ని పట్టుకొని ఎలకల్నిచంపి
మాపూరు పంతులకు కూరొండిపెట్టి
డాకదగ్గరబెట్టి దపడూడగొట్టి
తాటాకు వెలిగించి తలక్రింపపెట్టి
అయ్యయ్యో పంతులా అయిపోయినావ
మాదొడ్డపంతులా మాడిపోయేవ
జయాభిజయభవ దిగ్విజయభవ."

ఇది "ఏదయా మీదయా మామీదలేదా" అని దసరాల్లో బడిపిల్లలు పాడే గిలకలపద్యానికి 'పేరడీ'. ఇది ఉపాధ్యాయునిమీద ఆవిద్యార్థికి గట్టిగా కోపంవచ్చినప్పుడు ఆకసిని యిలాపాటలోతీర్చుకుంటాడు. విద్యార్థుల కోప తాపాలమీద పల్లెటూళ్ళల్లో చమత్కారమైన ఒకచిన్నకథకూడా ఉంది.

ఒకడూర్లో ఒకబడి నిప్పంటుకునితగలబడిపోతుంటే విద్యార్థులంతా బయట బలేసంబరంగా కేరింతాలుకొడుతూ గంతులేస్తున్నారట మళ్ళీకొన్నాళ్ల వరకూబడికెళ్ళక్కరలేదని. కాని అందులో ఒక కుర్రాడు కూర్చుని ఏడుస్తున్నాడట. పాపం వీడు చదువుకు భంగం వస్తుందని ఏడుస్తున్నాడనుకుని అతనిదగ్గరకెళ్ళి ఏడవకునాయినా మళ్ళీ తొందరగా బడి కట్టిస్తాంలే అంటే ఆ విద్యార్థి "నేను బడి కాలిపోతోందని ఏడవడంలేదు, మా మేష్టర్లు బయటుండి పోయేరని ఏడుస్తున్నాడట. ఇది ఒకజోకే కావచ్చు—— కాని పిల్లలమనస్త్వాలు బాల్యం బడిమీదా, మాష్టర్లమీదా ఎలాగుంటాయో హాస్యంగా ఆవిష్కరిస్తుంది.

ఇక "వదిన"గారిమీద కోపంవస్తే-

"వదినావదినా వల్లంగిపిట్ట
గదిలోపెట్టి గోడనేసికొట్ట" అనీ -

"నారాయణ" పేరుగలవానిమీద కోపంవస్తే -

"నారాయణ నారాయణ నక్కతోక
నారాయణ పెళ్ళాం కుక్కతోక" అనీ-

"ముసలితాత" మీద -

"తాతా పీతా ఉల్లికోళ్ళాతా"

అనే అను ప్రాసలతోనూ, అంత్య ప్రాసలతోనూ అల్లుకు పోతుంటారు, ముసలితాతను వెక్కిరిస్తూ మరోపాటకూడాఉంది.

"కూకుంటే లేవలేవు
కూరాకు తెంపలేవు
తాతా నీకెందుకురా పెళ్ళము" అనీ,

"సూర్యనారాయణ" పేరుగలవానితోగానీ, సూరమ్మపేరుగలవాళ్ళతోగానీ విరోధమొస్తే -

"సూరీ సూరీ చుంచెలక, మాయింటికొ స్తే మంచెలక"

అని పాడతారు. ఇందులో విరోధంలో క్రోధంకనిపిస్తున్నా కలిసిపోదాం రమ్మనే ఆహ్వానంకూడావుంది.

పిల్లలు ఎవరినైనా అభినందించాలంటే ప్రాస క్రీడలతో మంచి మజాగా అభినందిస్తారు యిలాగ -

"రాజా నారాజా, నారాజ నిమ్మలపండు
అప్పారావుకొండ, నేతిమిఠాయుండ" అని

పిల్లలు వాళ్ళలోవాళ్ళుపందాలువేసుకొని పరుగులెడుతుంటారు. ఆ పరుగులో ఎవరైనాపడిపోయినప్పుడుకాలికి దెబ్బతగిలితే ఇలాపాడతారు కోరస్‌లా—

"కొండమీద వెండిగిన్నె, కొక్కిరాయి కాలువిరిగె
దానికేమి మందు, వేపాకు చేదు
వెల్లుల్లి గడ్డ, నూనమ్మ బొడ్డు
నూటొక్క ధార, పొయ్యి పొయ్యి సూరి
పూట కొక్క తూరి" అని.

ఇందులో దెబ్బకు మందేదో చెప్పబడిందన్నమాట.

పిట్టల్ని చూ స్తే పిల్లల ఆనందం పట్టనలవికాదు. పాటలు వాటికవే పొంగి పొర్లి వస్తాయి.

"గువ్వ" కనిపి స్తే —

"గువ్వా గూడెక్కె, రాజూ మేడెక్కె" అని పాడతారు.

"చిలకను" చూ స్తే—

"చిలుకచిలుక రామచిలుక పలుకనన్నది
అ త్తతెచ్చిన కొ త్తకోక కట్టనన్నది
మామతెచ్చిన మల్లెమొగ్గ ముడువనన్నది
మొగుడిచేత మొట్టికాయ తింటానన్నది" అని పాడతారు.

"కాకి"ని చూస్తే మగపిల్లలు—

కాకీకాకీ కడవలకాకీ, కాకిని తీసుకెళ్ళి గంగలోముంచ
గంగానాకూ గంధామిచ్చె, గంధంతీసుకెళ్ళి ఆవుకురాస్తే
ఆవూనాకూ పాలూఇచ్చే, పాలూతీసికెళ్ళి అమ్మాకిస్తే
అమ్మానాకూ పాయసమిచ్చే, పాయసంతీసికెళ్ళి మామాకిస్తే
మామానాకూ పిల్లానిచ్చే. పిల్లాపేరు మల్లెమొగ్గ
నాపేరు జమిందార్"—

అంటూ ఇలా తమఆధిక్యతని తమే పెంచుకుంటూ మంచి హుషారుగా పాడతారు.

పిల్లలు ఒకర్ని పరోక్షంలోమరొకరు ఏమన్నా అంటే విన్నవారిలో ఎవరైనా ఆ వ్యక్తికడిచెప్పేస్తానంటే ఉక్రోషంవచ్చేసి కోపంతో —

"చెప్పుకోచెప్పుకో చెప్పుచ్చుకొట్టుకో
మామిడాకుతెచ్చుకో మందేస్తాను
ఈతాకుతెచ్చుకో ఇల్లుకడతాను
తాటాకుతెచ్చుకో తగలేస్తాను"

అనేగేయరూపంలో అదిరిస్తూ బెదిరిస్తారు.

సాయంత్రం సమయాల్లో చల్లబాటువేళల్లోనూ, రాత్రి వెన్నెల్లోనూ చిన్నపిల్లలు ఒకచోటచేరి వీధుల్లో తమచుట్టూతాము గిరునతిరుగుతూ కృష్ణుడిమీద—

"తారంగం తారంగం తాండవకృష్ణా తారంగం
వేణూనాథా తారంగం వెంకటరమణా తారంగం" అని,

"ఏనుగు" మీద —

"ఏనుగొచ్చిందేనుగు, ఏవూరొచ్చిందేనుగు
మావూరొచ్చిందేనుగు, మంచినీళ్ళు తాగిందేనుగు" అని,

"రాముడు" మీద —

"ఏనుగు ఏనుగు నల్లన, ఏనుగుదంతం తెల్లన
ఏనుగుమీదారాముడూ, ఎంతోచక్కని దేవుడూ"
అని కోరస్‌గా పాడుతుంటారు.

అలాగే 'సీత' మీద —

"సీతమ్మ వాకిటా సిరిమల్లెచెట్టు
సిరిమల్లెచెట్టేమొ చితకపూసింది
చెట్టుకదలాకుండ కొమ్మవంచండి
కొమ్మవిరగాకుండ పూలుకోయండి
కోసినాపూలన్ని సీతకివ్వండి
తీసుకోసీతమ్మా రాముడంపేడు
దొడ్డిగుమ్మంలోన దొంగలున్నారు
దాచుకోసీతమ్మ దాచుకోవమ్మ
దాచుకోకుంటేను దోచుకుంటారు"

అని పాడతారు వీనులవిందుగా. వీనివల్ల ఆచిన్నవయసులోనే గొంతులకు శృతిజ్ఞానం అలవడుతుంది.

ఆడపిల్లలు ఇద్దరుగాని, నలుగురుగాని ఎదురుబొదురుగానిలచి ఒకరి అరచేయి మరొకరి అరచేతికి తాకిస్తూ —

"చెమ్మచెక్క చేరడేసి మొగ్గ
అట్లు పొయ్యంగ ఆరగించంగ"

అనిపాడేపాటలో ఒకఔషధప్రక్రియఉందట. రజస్వలకాని స్త్రీలకు చెమ్మ చెట్టుచెక్క, దాని పువ్వులు, మొగ్గ అట్లపిండితోరుబ్బి ఆ అట్లు ఆరగించుట మంచి ఔషధమట.

పల్లెలలో కన్నెపిల్లలు సంక్రాంతిరోజుల్లో వీధుల్లో గుమ్మంముందు పేడతో గొబ్బిళ్ళుపెట్టి, పసుపూ కుంకుమా బొట్టులుపెట్టి, బంతిపూలతో అలంకరించి తమ మనసులోనికోరికలుముడివేసి యిలా పాడతారు—

"సుబ్బిగొబ్బెమ్మా సుబ్బణ్ణియ్యావే, తామరపువ్వంటీ తమ్ముణ్ణియ్యావే
చేమంతీపువ్వంటీ చెల్లెల్నియ్యావే, అరటీపువ్వంటీ అత్తానియ్యావే
మల్లెపువ్వంటీ మామానియ్యావే, బంతీపువ్వంటీబావానియ్యావే
మొగలిపువ్వంటీ మొగుడూనియ్యావే"—

ఆటల్లో పిల్లలు 'గొబ్బియళ్ళో....గొబ్బియళ్ళో' అనేదివంతగా మరోరకం పాటకూడా పాడతారు యిలా -

గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో గొబ్బియళ్ళో....
చంద్రగిరి భామల్లారా, నీలగిరి కన్యల్లారా ॥గొ॥
దుక్కూదుక్కూ దున్నేరట ఏమిదుక్కూ దున్నేరట
రాజాగారి తోటాలోనా జామీదుక్కూదున్నేరట ॥గొ॥
విత్తూవిత్తూ వేశారట ఏమీవిత్తూ వేశారట
రాజాగారితోటలోనా జామీవిత్తూ వేశారట ॥గొ॥
కాయాకాయా కాసిందట ఏమీకాయా కాసిందట
రాజాగారీ తోటాలోనా జామీకాయా కాసిందట ॥గొ॥
పండూపండూ పండిందంట ఏమీపండూ పండిందంట
రాజాగారీ తోటలోనా జామీపండూ పండిందంట ॥గొ॥
అపునాటే అక్కల్లారా ! చంద్రగిరి భామల్లారా !
నీలగిరి కన్యల్లారా ! తామరగిరి మొగ్గల్లారా ! ॥గొ॥

ఇలాగ వాళ్ళకు తెలిసినన్ని పండ్లచెట్లపేర్లు కలుపుకుంటూ పాట పెంచుకుంటూపోతారు. ఇది పిల్లలలో వృక్షశాస్త్రవిజ్ఞానాన్నీ, భావుకతనూ, కవితాశక్తిని ప్రోదిచేస్తుంది.

పిల్లలందరూ రెండుజట్లుగావిడి వియ్యాలవారి ఆట ఆడుతుంటారు సంభాషణాపరమైన పాటతో. అందులోఒకజట్టు దూరంగానిలుచున్న ఎదుటి జట్టువారితో —

"చిన్నిబిన్ని కెన్నోనెల సింగలగోరీకెన్నోనెల
తాడీబీడీకెన్నోనెల తామరగిరిమొగ్గాలమ్మామొగ్గలు"

అని మగపెళ్ళివారివలె ఒకరిభుజాలమీదఒకరు చేతులువేసి జట్టు కట్టుకుని, రెండవజట్టువారివద్దకువెళ్ళి ప్రశ్నించి వెనక్కి వెడతారు. అప్పుడు రెండవజట్టువారు ఆడపెళ్ళివారివలె మొదటిజట్టుదగ్గరకువెళ్ళి—

"చిన్నిబిన్నికి ఒకటోనెల సింగలగోరికి ఒకటోనెల
తాడీబీడికి ఒకటోనెల తామరగిరిమొగ్గాలమ్మా మొగ్గలు"

అని పాడుతూ జవాబు చెప్పుతారు. ఇలాగ అమ్మాయికి 16 ఏళ్ళు వచ్చే వరకూపాడి, పెళ్ళినిశ్చయంచేసి బొమ్మలపెళ్ళిళ్ళుచేస్తారు. అట్లతద్దినాడు వేకువజామున పిల్లలు జట్లుజట్లుగా తిరుగుతూ—

"అట్లతద్దోయ్ ఆరట్లోయ్, ముద్దపప్పోయ్ మూడట్లోయ్"

అంటూ ఊరంతటినీ నిద్రలేపుతారు. మేలుకొలుపుపాటగా —

* "మహావిపత్తులకు ప్రజలు బలిఅయ్యారు కాని, ఎవ్వరూ పిల్లల దేశీయ క్రీడల్ని, గీతాలను నాశనంచెయ్యలేకపోయారు" అంటారు దేవేంద్ర సత్యార్థిగారు.

## పెళ్ళిపాటలు

పెళ్ళిళ్ళలో వధూవరులను పానుపుమీదకూర్చోబెట్టి ముత్తయిదువలుపాడే పెళ్ళిపాటలు ప్రతివారిహృదయాల్లోనూ పన్నీటిజల్లులు చిలకరింపచేస్తాయి. అందులో —

"పన్నెండూ స్తంభాలా పందిటిలోనా
లచ్చన్నా దరిగోళ్ళా పట్టీమంచాలు" అనే పెళ్ళిపాట -

"ఏలాగు భోంచేతుము, ఈ విందు మేము
ఏలాగు భోంచేతుము" అనిభోజనంలోవడ్డించిన వంటకాలను అవహేళనచేస్తూ వియ్యాలవారిమీద పాట-

---

* దేవేంద్ర సత్యార్థిగారి మోడల్ రెవ్యూ సం 60 పు 394 (తెలుగు అనువాదం-ఆంధ్రుల జానపదవిజ్ఞానం పుట 67 నుండి గ్రహించ బడినది)

"బావా బావా పన్నీరు, బావను పట్టుకు తన్నేరు
వీధీ వీధీ తిప్పేరు, వీశెడు గుద్దులు గుద్దేరు

మూలా మంచం వేశారు, ముంతెడుగెంజీ పోశారు" అని మరదళ్ళు పెళ్ళికొడుకును పరిహాసంచేస్తూ పాడేపాట.

"కలికి కవాటము బంధనచేసిన కారణమేమో తెల్పగదే" అని తలుపు దగ్గరపాట పెళ్ళితంతులో మంచి వినోదాన్నందించే రత్నాలు.

"పోయిరామాతల్లి పోయిరామాయమ్మ" అని బిడ్డను సాగనంపుతూ

"అరిటాకువంటిది ఆడజన్మంటు ఎవ్వరేమన్ననూ ఎదురాడబోకే" అంటూ అత్తింటికి పంపే ఘట్టంలోపాడే అప్పగింతలపాటకు కంటతడి పెట్టకుండా ఉండడం అసాధ్యం. అంతటి రసోద్దీపనగల పాటఅది.

## భక్తిగీతాలు

శుభకార్యాల్లోనూ, దేవుడిపూజల్లోనూ స్త్రీలుదైవపరంగా మంగళహారతులిస్తూ చాలామనోజ్ఞంగా పాడతారు. అందులో —

"జయా జయమంగళం నిత్య శుభమంగళం" అనేది, "మంగళాహారతిదే" అనేది,

"రామచంద్రాయజనక, రాజితామనోహరాయ
మామకాభీష్టదాయ, మహిత మంగళం" అనేదీ –

సుప్రసిద్ధమైన పాటలు. పళ్లెంలో హారతికర్పూరం వెలిగించి హారతి ఇస్తూ ఇలాపాడేసి ఆయాకార్యాలను ముగింపుచేస్తుంటే చూపరులకు అదొక దివ్యానుభూతి. శివునిమీదపాడే ఈ క్రిందిపాట వ్యాజస్తుతితో మరీమనోహరంగాఉంటుంది.

"ఏమయా సాంబశివశివా కైలాసవాసా ఏమయా సాంబశివశివా
ఏమయా సాంబశివశివా సొమ్ములేల లేకపోయె

పాములను ధరించుటెంత పాపమో శివశివా
ఏమయా సాంబశివశివా
వెర్రివాడవైనకావు వెండికొండకు దొరవునీవు
పుర్రెలోభుజించుటెంత పుణ్యమో శివశివా
ఏమయా సాంబశివశివా
ఎల్లవేల్పులకునునీవు ఆదిమూలమైనవేల్పు
బిచ్చమెత్తుకొనుటఎంతకర్మమోశివశివా
ఏమయా సాంబశివశివా".

స్త్రీలపాటలలో శ్రీరామునిఉంగరంచూసిన సీతభావనతో కూర్చినపాట -

"ఉంగారమా ముద్దుటుంగారమా
నడువాకాళ్ళూలేవు ఎగురారెక్కాలులేవు
ఏలాగూ వచ్చితివే ఉంగారమా" అనేది కరుణరసాత్మకమై

కన్నీరుతెప్పిస్తుంది.

బియ్యంఏరుకుంటూనో, వత్తులుచేసుకుంటూనో గృహిణులు భారత భాగవత రామాయణ ఘట్టాలను పాటలుగాపాడుతుంటారు. అందులో కృష్ణలీలలు——

"కస్తూరి రంగరంగా నాయన్న, కావేటి రంగరంగా
శ్రీరంగ రంగరంగా, నినుబాసి ఎటులనే మరచుందురా -
కంసుణ్ణి సంహరింప, కృష్ణావతారుడై జన్మించెను
ఎదురగాళ్ళనుపుట్టెను ఆ బాలు, దేడుగురు దాదులను చంపెనపుడు-
"వసుదేవ పుత్రుడమ్మా ఈ బిడ్డ, వైకుంఠవాసుడమ్మా
నవనీతచోరుడమ్మా ఈ బిడ్డ, నందగోపాలుడమ్మా"

అని స్థాయిగాపాడుతుంటే ఆపాటల గమకానికీ, వస్తువిశేషానికీ అందరూ రాగరంజితులుకావలసిందే. అలాగే -

"పరుగెత్తుబాలుడూ పనసపండూఛాయ
శ్రీ సూర్యనారాయణా" అనే ప్రభాతభానుని వర్ణన -
"యశోదమ్మా, యశోదమ్మా
ఏమంటునమ్మా నోరాడాదమ్మా
వడివడిగా నీకొడుకు మడుగులోకి దుమికినాడు" అనే కాళియ

మర్దనవిశేషాలు చెప్పే కీర్తనలుకూడా జనాకర్షకమైనవే. చెక్కభజనలో -

"శివశివమూర్తివి గణనాథా నీవు శివుని కుమారుడవు గణనాథా"
అనే గణపతిప్రార్థన కూర్చున్న మనిషినిలేపి గంతులేయిస్తుంది. అలాంటిదే
'మారీచు' మాయకు సంబంధించిన ఈ క్రింది పాట -

"చుక్కాచుక్కల్లేడి రాంభజనా
సూదీకొమ్ముల్లేడి రాంభజనా
రాముడొస్తున్నాడు రాంభజనా
బమిడీకొమ్ముల్లేడి రాంభజనా
బంగారు ఆలేడి రాంభజనా
మారీచుఆలేడి రాంభజనా
మంత్రమ్ములాలేడి రాంభజనా"

అటువంటిదే ——

"ఏదిరా లక్ష్మణా సీ....తా
పర్ణశాలాలో లేదెందు సే....తా" అనే పాటకూడా.

జానపదులకు రామనామముమీద భక్తి అమితం. రాముని పేరు తలచు
కుంటేనే పులకరించిపోయేజనులెందరో. అందుకే ఆయనకు ఇలాంటిభజనలు
ఆ భజనల్లో ఒళ్ళుమరచిపాడే పాటలు -

"ఓనామా నీనామమెంతో రుచిరా
శ్రీరామ నీనామమెంతో రుచిరా
పాలూ మీగడలాకన్నా, పంచదారా చిలకలకన్నా

ఓ రామా నీనామమెంతో రుచిరా
శ్రీరామా నీనామమెంతో రుచిరా
ఎంతోరుచి, ఎంతో రుచి, ఎంతోరుచిరా'' అనేది లాంటిదే -
''రామ నామము, రామనామము
రమ్యమైనది రామనామము'' అనే పాటకూడా.

ఎవరైనా 'రామా' అనకపోతే వారికిఎంతకోపమో ! దానినిలా పాటలో కూడా నిరసిస్తారు.

''శ్రీరామాయననివాడుంటేనేమి పోతేనేమి
అలాంటివాడుంటేనేమి పోతేనేమి" అని ___

జానపదులకు హరిహర భేదంలేదు - శివునీ పూజిస్తారు, విష్ణువునీ పూజిస్తారు. అందుకే భజనల్లో -

"ఎద్దునెక్కినవాడు లింగడూ, బొల్లి
గెద్దనెక్కినవాడు రంగడూ'' అంటూ పరవశంతో పాడతారు.

## దంపుళ్ళ పాటలు

కర్రతోచేసిన రోటిలోగాని, నేలమీదచేసిన గుంటలోగాని ధాన్యం పోసి అడుగున ఇనుపపన్ను కట్టబడి గుప్పెడులావుగల నాలుగు అడుగుల కర్రతోచేయబడ్డ రోకలితోదంచుతారు. ఇద్దరుగాని, ముగ్గురుగాని, నలుగురు గాని జానపదస్త్రీలు. ఇవి దంపుళ్ళంటారు. ఒక్కసారిపోసి దంచే ధాన్యాన్ని 'వాయి' అంటారు. ఈ దంపుడుబియ్యం ఆరోగ్యానికి మంచిది - బలమైంది- 'బి' విటమిను ఎక్కువ. ఇలాదంచేస్త్రీలు శ్రమ తెలియకుండా రోకలిపోటు లయకు అనుగుణంగా యిలా పాటలందుకుని పాడుతూ దంచుతారు.

"అత్తాలేనికోడలుత్తమురాలు ఓయమ్మా
కోడలులేని అత్తా గుణవంతురాలూ - ఆహై" అంటూ చెప్పే లోకపు తీరు ___

కోడలా కోడలా కొడుకు పెళ్ళామా ఓయమ్మా,

పచ్చీపాలామీద మీగడాలేదె ?
వేడీపాలామీద వెన్నేలాలేదె ? అనే అత్తసాధింపు -
అత్తా నువ్వాపెట్టె అరశ్శేగాని
పచ్చీపాలామీద మీగడుంటుందా ?
వేడిపాలామీద వెన్నవుంటుందా?" అనే కోడలి సమాధానం-
"సువ్వి సువ్వి రామచంద్రా
సువ్వి సువ్వి కీర్తి సాంద్ర
సువ్వీ సీతమ్మ మాకు శుభము లియ్యావే" అంటూ సీతా
రాముల ఆశీస్సు కోరే పాట -
సువ్వీ కస్తూరిరంగ, సువ్వీ కావేటిరంగ
సువ్వీ రామాభిరామ సువ్వీలాలీ" -
"తుమ్మకర్ర రోలుదాసి, తూముడొడ్లు వాముసేసి
దంచుదామా బియ్యం దంచుదామా" -
"ఊరిముందరచేను వెయ్యబోకన్నా
ఊర్కోనవియ్యమ్మా చెయ్యబోకన్నా
ఊరిముందర చేను కాకులాపాలూ
ఊర్కోని వియ్యమ్మ కయ్యాలపాలు
ఆ.... హు.... ఆ.... హు....

అంటూ జీవితసత్యాలను పల్లెపడుచులు మాటలపాటల్లో రోకళ్ళతో దంచుతూ ముందుఒకరుపాడుతుంటే, కూడా దంచే మిగతావారు వంతగా పాడుతుంటారు. మనస్సును ఈ పాటమీదా, పాటలోని విషయంమీదా, దాని లయమీదా లగ్నంచేసిదంచుతుంటే దంచడంలోని శ్రమ వారికితెలియకుండాపోతుంది. వినేవాళ్ళకి సామాజికసత్యాలెన్నో రత్నాల్లా రాలి విజ్ఞుల్ని చేస్తాయి. ఈదంపుళ్ళపాటలనే రోకలిపాటలంటారు. "రోకలిపాటలట్ల వేదములు వినుగొనుమా శివభక్తులఇండ్ల" అని బసవ పురాణములో ఉటంకించబడింది - ఇవి అంత ప్రాచీనం.

## శ్రమజీవుల పాటలు

"ఆడుతుపాడుతుపనిచేస్తుంటే అలుపూసొలుపేమున్నది"

శ్రమజీవులు తాముచేస్తున్నపనిలోనికష్టాన్నిమరచిపోవడానికి పాడే పల్లె పదాలు అనేకరకాలు.

"గొదారీ తల్లికీ గొజ్జంగి పూదండ" అని పాడుకుంటూ పడవలాగే వాళ్ళు ఆయాసంతెలియకుండా రాత్రింబవళ్ళు పడవతాడు లాగుతునే ఉంటారు. పొలంపనుల్లో వరినాట్లు, కోతలు, కుప్పనూర్పుళ్ళలో "పొలియో పొలీ.... పొలియోపొలీ.... రావేలుగలవాడా.... రారా పొలిగాడా" వంటి ఉత్సాహజనకమైన పాటలు -

"శివ శివ యనమేలు తుమ్మెదా
శివ యంటేనె వినమేలు తుమ్మెదా"

అని తుమ్మెదపదాలు, వెన్నెలపదాలు వ్యవసాయకూలీలు పరవశంగా పాడుతుంటే పాటతోబాటు పనికూడా వేగంపుంజుకుంటుంది. రోడ్డురోలరులాగే కూలీలు కోరస్‌గా -

"జంభై లే సోకు లంగరి
రోలా కాదు బరువూరాయి
లాగానోడికి బుద్ధీ లేదు
లాగినోడే దేవూడయ్యా
సిగ్గూలేదు దుక్కాజనులు
రోషంలేదా మీసంలేదా
అయిలపట్టు బల్లకట్టు
అద్దిరబాబూ అక్కడ పట్టు" అనే పాట-
"జాలిలో ఓ జాలిబెల్లా - జాలిబాంబేలా
అన్నలారా తమ్ములారా - జాలిబాంబేలా
అందమైనా శూరూలారా - జాలిబాంబేలా
శూరమాత భేరిమాత - జాలిబాంబేలా
నూగునూగు మీసగాళ్ళు - జాలిబాంబేలా
నూటికొక్క కాపుబిడ్డ - జాలిబాంబేలా

జోరులో జొన్నాడ దాటి, బారులో బందరూ దాటి
జాలిలో ఓజాలిబెల్లా - జాలీబాంబేలా" అనే పాట—
"హైలెస్సో యవ్వారియవ్వా
లాగరోరీ లంగరుతాడు
పీకరోరీ పిల్లారిజుత్తు
అన్నలారా, తమ్ముళ్లారా
లాగరోరీ లంగరుతాడు
మూడునెలలా ముండా పోరు
ఆరునెలలా జన్మ ఖైదూ
ఎక్కరానీ పడవా మీదా
సెప్పరానీ దుఃఖమొచ్చే" అనే పడవలాగే వారి పాట -
"ఏరు దాటించరో జాలారయ్యో
ఏరుమీద ఏరొచ్చే ,,
వడ్డాణం వలిచిస్తా ,,
కడియాలు తీసిస్తా ,,
మళ్ళీ నేనొచ్చినపుడు ,,
మంచిగ నామనసిస్తా ,, అనే శృంగారపు పాట -
"ఏలేయాల ఏలేయాల హైలెస్సో - ఓహో....
దానీ మొగుడు ధర్మారాజయా" అనే పాట -
"కాంతమ్మో కారెల్లిపోతుంది
కాంతమ్మ కడియాలు - కారుమీదున్నాయి
కాంతమ్మ చీరలు ,,
కాంతమ్మ వస్తువులు ,,
కాంతమ్మ చూపులు ,,
కాంతమ్మ పట్టాలు ,,
కాంతమ్మ ప్రాణాలు ,,
కాంతమ్మో కారెల్లిపోతుంది ,, అనే పాట —

"నేలను నమ్మి ఏలేలో, చెట్టూ ఉన్నది - హైలెస్సా
చెట్టును నమ్మి ఏలేలో, కొమ్మా ఉన్నది - హైలెస్సా
కొమ్మను నమ్మి ఏలేలో, రెమ్మా ఉన్నది - హైలెస్సా
రెమ్మను నమ్మి ఏలేలో, పువ్వూ ఉన్నది - హైలెస్సా
పువ్వును నమ్మి ఏలేలో, పిందీ ఉన్నది - హైలెస్సా
పిందెను నమ్మి ఏలేలో, కాయా ఉన్నది - హైలెస్సా
కాయను నమ్మి ఏలేలో, పండూ ఉన్నది - హైలెస్సా
పండును నమ్మి ఏలేలో, నేనున్నానూ - హైలెస్సా"

వంటి పాటలుపాడుతూ ముందుకులాగుతుంటే పాడేవాళ్ళమాటటుంచి వినే వాళ్ళుకూడా చూస్తూ ఏదో ఆనందంపొందుతుంటారు.

## శృంగార గీతాలు

* ధర శృంగారము, హాస్యము,
కరుణయు, వీరము, భయానకము, భీభత్సం,
బురు రౌద్ర, మద్భుతము, శాం
తరసంబును రసములనగ దనరుం గృతులన్"

శృంగార, హాస్య, కరుణ, వీర, భయానక, భీభత్స, రౌద్ర, అద్భుత, శాంతములనునవి తొమ్మిది రసములు.

భోజుడు 'శృంగార' ఏవ ఏకోరశః (శృంగారమొక్కటే రసము) అని సిద్ధాంతీకరించాడు. నిజానికి ఇది రాజరసము - ప్రాణికోటిసృష్టి అంతా దీనిమీదే ఆధారపడిఉంది.

** "శృంగారమనగా మన్మదోద్భోధకము (కామోద్రేకము). దానిని కలిగించడానికికారణమైన ప్రకృతులచేవిస్తరించేదానిని శృంగారమందురు అని విశ్వనాధకవిరాజు పేర్కొనెను". ఈ ప్రకృతులలో శృంగారభరిత

---

* కావ్యాలంకార సంగ్రహము పు 291

** 'రూపకళ' (శ్రీ సహదేవ సూర్య ప్రకాశరావు) పు 165 నుండి

మైన పాటకూడా ఒకటి. జానపదులు శృంగారానికి పెద్దపీటేవేశారు. వారి పాటలలో చాలాచోట్ల ఇదికొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. పల్లెటూళ్ళలో యువకులు కోలాటమేస్తూ -

"తయ్యక్కడతాజనుతా
ఓ చిన్నదానా విడువనె కొంగు
మరొాదలనె కొంగు
చారడేసికళ్ళదాన
సంపెంగీముక్కుదాన
పసిమీవన్నెల దాన
పసిడీబుగ్గల దాన
తెల్లనిపలువరుస దాన
తేనెతేట లొలుకుదాన
హంసానడకల దాన
అందమైననడుము దాన
ఓచిన్నదానా విడువనె కొంగు -
సన్నా సన్నాని దాన
సన్నాని కురులు దాన
సన్నాని కురులుమీద
జాజి గుత్తు సోకే
ఓ చిన్నదానా విడువనె కొంగు -
బందరు చిన్నదాన
బాజా బందూల దాన
బాజా బందూలమీద
మోజేల లేదే !
ఓ చిన్నదానా విడువనె కొంగు -
గుంటూరు చిన్నదాన
గుండ్రాని కళ్ళదాన

గుండ్రాని కళ్ళమీద
మోజేల లేదే!
ఓ చిన్నదానా విడువనె కొంగు–
నల్లా నల్లానిదానా
నాతీనడకల దాన
నాతీ నడకల మీద
మోజేల లేదే ?
ఓ చిన్న దాన విడువనె కొంగు" అనే పాట–,

"ఎల్లకెల్ల కెల్తినమ్మ గోంగూరకి
నన్ను పాకచుట్టు తిప్పాడె గోంగూరకి
పాకలోకి లాగాడె గోంగూరకి
కొంగు పట్టుకున్నాడె గోంగూరకి
రైకముడి ఇప్పాడె గోంగూరకి
మాయదారి నాకొడుకు గోంగూరకి
నన్ను మాయజేసి ముంచాడె గోంగూరకి'' అనే ఊడ్పుల దగ్గరపాట–

'వానాగాలొస్తోంది మావయ్యగారూ
గేదెనెక్కడ కట్టనండి మావయ్యగారూ
అక్కడిక్కడ కాదె కోడలపిల్లా
కొట్టంలో కట్టవే కోడలుపిల్లా' అనే పాట–(దీన్ని అశ్లీలంగా పాడతారనుకోండి)

'లబోలబో లబ జనక
అబ్బదీని సోకో జబ్బలదాక జాకెట్టు' అనే పాట –
"నిన్ను రమ్మన్నాది నన్ను రమ్మన్నాది
ఇద్దర్ని రమ్మాని సిద్దారోయిందో
నెరానెరా నెరబండి–నెలవరిదండో
నెరానెరా నెరబండి" అనే పాట –

"నాయుడోరింటికాడ నల్లతుమ్మచెట్టుకాడ
నాయుడేమన్నాడె పిల్లా
అబ్బనా గుండెజల్లు మన్నాదెరైటో -
రెండీళ్ళసందునా రోలేసికూకుంటే
దెయ్యమనుకుంటినే పిల్లా
అబ్బనా గుండెజల్లు మన్నాదె రైటో" అనే పాట -

"ఎక్కుమామా బండెక్కుమామా" వంటి శృంగార రస భరితమైనపాటలు ముసలవాళ్ళనుకూడా మురిపిస్తాయి.

"ఛల్ మోహనరంగా
నీకు నాకూ జోడు కలిసెను కదరా -
నీకు నాకూ జోడు అయితే
మల్లెపూలా తెప్పకట్టి
తెప్పమీదా తేలిపోదాం పదరా
ఛల్ మోహనరంగా
నీకు నాకూ జోడు కలిసెను కదరా

నీకు నీవారు లేరూ
నాకూ నావారు లేరూ
ఏటి ఒడ్డున ఇల్లు కడదాం పదరా
ఛల్ మోహన రంగా
నీకు నాకూ జోడు కలిసెను కదరా" అనే పాట -

"ఓ.... పంచదారవంటి పోలీసెంకటస్వామి, నిన్ను నేనూ మరవలేనురా

నీకువచ్చింది కోరమీసం
నాకువచ్చింది దోరవయసూ
ఇద్దరిమనసూ ఒక్కటైతే
వెవకచింతలేని బ్రతుకేమనది
ఓ....పంచదారవంటి పోలీసెంకటస్వామి
నిన్ను నేనూ మరవజాలరా -

కన్ను కన్నూ కలిసిందోయి
నిన్నూ నన్నూ కలిపిందోయి
ఈడనున్నా నే నేడనున్నా నీ
నీడనే నోయీ -
సందు లేదు మనకు
సంద మామ తోడు
ఓ వాలుకన్నులా మువ్వలెంకటస్వామి
నిన్ను నేనూ మరువలేనురా" అనే పాట -
"రంగ మెళ్లొస్తానే నారాయణమ్మా
నీకు రంగుచీర తెస్తానే నారాయణమ్మ" అనే పాట
జానపదులలో ప్రాచుర్యంపొందిన శృంగారగేయాలు.
వీని ఛాయలలో ఆధునికులువ్రాసిన
"గుత్తి వంకాయ కూరోయ్ బావా"
'అప్పన్నా తన్నామన్నా'

'మొక్కజొన్న తోటలో' వంటి ఎన్నోపాటలు నేడు పల్లె జనులలోనేకాకుండా నాగరికలమీదకూడా నాట్య మాడుతున్నాయి.

## హాస్యం పాటలు

హాస్యం శృంగారరసాన్నుంచిఉద్భవించిన మరోరసం అన్నారు పెద్దలు. లాక్షిణికుల ప్రకారం వికృతరూపం, వికారవేషం, వింతచేష్ట, విచిత్ర సంభాషణాదులవలనకలిగేహాసమే హాస్యం. హాస్యం ఇట్టేఆకర్షిస్తుంది. మానవహృదయానికి సంతోషాన్ని, ఉల్లాసాన్ని కలిగిస్తుంది. నవ్విస్తుంది, కవ్విస్తుంది. మనిషిఆరోగ్యానికి నవ్వు మంచి టానిక్. నిజానికి నవ్వు మానవుడికి ఒక వరం. సృష్టిలో నవ్వగలిగేది మానవుడుమాత్రమే. జాన పదులలో హాస్యానికున్నస్థానం అసమానం. ఎవరైనా అమాయకుడిలా కనిపించే యువకుడు మంచిబట్టలు వేసుకొని షోగ్గాతయారై వెళుతుంటే కొంటెపిల్లలు హాస్యంగా ఇలా పాడుతూ వెంటపడతారు. -

'సోగ్గాడే బలే చిన్నినాయుడే
సగం కాలమన్న తీరలేదు సోగ్గాడికి
కావిపంచికట్టుకొని కాకినాడవెళుతుంటే
కాకిపిల్ల తన్నింది సోగ్గాడిని
అహ, సోగ్గాడే బలే చిన్నినాయుడే
సగం కాలమన్న తీరలేదు సోగ్గాడికి' –

గోదావరి పుష్కరాలకెళ్లిన ఒకపిల్ల తన వింతఅనుభవాలను పెత్తల్లికి యిలాచెబుతోంది –

"గోదావరిపుష్కరాల వింతలు
దొడ్డమ్మా గోదావరిపుష్కరాల వింతలు
గోదావరిపుష్కరాలు చూదామని పోతుంటే
కొత్తనీటికుదుపులకు కోకచెంగుబురదలకు
కొప్పులోన కొత్తసవరం
కొట్టుకుపోయిందోలమ్మ" –

ఇది పెదవులు కదలకుండా మనసును నవ్విస్తుంది. ఇలాటిదే మరోపాట –

"అప్పన్న కొండకి
ఎప్పుడెల్లిన గాని
చెప్పుకుంటే
చెడ్డ సిగ్గోలప్పమ్మ' అనేది –

ఇక తెలుగు హాస్యనాయకీ నాయకులైన చిట్టమ్మ – కొయ్యోడు సంవాద రూపకమైనపాటలో హాస్యంగుబాళిస్తుంది కొంచెంమోటుగా –

"చీటికిమాటికి చిట్టమ్మంటే
చీపురుదెబ్బలు తింటవురో రయ్యోకొయ్యోడ –
చిన్నోళ్ళుంటరు, పెద్దళ్ళుంటరు
కాపులుంటరు, కరణాలుంటరు
నను చిట్టమ్మాఅని పిలువకురో రయ్యోకొయ్యోడ
నే కుండుంనాయుడు కూతుర్నిరోరయ్యో కొయ్యోడ' –
'అబ్బా అబ్బా ఆలాగైతే
కొయ్యోడంటూ కూశావంటే

కొరడాదెబ్బలు తింటావే లమ్మో చిట్టెమ్మో
నువు కొరడా దెబ్బలు తింటావే లమ్మో చిట్టెమ్మో
మళ్ళీగాని మాటలాడితే
మడమతాపులు తింటావే లమ్మో చిట్టెమ్మో
నే మద్దప్పయ్యా మనవడినే లమ్మోచిట్టెమ్మో"—

ఇటువంటిదే భార్యాభర్తలు పోట్లాడుకొని తడికిని అడ్డం పెట్టుకొని మాట్లాడుకునే 'తడికో తడికో' అనేపాట. 'ఒకరికీ చేతులు ఇచ్చి, ఒకరికి కాళ్ళు ఇచ్చి నేనొస్తినోయ్ మావ' వంటి పాటలలో చమత్కారం జానపదుల హృదయాల్ని గిలిగింతలు పెట్టి చక్కని హాస్యాన్నందిస్తాయి.

* "మనిషిలోని నరాల బిగింపును సడలించి ఒకవిధమైన హాయిని కలిగిస్తుంది హాస్యం".

## తత్వాలు

తత్ అనగా అది. అది అనేది పరమాత్మ
త్వం అనగా నీవు—నీవు అనేది జీవాత్మ.
ఈ జీవాత్మ పరమాత్మల విచారణే తత్వం అని చెప్పుకోవచ్చు.

భగవద్గీతలో "పార్థాయ ప్రతి బోధితాం.... నారాయణేన స్వయం" అనే పదాల అంతరార్థాన్ని మథిస్తే గీతకూడా తత్వమేఅనిపిస్తుంది. "పార్థ" అంటే పృథివికుమారుడు—పృథివి అంటే భూమి—భూమి అంటే మట్టి—మట్టి అంటే దేహం. 'నారాయణా' అంటే నీరమునందు నివసించునది. ఇక్కడ నీరము అనగా శరీరంలో ప్రవహించు నీరు రక్తం. ఈ నీరమందు నివసించునది జీవుడు. జీవుడనగా ఆత్మ. ఇలా అన్వయించి ఆలోచించినప్పుడు ఆత్మ—దేహముల చింతనయే 'గీత' అని బోధపడుతుంది.

ఈ దేశంలో బైరాగులు, సన్యాసులు తత్వబోధకులు కాషాయవస్త్రాలుకట్టి, జోలె చంకనబెట్టి, ఆనపకాయబుర్ర తంబుర మీటుతూ వీధుల

* సంజీవ దేవ్ చలం సాహిత్యావలోకం పు. 16

వెంట తిరుగుతూ—

"తియ్యానీ మామిడీ పండూ"
తినబోతే దొరుకాదూ తీపూలా మెండూ
పండుకు వృక్షము పరులెవ్వరెరుగారూ
నరులకూ యీ పండూ వశముగాకుండూ" అనీ—,
"చూడచక్కని చిన్నది
ఆమేడ గదిలోనున్నది
ఈడా పింగళులమధ్య
ఆడుకొంటూ ఉన్నది" అని—,
"చందమామా చందమామా చందమామా దీని
సందుతెలిపే జ్ఞానులెవరే చందమామా
కాయమానే పుట్టాలోనా చందామామా....
పాములైదూ మెలగూచుండె చందమామా
తొమ్మిదీ వాకిళ్ళూమూసీ చందమామా....
పామును, నెమ్మదిగా పట్టావలెరా చందమామా"అని—,
"ఈ జన్మమిక దుర్లాభమురా
సాజన్మా సాకారా సద్గురుని గనరా
ఈ జన్మమిక దుర్లాభమురా
పంచక్షరీమంత్రాం పఠనాచెయ్యన్నా
పఠనాచేసితెయముడు పారిపోనన్నా
పారిపోతేఅంబ ఫలమిచ్చురన్నా
ఫలమునందినవాడు పరమగురుడన్న
ఈ జన్మామిక దుర్లాభమురా—
మూడారు వాకిళ్ళు మూయావలెనన్నా
ముక్తి వాకిట నిలిచి తలుపూతీయన్నా
తలుపూ తీసితె అంబ తేజమిచ్చన్నా
తేజామందినవాడూ తాగురుడోయన్నా
ఈ జన్మమికా దుర్లాభమురా—
ఆరూపదులా మీద అంబవుందన్నా
అంటాతో దుర్గాంబ ఆట్లాడురన్నా

ఆఆటలో మంచి అర్థముందన్నా
అర్థమెరిగినవాడు హరిగురుడోయన్నా
ఈజన్మామికా దుర్లాభమురా—
నాశికములోదృష్టి నడిపించుమన్నా
నడిపించిమరినీవు నమ్మియుండన్నా
నమ్మి నవరత్నముల పీఠామెక్కన్నా
పీఠామెక్కిన అంబ పిలుచూనోయన్నా
పిలిచినంతట నీవు నిలుచుండుమన్నా
నిలిచినంతటవాడె నిజగురుడోయన్నా
ఈ జన్మామికా దుర్లాభమురా"—అనీ,—
"చిల్లరరాళ్ళకు మ్రొక్కుచునుంటే
చిత్తము చెడునుర ఒరేఒరే
చిత్తములోనీ చిన్మయ జ్యోతిని
చూచుచుండుటా సరేసరే
నీళ్ళలోమునిగి గొణుగుచునుంటే
నిలకడచెడునుర ఒరేఒరే
నీళ్ళలోనుండే నిర్మలజ్యోతిని చూచుచుండుటా సరేసరే
ఘామలు అవవులు తిరుగుచునుంటే
బుద్ధులు చెడునుర ఒరేఒరే
బుద్ధిలోయుండే పున్నమచంద్రుని
చూచుచుండుటా సరేసరే"—అనే తత్వం,
"ఓం నమశ్శివాయి సిద్ధమైనాపదవి
ఓంకారమేదినా ఓరీ
ఒనరుగా త్రికూట భ్రూమధ్యమందున్న
వాడెవ్వడో చూడరోరీ
అఆలుఎనిమిది అక్షరములకుమూల
హరుడెవ్వరో చూడరోరి
ఆకారమునుచిలక హంసతోగూడుకొని
ఆడించుచున్నదీ ఓరీ"—
ఇట్లా జనులకు ముక్తిసాధనకై బోధచేస్తారు. ఈ చెప్పేవాళ్ళు

ఆసాధనచేస్తున్నారాఅంటే శ్రీశ్రీగారు చెప్పిన సమాధానమే దీనికీ వర్తిస్తుంది. "రోడ్డుమీద ఫలానాఊరికిదారి అని వ్రాయబడ్డబోర్డు ఆ వూరికి దారిచూపిస్తుందేగాని ఆవూరు వెళ్ళదుగా" అని -

## పారమార్థిక గీతాలు

పూర్ణాళ్ళు పుచ్చటికి మురిసేవు తరిసేవు
పుందుగతిగానవే మనసా" అని—,

"ఇల్లు ఇల్లనియేవు ఇల్లు నాదనియేవు నీఇల్లు ఏదిరా ఓరీ
ఊరికి ఉత్తరాన సమాధిపురంలో కట్టెఇల్లున్నదే చిలుకా -
కట్టెలే చుట్టాలు, కర్రలే బంధువులు
కన్నవారెవ్వరే చిలుకా
నువ్వు కాలిపోయేదాక కావలుందురుగాని
వెంటనెవ్వరురారు చిలుకా" అని -,

"వస్తావట్టిది పోతావట్టిది ఆశలెందుకంట
పోయేనాడు వెంబడిరాదు పూచికపుల్లైనా -
చేతిలొ బెల్లం ఉన్నంతవరకే, చీమ బలగమంటూ
చేతిలొబెల్లం చెల్లిందంటే ఎవరురారు వెంట -
ప్రమిదిలొనూనె ఉన్నంతవరకే, దీపమెలుగు నంట
ఆ ప్రమిదలొనూనె అయిపోగానే, దీపమారునంట -
పంచభూతముల తోలుబొమ్మతో ప్రపంచమాయెనట
మట్టికుండయిది నమ్మరాదు ఈ మర్మమెరుగుమంట"-

అని పాడుతుంటే విన్నవాళ్ళు ఆకాసేపూ వైరాగ్యభావాన్నిపొందుతారు. (స్మశాన వైరాగ్యం) అలాగే -

"ఏమిజన్మము ఏమిజీవనము ఈ మాయకాయము" అంటూ దేహస్వరూపాన్ని వర్ణిస్తుంటే దేహంమీద స్వల్పకాలమయినా విరక్తిపుడుతుంది.

'జీవులెనుబదినాల్గులక్షలు, చావు పుట్టుక లిక్కడా
ఎవరుచేసిన పాపకర్మములనుభవించేదక్కడ' అంటూ
జీవునిపాపపుణ్యాలప్రకారం ఇహపరలోకాలలోపొందేకర్మలు చెబుతుంటే ఇక పాపాలుచేయరాదనిపిస్తుంది. (ప్రసూతి వైరాగ్యం)

'తకతై తకతై తోలుబొమ్మా దీని తమాషచూడవేమాయబొమ్మా' అంటూ దేహంయొక్క అశాశ్వతత్వాన్ని చెబుతుంటే తాత్కాలికంగానైనా దైవచింతనపొందవలసిందే ప్రతివారూను.

ఇక పోతులూరివీరబ్రహ్మంగారి కాలజ్ఞానతత్వాలు జానపదులకు పెద్దబాలశిక్ష. వీని భావార్థలూ అంతరార్థాలూ నిత్య శోధనీయాలే.

"నందామయా గురుడ నందామయా
ఆనంద దేవికే నందామయా - ॥నం॥
తాడి చెట్టుక్రింద తాబేలుపుడుతుంది
దేశమంతా కరువు వచ్చేనయా - ॥నం॥
అత్తలకు పీటలు కోడలకి మంచాలు
కొడుకు తల్లిని కట్టి కొడతాడయా - ॥నం॥
రాచూరిదగ్గర రాతిబసవన్నలు
రంకెవేసేకాలమొస్తుందయా
కుక్కతోకాపట్టి గోదావరీదితే
కోటిపల్లికాడ తేలేనయా - ॥నం॥
వీరబ్రహ్మంగాడు వీధమ్మటొస్తారు
వీధీధికిద్దరిని కంటారయా -
"హరిగోవిందగోవింద భజగోవిందగోవింద" అనే తత్వం-"

"చెప్పలేదంటనక పొయ్యారు
పరులార గురుని చేరిమ్రొక్కుతు బ్రతుకనేర్చారు.
చెప్పలేదంటనక పొయ్యారు
తప్పదిదిగో గురుని వాక్యము.

తప్పుత్రోవల పోవువారల
చప్పరించి మ్రింగుశక్తులు
చెప్పలేదంటనక పొయ్యేరు –
అగలువిడిచి పొగలుదాచేరు
అదిగాక పట్టాపగలుచుక్కలు
చూసి భ్రమ సేరు
భుగలు భుగలను మంటమించుటను
పుట్టిపెగిన పిమ్మటాను
దిగులుపడుచూ ప్రజలుచాలా
దిక్కులేనీ పక్షులవుదరు
చెప్పలేదంటనక పోయారూ –
ఆకసమ్మ ఎఱ్ఱనౌను
ఆరుమతములు ఒక్కటౌను
లోకమందలి జనులు అందరు
నీరునిప్పున మునిగిపోదురు" –

అనే తత్వం భవిష్యద్దర్శనం చేయిస్తాయి.

## వీరగేయాలు

ఆదిమానవుడు మొదటమునిగింది వీరంలోనే. ఆహారం కోసం జంతువులనువేటాడ్డంలోనూ, తన మనుగడకోసం ఇతరులతో పోరాడ్డంలోనూ వీరావేశం పొందవలసివచ్చింది. ఆ ఆవేశమే వీరరసం.

* "వీరరసము దానవీరం, ధర్మవీరం, యుద్ధవీరం, దయావీరం అని నాలుగు విధములు".

దాన వీరమునకు దధీచిని, ధర్మవీరమునకు శ్రీరాముని, యుద్ధ వీరమునకు ఖడ్గతిక్కనను, దయావీరమునకు బుద్ధుని చెప్పుకొనవచ్చును. జానపదులకు సాహసమే వీరము. సాహసవంతులైన శూరులే వీరులు. సమాజంలో అటువంటి విక్రమసంపన్నులైన అసమాన్యులను వీరులుగా

* కావ్యాలంకార సంగ్రహము, పుట 430

చిత్రించి వీరరసాత్మకంగాపాడేపాటలు ఎంతో ఉద్రేకపూరితంగా ఉంటాయి యిలా -

"సై సై చెన్నాపారెడ్డీ, రెడ్డీ, రెడ్డీ,
నీపేరే బంగరుపు కడ్డీ -
చెన్నపరెడ్డీ పేరుచెప్పితే
పసిపిల్లలే పాలుత్రాగరు
విరోధులంతా విలవిలతన్నుకు
చెట్టుపుట్టలా చేరెదరండీ
సై సై చెన్నాపా రెడ్డీ"

ఈ రగడలలోని వాడీ వేడీ పాడేవాడినీ, వినేవాడినీ కూడా వుద్రూత లూగిస్తాయి. ఉద్యమాలకు ఊపునిస్తాయి. ఇంగ్లీషులోని Heroic Cauplets లాంటివి.

## గేయపురాణ గాధలు

ఇవిగాక ఎన్నోపురాణగాధలు కథాగీతికలుగా వచ్చాయి. వీనిలో రామయణపరంగా లంకాయాగం, ఊర్మిళాదేవినిద్ర, సీత వామనగుంట, సీతాదేవివేవిళ్లు. కుశలవులకుచ్చలచరిత్ర, పుత్రకామేష్ఠి, లక్ష్మణదేవరనవ్వు, లక్ష్మణమూర్ఛ, శివపరంగా గంగాగౌరీ సంవాదం ప్రసిద్ధి పొందాయి. ఊర్మిళాదేవినిద్రలోని 'శ్రీరామభూపాలుడు పట్టాభిషిక్తుడై కొలువుండగా' అనేది స్త్రీలు కాలక్షేపానికి తరచుగాపాడుతుంటారు. త్రినాధచరిత్రలోని 'హరిహారీ నారాయో ఆదినారాయ - కరుణించి మమ్మేలు కమలలోచనుడా' అనేపాట సంక్రాంతిపండుగనాడు అబోతుని బంతిపూల దండలతోఅలంకరించి ఊరుత్రిప్పుతూ పెద్ద బొంగురుచిప్పతాళాలు వాయిస్తూ పాడుతూ కొందరు గ్రామాల్లో ఇంటింటికీతిరిగి వడ్లు వసూలు చేసుకుంటారుఇప్పటికీ. 'శ్రీరామా .... రామారా.... మోరామా.... రామయ్య, హరిరామా....రామారా.... మయివోధ్యా రామా' అనేది కోల సంబరాల్లో వెంకన్నబాబుకథలోవినిపించే ప్రసిద్ధమైనవంతపాట. గౌరీ కళ్యాణంలోని "ఘల్లు ఘల్లున పాద గజ్జెలందెలు మ్రోగ కలహంస నడకల కలికిఎక్కడికే, జడలోన గంగాను ధరియించు కొన్నట్టి జగమూలేలే సాంబా శివుని సన్నిధికే' అనేపాట శ్రావ్యమైన

గొంతుగల ప్రతిస్త్రీ పాడుతుంది పల్లెటూళ్ళల్లో. ఈ పురాణగాధల్లో తొలికథా గీతం రామకథ. వాల్మీకి తాను రచించి లవకుశులుచేత గానంచేయించినట్లు తెలుస్తోంది.

## గేయ జానపదగాధలు

ఇవిగాక బొబ్బిలికథ, దేశింగురాజు కథ, కాటమరాజు కథ, కాంభోజరాజు కథ, ముగ్గురుమరాఠీలకథ, పల్నాటివీరకథ, యల్లమ్మకథ, మల్లమ్మకథ, రావులమ్మకథ, లక్ష్మమ్మకథ, బాలనాగమ్మకథ, గులేబకావళికథ, కన్యక, బాలరాజు, ధర్మాంగద, సారంగధర మొదలైనవి జంగాలు మాలదాసరలు, పిచ్చుగగుంటులు, పంబలవాళ్లు, ఒగ్గులు, గొల్లలు పేటల్లో పాడుతూ భిక్షాటనచేస్తుంటారు. మాలదాసరులు 'విప్రనారాయణ' బాగా పాడతారు. జంగాలు తంబుర, ధక్కీలతో 'సిరియాళకథ' చక్కగాచెబుతారు. ఒగ్గులు ఢమరుకంవాయిస్తూ 'మల్లన్న కథ' వీరోచితంగాచెబుతారు. ఈ వీరగాధలు వినేవారికి సంతోషాన్నీ, ఉద్రేకాన్నీ కలిగించి కార్యోన్ముఖుల్ని చేస్తాయి. ఈ గేయగాధలు కథాప్రధానములు - సాహిత్యం ఆనుషంగికమే. గానం వెంబడించి ఉంటుంది. వీనిలో వీరగాథలు, అద్భుతగాధలు, చారిత్రక గాథలు ఎక్కువ. ఒకరాజు గూర్చియో, పేరంటాలుగూర్చియో, అద్భుత కార్యములగూర్చియో సంపూర్ణ కధసముఉంతును. రాజుకథకు కాంభోజ రాజుకథ, వీరగాధకు బాలనాగమ్మకథ, అద్భుతగాధలకు శిరియాళకథ, ధర్మాంగద నిదర్శనాలు.

గ్రీకుభాషలో 'హోమరు' వ్రాసిన 'ఒడిస్సే' 'ఇలియడ్' కథలు యిలాంటివీరగాథలే.

వీరగాధల్లో నాయకుడు ఒకకార్యాన్ని సాధించడానికి కంకణం కట్టుకుంటాడు. ఎన్ని ఒడిదుడుకులువచ్చినా అన్నిటినీ అధిగమించి చివరకు విజయంపొందుతాడు (కాంభోజరాజుకధ). నాయకుడు తన మాటనిలుపు కొనుటకై పరీక్షలన్నిటిలోనూనెగ్గి చివరకు ప్రశంశాపాత్రుడౌతాడు. (మాంథాత). ప్రతినాయకుని స్పర్ధ, పగ తీర్చుకొనుటకై పలు కష్టాలకోర్చి చివరకు విజయంపొందుతాడు. (పల్నాటివీరచరిత్ర). నాయకుడు తాను

ప్రేమించినపడతినిపొందుటకుగాను బహుశ్రమలకోర్చి ప్రతిపక్షశక్తుల వశపరచుకొని లక్ష్యాన్ని సాధిస్తాడు కొన్ని యితరకథల్లో.

* "సంస్కృతీపథమున పయనించునాదిమమానవునియొక్క భావ ప్రకటన (Expression) కథాత్మకమును, కల్పనాపాటవముకలదియునై వచనరూపమునై, పద్యరూపమును పొందియుండవచ్చును. ఈ నాలుగు లక్షణములచేభాసించునాదిమానవునికళాసృష్టియే కథారమ్యమును, కల్పనా పటిష్ఠమును, గాన ద్వితీయమును, లయాన్వితమునునైన జానపదగేయ గాథాస్వరూపమువలన ప్రతిఫలించుచున్నది."

**"పురాణగాథలు మానవుడనుభవించుటకు వీలులేనివిషయములను గూర్చి యాతడు కల్పనాత్మకముగా వివరించుకొనిన యూహల సమాహార స్వరూపమని చెప్పవచ్చును."

*** "పురాణగాథలయొక్క ముఖ్యధ్యేయము ఇతరకథలవలె కేవలము వినువారికి ఔత్సుక్యముకలిగించుటమాత్రమేకాదు. అట్లే కేవలము చారిత్రకసత్యమువెలిబుచ్చుటయు వాని గమ్యముకాదు. కాగా అవి ఒకజాతికి సంబంధించిన జీవనవిధానముయొక్క మౌలికరూపమును, దానియందలి యాచారములయొక్క ప్రాథమికస్వరూపమును సంతరించుకొని, ఒకానొక ప్రాక్తనసత్యమును (Primitive reality) వివరణాత్మకముగాదెలుపు సిద్ధాంతము. (Statement)".

---

* 'తెలుగు జానపదగేయగాథలు, పు. 3 డా॥ నాయని కృష్ణకుమారి.

** Kluck Holn C - Myths and Rituals - A general Theory Harwarg - Theological Review - 35 pp 45 - 79 తెలుగు జానపద గేయగాథలు (డా॥ నాయని కృష్ణకుమారి) పు. 10 నుండి గ్రహింపబడినది.

*** MADINOWSKI - Myth in Primitive Phychology ("తెలుగు జానపద గేయగాథలు" పు. 10 నుండి గ్రహింపబడినది).

*'కథాగేయాలు' యీ క్రింది పదిలక్షణములు కలిగియుండును.

1. గేయరూపంలో ఉంటుంది.
2. అజ్ఞాతరూపంలో ఉంటుంది.
3. గాయకభిక్షువుల ఆశుకవితగా జీవిస్తుంది.
4. వాగూపమైనప్రచారం కలిగివుంటుంది.
5. కవిత్వం వస్తునిష్ఠం (Objective poetry)
6. భాష, భావం సరళంగాఉంటాయి. కొన్ని పదాలు, వర్ణనలు పునరుక్తమౌతుంటాయి.
7. ఒకకవి కర్తృత్వం కావు. ప్రజల్లో సహజంగా జనిస్తాయి.
8. వివిధప్రాంతాలలో వివిధవిధాలుగాకనిపించినా వీని అన్నిటికీ ఏకసూత్రతఉంటుంది.
9. నీతి వాచ్యంగాచెప్పక ధ్వన్యంతరంగాచెబుతుంది. విధిబలీయమన్ననీతిని చెబుతుంది.
10. ప్రతిజీవికి చివర ఓటమిఉన్నదనే విషాదవిషయాన్ని ప్రతిధ్వనిస్తుంటాయి".

## జానపద వచనకథలు

ఇవి పూర్తిగా కట్టుకథలు. వీనిలోనిసన్నివేశాలు భూలోకానికే కాకుండా స్వర్గలోకం, పాతాళలోకాలలోకికూడా పాకిఉంటాయి. వీనిలో రాజకుమారులు, రాజకుమార్తెలు, వీరులు, మాంత్రికులు, రాక్షసులు, పిశాచాలు, పోరాటాలు, సాహసకృత్యాలు, మంత్రతంత్రాలు మొదల గునవి కలిగిఉంటాయి. వినోదంప్రధానం. అద్భుత, వీర, శృంగార రసాలు వీనిలో ఎక్కువగాచోటుచేసుకుంటాయి. దుష్టశిక్షణ, శిష్టరక్షణ, వీరుడైన కథానాయకుడిగెలుపు ధ్యేయంగా ముగుస్తాయి. సాధారణంగా 'అనగనగా' అని మొదలుపెట్టబడి 'కథకంచికి వెళ్ళింది, మనం యింటికి వెళదాం'తో ముగుస్తాయి. పరమానందయ్యశిష్యులకథలు, తెనాలి రామ కృష్ణుడుకథలు, కాశీమజిలీకథలు, భట్టివిక్రమార్కకథలు, పేదరాశిపెద్దమ్మ కథలు, గులేబకావళికథలు, మదనకామరాజుకథలు, సహస్రశిరచ్ఛేద అపూర్వ

* డా॥ తంగిరాల సుబ్బారావు 1975 24 : 26

చింతామణికథలు ఈకోవలోవే. నిజానికి జానపదసాహిత్యంలో ముద్రణాభాగంపొందినవానిలో అధికభాగం యీ వచనకథలే.

పిల్లలు వృద్ధులదగ్గరచేరి 'ఊ' కొడుతూ యీకథలుచెప్పించుకుని వినోదిస్తుంటారు. వర్షాకాలంలో విద్యాగంధంలేనివయోజనులుకూడా అరుగుల మీదకూర్చుని ఒకరుకథచెబుతుంటే ఒకరుఊకొడుతూ ఆనందాశ్చర్యాలతో రోజులతరబడివింటుంటారు. చెప్పేవారినేర్పుమీదఆధారపడి వుంటుంది ఈ కథలఆకర్షణ.

## పొట్టి కథలు

వచనంలో చిన్నపిల్లలకుచెప్పే 'కాకి-నక్క' లాంటి కథలు తెలుగు జానపదవాఙ్మయంలో ప్రత్యేకతగన్నవి. వీనిలో ఎన్నోనీతులుఉంటాయి. పొగడ్తలకు పొంగిపోరాదనే నీతి 'కాకి-నక్క' కథలోను, బలవంతులు బలహీనులనెలా కబళిస్తారో అనేది 'తోడేలు - మేకపిల్ల' కథలోను ఊరకే అపకారంచేస్తే కలిగేఅనర్థాలు "రాజు ఏడుగురు కొడుకులు" కథలోను ఇమిడ్చి చిట్టిపొట్టిపాపల మనస్సులకు హత్తుకొనేలా చెబితే, వారు విజ్ఞులుగా తయారు కావచ్చుననే వీనిఅంతరార్థం. అలాంటివే "బాతు-బంగారుగుడ్డు" "కట్టెలమ్మే వాడు-గొడ్డలి" కథలు కూడా.

## పొడుపు కథలు

మార్గకవిత్వంలో బంధకవిత్వం, చిత్ర కవిత్వంలాంటిదే పొడుపు కథలప్రక్రియ. వీనిని సంస్కృతంలో ప్రహేళికలంటారు. ఇవి చమత్కారానికి ఆటపట్టులు. బుద్ధికి పదును పెడతాయి. మనస్సును వికసింపజేస్తాయి. వినోదాన్ని, విజ్ఞానాన్ని అందిస్తాయి.

"గోడమీదబొమ్మ గొలుసులబొమ్మ
వచ్చిపోయేవారికి వడ్డించుబొమ్మ" (తేలు)
"దిబదిబమన్నాయి రెండు, దిబ్బెక్కి చూసినవి రెండు,
ఆలకించినవి రెండు, అంది పుచ్చుకున్నాయి రెండు"
(కాళ్ళు, కళ్ళు, చెవులు, చేతులు)
చిటారుకొమ్మన మిఠాయిపొట్లం (తేనెపట్టు)
పచ్చనిచెట్టుమీద పిచ్చుక సమర్తాడింది (పండు మిరపకాయ)

ముగ్గురు దొరలకు ఒకటే టోపి (తాటిపండు)
గుడినిండాముత్యాలు, గుడికితాళం (దానిమ్మపండు)
అడవిలోఅక్కమ్మ తలవిరబోసుకుంది (ఈతచెట్టు)
అడవిలో అంబోతు రంకేసింది (గొడ్డలి)
అమారాదేశంనుంచి కోమారావస్తే కానేవాళ్ళేగాని
తినేవాళ్ళులేరు (పగడాలు)
అంబారిమీద కుంబారి
కుంబారీమీద కుడితిగోలెం
కుడితిగోలెంమీద బూర
బూరమీద డబ్బా
డబ్బామీద పీచు
పీచులో ముత్యాలు (పేలు)
దేవుడిగుడితలుపులు వేసేవారేగాని తీసేవారేలేరు (వెల్ల)
అడవిలోపుట్టింది, అడవిలోపెరిగింది
మాయింటికొచ్చింది, తైతక్కలాడింది (చల్లకవ్వం)
పనసపండుతెచ్చి పళ్ళెంలోపెడితే
తినలేనిబ్రాహ్మడు దిక్కులుచూసేనట (పుస్తకం)

ఈ పొడుపు కథలలో ఒక చిత్రముకూడాఉంది. ఒకరు కథపొడుస్తారు. రెండవవారు అది విప్పాలి. విప్పలేకుంటే ప్రతిగా వారొకకథ పొడవాలి. అది మొదటివారు విప్పాలి. అది అతనుచెప్పలేకుంటే ఇరువురూ ఎవరికథ వారు విప్పిచెప్పాలి. ఎదుటివారు విప్పలేనికథలు ఎవరెన్నిపొడిస్తే వారు మేటిగా లెక్క. ఆలోచనాశక్తి రేకెత్తించే విజ్ఞానపు ఆట-మెదడకునిండామేత.

* "Riddles are questions that are framed with the purpose of confusing or testing the wits of those who do not know the answers.

Roger D. Abrahams, Alan Dunder, Folk lore and Folk life. Richard M. Dorsen) (EDP. 130)

---

* (ఆంధ్ర జానపద విజ్ఞానం పు. 215)

# సామెతలు

జీవితాన్ని వడకట్టిన అనుభవాలు సామెతలు. జానపదులకు సూక్ష్మంగా పాఠాలు నేర్పుతాయి. అల్పాక్షరాలలో అనల్పార్థరచనయిది. ఆలోచిస్తే యిదే మినీకవిత. శ్రోతల్ని యిట్టే ఆకట్టుకుంటాయి. ఇవి మన నీతులు, ఆచారాలు, వ్యక్తులు, వృత్తులు, సంసారం, వైద్యం, విద్య, కళలు, మతం, ఆటలు, నమ్మకాలు, కులం, ఆహారం, వ్యవహారం, వాతావరణం, పరిపాలన, వినోదాలపై సంక్షిప్తంగాపలుకబడ్డ ఉక్తులు. జాతీయాలు, నానుడులు, జనశ్రుతులు వీనిలో కోకొల్లలు. సందేశాలు చాలా సూటిగాఅందిస్తాయి హృదయానికిహత్తుకొనేలాగ. ప్రసన్నత దీనికి ప్రాణం. ఎదుటివారిఅభిప్రాయాన్ని సమర్థించడానికిగాని, ఖండించడానికిగాని సామెతలు ఆటంబాంబుల్లా పనిచేస్తాయి. ధ్వని ప్రధానం – ఉపమాలంకారం తోనో, రూపకాలంకారంతోనే, అర్థాంతరన్యాసాలంకారంతోనో, స్వభావోక్తుల తోనో చెప్పబడి సులభగ్రాహ్యంగాఉంటాయి. సామెతనే సామ్యం అంటారు. మనవాళ్ళు మాటాడేటప్పుడు ఊతగా సామ్యంచెప్పినట్టు అంటుంటారు – సామెత చెప్పినట్టు అనిదానర్థం.

* "Proverbs are short and witty traditional expression that arise as part of every day discourse as well as in the more highly structured situations of Education and Judicial proceedings – Roger (D. Abrahams Folk Lore and Folk Life Richard M. Dorsen (ED)P. 119)

"A proverb is a remnant from old philosophy preserves amidst countless destructions by reason of its brevity and fitness for use.

– ARISTOTLE

"Short sentences drawn from Long Experiences"

—Cervantas

---

* డా. ఆర్.వి.యస్. సుందరంగారి "ఆంధ్రుల జానపదవిజ్ఞానం" పుట–198 నుండి గ్రహించబడినవి.

వేదాలు మహర్షులయొక్క జ్ఞానసముదాయాలైతే సామెతల్ని సామాన్య జనులయొక్క అనుభవసారాలుగా పేర్కొనవచ్చు. —కాలెపు వీరభద్రుడు

*"నిత్యజీవితంలో సామెతలఆమెతలు వడ్డించనివాడూ, తిననివాడూ ఉండడు. వక్తవ్యవిషయావబోధకు సులభసాధనం సామెత-విషయాన్ని నిశితంగా సూటిగా స్పష్టంగా సామ్యరూపంలో వ్యక్తంచెయ్యడానికి ప్రతి ఒక్కరికీ ఉపకరించేది సామెత. ఈ సాధనసంపత్తి ఎవరిలో ఎక్కువ వుంటే వాడు మాటకారి. సామెత ప్రసంగానికిప్రాణం. అంతేకాదు, ఏరచన కైనా జనజీవాన్ని ప్రసాదించేవాటిలో సామెతలు ప్రధానమైనవి."

— ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి

**"సామాజికమైన తరతరాలఅనుభవాన్ని ఇముడ్చుకుని సామ్యత, ప్రధానోత్పాదకత, ధ్వనిప్రాధాన్యత, ప్రజాప్రాచుర్యం, శ్రావ్యత కలిగి సంభాషణాయోగ్యమైన సంక్షిప్తవాక్యం తెలుగుసామెత."

ఈ సామెతలు ఒకోప్రాంతంలో ఒకోలాగ ఉన్నాయి. గోదావరి సీమలో జానపదులసామెతలు ఈ క్రిందిరీతి పదునుగాఉంటాయి.

అరిచేకుక్క కరవదు
అర్ధరాత్రికాడ అంకమ్మశివాలని
అమ్మబోతె అడివి, కొనబోతె కొరివి అన్నట్లు
అమ్మ పెట్టా పెట్టదు, అడుక్కుతినానివ్వదు
అత్త సొమ్ము అల్లుడుధారబోసినట్టు
అన్నీ ఉన్నాయి, ఐదోతనమే లోటు
అడ్డాలో బిడ్డలు గాని, గెడ్డాలొచ్చేక బిడ్డలా ?
అంగట్లో అన్నీ ఉన్నా, అల్లుడినోట్లోశని అన్నట్లు
అంతా శ్రీవైష్ణవులేఅయితే బుట్టెడురొయ్యలూ ఏమయినట్టు ?
అందితేజుట్టు, అందకపోతే కాళ్ళు

---

* (డా॥ పి. నరసింహారెడ్డిగారి 'తెలుగు సామెతలు, జనజీవనం' గ్రంథంలోని అప్రవచనం. పు. 1. నుండి గ్రహింపబడినది)

** డా॥ పి. నరసింహారెడ్డి (తెలుగుసామెతలు, జనజీవనం నుండి)

అంబలి తాగేవాడికి మీసాలెత్తేవాడొకడు
అచ్చిపెళ్ళి బుచ్చి చావు కొచ్చింది
అడగందే అమ్మైనా పెట్టదు
అడుసు త్రొక్కనేల కాలుకడగనేల
అత్త చచ్చిన ఆరుమాసాలకి అల్లుడు పరామర్శకొచ్చినట్టు
అడిగేవాడికి చెప్పేవాడు లోకువ
అంత్యనిష్ఠూరంకన్నా ఆదినిష్ఠూరంమేలు
అచ్చమ్మపెళ్ళిలో బుచ్చమ్మశోభనాలని
అలివోణ్ణి బలివోడుకొడితే బలివోణ్ణి బెమ్మదేవుడు కొట్టాడట
అసలే కోతి, అందులో కల్లుతాగింది, ఆపైన తేలుకుట్టింది
అయ్యొచ్చేదాకా అమావాస్యఆగుతుందా ?
అరచేతిబెల్లం చిరుచేదు
అన్నీ తెలిసినోడికి అమావాస్యమరణం, ఏమీ ఎరగనోడికి ఏకాదశిమరణం
అడావిడిపెళ్ళికొడుకు తోడగుడ్డదాన్ని తీసుకుపోయేడట
అణాకాణీపెళ్ళికి అర్ధరూపాయి బాణాసంచా
అదిగో పులంటే ఇదిగో తోకన్నట్టు
అదృష్టవంతుణ్ణి పాడుచేసేవాడూలేడు, దురదృష్టవంతుణ్ణి బాగుచేసేవాడూ లేడు
అమ్మవారిమొక్కూ తీరుతుంది, ఆసాదోడి బూతీతీరుతుంది
అయ్యవారిని చెయ్యబోతే కోతైనట్టు
అయ్యవార్లంగారు ఏంచేస్తున్నారంటే ఒలకబోసుకుని ఎత్తిపోసుకుంటున్నారన్నారట
అబద్ధపుపెళ్ళికి ముడ్డివాయింపులాగ
అమ్మనితిడతావేరా లంజకొడకా అన్నాట్ట
అయ్యకిరెండోపెళ్ళనిసంబరమేగాని తనికి సవతితల్లివస్తుందనేది తెలీదు
అరచేతిలోతేనెబోసి మోచేతివాకానాకించినట్టు
అడివిపంది చేనుమేసిపోతే ఊరపందిచెవులుకోసినట్టు
అతనికంటెఘనుడు ఆచంట మల్లన్న
అతిరహస్యం బట్టబయలు
అతివినయం ధూర్తలక్షణం

అన్నం ఉడికిందోలేదో మెతుకుబట్టి చూస్తేచాలు
అనుమానం పెనుభూతం
అప్పుచేసి పప్పుకూడు
అప్పులున్నవాడివెంట చెప్పులున్నవాడివెంట పోగూడదు
అక్కాచెల్లెళ్ళకన్నంపెట్టి లెక్కవ్రాసుకున్నట్టు
అందానికినేను రాగానికి మాఅప్ప అందట
ఆర్నెల్లు సావాసంచేస్తే వారువీరవుతారు
ఆర్నెల్లు సాముచేసి మూలనున్నముసలమ్మను పొడిచాడట
ఆలికి అన్నంపెట్టడం ఊరికిఉపకారం
ఆలూలేదూ చూలూలేదూ కొడుకుపేరు సోమలింగం
ఆవు చేలోమేస్తే దూడ గట్టునమేస్తుందా ?
ఆయనేఉంటే మంగలెందుకూ అని
ఆవులిస్తే పేగులులెక్కపెట్టేరకం
ఆడది తిరిగిచెడుతుంది మగవాడు తిరక్కచెడతాడు
ఆకలి రుచిఎరగదు, నిద్ర సుఖమెరగదు
ఆఊరికి ఈఊరెంతో ఈఊరికి ఆఊరూఅంతే
ఆదిలోనే హంసపాదు
ఆ అంటే అపరాధం, ఊ అంటే ఉపరాధం (ఉపద్రవం)
ఆకులునాకేవాడింటికి మూతులునాకేవాడొచ్చాడట
ఆడబోయినతీర్థం ఎదురైనట్టు
ఆతానులోదే ఈ ముక్కకూడా
ఆడలేక మద్దెలఓడన్నట్టు
ఇంటిగుట్టు లంకకుచేటు
ఇంటికి ఏబ్రాసి పొరుక్కి శ్రీమాలక్ష్మి
ఇంటిదొంగని ఈశ్వరుడుకూడా పట్టలేడు
ఇల్లలగ్గానే పండగవుతుందా ?
ఇల్లు ఇరకాటం, ఆలి మర్కటం
ఇంత లావున్నావు తేలుమంత్రంరాదా అని
ఇంటివాడు గొడ్డుగేదంటే పొరుగువాడు పాడిగేదంటాడా ?
ఇంటిపేరు కస్తూరివారు, ఇల్లంత గబ్బిలాలకంపు

ఇల్లుకట్టిచూడు, పెళ్ళిచేసిచూడు
ఇంటికోపుష్పమయితే ఈశ్వరునికోమాల
ఇంటిమీదరాయివేసి వీపొగ్గినట్టు
ఇంట్లోఈగలమోత బైట పల్లకీలమోత
ఇంటిలోవాడు 'ఇలో' అంటే, పొరుగువాడు 'హాలో' మంటాడు
ఇంతబతుకూబతికి ఇంటెనకాల పడిచచ్చినట్టు
ఇద్దరపెళ్ళాలమొగుడు ఇరుకునబడిచచ్చాడట
ఇన్నికంతిలుకొసేనుగాని నాకంతంతనొప్పి ఎరగనన్నాడట
ఇనపగుగ్గిళ్ళగాసి అనపగుగ్గిళ్ళుకావు
ఇల్లుకాలుతుంటే నుయ్యిత్రవ్వడంప్రారంభించినట్టు
ఇల్లుదాటిన ఆడది లోకానికి లోకువ
ఇసకతక్కెడ, పేడతక్కెడ
ఇంతోటిముఖానికి వీశెబులంపసుపా అని
ఈమాత్రంసంబడానికేనా ఇంతఆర్భాటం
ఈనగాచి నక్కలపాలుచేసినట్టు
ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికెగిరిందట
ఉన్నమాటంటే ఉలుకెక్కువ
ఉభయభ్రష్టత్వం ఉపరిసన్యాసత్వం
ఉయ్యాలలోపిల్లనెట్టుకుని ఊరంతావెతికినట్టు
ఉండేదిగట్టి, పోయిందిపొల్లు
ఉన్నది మనిషికిపుష్టి, తిన్నది పశువుకుపుష్టి
ఊరుమ్మడిగొర్రె పుచ్చిచచ్చిందని
ఉల్లి మల్లవుతుందా ?
ఊరకున్నంతఉత్తమం బోడిగుండంతసుఖమూలేదు
ఊరందరిదీఒకదారి, ఉలిపికట్టెదొకదారి
ఊళ్ళోపెళ్ళైతే కుక్కలకిఅడావిడి
ఊహ ఊళ్ళేలుతుంటే కర్మ గాడిదలుకాస్తోందని
ఊరందరికీనేసులోకువ నాకు నంబినాంచారయ్యలోకువన్నట్టు
ఎంతచెట్టుకంతగాలి
ఎక్కడైనాబావగాని వంగతోటదగ్గర బావకాదన్నాడట

ఎగరబోయి బోర్లాపడి ఊరచ్చురాలేదన్నట్టు
ఎద్దుపుండు కాకికి ముద్దా ?
ఎదుపుసొమ్ము బరువుచేటు
ఎలకలమీదకోపంతో ఇల్లుతగలెట్టుకున్నట్టు
ఎవడికిపుట్టినబిడ్డరా వెక్కి వెక్కి ఏడుస్తావని
ఎవళ్ళుతీసుకున్న గోతిలో వాళ్ళేపడతారు
ఎక్కడవేసినగొంగళి అక్కడే
ఎవరికంపు వారికింపు
ఎవళ్ళపిచ్చి వాళ్ళకానందం
ఏపుట్టలోఏపాముందో
ఏరుదాటి తెప్పతగలేసేరకం
ఏచెట్టూలేనిచోట ఆముదంచెట్టేమహావృక్షం అన్నట్టు
ఏమొగుడూలేకుంటే అప్పమొగుడే దిక్కని
ఏరుదాటిందాకా ఏరుమల్లయ్య ఏరుదాటాక బోడిమల్లయ్య
హేమాహేమీలు యేట్లోకొట్టుకుపోతుంటే నక్కపాటిరేవడిగిందట
ఏరాయైతేనేం పళ్ళూడగొట్టుకోడానికి ?
ఏకై వచ్చి మేకై తగులుకున్నట్టు
ఏకర్రకు నిప్పంటే ఆ కర్రే కాలుతుంది
ఏమమనువులెల్లినా యేకులొడకటం తప్పలేదట
ఏడ్చేదానికిమొగుడొస్తే ఏకులొడికేదానికీ మొగుడొస్తాడని
ఏనుగునుచూసి కుక్కలు మొరిగినట్టు
ఏనుగు బ్రతికినా వెయ్యే, చచ్చినా వెయ్యే
ఏబ్రాసికి పనెక్కువ లోభికి ఖర్చెక్కువ
ఏగూటిచిలక ఆగూటిపలుకే పలుకుతుంది
ఒక నాడాదొరికింది, ఇక మూడునాడాలూ గుర్రం దొరకడమే తరువాయి అన్నాడట.
ఒకరిద్దరినిచంపితేగాని వైద్యుడుకాడు
ఒకఊరికాపు ఇంకోఊరికి మాల.
ఒకదెబ్బకి రెండుపిట్టలు
ఓడలు బళ్ళవుతాయి, బళ్ళు ఓడలౌతాయి
ఓడినోడు వీధిలో ఏడిస్తే, నెగ్గినోడు ఇంట్లోఏడ్చాడట

ఓలితక్కువని గుడ్డిదాన్ని పెళ్ళిచేసుకుంటే నెలకి ముప్పయికుండలు పగలగొట్టిందట.
కుంచెడొడ్లు కూలికెళితే తూముడొడ్లు చూడలుతినేశాయట.
కుక్క మొరిగితే జంగం పరపతిపోతుందా ?
కడవంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువ
కడుపులోలేనిది కావలించుకుంటే వస్తుందా ?
కర్రలేనివాణ్ణి గొర్రెకరచిందన్నట్టు
కలిపోసిపెట్టినా ఉట్టివంకేచూసినట్టు
కలిసొచ్చేవేళకి నడిచొచ్చేబిడ్డపుడతాడని
కాకిపిల్ల కాకికిముద్దు
కాకిముక్కుకు దొండపంటులాగ
కాకుల్నికొట్టి గెద్దలకేసినట్టు
కాలుజారితే తీసుకోగలంగానీ, నోరుజారితే తీసుకోలేం
కాలుపట్టుకుతోస్తే చూరుపట్టుకు వేళ్ళాడుతున్నట్టు
కాశీకెళ్ళి గాడిదగుడ్డుతెచ్చినట్టు
కుక్కకాటుకు చెప్పుదెబ్బ
కుక్కతోకట్టుకుని గోదారీదినట్టు
కూలికొచ్చి పాలికిమాటాడినట్టు
కూసేగాడిదొచ్చి మేసేగాడిదిని చెరిపిందట
కాలికేస్తే మెడకీ, మెడకేస్తే కాలికీ
కొండకీ వెంట్రుకక్కీ ముడేయడం
కొత్తబిచ్చగాడు పొద్దెరగడన్నట్టు
కొత్తవింత, పాతరోత
కొబ్బరిచెట్టెందుకెక్కావంటే దూడగడ్డికోసమన్నాడట
కొరివితో తలగోక్కున్నట్టు
కోడలికిబుద్ధిచెప్పి అత్తరంకోయిందట
కావమ్మమొగుడంటే కాబోసనుకున్నాను - కాకపోతే నా కర్రా, బుర్రా ఇలా పారెయ్యండి పోతానన్నాడట
కోతికి కొబ్బరికాయదొరికినట్టు
కూచోడానికిచోటిస్తే తొంగోడానికి చోటిమ్మన్నాడట
కూడారావొద్దంటే ఎత్తుకోమనిఏడ్చిందట

కుక్కపని గాడిదచేసినట్టు
కాకై కలకాలంబతికేకంటే హంసై ఆరుమాసాలుబ్రతికినావాలు
కడుపుచింపుకుంటే కాళ్ళమీద పడుతుంది
కొండనాలుక్కిమందేస్తే ఉన్ననాలుక ఊడిపోయిందట
కరవమంటే కప్పకికోపం, విడవమంటే పాముకికోపం
కొడుకువాగుండాలి కోడలుముండామొయ్యాలి.
కూకుంటే గడవంది కూలికెడితే గడుస్తుందా అని
కుమ్మరావలో ఇత్తడిముంతలు దొరుకుతాయా ?
కథ అడ్డంతిరిగింది.
కొత్త గాసిరొస్తే అర్ధరాత్రి గొడుగుపట్టమన్నాడట
కలిపికొట్టరా కావేటిరంగా అని
కుమ్మరికి కుండకరువు, కమ్మరికి తెడ్డుకరువు
కరువులో అధికమాసం
కాడు రమ్మంటుంది - వూరు పొమ్మంటుంది
కడుపు వీపు అన్నట్టు
కంచే చేనుమేసింది
కక్కినకూడుకాసపడినట్టు
కడుపునిండిననోటికి గారెలుచేదు
కుడితిలోపడ్డ ఎలకలాగ
కూర్చునితింటే కొండైనా తరిగిపోతుంది
కొండనితలకిందెట్టుకుని గులకరాళ్ళకోసం వెతికినట్టు
కొండనితవ్వి ఎలకనుపట్టినట్టు
కొత్తనీటికి చేపలెదురెక్కినట్టు
కయ్యానికైనా వియ్యానికైనా సమఉజ్జీ ఉండాలి
గొంగట్లో కూర్చుని వెంట్రుకలులెక్కపెట్టినట్టు
గారం గారెలుకేడిస్తే వీపు దెబ్బలకేడ్చిందట
గాలివానవస్తే కథేలేదు
గుడినిమింగేవాడొకడైతే గుడినీ గుళ్ళోలింగాన్ని మింగేవాడొకడు
గుడ్డిలో మెల్లలాగ
గుడ్డెద్దు చేలోపడ్డట్టు
గుడ్డొచ్చి పిల్లనెక్కిరించిందట.

గుమ్మడికాయలదొంగ అంటే భుజాలుతడుముకున్నట్టు
గుర్రంగుడ్డిదైనా దాణాతప్పదు
గాడ్రాలికేంతెలుసు బిడ్డలసంగతి
గొర్రెలుతినేవాడుపోతే బర్రెలుతినేవాడొస్తాడు
గోడకు చెవులుంటాయి
గోడదెబ్బ చెంపదెబ్బ
గోడమీద పిల్లివాటం
గంతకుతగినబొంత
గరికిమేసిన గాడిదేపోతుంది
గొర్రె కసాయివాణ్ణే నమ్ముతుంది
గోటితోపోయేదాన్ని గొడ్డళ్ళదాకా తెచ్చినట్టు
గోరుచుట్టుమీద రోకలిపోటు
గునపూడిజంగాలు అమ్మకిల్లుకట్టినట్టు
గుడ్డికన్ను మూసినాఒకటే తెరిచినాఒకటే
గోచీకిచిన్న గోణానికిపెద్ద
గండంగడిచి పిండంబయటపడింది
గాడిదకిగడ్డేసి ఆవునిపాలిమ్మంటేఎలా ?
గాదిలోగింజలుగాదిలోనే ఉండాలి బిడ్డలు బీరకాయల్లాగుండాలి
గాలికిపోయినపేలపిండి కృష్ణార్పణం అన్నట్టు
గురివిందపూస గుద్దకింద నలుపెరగదట
గొంతుకలో పచ్చెలకాయపడ్డట్టు
గోడవతలగోలేటంటే, కోమట్లరహస్యాలన్నాడట
గోడకికొట్టినసున్నం సానికిపెట్టినసొమ్ము తిరిగిరావు
గోవును గోలెందగ్గరికి తీసుకెళ్ళగలంగాని కుడితి తినిపించగలమా ?
చల్లకొచ్చి ముంతదాయడమెందుకు ?
చూసిరమ్మంటే కాల్చివచ్చాడట
చంద్రునికోనూలుపోగులాగ
చచ్చినోడికళ్ళు చేరడేసి
చదవేస్తే ఉన్నమతిపోయిందట
చదువకోకముందు కాకరకాయంటే చదువుకున్నాక కీకరకాయన్నాడట.

చెప్పేవి శ్రీరంగనీతులు, దూరేవి దొమ్మరిగుడిసెలు
చద్దన్నంతిన్నమ్మ మొగుడాకలిఎరగదని
చావుకుపెడితేగాని లంఖణాలకురాదు
చావుతప్పి కన్నులొట్టపోయినట్టు
చింతచచ్చినా పులుపుచావదు
చిత్తం శివునిమీద భక్తి చెప్పులమీద
చిన్నపామునైనా పెద్దకర్రతో కొట్టాలి
చీరసింగారించుకొనేటప్పటికి ఊరు మాటుమణిగిందట
చెట్టుచెడేకాలానికి కుక్కమూతిపిందెలు పుట్టినట్టు
చెవిటివాడిదగ్గర శంఖమూదినట్టు
చేతిచమురుఛాగోతం
చేతులుకాలేక ఆకులుపట్టుకున్నట్టు
చుట్టంగావచ్చి దెయ్యమైపట్టుకుందట
చచ్చినోడిపెళ్ళికి వచ్చిందేకట్నం
చెట్టుపేరుచెప్పి కాయలమ్ముకున్నట్టు
చేసేచేసేకాపురంచెడగొట్టకపోతే నేను నీరంకుమొగుణ్ణేకాదన్నాడట
చాదస్తపుమొగుడు చెబితేవినడు కొడితేఏడుస్తాడు
చిక్కినతగువా చిక్కనితగువా అని
చూపులగుర్రమేగాని చురుకుదనంలేదు
చెడిస్నేహితుడింటికైనాపోవచ్చుగాని చెల్లెలింటికి వెళ్ళకూడదు
చెబితేపాపంగాని తింగేసికొడితేచస్తుందన్నాడట
చెరపడానికి చేటపెయ్యవాలు
చెరువుమీదకోపగించి ముడ్డికడుక్కోవడం మానేసినట్టు
చెరువులోగేదెనెట్టి కొమ్ములుబేరమాడినట్టు
జోగీజోగీరాసుకుంటే బూడిదరాలిందన్నట్టు
జరుగుబాటుంటే జ్వరమంతసుఖంలేదు
జిహ్మకోరుచి పుర్రెకోబుద్ధి
డూడూ బసవన్నాఅంటే తలూపినట్టు
తనకిలేదనిఏడిస్తే ఒకకన్నుపోయిందట, ఎదుటివారికుందనిఏడిస్తే రెండోకన్నుపోయిందట.
తడికటుతిసేవాడికి అప్పడాలుతెక్కా అని

తప్పక వనోమునోచి ఎక్కువఫలంరమ్మంటే వస్తుందా ?
తడిగుడ్డతో గొంతుకుకోసే రకం
తలప్రాణం తోక్కొచ్చింది
తలా తోకా లేని కథలాగ
తల్లి పుట్టిల్లు మేనమామదగ్గరా ?
తాచెడ్డకోతి వనమెల్లాచెరిచినట్టు
తానుపట్టినకుందేటికి మూడేకాళ్ళన్నట్టు
తానుదూరడానికికంతలేదుగాని మెడకోడోలు అన్నట్టు
తాపులగొడ్డుకి రోలడ్డం
తానువలచిందిరంభ తానుమునిగిందిగంగ
తింటేగాని రుచీ దిగితేగాని లోతూ తెలీవు
తిండికితిమ్మరాజు పనికిపోతురాజు
తిన్న ఇంటి వాసాలులెక్కపెట్టేరకం
తిట్టేనోరు తిరిగేకాళ్ళూ ఊరుకోవు
తీగలాగితే డొంకంతా కదిలిందని
తుంటిమీదకొడితే ముందుపళ్ళురాలినట్టు
తులసివనంలో గంజాయిమొక్క మొలిచినట్టు
తెగించినవాడికి తెడ్డేలింగమన్నట్టు
తొడసంబంధం కొంథయ్యేళ్ల దాకా పోదు
తుమ్మితేఊడేముక్కు ఎన్నాళ్లుంటుంది ?
తల్లి కడుపుచూస్తుంది పెళ్ళాం జేబుచూస్తుంది
తల్లికికూడెట్టనోడు పినతల్లికి కోకెడతాడా ?
తాతా పెళ్లిచేసుకుంటావాఅంటే ఇచ్చేవారెవరూ అంటాడట
తాతల్నాడునేతులుతాగాం మా మూతులు వాసనచూడమన్నట్టు
తాటిచెట్టుకింద పాలుతాగినా కల్లే అంటారు.
తొక్కితేరాయి మొక్కితే దేవుడు
తద్దినంపెట్టినోడి తమ్ముళ్ళాగ
తినబోతూ రుచి అడగడమెందుకు ?
తన్నితే బూరెలబుట్టలోపడ్డట్టు
తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం
తాటాకుచప్పుళ్లకు కుందేళ్లు బెదరవు

తద్దినం కొని తెచ్చుకున్నట్టు
తన్నుతప్పించి ఆకాశమంతపెడుగుపడినా ఫరవాలేదన్నాడట
తల్లి గండమూకాదు పిల్ల గండమూకాదు మధ్యన మంత్రసానిగండమన్నట్టు
తాడూలేదూ బొంగరంలేదు
తీతువుపిట్ట కాళ్లపైకెట్టి ఆకాశంపడకుండా ఆపుచేస్తున్నానందట
తెల్లవారిందంటే వీధిలోమగవాళ్ళనుపిలవ్వేఅన్నాడట
తొండముదిరి ఊసరవిల్లయినట్టు
దున్నపోతుమీద వానకురిసినట్టు
దంపినమ్మకి బొక్కిందేకూలు
దినదినగండం నూరేళ్ళాయుష్షు
దీపముండగానే ఇల్లుచక్కబెట్టుకోవాలి
దున్నపోతు ఈనిందంటే దూడనుకట్టమన్నాడట
దూరపుకొండలు నునుపు
దేవుడువరమిచ్చినా పూజారివరమివ్వడు
దొంగని తేలుకుట్టినట్టు
దొంగలుబడ్డఆరుమాసాలకి కుక్కలుమొరిగినట్టు
దొడ్డెడుదూడలూ దొంగఎత్తుకుపోతే గొడ్డుగేదె శివాలచ్చిమయిందట
దరిద్రుడిపెళ్లికి వడగళ్ళవాన
దూదేకులవాడికి దూదతెగులు, లంజకి పిల్లతెగులు
దొరికితే దొంగ దొరక్కపోతే దొర
దశకొద్దీదొరికాడు బిసకత్తులమొగుడని
దున్నేఎద్దునే పొడుస్తారు
దుబ్బుబారెడు, వెన్ను మూరెడు, దూస్తేదోసెడు, ఊత్తేఉళక్కి
దున్నపోతూ దున్నపోతూ పోట్లాడుకుని లేగదూడకాళ్ళిరగ్గొట్టినట్టు
దొంగవచ్చేడండీ లేవండంటే ముక్కుకరుస్తాడే జాగ్రత్తఅన్నాడట
దొంగతల్లికి ఏడవ భయం
దొంగలూదొంగలూకలిసి ఊళ్లుపంచుకున్నట్టు
నూరబద్ధాలాడైనా ఒకపెళ్ళిచెయ్యమన్నారు
నేతిబీరకాయలో నెయ్యిలాగ
నేలవిడిచి సాముచేసినట్టు

నోరుమంచిదైతే ఊరుమంచిదవుతుంది
నోరుంటే తలకొస్తుంది
నిజం నిలకడమీద తెలుస్తుంది
నక్కెక్కడా ? నాగలోకమెక్కడ ?
నలుగురితోపాటునారాయణా కులంతోపాటు గోవిందా.
నల్లేరుమీద బండిలాగ
నవ్విననాపచేనే పండుతుంది
నవ్వేఆడదాన్నీ ఏడ్చేమగవాణ్ణీ నమ్మకూడదంటారు
నవ్వు నాలుగువిధాల చేటు
నా కోడీ కుంపటీ లేకుంటే తెల్లవారదన్నట్టు
నానాటికితీసికట్టు నాగంబొట్టూ అన్నట్టు
నిండుకుండ తొణకదు
నిజమాడితే నిష్ఠూరం
నిత్యంచచ్చేవాడికి ఏడ్చేవాడెవడని
నిద్రపోయేవాణ్ణిలేపగలంగాని దొంగనిద్రపోయేవాణ్ణి ఎవరులేపగలరు ?
నివురుగప్పిన నిప్పులాగ
నేలనుపోయేది నెత్తికిరాసుకున్నట్టు
నిండామునిగినోడికి చలేమిటి ?
నొసటరాసినరాత తుడిచినాపోదు
నక్కపుట్టినాలుగువారాలుకాలేదు ఇంతగాలివాన నేనెప్పుడూచూశ్శేదందట
నలుగురితోచావు పెళ్ళితోసమానం
నీట్లోగేదెనెట్టి బేరమాడినట్టు
నీ తలమీదతేలుందంటే నీచేత్తోనేతీసెయ్యమన్నాడట
నేపుట్టకపోతే నీకుపెళ్ళామేలేకపోనంటే నువ్వుపుట్టకపోతే నీఅమ్మని పెళ్ళాడుదునన్నాడట.
నోరున్నవాడిదే రాజ్యం
నక్క ఒకచోట ఊలేసి ఇంకోచోట గౌరీకళ్యాణం పాడదు
పనలెత్తుకుపోయినోణ్ణివదిలేసి పరకేరుకునేవాణ్ణి పట్టుకున్నారట
పాకపీకి పందిరేసినట్టు
పనోడుపందిరేస్తే పిచ్చికలు పడగొట్టేసేయట
పెడితేపెళ్ళి పెట్టకుంటేశ్రాద్ధం

పిచ్చుకమీద బ్రహ్మాస్త్రంలాగ
పొరుగూరువాడికి నీటిభయం ఊళ్లోవాడికి కాటిభయం
పుల్లవంపు పొయ్యితీర్చినట్టు
పళ్ళున్నచెట్టుకే రాళ్ళదెబ్బలు
పాముకి పంటిలోవిషం, ఊతికి కంటిలోవిషం
పొరుగింటి పుల్లకూర రుచి
పోరునష్టం పొందులాభం
పండగనాడుకూడా పాతమొగుడేనా ?
పనిలేనిమంగలి పిల్లితలగొరిగాడట
పసుగెత్తి పాలుతాగేకంటే నిలబడి నీళ్ళుతాగడంమేలు
పాడిందేపాడరా పాసిపళ్ళదాసరీ అని
పాలుతాగి రొమ్ముగుద్దినట్టు
పిచ్చికుదిరింది తలకిరోకలిచుట్టమన్నాడట
పిట్టపోరూ పిట్టపోరూ పిల్లితీర్చిందన్నట్టు
పిడుక్కీ బియ్యానికి ఒకటేమంత్రం
పిల్లకాకికేంతెలుసు ఉండేలుదెబ్బ ?
పిల్లికళ్లుమూసుకొనిపాలుతాగుతూ తనని ఎవరూచూడ్డంలేదనుకున్నట్టు
పిల్లికిచెలగాటం ఎలక్కిప్రాణ సంకటం
పిల్లికి ఎలక సాక్ష్యం
పట్టుబట్టవెరువిచ్చి పీటట్టుకుతిరిగినట్టు
పుట్టుకతోవచ్చినబుద్ధి పుడకలతోగానిపోదు
పుణ్యానికిపెడితే నీమొగుడితోసమానంగాపెట్టమన్నాడట
పురిట్లోనే సంధికొట్టినట్టు
పులినిచూసి నక్క వాతపెట్టుకున్నట్టు
పువ్వులమ్మినచోట కట్టెలమ్మినట్టు
పెట్టినమ్మకు పుట్టిందేసాక్షి
పెద్దతలకాయలేకపోతే ఎద్దుతలకాయ తెచ్చిపెట్టుకోమన్నారు.
పెద్దపులి పేరంటంపెట్టదు
పేదవాడికోపం పెదవికిచేటు
పొట్టోడికి పుట్టెడుబుద్ధులు

పిండికొద్దీ రొట్టి
పుణ్యంకొద్దీపురుషుడూ, దానంకొద్దీబిడ్డలూ
పుల్లయ్యేవారంయెల్లొచ్చినట్టు
పాతచింతకాయపచ్చడి పత్యానికిమంచిది
పండినమలిసంవత్సరం కరువు
పట్టపగలుకొొంగట్టుకుండేరానిది చీకట్లోకన్నుకొడితేవస్తుందా ?
పనసకాయదొరికినప్పుడే తద్దినంపెట్టమన్నారు
పుట్టలో పాలోసి పొట్టతడుముకుందట
పెళ్ళికెళుతూ పిల్లినిచంకనెత్తుకెళ్ళినట్టు
పేనుకిపెత్తనమిస్తే చేనంతాతెగకొరికిందట
పానకంలోపుడకలాగ
పుండొకచోటుంటే రచ్చొకచోటేసినట్టు
పుండుమీద కారం చల్లినట్టు
పుండికి పుల్ల మొగుడు
పాపీ చిరాయువు
వెర్రివాడిపెళ్ళాం వాడకంతా వదిన
పట్టుకున్నవాడు మట్టగిడసంటే పైనున్నవాడు బొమ్మిడాయన్నాడట
పారేసుకున్న చోటే వెతుక్కోవాలి
పిల్లిమెడలో గంటకట్టేదెవరా అని
ప్రజలసొమ్ముతో పెద్దతిరపతెళ్ళినట్టు
పంచపాండవులంటే మంచంకోళ్ళలా ముగ్గురని రెండేళ్ళుచూపించాడట
పడగచుట్టం పాము పగానా ?
పదిమందిలోపడ్డపాము చావదు
పాండవులవారిసంపాదన దుర్యోధనులవారిపిండాకూళ్ళకుసరి
పాముకి పాలుపోసిపెంచినట్టు
పిచ్చికుదిరితేగానిపెళ్ళవదు పెళ్ళయితేగాని పిచ్చికుదరదు
పిడక్కి వారశూలా ?
పిల్లిగుడ్డిదైతే ఎలకముడ్డిచూపించిందట
పులికడుపున పిల్లి పుడుతుందా ?
పులిమీద పుట్రలాగ
పెట్టకపోయినా పెట్టేఇల్లుచూపమన్నారు

పెట్టనమ్మ ఎలాగా పెట్టదు పెట్టేముండకేమొచ్చిందిరోగం అన్నాడట
పెద్దింటిరంకు పెద్దచెరువుకంపు బయటకురావు
పేరుగొప్ప ఊరుదిబ్బ
పొమ్మనక్కర్లేదు పొగబెడితేచాలు
పోయినమగడుపోతేపోయేడు పొన్నకాయలా గుండుపదిలిందంటట
పోలీపోలీ నీ భోగమెన్నాళ్ళంటే మాలపల్లినుంచి మాయత్తొచ్చే వరకూ అందట
పరాయివాడితోలేచిపోతూ అత్తా నీకొడుక్కి చద్దన్నంఅలవాటందట
పైనపటారం లోనలొటారం
బూడిదలోపోసిన పన్నీరులాగ
బురదగుంటలో పందిలాగ
బోడెద్దుకు పోట్లుమప్పినట్టు
బతకనిబిడ్డ బారెడు
బంగారపుపళ్ళానికైనా గోడదాపుండాలి
బిడ్డతేగలాగున్నాడంటే తేగతెమ్మనేడ్చేడట
బయటపులి ఇంట్లోపిల్లి
బ్రహ్మచారిముదిరినా బెండకాయముదిరినా పనికిరారు
బాలనాయకం బహునాయకం
బ్రాహ్మణపాలేరుతనంచేస్తావా పల్లకిఎక్కుతావా అంటే పల్లకీ ఎక్కితే ఒళ్ళుకదులుతుంది బ్రాహ్మణపాలేరుతనమేచేస్తానన్నాడట
బెల్లంఉన్నచోటే ఈగలుముసురుతాయి
భోగండానివలపు బొగ్గుతెలుపూ లేదు
భక్తిలేనిపూజ పత్రిచేటు
మనబంగారం మంచిదైతే కంసాలిననవలసిన పనేవిటి ?
ముందునుయ్యి వెనకగొయ్యి
ముందొచ్చినచెవులకంటే వెనకొచ్చిన కొమ్ములు వాడి
మూలిగేనక్కమీద తాటికాయపడ్డట్టు
మెత్తనివాణ్ణిచూస్తే మొత్తబుద్దేసుందట
మొండోడు రాజుకంటేబలవంతుడు
మొగుడుకొట్టినందుకుకాదు తోటికోడలు దెప్పినందుకేడ్చిందట
మోకాలికీ బట్టతలకీ ముడేసినట్టు

మంచిమనిషికోమాట మంచిగొడ్డుకోదెబ్బ
మంత్రాలకు చింతకాయలురాలతాయా ?
మొగుడుచస్తేనేగాని ముండకు బుద్ధిరాదు
మసిబూసి మారేడుకాయచేసినట్టు
మాంసంతింటామని ముడుసులు మెళ్ళోకట్టుకుతిరుగుతారా ?
మాటకు మాటతెగులు నీటికి నాచుతెగులు
మాటలు కోటలుదాటుతాయి కాళ్ళు గడపదాటవు
మాటలునేర్చినకుక్క ఉస్కో అంటే ఉస్కో అందట
మిన్ను విరిగి మీదపడ్డట్టు
మాయింటికొస్తే ఏంతెస్తావ్ మీయింటికొస్తే ఏంపెడతావ్ అన్నట్టు
మేకవన్నె పులి
మంత్రసానిపనికొప్పుకున్నప్పుడు బిడ్డొచ్చినాపట్టాలి, గొడ్డొచ్చినాపట్టాలి
మందిఎక్కువైతే మజ్జిగపల్చనౌతుంది
మేకపెంటికి దొడ్లోఉన్నా ఒకటే ముడ్లోఉన్నా ఒకటే
మొదటిదానికి మొగుడులేడుగాని కడదానికి కళ్యాణమట
ముంజులుతిన్నవాణ్ణొదిలేసి మోరలుతిన్నవాణ్ణి పట్టుకున్నారట
మందిచేరితే మఠానికిచేటు
మొక్కైవంగంది మానై వంగుతుందా ?
మోసేవాడికితెలుస్తుంది కావిడిబరువు
మింగడానికిమెతుకులేదుగాని మీసాలికిసంపెంగనూనట
మారాజా అని మనవిచేసుకుంటే మరోరెండుతగిల్చియ్యమన్నాడట
మనిషిమంచిదేగాని గుణంగుడిచేటిది
మీఇంట్లోభోంజేసి మాఇంట్లోచెయ్యికడుక్కోమన్నాడట
ముళ్ళకంచెమీదఆరేసినబట్ట మెల్లిగా తీసుకోవాలి
ముందునడవమని వెనకాల కొంకులుకొట్టే రకం
ముల్లొచ్చి అరటాకుమీదపడ్డా, అరిటాకొచ్చి ముల్లుమీదపడ్డా అరిటాకుకేనష్టం
ముసలాడికి దసరా పండుగని
మూడుమనువులెల్లినా మాయ్యావడం తప్పలేదన్నట్టు

మొగమాటానికిపోతే కడుపొచ్చిందట

మొగుడుచచ్చిమొత్తుకుంటుంటే మిండగాడొచ్చి మీదపడ్డాడట

యాదవకులంలో ముసలంపుట్టినట్టు

రామాఅంటే బూతయిపోయింది

రాజులసొమ్ము రాళ్ళపాలు

రాజునిచూసినకళ్ళతో మొగుణ్ణిచూస్తే మొత్తబుద్దేస్తుందట

రామాయణంఅంతావిని రాముడికి సీతేమౌతుందన్నాడట

రామాయణంలో పిడకలవేట

రోగి పాలేకోరాడు, వైద్యుడూ పాలే పత్యం చెప్పేడన్నట్టు

రొట్టెవిరిగి నేతిలోపడ్డట్టు

రోకల్లి మద్దెలతో మొరపెట్టుకున్నట్టు

రౌతుకొద్దీ గుఱ్ఱం

రౌతుమెత్తనైతే గుర్ర్రం మూడుకాళ్ళతోనడుస్తుంది

రంకుసాగితే పెళ్ళెందుకురా పెదబాబూ అని

రంకునేర్చింది బొంకనేరదా అని

రామేశ్వరంపోయినా శనేశ్వరంతప్పలేదన్నట్టు

రాజుతలిస్తే దెబ్బలకికొదవా ?

రామేశ్వరంవెళ్ళినా రంకుమొగుడుపోరు తప్పలేదన్నట్టు

రాకుసబొగ్గుల్లో రామచిలుక

రజకచక్రవర్తి అంటే అంతపెద్దపేరు మాకెందుకుదొరా ఆపేరు మీరే ఉంచుకోండన్నాడట

రాజుగారికి పెద్దకొడుగ్గానైనాపుట్టాలి భోగంబానికి తమ్ముడిగానైనాపుట్టాలి

రాముడిలాంటిరాజుంటే హనుమంతుడిలాంటి బంటూ ఉంటాడు

రెండుచేతులూ కలిస్తేనేగా చప్పట్లు !

రొయ్యకులేదా తెగబారెడుమీసం ?

లంకమేత గోదారిఈత

లంజను లంజా అంటే నూరుసార్లు లంజంటుంది. ఇల్లాలిని లంజా అంటే ఇల్లుదూరుతుంది.

వాసరాకడ ప్రాణంపోకడ తెలీదు
వంకలేనమ్మ డొంకట్టుకేడ్చిందట
వట్టిగొడ్డుకు అరుపులెక్కువ
విగ్రహపుష్టి నైవేద్యనష్టి
వడ్లగింజలో బియ్యపుగింజ
విత్తుముందా ? చెట్టుముందా ?
వినాయకుడిమీద భక్తా ? ఉండ్రాళ్ళమీద భక్తా ?
విస్సన్న చెప్పిందే వేదం
వెదకబోయినతీగ కాలికితగిలినట్టు
వెర్రివాడిచేతిలో రాయిలాగ
వ్రతంచెడ్డా ఫలందక్కాలి
వండుకున్నవాడికంటె దండుకున్న వాడిపనే మెరుగు
వడ్డించేవాడు మనవాడైతే కడబంతిలో కూర్చున్నా ఫరవాలేదు
వెధవముండయినా వేవిళ్ళుతప్పవు
వసుదేవుడు గాడిదకాళ్ళు పట్టుకున్నట్టు
విత్తొకటివేస్తే మొక్కొకటిమొలుస్తుందా ?
వెధవముండకి దణ్ణంపెడితే నాలాగ నూరేళ్ళు బ్రతకమందట
శుభంపలకరామంకెన్నా అంటే పెళ్ళికూతురువెధవముండ అన్నాడట
శంఖంలోపోస్తేగాని తీర్థంగానట్టు
శనగలుతిని చెయ్యికడుక్కున్నట్టు
శివుడాజ్ఞలేనిదే చీమైనాకుట్టదు
శతకోటిదరిద్రాలకు అనంతకోటిఉపాయాలు
శతకోటిలింగాల్లో ఈబోడిలింగమొకటి
సరదాకి సమర్తాడితే చాకలిది కోకెత్తుకెళ్ళిందట
స్వర్గానికెళ్ళినా సవతిపోరు తప్పనట్టు
స్వాతివానకు ముత్యపుచిప్పల్లాగ
సమయానికిలేనిబాకా చంకనాకనా అనీ
సూదికోసంసోదికెళితే పాతరంకులు బయటపడ్డాయట
సన్యాసిపెళ్ళికి జుట్టుదగ్గరనుంచీ ఎరువే
సిగ్గులేనిమొహానికి నవ్వేసింగారమని

సూర్యుడిమీద ఉమ్మేస్తే తనమీదే పడుతుంది
సిరిపోయి చీడపట్టుకున్నట్టు
చిత్రాలమొగుడు తిరాలేస్తే చింతాకుల్లో చిక్కడిపోయేయట
సముత్తకీడు వాకలిదాన్ని కొట్టేసినట్టు
సుబ్బమ్మ పెళ్ళిలో సూరమ్మమూర్తాలని
సంచిలాభం చిల్లికూడ్చిందన్నట్టు
సరసుణ్ణినమ్ముకొని ఉన్నమొగుణ్ణి ఊడగొట్టుకుందట
సత్రంభోజనం మఠంనిద్ర
సముద్రంలో కాకిరెట్ట
సర్రాజుపెళ్ళిలో గుర్రాజుకోపోను
సాటివారితో సరిగంగస్నానాలుచేస్తుంటే ముసలమొగుణ్ణి మొసలెత్తుకెళ్ళిందట
సిరిఅబ్బదుగాని చీడ అబ్బుతుంది
సీతారామాభ్యోనమః అంటే మాయింటాయన ఎదురుకాలేదా అన్నదట
హోరుగాలిలోదీపమెట్టి దేవుడా నీదేభారమన్నట్టు
హనుమంతుడిఘుండా కుప్పిగంతులు ?

## తిట్లు

జానపదులు నిర్భయులు. తగువొచ్చిందంటే ముందువెనుకలాలోచించకుండా తిట్టేస్తారు. ఆవేశపూరితమైనమనిషికోపానికి వాగ్రూపం తిట్టే. ఆదికావ్యం తిట్టుతోనే ప్రారంభమయింది.

"మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీసమాః
యత్క్రౌంచమిధునాదేకమవధీః కామమోహితమ్"

క్రౌంచపక్షిజంటలో ఒకపక్షినికొట్టిన బోయవాణ్ణిచూసి వాల్మీకి ఆగ్రహం పట్టలేక అప్రయత్నంగాతిట్టిన తిట్టిది. "ఓ బోయవాడా ! నీవు వృద్ధినిపొందవు" అని. మహర్షి తిట్టుకనుక మృదువుగావుంది. కాని జానపదుల తిట్లు కఠినంగానూ, ఒక్కొక్కప్పుడు కర్ణకఠోరంగానూకూడా ఉంటాయి. ఆడవారైతే మరీను—పీధికుళాయిలదగ్గర సిగపట్లతో యీ తిట్టు ప్రవాహంలా సాగిపోతుంటాయి. ఆవేశం వేడెక్కేకొద్దీ బూతులుకూడా తోడవుతుంటాయి.

స్త్రీలతిట్లు స్త్రీలనైతే

నీ నోట్లో పురుగులుపడ
నీ శవం కాటికెళ్ళ
నీముఖంమండ
నీనోరుపడిపోను
నువ్వూడిపోను
నువ్వురాలిపోను
నీకు పెద్దరోగం రాను
నీ జిమ్మడ
నువ్వు ముండామొయ్య
నిన్నమోమ్మరేసుకుపోను
నీతాడు తెగ
ముండ
లంజ
గుడిచేటిదాన  (గుడి + చేటి = దేవదాసి)
నీకు దిక్కులేనిచావు రాను
నీకాళ్ళూచేతులూ పడిపోను

చిన్న పిల్లల్నయితే —

నిన్ను గోతిలో పెట్ట
నీయమ్మకడుపు కాల

పురుషులనైతే —

వెధవ, చచ్చినోడ, నీపెళ్ళాం రేవులోకెళ్ళ

మగవాళ్ళతిట్లు మగవాళ్ళనైతే —

వెధవ, లంజకొడకా
ఇవన్నీ శాపనార్థాల లాంటివి.

ఇక క్రియాత్మక తిట్లు తీవ్రఆగ్రహంతో ఫట్ ఫట్మంటూ పేలిపోతుం టాయి యిలాగ — బుర్ర రామకీర్తన పాడించేస్తాను జాగ్రత్త. (రామ కీర్తన పాడించడమంటే గట్టిగా కొట్టడం అట). నిన్ను కోదండంతీయించక పోతే నాపేరు ఫలానా కాదు. (కోదండంతీయించడమంటే తలకాయ దూలా నికి వ్రేలాడదీయడమట.)

తన్నేనంటే మళ్ళా నీ దిక్కున్నకాడచెప్పుకోవాలి.
సాచిపెట్టిలెంపకాయకొడితే మళ్ళీ మందినీళ్ళడగప్ప తెలుసా!
మళ్ళీమాటాడేవంటే చెంపపగిలిపోతుంది
మళ్ళీపేలితే పళ్ళు రాలిపోతాయి జాగ్రత్త
నోరుముయ్యి
సమాధానంచెప్పేవో గూబ గుయ్యిమంటుంది
కళ్ళుపీకేస్తాను ఏమనుకుంటున్నావో
నిన్ను ముక్కలుముక్కలుకింద నరికి పోగులుపెట్టేస్తాను
పళ్ళు రాలగొడతాను
పీకపిసికి గోతిలోకప్పెట్టేస్తాను
వీపువిమానంమోత మోగిపోద్ది - జాగ్రత్త

ఒక వీధికుళాయిదగ్గర నీళ్ళుపట్టుకోవడంలో తగువొచ్చి జరుతెగించి వేడివేడిగావదులుతోన్న తిట్లుచూసి ఒకసినీరచయిత గబగబా రాసేసుకుంటున్నాడట. అలావెళుతున్న ఒకాయన అదేంటయ్యా అలా రాసేసుకుంటున్నావంటే అవేగా మా సినిమా డైలాగులు అన్నాడట. ఇది నేటి సినీమాలమీదజోకేఅయినా ఇది సినిమారంగం తిట్టుసాహిత్యానికిచ్చిన గౌరవాన్ని వ్యక్తం చేస్తుంది.

## ఒట్లు

జానపదులు తమ సత్యసంధతను తెలిపేరూపం ఒట్టు. చేతిలోచెయ్యేసి చెప్పేఒట్టు ఒకటి, నోటితోనేచెప్పే ఒట్టొకటి. ఏదైనా పనిచేస్తానని ఒప్పుకోడానికి చేతిలోచెయ్యేసి 'ఒట్టు' అంటారు. అంటే ఇది వాగ్దానపుఒట్టన్నమాట. "చేతిలోచెయ్యేసిచెప్పు మావ" ఇది గట్టిఒట్టు. ఇక రెండవది తాను చెడ్డపని చెయ్యలేదనిచెప్పడానికి నోటితోచెప్పే ఒట్టు.

తల్లికి తోడు
నాబిడ్డల మీదొట్టు
సత్యప్రమాణంపూర్తిగా ఒట్టు
నిన్ను చంపుకుతిన్నట్టు

నీమీద ఒట్టు
నాబిడ్డల తోడు
దేవుడమీద ఒట్టు
(ప్రమాణంచేసేటప్పుడు కొందరు నెత్తిమీదచెయ్యివేసి మరీ ఒట్టుపెడతారు) పదమందికట్టినయింటిక్రిందఉండి చెబుతున్నానీమాట
అబద్ధమైతే పుసుగులడిపోతాను.
ఇక ఆజ్ఞాపనగా పెట్టే ఒట్లున్నాయి
నామాటవినకుంటే నీప్రాణాలుతియ్యకపోతే ఒట్టు
ఇప్పుడునువ్వుయిల్లుకదిలావంటే నన్నుచంపుకుతిన్నట్టే

ఇవికూడా పటుత్వం కలిగినవేగాని కొందరు మాటిమాటికి ఒట్టంటుంటారు — అదిమాత్రం ఒట్టి అలవాటుమాట.

## దీవెనలు

చిన్నవాళ్ళు ఎవరైనానమస్కారంచేస్తే పెద్దవాళ్ళు ఇలా ఆశీర్వదిస్తుంటారు—

సుఖంగా నూరేళ్ళు బ్రతుకు
దేవుడు నీకు మేలుచేస్తాడు
నీ మంగళసూత్రం చల్లగుండాలి (ఆడవారికైతే)
ఒకింటివాడివై పిల్లా మేకాతోచల్లగాఉండాలి (మగవాడిని)
నీయమ్మకడుపు చల్లగుండా —
నా ఆయుష్షుకూడా పోసుకు బ్రతుకు
నీకు జయం కలగాలి.
ఏదైనా ప్రయాణంవెళ్ళేటప్పుడు వెళ్ళొస్తానని చెబితే -

'శుభం' అని కొందరు, "క్షేమంగావెళ్ళి లాభంగా రా" అని కొందరూ దీవిస్తుంటారు.

## ఊతపదాలు

సాధారణంగా మాట్లాడేటప్పుడు జానపదులమాటల్లో ఊతపదాలు ఎక్కువ కనిపిస్తుంటాయి. తరువాత మాట వెంటనే స్ఫురణకు రాకపోవడం

వల్లగానీ, అలవాటువల్లగానీ మధ్యమధ్య యీ ఊతపదాల ప్రయోగం జరుగుతుంటుంది. గోదావరిజిల్లాలలో ఈక్రిందిపదాలు ఎక్కువగా వినబడుతుంటాయి.

దీని తల్లీ బొడ్డూ పొక్క
వీడమ్మకడుపు బంగారంగానూ
దెవుడు మేలుచేస్తె
ఏటీ
ఏదీ
మరీ
కానీ
అయితే
పోగా
ఇకపోతే
దీనమ్మా మొగుడు
గాడిద గుడ్డు
అదేపోయిందిలెద్దూ
తరవాత
నేచెప్పేదేటంటే

ఇందులో ఏటీ, మరి, తరువాత, ఇకపోతే, పోగా, చెప్పేదేటంటే అనేవి వేదికలమీద నట్టుతూమాట్లాడేవారి ఉపన్యాసాల్లోకూడా తరుచుగా వింటుంటాం. వీటికి అర్థంపర్థం ఉండదక్కడ – అలవాటుమాటలంతే – దీనిని ఇంగ్లీషులో 'మేనరిజమ్స్' అంటారు.

శ్రీ నేదునూరి గంగాధరంగారు అనేక శ్రమదమాదులకోర్చి జీవితమంతాధారపోసి పలుప్రాంతాలుతిరిగి చాలాభాగం సేకరించి లిఖించి వారి కుటీరంలో భద్రపరచి పరమపదించారు. చీకటిగదిలో మ్రగ్గుతున్న ఈ సాహిత్యం చెదలపాలుకాకుండారక్షించుకోవడం తెలుగుజాతి కర్తవ్యం.

— * —

# జానపద కళలు

తెలుగువారి సహజమైననిధి వారి జానపదకళాసంపద. తనడానికి తిండి ఉన్నా లేకున్నా, ఆకలితోనైనాసరే ఈ ప్రదర్శనలుచూసి ఆనందించి, అప్పుచేసైనా తృణమో ఫణమో ఇచ్చి కళాకారులను ఆదరించే సహృదయులైన పల్లెజనులే వీరి మహారాజపోషకులు. కళాకారులు కూడా అల్పసంతుష్టులు-ఆ పూటగడిస్తే చాలు వారికి చిదానందమే.

ప్రాచీనకాలంనుంచీ ప్రఖ్యాతంగాకనుపించేజానపదకళారీతులు దొమ్మరాట, గంగిరెద్దాట, మోళీఆట, గుర్రాలట, మల్లెలాట, గరగాట, బండ్లమీద వేషాలు, గారడీలు, ఎరుగుబంట్లవేషాలు, కోయనృత్యం, కర్రసాము, కోలాటం, బుట్టబొమ్మలాట, భోగంమేళం, కోలసంబరం, పండరిభజన, తోలుబొమ్మలాట, వీధిభాగోతం, పంబకథ, తంబురకథ, బుర్రకథ, జముకులకథ, హరికథ, పగటివేషాలు మొదలైనవి.

## దొమ్మరాట

T "దొమ్మరివిద్యలలోకనిపించే ఏకాగ్రత, క్రమశిక్షణ అంతగా కొట్టిపారెయ్యవలసింది ఎంతమాత్రమూ కాదు"

దొమ్మరాట సాధారణంగా సంక్రాంతిపండుగరోజులలో కడతారు. దొమ్మరజాతివారు రెండుమూడుకుటుంబాలుకలిసి ఒకజట్టుగా వస్తారు. జట్టులో అయిదారుగురు స్త్రీలుంటారు. వారిలో ఇద్దరుముగ్గురైనా పరువంలో ఉన్న పడుచులుంటారు. వీరే ఆజట్టుకు ప్రధానమైన ఆకర్షణ. ఊరినడిమధ్యలో ఆటకుఅన్ని ఏర్పాట్లూచేసికొని ఉదయంనుండి ఈ కళాకారులు ఊళ్ళోధనికులైన పెద్దవాళ్ళఇళ్ళకుతిరిగి పురుషులను ఆహ్వానిస్తూ చేయితగిలించినట్లూ చూపుతగిలించినట్లూ వారినిఆకట్టుకొని మొత్తంమీద ఊరంతా ఆటదగ్గరకు చేరేటట్టుచేసుకుంటారు.

ఒకరు డప్పు, ఒకరు డోలు వాయిస్తుంటే వానికనుగుణంగా వీరిలో ఆడా మగా గోచీలు ఎగగట్టి తొడకొడుతూ జబ్బచరుస్తూ "హారియా, హారియా' అంటూ మొగ్గలేస్తారు. మనఇళ్ళల్లో పిల్లలు శిరస్సుక్రిందికి

---

T. శ్రీశ్రీ 'రాజకమలం' ప్రత్యేకసంచిక. 1980

పెట్టి ముగ్గులుపేస్తుంటే అదేమిటిరాదొమ్మరిముగ్గులు ? అంటుంటారు — అవన్నపాట వీరి ముగ్గులపద్ధతి. డోలుశబ్దాన్నిబట్టి వీరు ముగ్గులు బలే వడిగావేస్తూ చూపరులకు ఆనందింపచేస్తారు.

వీరిఆటలో ఆఖరిఅంశం సాని గెడెక్కడం. దాదాపు పాతిక అడుగుల లావుపాటి బలమైనవెదురుగడ నిటారుగానిలబెట్టి అది పడిపోకుండా నాలుగు వైపులా గట్టిత్రాళ్ళతోకడతారు. ఆ వెదురు కర్రచివర రెండంగుళాల ఇనుప ఊచముక్క ఉంటుంది. వేపరొట్ట చుట్టబడి దానికికొంచెందిగువలో ఒకచిన్న ఊయల కట్టబడి ఉంటుంది. దొమ్మరసాని వెదురుబొంగుకణుపులదగ్గర కాలి బొటనవ్రేలితోనొక్కి పెడుతూ నిచ్చెనఎక్కినట్లుపైకెక్కి అక్కడ ఊయ్యాలలో ఊగుతూదానిమీదకూడా ముగ్గులువేసిచూపి ఆతరువాత పైనున్న వేపరొట్టతీసి క్రిందపడవేసి, ఆ ఇనుపఊచను బొడ్డులోపలకట్టుకున్న ఇనుప గిన్నెకు తగిలించి, కాళ్ళూ చేతులూ బారచాపి, గాలిలో గిర్రునతిరుగుతుంటే ఆ ప్రజ్ఞకు జనమంతాచప్పట్లుకొడుతూవినోదిస్తారు. సాని గెడెక్కితిరగడం గ్రామానికిశుభమని ఇప్పటికీ ముసలమ్మలుచెబుతుంటారు.

ఈ దొమ్మరాటలు రెడ్డి, పద్మనాయకరాజులకాలంలోకూడా (15వ శతాబ్దిలో) కలవు. అంతేగాక యింకాముందుచూస్తే పండితారాధ్య చరిత్రలో యిలావ్రాయబడింది.

'అమరాంగనలు దివినాడెడు మాడ్కి
సమరంగ గడలపై నాడెడువారు".

దీనినిబట్టి దీనిప్రాచీనత గమనించవచ్చును. చంద్రశేఖరశతకంలో వీరి ప్రతిభను యిలా చెప్పేడు.

'మెట్టుగ దొమ్మరెక్కగన
యించిన యిద్దమడేదలేదు నా
తెట్టొక బాప విద్దెలని
తిట్టును మూర్ఖుడు చంద్రశేఖరా",

అంటే బ్రాహ్మణవిద్యలేవీకూడా దొమ్మరివిద్యకు సరిరావట. దీనిమీద ఒకపాటకూడా వుంది. అందులో యీఆటతీరు కన్నులకుకట్టినట్లుంది -

అమ్మనన్నుకనకే దొమ్మరోడికియ్యకే
చాపచుట్టమంటాడు - చంకబెట్టమంటాడు
ఇల్లెక్కమంటాడు - ఇద్దెలు చూపమంటాడు
గడెక్కమంటాడు - గంతులెయ్యమంటాడు" అని—

దొమ్మరిసానులుచేసే కసరత్తులు, గమ్మత్తులు, వాలుచూపులే యీ ఆట ప్రత్యేకత. వీరు తూర్పుగోదావరిజిల్లాలోని పెద్దాపురం, రాజానగరంలలోనూ, పశ్చిమగోదావరిలో తాడేపల్లిగూడెం రైలుస్టేషనుదగ్గరా ఉన్నారు.

## గంగిరెద్దాట

'అయ్యగారికి దణ్ణంపెట్టూ - డూడూ, డూడూ బసవన్నా' అని గంగిరెద్దులతో పగలు అడుక్కొని రాత్రులు పేటల్లో ఆటకడతారుగంగిరెద్ల వాళ్లు. ఇందు 'రారాబసవన్నా' అని పిలవగానే దూరానఉన్నగంగిరెద్దు ఉర కలువేసుకుంటూ పరిగెత్తుకురావడంలాంటిచూస్తే ఎంతబాగాతర్ఫీదిచ్చారో అని జనం ఆశ్చర్యపోతారు. ఒకమనిషి నేలమీద వెల్లకిలా పడుకొని గంగి రెద్దును తనమీదకుపిలవగా అది అతనిమీదకుఎక్కి ఒకకాలు అతనిమీద, ఒకకాలు గుండెలమీద, రెండుకాళ్ళు పొట్టమీదపెట్టి నిలుపగా అంతబరువునూ కూడా సునాయాసంగా మోసెయ్యడం, ఆ విధంగా ఎక్కినఎద్దు ఊగుతూ గుండెలమీద నాట్యంచేస్తుంటేకూడా అతను నిభాయించుకొని ఉండగలగడం వంటి సాహసకృత్యాలు వీరిఆటలో ఆశ్చర్యపరిచే విద్యలు. తమ చెప్పుచేతల్లో అవినడవడానికి వానికి ముకుదాళ్ళుపోసి కోలతోజడిపిస్తూ ఆడిస్తారు. ఈగంగిరెద్లాటలు గురించి పల్నాటివీరచరిత్రలో యిలావ్యాఖ్యానింపబడింది. —

"గంగిరెద్దుల వాడు కావరమణచి
ముకుదాడు పొడిచిన పోతెద్దులట్లు"

గంగిరెద్లకు రాముడు, లక్ష్మణుడు అనిపేర్లు పెడతారు. వారు "రాముడూ! రా" అంటే పెద్దఎద్దు పరుగెత్తుకువస్తుంది. "లక్ష్మణుడూ! రారా" అంటే చిన్నఎద్దు వస్తుంది. చూసేవాళ్ళకిది చోద్యంగాఉంటుంది.

## మోళీ ఆట

ఏదైనా ఒకరోడ్డుపై డోలుకొడుతూ ఢమరకంవాయిస్తూ ఉర్దూయాసతో తెలుగుమాటలు వినబడుతూ జనం చుట్టూమూగిఉన్నారంటే అదిఖాయంగా మోళీఆటే. ఇది సాహెబులవిద్య. కాళీగాఉన్న పాములబుట్టచూపి అందులో ఒక కాగితంవేసి మూసి మరల మూతతీసేసరికి అందులో కాగితానికిబదులు పాముండడం. మనిషిని బుట్టలో పెట్టి మాయంచెయ్యడం. కాళీకుంచం పిల్లవానికాళ్ళసందునపెట్టి రూపాయలుకురిపించటం, ఉంగరాన్ని మాయంచేసి తిరిగితెప్పించటం వంటి అద్భుతాలు ప్రదర్శించి చేరినజనాన్ని సంభ్రమంలో ముంచెత్తుతారు. ఇదంతా కనికట్టు. వీరి ఉర్దూతెలుగుమాటలూ బుల్‌బుల్ మీద హిందీసినిమాపాటలూ మధ్యమధ్య పేల్చే జోక్సూ మంచి తమాషాగా ఉంటాయి. ఇదంతా కొత్తలంకయోగిమహాత్యమనిచెప్పి ఆఖరున అతని పేరుతో తావీదులు అమ్ముతుంటే జనం నిజమనేభ్రాంతితో కొనేస్తారు. దీనినే గారడీవిద్య అని పిలుస్తారు. కొరవిగోపరాజు వ్రాసిన సింహాసన ద్వాత్రింశికలో దీనిప్రసక్తి ఉంది.

ఇప్పుడిది "ఇంద్రజాలవిద్య" అని థియేటర్లలో ప్రదర్శనలిస్తూ దేశప్రఖ్యాతిపొందుతున్నారు సావర్కారు, పట్టాభిరాం వగైరాలు. ఈ రచయిత కూడా యిలాగ ఎన్నో ప్రదర్శనలివ్వడం జరిగింది.

## గుర్రాలాట

గిరజాలతలలు, చెవులకు పెద్దకమలాలు, సైకిల్‌కట్టు పంచె, పైకి ఎగగట్టినగోచీతో క్షత్రియపుత్రులవలెగోచరించే ఎదెనిమిదిమంది 'యోధులు' నాలుగైదు స్వారిగుర్రాలతో ఊరిమధ్య ఆటసాగిస్తారు. వీరుమొదట బల ప్రదర్శనకు సంబంధించినఅంశాలుప్రదర్శిస్తారు. ఒకనిరెండుభుజాలమీదా, ఇద్దరునిలబడడం, ఆపై ఇద్దరిభుజాలమీదా ముగ్గురునిలబడడం, రెండెడ్ల బండిని జుట్టుకుకట్టుకొని ఒకరులాక్కురావడం, బలమైన ఇనుపగొలుసులు త్రెంచడం, కట్టిగాకట్టిన మూడు నాలుగు ఇనుపగునపాలను ఒక్కపెట్టున వంచడంవంటివి ఎన్నెన్నోచేసి ఆఖరికార్యక్రమంగా గుర్రాలమీద వేగంగా స్వారీచేస్తూ వానిపై మొగ్గలువెయ్యడం, పరుగెడుతున్న గుర్రాలపై

ఒకదానిమీదనుండి మరొకదానిమీదకుఉరుకుతూ స్వారీచెయ్యడం మొదలైన ఫీట్సుతో జనాన్ని అద్భుతంగా ఆకట్టుకుంటారు.

## మల్లేలాట

"మాయమ్మాసత్తెం చూడండోయ్ మల్లేలోయ్ మల్లేలా" అంటూ చెణ్ణమనే లావుపాటిజనపనారకొరడాదెబ్బలు విసురుతూ, ముఖానికీ చెంపలకూ పసుపూ కుంకుమా పూసుకుని, కుచ్చెళ్ళుగల పరికిణీవంటిది కట్టుకొని, చెట్టువేరు దండకడియంమాదిరగా చుట్టుకొని ఒకపురుషుడూ అమ్మవారి విగ్రహంవున్న పెట్టె నెత్తిమీదపెట్టుకొని నడుముకు వీరణం కట్టుకొని, రెండు పుల్లలతోవాయిస్తూ ఒకస్త్రీ వస్తారు. ఆ కొరడా విసురుతుంటేవచ్చే 'ఛట్' మనే పెద్దశబ్దానికీ వీరణందెబ్బకీ మల్లేలపాటకీ వీధిజనంఅంతా చోద్యంగా చూడడానికిచేరతారు. అప్పుడు వీరు అమ్మవారిపెట్టె క్రిందికిదింపి ఆటప్రారంభిస్తారు. వీరుచూపేవిఎక్కువగా అమ్మవారిమాయలు. అమ్మవారిచేతులకు గాజులువేసి తెరవేస్తారు. ఒకనిమిషంపోయాక తెరతీసిచూస్తే ఆ గాజులుండవు. ఈ విధంగానే పసుపు, కుంకుమ వగైరాలు మాయంచేస్తారు. మామూలుగా గుడ్డలో వడ్లువేసి పేలాలుగా వేపుతారు. ఈరీతిని పల్లెజనాన్ని ఎంతగానో వినోదింపజేస్తారు. వీరిని మల్లెకాసరవాళ్ళనిపిలుస్తారు జానపదులు.

## ఎలుగుబంట్లవేషాలు

ఇవి ఎక్కువగా సంబరాల్లోనే కనిపిస్తాయి. ఇద్దరు రెండు ఎలుగుబంట్లుగా చెక్కతోచేసిన ఎలుగుబంటిముఖాలను తమముఖాలకు తగిలించుకొని ఎలుగుబంటి వెంట్రుకలమాదిరి నలుపురంగువేసినజనపనారపీచు చిక్కం ఒళ్ళంతాతొడుక్కొని "తాసా" వాయిద్యానికనుగుణంగా ఎలుగుబంటివలె గంతులేస్తుంటారు. "తాసా" అంటే మెడనుండిగుండెలమీదకు త్రాడుతో వ్రేలాడదీసుకొని రెండుచేతులతోనూ రెండుపుల్లముక్కలతో వాయించేది. ఇందులో శక్తివేషంకూడా వుంటుంది. చెక్కతో చేయబడి, రంగులు వేయబడి, పెద్ద నాలుక చాపిచూపుతున్న శక్తిముఖం తగిలించుకొని, పెద్దపెద్ద స్తనాలుఅమర్చుకొని, పైన నల్లఅంగీతొడుక్కొని, ఒకచేతిలో కత్తి, ఒకచేతిలో శూలం ధరించి ఈ ఎలుగుబంట్లతో సమంగా ఎగురుతూ చేరిన జనాన్ని అప్పుడప్పుడు అదలిస్తుంటారు.

## పులివేషాలు

జాతర్లలోనే పులివేషాలుకూడా పెడుతుంటారు. ఇద్దరుముగ్గురు వొంటినిండా పసుపు. నలుపు పులిచారలు వేసికొని ముఖానికి పులితల (అట్టతోగాని, చెక్కతోగాని చేసింది) తగిలించుకుంటారు. పులివేటగాడిలా ఒకవ్యక్తి కర్రపట్టుకుని మధ్యనుంటాడు. తాసామోతకనుగుణంగా పుల్లాగ పిచ్చి అడుగులువేస్తూ మనిషిమీదకు లంఘించడానికి ప్రయత్నిస్తున్న పులివేషధారులూ, మాటుగాసి వానిని చంపడానికి ప్రయత్నిస్తున్నమనిషిలాగ కర్రతోనున్నవ్యక్తీ నటిస్తుంటారు. ఒక్కోసారి అవి అతనిమీదకు పంజా విసిరినట్టూ, కర్రతోకొట్టి వానిబారినుంచి అతను తప్పించుకున్నట్లూ యిలా వేటక్రీడావిశేషాలన్నీ ప్రదర్శిస్తుంటారు. జానపదులకు ఉత్సుకతకలిగించే కళలలో యిదిఒకటి.

పీర్లసంబరాలరోజుల్లో యిలా పులివేషాలతో కొంతమంది యింటింటికితిరిగి యీ ఆటప్రదర్శిస్తూ డబ్బులు దండుతుంటారు.

## బండ్లమీద వేషాలు

పల్లెలలో దేవుళ్ళఉత్సవాలకూ దేవతల సంబరాలకూ బండ్లమీద వేషాలు పెడతారు. లక్ష్మి, విష్ణువు, గణపతి, కాటకి, పాండవులు, సీతారామలక్ష్మణులు, యమధర్మరాజు, పార్వతీపరమేశ్వరులు మొదలైన వేషాలు ప్రసిద్ధి. వీనికి నిశ్చలత ప్రధానం. సజీవప్రతిమవలె ఉండడం ఇందులో ముఖ్యం. ఈవేషాలువెయ్యడానికి చదువుఅక్కరలేదు సరిపడిన రూపం కావాలంతే. గ్రామాలలో చదువురానివారెందరికో నాటకాలలో వేషాలువెయ్యాలని సరదావుంటుంది. వీనిద్వారా ఆ సరదాతీరుతుంది. జనం యీవేషాలను ఎంతో ఆనందంగాచూస్తారు. ఆదిలో ఊలపల్లినివాసి శ్రీ కావ వెంకన్న యీవేషాల మేకప్‌లో మంచిప్రసిద్ధిగడించారు. తరువాతయిప్పుడు నాటకాలకు డ్రస్‌సప్లయిచేసే కంపెనీలన్నీకూడా యీ పనిలోకి దిగాయి.

ఒకసారి "ఏపుల" పత్రికలో యీ బండ్లమీద వేషాలపై ఒకజోక్ పడింది. రాయగడ రైల్వేకాలనీలో దసరాసంబరం ఊరేగింపులో బండిమీద

వేషాల్లో సీతారామాంజనేయ వేషాలు ఉన్నాయట. సీతారాముల పాదాలదగ్గర ఆంజనేయుడు కూర్చున్నాడు. సీతకు యూరినల్‌కు అవసరం వచ్చింది. అర్జంటు. కదిలితే ఆవేషం నిశ్చలతపోతుంది. ఏంచెయ్యాలి ? కాస్సేపటికి ఆంజనేయుడు దభాల్ని బండిమీదనుంచిఉరికేశాడట. సగంతడిసినపంచెతో సీతను బండబూతులు తిడుతూ.

## గరగాట

గంగాలమ్మ, నూకాలమ్మ, మరిడమ్మ వంటి గ్రామదేవతల సంబరాలకూ జాతర్లకూ గణాచార్యులు గరగలనెత్తుకొని డప్పులమోతకనుగుణంగా ఎగురుతుంటారు. గరగ ఇత్తడికుండవలెఉంటుంది. దాని నెత్తిమీద పాము పడగ అమర్చబడివుంటుంది. గరగలకు కోకలు కుచ్చిళ్ళతోకడతారు. ఈ గణాచారులను ఆసాదులంటారు. అంటే దేవతల పూజారులన్నమాట. వీరు గోదావరిసీమలో ఊరూరాఉన్నారు.

వీరు శబ్దానుగుణంగాఎగురుతూ డప్పులు వడిగా వాయించేటప్పుడు పూనకంచేస్తారు. దీనినే "గవెక్కడం" అంటారు. అప్పుడువెంటనే ఇద్దరు మనుషులుపట్టుకొని మరొకరు కోడిపిల్లను నోటికికరిపిస్తారు. గవెక్కిన వ్యక్తి దాన్ని పటుక్కున కొరికేస్తాడు. అమ్మవారికి కోడిపిల్లలు మొక్కుబడులు వస్తుంటాయి - అవి చూడగానే వానికి పూనకం వస్తుంది. అప్పుడు కొట్టేడప్పులదెబ్బలు వినేవారిలోకూడా ఆవేశం తెస్తాయి. ఈ సంబరాలనే జాగారాలంటూ తెల్లవార్లూచేస్తారు. జనం చూస్తూనేఉంటారు.

## గారడీలు

ఉత్సవాలకూ ఊరేగింపులకూ పల్లెలలో గారడీలుపెడతారు. గారడీ అంటే మోళీఆటకాదు. పర్వతాలవంటిపెద్దడోళ్ళను కర్రలతో లయగా వాయిస్తూ వానిచుట్టూ వలయంగా పాతిక ముప్పయిమంది నిలబడి కాళ్ళకు ఎండుగడ్డిచుట్టుకొని ఆపైన ఇనుపఅందెలు పెద్దపెద్దవి ఒక్కొక్కకాలికి రెండేసిజతలవంతున ఒకదానిమీదఒకటితొడిగి మొలకుగజ్జెలు కట్టుకొని "ఏలేఏల ఏలేయాల హైలెస్సో ఓహో" అంటూ ఏలపాటలు, తుమ్మెద

పాటలు, వెన్నెలపదాలు వగైరా జానపదగీతాలుపాడుతూ వానికనుగుణంగా పైకీక్రిందికీ ఎగురుతుంటే ఊరంతా ప్రతిధ్వనిస్తుంది. వలయం మధ్య అట్ట టోపీలూ, చమ్కీవస్త్రాలతో కొందరు దేవతా స్త్రీ పురుషవేషాలు వేసుకొని నృత్యంచేస్తూ పాటఅందిస్తుంటారు. ఇదికూడా ఎంతసేపైనా చూస్తారుజనం. గోదావరిసీమలో మాలలు యీ ప్రదర్శన చేస్తారు.

## తప్పెటగుళ్ళు

ఇవికూడా అమ్మవారిజాతర్లలోనూ దేవుళ్ళఊరేగింపులలోనూ పెడుతుంటారు. ఈకళాకారులనుఎక్కువగా కళింగసీమనుంచిరప్పిస్తుంటారు. ఈతప్పెట అనేది 'తాసా' లాగుంటుంది. ఇనుపరేకుడొప్పలాగమలచబడి పైన చర్మంతోకప్పబడి అంటించబడుతుంది. లోన గుల్లగనక చేతివ్రేళ్ళతో వాయిస్తుంటే దెబ్బస్థాయినిబట్టి శబ్దం వస్తుంది. ఇదిగుండెలమీద కట్టుకుని వాయిస్తారు. దీనికి 10, 15మంది జట్టుఉంటారు. అందరూ తప్పెటలు తగిలించుకొని పాటలయకుఅనుగుణంగా వానిని వాయిస్తుంటారు. వీరు ఎర్ర రంగుకలిగిన పొట్టిచేతులజుబ్బాలూ నిక్కర్లూ వేసుకుంటారు. ఆనిక్కర్ల చివర గజ్జెలుకుడతారు. కాళ్ళకుకూడా గజ్జెలు కట్టుకుంటారు. అవివాయిస్తూ, పాడుతూ ఒకపద్ధతిప్రకారం నృత్యంచేస్తారు. వీరుయాదవకులస్థులు. వీరిపాటలూకథలూ వైష్ణవపరంగా ఉంటాయి. గోపాలకృష్ణునిరాసక్రీడలు, కృష్ణలీలలతాలూకు పాటలు ఎక్కువగా చోటుచేసుకుంటాయి. గురువు ముందుపాడుతూ నృత్యాభినయంచేస్తుంటే మిగిలినవారుతరువాతపాడుతూ అనుసరిస్తారు. దీనిలోని ప్రత్యేకత వివిధరీతులగతులలో తప్పెటలు వాయించడం, సర్కసుఫీట్సులాగ ఒకరిభుజాలమీదఒకరు, అతనిమీదయిద్దరూ యిలాఎక్కి తప్పెట్లు వాయిస్తుండడం, ఒకరుకాళ్ళు బారచాపుకుకూర్చుని మోకాళ్ళమీద యిద్దర్ని కూర్చుండబెట్టుకొని తానులేవకుండాపడుకునే గిర్రుననాలుగువైపులా తిరుగుతూ తప్పెటవాయిస్తూ పాటపాడడం, పెద్దకుండపై ఒకడునిల్చుని, అతని భుజంమీదమరొకడునిల్చుని, అతనితలమీద నీళ్ళపాత్రనుపెట్టిఅవివలకకుండా తప్పెటలువాయించడంవంటి ప్రతిభాప్రదర్శనలు, అద్భుతవిన్యాసాలు ఎన్నో ఉంటాయి. ఇందులో ముందుపాడే (గురువు) వారిగొంతు చాలాపెద్దదిగా ఉండాలి. కారణం ఆచప్పుళ్ళమోతలోకూడా అవి వినబడాలికదా!

## కోయనృత్యం

సంబరాలలో కోయనృత్యంఅని ఒకమేళం గిరిజననృత్యం చేస్తుంటారు. ఈ మేళంలో దాదాపు ఇరవైమందిదాకాఉంటారు. సగంమంది ఆడవేషాలూ, సగంమంది మగవేషాలూ వేసుకొని తలకు కొమ్ములూ, మెడలో రంగురంగుపూసలదండలూ, కోడిఈకలూ, నెమలిపింఛాలూ ధరించి డోళ్ళు వాయిస్తూ నృత్యంచేస్తుంటే చూసేవాళ్ళకి తాము అడవుల్లోకివెళ్ళి వాళ్ళ నాట్యం చూస్తున్నట్లు భావనకలుగుతుంది. అంత అచ్చుగుద్దినట్లుతయారై పాటలుపాడుతూ, ఎగురుతూ, మధ్యమధ్య కోయభాషలా తెలుగు విరిచి మాట్లాడుతూ, కూతలూ అరుపులతో ఒకరినొకరు పిలుచుకుంటుంటే వాళ్ళు నిజంగా అడవినుంచివచ్చినకోయలేనేమో అనిపిస్తుంది. అప్పుడప్పుడువారు నోటినిండా కిరసనాయిలుపోసుకొని వెలుగుతున్న కాగడామీదఊదుతుంటే ఆ కాగడానుంచి మంటలు బుస్సుమని ముత్యాల్లారాలుతుంటే చూడ్డానికి అద్భుతంగాఉంటుంది.

## కర్రసాము

కర్రసాముకూడా ఉత్సవాల్లోనే పెడుతుంటారు. 'తాసా' శబ్దానికి అనుగుణంగా అడుగులువేస్తూ సామువిద్యలో ఆరితేరినఇరువురు రెండు కర్రలుతీసుకొని, తమచేతులతో గిరగిరాత్రిప్పుతూ, ఒకరిపై ఒకరు కర్ర విసురుకుంటూ దెబ్బలుకాచుకొంటూ కర్రలను తాకిస్తూ ఎలదుగుమీద పట్టె వంటివానితో తమ నేర్పునూ, ప్రజ్ఞనూ ప్రదర్శిస్తూ నేత్రానందంకలిగిస్తుంటారు. దీనిని పల్లెటూళ్ళల్లో "సాధకం" అంటారు. ఉత్సాహవంతులైన పల్లె యువకులు ఈ విద్యనేర్చుకొని సంబరాల్లో ప్రదర్శిస్తుంటారు. వీరముష్టివాళ్లు ఇది వృత్తిగాచేస్తారు కత్తులతోనూ కర్రలతోనూను. ఆరితేరినవారు సాము గరిడీలు వివిధరీతుల్లో ప్రదర్శిస్తారు.

ఈసాముగరిడీలప్రస్తావన మనుచరిత్రలో యిలావుంది —

"ఊరు సంఘాతపశోణ మృత్కలితమై
యొప్పారు బ్రహ్మాండమనీ

గిరిడిన్ కాలవు హంతకాడు చరమా
గస్కంధముంజేర్చు" అని.

## కోలాటం

పదిహేను ఇరవై మంది వలయంగాఏర్పడి రూళ్ళకర్రల్లా గుండ్రంగా సాపుచేయబడిన ఒకఅడుగుపొడవుకర్రలను ప్రతిఒక్కరూ రెండేసిచొప్పున రెండుచేతుల్లోనూపట్టుకొని ఒకరిచేతిలోనికర్రకు మరొకరిచేతికర్రను తాకిస్తూ ఆచప్పుడును తాళంగాచేసికొని లయబద్ధమైనఅడుగులువేస్తూ 'తెయ్యక్కడతా జనుతా' అంటూ 'ఓచిన్నదాన విడువనె కొంగు' వంటి శృంగార జానపద గీతాలూ, భక్తిగీతాలూ గురువుపాడుతుంటే కోలాటం వేసేవారు ఆ పల్లవిని వంతగాపాడుతూగెంతుతుంటే వినడానికీ చూడడానికీ వినోదంగాఉంటుంది. ఈ కోలాటాలు పల్లెలలోని ఆయా పేటల యువకులు విరామకాలంలో ఒక గురువునుపెట్టుకొని నేర్చుకొని సంబరాలలో సరదాగా వేస్తుంటారు.

* 'కోలాటం జానపదులకు ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని యిస్తుంది. దీనిలో వర్ణ చలనము, వేష సామరస్యము, గమనసామరస్యము మువ్వల మోత, కోలల లయ, రాగ సరళి, కంఠ మేళ, కథా సౌందర్యము ఒక్కుమ్మడిగా ఏకమయి అలరిస్తవి'.

** 'హంపీవిజయనగరము నందలి భవనప్రాకారభిత్తికల మీద కోలాటమువేయు స్త్రీ పురుషుల వివిధభంగిమలుకల చిత్తరువు లనేకములు చెక్కబడియున్నవి'.

*** 'విజయనగరకాలమున కోలాటమందు జనులకాసక్తి ఎక్కువగా నుండెను.' పాల్కురికి సోమనాథుని బసవ పురాణంలో యిలా చెప్పబడింది -

---

* కృష్ణశ్రీ పల్లెపదాలు.
(ఆంధ్రుల జానపదవిజ్ఞానం పు. 71 నుండి గ్రహింపబడింది)

** జానపద కళాసంపద. పు. 6 డా. తూమాటి దొణప్ప

*** ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పు. 259. సురవరం ప్రతాపరెడ్డి

'కోలాటమును, బాత్ర గొండ్లిపేరణియు
గేళిక జోకయు లీలనటింప'.—

అంతేగాక భరతార్ణవము (నందికేశుడు)లో ఏడవ అధ్యాయంలో కోలాటమొక ప్రత్యేకమైన నర్తనగా చెప్పబడింది.

గోదావరిసీమలో యీ కోలాటానికి పశ్చిమగోదావరిజిల్లా కురదాళ్ళ పాలెంజట్టు మంచి ప్రసిద్ధిపొందింది.

## బుట్టబొమ్మలాట

బుట్టబొమ్మలాటకూడా ఉత్సవాలకే పెడతారు. పాములవాడు, పాములవాడిభార్య, రాధ, కృష్ణుడు మొదలైనవి ఇందులోఉంటాయి. తల దగ్గరనుంచిబొడ్డుదిగువవరకూ చెక్కతో పెద్దపెద్దబొమ్మలుచేసి వానిక్రింద పొడుగాటిపరికిణీతొడిగి ఒకమనిషి ఆ పరికిణీలోదూరి ఆ బొమ్మను నెత్తి కెత్తుకొని బొమ్మబొడ్డురంధ్రంగుండాబయటకిచూస్తూ రామడోలుమేళంవారి వాయిద్యానికనుగుణంగా అడుగులేస్తుంటారు. ఇలాగే గుర్రాలముఖాలుచేసి వానికి మేదరతడికతో శరీరాన్ని తయారుచేసి అలంకరించి ఒకమనిషి పాదాలకు రెండుమూడడుగులపొడవు కర్రలు కట్టుకొని గుర్రంమెడవద్దకన్నం లోంచి మొత్తవరకూ పైకివచ్చి గుర్రం నడుస్తున్నట్లు కట్టుకున్నకర్రలతో లయానుగుణంగా నడుస్తాడు. ఇదికూడా చూడముచ్చటగాఉంటుంది. వాని గంటలతరబడి చూస్తూనేఉంటారు.

పశ్చిమగోదావరిజిల్లా 'తణుకు' వాస్తవ్యులు కట్టా ఎల్లయ్యగారు యీప్రదర్శనలకు ప్రసిద్ధిపొందారు. అనంతరం అతనికుమారుడు సూర్య నారాయణగారు గత 50 ఏండ్లనుండీకూడా ప్రదర్శనలిస్తున్నారు. వీరు రాధా కృష్ణులు, శివపార్వతులు మొదలగునవి ప్రదర్శిస్తారు. బుట్టబొమ్మల తయారీకి వెదురుగడలు, చింతగింజలగుజ్జు ఉపయోగిస్తారు. వెదురుగడలతో బొమ్మనుచేస్తారు. చింతపండు గుజ్జుతో బొమ్మరూపు దిద్దుతారు.

## భోగంమేళాలు

ఇక భోగంమేళాలసంగతి అందరికీ తెలిసిందే. ఇది లేనిదే ఏ ఉత్సవానికీ కళలేదు. పదిపదిహేనుమంది భోగపుస్త్రీలు మేళంగా వస్తారు.

ఈ మేళానికి ఒకనాయకురాలు ఉంటుంది. ఫిడేలు, హార్మోనియం మద్దెలలు ప్రక్కవాయిద్యాలు. వీరు సినిమాపాటలుపాడుతూ ఇద్దరుముగ్గురు ముందు కొచ్చి నాట్యాలుచేస్తుంటే మిగిలినవారు వెనుక దడిలానిలబడి తాళంకొడుతూ పాడుతుంటారు. సాధారణంగా విలాసపురుషులే. ఇక్కడకు చేరేది. వారి సెలక్షన్ ప్రకారం వీరు పాడి ఆడుతుంటారు. తర్వాత తాంబూలాలిచ్చి రవంత రంగుచేసి సొమ్ములు వసూలుచేస్తుంటారు వీరు అప్పుడప్పుడు సిగ్గులేకుండా పచ్చిశృంగారంవెలగబెడుతూ రసికులనురెచ్చగొట్టడంకూడా కద్దు. ఇలాంటి వానిలో వీరిఎలుగుబంట్లనృత్యం (బేర్‌డాన్స్) చెప్పుకోదగ్గది. ఒకామె మగ ఎలుగుగానూ, మరొకఆమె ఆడఎలుగుగానూ నటిస్తూ చూపించే రతిక్రియ లాంటివి కాలంపండినవాళ్ళనుకూడా కామపీడతులనుచేస్తాయి. అలాగని వీరి దంతా చౌకబారునాట్యం అనడానికి వీలులేదు. వీరి 'మేజువాణీ' ఉత్తమ నాట్యశ్రేణికిచెందిన ప్రక్రియ. నాయకురాలు 'తూరుపు తెలవారే' లాంటి జావళీలు పాడుతూ అభినయం పడుతుంటే "ఓహో" శలడూపని పండితులుండరు.

## కోలసంబరం

"ఓరోరి వెంకన్న ఓరి వెంకన్న" అనిపాడుతూ కోలత్రిప్పుతూ పచ్చనికొబ్బరాకులపందిరిక్రింద ఎక్కడైనా పాటవినిపించిందంటే అక్కడ కోలసంబరంచేస్తున్నారని నిర్ధారణగా చెప్పవచ్చు. తిరుపతి వెళ్ళి వచ్చినవారు దీపారాధనరోజునరాత్రి కథపెడతారు. 'శ్రీరామారామారా మోరామా రామయ్యా, హరి రామా రామారా మయఓధ్యా రామా' అనేది దీనికి వంత. ముఖానికీ గుండెలమీదా భుజాలమీదా పెద్దపెద్ద నామాలు దిద్ది ఇద్దరు నూనె గుడ్డలువెలిగించిన కోలలుత్రిప్పుతుంటే, ఇద్దరు సిబ్బి తాళాలు (పెద్దవి) వాయిస్తూ వంతపాడుతుంటే, మధ్యఒకరు ఒకచేతిలో పేముబెత్తం, మరొక చేతిలో నెమలిఈకలకట్ట పట్టుకొని ముందుకూ వెనుకకూ నడుస్తూ వెంకన్న బాబుకథ పాటరూపంలోపాడుతుంటారు. ఇది పురాణాలలో చెప్పబడ్డ పద్మావతీవెంకటేశ్వరులకథ కాదు. అలివేలుమంగ, బీబీనాంచారమ్మ, వెంకన్న బాబుల ప్రణయం, విరహం వగైరాలతో కూడిన ఒక భిన్నమైన జానపద కథ. తెలుగుప్రజలు ఇదేనిజమైనకథ అన్నంత నిష్టగా వింటారు. కథలో అప్పుడప్పుడు కోలత్రిప్పేవారిలో ఒకడు హాస్యగానిగామారి జోక్సువేస్తుంటే

ప్రజలు పగలబడినవ్వుతూ భక్తితోనూ ఆసక్తితోనూ వినోదిస్తుంటారు. ఈకథచెప్పేజట్లకు ద్రాక్షారామందగ్గర వెల్లగ్రామం ప్రసిద్ధి. అందులో సుబ్బారావుజట్టు మరీ పేరెన్నికగన్నది.

## భైటో భజన

ప్రతిపల్లెలోనూ దేవాలయంఉంటుంది - కనీసం రామాలయం అన్నా ఉంటుంది. కొన్నిచోట్ల కులానికోరామాలయం, పేటకోరామాలయంకూడా ఉంటాయి. రాత్రివేళల్లోనూ, ముక్కోటిఏకాదశి, భీష్మ ఏకాదశి, శివరాత్రి వంటి పుణ్యదినాల్లోనూ ఊళ్ళోభక్తులు ఈ ఆలయమండపాలలోకూర్చుని దేవునిఫోటో ఎదురుగాపెట్టుకుని ఇత్తడితాళాలతో భగవంతునిపైగూర్చిన పాటలూ పద్యాలూ పాడుతూ భజనలు చేస్తారు. వీనికి హార్మోనియం, మద్దెలలు తోడుంటాయి. గణపతి ప్రార్థనతో ప్రారంభించి భక్తరామదాసు కీర్తనలూ యడ్లరామదాసుకీర్తనలూ త్యాగరాజుకీర్తనలూ తూమునరసింహదాసు కీర్తనలూ తరంగాలూ గీతలూ తత్వాలూ ప్రతిచరణమూ ఒకరుముందుపాడితే తర్వాత అదేచరణాన్ని మిగిలినవారుపాడతారు. పాడేవారిగొంతుమాధుర్యాన్ని బట్టి ఈభజన చూడటానికి (చెయ్యడం చేత కాకపోయిన సరే) ఎంతో మంది చేరతారు. మొదటపాడేవ్యక్తి సాధారణంగా మంచి గాయకుడై ఉంటాడు, కూర్చునిచేసేదిగనుక దీనిని భైటోభజన అన్నారు. మధ్య మధ్య కాళహస్తీశ్వరశతకంలోనివీ, దాశరథీశతకంలోనివీ, ఇతర శతకాలలోనివీ పద్యాలు రాగయుక్తంగాపాడుతూ రంజింపచేస్తుంటారు. ఈభజనలో నేర్పరులైనవారు సప్తతాళాలభజనకూడాచేస్తారు. మధ్య మధ్య "రామ రాఘవ రక్షింపుము దేవ" వంటి కీర్తనలలోని మిశ్రములకు అనుగుణంగా తిరుగుడు తాళాలభజనచేస్తుంటే ఆజోరులో చేతులు భరతనాట్యంఆడుతున్నట్లుచోద్యంగా కనిపిస్తాయి. వచ్చినభక్తులంతా అరటిపళ్ళూ కొబ్బరికాయలుతెచ్చి దేవునికి నైవేద్యంపెడతారు. అవన్నీ ముక్కలుగాకోసి భజనకార్యక్రమము పూర్తయ్యాక హారతిచ్చి ప్రసాదంగా భక్తులకుపంచుతారు. (అందులోకూడాతిండి బకాసురులుంటారనుకోండి). ఇందులో ఏ అలసటా లేకుండాపాడే అందరికీ సులువైన పాటల్లో 'రామరామ రామసీత' అనేది ఒకటి. 'సీతారామ్ సీతారామ్

సీతారామ్ జయ సీతారామ్ పట్టాభిరామ్ పట్టాభిరామ్ పట్టాభిరామ్ జయ సీతారామ్" అని రామునిగూర్చి తెలిసినన్ని విశేషణాలతో చేంతాడులాగ పాటపొడిగించుకుంటూ ఏకతాళంలో త్రికాలాల్లోనూ భజన భక్తిగచేస్తారు. ఈపాటలలో ప్రేక్షకులుకూడా కలిసి భజనచేస్తారు."పాహిముకుందేతి"వంటి సంస్కృతపదభూయిష్టమైన పాటలు చక్కగాపాడుతుంటే అర్థంతెలియక పోయినా భక్తిలోమునిగి భజిస్తారు. మరొకవిశేషమేమంటే 'రామరామ రామసీత' అనే ఒక వాక్యంతో ఏకాహాలూ సప్తాహాలూ కూడా చేస్తారు. ఏకాహంఅంటే తొలిరోజు ప్రాతఃకాలంలోప్రారంభించి మలిరోజుప్రాతః కాలంవరకూ అనగా 24 గంటలు (ఒకరోజు) ఒకేనామంతో భజనచెయ్యడం. సప్తాహం అంటే యిలాగ 7 రోజులు చెయ్యడం. ఈభజనజట్టులు ఊరూరా ఉంటాయి. కొందరుభక్తులు తమయిళ్ళల్లోనే యివి ఏర్పాటుచేస్తారు. 'మేటియైచను భక్తకూటములందు పాటలుగాగట్టిపాడెడివారు' అని పాల్కురికి సోమన పండితారాధ్యచరిత్రలోవ్రాశారు. ఈ కళారూపం యొక్కప్రాచీనత దీనినిబట్టి ఊహించుకోవచ్చు.

గోదావరిసీమలోరామభజనలాగే 'హరనాధబాబా' భజనలు కూడా చేస్తుంటారు చాలాచోట్ల. హరనాధబాబాభజనలోవిశేషం భక్తులకు ఆవేశం రావడం. బాబాపూనడంలాంటివికూడా ఉండేవి. ఒకప్పుడు తూర్పుగోదావరి లోని వెదురుపాకగ్రామంలో బాబామేష్టారింట్లో నిత్యం యీభజనలు జరుగు తుండేవి. బాబామేష్టారిభార్య హరనాధబాబా ఆవేశంపొంది జీవితాంతం ఆ ఆవేశంలోనే ఉండిపోతే భక్తులందరూ ఆమెనే బాబాగా ఆరాధించేవారు. అంతేకాకుండా బాబామేష్టారితమ్ముని భార్యపై కుసుమకుమారి (హరనాధ బాబా భార్య) ఆవేశించిందని ఆమెను కుసుమకుమారిగా పూజించేవారు. హరనాధబాబా స్మరణలో తన్మయుడై భజించేవారు బాబామేష్టారు. అందుచేత ఆయన అసలుపేరు మల్యాల సత్యనారాయణ అనేది విడిచి అందరూ బాబా మేష్టారని పిలిచేవారు. ఆయన రాయవరం హైస్కూలులో ఉపాధ్యాయులు. 20వ శతాబ్దిలో పూర్వార్ధంలో హరనాధభక్తులలో ప్రసిద్ధులైన పాగలదాసు గారు, శకుంతలమ్మగారు పాల్గొన్న భజనలు భక్తుల్నేకాకుండా ప్రేక్షకుల్ని కూడా పరవశింపజేసేవి. వెన్నమీదా, కుంకంమీదా బాబాపాదాలు కనబడటం లాంటి విచిత్రాలు కూడా ప్రచారంలోఉండేవి. భజనలో ఒకరుపాటభావాన్ని

అభినయిస్తూ నృత్యంకూడాచేసేవారు. ఈరచయిత బాల్యంలో మొదట నృత్యానికి గజ్జెకట్టింది యీభజనలోనే. రామభజనలాగే "జై హరనాథ్ జై, కుసుమకుమారిజై" అనే నామంతో ఏకాహాలూ, సప్తాహాలూ కూడా జరుగుతుంటాయి. పూర్వం యీభజనలు వెదురుపాక, కొంకుదురు, రాయవరం, వె. సావరం, మండపేట, మహేంద్రవాడ, అర్తమూరు, బలభద్రపురం, రామచంద్రపురం, కొత్తూరు, సామర్లకోట, పెద్దాపురం, కాకినాడ, రాజమండ్రి, ధవళేశ్వరం, కొప్పర్రు, భీమవరం, ఆకివీడు, ఏలేశ్వరంలలో ముమ్మరంగా జరిగేవి. ఈ రచయిత తల్లి తండ్రులు హరనాథ భక్తులుకావడం వల్ల కొంకుదురులో యీ రచయిత యిల్లుకూడా హరనాథభజనలకు అలవాలంగా వుండేది.

## పండరిభజన

"జెండా ఘెడా ఘెడాతే జాయేంగే పండారి జాయేంగే" అనిపాడుతూ వలయాకారంలోనిలబడి, కాషాయరంగుబట్టలుధరించి, చేతిలో కాషాయ రంగుజెండాతో డాడాపు 30 మంది నృత్యంచేస్తూ పాడుతుంటే, ఆవలయం మధ్యతిరుగుతూ గురువు పాటచెబుతూ నృత్యగతినడుపుతుంటే హార్మోని, మద్దెలలు అనుసరిస్తుంటే చూసేజనంపిస్తుపోయేలాసాగుతుంది పండరిభజన. "ఇక ఎంతాదూరామో ఎరుగామే పండారి" అనే పాటకు వీరు చేసే భావ నృత్య విన్యాసాలు చక్కని రసస్ఫూర్తిని కల్గిస్తూ చూపరులను పులకింప జేస్తాయి. ఇది ఈభజనరీతి. దీనిని తూర్పుగోదావరిజిల్లాలో గొల్లల మామిడాడవాస్తవ్యులు శ్రీ పడాల సత్యనారాయణరెడ్డి గురువుగా ఆ పరిసర గ్రామాలలో ఎన్నోజట్లుబతయారుచేశారు. అప్పుళ్ళోనే శ్రీ బైరాగిరెడ్డి కూడా పండరిభజనలగురువే. 50 ఏళ్ళకిత్రం పందలపాక వాస్తవ్యులు శ్రీ కొప్పర్రి ఆదినారాయణరెడ్డి పండరిభజనగురువుగా చుట్టుప్రక్కల ఎన్నో గ్రామాలలో దళాలు తయారుచేశారు.

ఈరచయిత గొంతుమాధుర్యానికిమురిసి పసితనంలోనే వీరు పండరి భజనలోతర్ఫీదుయిచ్చి భజనలకుతీసుకుపోయేవారు. ఈరచయితకాలు నాట్యాలలో పదునుతేరిన చోటిదే.

# చెక్క భజన

గ్రామాలలో యువకులు రుమాళ్ళు నడుముకు బిగించి కుడిచేతులో చెక్కతో చేయబడిన చిడతలను తాళానుగుణంగా వాయిస్తూ, ఎడమ చేతితో కీర్తనలోని భావాల్ని అభినయించేస్తూ ఒకవలయంగా నిలిచి కాళ్ళకు గజ్జెలు కట్టుకొని ఒకేరీతి గంతులు వేస్తూ, కదులుతూ, వలయంలో గురువుండి ముందు పాడుతుంటే, అందరూ ప్రతిచరణం తిరిగిపాడుతూ, చూసేవాళ్ళకి భక్తిరసం ఉప్పొంగేలా చేస్తారు యీ భజన. లోపల వలయంలో హార్మోని, మద్దెలలు వాయిస్తుంటారు. ఇది పండరిభజన లాంటిదేగాని ఆవేషాయా, ఆడెండాలూ వుండవు. ఆ పాటకు యీపేరు. నృత్యం కదలికలు వరకూ మాత్రం అదేధోరణి.

ఇది ఒక గురువును పెట్టుకొని వర్షాకాలంలో పేటల్లోకుర్రకారు ఇరవై ముప్పైమంది ఈ పాటలు, ఈ నృత్యం, అభినయం నేర్చుకుంటారు. ఇంచుమించు పేటకో బృందం వుండేది. పేటలోగల ఆలయాలముందు పీరు అభ్యాసం చేసేవారు. ఆ పాటలుకూడా శబ్దోచ్చారణలో నాటుగావున్నా (గ్రామ్యం) దేవునిభక్తి, ఆవేశం గూడుకట్టుకొనివుంటాయి.

'కిట్టమ్మా గోపాల బాలా కిట్టమ్మా.
భజ నందాగోపాలబాలా కిట్టమ్మా,
గోపాలబాలా కిట్టమ్మా
కాళ్ళకుగజ్జెలుకట్టీ, వేళ్ళకు ఉంగ్రాలెట్టీ
గోళ్ళకు మెరుపులు దిద్దీ
గోరింటాకు పెడతా రారా ॥కి॥
ఎనిమిదిమూళ్ళిరవై నాలుగు
తొమ్మిదిమూళ్ళా ఇరవై ఏడు
పదకొండుమూళ్ళ ముప్పైమూడు
పన్నెండుమూళ్లా ముప్పైఆరు ॥కి॥

అనేదీ ఒకపాట. జానపదులు విద్యావంతులు కారుకదా ! అందువల్ల యిలా పాటల్లో ఎక్కాలుకూడా ఎక్కించటం లెక్కలుసులువుగా నేర్పడానికి అయ్యుంటుంది. చెక్కభజన ఈ క్రింది గణపతిప్రార్థనతో ప్రారంభిస్తారు.

"శివశివమూర్తివి గణనాథా
నీవు శివుని కుమారుడవు గణనాథా"

మూతుకాలలలోనూ నృత్యంచేస్తూచేసేతీఃభజన ఎంతోనయనానందంగా వుం టుంది. ఇంచుమించు నృత్యం కోలాటంలోలాగే. ఇందులో రామదాసు కీర్తనల్లాంటి భక్తిగీతాలు, కృష్ణలీలలు, వేదాంతతత్వాలు పాడతారు. సంబ రాల్లోనూ జాతర్లలోనూ ప్రదర్శిస్తుంటారు. ఇది భక్తిప్రబోధకమేగాకుండా యువజనుల్లో క్రమశిక్షణనేర్పుతుంది. గీతానికిస్మృతి, లయ అలవాటుచేస్తుంది.

## నృత్యతాళభజన

ఇందులో చెక్కలకుబదులు చిప్పతాళాలు వాడతారు. దీనికి నృత్యం, తాళం ప్రధానం. మధ్యలో వత్తులువెలిగించినదీపంపెట్టిఉంటుంది. వారు దాని చుట్టూ వలయంగానిలబడి "తాండవనృత్య హరీ గజానన, ధిమికిట ధిమికిట బాజామృదంగ, హరిలోరంగహరీ గజానన" అనే గణపతి ప్రార్థనతో ప్రారంభించి భూమి అదిరేలాగెంతుతూ ప్రేక్షకదృష్టిని తమపై కేంద్రీకరింప జేసుకుంటారు. "రామభజనచేయరే రజితాగిరి రామభజనచేయరే' తంబుర మీటుతు తాళముచేయుచు తకిట తకిటయని నృత్యమునల్పుచు రామభజన చేయరే" అనే కీర్తన మంచి దరువులతో ఊపేసి జనంచేత శభాష్ అనిపించు కుంటారు. దీనికి చెక్కభజనలలోలాగే గురువు వలయంలోఉండి కీర్తననడు పుతూ అడుగులుచూపిస్తూ భజనచేస్తుంటాడు. హార్మోనీ మద్దెలా మామూలే. దీనికి ప్రత్యేకవేషాలు లేకపోయినా రుమాలు నడుముకుచుట్టడం, కాళ్ళకు గజ్జెలుకట్టడం ఉంటుంది. "శ్యామలాదేవి - రమ్మంచేరావే" అనే వీరి భజన కీర్తనకి ముగ్ధులుకానివారుండరు.

వర్షాకాలం కాళీసమయంలో పల్లెల్లోని పేటల్లో గాత్రశుద్ధి, లయజ్ఞానం గల యువకులు జట్టుగాచేరి గురువునిపెట్టుకుని రామాలయందగ్గర యీభజన రీతి నేర్చుకుంటారు.

ఇవి దేవుడిసంబరాల్లోనూ, అమ్మవారిజాతర్లలోనూ తూర్పు పశ్చిమ గోదావరిజిల్లాలలో యిప్పటికీ కనిపిస్తుంటాయి.

## వీధిభాగవతం

వీధిభాగవతులు పలురకాలు. కూచిపూడి భాగవతులు, తూర్పు భాగవతులు, యానాది భాగవతులు ఇలా ఇంకా ఎన్నో. తూర్పు

భాగవతులు భామాకలాపం, గొల్లకలాపం లాంటివి ప్రదర్శిస్తుంటారు. ఇందు మాటలు తూర్పుయాసతోనూ, రాగాలు తోలుబొమ్మలాటఫణితిలోనూ ఉంటాయి. 'చిటపటచినుకులు దుప్పటితడిసెను' వీరిదే. ఇది యక్షగాన ప్రక్రియ. తెరలా చిన్న గుడ్డకట్టి, దానివెనుకనుండి భామరాగానే ఆతెర తొలగిస్తారు. నృత్యం శాస్త్రీయం కాకపోయినా సశాస్త్రీయ మన్నంత భ్రాంతి కలుగుతుంది. ప్రతిదరువుకీవంతగా ఒక బ్రాహ్మణ వేషధారీ ఒకరిద్దరు తాళంకొట్టేవాళ్ళూ మద్దెలవాయిద్యగాండ్రూ సహకరిస్తూ నాటకంవలె మంచి రక్తికిగానడిపిస్తారు. యానాదిభాగవతుల 'చెంచులక్ష్మి' నాటకం ప్రసిద్ధమైనది. "చెట్టెక్కగలవా నరహరి పుట్టలెక్కగలవా" వంటి పాటలు పల్లెప్రజల నోటపట్టడానికి వీరి వీధినాటకమేకారణం. మాదిగభాగవతులు కొంచెం రంగాన్ని ముందుకు నడిపారు. పందిరిక్రింద బల్లలువేసి ముందుతెర, వెనుక తెర కట్టి నాటకంఆడేవారు. వీరినాటకాలలో ప్రసిద్ధిచెందినది 'శశిరేఖా పరిణయం'. పాటలూ మాటలతోపాటు నేటిపద్యపఠనవిధానంకూడా చోటుచేసుకుంది ఇందులో. నేటి నాటకరంగానికిదగ్గరగాఉంటుంది వీరిప్రదర్శన.

శ్రీనాథునిచాటువులలో 'భాగోతులఋచ్చిగాడు' అనేమాట వీరి ప్రాచీనతను తెలుపుతుంది. ఈ భాగవతులుకూడ 'తాండవ నృత్యహారీ గజానన' అంటూ గణపతిప్రార్థనతో అర్థరాత్రిప్రారంభించి తెల్లవారే వరకూఆడేవారు.

ఈ భాగవతుల ప్రదర్శన ప్రయోగ ప్రయోజనాన్నిగూర్చి ఒక చారిత్రాత్మకగాథకూడా ఉంది. క్రీ. శ. 1505 - 1509 కాలములో విజయనగర పాలకుడు కృష్ణదేవరాయుల సవతిఅన్నఅయిన వీర నరసింహరాయల ఆస్థానంలో ఒకనాడు కూచిపూడిభాగవతులప్రదర్శన ఏర్పాటయిందట. విజయనగరరాజులఏలుబడిలోనున్న 'సిద్ధవటం సీమ' 'సమ్మెట గురవరాజు' అధీనంలోఉండేది. ఆయన పన్నులువసూలు చేయడంలో ఘోరాతిఘోరకార్యాలు చేసేవాడట. పన్నులివ్వనివారి భార్యలను ఈడ్చితెచ్చి వారి స్తనాగ్రాలకు చిరుతలుపట్టించి దారుణంగా హింసించేవాడట. ఈ భాగవతులు వానిహింసాకాండను, అతని దుష్టచేష్టలను కన్నులకుకట్టినట్టు ప్రదర్శించారట - దానితో

రాజు ఉగ్రుడై దండనాయకులనుపంపి గురవయ్యతల తీయించి సిద్ధవటంసీమ ప్రజానీకాన్ని అతని ఘోరాలబారినుండి తప్పించేడట.

ఆలోచించిచూస్తే ఇది షేక్స్పియరు 'హేమ్లెట్' నాటకంలోని అంత ర్నాటకాన్ని తలపుకుతెస్తుంది.

## తోలు బొమ్మలాట

ఊరిమధ్య కాళీజాగాలో పందిరివేసి, మూడుప్రక్కలామూసివేసి, నాలుగవవైపు తెల్లనితెరగట్టి, లోపల ఆముదండీపాలవెలుగులో ఆ తెరమీద తోలుబొమ్మలునిలిపి వానినికదుపుతూ రామాయణ, భారత, భాగవతఘట్టాలను కీర్తనలుగానూ, పద్యాలుగానూ, వచనంగానూ ఆయాపాత్రలసంభాషణలుగా వెనుకనుంచిపలుకుతూ మంచి రసవత్తరంగా రాత్రంతాసాగించే ప్రదర్శన తోలుబొమ్మలాట. మధ్యమధ్యలో బంగారక్క, గండోలిగాడు, కేతిగాడు, జుట్టుపోలిగాడు హాస్యోక్తులతో ప్రేక్షకుల్ని అలరిస్తూ నిదుర మేల్కొలుపుతుంటారు. వీరి సుదీర్ఘమైన తారస్థాయిరాగాలాపనపద్ధతికి తోలు బొమ్మలాటరాగాలని ప్రతీతి. ఇందులో ఆనందభైరవితీగడ బలేగమ్మత్తుగా ఉంటుంది. ముఖారి రాగం వీరిముద్దుబిడ్డ. ఈరాగాలుతీసేటప్పుడు ఒకరు తీస్తున్న రాగం మధ్యలో మరొకరందుకోవడం, సాగదీసి సాగదీసి అన్ని స్థాయిలూ పలకడం అదోపద్ధతిగాఉంటుంది.

* 'సంస్కృతంలో ఛాయానాటకములనేవి ఆంధ్రదేశంలో తోలు బొమ్మలాటలుగా వ్యవహరించబడుతున్నవి. బొమ్మలుచేసే పదార్థాన్నిబట్టి వీనికాపేరు వచ్చింది'.

** వినోదంతోపాటు విజ్ఞానాన్ని, రేడియోలూవార్తాపత్రికలూ లేని రోజుల్లో వార్తాప్రసారాన్ని ప్రజలకుఅందించిన యీబొమ్మలాట మానవుని ఆదివినోదము"

తోలుబొమ్మలాట ప్రదర్శనలో మొదటగా తెరమీదగణపతిబొమ్మను ప్రవేశపెట్టి —

---

* కూర్మావేణుగోపాలస్వామి. నాట్యకళ ఫిబ్రవరి-మార్చి 1970. పు. 144

** యం. వి. రమణమూర్తి డిటో పు. 119

'శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే
అగజానన పద్మార్కం గజానన మహర్నిశం
అనేకదంతం భక్తానాం ఏకదంతముపాస్మహే' అనే శ్లోకంతోనూ–
"తొండము నేకదంతమును తోరపుబొజ్జయు
వామహస్తమున్ మెండుగ మ్రోయుగజ్జెలును
మెల్లనిచూపులు మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరినవిద్యలకెల్ల
నొజ్జయైయుండెడి ఓయి గణాధిపా నీకు మ్రొక్కెదన్"

అనే పద్యంతోనూ గణపతి ప్రార్థనచేసి తరువాత "సరస్వతీ నమస్తుభ్యమ్, వరదేకామరూపిణీ, విద్యారంభం, కరిష్యామి, సిద్ధిర్భవతు మే సదా" అనే సరస్వతీప్రార్థనతో సరస్వతీబొమ్మనూ ప్రదర్శిస్తారు.

ఆతరువాత బంగారక్క, కేతిగాడు, గాండోలిగాడు తెరమీదికెక్కుతారు. వీరు ప్రదర్శనచేయుస్తున్న పెద్దలపేర్లు పేరుపేరునా పేర్కొని ప్రశంసిస్తూ యితరచోట్ల తమను ఆదరించినవాళ్ళపేర్లుచెప్పి స్తుతించి ఆ పిమ్మట తాము ప్రదర్శింపబోయేకథను తెలియజేస్తారు. రంగనాథ రామాయణంలోని లంకాదహనకథను వీరు విరివిగా ప్రదర్శిస్తారు.

ఒకసారి ఒకతోలుబొమ్మలాటమేళం ఒకఊరునుంచి అడవిదారిన మరొకఊరు వెళుతున్నారట. అడవిలో చీకటిపడితే కొందరువచ్చి ఆరాత్రి అక్కడ బొమ్మలాట వెయ్యమని, తెల్లవారి పారితోషకంయిస్తామని చెప్పారట. అర్ధరాత్రి ఆట ప్రారంభమయ్యింది. జనం కుప్పలుతిప్పలుగావచ్చారు. కొంత ఆట అయ్యేసరికి ఆంజనేయపాత్ర ప్రవేశించి దరువుల్తో మంచి రమ్యుగా వేషంసాగుతోందట. మధ్యలో ఆటగాళ్ళు ప్రేక్షక రసస్పందన చూద్దామని తెరతొలగించి చూసేసరికి ప్రేక్షకులు ఒక్కరూలేరట. ఏమిటాఅని ఆశ్చర్యపోయి అప్పటివరకూఉన్న ఆప్రేక్షకులు దెయ్యాలూ భూతాలూ అని అర్థమై భయంతో యిక వదలకుండా తెల్లవార్లూ ఆంజనేయ పాత్రనే ఆడించారట. ఆంజనేయస్వామిపేరు తలిస్తే దెయ్యాలూ భూతాలూ పారిపోతాయట. ఇది ఒక కథే అనుకోండి – ఇది జానపదుల కథ.

వర్షాలు కురవకుంటే వీరిచేత భారతంలోని విరాటపర్వం ఆడిస్తే వర్షాలు కురుస్తాయని యిప్పటికీ పల్లెజనాలకు పెద్దవిశ్వాసం.

తోలుబొమ్మలాట యక్షగాన పద్ధతిలో ఉంటుంది. ఇందులో ద్విపదలు వచనాలు, పద్యాలు, దరువులుఉంటాయి. మేకతోలుతో బొమ్మలు తయారు చేసి రంగులద్ది వారికికావలసినరూపులో అద్భుతంగా వారే తీర్చిదిద్దుతారు. తోలుబొమ్మలాటవారి ప్రతిభనుగూర్చి భాస్కరశతకంలో యిలావుంది.

"ఇంచుక నేర్పు చాలక విహీనతజెందిన నాకవిత్వమున్
మించువహించె నేకతన మిక్కిలి యెట్లన తోలుబొమ్మలన్
మంచివివేకి వాని తెరమాటునసుండి ప్రశస్తరీతినా
డించినవాడచే జనులడెందమునింపవె ప్రీతి భాస్కరా"

కబ్బయామాత్యుడు తన అనిరుద్ధచరిత్ర పీఠిక 12వ పద్యంలో -

"........................ తెరలో కథ చొప్పన బొమ్మలాడగా, నొకకడ హాస్యపుం బ్రతిమలుండవె పెక్కులు వెక్కిరించుచున్" అని వ్రాసాడు. ఇది కథకుసంబంధంలేని విషయాలుకూడా మాట్లాడుతూ హాస్యాన్ని అందించే గాఁడోలిగాడు, బంగారక్క, కేతిగాడు పాత్రలనుద్దేశించి చెప్పినది.

పండితారాధ్యచరిత్రలోపాల్కురికి సోమన -

** "భారతాది కథల చీరమరుగుల నారంగబొమ్మల నాడించువారు" అని బొమ్మలాటల పేర్కొన్నాడు. అంటే 12వ శతాబ్ది నాటికే యివి ప్రసిద్ధిలో ఉన్నాయన్నమాట.

గోదావరిసీమలో యీతోలుబొమ్మలాటవారు కాకినాడదగ్గర మాధవ పట్నంలోనూ, ద్వారపూడిదగ్గర జడ్. మేడపాడులోనూ, ఏలూరుదగ్గర శని వారప్పేటలోనూ, రాజమండ్రిదగ్గర ధవళేశ్వరంలోనూ అనాదినుండీ ఉంటు న్నారు. "ఒక్క మాధవపట్నంగ్రామం నివాసస్థలంగా చేసుకుని రమారమి అయిదువందల కుటుంబాలు నివసిస్తున్నాయి." వీరిలో —

* ఎస్. గీత. "అభినయ" 28, 29 డిశంబరు 1980 సంచిక 'తోలుబొమ్మలాట' వ్యాసంనుండి.

అనపర్తి వెంకటస్వామి, వనపర్తి సీదయ్య, డోలుకోటయ్య, శ్రీమతులు తోట గండమ్మ, అనపర్తి గనమ్మ, తోట కోటమ్మ, తోట కోటిలింగం మొదలగువారు ఒకనాడు పేరెన్నికగన్న కళాకారులు.

## పంబ కథ

"అంబరావే జగదాంబ రావే" అంటూ పల్లెల్లో సత్తెమ్మ సంబరాలు చేస్తుంటారు. సాంబ్రాణిధూపాలతో పంబలాళ్ళు సత్తెమ్మ ఆదిశక్తి అనీ, సృష్టి ఆవిర్భావం, సత్తెమ్మ మహాత్యాలూ గూర్చి ఈ పంబకథ చెబుతారు. ఒకరు పంబనాదం వాయిస్తారు. రెండు సన్నని చిన్న పీరణాలులాంటివి కలిపి కట్టబడి ఒకోవైపు ఒక్కోదాన్ని పుల్లముక్కలతో వాయిస్తుంటే 'పంబల క్కం పంబలక్కం' అనే శబ్దం వస్తుంది. మరొకరు జముకు వాయిస్తారు. ఇంకొకరు శృతికి తిత్తి ఊదుతుంటే ఒకరు కాలికి గజ్జెలు కట్టుకొని ఎగు రుతూ కథపాడుతుంటే వాయిద్యాల వారందరూ చెవిదగ్గర చెయ్యుంచి 'ఆ.......' అని ఆకడతారు. జనం కూర్చుని ఎంతోఇష్టంగా వింటుంటారు. దీన్నే పంబకథ అంటారు. మొదటిరాత్రికథచెప్పి తెల్లవారుజామున పిండితో అమ్మవారిలా చిన్న బొమ్మను తయారుచేసి చేటలోపెట్టి (దీన్ని 'పాపచేట' అంటారు) ఆసత్తెమ్మ ఎవరికి ఇలవేల్పో వారిండ్లకు పంబనాదాలతో వెళ్ళి ఆ చేటను ఆ కుటుంబసభ్యుల తలమీదపెట్టి దీవిస్తారు. దీవింపచేసుకున్న వాళ్ళు ఆచేటలో కానుకలువేస్తారు. తెల్లవారాక వీరు సంబరంగా సత్తెమ్మని ఊరావలికి సాగనంపేటప్పుడు సత్తెమ్మగుడిముందు ముగ్గుతో వేసిన పద్మంలో మేకపోతునుకోసి ఆరక్తంతో ఆముగ్గునె తేసి కొత్తకడవలోపోసి (దీనినే కత్తెరకడవ అంటారు) తమలో ఒకరికి కొత్తకోకకట్టి, రవికతొడిగి నెత్తికెత్తుతారు. మేక ప్రేగులుతీసి అతనికి ఎడజందెం, పెడజందెం వేసి అతనిని సత్తెమ్మగా భావిస్తూ వీధులవెంట ఊరేగింపుగా తీసుకెళతారు. ఊరు చివరకొచ్చేసరికి ఆమె నుద్దేశించి —

"సత్తెమ్మ సత్తెమ్మా సత్తెమైన సత్తెమ్మా ఏతల్లీ కన్నదే సత్తెమ్మా ?
నీది మల్లేపువ్వులఛాయ, నీది మల్లేమొగ్గలఛాయ"

అని సన్నసన్నగా ఆశ్లీలార్థంవచ్చేటట్టుపాడుతూ ఊరుదాటగానే పచ్చి బూతుపాటలు ప్రారంభిస్తారు. అది ఆమె కిష్టమటమరి. క్రీడాభిరామంలో బవనీలు అని చెప్పబడ్డవాళ్లు వీళ్లే. వీరు కులానికి మాదిగలు. రామచంద్ర

పురందగ్గర పసలపూడిలో ఇప్పటికీ వీరున్నారు. ఈ సత్తెమ్మ సంబరాలకు పసలపూడి, పందలపాక, కాకినాడజగన్నాథపురం ప్రసిద్ధి.

ఇక తాడేపల్లిగూడెందగ్గరగల పెంటపాడులో దానమ్మసంబరంకూడా యిలాగేచేస్తారు. శనివారంరాత్రి పంబలాళ్ళు తెల్లవార్లూ దానమ్మకథ చెబుతారు. ఇది మాంధాతరాజుకథ. ఆరాజుయొక్క నీతినిజాయితీలను భ్రష్టుపట్టించడానికి ఒకపద్ధతిప్రకారం దానమ్మ (దేవత) తనశక్తి యుక్తులన్నీ ఉపయోగించి రాజును అష్టకష్టాలపాలుచేస్తుంది. (హరిశ్చంద్రుణ్ని విశ్వామిత్రుడులాగ) అలా ఎన్ని యిబ్బందులకు గురిచేసినా లొంగని మాంధాత రాజునుమెచ్చి తన సంపూర్ణ శక్తియుక్తులతో అతనికి అష్టయిశ్వర్యాలూ కలుగజేసిన దేవతగా కీర్తిస్తూ కథముగిస్తారు. తెల్లవారి ఆదివారం జంతుబలులు. పగలు పదిగంటలకు ప్రధానపాత్రధారుడు దానమ్మకత్తెరకడవని నెత్తికెత్తుకుని తనకి దానమ్మ పూనినట్లుగా అభినయిస్తుంటే గ్రామసంచారం ప్రారంభమవుతుంది. సత్తెమ్మలాగే దారిపొడుగునా కాళ్ళమీద సేళ్ళుపొయ్యడం, బట్టలమీద నడిపించడం మామూలే. ఈ సంబరానికి తూర్పుగోదావరి నుంచికూడా వస్తారు దానమ్మ భక్తులు. చుట్టుప్రక్కలగ్రామాలప్రజలు కులభేదంలేకుండా భక్తితో కొలుస్తారు. కొత్తకార్లు, ట్రాక్టర్లు, లారీలు కొన్నవారు యీదేవతదగ్గరకుతెచ్చి, పూజలుచేసి తునిదగ్గరగల తలుపులమ్మలోవ దగ్గరలాగ యీమెకు జంతుబలులనిస్తారు.

మాదిగల కులవేల్పు గొంతేలమ్మ సంబరంకూడా యిలాగేచేస్తారు పంబలాళ్ళు. వీరుచేసేవి యిలవేల్పులు, కులవేల్పుల సంబరాలు.

## తంబుర కథ

తంబురకథఅంటే తంబురబుజానవేసుకొని ఒకచేత్తో వాయిస్తూ రెండవచేతిలో అందెకొడుతూ ఒకపురుషుడు, ప్రక్కన ఢక్కీవాయిస్తూ ఒకస్త్రీగాని, ఇద్దరుస్త్రీలుగాని "తందానతాన" అని వంతపాడుతుంటే బాలనాగమ్మ, కామమ్మ, లక్ష్మమ్మ, సన్యాసమ్మ మొదలగు కథలు చెబుతూ పల్లెజనులకు వినోదంకలిగించి బియ్యం, పాతబట్టలూ వసూలు చేసుకుంటారు. * "ఈకథల్ని ప్రత్యేకంగా జంగాలనే ఒకకులంవారు చెప్పు

చుండడంచేత ఈకథాప్రక్రియకు జంగంకథ అనేపేరు ప్రఖ్యాతమయింది. ఈ కథాసంవిధానాన్ని సిరికి జంగాలు, ఈతముక్కజంగాలు ఎక్కువవ్యాప్తి లోకి తెచ్చారు. వీరు వాయించే 'గుమ్మెట' అనే వాయిద్యాన్ని (ఢక్కి) బుడిగె అంటారు. అందుచేత వీరిని బుడిగెజంగాలనికూడా పిలుస్తారు." దీనికి కుడిఎడమల ఇద్దరువంతలు, మధ్య కథకునితో నృత్యంజోడించి బల్లకెక్కించారు. ఇలా బల్లకెక్కినదానిని బుర్రకథఅంటారు. ఇందు 'పల్నాటియుద్ధం' 'బొబ్బిలియుద్ధం' ప్రసిద్ధిపొందాయి. వీరరగడ వీరావేశంతెస్తుంది.

** 'సంగీతం, నృత్యం, నాటకం — యీనాటి జానపదరీతుల మేలు కలయికను మనంబుర్రకథలోచూడగలం. బుర్రకథలోనవరసాలూఉన్నాయి. సామాన్యప్రజలకు సాంఘికరాజకీయచైతన్యం కలిగించడంలో దానికదేసాటి'.

***"శ్రీనాథునికాలంనాటికే బుర్రకథలు బాగాప్రచారంలోఉన్నాయని క్రీడాభిరామంలోని యీక్రిందిపద్యంవల్ల తెలుస్తుంది.

దృత తాళంబున వీర గుంభితకథ ధుంధుంధుం కిటాత్కార సం
గతి వాయింపుచు సాంతరాళిక యతి గ్రామాభిరామంబుగా
యతి గూడం ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడెనొ
క్కృత ప్రత్యక్షరముం సమీరకులు ఫీట్కారంబునన్ దూలగన్"

అసలు తంబురకథరూపంలో నేడు యీరచయితచెబుతున్న 'పార్వతీ కళ్యాణం' కథ పండితపామరజనరంజకమై ప్రజల్ని విశేషంగా ఆకట్టు కుంటోంది. ఈప్రక్రియావైశిష్ట్యం యీనాటికీ జనరంజకమే అని యిది చెబుతుంది.

## జముకులకథ

"సారంగో సారంగ", "రాజులేనప్పుడూ రారాదా పోరాదా" అంటూ చిత్రాంగి సారంగధరుణ్ణి ప్రేరేపించడం వగైరా కీర్తనలు ఓ ప్రత్యేకమైన

---

* సహదేవ సూర్యప్రకాశరావు. రూపకళ. పుట.37

** లక్ష్మీకాంతమోహన్. నాట్యకళ. ఫిబ్రవరి-మార్చి 1970 పుట. 129, 130

*** శ్రీనివాస చక్రవర్తి. యక్షగానవ్యాసం. నాట్యకళ. ఫిబ్రవరి మార్చి 1970. పు. 12, 13

బాణీలతోపాడుతూ సారంగధర, కన్యక, బాలరాజు కథలుచెబుతూ రాత్రులు పేటల్లో జనాన్ని వినోదింపజేస్తారు జముకులకథకులు. ఇందులో నాటక ప్రక్రియకుచెందిన సంవాదాలుఎక్కువ. కథకుసంబంధించిన పాత్రలు సారంగ ధరుడు, చిత్రంగి, రత్నాంగి వంటి వేషాలు ధరించి కొందరువచ్చి ఆయా పాత్రల సంభాషణలుచెబుతూ నృత్యంచేస్తూ అభినయిస్తుంటారు. మిగిలిన వాళ్ళు శృతికి ఆనపకాయబుర్రతోచేసిన తంబురవాయిస్తూ ఒకరుజముకు వాయిస్తూ యిద్దరుకథనడుపుతుంటారు. పేటప్రజలు ఎంతోఆర్తితో ఈకథలు వింటారు.

## పురాణం

"అంగాని వేదాః చత్వారో మీమాంసా న్యాయ విస్తరః
పురాణం ధర్మ శాస్త్రంచ విద్యాహ్యేతే చతుర్ధశః" –
చతుర్దశ విద్యలలో పురాణమొకటి.
"పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని
మహిని గొనియాడు చుండ"

— నన్నయ (ఆది పర్వం 32)

"ఒరయన్ నన్నయ తిక్కనాది కవులీ యుర్విన్
బురాణావళిన్ దెనుగున్ సేయుచు"

— బమ్మెరపోతన (ఆంధ్రమహాభాగవతం ప్రథమస్కంధం 19)

"జనులు అప్పుడప్పుడు పౌరాణికులవలన
భాగవత భారత కథలను వినుచుండిరి"

— నన్నెచోడుడు (కుమార సంభవం. ఆ ౧౧)

"విబుధ విప్రుల బిల్వగ బంచి
వినుము భాగవతంబు విజ్ఞాన మొదవ
భారత రణకథ పాటించి వినుము"

— శ్రీనాధుడు (పల్నాటి యుద్ధం)

ఇలాగ పురాణప్రవచనమనేది నన్నయకాలంనాటికే కనబడుతోంది. పైగా మధ్యలో ఏకాలంలోనూ మరుగుకుపోకుండా అవిచ్ఛిన్నంగా

సాగివస్తున్నట్లు వివిధతరాలకుచెందిన తర్వాతికవులరచనలో స్ఫురింపజేయడం బట్టి గ్రహించవచ్చు.

ఇది ఒక విశిష్టవిధానం. మౌఖికంగా ఆశువుగా అనర్గళంగా మాట్లాడే సరళభాషా చమత్కారసామర్థ్యం దీనికి ముఖ్యావసరం. దీనికి వ్యాసపీఠం అనికూడా పేరు. దీనినిబట్టి ఈ పురాణప్రవచనం వ్యాసునినుండి పరంపరగా వస్తున్నట్లు భావించవచ్చు. వ్యాసశిష్యుడు సూతమహాముని పరమ పౌరాణికుడు. అష్టాదశపురాణాలను ఆపోసనపట్టి, ఆనాటి జనసామాన్యమునకు విశ్లేషించి చెప్పినవాడు. పురాణంఅనేది ఇంచుమించు ఏకపాత్రాభినయం. చతుర్విధాభినయాలలో వాచకం అతని ప్రవచనమే. పురాణంచెప్పునప్పుడు మామూలుబట్టలుకాకుండా అతనుకట్టే పట్టుపంచి, విభూతిరేఖలు, వినసకర్ర ఆహార్యం. ఇక సాత్వికాభినయం పౌరాణికుడు కథలోతానులీనమై శ్రోతలలోకూడా రసానుగుణంగా రోమాంచకంపస్వేదాదులు కలిగిస్తాడు, కనబరుస్తాడు. ఆంగికం కళ్ళూ, చేతులూ, ముఖకవళికలూ సందర్భానుసారంగా త్రిప్పుతూ అభినయిస్తుంటాడు. అందువల్ల పౌరాణికునిది ఏకపాత్రాభినయమని చెప్పవచ్చు.

గోదావరినీరుత్రాగితే కవిత్వంవస్తుందని, కృష్ణాజలాలుత్రాగితే సంగీతంవస్తుందని ప్రతీతి. ఇది నిజమేమోఅన్నట్లుగా గోదావరి సీమలో పురాణ ప్రవచనంచేసే సాహిత్యపండితులు ఎక్కువే.

గ్రంథం ముందుంచుకొని పురాణంచెప్పేపద్ధతేకాకుండా గ్రంథం అవసరంలేకుండా పురాణప్రవచనంచేసేవారుకూడాఉన్నారు. వీరిలో విశేషప్రఖ్యాతిగన్నవారు పురాణపండ రామమూర్తిగారు. వీరిది రాజమహేంద్రవరం. అద్వితీయమైనపాండిత్యంతో ఖంగుమనే కంచు కంఠంతో సామాన్యులకు సులభంగాతెలిసేఉపమానాలతో అనుపమానంగాచెప్పేవారు. వచ్చినప్రేక్షకుడు మరికదలడంఅనే ప్రసక్తిలేదు. కథ పూర్తయ్యేవరకూ నిశ్శబ్దంగాకూర్చోవలసిందే. భారతం, భాగవతం, రామాయణాలు నెలలతరబడివిన్నా మళ్ళీమళ్ళీ వినాలనిపించేవి. తెలుగునేలనాలుగుచెఱగులాప్రవచనంచేసి పేరు గడించిన మహావిద్వాంసులు పండితప్రకాండులు వీరు.

అలాగే వాజపయాజుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారుకూడా (రాజమహేంద్రవరం). అనర్గళమైనధారతో సరళసుందరంగా లౌకికవిషయాలను జోడించి అనేకచోట్ల పురాణప్రవచనంచేసి ప్రఖ్యాతిపొందారు. పిఠాపురం చింతామణిశాస్త్రిగారుకూడా యీకోవలోవారే. వీరిపురాణంఅంటే జనం విరగబడిపోయేవారు. అద్భుతమైన జనాకర్షణ. ఆ చెప్పడంలోని సొగసు, పురాణాంతర్గత విషయాలచర్చ పండితపామరులందర్నీ పరవశుల్నిచేసేది. వీరు పురాణం కాకినాడ, మండపేట వగైరా పట్టణాలలో నెలలతరబడి చెబుతుండేవారు.

ఇక రేడియోలో వ్యాసపీఠంద్వారా వాసికెక్కినవారు ఉషశ్రీగారు. వీరిది రాజమండ్రి. అసలుపేరు పురాణపండ సూర్య ప్రకాశదీక్షితులు. వీరి ప్రవచనం తీరు మరోరకం. ఇది ఉపన్యాసధోరణి. పైవారిలానెలలతరబడి ప్రవచనం చెయ్యడంకాకుండా అప్పుడప్పుడు అక్కడక్కడ రామాయణ, భారతాలలోని ఘట్టాలుచెబుతూ తన అమృత వాక్ప్రవాహంతో మనుషుల్ని మంత్రముగ్ధుల్నిచేసేవారు. వారిప్రసంగం ఒకసారివింటే ఎవరైనాసరే ఆయనఅభిమానిగా మారిపోవలసిందే. ఆగొంతులోనిమాధుర్యం, ఆచెప్పడంలోనినేర్పు, ఆమాటలకూర్పు జనాకర్షణకు మూలకారణాలు. వాల్మీకిరామాయణం, వ్యాసభారతం సామాన్యులకు అర్థమయ్యేలా సులభశైలిలో ఆధునికంగావిశ్లేషిస్తూచెప్పడం వీరిప్రత్యేకత.

గ్రామంలోని గుడిఆవరణలోగాని, ఊరిచావిడిలోగాని ఎత్తైన బల్లమీద పురాణంశాస్త్రులుగారుకూర్చొని ఎదుట వ్యాసపీఠంమీద గ్రంథాన్ని వుంచి, అదిచదివి వివరిస్తుంటారు. కొంతమంది చదువుటకు వేరుగా మరొకరిని ఏర్పాటుచేసుకొని వారుచదవగా వీరుదానిని సులభశైలిలో అటువుగా వివరిస్తుంటారు. సాధారణంగా వాల్మీకిరామాయణం, వ్యాసభారతం, దేవీభాగవతం, కవిత్రయభారతం, భాస్కరరామాయణం, గోపీనాధరామాయణం, పోతనభాగవతం, భగవద్గీత, శివపురాణం గ్రంథాలను ఈ ప్రవచనానికి ఎన్నుకుంటారు. వానాకాలం వచ్చిందంటే రాత్రులేగాక సాయంత్రంవేళల్లో కూడా గ్రామాలలో పురాణాలు వినబడుతూనేఉంటాయి. జానపదులకు జ్ఞానభిక్షపెట్టిన కళారూపాలలో దీనిస్థానం గొప్పది. ఈప్రవచనంలో మధ్యమధ్య ప్రేక్షకులను భాగస్వాములుగాచేయుటకు "శ్రీమద్రమారమణగోవిందో హరి"

వంటి గోవిందబొబ్బలు కొట్టించడం, 'రామరామ రామసీత' అని భజనలు కూడా చేయిస్తుండడంచేస్తారు. ఇందు శ్లోకాలూ పద్యాలూ చదివేరీతి ఒక ప్రత్యేకబాణీలో ఉంటుంది. అదొక చిత్రమైనఛాయ. ఈపురాణ కాలక్షేపాలు నెలలతరబడిసాగేవి. చివర అందరూ పురాణంశాస్త్రిలు గారికి భక్తితో కట్నాలూ కానుకలూ చదివించేవారు.

పానుగంటివారు పురాణపఠనంగురించి ఇలా వ్రాసారు —

"కాలదికాలముక్రిందట ప్రతిగ్రామమునందూ రామభజనలు చేయు చావడిలోనో మఱ్ఱిచెట్టుక్రిందవేయబడినమట్టితిన్నెపైనో మునసబుకరణముల రచ్చసాలలోనో రాత్రి ఎనిమిదిగంటల సమీపమున వృద్ధులు, బాలురు, పురుషులు, స్త్రీలు సావకాశముగా కొంతసేపు కూర్చుండి నిష్కల్మష హృదయములతో నిశ్చలదీక్షతో పురాణం వినుచుండెడివారు. పౌరాణికుడు గంభీరకంఠస్వరముతో నట్టి నిశ్శబ్దసమయమున భారతమో, రామాయణమో, భాగవతమో బఠించుచుండగా కథాసందర్భములననుసరించి శిష్యులను భూషించువారు. కృష్ణ, కృష్ణ అని తాత్కాలికభక్తితో నరచువారలై ఒడలు తెలియని పవిత్రానుభవముతో నోలలాడుచుండెడివారు.

"ఈ పురాణ శ్రవణమువలన ప్రజలలో భక్తిభావము పెంపొందుటే గాక పుణ్యకార్యములందుదీక్ష, సంతుష్టి, శాంతి, ధైర్యము, సత్కార్యా చరణలయందుమక్కువ వెల్లివిరిసేవి. జాతిఐక్యతకు ఇవి ఎంతగానో తోడ్పడేవి".

సాధారణంగా పురాణకాలక్షేపం ప్రతిరోజూ లోకకళ్యాణంకోరుతూ యీక్రిందిశ్లోకంతో ముగుస్తుంది -

'స్వస్తి ప్రజాభ్యాః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీమహీశా
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యా
లోకస్సమస్తాస్సుఖినోభవంతు'
కొందరు —

"మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం"

అని మంగళంతో ముగిస్తారు.

ఉషశ్రీ లాంటివాళ్ళు "స్వస్తి" అని ఒక్కమాటతో ముగిస్తున్నారు.

## హరికథ

హరికథకూడా జానపదకళాస్వరూపమే. హరికథకులు కాలికిగజ్జెలు కట్టివిగురుతూ, హావభావాలుప్రదర్శిస్తూ సంగీతంజోడించి కీర్తనలతోనూ, పద్యాలతోనూ, సంభాషణలతోనూ కథాకథనంసాగిస్తు. మధ్యమధ్య పిట్టకథలతో హాస్యాన్నిగుప్పిస్తూ భారత, భాగవత, రామాయణాల్లోనికథలకు ప్రాపంచికవిషయాలూ, ఆధ్యాత్మికవిషయాలూ జోడించి చెబుతూ పల్లెజనులను ఆకర్షిస్తూ మద్దెల, వయొలిన్, హార్మోనియం సహకారులుగా నెలల తరబడికూడా చెబుతారు.

## పగటివేషాలు

పగటివేషాలు సామాన్యంగావేసేవి 32 వరకూ కనబడుతున్నాయి. రోజుకోరకంచొప్పున వీరు పగలువేషాలువేసుకొని ఊరిలో తిరుగుతుంటారు. ఇందులో శక్తివేషం, మాంత్రికవేషం, లంబాడీవేషం, బోడెమ్మలవేషం ప్రసిద్ధి. మాదిగవేషంలో కులాలపై హేతుబద్ధమైన విమర్శ, బోడెమ్మల వేషంలో సంఘపరమైన విమర్శ, శక్తివేషంలోని భీభత్సం ఒకసారి చూస్తే మరజీవితంలోమరపురావు. ఈ వేషాల్లోవీరు సంఘదురాచారలనూ, అత్యాచారాలనూ తూర్పారబడతారు. గమ్మత్తుగా వానిని అవహేళనచేస్తూ సమాజం దృష్టికి తీసుకువస్తుంటారు.

నిజానికి ఒకనాడు మనపల్లెజనులకు విజ్ఞానాన్నందజేసినవి చాల వరకు ఈ జానపద కళారూపాలే. ఇప్పుడివి ఆదరణలేక క్షీణదశకు చేరుకున్నాయి. వీనిని పునరుద్ధరించడంఅంటే మనసంస్కృతిని పునరుద్ధరించుకోవడం. దీనికి ప్రజలూ ప్రభుత్వం ఆయా రంగాల కళాకారులు బాధ్యత తీసికోవాలి. కనీసం మనసంస్కృతీచరిత్రకోసమన్నా వీనిని కేసెట్స్‌లో భద్రపరచాలి.

# కోతి ఆట

వానరాలు నరులకు మూలరూపాలని డార్విన్ సిద్ధాంతం. వాని అవయవాలూ ఆలోచనలూ మానవునికి దగ్గరగా ఉంటాయి. మాటలు రాకున్నా మనిషికి మచ్చికకాబడి అతనిమాటలు అర్థంచేసుకుంటాయి. కూటికోసం కోటివిద్యలు అన్నట్లు కొందరుబిచ్చగాళ్ళు వీనిని మచ్చికచేసుకొని వానికి తర్ఫీదుఇస్తారు. ప్రదర్శనకు ఊరిలోనికి తీసుకువస్తారు. యజమాని ఆదేశం ప్రకారం అవిచేసేచేష్టలు జానపదులను చాలాబాగా ఆనందింపచేస్తాయి. అతడు కోతిని పొలంవెళ్ళి పశువులుకాసుకురారా తిమ్మన్నా అంటే అక్కడున్న పుల్లముక్క తీసుకొని ముందరకాళ్ళతో మెడమీదపెట్టుకొని, వెనుక కాళ్ళపైనడుస్తూవెళుతుంటే చిత్రంగాఉంటుంది. ఒరే తిమ్మన్నా ఈ బట్టలు మీ అత్తవారిచ్చారు కట్టుకోరాఅని గుడ్డఇస్తే విసిరిపారేస్తుంది. ఈబట్టలు మీ పుట్టింటివారుపంపారురా అంటే ఆబట్ట ఆనందంగా భుజంమీదవేసుకుంటుంది. ఇలాంటి పనులేకాకుండా సర్కస్‌ఫీట్స్‌కూడా చేస్తుంది. ఒకచిన్న ఇనుపచక్రంపట్టుకొని దానిలోనుంచి దూకమంటే ఛెంగునదూకుతుంది. ఆ చిన్న చక్రానికి నూనె గుడ్డలుచుట్టిమండిస్తూ దానిలోనుండిదూకమంటేకూడా నిర్భయంగా ఛెంగునదూరి బయటకువస్తుంది. తలక్రిందకుపెట్టి దొమ్మరమొగ్గలువేస్తుంది. అతనిఆజ్ఞనుపాటిస్తూ ఎన్నోచిలిపిచేష్టలూ, చిత్రాలూ చేస్తుంది. ఇది చూడడానికిమూగినజనం పావలో, అర్ధో, బియ్యమో పెట్టి తమ కళాప్రియత్వాన్ని చాటుకుంటుంటారు.

# ఎలుగుబంట్లాట

కోతుల్లాగే ఎడుగుబంట్లనుకూడా మచ్చికచేసుకొని దానిచేత గంతులు వేయిస్తూ, చుట్టూచేరినవారికి సలాంచేయిస్తూ ఆడించి జనాన్ని అలరించి డబ్బులూ బియ్యం ప్రోగుచేసుకొని యీకళ జీవనాధారంగా బ్రతుకుతారు కొందరు.

# కోతి ఆట

వానరాలు నరులకు మూలరూపాలని డార్విన్ సిద్ధాంతం. వాని అవయవాలూ ఆలోచనలూ మానవునికి దగ్గరగా ఉంటాయి. మాటలు రాకున్నా మనిషికి మచ్చికకాబడి అతనిమాటలు అర్థంచేసుకుంటాయి. కూటికోసం కోటివిద్యలు అన్నట్లు కొందరుబిచ్చగాళ్ళు వీనిని మచ్చికచేసుకొని వానికి తర్ఫీదుఇస్తారు. ప్రదర్శనకు ఊరిలోనికి తీసుకువస్తారు. యజమాని ఆదేశం ప్రకారం అవిచేసేచేష్టలు జానపదులను చాలాబాగా ఆనందింపచేస్తాయి. అతడు కోతిని పొలంవెళ్ళి పశువులుకాసుకురారా తిమ్మన్నా అంటే అక్కడున్న పుల్లముక్క తీసుకొని ముందరకాళ్ళతో మెడమీదపెట్టుకొని, వెనుక కాళ్ళపై నడుస్తూవెళుతుంటే చిత్రంగాఉంటుంది. ఒరే తిమ్మన్నా ఈ బట్టలు మీ అత్తవారిచ్చారు కట్టుకోరాఅని గుడ్డఇస్తే విసిరిపారేస్తుంది. ఈబట్టలు మీ పుట్టింటివారుపంపారురా అంటే ఆబట్ట ఆనందంగా భుజంమీదవేసుకుంటుంది. ఇలాంటి పనులేకాకుండా సర్కస్‌ఫీట్స్‌కూడా చేస్తుంది. ఒకచిన్న ఇనుపచక్రంపట్టుకొని దానిలోనుంచి దూకమంటే ఛెంగునదూకుతుంది. ఆ చిన్న చక్రానికి నూనె గుడ్డలుచుట్టిమండిస్తూ దానిలోనుండిదూకమంటేకూడా నిర్భయంగా ఛెంగునదూరి బయటకువస్తుంది. తలక్రిందకుపెట్టి దొమ్మర మొగ్గలువేస్తుంది. అతనిఆజ్ఞనుపాటిస్తూ ఎన్నోచిలిపిచేష్టలూ, చిత్రాలూ చేస్తుంది. ఇది చూడడానికిమూగినజనం పావలో, అర్ధో, బియ్యమో పెట్టి తమ కళాప్రియత్వాన్ని చాటుకుంటుంటారు.

# ఎలుగుబంట్లాట

కోతుల్లాగే ఎడుగుబంట్లనుకూడా మచ్చికచేసుకొని దానిచేత గంతులు వేయిస్తూ, చుట్టూచేరినవారికి సలాంచేయిస్తూ ఆడించి జనాన్ని అలరించి డబ్బులూ బియ్యం ప్రోగుచేసుకొని యీకళ జీవనాధారంగా బ్రతుకుతారు కొందరు.

# ప్రఖ్యాత ప్రదర్శనలు - ప్రత్యేక పరిశీలన

ఈ జానపదకళలలో సంగీతసాహిత్య నృత్యకళాభినయాలతో కండ పుష్టికలిగి పండితుల్నికూడా మెప్పిస్తూ ప్రఖ్యాతిగన్న ప్రదర్శనలు ప్రత్యేక పరిశీలనార్హములు. వానిలో పగటివేషాలు, హరికథలు, బుర్రకథలు, యక్షగానాలు, భోగంమేళాలు, కోలసంబరాలు, వీధినాటకాలు ముఖ్యమైనవి. వీధి నాటకాలలో హరిశ్చంద్ర, చింతామణి, గయోపాఖ్యానం నాటకప్రదర్శనలు బహుళప్రాచుర్యంపొందాయి. అందువల్ల ఆయాప్రదర్శనల్ని మరింతలోతుగా ప్రత్యేకపరిశీలనతో వివిధ కోణాలనుంచీ విశ్లేషించడం, వీనిమనుగడను ఏర్ద్ధరించడం యీఅధ్యాయం ధ్యేయం.

## పగటివేషాలు

తెలుగువారికిగల అపూర్వజానపదకళాసంపదలో "పగటివేషాలు" కూడా పేర్కొనదగినవి. వీని ఆవిర్భవకాలాన్ని నిర్ణయించడానికి సరియైన చారిత్రకాధారాలు లభ్యంకాకపోయినా తెలుగుసాహిత్యవిమర్శకుల పరిశోధనలో యిది స్ఫుటంగా ఒకచోటకనపడుతోంది. అది వేములవాడభీమకవి కాలం. శాపానుగ్రహసమర్థుడగు ఉద్దండపండితుడైన వేములవాడభీమకవి కళింగరాజ్యానికివెళ్ళి లోపలనున్నరాజకళింగగంగుకు తనరాకకబురుపంపగా అతడీతనికి దర్శనమీయలేదట — దానికి కోపించిన భీమకవి "ముప్పదిరెండు దినంబులావలన్ ఘూమునకర్థమందతవి సంపద శత్రులజేరుగావుతన్" అని శపించి వెళ్ళిపోయాడట. ఆవిధంగానే శత్రురాజులుదండెత్తివచ్చికళింగగంగు నోడించగా అతడు పారిపోయి బికారియై వీథులవెంటతిరుగుతూ ఒకరాత్రి ఒకచోట కాలుజారి పాతరగోతిలోపడి "అంతబ్రతుకూబ్రతికిన మహారాజుకు యిప్పుడో కాలిదివ్విటీఅయినా లేకపోయెనే" - అని ఆక్రోశించాడట. అదివిని ఆప్రక్కనుండి వెళుతున్నభీమకవి 'ఎవరునువ్వు ?' అని అడిగితే 'భీమకవి చేసిన జోగిని' అని ఏడ్చాడట. అప్పుడు జాలిపడి మరల భీమకవి "ఆజిలో రాయలగెల్చిసజ్జనగరంబున పట్టముకట్టుకోవడిన్ రాయకళింగగంగ-మీనమాసమున పున్నమిపోయిన షష్ఠినాటికిన్" అని శాపవిముక్తినిఅనుగ్రహించాడట.



# ప్రఖ్యాత ప్రదర్శనలు – ప్రత్యేక పరిశీలన



ఆతరువాత కళింగగంగు అటుపోతున్న భాగవతులమేళంలో మూటలు మోసే నౌకరీకి చేరాడు. భీమకవిచెప్పిన శాపవిముక్తి సమయానికి ఆమేళం కళింగరాజ్యంచేరి ఏలికను ఆరాత్రి తమప్రదర్శన తిలకించమనికోరగా, రేపు పగలు తనకుపోటిపరారిఅయిన రాజ కళింగగంగువేషముకట్టిన చూడగలనని తెలుప, ఆభాగవతులు అది తమకసాధ్యమని దిగులుపడుతుంటే మూటలు మోస్తున్నగంగు ప్రభువులు కళింగగంగుయొక్క దుస్తులు. కత్తి. గుర్రము యిచ్చిన తానావేషము కట్టగలనని చెప్పెనట. రాజందుకుసమ్మతించి వాసిని సమకూర్చెనట. మరునాడుపట్టపగలు భాగవతులతో కళింగగంగు రాజసభను ప్రవేశించి గంగువేషములో వీరప్రదర్శనచేస్తూ రాజునుసమీపించి ఒక్క వేటున అతనిశిరమునరికి తిరిగిరాజ్యాభిషిక్తుడయ్యేడట.

తెలుగుసాహిత్యంలో పగటివేషం తొలుతగాయిక్కడ యిలాకనిపిస్తోంది. ఈభీమకవికాలాన్ని నిర్ణయించడంలోకూడా పరిశోధకులు చాలాతికమకపడ్డారు. నన్నయ్యకు ముందువాడని కొందరు, తరువాతివాడని కొందరు, తిక్కనకుకూడా తరువాతివాడని కొందరు. అయితే భీమకవి శాపఉపసంహార పద్యంలోని 'మీనమాసం' సౌరమానాన్ని తెలుపుతుందిగనుక (సౌరమానమంటే నేటివలె 12 నెలల్నీ చైత్రం, వైశాఖం, జ్యేష్టం, ఆషాఢం అని గాకుండా మీనం, మేషం, వృషభం అని 12 రాసులపేర్లతో పిలిచేవారు). చరిత్రచూస్తే ఈ మానం రాజరాజనరేంద్రునితర్వాత కొద్దికాలమే ఉంది. గనుక ఏపరిస్థితుల్లోనూ ఈయన తిక్కనకుపూర్వుడే అని నిర్ధారించవచ్చు. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు భీమకవితిట్టిన కళింగగంగు అనంతవర్మ చోడగంగిదేవుడని, యితనికాలం 1076-1147 మధ్యఅని కళింగ సంచికలో వ్రాసారు. నేలటూరివెంకటరమణయ్యగారు "అన్నదేవుని" రాజమండ్రి శాసనాల ఆధారంగా వేములవాడభీమకవికాలం క్రీ. శ. 1121 ప్రాంతంగా నిర్ధారించారు.

ఇంతప్రాచీనతగలిగిన యీజానపదకళ 20వ శతాబ్ది తొలిదశలో కూడా దేదీప్యమానంగావెలిగింది. 19వ శతాబ్దిలో పగటివేషాలు మైసూరులో మంచి ప్రజ్వలంగాసాగేవి. అక్కడనుంచి తెలుగు బ్రాహ్మణుడు శ్రీ పల్లావఝ్ఝుల వెంకటరామయ్యగారు తన పరివారంతో ఆంధ్ర దేశంవచ్చి కృష్ణాజిల్లాలో వీరంకిలాకుదగ్గరగల హనుమంతపురం

అగ్రహారంలో అయ్యవార్లంగారలనేవారి ఆదరణతో ఒకపీఠాన్ని స్థాపించి యీ పీఠంలో పగటివేషాలునేర్పేవాడు. వేషాల భాషనుకూడా తానేకూర్చి శిష్యగణాన్నితయారుచేశాడు. స్థానిక బ్రాహ్మణకులానికిచెందిన పాపట్లవారు, వేదాంతంవారు వగైరాలకుటుంబాలపిల్లలు యీ శిక్షణపొంది పగటివేషాలతో ఆంధ్రదేశమంతాపర్యటిస్తూ, జనాన్ని బాగా ఆకట్టుకునేవారు. అప్పట్లో కూచి పూడివారి యక్షగానాలలో హాస్యం పాలు శూన్యం. విరామసమయాల్లో యీవేషాలుప్రవేశపెట్టి ప్రేక్షకులకు హాస్యాన్ని అందించేవారు. ఈ హను మంతపురం అగ్రహారమే యిప్పుడు "గడ్డిపాడు"గా పిలవబడుతోంది.

పగటివేషాలు రెండురకాలు. 1) తామసవేషాలు 2)సాత్వికవేషాలు. గడ్డిపాడువారివి సాత్వికానికిచెందినవి. హనుమాన్ జంక్షను వద్దనున్న కొమ్మూరువారికి. నూజివీడుదగ్గరున్న గొల్లపల్లి వారికి యీకళ పల్లావఝ్ఝల వారి శిక్షణవల్ల అబ్బిందే. వీరు యాదవులు. వీరిలో పాలిపోయిన పెదముస లయ్యగారు, ఏయర్ల లక్ష్మినారాయణగారు ప్రసిద్ధులు. వీరి పిట్టలదొర, పాములాళ్ళు, మంచులవాళ్ళవేషాలు చూస్తుంటే వేషధారుల్లా ఉండేవారు కాదు. అచ్చంగా కట్టు, బొట్టు అవే. ఈ వేషాలకు వీరు సువర్ణపతకాలు కూడా పొందారు.

ఇక ఏలూరుదగ్గర సీతంపేటలోనున్న పగటివేషధారులుకూడా మంచి ప్రసిద్ధిగన్నవారే. వీరు దక్షిణాదినుంచివచ్చిన ఈతముక్కు జంగాలవారు. వీరు ఎక్కువగా తామసవేషాలకు ప్రసిద్ధి. శూర్పణఖ, భేతాళవేషాలు, శక్తి వేషంవంటివానికి వీరికివీరేసాటి. అలాగని సాత్వికవేషాలలో తక్కువేం కాదు. సాధువులవేషాలలో వీరిని నిజంగా సాధువులనిభ్రమించేవారు. వీరికి శక్తిపూజఉందనీ అందుకే మాంత్రికవేషాల్లో టక్కుటమారివిద్యలు అద్భు తంగా ప్రదర్శించేవారని ప్రతీతి.

ఇక్కడ దెందులూరులోని సున్నం వీరయ్యగారిదళంకూడా తామస వేషాలకు పేరెన్నికగన్నదళం. వీరు విశ్వబ్రాహ్మణులు. సున్నం వీరయ్య గారి భేతాళవేషంచూస్తే గర్భిణీస్త్రీలు హడలి పిండంపడిపోయేదట. ఏలూరు మోతేవారు వీరికి అఖండసన్మానంచేసి గండపెండేరం తొడిగారు. ఒకసారి బందరులో డాక్టర్ అహోబలరావుగారింటికి కత్తిపోటుతో కడుపులోని

ప్రేగులుబయటికివచ్చి గిలగిలకొట్టుకుంటున్న కుఱ్ఱవాణ్ణి వెంటబెట్టుకొని ఒకాయనవచ్చి బాబూ డాక్టరుగారూ! కుఱ్ఱాణ్ణి బ్రతికించండని ప్రార్థించేడట. డాక్టరుగారు ఆ అబ్బాయి పొట్టా, ప్రేగులూ చూసి వెంటనే అతనిని జనరల్ హాస్పటల్‌కు తీసికెళ్ళండని అన్నాడట. ఆ బాబు అక్కడికక్కడే మరణి స్తాడేమోఅని ఆహోబలరావుగారు కంగారుపడుతున్నారు. కుఱ్ఱవాడిబంధు వులు లబోదిబోమని ఏడుస్తున్నారు. మాంత్రికవేషంలోనున్న ఒకవ్యక్తి జనంలోంచివచ్చి మంత్రించి ప్రేగులు తీసేసి పొట్టసర్దేశాడు. అప్పటిదాకా చావుబ్రతుకుల్లోఉన్న ఆఅబ్బాయి లేచికూర్చున్నాడట. అంతా నివ్వెరపోయా రట. ఇంతకీ యీ అద్భుత మాంత్రికుడెవరయ్యా అంటే ఉన్నం వీరయ్య గారు. తరవాత ఆ కుఱ్ఱవానిపొట్ట పరీక్షించిచూస్తే అరటిగుజ్జు, బొంద, పువ్వు ఎఱ్ఱరంగులోకలిపితే పొట్ట, ప్రేగులు ఏర్పడ్డాయని తేలింది. వీరయ్య గారి పగటివేషాలు అంత స్వాభావికంగా ఉండేవి.

* "కష్టాతికష్టమగు యీవిద్య ఆంధ్రదేశమందు కూచిపూడి బ్రాహ్మణవంశములలో తొలుత నవతరించినదంటారు. తరువాత గోదావరి మండలమందలి కాకరపఱ్ఱుగ్రామముయీవిద్యకు గురుకులమైనది. ఆ రెంటు చోట్లను సుశిక్షితులైనవారే యావదాంధ్రదేశాన దమ విద్యను ప్రదర్శించి గ్రామాధులచేతను, పౌరులచేతను, మహారాజులచేతను ఆదరమును బడయగల్గిరి".

ప్రస్తుతం యీకళను ఆరాధిస్తున్నప్రసిద్ధులలో రాజమహేంద్ర వరంలోఉంటున్న విభూతి భవానీలింగంగారొకరు. సంగీతం, సాహిత్యం, నటన, నాట్యకళలలో ప్రవీణులేగాక శిష్యులనుతయారుచేస్తూ తమదళంతో ఊరూరా ప్రదర్శనలిస్తున్నారు. వీరి అర్ధనారీశ్వర, బోడెమ్మవేషాలు చూసి తీరవలసిందే. మొదట భాగవతులలో వృత్తిగా బ్రాహ్మణులే ఈవేషాలు వేసినా, క్రమంగా విశ్వబ్రాహ్మణులు, జంగందేవరలుమొదలగు బ్రాహ్మణే తరులుకూడా దీనినభ్యసించారు. గోదావరిమండలంలో కీర్తిశేషులు పాలంకి

---

* విజ్ఞాన సర్వస్వము – సంస్కృతి పు. 915. వెంపరాల సూర్య నారాయణశాస్త్రిగారు

నారప్ప, రావూరి సూరయ్య, వేదుల బాపయ్య, భాగవతుల కోనయ్య, కాశీనాథభట్ల వెంకయ్య మొదలగువారు కూడా ప్రసిద్ధులు. సోమయాజులువేషానికి కోనసీమ వేదపండితులచే కాశీనాథభట్ల వెంకయ్యగారు జోడుశాలువలు బహూమానమునందిన ఘనుడు.

ఈ పగటివేషాలలోని ప్రక్రియ ముఖ్యంగా వేషంలో, భాషలో నడకల్లో, చేష్టల్లో లోకంలోని కొందరిని అనుకరించడం. అదికూడా గుర్తుపట్టలేనంత గొప్పగాఆరూపంలో అతుక్కుపోవడమే దీనిలోని ప్రత్యేకత. ఇది పూర్తి పరకాయప్రవేశం. ముఖ్యంగా ఆయావేషాలద్వారా సామాన్యులకి సంఘంలోదురాచారాల్ని గిలిగింతలుపెట్టే హాస్యంతో వ్యంగ్యంగా ఎత్తి చూపించడం యిందులోని మౌలికసూత్రం. వినోదం, విజ్ఞానం బహిప్రాణాలు. ఈవేషాలు మగవాళ్ళేవేస్తారు. ఇవి 32. వీనిలో పోలీసులు, పఠాన్లు, బుడబుక్కలు, లంబాడీలు, బోడెమ్మలు, సోమయాజులు - సోమిదేవమ్మ, భట్రాజులు, గొల్లబాయిడు, పిట్టలదొర, ఫకీర్లు, మాదిగ, కారువాసాని - సోమయాజులు, మందులవాళ్ళు, సాతాని వైష్ణవులు, సాధువులు, బాల్కి - బైరాగి, సిద్ధి - కంచెనీ, అర్ధనారీశ్వర, శక్తి, భేతాళ, దేవరపిట్టి మొదలగునవి సుప్రసిద్ధ వేషాలు.

## పోలీసులు

ఇది సాధారణంగా తొలిరోజుఉదయం ఇచ్చే ప్రదర్శన. ఒకసారి గ్రామంలో ఒకస్త్రీ ఊరావల చెరువులోపడి ఆత్మహత్య చేసుకుంటే ఆమెను పైకితీసి వెంటనే రాత్రికిరాత్రి దహనంచేసేసేరట. దీనిపై పోలీసురిపోర్టు ఇవ్వవలసిన మునసబుగారు రిపోర్టు ఇవ్వలేదట.

మరునటిరోజు తెలతెలవారుతుండగా నలుగురు కానిస్టేబుల్సూ, ఒక ఇనస్పెక్టరూ వచ్చి కచేరిచావడిలోకూర్చుని మునసబుగారికి కబురుచేశారట. అయనవచ్చి నమస్కారంచేసి నిలబడితే ఆత్మహత్యచేసుకొన్న స్త్రీ విషయమై ఆచూకీకివచ్చామనీ ఎందుకు రిపోర్టివ్వలేదనీ గద్దించేసరికి మునసబు వణికిపోతూ బ్రతిమలాడుకుంటుంటే, కరణంవచ్చి కానిస్టేబుల్సుని ప్రక్కకు పిల్చి డబ్బుకుబేరమాడడం ప్రారంభించాడట. ఈ అడావిడికి గ్రామస్థులందరూ అక్కడికిచేరిపోయారు. కథమంచి 'క్లయిమాక్సు'కు చేరి అంతాగడిబిడి

పడిపోతుంటే అప్పుడు వారునవ్వుతూ తాముపగటివేషగాళ్ళమనిచెప్పి వాళ్ళని ఆశ్చర్యంలో ముంచె త్తేరట. అంతకుక్రితంరాత్రి వాడు ఊరావలదిగేరు. ఆ రాత్రి జరిగింది తెలిసికొని ఉదయమే ఈ ప్రయోగంచేశాడు. ఈవేషాల్లో వాళ్ళుచేసే ఇలాంటిట్రిక్కులు ఎన్నో ! అద్భుతరసపోషణ యీ వేషాల్లో పరాకాష్ఠ నందుకుంటుంది.

## పఠాన్‌వేషం

ఒకసారి పగటివేషగాండ్రు కోనసీమవెళ్ళినప్పుడు ఒకపండిత గ్రామంలో బసచేశారట. తాము పగటివేషగాళ్ళమనీ ఆ వూరిలో తమ వేషాలతో కళాప్రదర్శనచేయడానికి వచ్చామనీ తమప్రజ్ఞనుచూసి ఆదరిస్తారని ఆశతోవచ్చామంటే ఆపండితులు ఈసడిస్తూ తూష్ణీభావంతో వీరికళలను హేళనచేసారట. పగటివేషగాళ్ళు వెళ్ళిపోయారు.

మరునాడు ఆ ఊళ్ళోకి ఒక పఠాన్‌దండువచ్చింది. ఊళ్ళో అందర్నీ భయభ్రాంతుల్ని చేస్తోంది. ఊరంతా దద్దరిల్లజేస్తూ యీపండితప్రకాండుల్ని నడివీధిలో నిలబెట్టి కొరడాలు పైకెత్తేసరికి పండితులు హడలెత్తిపోయి వణికిపోతూ దణ్ణంపెట్టడానికి చేతులుపైకెత్తేసరికి వెంటనే వాళ్ళపాదాలకు నమస్కరించి తాము పగటివేషగాళ్ళమనీ, ఇదితమ పఠాన్‌వేషాల ప్రదర్శన మనీ చెప్పేటప్పటికి పండితులు అవాక్కయిపోయి వారివేషధారణకుముగ్ధులై వారికళానైపుణ్యాన్ని అభినందిస్తూ వేషాలన్నీచూసి ఆఖరున అఖండ సన్మానంచేసిపంపించేరట. (ఇప్పుడైతే నాలుగు తన్నిపంపిస్తారనుకోండి).

## బుడబుక్కలవేషం

"అంబపల్కు జగదంబాపల్కు, శాంకరీ పల్కు ఓంకారీ పల్కవే, యక్షిణీపల్కు అంబరపక్షీ పల్కవే - దుర్గా పల్కు చాముండీ పల్కవే" అంటూ ఒకచేత్తో ఢమరకంవాయిస్తూ, మరోచేత్తో గొడుగుపట్టుకొని, బుగ్గ మీసాలు, నల్లనికోటు, భుజంమీద ఎరుపు, పసుపు, పచ్చగుడ్డలువేసుకొని తలకు పెద్దపాగాజుట్టి, యీవేషాల్లో నలుగురైదుగురు జట్టుగా వస్తారు.

వీరు బుడబుక్కలజాతి పుట్టుపూర్వోత్తరాలూ, వాళ్ళ వేషభాషలూ, అల వాట్లూ అదో ప్రత్యేకమైన మాండలికంగా మాట్లాడుతూ మధ్యమధ్య చిన్న చిన్న హాస్యంచెణుకులు వదుల్తుంటే చూడ్డానికీ, వినడానికీ అదో చిత్రంగా ఉంటుంది.

'మాపూరిచివర తొంభై ఏండ్ల బాలాకుమారీవుంది. అక్కడ చాలా చిత్రాలూ జరుగుతున్నాయ్ మహారాజ్—ఏమి చిత్రాలురా రామజోగి అనేరు. పాములు కప్పల్ని మింగు, పిల్లులు ఎలకల్ని కరచు, బెల్లానికి చీమలూపట్టు'

"ఈఊళ్ళో ఓగాలీతిరుగుతోందీ మహారాజ్ - దాన్ని ఒదిలిస్తా—మీదీ సొమ్మూ మాకూవద్దు - తెల్లని గుడ్లుపెట్టే నల్లని కోడిపెట్టల్ నాగ్లూ యియ్యిచాల్".

"ఈమధ్య అయ్యగారిమీదా ఒకడూ పగబట్టిఉన్నాడ్. వాడూ మిడీ గుడ్లవాడూ మిట్టనొసలావాడూ. సిశీరాత్రీలేచీ నిక్కినిక్కిచూసి తనావారీతో కూడూకొనీ తమయింటిక్కి కన్నంవేస్తండూ. వాడూ ఎవడురా అని అడి గారూ అయ్యగార్ ? వాడే మహారాజ్ - గాదీకిందా ఎలకా - పందికొక్కు మహారాజ్." ఇలా నవ్వించే జోకులుఎన్నో !.

## లంబాడీవేషం

అద్దాలుకుట్టిన పరికిణీ జాకెట్టూ ధరించి, చేతులకూ భుజాలకూ తెల్ల దంతపు మురుగులూ, చెవులకుజూకాలూ, వేళ్ళాడే రెండుజడలతో అయిదారు గురు లంబాడీస్త్రీలవేషాలతోవస్తుంటే ఏదో లంబాడీతండాఊళ్ళోకొచ్చిందేమో అన్నంత అనుమానంకలుగుతుంది. వాళ్ళతండాలు ఎక్కడెక్కడఉన్నాయో, వాళ్ళ ఆచారవ్యవహారాలూ, పద్ధతులూ చెబుతూ వాళ్ళల్లో అన్న చనిపోతే అతనిపెళ్ళాన్ని తమ్ముడు పెళ్ళిచేసుకుంటాడనీ, తాము వాలిసుగ్రీవులవంశం వాళ్ళమనీ, వాళ్ళలో ఒకామెనుచూపుతూ యీలంబాడీస్త్రీ తనభర్త అడవిలో చనిపోతే మరిదినిపెళ్ళిచేసుకున్నదనీ "మొన్నపెళ్ళి, నిన్నశోభనం, యియ్యాలపొట్టా - ఈ పొట్టా మీదా ఒకేపిల్లాఉందో, రెండూపిల్లాఉందో, మూడూపిల్లాఉందో సూపించుకోడాన్కి ఎల్తున్నాం మంత్రసానీ జాడాకోసం" అని పొట్టఎత్తి చూపిస్తుంటే అందరూనవ్వుతారు. ఇలా వాళ్ళఆచారవ్యవహా రాలుచెబుతూ వాళ్ళునవ్వకుండా మనల్నినవ్విస్తూ గొప్పవినోదంకలిగిస్తారు.

## బోడెవమ్మల వేషాలు

ముఖాన విభూతిరేఖలతో మెడలో రుద్రాక్షమాలలతో తెల్లని మల్లు రేకు కట్టుకుని, తలగుండుచేయించుకుని కప్పెట్టుకొన్నట్లు చెంగు నెత్తిమీద నుండిదింపి, చెంబుచేత్తోపట్టుకుని "కస్తూరిరంగరంగా" అంటూ పాడుకుంటూ వచ్చి ప్రజల్ని చూసి అందులో ఒకర్ని చాలాతెలిసినట్టు "ఏమండోయ్! క్షేమంగాఉన్నారా? అయ్యో మేమేనండీ! మమ్మల్నెప్పుడూచూడనట్టు అలాచూస్తున్నారేమిటి? నాపేరు తులసీభాయండీ - ఈమెపేరు సౌభాగ్యం. మీరంతా క్షేమంగావున్నారా?

ఇదిగో మేం నిక్షేపంలాగున్నాం, కాకపోతే భర్తపోవడం గుండు గీయించుకోవడంతప్ప" అని చిన్న ఏడుపుతో ముక్కుచీదేసి తనభర్త ఉన్న రోజుల్లోని తనఅందాన్నిగూర్చిచెబుతూ "ఆరోజుల్లో నేను నగలు ధరించి నడివీధిలో నడుస్తుంటే అందరూ అదిగో వరలక్ష్మి వెళుతుందిరోయ్ అని వెంటబడేవారు. ఆయనమట్టుకాయనో భాగాయీ! నా ఐశ్వర్యంఅంతా నువ్వే నోయ్ - అంటూ తెగమురిసిపోయేవారు. ఇప్పుడేముందినాయనా 'భుజంమీదా కొంగు గోవిందారామ బుర్రపై కొచ్చిందిగోవిందా' అంటూ గోవిందనామాలు పాడి, "మాపంతులుగారు గంగలోస్నానానికిదిగి మునిగిపోయారునాయనా - అయనున్నన్నాళ్ళూ నేనే తిరిగేదాన్ని వీధులంట. ఇప్పుడిల్లుకదిలే అవకాశమేలేదు. ఎక్కేవాళ్ళూ దిగేవాళ్ళూ - ఏమిటి అలా చూస్తారు? ఆఎక్కేవీ దిగేవీ మా గుమ్మంమెట్లండీ గుమ్మంమెట్లు. అటు పంతులుగారిస్నేహితులూ, ఇటు నా స్నేహితులూను. ఎవరినిమాత్రం కాదనగల్ను?" అని కొంచెం శృంగారం ముదరపాలులో చెబుతుంటే చుట్టూచేరినజనం గొల్లుననవ్వుతుంటారు. "మాకు డబ్బులేక యిలాదేశాలంటబడ తిరగడంలేదునాయనా! గుమ్మడికాయంతబంగారం పక్కముట్టుకుంటే పెంటమీదపారేశాం తెలుసా? ఏదోమిమ్మల్నినలుగుర్నీ చూసిపోదామని యిలావచ్చేమంతే" అని బియ్యం కోసం జోలిచాపుతుంటే నవ్వనివాడెవ్వడు?

## సోమయాజులు - సోమిదేవమ్మ

శ్రోత్రియబ్రాహ్మణవేషంలో పెండికట్లతో పట్టుపంచి, గొడుగు, పంచాంగంకట్టతో ముసలిసోమయాజులూ - బాపనకచ్చావేసుకొని పసుపు

సోమిదేవమ్మా, వయస్సులోనున్నశిష్యుడూ వెంబరాగా కూరగాయలపేర్లు వేదంలోపనసలాగ చదువుతూవచ్చి, బ్రాహ్మణత్వంతొణికిసలాడే 'ష'లు ఎక్కువగావాడుతూ వినోదాన్ని అందిస్తారు. శిష్యుడివైపు ఓరగా చూస్తున్న సోమదేవమ్మను సోమయాజులు 'ఒషేవ్ సోమిదేవీ ! నేను ముసలివాణ్ణని అలా ప్రక్కచూపులుచూ స్తే నీకు పాపంఘటిస్తుందే' అంటే, సోమిదేవమ్మ "అవేం పాపిష్టిమాటలండీ అన్యాయంగానూ? ఇదిగో - నావల్ల పాపంవుంటే నాపసుపూకుంకుమేపోతుంది, మీవల్ల పాపంవుంటే మీరేపోతారు" అనిపెట్టే ఒట్టుకి ఫక్కుననవ్వకుండా ఎలావుండగలం !

శిష్యుడు "గురువుగారూ ! అమ్మగారికి ఆరోమాసం కడుపులాగుం దండీ" అంటుంటే సోమయాజులు "నేను కాశీవెళ్ళి ఆరు సంవత్సరాలనుంచీ అక్కడ నేనుచేస్తున్న తపస్సువల్ల యిక్కడ మాసోమిదేవికడుపు ఫలించిం దన్నమాట" అంటాడు.

అప్పుడు "మరి బారసాలపీటలమీద మీరేకూర్చుంటారా గురువు గారూ !" అంటే "తప్పేవిటిరా ? మనఆవు ఎన్నిపొలాలుతిరిగొ స్తేనేం మన దొడ్లోపేడే స్తేవాలదూ ?" అంటాడు. ఇలాంటి చతురసంభాషణలతో కడు పుబ్బనవ్విస్తాయియీవేషాలు.

## భట్రాజులవేషం

చేతిలో విసనకర్ర, మెడలో జందెం, నుదుట కుంకంబొట్టు, భుజం మీద తుండు, తలపాగాతో "విజయీభవ విజయీభవ విజయీ దిగ్విజయీ భవ, ధరసింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై పరమా మ్నాయములెల్ల వందిగణమై సిరిభార్యామణియై విరించిగొడుగై వరుసన్నీ గణరాజసంబు నిజమై వర్ధిల్లునారాయణా, జయాభిజయభవ దిగ్విజయీభవ" అంటూ నలుగురైదుగురు భట్రాజుల్లావస్తారు. వీరి పొగడ్తలూ, సుభాషి తాలూ నిజంగా భట్రాజులేఅని భ్రమింపజేస్తాయి.

ఎదుటివారికులాన్నిబట్టి పెద్దపెద్ద సమాసాలతో సంబోధిస్తూ ఎదుటి వారు బ్రాహ్మలైతే "త్రికాలసంధ్యాదిజపహోమనిత్యకర్మాగ్రశ్రేష్ఠా ! హరి హర పూజావిధేయా ! విజయీభవ" అనీ, - కోమటి అయితే 'వైశ్యరత్నా

కరా। పెనుగొండ పట్టణప్రకాశకా। ధర్మనిష్ఠాగరిష్ఠా' అనీ, కంసాలిని "ఓహో విశ్వబ్రాహ్మణా। కనకకుండలాభరణా। కాళీవరప్రసాదకారమణా।" అనీ, కాపులను "కామధేనూ। కాపులుగలుగంగనేగదా కాపురములుచేయగలి, కాపే కదకన్న తండ్రి" అనీ ఎడతెగనిథారతో ఎదుటివారిని ఉక్కిరిబిక్కిరిచేసేస్తారు. దానధర్మవిశేషాలనుగురించి వివరిస్తూ "ప్రభూ ! జగత్తులో వస్తే పోనివి రెండు, పోతేరానివి రెండు. వస్తే పోనివి పాపం, అపకీర్తి. పోతే రానివి ధర్మం, కీర్తి" అని చెప్పే పాండిత్యపులోతులకు ఆశ్చర్య పడని వారుండరు.

## గొల్లబాయుడువేషం

చేతికి నీవండిమురుగులు, ముక్కుసకాడ, పంగనామం, పిలక, పిర్రలదాకా ఎగ్గట్టినపంచె ధరించి మేకల్నితోలే పొడవాటికర్ర చేత్తో పట్టుకొని "హరిహరీ నారాయో ఆదినారాయో, కరుణించిమమ్మేలూ కమలలోచనుడా" అని పాడుకుంటూ గంతులేస్తూవస్తాడు. ఈ వేషంతోపాటు వైష్ణవ గురువువేషంకూడావస్తుంది. గురువు "దండంపెట్టరా గొల్లా" అంటే గొల్లబాయుడు కర్రపైకెత్తుతాడు నెత్తిమీద ఒకటికొట్టడానికి. "అదేంట్రానాయనా" అంటే "దండం అంటే కర్ర అని నిన్న పురాణంలోయిన్నా" అంటాడు.

"అదికాదురా దండం అంటే నమస్కారం" అంటాడు గురువు. దానికి "ఎర్రిగొల్లోణ్ణి ఎట్టాగెట్టాలో నాకేంతెలుసు ? నువ్వు నాకెట్టిసూపించు తరువాత నేన్నికెడతా" అంటాడు. వీరిద్దరిమధ్యా చిత్రమైన పొడుపు కథలూ, చమత్కారాలూ ఎన్నో !

'చూచివచ్చినోడొకడు, చూడకవచ్చినోడొకడు – ఇచ్చివచ్చినోడొకడు, యివ్వకవచ్చినోడొకడు – యీశ్శెవరో చెప్పుకోచూద్దాం' అంటాడు గొల్లడు. దానికి గురువుతెల్లమొగంవేస్తే అతడిలా విప్పుతాడు –

"చూసివచ్చినోడొకడు జటాయువు, చూడకవచ్చినోడు దశరథుడు, ఇచ్చివచ్చినోడు బలిచక్రవర్తి, ఇవ్వకవచ్చినోడు రావణాబ్రహ్మ. తెలిసిందా ?" అంటాడు గురువుమీదతనఆధిక్యతవెలిబుచ్చుతూ. అలాగే "కరకర జరజర దిబుక్కుమే" అని మరోకథపొడిచి గురువుచెప్పుకోలేకపోతే చంకలు

కొట్టుకుని యిలా విప్పిచెబుతాడు. పాకమీదఆనబకాయ కత్తితో 'కరకర' కోస్తే అది 'జరజర' జారి క్రిందనున్న మేకనెత్తుంమీద 'దిబుక్కున' పడితే, మేక 'మే' అంది అంటాడు. మొత్తంమీద యిదికూడా వినోదానికి సంబం ధించిన వేషమే.

## పిట్టలదొర

కాకీనిక్కరూ చొక్కాటక్ చేసి, దొరటోపీ పెట్టుకొని, చేతిలో తుపాకీతోవచ్చి జాతీయ అంతర్జాతీయవిషయాలూ, ప్రభుత్వ విధానాలూ పెద్ద అధికారిలా వివరిస్తాడు. వ్యంగ్యం ఈపాత్రకి ప్రాణం. జనాభాసమస్య గురించి చెబుతూ "దేశంలోజనాభాపెరిగిపోయి ఆహారంకొరత రాబోతోందని గ్రహించిన ప్రభుత్వం 60 ఏళ్ళు దాటిన ముసలివాళ్ళందర్నీ అర్జంటుగా కాల్చిపారెయ్యమని తనకి తాఖీదుపంపిందనీ, అందుకే తానువచ్చాననీ, మీయింట్లో ముసలివాళ్ళెవరెవరున్నారు ?" అని అడుగుతుంటే అది వింటున్న కుర్రాడొకడు ఘొల్లుమని ఏడవడంప్రారంభించాడట. ఏమిటని అడిగితే వాళ్ళ తాతయ్యను చంపేస్తాడుకాబోల్ననట. అంతసహజంగా చేస్తారు ఈవేషాన్ని.

## ఫకీర్లు

ఈవేషాల్లో అయిదారుగురు వస్తారు. ఉరుదూయాసతో తెలుగు మాట్లాడతారు. జీవాత్మ పరమాత్మలగురించిచెబుతూ "తన్కూకీ ప్రాణాన్కీ ఉన్న స్నేహం గొప్పాది. ఒకదాన్కీ బాధావస్తే మరొకదాన్కీ బాధా కల్గాతుంది. ఇడీదోస్తి".... ఇలా దేహాన్ని గురించి చెబుతూ "ఒక అడవికీ పోయి చిల్కా తెస్తాం - పంజరంలోపెట్టి పళ్లూ పప్పులూ పెడ్తాం. విద్దెల్ సెపుతాం. అది మనల్ని నమ్మిందికదా అని దాన్ని నమ్మి సంతోషపడ్తాం. కానీ పంజరం తెరచీవున్నా వేళా అది ఎవరికీ చెప్పాకుండా జంగిల్‌కా ఎగిరీ పోద్ది. ఈ దేహమనే పంజరంనుంచీ జీవామనేచిల్కా అట్టాగేఎగిరీపోద్దీ" ఇలాగ లోకంలోని సామాన్య ఉపమానాలతో ఎన్నోవిషయాలు చక్కగా చెబుతారు.

## మాదిగవేషం

తలకు పెద్దపాగా, నల్లనిముఖంమీద ఎర్రనికుంకంబొట్టు, మెడలో తాయెత్తు, చెవిమీద సగంకాల్చినచుట్ట, చిప్పలమొలత్రాడు, పైకి ఎగ

గట్టిన పంచెతో డప్పువాయిస్తూ "తాలే....లెల్లియలో - రామా రాఘవ లెల్లియలోయ్ - ఊరికి వెలుపలఉన్నామందోయ్ - ఊరపందిని తిన్నామండోయ్. తాలే....లెల్లియలోయ్....శివతాలే....లెల్లియలోయ్"అని పాడుతూ దానికి అనుగుణంగా గంతులేస్తూవస్తాడు. వేదాల్నిగురించీ జాతులగురించీ కులాలగురించీ పాటల్లోనూ మాటల్లోనూ విమర్శనాత్మకంగాచెబుతూ విన్న ప్రతివారినీ ఆలోచింపచేస్తాడు. అంటరానితనాన్ని గురించి పాట -

"కుక్కను కోతిని కొల్చుతారయా
నందిని పందిని పూజ సేతురయా
తోటి మానవుడు ఎదురైవస్తే
దూరం దూరమని తొలగిపోదురు ॥తాలే॥

(కుక్కంటే కాలభైరవుడు, కోతంటే హనుమంతుడు, పందిఅంటే వరహావతారం అని గ్రహించాలి).

కులాల గురించి -

"శునకగర్భమునజన్మించిన ఆ శౌనకముని గోత్రమ్ముచెప్పరా
మండూకమునకుపుట్టినట్టి ఆ మాండవ్యుని కులమేదోతెల్పుడి ॥తాలే॥
రకరకాలుగా కులాలులేవూ - రంగురంగులా మతాలులేవూ
కలిగినవాడిది గొప్పకులమూరా లేనివాడిది లేకికులమురా ॥తాలే॥

వశిష్ఠుని గురించి -

"తల్లి తొలుతలంజ తనయాలిమాదిగ
తాను బ్రాహ్మడనగ తగునెజగతి
తపసువల్ల ద్విజుడు తర్కింపకులమేది
విశ్వదాభిరామ వినురవేమ"

శూద్రులగురించి, బ్రాహ్మణుల గురించి -

"జన్మనా జాయతే శూద్రః
కర్మణా జాయతే ద్విజః
వేదభ్యాస్ విప్రశ్యాత్
బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః"

ఇలా అనేకగ్రంథాలలోని పద్యాలూ శ్లోకాలూ ఉదహరిస్తూ కులవ్యవస్థిని తూర్పారబడుతుంటే అతని శాస్త్రపరిజ్ఞానానికి ఆశ్చర్యంవేస్తుంది. చివరగా ఊళ్ళోకి ధాన్యం, పప్పులూ అమ్మకానికివచ్చాయనీ, ఉప్పు కుంచం పందహాహాయలనీ, మినుములు కుంచం రెండొందలనీ, పెసలు కుంచం నాలుగొందలనీ, కావలసినవాళ్ళంతావొచ్చి కొనుక్కోండొహో" అని దండోరావేస్తుంటే జనం నిర్ఘాంతపోయి చూస్తుండేవారు అప్పుడు. (ఇప్పుడైతే ఆశ్చర్యం కలగదనుకోండి నేటిరేట్లు ప్రకారం)

## కారువాసాని - సోమయాజులు

ఇవికూడా వినోదప్రధానమైనవి. కారువాసాని తురకవేశ్య. సోమయాజులు ఛాందసబ్రాహ్మణుడు. ఆమె తురకంలోమాట్లాడేమాటల్ని సోమయాజులు తెలుగుమాటలుగా తీసుకొనిసంభాషించేతీరు నవ్వుపుట్టిస్తుంది.

ఆమె "ముసల్మాన్" అంటే "ముసలమ్మవా ?" అంటాడు. "కోన్ హై" అంటే మాది "కోనసీమ" కాదంటాడు. "గానా సునే గాయా" అంటే "గానుగనున్నం వద్దు" అంటాడు.

ఇక శాస్త్రప్రకారం పాపపుణ్యాలవిషయం చెబుతూ — ఆవును దానం చేస్తేపుణ్యం, గర్భంతోవున్న ఆవునిదానంచేస్తే మరీపుణ్యం, దూడతోనున్న ఆవును దానంచేస్తే మహాపుణ్యం. ఈ ప్రకారంచూస్తే కన్యాదానం పుణ్యం గనుక గర్భిణీస్త్రీని దానంచెయ్యడం మరీపుణ్యం. పిల్లలతల్లినిదానంచెయ్యడం మహాపుణ్యం అవుతుందని సిద్ధాంతీకరించడం బలేనవ్వు తెప్పిస్తుంది. (అదేదో జామెట్రీలో పైతాగరస్ సిద్ధాంతంలా చెబుతుంటే నిజమేనేమో అనిపిస్తుందికూడా).

తననుగురించిచెబుతూ "మేము బ్రాహ్మలం - మా అన్నయ్యగారి పేరు నిరక్షరకుక్షి విరూపాక్షదీక్షితులుగారు - పొట్టచింపినా అక్షరం ముక్క రాదు. మా తమ్ముడు నిరంతరతస్కరసోమయాజులు - పోలీసువారితో మంచిదోస్తీ. నా నామాంకితం మండ్రగబ్బ దీర్ఘవృశ్చికవ్రతిసొట్టసోమయాజులు - నా శిష్యులు గోంగూర పేరిశాస్త్రులు, పుల్లిపాయల లింగావధాన్లు, దొమ్మరి రాఘవాచార్యులు, దూదేకుల పెద్దింభొట్లు, సాతాని శంభులింగం" అని చెబుతుంటే ఆ మాటలకు పగలబడి నవ్వుతుంటారు జనం.

సన్మానాలగురించిచెబుతూ కనకాభిషేకం, రత్నాభిషేకం, పుష్పాభిషేకంతోపాటు శిలాభిషేకం, అని ఓక్రొత్తది చెబుతారు. శిలాభిషేకమంటే ఆమనిషినెత్తిమీదకి రాళ్ళురువ్వడమట.

## మందులవాళ్ళు

మగవాళ్ళని 'పుంజు' అనీ, ఆడవాళ్ళని 'పెట్ట' అని పిలుచుకుంటూ రకరకాల ఓష్టిపూసలుధరించి, స్త్రీ పురుష వేషాల్లో వచ్చి "భద్రాచలం బస్తరు ప్రాంతాలవాళ్ళం. చెవిలో పోటు, కంటిలోపోటు, శిరోవాతానికి శీతలపైత్యానికి, కోరింతదగ్గుకి మందులుయిస్తాం మందులు" అంటూ "ఒక్కరికి మందిస్తే యింటిల్లపాదీ తానంచెయ్యాల. మంచాలూ, కుంచాలూ, తడుపుకుని వంశీకులకు త్తరాలేసుకోవాల" అని మాటలు పట్టి పట్టి కోయభాషలాగ అంటుంటే మొదట నిజంగామందులవాళ్ళేవచ్చారనుకునిచేరినజనం చివరి మాటకు పగటి వేషగాళ్ళని తెలిసి ఫక్కున నవ్వుకుంటారు.

ఇందు ఆడవారు తమ జాతినిగురించిచెబుతూ తమలో ఏడుమనువులెల్లినస్త్రీ పెద్దపేరంటాలు క్రిందలెక్క అనీ అందుకోసంతంటాలుపడుతూ యింతవరకూ తామెంతమందిమగలనుమార్చిందీ మంచి హాస్యంగా చెబుతారు.

## సాతానివైష్ణవులు

నుదుటా, గుండెలమీదా, భుజాలమీదా పెద్దపెద్ద నామాలుదిద్ది, అక్షయపాత్రలుధరించి, హార్మోనియం మద్దెళ్ళతో త్యాగారాయకీర్తనలు పాడుకుంటూవచ్చి "మేమంతావైష్ణవులమండీ-అంటే శ్రీ వైష్ణవులంమాత్రం కాదు. 108 దివ్యక్షేత్రాలు సేవించుకుని తిరుపతివెళుతున్నాం. కంటెలుగానీ, కాసులపేర్లుగానీ, ముద్దులుగానీ, జూకాలుగానీ, వడ్డాణంగానీ వెండిబంగారు లూపేణా మీవద్దముడుపులుఫుంటే మా అక్షయ పాత్రలోవెయ్యండి. మీరిచ్చే ముడుపులన్నీ కైంకర్యంచేసేస్తాం. మీరేవెళ్ళాలంటే రానూ పోనూ చాలా ఖర్చూ శ్రమా. మావంటి భక్తులకిచ్చారంటే మరిఢోకాలేదు" అంటుంటే చుట్టూ చేరిన జనం ఈ దొంగ భక్తుల మాటలకు కిలాకిలానవ్వుకుంటుంటారు.

ఈవేషంలో వీరు సృష్టి ఆవిర్భావం, శ్రీమన్నారాయణ అవతరణ, మానవ జన్మవిశిష్ఠత మొదలగు పురాణగత విషయాలెన్నో చెప్పి ప్రజలను మంత్రముగ్ధుల్ని చేస్తారు.

ఇందులో భగవద్గీత, భారతం, భాగవతం, విష్ణుపురాణాలనుండి సందర్భానుసారంగా శ్లోకాలూ పద్యాలూ ఘట్టాలూ ఉటంకిస్తుంటారు.

## సాధువులు

కాషాయరంగు అంగీలుతొడుక్కుని ఒకచేతిలో కమండలం, ఒక చేతిలో యోగదండం పట్టుకొని పాంకోళ్ళుతొడుక్కుని, చంకన చుట్టలా చుట్టిన లేడిచర్మంధరించి, అట్టకట్టినజడలూ, గెడ్డాలూధరించి, ముఖాన విభూతి కుంకంబొట్లతో నలుగురైదుగురు సాధువుల రూపాలలో వస్తారు.

"అర్థం నాస్తి, గృహంనాస్తి
మాతానాస్తి, పితానాస్తి
నాస్తిబంధు సహోదరః"

అంటూ శ్లోకాలూ కీర్తనలూ పాడుతూ వాని వివరణలు వేదాంత పరంగాచెబుతూ నిజంగా సాధువులేఅని భ్రమింపజేస్తారు. ఈ వేషాలు సీతంపేట ఈతముక్కలజంగాలవారు చాలా బాగావేస్తారు.

## బాల్కి - బైరాగి

"బాల్కి" అంటే బాలిక - ఆ వేషంఒకరూ బైరాగివేషం మరొకరూ వేసుకుని 'నారాయణ, నారాయణ, నారాయణ భగవాన్" అని కబీరుకీర్తనలా పాడుకొంటూవచ్చి దగ్గరకుచేరినజనంతో "జై సీతారాంబాబా - హమ్ ఖానా నహిఖాతా, పానీ నహీపీతా, మాకీ ఖానా - మాకీపీనా - మాకీమే సోజానా - కోయీకో కోయీనహీ, పృథ్వీమాయా, సోబ్ఝూటీహై - హమ్ ఏక్‌జనీ సాజీమే''.

''గంజాయ్ బహుత్ పీనేవాలా - ఏక్‌దమ్‌పీయాత్ కాశీదేఖ్‌నా, దోదమ్‌పీయాత్ - మక్కాదేఖ్‌నా - తీన్‌దమ్‌పీయాత్ మాటీమే సోజానా ఏక్ సిరంజన్ - దో సుఖీ - తీన్ గడ్‌బిడ్ - చార్ లట్‌ఫట్ పాంచ్

మర్గయా" అని ఏదో వేదాంతంచెబుతున్నట్లు మారాఠీయాసలో చెబుతుంటే ఆ చెప్పటంలోనితీరుసుబట్టి తెలుగుప్రజలు అదేదో వేదాంతంలావినోదిస్తారు.

## "సిద్దీ - కంచెనీ" వేషాలు

సిద్దీ తురక - ముఖానికి నల్లని మసిపూసి, రెండంగుళాల గడ్డం, చొక్కాపై వేస్టుకోటు, చేతిలోకర్ర, టర్కీటోపీ, శిల్కులుంగీ, బఫూన్‌లా వుంటాడు. కంచెనీ (భోగంవారు) నాట్యకత్తెలు ముగ్గురు నలుగురుంటారు. వీరు జావళీలు, కృష్ణశబ్దం, మండూకశబ్దం, దశావతారాలు, అష్టపదులు, తరంగాలు, అధ్యాత్మికరామాయణ కీర్తనలు, త్యాగరాయ కృతులుపాడుతూ నాట్యంచేస్తూ చక్కగాఅభినయిస్తారు. వీరితోబాటు హార్మోనీ, మద్దెళ్ళతో భాగవతులుంటారు.

సిద్దీ అక్కడ తాను షామషాగారి కాపలాదారుననీ అల్లరిచెయ్యవద్దని భాగవతుల్ని అదలిస్తాడు. ఇతడు వారిలో గురుమూర్తిని గొర్రెమూతనీ, గోవిందప్పని గోంగ్రుకప్పనీ, భరతనాట్యాన్ని బడితెనాట్యంఅనీ పలకడం మనకు నవ్వుతెప్పిస్తుంది. అమ్మాయిల్ని చూపించగానే ఆనందపడిపోయి ఆడమంటాడు.

ఇక్కడ భాగవతులనాట్యరీతులు సిద్ధాంతాలూ కర్తలు వగైరా ఎన్నో శాస్త్రవిషయాలు సామాన్యులకు తెలిసేటట్లు శ్లోకాలుచదివి, అర్థం వివరించి ఆహా ! అని శిష్టజనులుకూడాతలలూపేలాచెప్పి మెప్పిస్తారు. ఇందులో బాలగోపాలతరంగం, దశావతారాలు వంటివి నడివీధినే రంగస్థలంగాచేసికొని చక్కగా ముద్రలుపట్టి అభినయిస్తూ నర్తిస్తారు.

అంతాచూసి సిద్దీ ఏమీ ఇవ్వడుసరికదా నవాబుదర్శనానికికూడా అనుమతించడు. అప్పుడు భాగవతులలో ఒకడు "తుమ్మచెట్టు తినేపళ్ళుకాయుమ" పైగా తినేపళ్ళచెట్టు ఎవ్వరూఎక్కకుండా యీతుమ్మకంచేకాపలా. అలాంటి తుమ్మచెట్టులాంటివాడివి నువ్వు" అని తిట్టడంలోని ఉపమ సాహిత్యకారుల చేతకూడా శభాష్ అనిపిస్తుంది. భాగవతుల నాట్యప్రవీణతనుప్రకటించే అవకాశం యిందులోనే వుంది. శృంగార హాస్యరసాలకిది పట్టుగొమ్మ.

# అర్ధనారీశ్వర

కూచిపూడిపద్ధతిలో "శంభోశంకర సాంబసదాశివ-అంబర కేశదిగంబర రూపా" అని పాడుతూ భృంగివేషంలోఒకరూ అర్ధనారీశ్వర వేషంలోఒకరూ హార్మోనియం, మద్దెలా వాయిస్తూ మరిద్దరుభాగవతులూ కనిసంగా వస్తారు. అర్ధనారీశ్వరవేషానికి కుడిచెంప శివుడుగాను, ఎడమచెంప పార్వతిగానూ ఒకే మనిషికి రెండువేషాలూ వేసి తలమధ్యనుండి ముక్కు మీదనుండి పాదంవరకూ క్రిందకి ఒకతెరకడతారు. శివుని వేషంవైపు పులిచర్మం, మెడలో పాము, భుజానికీ చేతులకూ రుద్రాక్షమాలలు, ముఖాన విభూతిబొట్టు, కంఠానికి నలుపుమచ్చ, మూతిపై మీసం, జటాజూటంపై గంగ ధరిస్తారు. అప్పు డప్పుడు జటాజూటంలోని గంగ గొట్టంలా పైకితన్ని ధారగాక్రిందపడుతుంటే విచిత్రంగాకనబడుతుంది.

పార్వతివేషంవైపు ముక్కుకుముక్కెర, ముఖాన కుంకుంబొట్టు, చీర కట్టు, రవిక, చేతికిగాజులు, భుజకీర్తులు, తలకు స్త్రీవిగ్గు అలంకరిస్తారు. శివునిపాత్ర అభినయించేటప్పుడు మధ్యతెరతో పార్వతివేషం మూసేస్తూ, పార్వతిపాత్ర వచ్చినప్పుడు అదేతెరతో శివునివైపు కప్పేస్తూ నాట్యంలో యీమార్పు కనురెప్పపాటుకాలంలోచేస్తూ ప్రేక్షకుల నలరిస్తారు.

ఈవేషంలో బహుభార్యాత్వమువలనిచిక్కులూ గంగాగౌరీ సంవాదం (సవతులకయ్యం), త్రిపురాసురసంహారం, దక్షయజ్ఞం, దేవాసుర అమృత మథనం, పార్వతీపరిణయం, భక్తకన్నప్ప మొదలగు శివలీలలు పద్యాల రూపంలోనూ పాటలరూపంలోనూ నాట్యాలరూపంలోనూ ప్రదర్శిస్తారు. నడి రోడ్డుమీదే శివతాండవం ఏమాత్రం బెరుకులేకుండాచేసేస్తారు. పగటివేషాల్లో ఆదినుంచీ ప్రత్యేకతగన్న వేషంయిది. నవరసాలూ చోటుచేసుకున్న వేషం.

# శక్తి - భేతాళవేషాలు

శక్తి భయానకరసానికిసంబంధించిన వేషం. కళ్ళకు కోడిగ్రుడ్లు, నలుపురంగువేసిన పిరజోసుకున్న జనపనారతల, భయంకరంగా చాపిన

నాలుక, కోరపళ్ళుపెట్టుకున్న రాక్షసిముఖం, పైనుంచి క్రిందిదాకా నల్లటిఅంగీ, లోన ఎండుగడ్డితోకట్టిన బానపొట్ట, కుండలంతేసి స్తనాలు, మెడలో పుర్రెలదండ, కాళ్ళకు ఘనేల్ ఘనేల్మనే గంటలమోత, ఒక చేతిలో కత్తి, రెండవచేతిలో వేపరొట్టతో మందు దప్పులువాయిస్తుంటే ఎగురుతూ రోడ్ల వెంటభయంకరంగా వీరవిహారంచేస్తుంటే పిన్నలూ పెద్దలూ బికాబికలై పారిపోతుంటారు.

భేతాళవేషానికిమాత్రం మగరూపు, నాలుకకుమధ్యగాగానీ, బుగ్గకు మధ్యగాగానీ చిన్న శూలంగుచ్చబడినట్లుప్తుంటుంది నోటినుండి రక్తంకారు తున్నట్లు రంగుపూస్తారు. చేతులకుత్రాళ్ళుకట్టి అటూఇటూ యిద్దరుపట్టుకొని అతనిపరుగును అపుచేస్తుంటారు. ఈ వేషంలో భీభత్సాన్ని విపరీతంగా సృష్టిస్తారు.

ఇవి మిట్టమధ్యాహ్నంబయలుదేరతాయి పిల్లలుజడుసుకుంటారని ఈ వేషాలువస్తుంటే పిల్లల్ని యిళ్ళల్లోనుండి బయటకురానివ్వరు. ఇందుకోసమే యీ వేషాలరోజునఉదయమే గ్రామంలో దండోరాకూడా వేయిస్తారు. ఈ భయానకదృశ్యాన్ని ఊరూవాడా పది పదిహేను రోజులుదాకా చెప్పుకుంటూనే ఉంటారు. తలుపుసందుల్లోంచిచూసిన పిల్లలు జానపదకథలలో రాక్షసుల్ని చూసినట్టు అనుభూతిపొందుతూచెబుతుంటే చూడనిపిల్లలు చెవులురిక్కించి వింటుంటారు.

## దేవరపిట్టి

ఇది మాంత్రికవేషం. సాధారణంగా యిది ఆఖరివేషంఅవుతుంది. తలకు రంగుపాగా, బుగ్గమీసాలూ, ఎర్రపంచి, చేతులకు సింహతలాటం మురుగులు, కాలికి గండపెండేరం, చెవులకు కుండలాలు, ముఖానికి పసుపు, నొసట పెద్ద గంగసింధూరంబొట్టు, ఒకచేతిలో వేపరొట్ట, మరో చేతిలోఎముక, కూడా యిద్దరు ముగ్గురు పరివారం గుమ్మం గుమ్మం దగ్గరా వేపరొట్టదూసి తెళ్ళనుసృష్టించడం, పొడిఇసుక నీళ్ళలోవేసి మరల అందులోంచి పొడిఇసుకతీయడం, తడిబట్టలో జొన్నగింజలువేసి అందులో వేపి పేలాలుచెయ్యడం, నేలమీద కొబ్బరికాయ దానికదే నడవడ ఒకరూపాయిని వందరూపాయలుగా చెయ్యడం, కొబ్బరికురిడీ నిలువుగా

తాడుపై నడిపించడంవంటి మాయావినోదకార్యక్రమాలుచూపి కట్నాలుగా డబ్బు, పాతచీరలు, పాతపంచెలు వసూలుచేసుకుంటారు.

* "ప్రయోగయోగ్యమైన ఉత్తమనాటకమువలె యీపగటివేషధారణ అన్ని పరీక్షలకు నిలువగలిగిన కళాఖండము. సాహితీరంగమున మహాకావ్యమునకు ఖండకావ్యమువలె నాటకమున కిది రంగ శాలతో పనిలేని ఏకాంకికవంటిది".

వీనిలో సంగీతముంది, సాహిత్యముంది, నాట్యముంది, ఈ ప్రజాకళాకారులు తమవేషాలతో జనాన్ని ఆకట్టుకుని పొట్టపోసుకోగలిగేవారు. కాని నైతిక విలువలుపడిపోయి సమాజంలో పెద్దవాడినుంచి చిన్నవాడివరకూ ప్రతివాడూ పగటివేషధారణచేస్తున్న యీరోజుల్లో అసలువేషాలు నిలబడలేక క్షీణదశకు చేరుకున్నాయి. నేటివరకూ ఇవి గ్రంథస్థంకాలేదు. దీనిమీద తగుశ్రద్ధచూప కుంటే యిప్పటికీ క్షీణదశకుచేరుకున్న యీ ప్రజాకళ నశించిపోయేప్రమాద ముంది. ఆయావేషధారుల మాటల్ని, పాటల్ని రికార్డుచేసి, వేషాలు ఫొటోలుతీయించి భద్రపరచి ముందుతరాలవారికి కనీసం మ్యూజియం వస్తువుగానైనా అందచేయడం తెలుగు విశ్వవిద్యాలయంవారి విధి.

## హరికథ

తెలుగువారిస్వంతం అని గర్వంగాచెప్పుకొనే సాహిత్యప్రక్రియ అష్టావధానం. అలాగే కళారంగంలో మనదీ అనిచెప్పుకొనే కళాప్రక్రియహరికథ.

ఇది మరాఠీనుండో, కన్నడంనుండో, తమిళంనుండో దిగుమతి అయిందని చెప్పేవారు లేకపోలేదు. అయితే వారు ఒకవాస్తవాన్ని గమనించ లేదనిపిస్తుంది. ఆయాభాషలలో హరికథలుగా చలామణిఅయ్యే మరాఠీ వారి "సంకీర్తన" (అభంగ్), కన్నడిగుల "కీర్తన" తమిళుల "కాలక్షేపాల"కు తెలుగుహరికథకు మౌలికంగా ఎంతో భేదంఉంది. అవన్నీ ఏక ప్రాణజన్యం. తెలుగుహరికథ పంచప్రాణజన్యం కన్నడిగుల కీర్తనలో ప్రవచనానికేప్రాధాన్యం. మరాఠీల సంకీర్తనకు భజనరీతి ప్రాణం. తమిళుల

* విజ్ఞాన సర్వస్వం. సంస్కృతి పు. 914.

కాలక్షేపం సంగీతమయం - ఇంచుమించు గానకచేరీ, తెలుగుహరికథ అట్లా కాదు. ఇది సంగీత సాహిత్య నృత్య గాన అభినయాల సమతూకపు సమాహారకళ,

* 'తమిళ, కన్నడ దేశాలలోని 'కాలక్షేప' రీతికిని "కీర్తన" సంప్రదాయానికిని మరాఠీకళారూపం మూలమని పరిశోధకులనిర్ధారణ. తెలుగులో ఇది అసలుమొక్కగానే అంకురించిందిగాని వారూహించినట్లుగా అంటుమొక్కకాదు. మరాఠీహరికథ తెలుగుహరికథను కొంతలోకొంత ప్రభావితంచేసిఉండవచ్చుగాని తెలుగుహరికథ మరాఠీవ్యుత్పత్తికంకానేకాదు.

తెలుగుహరికథకు మూలంవెదికితే తెలుగునాటనే కనిపిస్తుంది. పన్నెండవశతాబ్ది "పండితారాధ్యచరిత్ర" నాటినుండే ప్రచుర్యంలో ఉన్న మన జానపదకళ యక్షగానం. దీనిస్వరూపానికీ హరికథ స్వరూపానికీ పెద్ద తేడాలేదు. అవే అంగాలు - కాకపోతే యక్షగానంలో బహుపాత్రలు పలువురు వ్యక్తులునిర్వహిస్తే హరికథలో అన్ని పాత్రలనూ ఏకవ్యక్తి పోషిస్తాడు. కీర్తనలు, తత్త్వాలు, తోహరాలు, మిశ్రాలు, వచనాలు, శ్లోకాలు, దండకాలు, దరువులు, కందార్థాలు అన్నీ అదే తీరు. అట్టి సహజ నిసర్గ తెలుగుకళాసంపదను ఏదోఒకభాగంలో సామ్యంచూసి పరాధీనంచేసుకోవడం భావ్యంకాదు. పూర్వకవులు చాలామంది తమ హరికథాకావ్యాలకు యక్షగానాలని పేరుపెట్టడంకూడా ఇక్కడ గమనార్హం.

"అంబరీషోపాఖ్యానంబను యక్షగాన ప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన" అని చేవూరి ఎరుకయ్యదాసుగారు (1861-1941) తమ హరికథను యక్షగానమని వ్యవహరించారు.

** "దక్షిణదేశానికి చెందినంతవరకూ హరికథలు మహారాష్ట్ర సంప్రదాయాన్ని అనుసరించే వచ్చాయని చెప్పవచ్చునేమోగాని, ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకూమాత్రము హరికథ యక్షగాన సంప్రదాయంలో నుంచే పరిణమించింది".

---

* డాక్టరు తూమాటి దొణప్ప 'తెలుగుహరికథా సర్వస్వం' పు. 60

** శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు. ఆంధ్రవాగ్గేయకారచరిత్ర పు. 477.

నేటి ఈ హరికథా వికాసంమాత్రం 20వ శతాబ్ది పూర్వార్ధంలోనే జరిగింది. ఈ కళాసరస్వతి ఆరోజుల్లో నడివీధిలో గజ్జెకట్టి ఆడింది. ఆకాలంలో వర్షాకాలంవస్తే ఏపల్లెలోచూసినా రాత్రి పదయ్యేసరికి "ఓరోరీ గణపాతీ రారా - నీకుంద్రాళ్ళూపోసేదా రారా" అంటూనో, "తాండవ నృత్యహారీ గజానన, ధిమికిట ధిమికిట బాజా మృదంగ" అంటూనో గణపతిప్రార్థనతో ప్రారంభమై అర్థరాత్రి రెండుగంటలవరకూ "పవమానా సుతుడుపట్టు పాదారా విందములకు" అని దాసుగారు మంగళంపాడేవరకూ అందరూపరవశులై వింటూకూర్చోవలసిందే. అక్షరాస్యత నామమాత్రంగాఉన్న ఆరోజుల్లో పల్లె జనులలో విజ్ఞాన, వినోద, వికాసాలు కలిగించిన ఉపాధ్యాయులు హరిదాసులే.

** "ఈ విద్య లోకమందున నావిర్భవమంది షష్టిమాయనములగున్ నేవచియించెడునేటికి" అని కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారు వ్రాశారు. ఈ గ్రంథప్రచురణకాలం 1939 అయినందున ఆనాటికి షష్టి మాయనాలంటే 60 సంవత్సరాలు - క్రీ. శ. 1880 అవుతుంది. నారాయణ దాసుగారు గజ్జెకట్టింది 1883లోనేకనుక నేటి హరికథ ఆవిర్భావం క్రీ. శ. 1880 ప్రాంతం అనిచెప్పవచ్చు.

హరికథ అనగానే నిఘంటువులో 'హరి' శబ్దానికిగల నానార్థాలుచూసి యిది విష్ణువు, ఇంద్రుడు, చంద్రుడు, కప్ప, కోతి, పాము వగైరావాని తాలూకుకథ అనిభావిస్తే పొరబాటు. పోనీ 'హరి' అనేనామాన్ని బట్టి విష్ణుపరమైనఆలోచనకూడా నేటికధకు సరిపడదు. హరికథ ఒక కళాప్రక్రియ. కాళ్ళకుగజ్జెలు, చేతిలోచిడతలు, ముంజేతికి సింహతలాటం మురుగులు, భుజాలకు దండకడియాలు, నుదుట కుంకంబొట్టు, గిరజాలతల, మధ్యపాపిడి. వెనక సిగముడి, మెడలో పూలదండలు, పట్టుపంచి, జరీకండువా ఇదీ ఆనాటి హరిదాసువేషం. ఇరువైపులా మద్దెలా ఫిడేలూ, వెనుకవైపు హార్మోనీశృతి దాసుగారి ఉపాంగాలు. కొందరు కంజీరాకూడాపెడితే మరికొందరు అగ్గిపెట్టెల వాయిద్యంకూడా ఏర్పాటుచేసేవారు. ఆరోజుల్లో హరిదాసు విజ్ఞానఖని. సంగీత సాహిత్య విషయాలే కాకుండా శాస్త్ర, పురాణ, రాజకీయ, చారిత్రక విషయాలుకూడా ఆమూలాగ్రంగా తెల్సిసిన మేధావిక్రిందలెక్క. కనుకనే

---

** హరికథా విధానము పు. 11 (హరికథా సర్వస్వం).

ఆతనుచెప్పే ప్రతిమాటా ఎంతో ఆసక్తిగావినేవారు అర్ధరాత్రివరకూ. వర్షా కాలంవచ్చిందంటే వార్షికంగా ఊరూరా హరిదాసులు రామాయణ, భారత, భాగవత కథాకాలక్షేపం ఒకమండలంపాటు (40 రోజులు) వరుసగాచెప్పే వారు ఆరోజుల్లో.

వీరికి ఆదిపురుషుడు ఆదిభట్ల నారాయణదాసుగారు. అందుకే వీరిని "హరికథా పితామహ" అన్నారు. వీరికిముందు యీ కథలు లేవనికాదు. మద్రాసునుండి విజయనగరంవచ్చి కుప్పుస్వామినాయుడుగారు 'ధృవచరిత్ర' హరికథచెప్పగా దానివల్ల ప్రేరితుడై తానీరంగంలోకిదిగాననిశ్రీ నారాయణ దాసుగారే స్వయంగాచెప్పుకున్నారు తమ ఆత్మకథలో. అయితే ఈ పితా మహబిరుదు అల్లసానిపెద్దన్నగారిబిరుదువంటిదే. అల్లసాని పెద్దనగారిని "ఆంధ్రకవితాపితామహ" అన్నారంటే అంతకుముందు తెలుగుకవిత్వంలేదనా? పెద్దన్నగారి మనుచరిత్ర కావ్యంతో ఒకకొత్తపుంతనుతొక్కింది తెలుగు కవిత్వం. అలాగే నారాయణదాసుగారిప్రవేశంతో హరికథారంగం పండిత పామరజనరంజకమై ప్రక్రియావైశిష్ట్యాన్ని పొందింది.

"హరికథా పితామహుడు ఆదిభట్లదాసు, సంగీతం సాహిత్యం సరి తూచిన త్రాసు" అన్నారు మహాకవి శ్రీశ్రీ. జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు యిలా అన్నారు -

"వాల్మెలిమీసకట్టు జనపాలజుట్టు
నొసటకుంకుమబొట్టు మేల్ పసిడికట్టు
విద్దెలకుపట్టు, నడయాడువేల్పుచెట్టు
హరికథాశిల్పసమ్రాట్టు ఆదిభట్టు".

ఆయనపెట్టినఒరవడి ఈనాటివరకూకొనసాగుతున్నది. అందుకే ఆయన్ని తలవని హరిదాసుఉండడు. ఆటా, మాటా, పాటల్లో ఆయన కాయనేసాటి. ఒకసారి దాసుగారిని సభలో హరికథకాదు గిరికథచెప్పమన్నారట. వెంటనే అప్పటికప్పుడు 'గిరిజాకళ్యాణం' చెప్పి సభికుల్ని ఆశ్చర్యచకితుల్ని చేశారట.

ఆదిలో దాసులంతా నారాయణదాసుగారివలెనే కవిగాయక పండితులై ఉండేవారు. అందుచేత వారికథలుకూడా చాలావరకు వారే వ్రాసుకొనేవారు. కథారచన చేసినవారిలో పరిమి సుబ్రహ్మణ్య భాగవతార్‌గారు, చింతా దీక్షిత దాసుగారు, కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారు, నల్లమిల్లి బసివిరెడ్డి గారు, కడలి వీరదాసుగారు, పెద్దింటి దీక్షితదాసుగారు పేర్కొనదగినవారు. వీరు శిష్యగణాన్ని తయారుచేసినపద్ధతికూడా ఎంతో ఆత్మీయమైనది. తమ ఇంటిలోనే భోజనాలుపెట్టి సంగీత, సాహిత్య, నృత్య, గాన, కథా విన్యాసాలునేర్పుతూ కథలకు తమతోతీసుకువెళ్ళి కథమధ్యలో పాటలుపాడిస్తూ అప్పుడప్పుడు ఒకవిడికథచెప్పిస్తూ సభాపిరికిపోగొట్టి స్వంతబిడ్డమాదిరిగా తయారుచేసేవారు. ఆ శిష్యులుకూడా గురువునకు సకలోపచారాలూచేసి కష్టపడి విద్యనేర్చుకొనేవారు. హరికథాకార్యక్రమానికి ఒకటిరెండువారాలు ముందుగా కచ్చాబిగించాలిరా అని హెచ్చరించేవారట నారాయణదాసుగారు శిష్యుల్ని. కచ్చా బిగించడంఅంటే బ్రహ్మచర్యం పాటించడమన్నమాట.

ఇక కథలకువెళితే ప్రక్కవాయిద్యగాండ్రతోపాటు శిష్యగణంతో ఆవూళ్ళో ఉండిపోవడమే. దాసుగారు పండితులుకావడంవల్ల ప్రజలమీద ఆయనప్రభావం ఎక్కువ. ఆ బృందానికి ఊరివారు రోజుకొకరుచొప్పున సాదరంగాఆహ్వానించి పిండివంటలతోభోజనాలుపెట్టిగౌరవించేవారు. ఆరాత్రి కథలో దాసుగారు బ్రేవ్‌మనిత్రేన్చి వారిఆతిథ్యాన్ని పొగుడుతూ ఆ మహాతల్లి, ఆమహాసాధ్వి, ఫలానాసుబ్బాయమ్మగారు కత్తితోకోసినా తెగని గడ్డపెరుగుతోభోజనంపెట్టిందంటూ ఆకూరలూ, ఆపిండివంటలూ వర్ణించి వర్ణించి చెబుతుంటే మలిరోజు భోజనాలుపెట్టేవారు మరింతపోటీగా వంటలుచేయించి భోజనాలుపెట్టేవారు. ఆ నలభై రోజులూ దాసుగారికి విందుభోజనాలే. దాసుగారు తమఇంటికిరావడం ఎంతో గొప్పగా భావించేవారు.

ఊరిమధ్యదేవాలయంవద్ద పచ్చనిపందిరివేసి, ఆపందిరిక్రింద బల్లలు వేసి, పైన రెండుపెట్రోమాక్సులైట్లుతగిలించి ఆవెలుగులో కథ చెప్పించేవారు. పగలంతా పొలాలలోపనిచేసుకుని రాత్రి భోజనాలు పూర్తిచేసుకుని, కూర్చోవడానికి గోనెబస్తాలుతెచ్చుకొని యింటిల్లపాదీ కథకువచ్చి వినోదించేవారు.

దాసుగారు వేషధారణచేసి, తిలకందిద్దుకుని, బల్లమీదకువచ్చి కూర్చుని ఇష్టదేవతాప్రార్థనచేసేవారు. తరువాత నిలిచి, పైనకప్పుకున్న కండువా మొలకుచుట్టుకొని "శ్రీమద్రమారమణ గోవిందోహరి" "శ్రీ ఆంజనేయవరదగోవిందోహరి" "శ్రీపుండరీకాక్షవరదగోవిందోహరి" అని అందరి చేతా గోవిందగొబ్బలు కొట్టించి ప్రేక్షకుల్ని కథోన్ముఖుల్నిచేయడం పరిపాటి. ప్రేక్షకుల్ని కథాకార్యక్రమంలో భాగస్వాములుగాచేయడానికి కొందరు దాసులు పదినిమిషాలు భజనచేయించడంకూడా కద్దు.

ఒకసారి పొడుగు పాండురంగదాసుగారు తనతోపాటు అందరూ భజన చెయ్యకపోవడంచూసి ఒకవిశేషంచెబుతావినండని చెప్పడం ప్రారంభించాడు. ఒకరోజు ఒకశిష్యుడు గురువుగారిని రామనామంయొక్క గొప్పతనం ఏమిటి అని అడిగాడట. దానికి గురువుగారు కాకినాడ జగన్నాథపురంలో సత్తెమ్మ గద్దెఉంది, ఆగద్దెమీద ఈశాన్యమూలలో సాలెగూడుఉంది. ఆసాలెగూడులో సాలెపురుగుఉంది. దాన్నడుగు చెబుతుందన్నాడు. శిష్యుడక్కడికివెళ్ళి రామనామంయొక్క గొప్పతనం ఏమిటి అన్నాడట - అంతే - అది గిరుక్కున తిరిగి నేలమీదపడి చచ్చిందట. ఆ విషయం వచ్చి గురువుగారికిచెప్పగా, అయితే రాజమండ్రి వెత్సావారింట్లో చిలకపంజరంఉంది, ఆ పంజరంలోని చిలకనడుగు చెబుతుందన్నాడట. శిష్యుడక్కడికివెళ్ళి రామనామంయొక్క గొప్పతనం ఏమిటి ? అని అనేసరికల్లా అది ముమ్మారు కిచకిచమని ప్రాణం వదిలేసిందట. ఇదేంటనివచ్చి గురువుగారినడిగితే ఇప్పుడు వేమగిరిలో సూరాబత్తుల సూరయ్యగారింట్లో కోడెదూడపుడుతోంది, ఆ దూడనడుగు చెబుతుందన్నాడట. సరే అని శిష్యుడు అక్కడికి వెళ్ళేటప్పటికి ఆవు ఈనుతోంది. కోడెదూడపుట్టింది. ఆహా ! గురువుగారిమాట నిజమే అని దూడదగ్గరకెళ్ళి రామనామంయొక్క గొప్పతనం ఏమిటి ? అన్నాడట. అంతే అదికూడా చచ్చూరుకుందట. ఇదేమిటిరా భగవంతుడాఅని హడలిపోయివచ్చి గురువుగారికిచెప్పేసరికి ఇప్పుడు జయపూర్ రాజాగారిభార్య మగబిడ్డనుప్రసవించబోతోంది, వెళ్ళి ఆబిడ్డనడుగు తప్పకచెబుతాడన్నాడు. శిష్యుడు అక్కడకు చేరుకొని విచారిస్తే అప్పుడే రాజుగారికి పుత్రోదయమయిందన్నారు. మళ్ళీ

ఇప్పుడు ఈ బిడ్డకూడా ఎక్కడ చచ్చిపోతాడోఅనిభయపడి దూరంగా గోడ ప్రక్క నిలబడి రామనామం యొక్క గొప్పతనం ఏమిటి ? అన్నాడట. వెంటనే ఆబిడ్డ పగలబడినవ్వి "ఓయి మాయకుడా ! ఇంకా అర్థంకాలేదా ? సత్తెమ్మ గుడిదగ్గర సాలెపురుగుని నేనే - నువ్వువచ్చి రామా అన్నావు. ఆ జన్మపోయి చిలకజన్మవచ్చింది. నువ్వు అక్కడికికూడావచ్చి రామా అన్నావు. ఆజన్మపోయి కోడెదూడగా పుట్టాను. అక్కడ మళ్ళా రామా అన్నావు. దానితోఇక్కడ రాజుగారిబిడ్డగాజన్మించాను. ఇంతకంటే ఏంచెప్ప మంటావు రామనామ మహాత్మ్యాన్నిగురించి ;" అన్నాడట. ఇది చెప్పేటప్ప టికి సభఅంతా నిశ్శబ్దమైపోయింది. దీంతో మొత్తం జనమంతా దాసుగారితో పాటు రామరామ రామసీత అంటూ భజనమొదలుపెట్టారు. పుణ్యం అప్పుడే పొందెయ్యాలన్నట్టు. ఇలాగ కొందరుదాసులు పిట్టకథలతో ప్రజల్ని ఆకట్టు కునేవారు. కథలో సందార్భానుసారంగా కొన్ని పిట్టకథలుచెబుతూ నవ్విస్తూ వినోదింపజేయడం హరికథలో ముఖ్యభాగం కూడా.

అనాదిగా హరికథకు భారత, భాగవత, రామాయణాలు, శివలీలలు సక్కుబాయి, మీరాబాయి, జయదేవవంటి భక్తుల గాథలు కథావస్తువులు. ఈ ప్రక్రియ ప్రజలలో మంచి ప్రచారసాధనంగా రాణించడంతో క్రమంగా క్రైస్తవకథలు, ఇస్లాంకథలు కూడా ఇందులో చోటుచేసుకున్నాయి.

జాతీయోద్యమకాలంలోహరిదాసులుకూడా "నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చా" నన్నట్టు స్వాతంత్ర్యఉద్యమాన్ని గురించీ, నాయకులగురించీ కథలుచెప్పి చైతన్యాన్ని రేకెత్తించేవారు. అలాంటివాటిలో జాతీయభారతం, ఝాన్సీరాణి, రాణాప్రతాప్, వీరశివాజీ, నెహ్రూ, తిలక్, భగత్‌సింగ్, సుభాస్‌చంద్రబోస్, క్విట్టిండియా, బెంగాల్‌కరువుముఖ్యమైనవి.

ఆరోజుల్లో యాళ్ళ తాతారావుగారు భాగవతార్ 'బెంగాల్‌కరువు' చెబుతుంటే ప్రేక్షకులు బ్రిటిష్‌వాళ్ళను నరికిపోగులుపెట్టెయ్యాలనేస్థితికి వచ్చేసేవారు.

సాహిత్యపరంగాచూస్తే హరికథాసాహిత్యంకూడా ఉత్కృష్టమైనదే. చక్కనిపదబంధం, చందోబద్ధమైనపద్యాలూ, రాగతాళయుక్తమైన కీర్తనలు

వ్యాకరణోద్దిష్టమైనవచనం, అడుగడుగునా అలంకారాలు, అనుప్రాసలు, అంత్యప్రాసలు, యమకాలు, గమకాలు, ప్రతిచోటా పరిమళించే కవిత్వం. ఈ సాహిత్యం తెలుగుసాహితీచరిత్రలో ఎందుకు చోటుచేసుకోలేదో ఆశ్చర్యం !

"రూపవాన్ మధురభాషీ". కథకునికి చక్కని స్ఫురద్రూపం, వాక్చాతుర్యం, సంగీత పరిజ్ఞానం, శ్రావ్యమైనగొంతు, లౌకికజ్ఞానం చాలాఅవసరం. కథల్లో మధ్యమధ్య త్యాగరాజకీర్తనలు, రామదాసు కీర్తనలు, మీరాకీర్తనలు, ఆధ్యాత్మికతత్వాలు కర్ణపేయంగాపాడి పురాణాంతర్గతధర్మాలు, హితోక్తులు చెప్పి జనహృదయాలను రంజింపజేసేవారు కథకులు.

హరికథకులు తామునటులుగామారి, పాత్రోచితంగాపలుకుతూ మంచి రసోత్పత్తితోచెబుతూ ప్రేక్షకుల్ని అందులోలీనంచేస్తూఉంటేనే కథ రాణిస్తుంది. ఇలా లీనంచేసుకోవడమనేది కోట సచ్చిదానందశాస్త్రి 'కర్ణ' రావు కమలకుమారి 'ప్రమీలార్జునీయం', బళ్ళ జనవలింగంగారి "గంగావతారణం" కథలలోని ప్రత్యేకత.

యుద్ధరంగంలో కర్ణుడిరథసారథి సహాయనిరాకరణచేస్తాడు. రథచక్రాలు భూమిలోకికూరుకుపోతుంటే అవస్థపడుతూ భుజంపట్టి వానిని పైకి లేపుకుంటున్నాడు కర్ణుడు. అందరికీ అయ్యోపాపం అనిపిస్తోంది. అయినా అర్జునుడు అతనిపై బాణవర్షం కురిపిస్తూనేఉన్నాడు. కాని అవి కర్ణుడి గుండెకుతగిలి పూలహారాలుగా మారిపోతున్నాయట. కారణం, ధర్మదేవత అతనిగుండెలమీద తిష్టవేయడమే. ఇదిగ్రహించినకృష్ణుడు ముసలిబ్రాహ్మణ వేషంలోవెళ్ళి దానంఅడిగాడట. "ఈయుద్ధరంగంలో ఈ నిస్సహాయస్థితిలో నీకు నేను ఏమిఇవ్వగలను బ్రాహ్మణోత్తమా ! సర్వశక్తులూ ఉడిగిపోతున్న సమయంలో నాదగ్గరఏముందనిఇవ్వను ?" అన్నాడట కర్ణుడు. దానికి కృష్ణుడు "నువ్వుచేసిన దానఫలం ధారపొయ్యి చాలు" అన్నాడట. వెంటనే అమ్ములపొదిలోని బాణంతీసి అరచేత గుచ్చుకొని ఆ రక్త తర్పణంతో తన దానఫలాన్ని ధారపోశాడట కర్ణుడు. అప్పుడు కృష్ణుడు వెళ్ళి "ఈసారి బాణంవెయ్యి అర్జునా" అనగానే ఆ

దెబ్బకు కర్ణుడు నేలక్రూలాడు. ఈ వృత్తాంతాన్ని శ్రీ కోట చెబుతుంటే కంటతడిపెట్టని ప్రేక్షకుడెవడూ ఉండడు.

అలాగే రావుకమలకుమారి 'ప్రమీలార్జునీయం' కథలో ప్రమీలాదులు వనవిహారంలో ఉయ్యాలలు ఎలా ఊగుతున్నారో కళ్ళకుకట్టినట్టు అభినయంతో చెబుతుంటే హాలులో ప్రతిఒక్కరూ ఊగిపోవలసిందే. బళ్ళ బసవలింగంగారు 'గంగావతారణం'లో -

"జటా కటాహ సంభ్రమ భ్రమన్నిలింప నిర్ఝరీ,
విలోల వీచి వల్లరీ విరాజమాన మూర్ధని"
ధగధగధగజ్జ్వలల్ల లాటపట్టపావకే
కిశోరచంద్రశేఖరే రతి ప్రతిక్షణం మమ !
ఓం నమశ్శివాయ .... ....
ప్రఫుల్ల నీలపంకజ ప్రపంచ కాళిమచ్ఛటా
విడంబి కంఠకంధరా రుచిప్రబంధకంధరమ్
స్మరచ్ఛిదం పురచ్ఛిదం భవచ్ఛిదం మఖచ్ఛిదం
గజచ్ఛిదాంధ ఖచ్ఛితం తమంతఖచ్ఛితంభజే ।
ఓం నమశ్శివాయ ................

జయత్వదభ్రవిభ్రమభ్రమద్భుజంగమస్ఫురత్
ధగధగద్వినిర్గమత్కరాళఫాలహవ్యవాట్
ధిమిధ్ధిమిధిమిధ్వనన్మృదంగతుంగమంగళా
ధ్వనిక్రమప్రవర్తిత ప్రచండతాండవశ్శివా"

అని రావణప్రోక్తమైన శివస్తోత్రం చదువుతుంటే ప్రతివారూ భక్తిరసంలో మునిగి తేలవలసిందే.

సలాది భాస్కరరావు 'నర్తనశాల' హరికథారంగంలో ఒకవిప్లవం. మంచి విమర్శ, చక్కని చమత్కారం, మెదడుకు గొప్పమేత, పాండవులు అజ్ఞాతవాసంలో ఆవేషాలేఎందుకువేశారు అనేదానికి కట్టమంచి రామలింగారెడ్డిగారు భారతవిమర్శలో ఇలాబ్రాశారని చెబుతాడు - రాజసూయయాగం చేసినవాడు ఎవరికీముందుగా నమస్కరించకూడదట. ధర్మరాజు రాజసూయం చేశాడు. మరి ఉద్యోగంఅర్థించేవాడు ముందు నమస్కరించకపోతేఎట్లా ? అయితేఆరోజుల్లో బ్రాహ్మణులకు రాజులు కూడా ముందునమస్కారంచేసే

వారట. అందువల్ల ధర్మరాజు కంకుభట్టు వేషంవేసుకువెళ్లాడట. భీమునికి ఎవరుఅన్నంవడ్డించినా అతడు భీముడనితెలిసిపోతుంది. అందువల్ల తనకు తానే పెట్టుకుతింటే ఇతరులకు తెలియడానికి అవకాశంఉండదని వలలుడి వేషంలో వంటశాలలోకి వెళ్ళాడట. అర్జునుడు ఆజానుబాహుడు. గొప్ప అందగాడు. బయట ఎక్కడకనిపించినా ఇతడుఅర్జునుడనిపోల్చుకోవచ్చు. అందుకని పేడివానివేషంలో బృహన్నలగా అంతఃపురంలోకి ప్రవేశించాడట. ఇక సహదేవుడు పశువులుకాసే నెపంతో పొలిమేరలలో తిరుగుతూ శత్రువుల జాడతెలిసినవెంటనే ఆవార్తచేరవేయడానికివీలుగా పశులకాపరిగా వెళ్ళాడట. వార్తఅందగానే పారిపోవడానికివీలుగా అయిదుగురకూ అయిదుగుర్రాలు సిద్ధంగాఉంచడంకోసం నకులుడు అశ్వశాలలోప్రవేశించాడట. ఇలా ప్రతీదీ విమర్శనాత్మకంగాచెప్పుకుపోతుండడం ఇందులోనిప్రత్యేకత. పైగా ప్రస్తుత రాజకీయాలమిళాయింపు దీనికిపట్టు.

కూరకు తాలింపు, బట్టకు జాడింపు, శాలువాకు జోడింపు, దాసుకు చదివింపు ఉండితీరాలన్నారు బుగ్గా పాపయ్యశాస్త్రిగారు - నిజమే - ఈ చదివింపులే దాసుగారికథకు హుషారు. ఒక్కొక్కచదివింపూవస్తుంటే "ఫలానావారు నన్నుఆశీర్వదించి భగవదర్పితంగాచదివించినవి యిన్ని రూపాయలు. ఆపరమాత్ముడు వారికిఅనంతకోటిరూపాయలుఇచ్చి రక్షించుగాక" అని దీవిస్తుంటారు. గ్రామాల్లో ఈకట్నాలు పోటీపడి మరీ చదివిస్తారు పేరుకోసం. కరణంగారిపద్దు ఇరవై ఐతే, మునసబుగారిపద్దు నలభై కావలసిందే. మునసబుగారిపద్దు నలభై అయితే పెద్దకాపుగారిపద్దుయాభై. ఇవే కాకుండా 'సీతాకళ్యాణం' వంటి ఘట్టాలు వచ్చినప్పుడూ, ఆఖరున పట్టాభిషేకం ఘట్టంలోనూ భార్యాభర్తలజంటలు పీటలమీదకూర్చుని వానినిజరిపించడం అనే తంతుపెడతారు. ఇక్కడ వారుపెట్టే పంచెలు, చీరలు, జామార్లు దక్షిణతాంబూలాలు దాసుగారికేదక్కుతాయి. బ్రహ్మంగారి 'కాలజ్ఞానం' చెప్పే హరిదాసులు ఆఖరున 'జేజీ నాయనకు ఆరాధన" అని పెడతారు. గ్రామంలో స్త్రీలందరూ పళ్ళాలనిండా బియ్యం, ఆకులూ, వక్కలూ, కొత్త బట్టలూపట్టుకువచ్చి సత్యనారాయణవ్రతంలోవలె బారులుతీరికూర్చుని పూజలు చేసి సమర్పించుకుంటారు. తరువాత అవి దాసుగారికేచెందుతాయి.

అంతేకాకుండా సభలో హారతిపళ్ళెం ఒకటి ప్రతిరోజూ త్రిప్పుతారు. ఆపళ్ళెంలోపడ్డుంది సాధారణంగా ఆరోజుఖర్చు ఎత్తేస్తుంది. (ఆపళ్ళెంలో అక్కడక్కడ అర్ధరూపాయివేసి తొంభైపైసలుతీసుకోవడంకూడా కద్దు). అప్పుడప్పుడు కథదగ్గరపెట్టినదేవుడిఫోటోని పల్లకీలోపెట్టి ఊరంతా ఊరేగిస్తుంటారు. ఇంటింటా హారతులిచ్చి పళ్ళాలతో బియ్యంపోసేవారు. ఈ బియ్యంతో దాసుగారు ఆఖరురోజున సంతర్పణచేసేవారు. దాసుల్లో దంత వేదాంతులు అవికూడా అమ్మేసుకొని డబ్బుచేసుకొనేవారు. ఇలాంటివాళ్ళతోనే హరికథాకులానికి గౌరవంపడిపోసాగింది. పైగా పాండిత్యంతక్కువై, ప్రగల్భాలుఎక్కువై ప్రజలకు బోరుకొట్టేయడం ప్రారంభించింది. అందుకే రావుగోపాలరావుగారి "హరికథ చెప్పకు" అనే ముత్యాలముగ్గుడైలాగు బాగా పేలింది జనంలో.

హరికథ నేడు ఎంతచిక్కిపోయిందో పిట్టకథల్లో హరిదాసులే చెబుతుంటారు. ఒకచోట హరికథజరుగుతుందట-కథమధ్యలో జనమంతా వెళ్ళిపోయారట. కాని ఇద్దరుమాత్రం చివరివరకూ కూర్చున్నారట. వారిని చూసి దాసుగారుసంతోషించి "కనీసం మీరైనా నాకథకోసం ఇంతశ్రద్ధగా కూర్చున్నందుకు నా ధన్యవాదాలు" అంటే. వాళ్ళు "అయ్యా! మేము కూర్చున్నది మీకథకోసంకాదు మీరుకూర్చున్న బల్లలకోసం మేము గ్రామ నౌకర్లం. అవి కరణంగారిబల్లలు. కథ అయిపోగానే ఇంటికిచేర్చెయ్యమన్నారు - అందుకని కూర్చున్నాం" అన్నారట.

ఈ స్థితి హరిదాసులే చాలావరకూ బాధ్యులు. మారుతున్న సమాజానికి అనుగుణంగా ప్రక్రియమార్చుకోలేకపోవడం, తగినంత కృషిచేయకపోవడం ప్రతిభావిహీనులు రంగప్రవేశంచేయడం, ప్రజానాడిని పట్టుకోలేకపోవడం హరికథకుఆదరణతగ్గడానికి ముఖ్యకారణాలు. అంతేకాకుండా జనాభిరుచికి అనుగుణంగా కొత్తకథలు వ్రాయడంలేదు. అసలిప్పుడు హరికథా రచయితలేరు. ఒకరిద్దరుసిద్ధపడినా వారి పాతఫక్కీరచన జనానికి రుచించడంలేదు. ఒకనాడు పల్లెవాసులలో విజ్ఞాన వికాసాలు పెంపొందించి నీతినియమాలునేర్పింది. ఈ ప్రజాకళే. పతనమైపోతున్న నేటి సమాజంలో నైతిక విలువలపునరుద్ధరణనిమిత్తం ప్రభుత్వంమళ్ళీ దీన్ని తీర్చిదిద్ది ప్రోత్సహిస్తే మంచి ప్రచారసాధనంగా ఉపయోగపడగలదు.

# గోదావరిసీమలో హరికథకులు - వారి ప్రత్యేకతలు

ఇక్కడివారిలో ఎక్కువమంది ఆదిభట్ల నారాయణదాసుగారి శిష్యులు, దీక్షితదాసుగారి శిష్యులు, వాజపయాజుల సుబ్బయ్యగారి శిష్యులు, పెంటపాటిసుబ్బయ్యగారి శిష్యులు, పరిమి సుబ్రహ్మణ్యభాగవతార్ గారి శిష్యులు, ములుకుట్ల అన్నపూర్ణారావుగారి శిష్యులు, మునునూరి సూర్యనారాయణగారి శిష్యులు, పుప్పలి భ్రమర్దాసుగారి శిష్యులు, నల్లమిల్లి బసివిరెడ్డిగారి శిష్యులు, వారి ప్రశిష్యులూను.

## భాగవతార్‌లు :-

### 1. డా॥ పెద్దింటి దీక్షితదాసుగారు:-

వీరినివాసం నరసాపురం. (ప. గో.) కథకుడూ రచయిత కూడా. భారతం, ఇతరకథలూ ఎన్నో వ్రాశారు. వీరికథ సంగీత సాహిత్యముల కలయిక. రచన మధురం. సంస్కృతంలోకూడా వీరిరచనలు వెలువడ్డాయి. దేశంలో ఎన్నోసన్మానాలు, ఎన్నోబిరుదాలు పొందారు. ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు డాక్టరేట్ డిగ్రీయిచ్చిగౌరవించారు. తిరుమలతిరుపతిదేవస్థానం ఆస్థానవిద్వాంసులుగాకూడా నియమింపబడ్డారు. వీరిరచనలు నారాయణదాసుగారు కూడా మెచ్చి ఆశీర్వదించారు. నారాయణదాసుగారిచరిత్ర, షిరిడిసాయిబాబాచరిత్ర, మెహర్‌బాబాచరిత్ర, సత్యసాయిచరిత్ర హరికథలువ్రాసి దేశానికందించారు. ఎంతో మంచిశిష్యులను తయారుచేశారు.

### 2. శ్రీ వాజపయాజుల సుబ్బయ్య భాగవతార్ :-

వీరి స్వగ్రామం ఉంగుటూరు (ప. గో.) గొప్ప సంగీతవిద్వాంసులు. మంచిస్వరప్రూపి. మొదట రాజమండ్రి గున్నేశ్వరరావుగారినాటక కంపెనీలో కృష్ణుడు వగైరాపాత్రలువేసేవారు. తరువాత నారాయణదాసుగారికిశిష్యులై కథలునేర్చుకుని దేశప్రఖ్యాతిపొందారు. అంతా నారాయణదాసుగారిపట్టే. అందుకే రెండవ నారాయణదాసుగారని పిలిచేవారు. రామాయణం సీరియల్‌గా ఎన్నోచోట్ల నెలరోజులపాటు చెప్పేవారు. కథ ఎక్కువగా సంగీతపరంగాసాగేది.

3. శ్రీ పెంటపాటిసుబ్బయ్య భాగవతార్ :-

వీరి స్వస్థానం ఉంగుటూరు (ప. గో.) వాజపయాజులవారి శిష్యులు. నారాయణదాసుగారి రామాయణం, భాగవతం సీరియల్స్‌గా లెక్కలేనన్నికథలుచెప్పేరు. బహుశః యిన్నికథలు దేశంలో మరెవ్వరూ చెప్పివుండరు. భక్తి, వీరరసములు పోషించడంలో వీరి ప్రతిభ అద్భుతం. చాలామందిశిష్యుల్నితయారుచేసిన గురువు.

4. శ్రీ పరిమి సుబ్రహ్మణ్య భాగవతార్ :-

వీరిది పోతునూరు (ప. గో.) చక్కని రచయిత. మంచి కథకులు. భారతం, భాగవతం మరెన్నోకథలు రచించారు. ఏ హరిదాసైనా పార్వతీ కళ్యాణం కథచెబితే వీరువ్రాసిందే చెబుతారు. అది అంతబాగా ఉంటుంది. వీరికథలలో భక్తి, రక్తి ఎక్కువ. భారత, భాగవత కథలు నెలలతరబడి చెప్పేవారు. అనేకమంది శిష్యుల్ని తయారుచేశారు.

5. శ్రీ ముళుకుట్ల అన్నపూర్ణారావు భాగవతార్ :-

వీరి స్వస్థలం తణుకు. వాజపయాజుల సుబ్బయ్యగారి శిష్యులు. తరచు రామాయణం సీరియల్‌గాచెప్పేవారు. శృంగారరసపోషణ వీరికథలో ఎక్కువగాపోషింపబడేవి. సీతాకళ్యాణం, సావిత్రికథలకు వీరు ప్రసిద్ధులు. ఎంతోమందిశిష్యుల్ని తయారుచేశారు. సంగీతశిఖామణి, లయబ్రహ్మ అనేవారు.

6. పుప్పల భ్రమరదాసుగారు :-

వీరు రాజమండ్రినివాసి. గున్నేశ్వరరావుగారి నాటకకంపెనీలో ముఖ్యపాత్రలుధరించేవారు. ఆతరువాత వాజపయాజుల సుబ్బయ్యగారి శిష్యులై కథలునేర్చుకుని హరికథకునిగా చాలాపేరుసంపాదించారు. భక్త మార్కండేయ, సత్యహరిశ్చంద్ర కథలకు వీరుప్రసిద్ధి. భక్తమార్కండేయ గ్రామఫోనురికార్డుకూడా యిచ్చారు. కథలో యితరవిషయాలకంటే కథనే ఎక్కువగాపోషించేవారు. వీరి రూపంలోనూ, కథాగానంలోనూ నారాయణ దాసుగారిపోలికలుండేవి.

7. శ్రీ సల్లమిల్లి బసివిరెడ్డి భాగవతార్ :-

తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురందగ్గర రామవరం గ్రామ

నివాసి. హరికథచెప్పడంలో అందెవేసినచెయ్యి. రామాయణ, భారత, భాగవతాలు హరికథలుగావ్రాసి సీరియల్సుగాచెప్పడమేగాక తుకారాం, మీరాబాయి, చోకామేళ, మార్కండేయవంటి భక్తిశిఖామణులకథలు "భక్త విజయం" పేరవ్రాసి విడికథలుగాచెప్పేవారు. అందులో అస్పృశ్యతానివారణ మీదవ్రాసిన భక్తచోకామేళకథ నిజానికి సాంఘికవిప్లవ ప్రబోధానికి గొప్ప ఆయుధమే. చోకామేళుడు హరిజనబాలుడు. అతను భక్తినిష్ఠలతోఉంటే (బాలయోగిలా) ఆ హరిజనపేట పెద్దలు వారించేతీరు జానపదవరసల్లో మంచి పసందుగాఉంటుంది యిలాగ -

"అబ్బోసిరా బోసిరా యీడియేదాంత
మంతకంతకు హెచ్చిపోనాది
ఈడబ్బ నాడెపుడైన యీయాసమున్నదా
అందరికి మనసిరిగిపోనాది" -

పల్లెటూళ్ళలో ఈ వరసలుపాడుతూ ఆయన కథచెబుతుంటే ఆత్మీయంగావినేవారు. దేశభక్తిపూరితంగా భారతస్వాతంత్రోద్యమచరిత్రను జాతీయభారతం అని వ్రాసారు. మంచి సంగీతవేత్త. నిండైన విగ్రహం. మధ్యపాపిడి, సిగముడి, మూతిని మీసం, బంగారుదండకడియాలు, సింహతలాటం మురుగులు, ముఖాన నామంబొట్టు, పట్టుపీతాంబరాలు ఆయనవేషం. ఆయన సీరియల్ కథచెప్పితే కనకవర్షమే. ఒక ఉళ్లో యీయేడు భారతం సీరియల్ చెబితే, మరుసటిసంవత్సరం రామాయణం సీరియల్ చెప్పించేవారు. ఆసువుగాకూడా కథచెప్పడం అలవాటు. అనేకమంది శిష్యుల్నితయారు చేశారు. గ్రామాల్లోన్నికక్షల్ని యితివృత్తంగా తీసికొని "పల్లెటూరు" అని ఒక నాటకంకూడా వ్రాశారు.

8. కొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారు

వీరిది రాజమండ్రి. కవి, కథకుడు. కవిసార్వభౌమ శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి శిష్యులు. ఎన్నోచోట్ల భారతం సీరియల్‌గా చెప్పేరు. నలచరిత్ర, వీరభద్రవిజయం కథలు గొప్ప రక్తిగాచెప్పేవారు. వీర రసపోషణ వీరిసొత్తు. సువర్ణ గండపెండేరం, ఘంటాకంకణద్వయ భుజకీర్తులు, సువర్ణకిరీటసన్మానాలు, అనేకబిరుదులుపొంది పేరెన్నికగన్న కథకులు. చాలామందిశిష్యుల్ని తయారుచేశారు. పొడుగు పాండురంగదాసు, కట్టా శరభాచారి, పట్నాల మల్లేశ్వరరావు వీరిశిష్యులే.

9. శ్రీ యాళ్ళబండి తాతారావు భాగవతార్ :

వీరు తాడేపల్లిగూడెం వాస్తవ్యులు. ముసునూరి సూర్యనారాయణగారి శిష్యులు. కథ సంగీతమయంగా ఉండేది. కథ ఏదిచెప్పినా మధ్య మధ్య బెంగాల్ కరువువంటి దారుణఘట్టాలుచెప్పి జనుల్ని ఆవేశపూరితుల్ని చేసే వారు. జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు వ్రాసిన "కూర్చుండ మాయింట కుర్చీలు లేవు" అనే పద్యం వీరినోటినుంచిరాగానే వన్సుమోర్‌లు మారుమ్రోగి పోయేవి. స్వామివివేకానంద, ద్రౌపదీవస్త్రాపహరణం వీరి ప్రత్యేకతగన్న కథలు. రసభరితంగా కథచెప్పడం వీరిలోని విశేషం.

10. ముదపాక మల్లేశ్వరరావుగారు :-

వీరిది భీమవరం. కథకులేకాకుండా చక్కని సంగీతవిద్వాంసులు కూడా. వీరు మొదట 'లవకుశ' చిత్రంలో నటించారు. కథ ఎంతో ఆకర్ష ణీయంగా చెప్పేవారు. గాంధర్వగానంచేస్తూ ఎన్నో అపురూపరాగాలు పాడే వారు. పాండవసందేశం, తులసీజలంధర వీరినోట ప్రసిద్ధి పొందిన కథలు. అందులో జలంధర అద్భుతం.

11. శ్రీ మరువాడ రామమూర్తి భాగవతార్ :-

వీరు కాకినాడనివాసి. రాజమండ్రి గున్నేశ్వరరావుగారి కంపెనీలో ప్రముఖపాత్రలుధరించి పేరుగడించారు. ఆతరువాత నారాయణదాసుగారికి శిష్యులై కథకునిగాపేరుగడించారు. శృంగారరసపోషణలో రక్తిగా కథ నడి పించేవారు. వీరికి రామాయణం సీరియల్ కథలు ఎక్కువ.

12. శ్రీ బళ్ళ బసవలింగ భాగవతార్ :-

స్వస్థలం మండపేట. పుచ్చల భ్రమరదాసుగారి శిష్యులు. కవి, కథకుడు. కథలో యితరవిషయాలేవీ చెప్పకుండా, హాస్యంజోలికిపోకుండా అపూర్వగాథలకు, దండకాలకు ప్రాధాన్యమిచ్చి సాహిత్యపరంగా కథచెప్పే వారు. శివలీలలు, దశావతారాలు, కృష్ణరాయబారం ఇత్యాది కథలు భక్తిరస భరితంగా చెప్పేవారు. ఏకసంథాగ్రాహి. బహుగ్రంథ పరిచయం కలవారు. తునిమహారాజావారిచే నవరత్నములుపొదిగిన ఘంటాకంకణ సన్మానం పొందారు. బెండపూడిసాధూగారిదగ్గర ఉపదేశం పొందారు. కథ సంస్కృత పదభూయిష్టంగాఉన్నా జనవశీకరణ ఎక్కువగా ఉండేది.

13. శ్రీ కత్తుల కృష్ణారావు భాగవతార్ :-

వీరు రాజమండ్రి వాస్తవ్యులు. ఎన్నో నాటకాలలో పాత్రలుధరించి పేరు గడించారు. అందులో భక్తరామదాసువేషంలో తాదాత్మ్యంపొంది నటించేవారు. నారాయణదాసుగారిశిష్యులై కథలుచేర్చుకుని రామాయణం, భారతం, భాగవతం, శివలీలలు, బ్రహ్మంగారిచరిత్ర సీరియల్సుగాచెప్పడమే గాక వానిని విడికథలుగాకూడా చెప్పేవారు. హిందీ, ఇంగ్లీషు, సంస్కృతం ఒరియా ఇంకా అనేకభాషలలో పరిచయముండేది. ఆ భాషలలోని రమ్యమైన విషయాలు యీకథలోకి ఎక్కించి ఉపయోగించేవారు. ఇతరరాష్ట్రాల్లోకూడా ఎన్నోకథలు సీరియల్సుగా చెప్పేరు.

14. భమిడిపాటి సూర్యనారాయణగారు :-

వీరి స్వస్థలం పలివెల. (తూ. గో.) వీరు కవికూడా. రామాయణం మంచిపట్టుగాచెప్పేవారు. ఒకఊళ్లోనే రామాయణం నాలుగైదుసార్లుచెప్పించు కొనేవారు. ఎక్కడ రామాయణంచెప్పినా పదిమెడల్సులకు తక్కువకాకుండా వచ్చేవి. అవన్నీసుమారు వందమెడల్సులపైనే దండలుగాగ్రుచ్చి మెడలో వేసుకొనేవారు. వీరిని కాసులదాసుగారనిపిలిచేవారు. వీరుఎంతసేపుకథచెప్పినా జనం విసుగుచెందకుండా వినేవారు. కథ భక్తిగా, సాహిత్యపరంగా సాగేది.

15. ఖండవిల్లి భానుమూర్తిగారు :-

వీరిది తాడేపల్లిగూడెం. సహజంగా సంగీతవిద్వాంసులు. వీరిది దేవ గానమని ప్రసిద్ధి. ఎన్నో అపురూపరాగాలుపాడేవారు. దీక్షితదాసుగారి శిష్యులు. వీరి సావిత్రి, కీచకవధ జనాన్ని బాగా ఆకట్టుకొనేవి. ఎక్కడికి వెళ్ళినా కీచకవధ చెప్పమనేవారు. హాస్యరసపోషణకు యీయన పెట్టింది పేరు. కథ సంగీతపరంగాఉండేది. వీరు "సంపూర్ణ రామాయణం" సినిమాలో కూడా నటించారు.

16. భమిడిపాటి వెంకటనారాయణగారు :-

వీరిఊరిపేరు ఉండిఅగ్రహారం. (ప.గో.) దీక్షితదాసుగారి శిష్యులు. ఏకథచెప్పినాకథాపోషణకేప్రాధాన్యం. కీర్తనసమతూకంగాపాడాలంటే వెంక టనారాయణదాసుగారేపాడాలనేవారు. రసోద్దీపనతోకథచెప్పడం వీరిప్రత్యేకత.

17. చిట్టాల ఆంజనేయులుగారు

వీరిది రావిపాడు (ప. గో.) పెంటపాటి సుబ్బయ్యగారి శిష్యులు. వీరి భక్తమార్కండేయకథకు మంచిపేరు. రామాయణం వగైరా ఎన్నో కథలుచెప్పేవారు. మైకులులేని ఆరోజుల్లో వీరికథ రెండుమూడువేలమందికి వినిపించేది. అంతపెద్దగాత్రం. వీరిరసపోషణ కథలో అధికప్రాధాన్యత పొందేది.

18. శ్రీ తెలికిచర్ల కృష్ణమూర్తి భాగవతార్ :-

రాజమండ్రి. దీక్షితదాసుగారిశిష్యులు. వీరి "రామభక్తి" కథ ప్రసిద్ధి. భక్తితో రక్తిగాచెప్పి అందర్నీ పారవశ్యులచేస్తారు. ఇతర కథలుకూడా ఎన్నో చెబుతారు.

19. పెదపాటి కృష్ణమూర్తిగారు :-

తాడేపల్లిగూడెం. పెంటపాటి సుబ్బయ్యగారి శిష్యులు. రచయిత, కథకులు. హరికథాపరిషత్‌కు కార్యదర్శి. రామాయణం, భారతం, భాగవతాలనుచెబుతారు. కథ సంప్రదాయబద్ధంగా రక్తిగాచెబుతారు. చాలామంది శిష్యుల్ని తయారుచేశారు.

20. మల్లాది శ్రీరామమూర్తిగారు :-

ఏలూరు. డ్రాయింగుటీచరు - కథకులు. సంగీతసాహిత్యాల మేలు కలయిక వీరికథలోకనిపిస్తుంది. కథలో భక్తికి ప్రాధాన్యత ఎక్కువ.

21. ముదపాక బాలసుందరంగారు :-

భీమవరం. యువకథకులు. ముదపాక మల్లేశ్వరరావుగారి తనయుడు, శిష్యుడుకూడా. కథ చురుకుగా రక్తిగానడిపిస్తారు.

22. గార్తి కొండయ్యశాస్త్రిగారు :-

వీరిది ఇందుపల్లి. (తూ. గో.) గొప్ప సాహితీవేత్త. తరుచు రామాయణం సీరియల్‌గా చెప్పేవారు. కథలో సాహిత్యవాసనలగుబాళింపుఎక్కువ.

23. అక్కిపెద్ది శ్రీరామశర్మగారు :-

కపిలేశ్వరపురం (తూ. గో.) సర్వారాయహరికథా గురుకులంలో ఎంతోమందిశిష్యుల్ని తయారుచేశారు. వీరికథలో ప్రాముఖ్యం కథకే.

24. సలాది భాస్కరరావుగారు :—

కాకినాడ. వీరుచెప్పేకథ నర్తనశాల. సమకాలికరాజకీయాల మీగా యింపు వీరికథలో క్రొత్తదనం. ఇందులో హాస్యబద్ధంచేసే విమర్శలు, కట్టమంచి రామలింగారెడ్డిగారివంటి సాహితీవేత్తల గ్రంథాల పరామర్శలు జనబాహుళ్యాన్ని ఉర్రూతలూగించే మసాలాదినుసులు.

25. వేదనభట్ల వెంకటరమణయ్యగారు :—

పిఠాపురం. వీరు నారాయణదాసుగారి శిష్యులు. ఎన్నోచోట్ల రామాయణకథలుచెప్పి కీర్తిపొందారు. కరుణరసపోషణలో కథ రక్తిగా నడిపించే శక్తి వీరిది. విశాఖరేడియోస్టేషనులో నిలయవిద్వాంసులు.

26. అన్నంపేడి బాలకృష్ణదాసుగారు :—

రామచంద్రపురం (తూ. గో.) వీరుకూడా నారాయణదాసుగారి శిష్యులే. సావిత్రికథకు వీరు పెట్టిందిపేరు. సర్వజనరంజకంగా కథలుచెప్పి ఎన్నో సన్మానాలు, బిరుదులు పొందారు.

27. ఎం. టి. రావుగారు :—

రాజమండ్రి. మొదట గున్నేశ్వరరావుగారి కంపెనీలో నటుడుగానూ హార్మోనిష్టుగానూ తిరిగేవారు. తరువాత నారాయణదాసుగారి శిష్యరికంలో కథలునేర్చుకుని హరికథకునిగా వాసికెక్కారు.

28. పెదసనగంటి సోమయ్యగారు :—

రావులపాలెం. (తూ. గో.) కథకులు. రచయితకూడా. పూర్వపు బాణీలో రామాయణం, ఇతరవిడికథలు చెప్పేవారు. విడికథలుచెప్పేటప్పుడు తెల్లవారిందాకా కథాగానం చేస్తూనేఉండేవారు. వీరికి తెలిసినన్ని పూర్వగాధలు మరెవరికైనా తెలుసునంటే అనుమానమే. గొప్ప పండితులు. కథ భక్తిగా, సాహిత్యపరంగా ఉండేది.

29. చింతా శివరామశాస్త్రిగారు :—

మురారి. (తూ. గో.) వీరు వాజపయాజుల సుబ్బయ్యగారిశిష్యులు. రామాయణం సీరియల్‌గా ఎన్నోచోట్ల చెప్పేవారు. ఎన్నో విడికథలుకూడా చెప్పేవారు. శృంగార, హాస్యరసాలు పోషిస్తూ ఆకర్షణీయంగా చెప్పేవారు.

ఘంటాకంకణ, కేయూరసన్మానాలు. బిరుదులుపొందారు. వీరి సంపాదన దాన ధర్మాలక్రిందే ఖర్చు.

30. శ్రీ ఉయ్యూరు బలిరాజు భాగవతార్ :-

వీరిది అంగర. (తూ.గో.) వీరుకూడా రచయిత. కథకుడు. భారతం సీరియల్‌గా చెబుతారు. కథ సంగీతసాహిత్యపరంగా, భక్తిగా ఉంటుంది. ఇతర ప్రసంగాలూ, హాస్యోక్తులూ లేకుండా కథనుపోషిస్తూ చెబుతారు.

31. ఘట్టి శేషాద్రిశాస్త్రిగారు :-

తాడేపల్లి గూడెం. దీక్షితదాసుగారి శిష్యులు. చక్కని అనుభూతితో రక్తిగా కథచెబుతారు. "దైవజ్ఞశిఖామణి"గా కూడా వీరికి పేరుంది.

32. కొమ్మ సుబ్రహ్మణ్యవరప్రసాద్‌గారు :-

ఆకివీడు. (ప.గో) ఎం. ఏ. పట్టభద్రులు. అన్ని కథలూ సాహిత్య పరంగాచెబుతారు.

33. నల్లమిల్లి సర్రెడ్డిగారు :-

రామవరం. (తూ. గో.) వీరు నల్లమిల్లి బసివిరెడ్డి భాగవతార్‌గారి సోదరులు, శిష్యులు. అన్నగారిఛాయలో అక్కడక్కడ విడికథలు చెప్పే వారు. కథసూటిగాచెప్పడం వీరిప్రత్యేకత.

34. పులగం సత్యనారాయణరెడ్డిగారు :-

కుతుకులూరు (తూ. గో.) వీరు నల్లమిల్లి బసివిరెడ్డిగారివద్ద వయొలిన్‌వాయిస్తూ వారిదగ్గర కథలునేర్చుకుని అనంతరం కథకులుగా భారత గాథలు చెప్పేవారు. వీరి కథలోని మధురమైనసంగీతం జనాన్ని విశేషంగా ఆకర్షించేది.

35. డా॥ నల్లమిల్లి బాపిరెడ్డిగారు ఎం. ఏ. పి హెచ్‌డి. :-

రామవరం (తూ. గో.) వీరు బసివిరెడ్డిగారి కుమారుడు, శిష్యుడు కూడా. బాల్యంలోనే తండ్రిననుసరించి కథలకువెళుతూ వారిదగ్గర కథలు నేర్చుకుని చిన్నప్పుడే మంచికథకులుగాపేరుతెచ్చుకున్నారు. ఎదిగాక ఎం. ఏ. పాసై రామచంద్రపురం వి. యస్. యం. కళాశాలలో తెలుగుశాఖా ధ్యక్షులుగా పనిచేస్తున్నారు.

36. కూళ్ళ వెంకటరెడ్డిగారు :-

వీరి స్వగ్రామం కూళ్ళ. (ప. గో.) భారతకథలు, విడికథలు చెప్పే వారు. కథ చెప్పడంలో, నృత్యాభినయంలో, చమత్కార సంభాషణలోగల ప్రత్యేకతలు స్త్రీ సమాజాన్ని బాగా ఆకర్షించేవి. చదివింపులు కథను సాగ నిచ్చేవికావు. అదీ వారికథ ఆకర్షణ.

37. వడియ్యదాసుగారు :-

కొంకుదురు. (తూ. గో.) వీరు సహజంగా హాస్యనటులు. అనేక పౌరాణిక నాటకాలలో హాస్యనటుడుగా గుర్తింపుపొందారు. చింతామణి నాటకంలో శ్రీహరివేషం కొట్టినపిండి. రెండుమూడు కథలునేర్చుకుని అప్పు డప్పుడు ఊళ్లో ఉత్సవాలకి అందరూప్రోత్సహిస్తేకథచెప్పేవారు. ఎంతకథైనా వడిగా అరగంటలో చెప్పేసేవారు. అందుకని జనం ముద్దుగా వడియ్యదాసు అని పేరుపెట్టారు. అసలుపేరు నల్లమిల్లి వీర్రెడ్డి. ఈతనికథకి హాస్యమూ వంకరనడకలూ ప్రాణం.

38. శ్రీ ఆదిరెడ్డి భాగవతార్ :-

కుతుకులూరు (తూ. గో.). వీరుకూడా బసివిరెడ్డిగారిశిష్యులే. గొళ గాత్రం. పాడుతుంటే గొంతు ఖంగుమనిమ్రోగేది. ఆ మాధుర్యం జనం విడవకుండా వచ్చేటట్టు చేసేది. బొబ్బిలియుద్ధం నాటకంలో పాపారాయుడు వేషంలో హాలుదద్దరిల్లిపోయేది.

39. శ్రీ గూనపల్లి సూర్యనారాయణ భాగవతార్ :-

రామచంద్రపురం. వీరు మంచి సంగీతవిద్వాంసులు. కథలో శాస్త్రీయ సంగీతాన్నిగుప్పించి రకరకాలరాగాలాపనలతోమెప్పించి కథను నడిపించ డంలో ప్రసిద్ధులు.

40. ప్రయాగ నరసింహశాస్త్రిగారు :-

వీరి స్వగ్రామం పొలమూరు. (తూ. గో.) వీరు ఆకాశవాణి ఉద్యో గిగా పనిచేస్తూ ఆకాశవాణి విజయవాడకేంద్రంనుండి ఎన్నో కథలు గానం చేశారు. ఇతర జానపదకళలలోకూడా మేటి. ఆయనగొంతుకో ప్రత్యేకత ఉంది. సమయస్ఫూర్తికి పెట్టిందిపేరు.

41. అమృతకవి శ్రీశైలం భాగవతార్‌గారు :—

వెదురుపాక. (తూ.గో.) వీరు వయొలిన్ విద్వాంసులు. కథసంగీత ప్రాముఖ్యతతో నడుస్తుంది. భారత రామాయణకథలు, విడికథలు పలుచోట్ల చెప్పి మంచి కథకులుగా కీర్తిగడించారు. మైక్ లేకున్నా వినిపించేటంతటి గంభీరగాత్రం.

42. గాజుల దాసుగారు :—

వీరిగ్రామం ఆరికిరేవుల (తూ. గో.) వీరి అసలుపేరు నాగేశ్వర రావుగారు. వీరు పూర్వం గాజులవ్యాపారం చేసేవారు. అందుకని వీరిని గాజులదాసుగారని పిలిచేవారు. దేశంలో పలుగ్రామాల్లో కథలుచెప్పేరు. తిరుపతిదేవస్థానంలోకూడా అడపాతడపా కథలుచెబుతుంటారు. భారత, రామాయణభాగాలు విడికథలుగా చెబుతారు.

43. దువ్వూరి సుబ్బారావుగారు :—

కాకినాడ. కథకులు. మంచి హార్మోనిస్టు. ప్రమీలార్జునీయం, హనుమత్సందేశం, సతీసుమతి, మారుతిచిటికెలు, తులసీజలంధర కథలుచెప్పే వారు. వీరికథలలో "మారుతి చిటికెలు" కథ పేరెన్నికగన్నది.

44. శ్రీ తణుకు విశ్వనాధ భాగవతార్ :—

కాకినాడ. రామాయణం, బ్రహ్మంగారిచరిత్ర వారాలతరబడి చెబుతారు. సంగీతవిద్వాంసులు. జనాకర్షకంగా కథలు చెబుతారు.

45. తణుకు ప్రభాకరంగారు :—

సామర్లకోట. బ్రహ్మంగారి కథచెబుతారు. కథ సంగీతపరంగానూ సాహిత్యపరంగానూ ఉంటుంది.

46. శ్రీ కొచ్చెర్ల రామకృష్ణ భాగవతార్ :—

భీమవరం. నలదమయంతికథకు వీరు పెట్టిందిపేరు. సంగీతసాహిత్యాలు సమానంగా పోషిస్తారు.

47. అర్జునదాసుగారు :-

ముమ్మిడివరం. (తూ. గో.) దీక్షితదాసుగారి శిష్యులు, అన్ని కథలూచెబుతారు. చాలామంది శిష్యప్రశిష్యులు తయారుచేశారు.

48. శ్రీ కొప్పర్వారి కృష్ణారెడ్డి భాగవతార్ :-

కొమరిపాలెం. (తూ. గో.) చక్కని వయొలిన్ విద్వాంసులు - కథకులు. వీరికథలో శాస్త్రీయసంగీతం పాళీంపు ఎక్కువ. మధురమైనగాత్రం. కథలో లీనమై చెప్పేవారు.

49. శ్రీ అద్దేపల్లి లక్ష్మణశాస్త్రిగారు :-

రాజమండ్రి. వేలాదిప్రజలను కథతో ఇట్టే ఆకట్టుకొనేవారు. ఎంత దూరం కథకివెళ్ళినా టాక్సీలోనేవెళ్ళేవారు. కథలో మధ్యమధ్యన సినిమాలాగ పదినిమిషాలపాటు విశ్రాంతియిచ్చేవారు. విశ్రాంతిసమయంలో జనం లేచివెళ్ళినా కథప్రారంభంచేసేటప్పటికి ఎక్కడివారక్కడేవచ్చికూర్చునేవారు.

50. శ్రీ కాశిన వీరభద్ర భాగవతార్ :-

వీరిది పెద్దాపురం. పుత్సలభ్రమరదాసుగారిశిష్యులు. సత్యహరిశ్చంద్ర భక్తమార్కండేయ, సతీసావిత్రి, జయప్రద విడికథలు, రామాయణ భారత భాగవత కథలుచెబుతారు. పెద్దాపురంలో బ్రహ్మాండమైన సన్మానంజరిగింది.

51. శ్రీ మత్తుర్తి వీరబ్రహ్మానంద భాగవతార్ :-

పెద్దాపురంలో నివాసం, యదార్థరామాయణం, మహాభారతం, బ్రహ్మంగారిచరిత్ర కథలుచెబుతారు. తాళ్ళరేవులో సింహతలాటం, దేవరాపల్లి, శృంగవరపుకోటలలో కేయూరసన్మానములుపొందారు.

## భాగవతారిణులు :-

1. ఆకి దుర్గాంబగారు :-

స్వస్థలం భీమవరం. ఎన్నోచోట్ల భారతంసీరియల్‌గా చెప్పేవారు. సుమారు 150 మెడల్సుని బహుమతిగాపొందారు. వీనిని దండలుగా మెడలో ధరించేవారు. కథలో శ్రావ్యత, నిర్మలత యీమెప్రత్యేకత. వీరు తిరుపతి శ్రీవెంకటేశ్వర సంగీతకళాశాలలో హరికథాలెక్చరర్‌గా పనిచేస్తున్నారు.

8. పి. రామకుమారిగారు :-

అంగర (తూ. గో.) పొడుగుపాండురంగదాసుగారి శిష్యురాలు. బ్రహ్మంగారిచరిత్ర సీరియల్‌గాఎన్నోచోట్ల చెప్పి గౌరవింపబడ్డారు.

9. సుశీల భాగవతారిణిగారు :-

రాజమండ్రి. మొదట్లో బేతా రామచంద్రరావుగారిగ్రూపులో నాటకాలు వేసేవారు. అనంతరం కథలునేర్చుకుని యీరంగంలోకృషిచేస్తున్న విదుషీమణి. ఈగ్రంథరచయితతోకలిసి "సుభాస్‌చంద్రబోసు" జముకుల కథకూడా చక్కగాచెప్పేవారు.

10. దువ్వూరి సత్యవతి భాగవతారిణిగారు :-

కాకినాడ. దీక్షితదాసుగారి శిష్యురాలు. తులసీజలంధర, మారుతి చిటికెలు, సతీసుమతి, ద్రౌపదీస్వయంవరం, ద్రౌపదీమానసంరక్షణం, సుగ్రీవవిజయం, కృష్ణరాయభారం మున్నగు విడికథలు చెబుతారు. ద్రౌపదీ మానసంరక్షణం వీరికి గుర్తింపుతెచ్చినకథ. మార్కాపురంలో "గానకోకిల" బిరుదుతో సత్కరించారు.

11. రంగమాంబ భాగవతారిణిగారు :-

భీమవరం. మంచికథకురాలు. భారతం నెలరోజులు సీరియల్‌గాచెప్పి మెప్పించేదిట్టగా పేరుగన్నారు. వల్లీకళ్యాణం అద్భుతంగా చెబుతారు. పద్యంచదవడంలో యీమెమధురగాత్రం యీమెకు వరం.

12. అచ్చమాంబ భాగవతారిణిగారు :-

కాకినాడ. నారాయణదాసుగారువ్రాసిన సావిత్రిచరిత్ర, యితర విడి కథలూ యించుమించు 10దాకా చెబుతారు.

13. శార్వాణీ భాగవతారిణిగారు :-

కాకినాడ. ఈమెకథలో పాండిత్యంఎక్కువ. రామాయణం సీరియల్ చెబుతారు. చాలాచోట్ల సన్మానాలుపొందారు.

14. కొచ్చెర్లమల్లేశ్వరి భాగవతారిణిగారు

భీమవరం. ఈమెచక్కని నాట్యంతో కీర్తనలుపాడి అభినయంతో కథనడిపిస్తారు. సినీపాటలుచక్కగా అనుకరిస్తారు. ప్రేక్షకులమీద యిదో సమ్మోహాసం.

15. సత్యవతి భాగవతారిణిగారు :-

తణుకు. మంగిరెడ్డిగారికుమార్తె. సీతాకళ్యాణం, హనుమత్సందేశం, విజయముద్రిక కథలు బాగాచెబుతారు. కథలోమధ్యమధ్య సినిమాపాటలు పాడి జనాన్ని రంజింపజెయ్యటంలో దిట్ట. "బోల్తాకొట్టిందిలే బుల్ బుల్‌పిట్ట" అనేసినిమాపాట యీమెపాడుతుంటే మళ్ళీమళ్ళీ పాడించుకుని చదివింపులతో ముంచేసేవారు.

ఇవి హరికథారంగంలో గోదావరిసీమప్రసవించిన మరుమల్లెలు. తూర్పుగోదావరిజిల్లా కపిలేశ్వరపురంలోని శ్రీసర్వారాయ హరికథా గురుకులం ఎంతోమంది యువకళాకారులనుతయారుచేసి దేశానికి అందిస్తోంది. అందులో ప్రభవించిన తొలికుసుమం కుమారిదాలిపర్తి ఉమామహేశ్వరి. ఈమె కాళిదాసు కుమారసంభవం హరికథగా సంస్కృతంలో ఉజ్జయినీరోనూ, కౌలాలంపూర్‌లోనూ, పాట్నాలోనూ, మద్రాసులోనూ కూడాచెప్పి పండిత ప్రకాండులను మెప్పించి దేశప్రజలను ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఈ రంగం నీరసపడిపోతున్న రోజుల్లో కపిలేశ్వరపురంలో శ్రీ యస్. బి. పి. కె. సత్యనారాయణరావుగారు వారిసతీమణి రాజేశ్వరమ్మగారు దీనికొక గురుకులాన్ని స్థాపించి పెంచిపోషిస్తూ నారాయణదాసుగారిపేర అప్పుడప్పుడు హరికథోత్సవాలుకూడానిర్వహిస్తూ హరికథాజ్యోతి ఆరిపోకుండా కొడిగట్టినదీపానికిచమురుపోసి వెలిగిస్తున్నారు.

అలాగే రాజమండ్రిలో శ్రీ త్యాగరాజనారాయణదాస సేవాసమితి ప్రతి సంవత్సరం ఫిబ్రవరిలో గానకచేరీతోపాటు హరికథాసప్తాహం కూడా నిర్వహిస్తూ యీ రంగానికి ప్రోత్సాహాన్నందిస్తున్నారు.

తాడేపల్లిగూడెంలో శ్రీ పెదపాటికృష్ణమూర్తి భాగవతార్‌గారు కార్యదర్శిగా 'హరికథాపరిషత్' అనే సంస్థకూడా యీరంగంలో ఎందరో యువకళాకారులకు తర్ఫీదుయిస్తూ, నెలనెలా పరిషత్‌లో కథలనుఏర్పాటు చేస్తూ సేవలందిస్తోంది.

ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు యీ కథారంగంలోప్రవీణులైన అమ్ముల విశ్వనాథం భాగవతార్‌వంటి వారికి కళాప్రపూర్ణ బిరుదులివ్వడం ఉన్నత విద్యారంగంకూడా దీనిని విశిష్టకళగా గుర్తించిందనడానికి నిదర్శనం.

# బుఱ్రకథ

* "కథకుడు కాలికిగజ్జెకట్టి, చేతవాయిద్యములుధరించి, వంతపాటగాండ్ర సహాయమున ఆవేశపూరితుడై కించిదభినయవిశాలనమున, పదవిన్యాసమున, లయబద్ధమున ప్రజాసమూహమునెదుట గానముచేయును. అట్టివానికే ఆంధ్ర దేశమున బుఱ్రకథలనియు, జంగమకథలనియు, పదములనియు, తందాన కథలనియు, పురాణమనియు, కతలని వ్యవహారమున కలదు. కథకుడు చేతియందు సొరబుఱ్రతోడనో, గుమ్మడిబుఱ్రతోడనో చేసిన తంబురా, శారద వంటి వాద్యములధరించి వానిధ్వనులతోమేళవించిన గానముగల కథలను పాడుటచే వీనికి బుఱ్రకథలని పేరువచ్చింది".

తెలుగువారి జానపదకళాఖండాలలో బుఱ్రకథస్థానం అపూర్వమైనది. ఇది అప్పమైన ప్రజాకళ. ఆదినుండీ తెలుగుదేశంలో యిది తెలుగునాడిని ప్రతిస్పందిస్తూ వినోదాన్నందిస్తూ గత అర్ధశతాబ్దినుండీ విజ్ఞానాన్ని వెదజల్లే సాధనంగాకూడా మలచబడి నిలబడింది.

దీని "చరిత్ర - గమనము" నిజంగా పరిశోధింపదగ్గ అంశమే - అయినా యూనివర్సిటీలదృష్టి ఎందుకు దీనిమీదకివెళ్ళలేదో ! ఇదికూడా యక్షగానప్రక్రియేగనుక సాహిత్యంలో దీనికక్కడా స్థానముంది. స్థూలంగా తెలిసినంతవరకూ మనకులభ్యమౌతున్న కథలలో బాలనాగమ్మ, కాంభోజ రాజు, కాటమరాజు, ముగ్గురుమరాఠీలు, లక్ష్మమ్మ, కామమ్మ కథలు ప్రాచీనములు.

ఇవి ఏకాలంలోపుట్టాయి అని ఆలోచిస్తే బాలనాగమ్మకథ రంగనాథ రామాయణానికిముందే తెలుగుదేశంలో ప్రచారంలోవున్నట్లు కనబడుతోంది. ఎందుకంటే వాల్మీకిరామాయణంలో లక్ష్మణరేఖప్రసక్తిలేదు. ఇదితొలిసారిగా రంగనాథరామాయణంలోనేకనిపిస్తోంది. మరి యిందులో యిది ఎలావచ్చిందీ ఆలోచిస్తే తెలుగునాట జనసామాన్యంలో అప్పటికే బహుశా బహుళ ప్రచారంలోనున్న బాలనాగమ్మకథలోని కార్యవర్ధిరాజు యుద్ధానికివెళుతూ బాలనాగమ్మను దాటవలదనిగీచిన గీతలే రంగనాథ రామాయణంలో

* తెలుగుజానపదగేయగాథలు పు. 21 డా॥ నాయని కృష్ణకుమారి.

చొప్పించబడివుండవచ్చునని శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు వ్రాశారు "రాజకవులు" విమర్శగ్రంథములో. మరి బాలనాగమ్మ పద్యకావ్యంగానీ, గద్యకావ్యంగానీ లేదు. కాబట్టి నేడు లభ్యమౌతున్న "బాలనాగమ్మ" తంబురపాట క్రీ. శ. 13వ శతాబ్దికి ముందేవుందని చెప్పవచ్చు.

ఒకనాడిది ఒకజాతివారికి భిక్షకవృత్తికి ఆలంబనగావుండేది. ఇద్దరు స్త్రీలుగానీ ఇద్దరు పురుషులుగానీ, ఒకస్త్రీ ఒకపురుషుడుగానీ ఒకరు తంబుర వాయిస్తూ అందెమ్రోగిస్తూ కథపాడుతుంటే రెండవవారు ఢక్కీవాయిస్తూ "తందానతాన" అని వంతపాడుతుండేవారు. అలా గుమ్మం గుమ్మానికీ కొంతకొంతపాడుతూ బియ్యం, పాతబట్టలూ అడుక్కునేవారు. ప్రజలు ఎంతోఆప్యాయంగావింటూ వారికి భిక్షవేసేవారు. ఒకోసారి ఆయావీధి ఆడవాళ్ళంతాచేరి వీరినికూర్చుండబెట్టుకుని యీకథలు పూర్తిగా చెప్పించుకుని వానిలోని వీర, కరుణ రసాలకు నీరైపోతూ శేరుబియ్యం చేటలతోతెచ్చి వారికిపెడుతుండడం తెలుగునాట పల్లెటూళ్ళలో యిప్పటికీ మనకు కనిపిస్తూనే ఉంటుంది.

దీన్నిభిక్షకవృత్తిస్థాయినుంచిపెంచి నాట్యాదివిషయాలుజోడించి గజ్జె కట్టించి, బల్లకెక్కించి, పూలదండలు వేయించి పండితాదరణ తెచ్చిన గౌరవం శ్రీనాజర్ కే దక్కుతుంది. ఆంధ్రదేశంలో ప్రజానాట్యమండలి యీప్రక్రియకు ఒకఊపునివ్వడంతో వాడవాడలా బుర్రకథదళాలు వెలిశాయి. వీరబొబ్బిలి, పల్నాటియుద్ధం, సీతారామరాజు, నేతాజీ, బాపూజీ, బెంగాల్ కరువు యిలా ఎన్నోకథలు. నిజానికి స్వాతంత్రపోరాట అంతిమఘట్టంలో ప్రజల్ని ప్రేరేపించడానికికళారంగంలో యీప్రక్రియ బాగాఉపయోగపడింది. క్రమంగా ఆనాటినుంచీ రాజకీయఎన్నికలరంగంలోకూడా అన్నిటికన్నా దీనిపాత్రే ఎక్కువ.

సమకాలీన ప్రజాసమస్యల్ని కథగామలుచుకుని అనుపమానంగా తెలుగుదేశాన్నిఏలిన తొలిబుర్రకథ "కష్టజీవి".

"రామాపురమని ఉత్తరాదిలో రాజిలు నొక పల్లె
అపూరివిగల వన్ని గుడిశలే అడవికంప దడులే"

అని ప్రారంభించబడ్డ యీకథలోని జానుతెనుగు, రసపుష్టి, సాహిత్యసుతారం తరువాత సామాజికస్పృహకలిగినరచనలకు మార్గదర్శక మయింది. "వినరాభారత వీరకుమారా విజయముమనదేరా" అనే క్రొత్త వంతఅప్పుడు పుట్టిందే.

సుంకర, వాసిరెడ్డి "కష్టజీవి" ''సీతారామరాజు" వంటి విప్లవకథలు వ్రాసి జనంమీదికి విసిరితే పతివాడలాంటివారు "పట్టాభి", "నేతాజీ" మొద లగు రాజకీయ నాయకుల చరిత్రలు వదిలారు.

ఇక ప్రదర్శనల్లోవస్తే "నాజర్" అడుగుజాడల్లో జూనియర్ నాజర్, నిట్టలాబ్రదర్స్, డిండిబ్రదర్స్, బెనర్జీదళం యింకా ఎన్నో బృందాలు వట్టి ఢక్కీలూ తంబురా అందెలతో కథలుచెబుతుంటే, యివి నామమాత్రంగా ధరించి హార్మోనియం, తబలా యింకా రకరకాల మ్యూజికల్ఇన్‌స్ట్రుమెం ట్స్‌తో నిడదవోలు అచ్యుతరామయ్య, కృష్ణమాధవరావు మొదలగువారు హరికథమట్టులూ, నాటకపద్యాలూ జోడించి హరికథలాంటి బుర్రకథలు చెప్పేవారు. బుర్రకథలకు యిదోరకం ఆధునికీకరణ అన్నట్టు.

ఒకదశాబ్దంక్రితంవరకూ దేశంఅంతా ముమ్మరంగా జరిగిన బుర్రకథా ప్రదర్శనలు ఆశ్చర్యంగా ఇప్పుడు ప్రజలముందు విఫలంకావడం ప్రారంభిం చాయి. కథలకు జనం రావడంలేదు. వచ్చినకొంతమందీ కొంతసేపటికే వెళ్లి పోతున్నారు. ఆఖరికి ఏ యిద్దరైనా మిగిలితే వీళ్ళలో ఒకడు మైక్‌మనిషి. రెండోవాడు బల్లలుమోసుకెళ్ళేమనిషి. కథ అయ్యేవరకూ వాళ్ళు చచ్చినట్టు కూర్చోవలసిందేగామరీ! ఈ దుర్దశకు కారణం ఏమిటాఅనిఆలోచిస్తే మనకు గోచరించే ప్రధానకారణాలు నాలుగు.

1) పాతకథలుతప్ప క్రొత్తకథలు రావటంలేదు. రచయితలెవరూ బుర్రకథలు వ్రాయడంలేదు.

2) కథల్లోకూడా ఎప్పుడో నాజర్ఏర్పాటుచేసుకునిచెప్పిన విధానమే తప్ప మార్పులేదు. ఎవరుచెప్పినా అవేకథలూ, అలాగేచెప్పడంతో జనానికి బోరుకొట్టేసింది.

3) రగడలు, నడకలు, మాటలు, పాటలు ఒకటే మూస. వెరైటీ లేదు. నవ్యతలేదు.

4) హాస్యకథలుకూడా అనాదినుంచి చెబుతున్నవే. నవ్వురావడం లేదు. పైగా క్రొత్తగాచేసేప్రయత్నం - అక్షరాలు అర్థంకాకుండా మాట్లాడే ఓ సినిమా హాస్యనటుణ్ణి అనుకరిస్తూ మాటలుతెలియకుండా కంగారు కంగారుగా పలకడం అసలుకే ఎసరుపెడుతోంది.

ఇతరలోపాలు :- "బొబ్బిలియుద్ధం"లో బొబ్బిలిరాజులు వన్యమృగవేటలో ఉత్సాహంతో పందిని కొట్టినప్పుడు ఉత్సాహవంతంగా కథకుడు పాడే రగడకు వంత "నారాయణా'' అనడం అర్థవంతంకాదు. కథ ఉత్సాహపూరితం, వంత విషాదభరితంకావడం అంగిరసానికి ఆఘాతం కలిగిస్తుంది. అలాంటిదే మరొకవంత "రామరామ శ్రీ రామారామ రామారఘురామా" అనేదికూడా PATHOS ని సృష్టిస్తోంది. ఉత్సాహంలో యిదికూడ వాడడం సరికాదు. అలాగే వీరుడైన కథానాయకుడు చచ్చిపోయినప్పుడు "భళిభళి" అనేవంతకూడా సముచితంకాదు. ట్యూన్ శోకరసానికి సంబంధించినదైనా శబ్దార్థం దానికివ్యతిరేకం.

అలాగే నృత్యంఎక్కువకావడం కథనుదెబ్బతీస్తోంది. వాచకం స్పీడ్ కావడంతో విషయం తెలియకుండాపోతోంది. తంబుర, అందెలు, ఢక్కీలు అలంకారప్రాయంగా ధరించడం అధర్మం. అవి వాడాలి. తంబుర మీటుతూ తాళానుగుణంగా అందెకొడుతూ, ఢక్కీలు రసానుగుణంగా వరుసలు మారుస్తూ వాయిస్తే ఆనాదాలలోకలిసినపాట కర్ణరసాయనంగా ఉంటుంది.

ఆహార్యందగ్గరకొస్తే వ్యాఖ్యాత పాగాలేకుండా జానపద రాకుమారుడిలారావడం టీము "సిమెట్రీ"ని పాడుచేస్తోంది. అసలు దళమందరూ (మగాళ్ళయితే) పాగాలుచుట్టి, నడుముచుట్టూ గుడ్డకట్టిచెప్పడమే సంప్రదాయం. కథకుడితలకు తురాయిపెట్టుకోవడం నాటకంలో ఏదోరాజువేషంలా కనిపింపజేస్తుంది అసహజంగా.

నృత్యం అస్తమానూఒకేలాచెయ్యడం, నడకలలో వైవిధ్యం లేకపోవడం, కదలికలు అతికావడం, చూసిన భంగిమనే మరలమరల చూపడం

చూపరులకు విసుగుకల్గిస్తున్నాయి. విలన్ చచ్చిపోతే విషాదమెందుకు ? సాఫీగా చెప్పవచ్చుగా : సినిమాపద్ధతులు సౌకర్యంకాదు – సంప్రదాయమూ కాదు. పైగా ఆ బాణీలు ఎక్కువకాలం నిలిచేవికావు. జానపదబాణీలు శాశ్వతమైనవి. పల్లెజనాన్ని పులకరింపజేసేవీను. వెన్నెలపాటలు, తుమ్మెద పదాలు వగైరా చొప్పిస్తే కథకు జాతీయతవస్తుంది. వీరరసపోషణలోనూ, కరుణరసపోషణలోనూ మనుషుల్ని కదలింపచేస్తున్న యీ కళాకారులు యీ స్వల్పలోపాలనుకూడా సరిదిద్దుకుని ఈ క్రిందిఅంశాలపై దృష్టిపెట్టి సాధనచేస్తే బుర్రకథాకళారంగానికి కొత్తఊపిరి రాగలదు.

అవి 1) కథాకథనం శిల్పం 2) వాచకం 3) ఆహార్యం 4) ఆంగికం 5, సాత్వికం 6) రసపోషణ 7) సంగీతం 8) నృత్యం 9) అభినయం 10) పనిముట్లవినియోగం 11) రగడపట్టు 12) కాలనియమపాలన 13) టీమ్‌వర్కు 14) నాట్యం 15) జనరంజకత్వం.

రచయితలు ముడిచిన తమకలాలలోని సిరా మళ్ళీ బుర్రకథలమీద చిందిస్తే యీరంగంపునరుజ్జీవనంతో తప్పకవిజృంభిస్తుందనేది నిస్సందేహం.

## గోదావరిసీమలో బుర్రకథ దళాలు

ఈసీమలో బుర్రకథ ప్రదర్శనజరగని గ్రామంలేదంటే అతిశయోక్తి కాదు. ఉత్సవాలకారణంగానో, ఎన్నికలకారణంగానో, వివాహాల సందర్భాల లోనో గత 50 ఏళ్ళలో యివి చాలాముమ్మరంగాసాగేవి. బుర్రకథ దళాలు కూడా దేశంలో ఈ సీమలోనే ఎక్కువగా ఉద్భవించాయి. వీనిలో నాజర్ బాణీలో నృత్యం, అభినయం, వేషం, 2 ఢక్కీలు, తంబుర, అందెలతో కథచెప్పేదళాలుకొన్ని, నామమాత్రంగా తంబుర, ఢక్కీలు ధరించి హార్మోనియం, వైలిన్, తబలాలతో (నృత్యాభినయాలు లేశమాత్రంగా) హరికథ బాణీలో కథచెప్పేదళాలుకొన్ని, పౌరాణికనాటకంలా రంగస్థలపద్యాలతో కథచెప్పేదళాలుకొన్ని.

1. భానుమూర్తి బుర్రకథదళం :–

మండపేట. నాజర్‌బాణీలోకథ. సుంకర, వాసిరెడ్డి వ్రాసిన 'కష్టజీవి' కథ వీరుచెబుతుంటే ప్రేక్షకులరక్తం వేడెక్కిపోయేది. తూర్పుగోదావరి జిల్లాలో 20వ శతాబ్ది పూర్వార్ధంలో వీరిప్రదర్శనలు సంచలనాత్మకమేగాక

కళాత్మకములుకూడా. ఆబాలగోపాలం ఆద్యంతం ఉత్సుకతతో వినేవారు. వ్యాఖ్యాత వేషంఏమీలేకుండా మామూలుగానే ఉండేవాడు. ఈ వంతను రాజకీయం అనేవారు. హాస్యగాడుమాత్రం కూచిపూడి భామాకలాపంలో సట్టువాంగం(బ్రాహ్మణుని)లా వేషంధరించేవాడు. కథకుడు జానపద సినిమాలలో సైనికవేషంలా (ఇంచుమించు జంగంకథలో కథకునిలా) పాగా, మెడలో పూసలు, మోకాళ్ళదిగువవరకూ గౌను, సురవా. చెవులకు రింగులు, కాళ్ళకు గజ్జెలతో లయానుగుణంగా నృత్యం, భావాభినయం, హృద్యంగాచేసేవాడు. ఈ కథకుడు భానుమూర్తి. రాజకీయం పెదపాటి వెంకటరావు. వీరు కమ్యూనిష్టుపరంగా కథలుచెబుతున్నా జనం అది రాజకీయకథగా భావించేవారు కాదు. అంతకళాత్మకంగాఉండేది.

2. పేపకాయల వెంకటరావు బుర్రకథదళం :-

కాకినాడ. భానుమూర్తిదళంలాగే జనాన్ని ఉర్రూతలూగిస్తూ కథ రసావేశపూరితంగాచెప్పేవాడు. వీరు అల్లూరిసీతారామరాజుకథ చెప్పేవారు. కథకునితో సమఉజ్జీలుగా వంతలునడిచిన దళమిది. హాస్యగాడు చెప్పే ముస్లిమ్ తహశీలుదారుగారి 'అచ్ఛా' కథకు ప్రేక్షకులు పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వుకొనేవారు. ఇందులో శ్రీ బళ్ళ మృత్యుంజయరావు వ్యాఖ్యానం. శ్రీ చెక్కా సూర్యనారాయణ హాస్యం.

3. నిడదవోలు అచ్యుతరామయ్య బుర్రకథదళం :-

రాజమండ్రి. రచయిత. మంచి హార్మోనిష్టుకూడా. పద్మవ్యూహం, మహారథికర్ణ, సుభాష్‌చంద్రబోస్ కథలు విరివిగాచెప్పేవారు. వీరికి తంబుర భుజంమీద నామమాత్రమే. ప్రక్కన హార్మోనియం, తబలా, వయొలిన్ వగైరా ఉపాంగాలు. మొత్తం కథలో 5, 6 సార్లు అడుగులు ముందుకూ వెనక్కూ వేయడం తప్పితే నృత్యంలేనట్లే. అభినయం అంతంతమాత్రం. వేషధారణలో పాగా, పాగామీదతురాయిఉండేవి. రంగులూ రింగులూ లేవు. సురవా, సేనాని గౌనులాంటివి మామూలే. వ్యాఖ్యాతపాత్ర వంతపాడడమే తప్ప వ్యాఖ్యానంకూడా కథకుడేచెప్పడం - హాస్యగానికి మాత్రం కొంత అవకాశం ఉండేది. వీరి వ్యాఖ్యాత వీరి సోదరులే. హాస్యం ప్రఖ్యాత సినీ హాస్యనటుడు రాజబాబు. కథలో వరుసలు ఎక్కువగా శాస్త్రీయ సంగీత

మయం. జానపదాలులేనట్టే. దాదాపు హరికథవాణికే. వీరి పద్మ వ్యూహం కథ వినితీరవలసిందే. ఈ కథలో సామాన్యప్రజలకుతెలియని ఎన్నో పురాణగాథలుచెబుతుంటే ఎంతోస్పష్టంగా సోరావలించివినేవారు. వీరికి గాత్రం ఒకవరం. యావత్భారతదేశంలో 26 సంవత్సరాలు కథలు చెప్పి అఖండకీర్తి నార్జించారు.

4. సుంకర కృష్ణమాధవరావు దళం :-

వీరిది జి. మేడపాడు. (తూ. గో.) వీరికథ సంగీతపరంగాఉండేది. నట్టువాంగంఅంతా అచ్యుతరామయ్యగారిలాగే. అనేకచోట్ల బిరుదులందు కున్నారు. వీరి గానమాధుర్యమే ప్రేక్షకుల్ని కదలకుండాచేసేది. భగవద్గీత మొదలగుకథలు చెప్పేవారు. పద్యాలు రంగస్థలిలో పాడినట్లు పాడడం వీరి కథలోని ప్రత్యేకత.

5. జూనియర్ నాజర్ దళం :-

రామచంద్రపురం. మంచిస్ఫురద్రూపి. నృత్యాభినయాలు చాలా సహజంగావుండేవి. ఆపైన అపాతమధురమైన మధురమంజులగానం. సీని యర్నాజర్పద్ధతిని పూర్తిగా పుణికిపుచ్చుకున్న కళావేత్త. పల్నాటియుద్ధం, బొబ్బిలియుద్ధం కథలు రాష్ట్రరాష్ట్రేతరాలలో వేలమీదచెప్పి ఎన్నోసన్మా నాలు పొందారు. వీరికి హాస్యం ప్రాంతీయంగా హాస్య మణిపూసగాపేరు గాంచిన శ్రీ కట్టా వీరయ్య. ప్రేక్షకులపొట్టలు చెక్కలయ్యేటట్టు నవ్వించే వారు. వీరు ఎంతోమంది శిష్యుల్ని తయారుచేశారు.

6. నిట్టలా బ్రదర్స్ :-

వీరిది కోనసీమలో తానేలంక. ముగ్గురూసహోదరులు. వీరిది నాజర్ మూసలోకథ. ఇందులో వ్యాఖ్యాతరత్నప్రద్యుమ్నరావుగారిపాత్ర ఎక్కువ. కథ కుడు పాటలవరకేపరిమితం. హాస్యపాత్రకూడా ఎక్కువసమయాన్నే తీసు కుంటుంది. కథలో ఎలాగోలాగ సందర్భం కలిగించుకుని భారతదేశానికి స్వతంత్రం వచ్చిననాటినుంచీ నిత్యావసరవస్తువులధరలు ఎలాఆకాశానికి అంటుతున్నాయో వగైరా సామాజికరుగ్మతలు వ్యంగ్యంగా "అగష్టు పదిహేను నందాన అదిఎంతో సుదినమ్ము నందాన" అను పల్లవితో విమర్శనాత్మకంగా ప్రజల్ని కవ్వించి నవ్వించడంలో యితని ప్రత్యేకత అసామాన్యం. ఈ పాటకోసమే వీరికథ మరల మరల పెడు

తుండడంకూడా జరుగుతుండేది. వీరుభారతదేశంలో అనేకరాష్ట్రాలలో కథలు చెప్పి సెహభాష్ అనిపించుకున్నారు. పల్నాటియుద్ధం వీరి పేటెంటు కథ.

7. డిండి బ్రదర్స్ :-

ధవళేశ్వరం వీరుముగ్గురూ ఏకోదరులే వీరిదికూడా నాజర్ బాణీయే. ఈమధ్యకాలంలో వ్యాఖ్యానానికి ఒకమహిళకు తర్ఫీదుయిచ్చి ఆమెతో కథలు చెబుతున్నారు. కథకులు శ్రీ డిండి సత్యనారాయణ. హాస్యం శ్రీ దిండి లక్ష్మీ నారాయణ. వీరికథలో హాస్యగాని ప్రాముఖ్యం ఎక్కువ. సినిమా పాటలతో తన ప్రేమపురాణాన్ని చెప్పేహాస్యకథ బాగా అలరిస్తుంది. పల్నాటియుద్ధం, బొబ్బిలియుద్ధం, వీరాభిమన్య వీరువిరివిగా చెప్పే కథలు. ఈ గ్రంథకర్త కథకుడుగా పై సోదరులిద్దరూ వంతలుగా పార్వతీకళ్యాణం బుర్రకథ రాజమండ్రి త్యాగరాజనారాయణదాస సేవాసమితివారి ఉత్సవాలలోనూ, శ్రీ వెంకటేశ్వరాఆనంకళాకేంద్రంలోనూ, సత్యసాయి నవభారతగురుకులంలోనూ ఆకాశవాణి విశాఖపట్నం కేంద్రంలోనూచెప్పి పలుప్రశంశలుపొందడం జరిగింది.

8. మర్ల భద్రకాళి దళం :-

తాపేశ్వరం. (తూ. గో.) ప్రస్తుతం జనరంజకంగాపాడడంలోనూ. కథచెప్పడంలోనూ ఈమెకున్న ప్రసిద్ధిహెచ్చు. రేడియోలో యీమెకథంటే జనం చెవికోసుకుంటారు. బాణీలుఅన్నీ నాజర్ బాణీలే. పల్నాటియుద్ధం లాంటికథలేగాకుండా ప్రభుత్వప్రచారకథలు, కుటుంబ నియంత్రణ వగైరాలపై చెప్పేకథలుకూడా ఎంతోఉత్తేజకరంగా చెప్పడం యీ దళంవిశేషం.

9. మణి సిష్టర్స్ దళం :-

ముమ్మిడివరం (కోనసీమ). వీరుముగ్గురూస్త్రీలే. నిట్లాబ్రదర్స్‌వారి కథకు మక్కీకిమక్కీ అనుకరణ. కథ రక్తిగాచెప్పడం, శ్రావ్యంగా పాడడం, చక్కని నృత్యాభినయాలు వీరివిశిష్టత. వీరి వీరాభిమన్య పలువురి మన్ననలందిన రసగుళిక.

10. బాబూరావుమాష్టారి దళం :-

రామచంద్రపురం వీరిది అంతా జూనియర్ నాజర్ బాణీయే. నాజర్ చెప్పేకథలతోపాటు సీతారామకళ్యాణం, వీరాభిమన్య, మనుషులుమారాలి,

వెలుగుబాట, బాలఏసు, కరుణామయుడు, ఝాన్సీరాణి, ఎఱ్ఱబాట కథలు చెబుతారు. ఉత్సాహవంతమైన యువదళం. అనేకచోట్ల బెంగాల్, బీహార్, ఒరిస్సా, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, కర్నాటక తమిళనాడు రాష్ట్రాలలో ఎన్నో కథలుచెప్పి ప్రఖ్యాతిపొందారు. పెద్దపెద్ద పండితులచేత ఘన సన్మానాలుపొందారు. వీరికిహాస్యం జుత్తుక సూరిబాబు బి. ఏ. వ్యాఖ్యానం నవీన్‌కుమార్ బి. ఏ. బి. యిడి. సిలోన్ రేడియో కథకులు. బాబూరావు మాష్టారు బుర్రకథాసమ్రాట్, బుర్రకథ సార్వభౌమ బిరుదులుపొంది నాజర్ గారిచే సింహతలాటంవేయించుకుని "బుర్రకథారత్నగా" బిరుదు ప్రదానం పొందారు.

11. ప్రజానాట్యమండలి :-

జంగారెడ్డిగూడెం. (ప. గో.) ఇదికూడా నాజర్ అడుగుజాడలలో పయనించే బృందమే. వీరి గ్రామరాజకీయాలు యితివృత్తంగా చెప్పే "మనవూరికథ" ప్రత్యేకతగన్నది. ఈదళంలో వ్యాఖ్యానంచేసే పూసల రజనీ గంగాధర్ రచయితకూడా. శ్రీ మారం సోమరాజు కథకులు. షేక్‌సుభాన్ హాస్యం. రజని గంగాధరంగారు దానవీరశూరకర్ణ, విరాట పర్వం, సీతా కళ్యాణం వగైరా బుర్రకథలు రచించడమేగాక అనేక దళాలకు తర్ఫీదు యిస్తున్నారు. నాటకాలు, నాటికలు, ఏకపాత్రలు ఎన్నోవ్రాశారు. కొంత కాలం "సమాచారప్రభ" వారపత్రిక ఎడిటర్‌గా నడిపారు.

12. ప్రసాద్ పార్టీ :-

పెద్దాపురం. వీరు రాజమండ్రి బుర్రకథాపరిషత్‌పోటీలలో లెనిన్ కథచెప్పి కథావైవిధ్యంచూపించారు. దేశంలో అనేకచోట్ల కథలు చెప్పేరు.

13. దుర్గాభవానీ బృందం :-

పెద్దాపురం. ఈ బృందంలోకథకురాలు మహిళ. వంతలు పురుషులు నాజర్‌బాణీలే - సీతారామరాజు వగైరాకథలు దేశంలో అనేకచోట్ల చెప్పారు.

14. పాల్ మాష్టారు బృందం :-

రాజమండ్రి. వీరుకూడా నాజర్‌మూసలోనే చెబుతారు. బొబ్బిలి యుద్ధం వీరు ఎరివిగా చెప్పేకథ.

15. కృష్ణాబృందం :-

రామచంద్రపురం. వీరిదీ నాజర్ అనుకరణే. ఇందు వ్యాఖ్యాత తన వాక్ప్రవాహంతో ప్రేక్షకుల్ని మంత్రముగ్ధుల్ని చేస్తాడు. నాజర్ కథలేకాకుండా "ఊరుమారింది"వంటి క్రొత్తకథలనుకూడాచెప్పి జనంలో జాగృతి కలిగించ డానికి కృషిచేస్తున్న యువకథకులదళం. కథకులు గొల్లపల్ల కృష్ణ. వ్యాఖ్యానం గొల్లపల్ల రామం. హాస్యం చెక్కా. టి. వి. ఆర్టిస్టులు. ప్రజానాట్య మండలి పోటీలలో గొల్లపల్లరాము ఉత్తమవ్యాఖ్యాత ప్రయిజుపొందారు. ఈ దళం ద్వితీయ ఉత్తమ ప్రదర్శన బహుమతి పొందింది. మద్రాసు, బెంగు ళూరు, కలకత్తా, బొంబాయి మొదలగుచోట్ల ప్రదర్శనలిచ్చి దేశవ్యాప్తంగా పేరుపొందారు. గొల్లపల్ల కృష్ణకు 'యక్షగానకేసరి' గొల్లపల్ల రామంకు "కథా వచనసుధానిధి" అని బిరుదులిచ్చి ప్రజలు పలుచోట్ల సన్మానించారు.

16. రమణ పార్టీ :-

రాజమండ్రి. వీరు ప్రసిద్ధిగాచెప్పే కథ కర్ణ. రాజమండ్రి పోటీలలో కూడా పాల్గొన్నదళం.

17. సబ్బికనకారావు దళం :-

లక్కవరం. (ప. గో.) కథకులు సబ్బి కనకారావు. హాస్యం రొతు వెంకటేశ్వరరావు. వ్యాఖ్యాత రామారావు. వీరు బొబ్బిలియుద్ధం, సీతారామ రాజు, కూలిచండి కథలు అద్భుతంగా చెబుతారు. వీరు రాజమండ్రి పరిష త్‌లో "శ్రమజీవులు" కథచెప్పి మొదటిబహుమతిపొందారు. కథాసంవిధానం, నడకలు, బాణీలు, వేషం, అభినయం కథకునిలో నిండుగా ఉన్నదళం యిది. కథకుడే యీదళానికి కథానాయకుడు. చక్కనిగొంతు. రసోత్పత్తితో ప్రేక్షకుల్ని ఉద్రేకితలూగించే కథకుడు.

18. పెంటయ్య దళం :-

లింగంబోయినపల్లి. (ప. గో.) కొలిశెట్టి పెంటయ్యగారు కథకులు. వీరు రచయితకూడా. ఆంధ్రదేశంలోనేగాక యితరరాష్ట్రాలలోకూడా కథలు

చెప్పి పేరుగడించారు. వీరిదళంలో హాస్యం నారిపల్లి మాణిక్యాలరావు. వ్యాఖ్యాత చంద్రు సూర్యనారాయణ. వీరికథలు కష్టజీవి, అల్లూరి సీతారామ రాజు, మహారధికర్ణ, వీరాభిమన్య, రుక్మిణీ కళ్యాణం.

19. పార్థసారధి దళం :_

గొల్లలమామిడాడ (తూ॥గో॥). వీరు భగవద్గీతకథ దేశంలో పలు చోట్లచెప్పి ప్రఖ్యాతిగన్నారు. సుప్రశిద్ధరంగస్థల హాస్యనటుడు గోపి ఇందులో హాస్యంచెబుతూ జనాన్ని బాగా ఆకట్టుకునేవారు.

20. రేలంగి సూర్యం పార్టీ :_

అమలాపురం. వీరు సుమారు 200 వరకూ కథలు చెప్పేరు. రేడియోలో కూడా వీరికథలొచ్చాయి.

21. అప్పారావు దళం :_

మంచిలి (ప॥ గో॥). వంతలు మాస్టేరు బేబి, అత్తిలిపాప. కష్టజీవి, వీరాభిమన్య, మహారధి కర్ణ వీరు చెప్పేకథలు.

22. పండు దళం :_

ముమ్మిడివరం. వీరి పేరు పండితారాధ్యుల సత్యనారాయణగారు. రచయిత. వీరుకొన్ని కథలలో కథకులుగాను, కొన్నిటిలో వ్యాఖ్యాతగాను, కొన్నిటిలో హాస్యగానిగానూకూడా పోషించారు. ఆంధ్రా, తమిళనాడు, బీహారు, ఒరిస్సా, మహారాష్ట్ర, కర్నాటకలలో కథలు చెప్పి మెప్పించారు. బొబ్బిలియుద్ధం, పల్నాటిభారతం, సీతాకళ్యాణం, కర్ణ, అభిమన్య సీతా రామరాజు, చంద్రహాస నర్తనశాల కథలు చెబుతున్నారు. వీరికి 'ఛక్కీ కింగ్', 'హాస్యశ్రీ', 'బుర్రకథ నాట్యకళా ప్రవీణ' బిరుదులిచ్చి ప్రజలు సత్కరించారు. గుంటూరు నాజర్‌గారి కథలో హాస్యం చెప్పేరు.

23. మండ సుబ్బిరెడ్డి దళం :_

మాచవరం (తూ. గో.). శ్రీ సుబ్బిరెడ్డి కథకులు. శ్రీ అమ్మిరెడ్డి వ్యాఖ్యాత, శ్రీ కట్టా వీరయ్య హాస్యం. వీరు సీతారామరాజు, కష్టజీవి మొదలగు కథలతో జనాన్ని ఉర్రూతలూగించేవారు. కమ్యూనిస్టుపార్టీ తమకథలద్వారా నిధులురాబట్టేవారు. వీరు ముగ్గురూ ఆత్రేయ రచించిన 'కప్పలు' నాటకంలో గొప్పగా నటించేవారు.

24. సన్యాసి రెడ్డి దళం :_

నాగులాపల్లి. (తూ. గో.) వీరు కృష్ణరాయబారం కథకు ప్రసిద్ధి. తిరుపతి వెంకటకవుల రాయబారంసీసపద్యాలు. కర్ణసంవాదంపద్యాలు రంగస్థలిలాపాడేసి జనంచేత ఓహో అనిపించుకొనేవారు. హాస్యగానికి చిలకలు, పిలకలు (ప్లాస్టిక్‌వి) అలంకరించేవారు.

25. సత్తిఆదిరెడ్డి దళం :_

కొంకుదురు. (తూ. గో.) శ్రీ సత్తిఆదిరెడ్డి కథకులు. శ్రీ కడియం సింహాచలం, శ్రీకోరుకొండ కృష్ణమూర్తి వంతలు. వీరు జూనియర్ నాజర్ శిష్యులు. పల్నాటియుద్ధం, బొబ్బిలియుద్ధం కథలు అతని అనుగుణాచర్లో చెప్పేవారు.

26. సాహిత్యకళాసమితి :_

కొంకుదురు. (తూ. గో.) ఈ గ్రంథరచయిత కథకుడుగా, శ్రీ కె. తలుపులరావు వ్యాఖ్యాతగా, శ్రీసత్తివిశ్వనాథరెడ్డి హాస్యంతో రాజమండ్రి, సోమేశ్వరం, వెదురుపాక,కొంకుదురు, రాయవరం, కొప్పవరం వగైరాచోట్ల ఉత్సవాలకు పార్వతీకళ్యాణం, భారతి కథలుచెప్పడంజరిగింది. "సంజీవరెడ్డి" బుర్రకథ యీ రచయిత స్వయంగావ్రాసి వారి ముందు ప్రదర్శించినప్పుడు ఆనందాన్నిపట్టలేక అల్లూరి సత్యనారాయణ రాజుగారు యీ గొంతులో పాపికొండలలోని గోదావరి గలగలారావం వినిపిస్తోందని శ్లాఘించారు. అలాగే 'శ్రీ కళా వెంకట్రావు' కథవ్రాసి రాయవరంలో వారి సమక్షంలో చెప్పినప్పుడు వారు పొందినఆనందం అద్వితీయం.

27. శేషారత్నం పార్టీ :_

కొంకుదురు. (తూ. గో.) ఇది బాలికలదళం. కుమారి గాదేపల్లి శేషారత్నం కథకురాలుగా, కుమారి గాదేపల్లి సర్వలక్ష్మి హాస్యం, కుమారి పడాల ఆదిలక్ష్మి వ్యాఖ్యానంతో సుభాష్‌చంద్రబోస్‌కథ చాలా ముచ్చటగా చెప్పేవారు. కొంకుదురు, రాయవరం, కాకినాడ, కొప్పవరం, పసలపూడి మొదలగుచోట్లచెప్పి ఎన్నో వెండికప్పులు బహుమతిపొందారు.

28. పంతం త్యాగరాజు & పార్టీ :-

ఛట్లమగుటూరు. (ప. గో.) త్యాగరాజు మంచి కథకుడు, గాయకుడు. గానంతో కథరక్తి కట్టించేవారు. వ్యాఖ్యాత శ్రీ అల్లంపల్లి సోమేశ్వరరావు. వీరిది రాజకీయోపన్యాసంలాగుండేది. శ్రీ జోస్యుల రామం హాస్యం. వీరికి 'వికటకవి' అని బిరుదు.

29. దాసరికృష్ణ బుర్రకథ దళం :-

భీమవరం. కథకుడు శ్రీ దాసరి కృష్ణ. వ్యాఖ్యాత శ్రీ దాసరి వెంకన్నబాబు. హాస్యం శ్రీ దాసరి శాయిబాబు. వీరు ముగ్గురూ సోదరులే. నాజర్ ప్రశంసలనందుకున్న దళం.

30. రత్నం బుర్రకథ దళం :-

తణుకు. కథకురాలు శ్రీమతిరత్నం. వ్యాఖ్యానం శ్రీడి.నాగేశ్వరరావు, హాస్యం శ్రీ వి. నాగేశ్వరరావు హార్మోనీ, డోలక్ వీరికి సహకారులు, సీతా కళ్యాణం, చంద్రహాస, వీరాభిమన్యకథలు బాగాచెబుతారు.

31. డి. వెంకట్రావు బుర్రకథ దళం :-

భీమవరం. కథ శ్రీ వెంకట్రావు. మంచిగాయకుడు. హాస్యం శ్రీ దాసరి నరసింహమూర్తి. వ్యాఖ్యానం శ్రీ లింగమూర్తి. పల్నాటియుద్ధం, బొబ్బిలియుద్ధం వీరికథలు.

32. సింహాచలం బుర్రకథ దళం :-

భీమవరం. రచయిత, కథకులు శ్రీ సింహాచలం, హాస్యం శ్రీ వెంకట్రాజు, - వ్యాఖ్యానం శ్రీ చల్లారావు. ఆంధ్రకేసరిబుర్రకథ, అమరజీవి బుర్రకథ ఆంధ్రదేశమంతటా చెప్పేరు. ఆదిలో సింహాచలంగారు 'కన్యక' జముకులకథచెప్పేవారు. ఎంతోమందికి బుర్రకథల్లో తర్ఫీదుయిచ్చారు.

33. కొమరశ్రీ బుర్రకథ దళం :-

కాకినాడ. కొమరశ్రీ అసలుపేరు శ్రీ కె. అప్పారావు. వీరు కథకులు. నాజర్‌బాణీ, హాస్యం శ్రీ కాశీరాం, వ్యాఖ్యానం శ్రీ కె. కోదండరావు బొబ్బిలియుద్ధం, పల్నాటియుద్ధం, ఖడ్గతిక్కన, అల్లూరి సీతారామరాజు వంటి కథలు దేశంలో వేలాదిచెప్పారు. శ్రీ నాజర్‌చే సింహతలాటం తొడి

గించుకున్నారు. విశాఖలో మకాంపెట్టి కుటుంబనియంత్రణ ప్రచారానికి 'సుఖజీవనం', 'పదండి ముందుకు' మత్స్యకారులప్రగతి మొదలైన కథలు తానేవ్రాసి ప్రభుత్వపరంగా ప్రచారం చేస్తున్నారు.

34. శ్రీ వాణీగిరిజా బుర్రకథ దళం :-

పిఠాపురం. (తూ. గో.) కథకులు శ్రీ కె. కనకరాజు. వ్యాఖ్యానం శ్రీమతి దమయంతి - హాస్యం శ్రీ కె. గంగరాజు. వీరు వీరాభిమన్య, బొబ్బిలియుద్ధం కథలు ప్రసిద్ధిగాచెబుతారు. నిడదవోలు అచ్యుత రామయ్య గారిబాణీ. కర్నాటక, మధ్యప్రదేశ్‌లలోకూడా కథలుచెప్పేరు. సుమారు వేయి ప్రదర్శనలుచేసిన దళం. శ్రీ కనకరాజు, శ్రీమతి దమయంతి రంగస్థలనటులుకూడా - రేడియో ఆర్టిస్టులు.

35. పరాంకుశం రామానుజులు బుర్రకథ దళం :-

పిఠాపురం. (తూ. గో.) కథ రామానుజులుగారు వ్యాఖ్యానం సుబ్బలక్ష్మిగారు. కృష్ణరాయబారం, బొబ్బిలియుద్ధం, నర్తనశాల కథలకు ప్రసిద్ధి. వీరిదికూడా అచ్యుతరామయ్యగారి పద్ధతే.

36. జాతీయ బుర్రకథ దళం :-

పెద్దాపురం. (తూ. గో.) కథకురాలు శ్రీమతి సత్యవతి. వ్యాఖ్యాత శ్రీ బ్రహ్మానందం, హాస్యం రాజ్యలక్ష్మి. కర్ణ, అభిమన్య, మణిమంజరి, మాధవివిజయం వీరి పేటెంటుకథలు. నాజర్‌బాణీ. బెంగాల్, బీహార్, ఒరిస్సా, కర్నాటక రాష్ట్రాలలోకూడా కథలుచెప్పేరు. రేడియోకథకులు. బ్రహ్మానందంగారు రచయితకూడా. పరశురామ్, జయప్రద, మణిమంజరి కథలు వ్రాశారు. వీరు అభిమన్యకథలో అంతర్భాగంగా బర్బరీకుడు కథ చెబుతుంటే చాలావిచిత్రభావన కలుగుతుంది. ఘటోత్కచుని కుమారుడు బర్బరీకుడు. భారతయుద్ధం ప్రారంభానికిముందు పాండవులకు అండగా యుద్ధానికిబయలుదేరి వస్తున్నాడట. దారిలో కృష్ణుడు మారువేషంలో ఎదురొచ్చి ఎక్కడికివెళుతున్నావంటే విషయం చెప్పేడట. మరిబాణాలు మూడే పట్టుకెళుతున్నావేమిటంటే ఈ మూడుబాణాలూ ఒకటి కర్ణుడుకోసం, రెండవది యావత్ కురు సైన్యంకోసం అన్నాడట - మరి మూడవదోఅంటే అసలీ భారతయుద్ధానికి కారకుడైన కృష్ణుడికోసం అన్నాడట- దానితో కృష్ణుడదిరిపోయి ధర్మరాజుదగ్గరకొచ్చి భారతయుద్ధప్రారంభానికి ఒక

యోధుని బలియివ్వాలనిచెప్పి యీతనిని బలివేయించాడట. ఈ కథ చెబు తుంటే భారతయుద్ధాన్నిగూర్చి అందరూ పునరాలోచనచేస్తారు. ఈయనకు "హాస్యకళానిధి" అని పెనుగొండలో బిరుదునిచ్చి గౌరవించారు. పెద్దా పురంలో సింహతలాటం వేశారు.

37. రాఘవ బుర్రకథ దళం :—

పెద్దాపురం. వ్యాఖ్యానం పోతాబత్తుల సత్యనారాయణ. కథ శ్రీమతి లక్ష్మీకుమారి. హాస్యం పోతాబత్తుల లక్ష్మీనారాయణ. లక్ష్మీకుమారి సత్య నారాయణగారి భార్య. లక్ష్మీనారాయణ సత్యనారాయణగారి తమ్ముడు. వీరు భారతదేశంలో అనేకపట్టణాలలో కథలుచెప్పేరు. తాళ్ళరేవులో సువర్ణ హస్త ఘంటాకంకణం సన్మానంపొందారు. అనేకచోట్ల సువర్ణ రజితవస్తుబహూకర ణలుపొందారు. పెద్దాపురంలో సువర్ణగిరి పట్టాభిషేకంపొందారు. వీరుచెప్పేవి ఝాన్సీలక్ష్మీబాయి, బొబ్బిలియుద్ధం, పల్నాటియుద్ధం, దక్షయజ్ఞం కథలు.

38. సరస్వతీ బుర్రకథ దళం :—

పెద్దాపురం. కథకురాలు శ్రీమతి కె. మణికుమారి. వ్యాఖ్యానం శ్రీ కె. బండేశ్వరరావు, హాస్యం శ్రీ యం. రాము. నర్తనశాల, వీరాభిమన్యు, బొబ్బిలియుద్ధం, అంబేద్కర్ వగైరా కథలు. వీరు రేడియో కథకులు, ఆంధ్రదేశంలోనేగాక అనేక యితరరాష్ట్రాలలోకూడా కథలుచెప్పి సన్మానాలు పొందారు. వీరికి శ్రీ ఆనం లక్ష్మణరావుగారు సింహతలాటం బహూకరించారు.

39. దుర్గాభవాని దళం :—

పెద్దాపురం. కథకురాలు శ్రీమతి కె. లక్ష్మి, వ్యాఖ్యానం శ్రీ గోరు వీర్రాజు, హాస్యం శ్రీ కె. సూరిబాబు. బొబ్బిలియుద్ధం, సీతారామరాజు, కర్ణ, రాజహంస, జవహర్‌లాల్ వీరుచెప్పేకథలు. జిల్లాస్థాయిలో రాజోలు తాలూకా అరవపాలెం పరిషత్‌లో ప్రథమబహుమతిపొందారు. కొత్తపేటలో కె. సూరిబాబుకు సింహతలాటం బహూకరించారు. రేడియో కథకులు. ఇతర రాష్ట్రాలలోకూడా కథలుచెప్పి మెప్పులుపొందారు.

40. నాగమణి దళం :—

పెద్దాపురం. కథకురాలు శ్రీమతి జంధ్యాల నాగమణి. వ్యాఖ్యానం శ్రీ ఈగల అప్పారావు. హాస్యం శ్రీ గోపాలం. బొబ్బిలియుద్ధం, సీతా కళ్యాణం పేటెంటుకథలు. కథకురాలిమధురగాత్రం యీదళానికి వరం.

41. సూర్యకుమారి దళం :—

పెద్దాపురం. కథ శ్రీమతి పి. సూర్యకుమారి. వ్యాఖ్యానం మొదట శ్రీ గోరి అమరేశ్వరరావు, తరువాత శ్రీ ఈగల అప్పారావు వగైరాలు. హాస్యం అల్లాడి రాము. వీరికథలు వీరబొబ్బిలి, సీతారామరాజు, మహారథి కర్ణ మొదలగునవి. కథకురాలి కమ్మనిగాత్రం ప్రేక్షకులకు ప్రత్యేకఆకర్షణ. ఆంధ్రాలోనేకాకుండా బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రాలలోకూడాచెప్పేరు. రేడియోకథకులు. సూర్యకుమారి చిల్లరకొట్టుచిట్టెమ్మ వేషానికి గొప్పప్రసిద్ధి.

42. కళాంజలి బుర్రకథ దళం :—

పెద్దాపురం. కథ శ్రీ జలగం మల్లిఖార్జునరావు. వ్యాఖ్యానం చందన రామమోహనరావు. హాస్యం శ్రీ మాపూరి చంద్రరావు. వీరాభిమన్య వీరి పేటెంటుకథ. ద్రాక్షారామలో శ్రీ చంద్రరావుగారి హాస్యానికి ప్రత్యేక బహుమతి యిచ్చేరు.

43. కోటేశ్వరరావు బుర్రకథ దళం :—

పెద్దాపురం. కథకులు శ్రీ చందన కోటేశ్వరరావు, వ్యాఖ్యానం శ్రీ కుంచుం భీమరాజు. హాస్యం శ్రీ దయింత్రి కనకలింగేశ్వరరావు. వీరాభిమన్య, కృష్ణరాయబారం, బొబ్బిలియుద్ధం, పల్నాటియుద్ధం సుబాష్‌చంద్ర బోస్ వగైరా కథలు చాలాచక్కగా చెప్పేవారు. నాజర్‌గారి బాణీ. సందర్భానుసారంగా కథలో కథకుడు జాతీయ గీతాలు పాడుతూ ప్రత్యేకతను ప్రదర్శించేవారు. వ్యాఖ్యాత గతాన్ని మేళవిస్తూ ప్రస్తుతాన్ని విమర్శిస్తూ గొప్ప వ్యాఖ్యాతగా పేరుపొందేరు. కనకలింగేశ్వరరావుగారి హాస్యం అదో ప్రత్యేక తరహా. చిన్నచిన్న బిట్టులతో కడుపుబ్బ నవ్వించేవారు. దానాలలో ఒకదానం చెప్పరా అంటే గర్భాదానం అని చెప్తూతూ ప్రజల్ని పకపకా నవ్వించేవాడు. సున్నితమైన రాజకీయ వ్యంగ్యం, సామాజికరుగ్మతలమీద

విసుర్లు, విమర్శలు ప్రజల్ని ఆలోచింపచేసేవి. భీమరాజు జాతీయ అంతర్జాతీయ రాజకీయాల పరామర్శ, కనకంహాస్యం జనంలో క్రొత్తచైతన్యాన్ని సృష్టించేవి. కోటేశ్వరరావుగారు తనకుటుంబాన్నంతటినీ కొడుకులూ, కూతుళ్ళనూకూడా యీకళలో ప్రవేశపెట్టిన కళాతపస్వి. విశాఖజిల్లా ఆనందపురంలో ఘంటాకంకణం, విశాఖలో మణికంఠహారం వేసి కోటేశ్వరరావుగారిని సన్మానించారు.

44. భారతి బుర్రకథ దళం :-

సామర్లకోట. కథకురాలు శ్రీమతి చినగంధం సత్యవతి. ఈమె పేరు భారతిగా మార్చుకుంది. వ్యాఖ్యానం శ్రీ తాడి మురళీమోహనరెడ్డి. హార్మోని తబలాలు నట్టువాంగం. ఆమెపాట, మురళీమోహనరెడ్డిమాట పీరికథకుబలం.

ఈ బుర్రకథలలో కళానైపుణ్యాన్ని ప్రోత్సహించుఉద్దేశంతో తూర్పుగోదావరిజిల్లా ప్రజానాట్యమండలి రాజమండ్రి శ్రీ వెంకటేశ్వరా ఆనంకళాకేంద్రంలో 1980 డిశంబరు 26, 27 తేదీలలో బుర్రకథ కళాపరిషత్ నిర్వహించింది. న్యాయనిర్ణేతలుగా యీగ్రంథరచయిత, సీనియర్ నాజర్, మంచ సుబ్బిరెడ్డి వ్యవహరించారు. ఇవిమాకాక మళ్ళీ యీ రంగం విజృంభిస్తుందనే విశ్వాసం కలిగింది. నాజర్‌గారికి పద్మశ్రీ యివ్వడం బుర్రకథకళనుకూడా ఒకగొప్పకళగాభారతప్రభుత్వంగుర్తించినదానికినిదర్శనం.

## యక్షగానాలు

యక్షగానాలమీద సమగ్రపరిశోధనజరిపి డా. యస్. వి. జోగారావుగారు యక్షగానాన్ని గురించి ఈక్రిందిరీతి తెలిపారు.

1. 'అది సర్వోపభోగ్యమైన సమాహార కళ'
2. 'వివిధప్రక్రియలనుబంధము (ప్రబంధము, కలాపము. ఉలాప్రబంధము, కొరవంజి, వీధినాటకము, మార్గనాటకము, బొమ్మలాట, జంగంకథ, హరికథ, ఆధునికనాటకము మొదలగు వివిధప్రయోజనాత్మకమై బయల్వెడలిన సాహిత్యప్రక్రియలతో దీనికి సంబంధంకలదు).
3. బహువిధ పదకవితాప్రభేద సమీకరణము
4. వస్తు వైవిధ్య సంపన్నము.

5. రస విషయిన విశిష్టము - హాస్యము ప్రధానము.
6. ఛందో వైవిధ్యసహితము (పదకవితలేకాక జాత్యుపజాతులును ప్రయుక్తములు).
7. భాషావైవిధ్య సంపన్నము.
8. లోకవృత్తి ప్రదర్శనము.
9. దేశినాటక కళా ప్రతినిధి.
10. విశిష్టతలో విశిష్టత తెలుగు ప్రత్యేకత యగుట."

సంస్కృతయక్షశబ్దానికి ప్రాకృతం ఎక్కలని, తెలుగుతద్భవం జక్కులని కొందరిమతం.

* "కామవల్లీ, మహాలక్ష్మి కైటభారి
వలపు పాడుచువచ్చె "జక్కుల"పురంధ్రి"-అన్నాడు శ్రీనాధుడు.

** "జక్కులపాట అనేపదానికి సంస్కృతీకరణే యక్షగానం" అన్నారు. శ్రీనివాసచక్రవర్తి తన యక్షగానవ్యాసంలో.

"యక్షగాన మొనరింతు వేషముల్ గట్టి, జనులు పాడివినిపింప పుణ్యసంపద ఘటింప" (చిత్రాంగద విలాసం)

'సౌభరి చరితంబు "జక్కుల" కథచెప్పె లాలిత నవరసాలంకృతమగు'
(నృసింహ పురాణం)

'నల పారిజాతపహరణంబు యక్షగానంబుచేసె .... పెంపుగా నీ ప్రబంధ' (విష్ణు పారిజాతం)

"కీర్తింతువెద్దానికీర్తి గాంధర్వంబన యక్షగాన సరళి"
(భీమ ఖండం)

తెలుగు సాహిత్యంలో ఈ యక్షగానశబ్దం ఇలా కనబడుతుంది. క్రీ. శ. 1580-1620 కాలమునాటి కందుకూరి రుద్రకవిచే రచించబడిన "సుగ్రీవవిజయం" ఈ యక్షగానాలలో మొదటికావ్యమని కొందరు పరిశీలకులు నిర్ధారించారు.

---

* క్రీడాభిరామం పు. 46
** నాట్యకళ. ఫిబ్రవరి - మార్చి 1970 పు. 5

## చోడిగాడి కలాపం

యక్షగాన ఆవిర్భావం మూలంలోకివెళితే మొదటగాకనిపించేది చోడి గాడికలాపం. దీనికికథ చెంచులక్ష్మీ నరసింహుల ప్రణయ, కలహగాథ. ఈ నృసింహుడు చోడిగాడు - అతడే సింగడు. చెంచులక్ష్మి సింగి. కథ నామమాత్రం. ఒకరోజు నిద్రలేచిన సింగడికి పక్కలో సింగి కనబడదు. అతడు ఆమెను వెదకడం, కనిపించకపోవడంతో విరహం, ఆమెచేష్టలుతలచు కొని విలపించడం, దేవతలందరికీమొక్కి తన సింగిని చూపమని వేడుకో వడం, చంద్రఉపాలంబనాదులు అయ్యాక సింగి వస్తుంది. సింగడికి ఎంతో సంబరమవుతుంది. కాని పరువుకోసం పౌరుషంతో సింగిని సాధించబోతాడు. కాని అదివిరసమై, వివాదమై కడకు అలకలుతీరి పొత్తులుకుదిరేసరికి తెల్ల వారుతుంది. ఇందులో కోపు, చిందు దశావతరనృత్యం, తాండవం ప్రయో గింపబడతాయి. తాళంవేసే వారిలోఒకడు వారిద్దరిమధ్య పారిపార్శ్వకుడిగా వ్యవహరిస్తాడు. ఇతడిపేరు కోణంగి. ఇతడు నాయకీ నాయకుల్ని సంధానం చేసేటప్పుడు హాస్యంకోసం కొన్ని కొంటెపనులుచేస్తుంటాడు. అందుకే "కొంటెకోణంగి" అని వాడుకలొచ్చుండొచ్చు. చోడిగాడిచేతిలో వంకరకర్ర ఆహార్యంలో ప్రధానమైనది. "బ్రహ్మకుటిలకం దద్యాత్" అని భరత శాస్త్రంలో వ్రాయబడింది. కుటిలకం అంటే వంకరకర్ర.

* "ఈకుటిలకం విదూషకుడిచేతిలో శోభిస్తుందని అభినవగుప్తుడు వ్యాఖ్యానించారు". దీన్నిబట్టి చోడిగాడు హాస్యాన్నికూడా నిర్వహిస్తా డన్న మాట.

## కురవంజిలు

** "చోడిగాని కలాపపరిణామమే కురవంజి. కురవంజిపదమును ప్రప్రథమంగా కావ్యంలోవాడిన తెలుగుకవి అయ్యలరాజు రామభద్రుడు (1500 - 1580)గా కన్పట్టుచున్నది.

---

* శ్రీ ముట్నూరి సంగమేశంగారి "చోడిగాడి కలాపం" వ్యాసంనుండి నాట్య కళ. ఫిబ్రవరి - మార్చి 1970 పు. 50

** డా. పి. ఎస్. ఆర్. అప్పారావుగారు తెలుగునాటక వికాసము. పు. 155

ఈ అయ్యలరాజు రామభద్రుడు తన రామాభ్యుదయ కావ్యంలో –

"జెక్కిణి కురవంజి మేళములు గేళికయు సల్పిరి" అని వ్రాశాడు. ఇందులో ఎరుకలసాని ఎరుకచెప్పడం ముఖ్యాంశం.

"ఎరుకో యెఱుక యటంచు గొరవంజి నటించె నొక్కగురు కుచ చంకన్ బుగుబురు బంగరు చుట్టియు, జొరిదిన్ గొల్లా పురమ్మ సుద్దులు వెలయన్'' –

అని దశావతారచరిత్రలో వ్రాయబడింది. ఇందులో చోడిగాడికలాపంలాగే అవే పాత్రలు. అదేకథ.

* 'సింగడు సరసింగడునుంచి ఏర్పడినది' ఈ కురవంజిలను విమర్శకులు మూడురకాలుగా విభజించారు. మొదటిది చెంచులక్ష్మీ నరసింహుల ప్రణయగాథనే వర్ణిస్తుంది. ఇది పూర్తిగా చోడిగాని కలాపమే. 'గరుడాచల మహాత్యం' దీనికి ఉదాహరణ. రెండవది నాయకుడు ఎరుకత వేషంలోవెళ్ళి నాయకికి ఎరుకచెప్పడం. ఉదాహరణకు "పార్వతీ పరిణయం"లో పరమేశ్వరుని ఎరుక. మూడవది కథకి ఏవిధమైన సంబంధం లేకపోయినా ఏదోలాగ ఎరుకలసానిని ప్రవేశపెట్టి ఆమెచేత నాయకికి సోదిచెప్పించడం. ఈమూడును శృంగారకురవంజిలు. ఇవిగాక వేదాంత కురవంజిలుకూడావున్నాయి. ఎఱుక అంటే జ్ఞానము అని అర్థం. అది సన్నిధిరాజు జగ్గకవి (ఉప్పాడ) వారు వ్రాసిన జీవయరుకుల కురవంజిలో హాస్యగాడూ ఎరుకతాసంవాదంలో యిలా వివరించబడుతుంది. 'ఆహో ! ఎరుకులపాపా! ఆదివారముమొదలుకొని శనివారము పర్యంతము ఏడువారములు వెదకిచూచినా ఎరుకవారమనేమాట కనిపించలేదు. అది ఎలాగువచ్చెనో తెలియజెప్పవలెనే పాపా !

ఆలాగునగాదయా సామీ ! ఎరుకవారమనగా ఎరుకులకులమనే మాట గాదయా – దాని వివరముజెప్పెగాని వినవయా సామీ !

"ఎరుక వారమనగ యెల్ల లోకంబుల రాణివాసులైన రమణులకును, యెరుకచెప్పునట్టి ఎరుకుల కులమయా యెల్ల కులములకును హెచ్చుకులము."

---

*సురవరం ప్రతాపరెడ్డిగారు. ఆంధ్రుల సాంఘికచరిత్ర. అయిదవ ప్రకరణం పు. 301

మాకులము అష్టాదశకులములకంటే ఎక్కువకులమయా సామీ : అవునే హాహా : ఈ జగత్తులో శ్రేష్ఠమైనకులములు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య శూద్ర కులములని చెప్పెను. అంతకన్నను మీకులము ఎక్కువని చెప్పితివి, ఆవృత్తాంతము ఎటువంటిదో తెలియజెప్పవలెనే హాహా :

చెప్పెగాని వినవయా సామీ :
'ఎరుకవారి కులమెక్కువ
జ్ఞానమెరుగని జాతులు తక్కువ -
ఎరుకవారలంటే సరకు సేయరుగాని
ఎరుకలేని కార్యమేమైన గలదమ్మా -
ఈ ఎరుకత చెప్పేదికూడా అంతా వేదాంతమే -
"ఎరుకత తావచ్చె అవ్వో అవ్వా :
కోటి సూర్యుని కాంతిని వెలుగుచున్న మేటి
చిన్మయమూర్తిని భ్రుకుటి మధ్యపాటించి
తెలియుడని నిర్మలభక్తి సూటిమార్గము, ముమ్మా
టికి మది కంటనాటికొనగజేయుబోటిమై వెలుగుచు ॥ఎ॥

ఇది ముక్తికాంతనుకాంచుటకు చెప్పిన వేదాంతపరమైన మార్గం.

ఇది తొలుత నృత్య విశేషము. కాలక్రమంలో స్థలమహాత్యాలు, శివ లీలలు, విష్ణులీలలు కథలతో ఆగేయం విశిష్టనాట్యరూపంగా రూపొందింది.

## కురవంజిల పరిణామం

* "తొలుత ద్రావిడభాషలోవెలసిన దృశ్యరచనలు కురవంజులన బడినవి. కురవజాతివార అంజె (అడుగు) కురవంజె అనబడును. చంచిక మున్నగునవి కురవంజులుగా వెలసెను. తొలుత అత్యల్పముగా గేయ భాగ ములుగాను, విశేషముగా నృత్యముకలవై యుండెను. అవి సింగి, సింగడు అను పాత్రములుకలవై యుండెను. సంస్కృత ధ్రువాగానమే కురవంజు లలో దరువనబడెను.

---

*వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ("సుగ్రీవవిజయం" యక్షగానానికి వ్రాసిన పీఠిక నుండి).

ఈ నృత్యదృశ్యములు తర్వాత జక్కులవారు నగరములందు ప్రయోగింపజొచ్చిరి. సింగి, సింగడు మారి రామ, నల, సీతాది పాత్రలు వచ్చినవి. జాతర్లలో యక్ష, గాంధర్వాది వేషములు ధరించి వేశ్యలు ప్రదర్శించినవి కావునను నృత్యధర్మములకంటే గేయధర్మము లధికముగా కలవిగావుననూ ఇవి యక్షగానములనబడెను." ఇలా కురవంజిల పరిణామ క్రమమే యక్షగానం.

కంకంటిపాపరాజు ''విష్ణుమాయా విలాసం"అనే యక్షగానం వ్రాశాడు. త్యాగరాజు"నౌకాభంగం", 'ప్రహ్లాదచరిత్ర', 'శ్రీరామజననం' మొదలగు యక్షగానాలు వ్రాశాడు. యక్షగానాలకు తంజావూరు నాయకరాజుల కాలం స్వర్ణయుగం. ఇందు మొదట సూత్రధారుడు ప్రార్థన, కవిస్తుతి, షష్ట్యంతాలు పూర్తిచేశాక విదూషకుడు ప్రవేశిస్తాడు. వచ్చినవారందర్నీ, వారికి సహాయం చేసినవారినీ పేరుపేరునా ప్రశ్నిస్తాడు –

"సభారంగమునకు అందరూ వచ్చినారా ?
చిత్తం.
కరణంగారు ?
చిత్తం.
మునసబుగారు ?
చిత్తం.
పెద్దలందరూ వచ్చినారా ?
చిత్తం.
సెహభాష్ – వారందరినీ ఉచితాసనముల నలంకరింపజేసీ యుంటిరా ?
చిత్తం.

ఇలా ప్రేక్షకులందర్నీ పరామర్శించి ప్రదర్శన ప్రారంభిస్తారు. నాయకరాజులకాలంలోనే యక్షగానం పురాణాలనుంచి సాంఘిక యితివృత్తాలలో కాలుపెట్టింది. అవే విజయరాఘవుడు వ్రాసిన "రఘునాథాభ్యుదయం" (రఘునాథనాయకుని దినచర్య), ఆనాటి కవయిత్రి రంగాజమ్మ తన భర్త విజయరాఘవునిపై వ్రాసిన "మన్నారుదాస విలాసము'. కోనేటి దీక్షితకవి "విజయరాఘవకళ్యాణం'' మొదలగునవి.

నాయకరాజుల తరువాత మహారాష్ట్ర ప్రభువులుకూడా వీనిని బాగానే పోషించారు. శహాజీ ఎన్నోయక్షగానాలు వ్రాశారు. వానిలో 'విష్ణుపల్లకి', 'శివ పల్లకి' సేవాప్రబంధాలు లోకప్రసిద్ధాలు. ఈకాలంలో సుదుపాటి వేంకనార్యుడు "పార్వతీకళ్యాణం'' యక్షగానం వ్రాశాడు. నారాయణతీర్థులు "పారిజాతాపహరణం" వ్రాశారు.

యక్షగానాల్లో పదములు, దరువులు, ఏలలు, ధవళలు, మంగళహారతులు, ఉయ్యాలపాటలు, చందమామపాటలు, సుద్దులు. అష్టపదులు విరివిగా పాడబడతాయి. గద్యతో కథాసంధి నిర్వహిస్తారు.

దీనికి తెర దుప్పటి. 'బసవపురాణంలో జవనికరప్పించి' అని ప్రయోగించడంవల్ల నాటితెర అప్పటికప్పుడు అడ్డుపెట్టే దుకూలమని తెలుస్తుంది. తెర తొలగించగానే నటీమణిముఖం అందరికీ స్పష్టంగా కనిపించడానికి కాగడాలమీద గుగ్గిలంజల్లి భగ్గుమని మండించేవారు. ప్రేక్షకులు రంగస్థలం నలుపైపులాకూర్చునేవారు. నటి ఆడుతూపాడుతూ నాలుగైపులకీ తిరుగుతూ కథవినిపించేది. ఇందులో శృంగార, కరుణ రసాలకి ప్రాముఖ్యం ఎక్కువ. వర్ణనలుకూడాఎక్కువే. ప్రాచీనయక్షగానాలలో ఓబయమంత్రి రచించిన 'గరుడాచలము' యక్షగానమొకటి. ఇది "సుగ్రీవవిజయం" కంటే ముందుదేమోకూడా ! చరిత్రకారులు యింకా ఒక నిర్ధారణకు రాలేకపోయారు. ఇందుపాత్రలు అమాయకురాలు చెంచులక్ష్మి, మాయకుడు నరసింహుడు. ఈ మాయతెరుగని లక్ష్మి, లోబరుచుకోవడంలో ఆమె యిష్టాలనుబట్టి నృసింహుడుచేసేవాగ్దానాలు, చేష్టలు ఈ కథకు ఆయువుపట్టులు.

ఈ యక్షగానాలు మొదట కేవల గేయరూపాలుగానూ (క్రీడాభిరామంలో జెక్కులపురంధ్రి) తరువాత సంవాదరూపంలోనూ (సుగ్రీవవిజయం, సౌభరిచరిత్ర) కనిపించి తరువాత వీధినాటకంలో అభేదం పొందాయి.

వీనిలో కలాపములుకూడాచేరి వీని ప్రసిద్ధిని పెంచాయి. ముఖ్యంగా చెప్పుకోదగ్గకలాపాలు భామాకలాపం, గొల్లకలాపం.

## భామాకలాపం

భామ అంటే సత్యభామ. కలాపం అంటే కలహం, లేక కలత అని అర్థం. దీనికి కథ ప్రధానంగా ఏమీఉండదు. ఇదంతా సత్యభామ విరహాభినయమే. అష్టవిధ నాయికాభినయం ఈ కలాపానికి ప్రాణం. దీనికి నట్టువాంగంగా సూత్రధారుడు, మద్దెలవాయించేవారు, వయొలిన్ వాయించేవారు వుంటారు. ఈ సూత్రధారుడివేషం బ్రాహ్మణవేషం. ఇతడే చెలికత్తె మాధవిగానూ, చెలికాడు మాధవుడుగానూకూడా వ్యవహరిస్తాడు. కూచిపూడి వారివల్ల దీనికి విశేషప్రశస్తివచ్చింది. సిద్ధేంద్రయోగి దీనికి మూలవిరాట్టు. ఇది చతుర్విధాభినయాలకు సంగీత సాహిత్యాలకు నిలయం.

సత్యభామ కృష్ణుడు తనమీద అలిగి వెళ్ళిపోయాడని చెలికత్తెకు (సూత్రధారుడికి) చెప్పేతీరు మనోజ్ఞం.

* "ఓయమ్మా ! వొకానొకనాడు పడకమందిరంలో హంసతూలికా తల్పమందు, కేళికాగృహముయందు వజ్ర వైఢూర్య గోమేధిక పుష్యరాగ మరకత మాణిక్యములు స్థాపించినటువంటి నగరియందు పవళించియుండగా స్వామివారువచ్చి గానం చేసినారమ్మా. నేను గాఢాంధకారమైనటువంటి సుషుప్తిలోనుండగా కన్ను తెరచినానమ్మా. అంతట స్వామివారువచ్చి శయ్యమీద కూర్చున్నారమ్మా. నాకు కలతనిద్దురసమయం గనుక ఉగ్గునలేచినానమ్మా. లేచి పరిమళద్రవ్యములు మొదలైన చందనగోష్టిచేసినానే. అంతట స్వామివారు పరున్నారే, నేను కూర్చున్నానే, పాదసేవచేసినానే – అప్పుడు స్వామివారు నన్ను తొడపై కూర్చుండబెట్టుకుని అమూల్యమైనటువంటి ఆభరణములు అలంకరించి నిలువుటద్దం తెచ్చి ఎదుటవుంచి నీడలుచూపించి "సత్యభామా ! నీవు చక్కనిదానవా నేను చక్కనివాడనా ?" అని అడిగేనే వోయమ్మా ! అడిగేటటువంటివరకు ఆడబుద్ధి అపరబుద్ధికనుక, అబలలము గనుక తెలియక నేనేచక్కనిదాననంటినే వోయమ్మా !. అంతట స్వామివారు నామీద కోపముచేత దిగ్గునలేచి చక్కాపోయెనే వోయమ్మా ! మన స్వామివారు ఎందుబాయెనో, ఎక్కడబాయెనో వెదుకుదామటే వోయమ్మా ?"

* "యక్షగానము" వ్యాసం (శ్రీనివాసచక్రవర్తి) నాట్యకళ. ఫిబ్రవరి మార్చి 1970 పు. 2.

అలాగ అలిగివెళ్ళిపోయిన కృష్ణునికి ''శ్రీమద్ రత్నాకరపుత్రికా విదంబ మాస" అనిప్రారంభించి - చివరన "హాయంగల విన్నపములు తప్పో ఒప్పో ఎంచక యీమదనుని బారినుండి నన్ను విముక్తురాలను చేయంగదే. ఇట్లు, నీ ప్రియసతి, సత్యభామ". అని పాడుతూ వ్రాస్తున్నట్లు అభినయిస్తూ లేఖ మాధవికిచ్చి రాయబారమంపేటప్పుడు శకునాలుచూసి "శకునాలూ మంచివాయెనమ్మా !'' అని దరువుపాడుతూపంపేతీరు అత్యంతమనోహరం. ఇక్కడ మాధవికి కృష్ణుని ఆనవాలుచెప్పేవిధానం, మాధవి (బ్రాహ్మడు) వికటప్రశ్నలు బలే చమత్కారంగా ఉంటాయి. "అమ్మా ! సత్యభామా ! నీ ప్రియుడు ఏసరివాడు? ఎలావుంటాడు? రూపురేఖలేంటి? నామధేయమేంటి సత్యభామా !'' అంటాడు. దానికామె 'నాప్రియుడు - చక్రముధరించినవాడే ఓయమ్మా' అంటే, విదూషకుడు ఆలోచించి పెద్దతెలిసిపోయిన 'ఓహో మనప్రక్కవీధిలోనున్న కుమ్మరిగురవయ్య కొడుకాఅమ్మా?" అంటాడు.

దీనికామె 'కాదే-పింఛము ధరించినవాడే ఓయమ్మా' అంటే, 'ఊరావల మకాంవున్న చెంచువాళ్ళకుర్రాడా అమ్మా ?' అంటాడు. "కాదే-మకరకుండలములు ధరించినవాడే ఓయమ్మా" అంటే, "ఓహో పౌరోహిత్యం పంతులు పెద్దకొడుకా ?" అంటాడు. "కాదే-శంఖము ధరించినవాడేఓయమ్మా" అంటే, "ఓహో పెద్దవీధి జంగాలకుర్రాడా ?'' అని అడుగుతాడు. అదికాదె అని ఏదో చెప్పబోతుంటే, "పోనీ-ఇంతకీ నీభర్త నామధేయమేమిటమ్మా?" అని అడిగితే, ''అవ్వ'' అని నోరునొక్కుకుని సిగ్గుపడుతూ ఇంతమంది ఆడవారిలో, ఇంతలేసి మగవారిలో సత్యభామ తన మగనిపేరుచెప్పుటయా? సిగ్గుగాదా ?" అంటుంది, "మరెలాగమ్మా - పోనీయింకో అనవాలేదైనా చెప్పుమరి" అంటాడు. అప్పుడు ''అదికాదే - ఆయన బావమరదుల సందు వారే ఓయమ్మా" అంటే, "ఏవిటేవిటి ? బావమరుదుల సందా ? ఆ సందెక్కడుందమ్మా ? పేరివారిసందు, సేతివారిసందు, వెచ్చావారిసందు, పుచ్చావారిసందు, శీలంవారిసందు, నీలంవారిసందు విన్నామగాని యీ సందు ఎక్కడా కనబడలేదే'' అంటే, 'అబ్బా ! అదికాదే - బావమరదుల సందు వారంటే బలరామునికి సాత్యకికి మధ్యవాడే' అంటుంది.

అప్పుడు "ఓహో అతనా ? గోపాలకృష్ణుడాఅమ్మా ? సరిసరి. ఈసారి అర్థమయింది" అని మాట్లాడడం పండితులు యిది ఎనక్రానిజమ్ అని తప్పుపట్టినా జానపదులు నిండుగా ఆనందించే ఘట్టమిదే.

* "ప్రదర్శన ప్రారంభమునకుముందు నాట్యశాస్త్రవిహితమైన పూర్వరంగము ప్రవర్తితమగును. అటుపిమ్మట కథాప్రారంభము. భామ రంగస్థలముమీదకువచ్చుటకుముందు ఒక తెర పట్టుదురు. దానికిరుపైపులను కాగడాలు వెలుగుచుండును. అంతట భామ తనపొడుగుపాటి జడను తెరపై వేసి సభలోని పండితులను సవాలుచేయును. ఈ ఘట్టంనే 'వేణీప్రబంధము' అందురు. కూచిపూడిన ర్తకులు ముఖ్యంగా భామ వేషధారి నృత్యమందేకాక సంగీతసాహిత్యములందునూ, వేద వేదాంగాది విద్యలందునూ నిష్ణాతులుగా నుండెడివారు! ఆ జడనట్లు వేయుటయనగా శాస్త్రార్థచర్చయందుగాని, భామవేషాభినయమందుగాని తనతో సాటి ఎవరునూలేరని తెలుపుట. భామ అట్లు తెరమీదజడవేసి జడయొక్కపుట్టుకనుగూర్చిచెప్పి (అదిదేవశిల్పియగు మయుని సృష్టియట) శాస్త్రార్థచర్చ చేయడం. అంతట రెండుకాగడాలమీదా చల్లిన గుగ్గిలపు మెరపులో భామ తనమొగము చూపును. రెండవసారియు నట్లే తెరను నడుమువరకు దింపుదురు. ఇంక మూడవసారి తెరను పూర్తిగా తీసివేయుదురు. "భామనే సత్యభామనే" అనే దరువుతో నటి రంగప్రవేశం చేస్తుంది. కూచిపూడివారి ఈ భామాకలాపప్రదర్శనానికిముగ్ధుడై గోల్కొండ నవాబు వారికి కూచిపూడిని అగ్రహారంగా యిచ్చాడట.

సత్యభామ జడకథను మరొకవిధంగాకూడా చెబుతారు.

** "క్షీరసాగరమథనం జరిగింది. అమృతం పుట్టింది. ఆ అమృతాన్ని పంచుకోవడంలోసురాసురులలో కలహంరేగింది. ఆ కలహం మాన్పి అమృతం పంచడానికి విష్ణుమూర్తి జగన్మోహినిరూపం దాల్చవలసివచ్చింది. ఈ జడ ఆనాటి జగన్మోహినిదాల్చిన జడ. అమృతం పంచడంకాగానే విష్ణుమూర్తి జగన్మోహినిరూపాన్ని ఉపసంహరించుకుంటూ ఆజడను కత్తిరించి పదిల పరిచాడు. కృష్ణావతారంలో నరకాసురవధానంతరం శ్రీకృష్ణుడు ఆజడను సత్యభామకు బహూకరించాడు. అప్పటినుండి ఆజడను సత్యభామ ధరిస్తుంది.

---

* డా॥ పి. యస్.ఆర్. అప్పారావు. తెలుగునాటక వికాసము పు. 143

**సహదేవ సూర్యప్రకాశరావు, రూపకళ పు. 28

జడ మొదట పాముపడగ వుంటుంది. దానిక్రిందుగా 27 నక్షత్రాలను సూచించే 27 బిళ్ళలుంటాయి. దానిచివర మూడుకుప్పెలు - ఆ మూడు కుప్పెలకు ఇంకొక మూడుకుప్పెలు - ఆమూడుకుప్పెలకు ఇంకొకమూడు. మొత్తం తొమ్మిది కుప్పెలూ నవగ్రహాల సూచనలు.

సత్యభామ రాగిడి, చంద్రవంక, సూర్యుడు. మొగలిరేకులు. పాపిడి పిందెలు, కమ్మలు జూకాలు. దండకడియాలు, ముత్యాలు, పట్టెడ, అడ్డ బాస, ముక్కుపుడక వగైరానగలతో మెరిసిపోతూ వుంటుంది. ఇవన్నీ కాకిబంగారంతో చేయబడినవే. ఈ కలాపమంతా శృంగార, హాస్య రస ప్రధానమై ప్రేక్షకులకు గిలిగింతలుపెడుతూ అర్ధరాత్రి ప్రారంభమై తెల్ల వార్లూ సాగుతుంది.

* ఆ రచనలన్నియు (యక్షగానాదికములు) బామరములనియు, నప్రౌఢములనియు, దోషభూయిష్ఠములనియు నిపుడువానిసంస్మరణము సైతము మఱచిపోయితిమి. కావుననే మన వాఙ్మయశరీరమున నొక పార్శ్వము పక్షవాతపీడితమై చచ్చుపడినది."

## గొల్లకలాపం

**"గొల్ల కలాపం భామాకలాపంలోని భాగమే. ఈ కలాపాన్నికూడా భామాకలాపంలోకలిపే పూర్వం "గోపికా విదూషక సంవాదరూపం"గా ప్రదర్శిస్తూవుండేవారు. నవరస కళాభరితంగావుండేకథలో వేదాంత ప్రబోధ మెండుకనికాబోలు రసజ్ఞులైన పండితులు కొందరు భామాకలాపంనుండి ఈ కథను వేరుచేసి 'గొల్ల కలాపం'గా ప్రచారంలోకి తెచ్చారు".

దీనిలోకూడా కథేమీఉండదు. ఓ గొల్లభామ చల్లమ్ముకుంటూ వస్తుంటే దారిలో ఒకబ్రాహ్మడు తారసిల్లుతాడు. ఆ బ్రాహ్మడు -

"గొల్లాభామావచ్చేనే చల్లోయని.

గొల్లాభామావచ్చేనే, పెరుగోయని, గొల్లాభామావచ్చేనే -

---

* ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు. ద్విపదభారతపీఠిక. పు. 42.

** విద్వాన్ సహదేవ సూర్యప్రకాశరావు. రూపకళ. పు. 31.

గొల్లభామావచ్చె పల్లెపిపాణిరో
పల్లెవాడలంట చల్లానమ్ముకుంటూ
గొల్లభామా వచ్చేనే" అని దరువు ప్రారంభిస్తాడు.

గొల్లభామకూడా ఆ దరువునందుకుని నాట్యంచేస్తూ వస్తుంది. ముందుగా ప్రచారానికి ఆరోజుల్లో అవకాశంలేదుగనుక ఇలా పాత్రపరిచయం అయ్యేది. ఆ తరువాత ఆ బ్రాహ్మడు, ఆభామ సంభాషిస్తారు. ఇదంతా వేదాంతమయమే. కాకుంటే ఆపద్యాలూ శ్లోకాలూచదివి సామాన్యులకుకూడా సులువుగా అర్థమయ్యేటట్లు ఆయావిషయాలను వివరిస్తారు. ఈ సంభాషణ విప్ర, గొల్లకులాల్లో ఏదిగొప్పది అనేవాదంతో ప్రారంభమై మతం, సంస్కృతి, ఆచారవ్యవహారాలు, త్రిపురాసురసంహారం, క్షీరసాగర మధనం, పిండోత్పత్తిక్రమం, జీవాత్మ పరమాత్మల ఉనికి, పునర్జన్మ, సృష్టి, ప్రళయం వగైరా ఎన్నో విషయాలు వీరి చర్చలో వస్తాయి. ఆ బ్రాహ్మడే కథనడుపుతూ మధ్యమధ్య విదూషక పాత్రకూడా నిర్వహిస్తాడు. ఇందులో సుంకరికొండయ్యగా వచ్చిన శ్రీకృష్ణునితో సంవాదము మరోఘట్టం. సుంకరికొండ తనప్రేమను గొల్లభామకు తెలుపగా ఆమె ఆగ్రహిస్తుంది. ఇంతలో మరోగొల్లభామ వస్తుంది. వారితో కొంతసంవాదం అయ్యాక సుంకరికొండ ఆ గొల్లభామలకు స్వస్వరూప దర్శనం యిచ్చి (శ్రీకృష్ణరూపం) వారిని తరింపచేస్తాడు. నిజానికి యిందలివిషయం సామాన్యుని అవగాహనకు అందనిది. వినడానికి విసుగుకలిగిస్తుందికూడా. కాని వీరా శ్లోకాలూ పద్యాలూ శ్రవణానందంగా చదువుతూ, సరళసుందరంగా విప్పిచెప్పడం, నేత్రానందంగా అభినయిస్తూచేసే నృత్యం బ్రాహ్మణుడు విదూషకుడిగా విసిరే చెణుకులు ఎంతో ఆహ్లాదాన్ని కలిగించి తెల్లవార్లూ చూసేటట్లు చేస్తాయి. జీవితాన్ని గురించి ఆలోచనలు రేకెత్తించి మనిషిని విజ్ఞునిచేసే అద్భుత కలాపమిది. ఈకలాపాలు తెలుగువారిస్వంతం. మరెక్కడాలేవు.

## భోగం మేళాలు

తెలుగునాట వివాహాదిశుభకార్యలలోనూ, దేవునిఉత్సవాలలోనూ అనాదిగా భోగంమేళాలుఆడించడం ఒకవేడుక.

మీపుట్టుపూర్వోత్తరాలు ఏమిటని వృద్ధకళాకారిణి కోటిపల్లి రాజరత్నంను అడిగినప్పుడు ఆమె గతకాలాన్ని నెమరువేసుకుంటూ కళావంతులు రంభ వంశంవారనీ, దొమ్మరసానులు ఊర్వశివంశంవారనీ తమపూర్వులు చెబుతుండేవారన్నది చిరునవ్వుతో. ఈమె కవికుల గురువులు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి శిష్యురాలు. పలుకులో ఎంతో పాండిత్యం ఒలుకుతుంది. పరిశుద్ధమైనభాష. సంగీతంలో నిధి. సంస్కృతంనేర్చుకుంది. శ్రీ శాస్త్రిగారి దగ్గర 200 శ్లోకాలు అభినయానికి వీలుగా అర్ధవివరణతో చదివిందట. "అభినయ దర్పణం" ఆపోసన పట్టేసింది. "రసమంజరి" ఆమె రసనాగ్రాల మీద నాట్యంచేస్తోంది. "నేనేకాదు ఆకాలంలో మావాళ్ళందరూ అంతే. కనుకనే ఆరోజుల్లో మేము పదానికి అభినయంపడుతుంటే పండితులంతా వళ్ళుమరచి తాళంవేస్తూ తలలాడించేవారు. నర్తకీ, సభాసదులూ కూడా ఆ రససముద్రంలో ఓలలాడేవారు. ఒక్కవర్ణం పట్టేటప్పటికే తెల్లవారేది. ఎక్కడ ఏ హస్తం పట్టాలనేది ఆనాడు సామాజికులకుకూడా బాగాతెలుసు. అందుకే ఆసభ సప్తాంగ లక్షణాలతోరాణించేది" అంది.

మరి ఇప్పుడో ? అన్నాను. "ఇప్పుడా ? జయమాలిని, జ్యోతిలక్ష్మి నెక్సుడాన్సులే ఆడుగుతున్నారు ప్రేక్షకులు. మా పిల్లలకు కూడా అంతకు మించిరావు. ఇలా దిగజారిపోయింది మాకళ" అని ఆమె వాపోయింది.

## దేవదాసీలు

* "సురపతి ........ భూతలమిచ్చె
............ దక్షవాటికావరునకు
భీమనాధునకు వారవధూత్రిదశ స్వయంబుతో"

ఆదిలో వీరి కళాప్రదర్శన దేవాలయాలలో దేవునిఅర్చన విధులలో ఒకటి. ఉదయం, సాయంత్రం వీరు అభినయంపట్టి హారతిఇవ్వడంతో ఆపూట అర్చన పూర్తయ్యేది. అందుకే వీరిని దేవదాసీలనేవారు. వీరి కుటుంబాలస్త్రీలను రజస్వలకాగానే దేవుని సేవకు కైంకర్యంచేసేవారట. కాబట్టి వీరు నిత్యపుణ్యస్త్రీలు. మొన్న మొన్నటివరకూ పెళ్ళిళ్ళలో

* భీమేశ్వర పురాణం - శ్రీనాధుడు.

మంగళసూత్రాలకు నల్లపూసలు, పుస్తెకంటు వీరిచేత కట్టించేవారు మంగళ కరమని. వీరికి దేవాలయ మాన్యాలుండేవి.

తరువాతతరువాత వీరికళ దేవస్థానాలనుంచి రాజాస్థానాలకుమళ్ళింది. రాజుల సమాదరణలో కూడా బాగానేఉండేది. క్రమంగా జమీందారుల కౌగి ళ్ళలో నలిగినలిగి, శ్రీమంతులచేతుల్లో చితికిచితికి పతిత జాతిగా పతనమై పోయింది. ఆరోజుల్లో ఎంతసత్సీలత ! కళే సర్వస్వం. వీరిలో 'కన్నెరికం' అనేదికూడా కళాత్మకంగానే జరిగేది. అంతా 'శోభనం'తంతే. ఆరోజునుంచీ అతనికిుందే ఆమె. అంత నిజాయితీ. ఉంపుడుగత్తెల నుంచుకోవడం ఆ రోజుల్లో అదోగొప్ప. ఫలానావారితాలూకుఅంటే పేరు. ఆమెను స్వంత భార్యకూడా చెల్లెలిగాచూసేది. పండుగ పబ్బాలలోనూ, విందులు వినోదాల లోనూ కలిసిమెలిసి తిరిగేవారు. ఒకసారి ఒకాయన భార్యాసమేతంగా తరలి వచ్చి ఒకామెకు కన్నెరికం చేస్తున్నాడు. అందరూ ఆశ్చర్యపోయారు. తరు వాత తెలిసింది ఈపనికి ఆ భార్యకూడా ప్రోత్సహించిందని. ఎందుకంటే ఓ పెద్దజోస్యుడు అతనికి ద్వికళత్రయోగముందని చెప్పాడట. ఈ గండం నుంచి తప్పించుకోవడానికి ఇదొక్కటే మార్గమన్నాడట.(ఆయనేఅన్నాడో ఈయనే అనిపించాడో !)

సానులమేళాలకు, కళావంతులమేళాలకు తేడా ఒక్కటే. కళావం తులు "కలాపాలు" చెయ్యరు. సానులు "గొల్లకలాపం", "భామాకలాపం" కూడా చేస్తారట. భోగంమేళాలముందు ఒకనాడు రసికులూ, తరువాతి కాలంలో సరసులూ చేరేవారు. నేటికాలానికిది కాముక కళగా మారింది. ఆనాడు ఊరేగింపులో ఇద్దరుగానీ నలుగురుగానీ సానులు ముందుకొచ్చి నాట్యంచేస్తుంటే మిగతాసానులు వెనుక దడిలానిలబడి పాడుతూ, తాళం వేస్తూ రాత్రంతా ఊరు తిరిగేవారు.

## "మేజువాణి"

వీళ్ళ ప్రసిద్ధి మేజువాణీ – దీనిని 'సభ' అనేవారు. *"ఇది ఉర్దూ మేజుబానీ"నుండి వచ్చిన పదం – దీనికి ఉర్దూలో 'విందు' అని అర్థం.

---

* ఆంధ్రుల సాంఘిక చరిత్ర – 7వ ప్రకరణం పు. 409
(సురవరం ప్రతాపరెడ్డి)

వీరి పాండిత్యం పూర్తిగా వెల్లడయ్యేది ఇందులోనే. సిద్ధహస్తురైన విదుషీ మణులు మోకాళ్ళమీదా పద్మాసనంమీదా కూర్చొని పదాలూ, వర్ణాలూ, జావళీలూ పాడుతూ అభినయం పడుతుంటే కూర్చున్న పండితులు ఓహో ఓహో అని తన్మయులై పోయేవారు.

తొలుత "పాలయగజవదనా"వంటి గణపతి ప్రార్థన, "అప్పసేవా జీకేమగువా'' వంటి దేవతాప్రార్థన, కీర్తనలు స్వర ఆలాపనచేస్తూ మధురంగా పాడి తమ సంగీత పాండిత్యాన్ని ప్రదర్శించేవారు. తరువాత విదుషీ మణి ముందుకువచ్చి ''స్వామీ దయరాదేమిరా'' వంటి పల్లవిపాడుతూ అభినయంపట్టడం ప్రారంభించేది. క్రమంగా 'భైరవి'లో గాని, 'బేగడ'లోగాని 'చేకొ' వర్ణాలు 'నీసాటి దొరవాని నెరనమ్మినారా' (భైరవి), 'తిరిగిచూడవదేమిరా తీరైన స్వామీ' (బేగడ) వంటివి అభినయం పడుతుంటే పండితులు మళ్ళీమళ్ళీ పట్టించి తాంబూలాలలో రూపాయలవర్షం కురిపించేవారు. "సామిని రమ్మనెరా ఆచెలి, దాని సాటి ఎందులేదు" అని క్రీగంటిచూపుతో కనుబొమ్మలెగరేస్తూ పాడుతుంటే పరవశంపొందని వాడెవడు!

## నాయకీభావం

"నాయకీభావం" వీళ్ళసొత్తు. పదాలలో 'ఇట్లెరుగక మారీ ఒకరింటికి వచ్చితివా. ఎవరోయీ నాయకుడా" అనే ప్రౌఢనాయిక, 'ఏరీతి బొంకేవురా లేదనీనాతో' అనే ఖండితనాయిక, 'సుదతూలందరూగూడి శోభనమని అంటే అదిఏమో అనుకొంటినే' అనే ముగ్ధనాయిక, "పోయీవచ్చెద సామీ-అత్తింటికి పోయీవచ్చెద" అనే పరనాయికాభినయనాలకు వీరు పెట్టేతీరు మనోహరం. బహుశః మరే నాట్యసంప్రదాయంలోనూ ఇలా కూర్చబడలేదేమో కూడా. శాస్త్రంతెలియని పామరుడుకూడా 'శభాష్' అని తీరవలసిందే. ఆ తరవాత 'నమ్మగరాదె కొమ్మ మగవారల', 'ముద్దుపెట్టరా ఒక ముచ్చటాడిపోరా', 'చీటికి మాటికి ఏటికి కోపము', 'మరువారికి తాళలేను' వంటి జావళీలకు హస్తం, ముద్రలు పడుతూ మదనతాపం ప్రకటించే తీరులో ఉద్భవించే శృంగారరసోత్పత్తిని రసగంగాధరుడు కూడా అక్షరాలలో నిక్షేపించలేడు. ఆ అభినయం, ఆ హావభావాలు పుస్తకాల్లో ఇమడ్చడానికి కావ్యాలంకార సంగ్రహకర్తకుకూడా సాధ్యంకాదేమో!

## తరంగాలు - కీర్తనలు

మధ్యకాలంలో "తరంగాలు" కూడా చేరాయి కాలానుగుణంగా. 'వినవేపల్లవ మృదుచరణా' వంటి ఆధ్యాత్మికకీర్తనలు, 'సుజనజీవనరామ సుగుణ భూషణ" వంటి త్యాగరాయకీర్తనలు దేవతాప్రార్థనఅనంతరం చోటుచేసుకున్నాయి. అలాగే అభినయభాగంలో 'ధీరసమీరే యమునాతీరే' వంటి అష్టపదులు, 'బ్రూహి ముకుందేతి', 'బాలగోపాల' వంటితరంగాలు అనుసంధించబడ్డాయి. ఈకాలంలోనే ప్రవేశించిన మరో అంశం "సలాందరువు". ఇది ఏ ఇతరనాట్యాలలోనూలేదు. వీరి స్వంతం. ఇది చేస్తున్నప్పుడు ప్రతివాడూ మైమరచి కళ్ళప్పగించి చూడవలసిందే. దీనికి సాహిత్యంలేదు. వాయిద్యసహకారంతోఅభినయించే నృత్య ప్రహేళిక. దీనినే "గప్తు" అంటారు. దీనిలో కోలా సుబ్రహ్మణ్యం ప్రసిద్ధురాలు. 'పరిపరివిధముల ప్రహ్లాదుడుమిము హరిహరిహరియని మరిమరి వేడగ' అనే దశావతారవిన్యాసం దీనికిముందు పెడతారు. ఇది యించుమించు 'ముక్తాయింపు' దరువుకూడా. ఈ కాలంలోనే 'కారువా', 'జడకోపు' అనేవి కూడా ప్రవేశించాయి. 'కారువా అంటే ఒక ఆడవేషం, ఒక మగవేషం (రాజు, రాణులులాగ) వేసుకుని వచ్చేవారు ఆ సానులలో ఇద్దరు. వారి వచనం, పద్యం, సంభాషణ, అభినయం చూపరులకు చోద్యంగాఉండేది. 'జడకోపు' అంటే ఒకామె తలవిప్పుకొని మధ్యఉంటే మిగతావారంతా అడుగులువేస్తూ చుట్టూతిరుగుతూ చక్కగా ఆమెజడ అల్లేసేవారు. అది చూడ్డానికి గొప్ప 'త్రిల్'గా' ఉండేదట. స్వాతంత్రోద్యమంలోకూడా వీరి పాత్రేమీతక్కువకాదు. 'మురువకుండార్యులారా పంజాబు వధ' వంటి కీర్తనలతో సభికుల్ని ఉత్తేజితుల్ని చేసేవారట.

## రెండర్థాల పాటలు

1950 నుండి ఆధునికకాలం అనుకుంటే ఈకాలంలోచేరినవి 'సారా బుడ్డి చంకనబెట్టి', 'చూడు పిన్నమ్మా పాడు కుర్రాడు', 'పచ్చబొట్టు పొడిపించుబావా', 'తగులుకుంటెరాదోయి తాళంకప్ప' వంటి రెండర్థాల పాటలు, బూతు అభినయం రంగప్రవేశంచేశాయి. ఆటలో వాలు మొగ్గవేసి క్రిందనున్న సూదిని కనురెప్పతో తీయడం, వాలుమొగ్గమీద వెనక్కివంగి నాలుకతో నేలమీదిరూపాయలుతియ్యడం, పళ్ళెంలో నీళ్ళు

పోసి అవి వొలక్కుండా పళ్ళెంఅంచులపై నాట్యంచేయడంవంటి ఫీట్సు చేసి సభికుల్ని చకితుల్నిచేసేవారు. కోటిపల్లి నరసింహోయి పచ్చికుండమీద చేసేనాట్యం పిచ్చెక్కించేదట. ఈ కాలంలో వేర్‌డ్యాన్సులవంటి నృత్యాలతో పాటు సర్పనాట్యంవంటి జానపదనాట్యంకూడా ప్రసిద్ధిపొందింది.

ఆదిలో ఈ కళావంతుల నృత్యాభినయాన్ని 'కర్నాటకవిద్య' అనే వారట. తూర్పుగోదావరిజిల్లాలో మండపేట, మురమండ, అమలాపురం, తాటిపాక, పెద్దపురం, పిఠాపురం, రాజమండ్రి, కాకినాడలలోనూ పశ్చిమ గోదావరిలో దువ్వ, రేలంగి, ఇరగవరం, అత్తిలి. భీమవరాలలోనూ భోగం మేళాలు ప్రసిద్ధిగా ఉండేవి. ప్రభుత్వనిషేధంవల్ల నేడు ఇది దాదాపు క్షీణ దశకుచేరుకుంది. చరిత్రపరంగా ముందుతరాలవారి కోసం దీనిని మ్యూజియం వస్తువుగానైనా రికార్డుచేసిఉంచడం మన కనీసధర్మం.

## కోలసంబరం

* కృతే సత్యస్వరూపశ్చ, త్రేతాయాం రఘునందనః
ద్వాపరేవాసు దేవశ్చ, కలౌ వేంకటనాయకః

ఆంధ్రదేశంలో ప్రసిద్ధమైన దేవాలయాలు అడుగడుగునా అనేకం కనిపిస్తాయి. వీనిపై పురాణాంతర్గతమైనకథలుఒకవైపునా, చారిత్రాత్మక మైనగాథలు మరొకవైపునా, జానపదులనోళ్ళల్లో వేరే కథలూ ప్రచారంలో ఉన్నాయి. ఉదాహరణకు తిరుపతివేంకటేశ్వరస్వామికథ తీసుకుంటే పద్మపురాణంలోచెప్పబడ్డకథ స్థూలంగా యిలావుంది.

వైకుంఠంలో భృగుమహర్షి విష్ణువక్షస్థలంమీదతన్నడం, దానికి లక్ష్మీదేవిఅలిగి భూలోకానికివచ్చేయడం, ఆమెనువెతుక్కుంటూ విష్ణువు రావడం, వకుళాదేవిబిడ్డగా పెరగడం, శ్రీనివాసుడనేపేరుతో ఆకాశరాజు కూతురు పద్మావతీదేవిని పెండ్లాడడం, తిరుపతిలో కలియుగ దేవతలుగా నిలిచిపోవడం అనేది గ్రంథస్థమైన కథ.

ఇది చారిత్రాత్మకంగా చూస్తే వీరశైవ, వీరవైష్ణవ పోరాటాలలో రామానుజాచార్యులు తిరుపతికొండపై యీ విగ్రహాలను ప్రతిష్ఠించడం, కృష్ణదేవరాయలు వగైరారాజులు వీనిని దర్శించి, సేవించి, పెంచి పోషించడం మనకు కనిపిస్తుంది.

కాని పల్లెటూళ్ళల్లో జానపదులుచెప్పేగాథ వీనికి భిన్నంగా వేరే విధంగా వుంటుంది. ఈ కథే కోలసంబరంలో పాటగా పాడేకథ. ఇది అముద్రితం.

## కథ

దిగువతిరుపతివాసులైన తిమ్మరాజు, పేరిందేవి దంపతులకు తొలి చూలుగర్భాన గోవిందరాజు, రెండవగర్భాన ఉప్మాకవెంకన్న, మూడవ గర్భాన యానాం వెంకన్న, నాలుగవగర్భాన పొన్నాడవెంకన్న, ఐదవ గర్భాన బెండపూడివెంకన్న. ఆరవగర్భాన వాడపల్లివెంకన్న, ఏడవగర్భాన తిరుపతి వెంకన్న పుట్టేరు. తండ్రి తిమ్మరాజు కాలంచేసేడు. పేరిందేవి ఏడవకాన్పులోపుట్టిన వేల్పువెంకన్నకు అరికాలున తామరపద్మం, వీపున వింజామర, బొడ్డున పొన్నారిపువ్వు, చేతులలో శంఖుచక్రాలు, నాలుకన నక్షత్రం ఉన్నాయి. చూడవచ్చిన అమ్మలక్కలంతా వీడు నరుడుకాడమ్మా నారాయణుడమ్మా అన్నారు.

ఈ విధంగాపుట్టిన ఏడుగురూ పెద్దవాళ్ళయ్యారు. విద్యాబుద్ధులు నేర్చుకున్నారు. మొదటి ఆరుగురికి పెళ్ళిళ్ళయ్యాయి. ఎవరిరాజ్యాలు వారు ఏలుకుంటున్నారు. ఏడవవాడైన వేల్పువెంకన్న పెంకివాడయ్యాడు. పొగరు బోతుగామారాడు. పెళ్ళికెదిగాడు. అప్పుడు తల్లి పేరిందేవి ఒక అర్ధరాత్రి వేళ తలదగ్గర బంగారుకుంచంపెట్టుకుని, వేదపుస్తకాలుప్రక్కనేసుకుని, పట్టు శాలువా ముసుగేసుకుని నిద్దరోతున్న పెద్దకొడుకు గోవిందరాజుని పిలిచి మంచి కన్యనుచూసి వెంకన్నకు యీ యేడు పెళ్ళి చేసెయ్యాలంది. ఆ మరు నాడు గోవిందరాజు మిగతా అయిదుగురు తమ్ముళ్ళకూ ఉత్తరాలువేసి రప్పించి విషయంచెప్పేడు. వెంటసేవాళ్ళు చన్నీళ్ళు స్నానాలుచేసి, కాశి పంచెలుగట్టి, బిళ్ళగోచీలుపెట్టి, కుచ్చుతలపాగలుచుట్టి కాళ్ళకుగజ్జెలూ, చేతు లకు మురుగులూ దండకడియాలూ, ముద్దుటుంగరాలూ మెడలో తులసి తావళాలూ రుద్రాక్షపేరులూ ధరించి. వంకదండం చేత్తోపట్టుకుని, తల్లిదీవెన పొంది కన్యాన్వేషణకు బయలుదేరెను.

మోకాళ్ళపర్వతంఎక్కేరు. చుక్కలగిరిపర్వతం చేరారు. గడి మన్యాలుదాటారు. నేపాల, భూపాల, ఢిల్లీ, పాంచాల అనేక రాజ్యాలు తిరిగారు. కన్యదొరకలేదు. విసుగెత్తినగోవిందరాజు బయలుదేరిన

ఘడియలు మంచివికావని వెనుకకుపోదామన్నాడు. వచ్చినపనిపూర్తికాకుండా వెనక్కిమళ్ళడం యిష్టపడక మరలముందుకు వెళ్ళుటకే నిశ్చయించారు. కడప, కర్నూలు చూసేరు. ఫలితందక్కలేదు. ఆఖరికి ఆలంవారిపట్నం వెళ్లేరు. అక్కడ మూడువీధులమొగలో కడిమిచెట్టుంది. దానికింద వీళ్ళు కొలువుతీరేరు. ఆపట్నంరాజు ఆలమందారకుడు. అతను సప్తసముద్రాలలో స్నానంచేసి అప్పుడే సంధ్యవార్చుకొని ఆదారిన వస్తున్నాడు. ఈఆరుగుర్నీ చూసేడు. 'బాబులూ మీదేవూరు ? ఏసీమ ? ఎవరు ? ఎందుకోసంవచ్చారు? మీ తల్లిదండ్రుల పేరేమిటి ? అని ప్రశ్నించాడు. అప్పుడు గోవిందరాజులు ఇంటిపేరు ఇనకులవారమనీ కాశ్యపసగోత్రమనీ మాతల్లిదండ్రులు పేరిందేవి, తిమ్మరాజు అనీ, మాది దిగువతిరుపతి అనీ, తాము ఏడుగురు అన్నదమ్ములమనీ అందులో ఆరుగురికి పెళ్ళిళ్ళయినాయనీ, ఏడవవాడికి కన్య కోసం వెదుకుతూ అనేకరాజ్యాలు తిరిగితిరిగి యిక్కడికిచేరామన్నాడు. ఇది విన్న ఆలమందారకుడు సంభ్రమాశ్చర్యాలుపొంది వారితల్లి పేరిందేవి తన పెదతండ్రికూతురనీ, కాబట్టి వారంతా తనకు మేనల్లుళ్ళనీ తమబంధుత్వం తెలిపి తనకు యీడొచ్చినకూతురుందని, చూపులకు బంగారుబంతి, బంగారు బొమ్మ పేరు మంగమ్మనిచెప్పి, చూసుకోవడానికి యింటికి రమ్మన్నాడు. గోవిందరాజులకు బంగారుకుర్చీ, మిగిలిన అయిదుగురకూ క్షేముకుర్చీలూ వేసి, చక్కెరపొంగలి ఫలహారమిచ్చి భార్యఇనుదేవితో దిగువతిరుపతినుండి మంగనడగవచ్చారని, ఆరుగురుబావలు చూడవచ్చేరని మంగనుముస్తాబుచేసి పంపమన్నాడు.

ఈలోపల మంగకు చన్నీళ్ళస్నానంచేయించి, సంపెంగనూనెరాసి, చక్కగా తలదువ్వి, జారుముడివేసి, కంచుమట్లు కాళ్ళకుతొడిగి, బంగారు గాజులు, మువ్వలవడ్డాణం, ముత్యాలపేరు, ఏడువారాలనగలూ పెట్టారు. కంటికికాటుక, బుగ్గనచుక్క, చిట్టిమల్లిమొగ్గల చీరా కట్టారు. వారు కొలువు తీర్చివున్నచోటికి తీసుకువస్తున్నారు.

వరిపిండి పాదాలకువత్తకుండా చీమకదలనంత చిట్టడుగులేస్తూ, దోమదూరనంత దొడ్డడుగులేస్తూ మంగ మండువాలోకొచ్చింది. ఆమెను చూసినగోవిందరాజులు నాతిమంగమ్మను నడిపించమన్నాడు. నడిస్తే హంసనడక. పలికితే చిలుకపలుకు. ఆమె అరచేతిలో పద్మం, వీపున వింజామర తమ ఆరుగురు భార్యలకంటె అందగత్తె. పైగా మామ

కూతురు. ఆనందమయ్యింది. పురోహిత్తుణ్ణి పిలిపించమన్నారు. పేరూరి బ్రాహ్మలొచ్చారు. వెంకన్న, మంగమ్మల పేరుబలాలు చూసేరు. వారు జోడు త్రాచులయ్యారు. సరిపోతుందని గోవిందరాజులు ఆలమందారకుణ్ణి కట్నాలసంగతితేల్చమన్నాడు. పచ్చనిపందిట్లో పెళ్ళిసమయంలో పద్దెనిమిదిలక్షల కట్నం యిస్తామన్నాడు. వెంటనే గోవిందరాజులు సుముఖతను వ్యక్తంచేసి అక్కడతల్లికీ యిరుగుపొరుగులకీ వెంకన్నకూనచ్చితే యీపెళ్ళి ఖాయమేనన్నాడు. తల్లి పేరిందేవి ఎదురెళ్ళింది. "అమ్మా! మేము వెళ్ళిన పని సఫలమయ్యింది. మామకూతురే మనకుదొరికింది. మంగమ్మ అందాలు చెప్పనలవికానివి. బంగారపు బొమ్మ. ఇకవారి యిల్లుచూస్తే ఎత్తైన స్తంభాలతోకట్టినమేడ. చుట్టూ ప్రహారీగోడలు. దర్వాజా లోగిలి". అని గోవిందరాజు చెప్పాడు. అందరికీ సమ్మతమయింది. వారిలో చిన్నన్న పెంచిన రామచిలకకు మర్నాడు వారి ఆమోదం తెలుపుతూ చీటీ వ్రాసికట్టి దానికి ఆలంవారిపట్నానికి దారిచెప్పివదిలారు. అది నల్లనల్లని మేఘాలలో నడిచి వెళ్ళింది. తెల్లతెల్లని మేఘాల్లో తేలివెళ్ళింది. పాపికొండలుతిరిగి పరుగెత్తుకెళ్ళి ఆలమందారకుని దండపై వ్రాలింది. ఆలమందారకుడు దానివీపుమీద చెయ్యేసిదువ్వి చీటీనివిప్పిచూసేడు. సంబరంతోపెళ్ళిపనులు ప్రారంభించారు. ధాన్యపుకొట్టులు విడగొట్టారు. ఆ రాజ్యాన్ని పోయేటి రమణిపిచ్చుకలు వొడ్లుదంచాయి. రాసులోసాయి. పిండికొట్టి పళ్ళాల్లోకెత్తాయి. పసుపులు కొట్టారు. తమలపాకుల దడులు, పారుటాకులపందిళ్ళు, ముత్యాలముగ్గులు, రత్నాలరంగులు, పగడాలపట్టీలు. ఆలంవారిపట్నంఅద్భుతంగాముస్తాబయింది.

ఇక దిగువతిరుపతిలో చిలకలద్వారా ఊరూరికీ పెళ్ళికబుర్లుపెట్టారు. శుభలేఖలు వీధివీధికీ వెదజల్లారు. పల్లెపల్లెకీ పంచిపెట్టారు.

చిన్నఏనుగెక్కి చిన్నదుర్గవచ్చింది. చుట్టాలు పక్కాలు మూడుకోట్లు వచ్చారు. సీకాయ మాకాయ సిద్ధిలోచమురు, జాజికాయ, జాపత్రి నలుగు పెట్టేరు. పొత్తుపంచెలుతెచ్చి గుత్తంగాకట్టి, పల్లకీ తెచ్చేరు. పందిట్లో వుంచేరు. పల్లకీలో పంచెలుంచారు. బియ్యాలుపోశారు. కొబ్బరిబొండాలుంచారు. ఇవన్నీ ఒకపెడ యిలాజరుగుతుంటే మన వేల్పు వెంకన్న జిల్లేడు వనంలో దిగులుగా కూర్చున్నాడు. ఇదిచూసిన చాకలి ముసలి గోవింద రాజులతో చెప్పింది. వెంటనే గోవిందరాజులు జిల్లేడువనంలో తమ్ముడు

దగ్గరకు వెళ్ళి తలమీదచెయ్యేసిదివ్వాడు. ఇంతలో మిగిలినఅన్నలుకూడా వచ్చారు. దిగులుకు కారణం చెప్పమన్నారు. వెంకన్న పల్లకీవద్దు. ఎద్దు కావాలన్నాడు. ఎవరెద్దుకావాలో కోరుకోమంటే కమ్మవారిఎద్దు కోరు కున్నాడు. వెంటనే వారిఎద్దు ఏటుకొంపలనుంచి తెప్పించారు. కొమ్ములు చెక్కించి తొడుగులు కట్టించారు. నడుముకి పటకాలు. ముక్కుకి ముగ త్రాడు వేశారు. ఆఎద్దునెక్కాడు వెంకన్న. గుర్రాలు, ఏనుగులు, మందు గుండుసామాను, రామడోలు మేళాలతో లక్ష్మీవారంనాడు ఆలంవారిపట్నా నికి తరలివచ్చారు — విడుదుల్లో దిగారు.

ఇక మంగచెలికత్తెలు "పెద్దక్కా ! చిన్నక్కా ! రండర్రా మీరు. ఆలంవారిఅల్లుడొచ్చాడు చూసొద్దాం" అని వెళ్ళొచ్చి ఆకతాయిచెలులు మంగను మేలమాడమొదలెట్టేరు. ''మంగమొగుడు వెంకన్న వెనుకకు చూస్తేఎసుకోతిరూపు, ముందునుంచిచూస్తే ముదికోతిరూపు. ముందుపళ్ళు పూడాయి. మునుచెంప నెరిసింది. కనురెప్పలు నెరిసాయి. ముసలిమొగుడు" అని మంగను ఏడిపిస్తున్నారు. ఎద్దుమీదొచ్చాడు అని వేళాకోళంపట్టారు. ఇదివిన్న ఆలమందారకుడు పరుగెట్టుకెళ్ళి "మీ సంబువారింటిలో పల్లకీ లేకుంటే కాకిచేత నాకుకబురుపంపలేకపోయారా జోడుపల్లకీలుపంపించేవాణ్ణి" అన్నాడు. ఇదివిని గోవిందరాజులు మేము ఎద్దుమీదరావడం మా ఆనవా యితీ అనీ, ఆనవాయితీప్రకారం అలా చేశామన్నాడు. ఆ మాటవిన్న ఆల మందారకుడు పానకాలకావిళ్ళు పట్టించుకొచ్చాడు. ఎదురుతళ్ళింపులతో అవి పుచ్చుకున్నారు. ఆ రాత్రంతా ఊరేగించారు. ఊరేగింపు పందిట్లోకొచ్చింది. పెళ్ళికి బంగారుపీటలేసారు. వధూవరులకు బ్రాహ్మలు బ్రహ్మముళ్ళేశారు. వెంకన్న మంగమ్మలను కూర్చోబెట్టారు. గౌరీపూజచేయించి అల్లాలూ బెల్లాలూ ఆవుపాలూ బియ్యం అన్నీ తెచ్చారు. విఘ్నేశ్వర పూజకూడా జరిగిపోయింది. మంచిముత్యాల తలంబ్రాలు ముమ్మారు మంగమ్మనెత్తిపై వెంకన్నపోస్తే వెంకన్న నెత్తిమీద మంగపోసింది. తల్లి ఇనుదేవి కాళ్ళుకడిగి కన్యాదానమిచ్చింది. ఇక కట్నాలదగ్గరకొచ్చారు — గోవిందరాజుఅడిగాడు. "సువ్వుయిస్తానన్న కట్నం యిప్పుడివ్వకపోతే మాతమ్ముడు వెంకన్న పెళ్లి అయినే దిగడు'' అన్నాడు. ఆలమందారకుడు అదిరిపోయాడు. ప్రస్తుతం తనదగ్గర రొఖంలేదనీ, ప్రయత్నించినా దొరకదనీ, మీరు కాదూకూడదని

పట్టుపడితే నాకున్న పండనిభూమి ఏబది ఎకరాలు రాసిస్తానన్నాడు. ఆ ఏడు కొండలూ కొట్టించి కోనేరుత్రవ్వించి "ఆలంవారి కోనే"రని అనిపిస్తాను, ముందుముందు మెట్టుచెబుతాను. ఒప్పుకోమని ప్రతిమాలుతున్నాడు. ఇక పెళ్లికొచ్చినవాళ్ళు మాకుఆకళ్ళు వేస్తున్నాయి, దప్పికలేస్తున్నాయి, మీకు కట్న కానుకల పట్టుంటే మాయిళ్ళకు మేము వెళ్ళిపోతామన్నారు. వెంటనే వీధివీధితుడిచి విస్తర్లేశారు. ఇంతలో దేవలోకంనుంచి గోవువచ్చింది. దానికి నాలుగుచన్నుల పొదుగు. అది ఆకాశునందున నడుస్తుంటే గారెలూ బూరెలూ ఒకచన్ను కురవగా, పంచభక్ష్యాన్నములు మరొకచన్ను కురవగా, చిత్తకార్తె వానలాగ పాలుమజ్జిగలు మరొకచన్ను కురుస్తుంటే అందరూ భోజనాలు సుష్టుగాచేసి ఎవరిళ్ళకువారు వెళ్లిపోయారు.

అన్నమాటప్రకారం కోనేరుత్రవ్వించాడు. నీళ్ళల్లోపండిన నీవారు ముత్యాలు, ఎద్దుతొక్కనిపంటఏడుపుట్లు మంగకు వడకట్టుబియ్యం కట్టారు. పన్నెండుమణుగులపాతబెల్లం, పన్నెంతుమణుగుల పచ్చిపసుపు, పన్నెండు మణుగుల పాతకంద, పన్నెంకు మణుగుల పత్తివిత్తనాలు పాతిక బొండాలు, పన్నెంతుకుంచాల పెసగలు, పన్నెండుకుంచాల కందులూ, ఒడి గట్టుగుకట్టారు .పన్నెండు వందలరూపాయలు ఖరీదు పట్టుచీరపెట్టేరు. ఒడికట్టుతో మంగను దిగువతిరుపతికి పంపించారు. అక్కడమూడురోజులుంచారు.

తరువాత మంగతమ్ముడు పింగళుడు అక్కకి ఒకపల్లకీ, బావకు ఒకపల్లకీ జోడుపల్లకీలు పట్టించుకునివచ్చి, తన అక్కాబావలనుపంపించమని గోవిందరాజులనడిగాడు. అతడు పింగళకునికి తలవాసి నీళ్లోసి పంచల చాపుపెట్టి, తమ్ముడు వెంకన్నునుపిలిచి ఆలంవారిపట్నం వెళ్ళమన్నాడు. ఈ మాటవిన్నవెంకన్న మాటాడకుండా వెళ్ళిపోయాడు. మరలరాలేదు. పింగళకుడు అక్కదగ్గరకెళ్లి జరిగిందిచెప్పి ఆమెనైనా పయనమై రమ్మన్నాడు. దానికామె నాయీడూ జోడూవారు నన్నడిగితే నేనేం చెప్పేదని వెక్కివెక్కిఏడ్చింది. దీనికి గోవిందరాజు ఓదార్చి, "నీదేవుడు వెంకన్నను నేను పంపుతాను. నువ్వెళ్ళుతల్లీ" అని చెప్పి పంపాడు. పల్లకీలో మంగమ్మ కూర్చుంది. మిట్టపల్లాలవద్దకూడా ఒడి దుడుకులులేకుండా చాకలి సర్వయ్య, మంగలివీరేసు జాగ్రత్తగా తీసు

కెళుతున్నారు. పల్లకీలు రెండూ సాగిపోతున్నాయి. ఇంతలో పల్లకీలోనుంచితొంగిచూసింది మంగమ్మ. ఆపండి పల్లకీలంది. పింగళకునిపిలిచి అదుగోమీబావ వెళ్ళిఅడుగు అంది. వెంకన్న దూరంగా అందకుండా వెళ్ళిపోయాడు. మంగప్రాణం వుసూరుమంది. మరల పల్లకీలు ప్రయాణము సాగించాయి. అయితే వారికంటేముందు కాలినడకన వెంకన్న ఆలంవారిపట్నంవెళ్ళి వారి యిరుగిళ్ళ పొరుగిళ్ళలో పొంచున్నాడు. ఇది తెలిసిన ఆలమందారకునికి కోపమొచ్చింది. రక్షకభటుల్ని పిలిచి వెంకన్నను పట్టుకు తీసుకురమ్మన్నాడు. వారు పట్టుకోవడానికి ప్రయత్నించారు. వెయ్యిమాయలవాడు వేల్పువెంకన్న దొరికితేగా! ఎగువ వీధిలో రక్షకభటులుంటే దిగువవీధిలో వెంకన్న. వీరు దిగువవీధికెళితే అతను మరొకవీధి. మొత్తంమీద రక్షకభటులు అలిసిపోయారు. వేడికోలు మొదలుపెట్టారు. "మీరు మాకుదొరక్కుంటే మాజీతాలూనాతాలూ పోతాయి. పిల్లలూజల్లలూ ఆకళ్ళతోఅలమటించిపోతారు. కనబడు స్వామీ!" అని బ్రతిమాలుతుంటే వెయ్యిమాయలస్వామికి జాలివేసింది. రక్షకభటులకు ఎదురొచ్చి దొరికిపోయాడు. వారు అలంవారిలోగిట్లో దిగవిడిచారు. వచ్చిన వెంకన్నదగ్గరకు మంగమ్మరాగా "మీనాన్న యిస్తానన్న కట్నం యివ్వలేదు. నామీద ఆశలు చాలించుకో" అనిచెప్పి దిగువతిరుపతికి వచ్చేశాడు. తల్లి పేరిందేవిదగ్గర తలవంచుకుని నిలబడ్డాడు. ఆమె ఆశ్చర్యపోయి "మీ అత్తవారింట మర్యాద జరగలేదా? ఏమీ వచ్చేశావు?" అంది "నాకు కంచుచెంబులతో నీళ్ళివ్వలేదు మట్టిముంతలతో నీళ్ళిచ్చారు. కూర్చోడానికి చాలీచాలని పీటవేశారు. పడుకను దిగని చాపులుపెట్టారు. బూరెలొండారు బుడ్డిముంతలతోటి — గారెలొండారు గాదెకింద కప్పలు — అరిశలొండేరు అరవడాని చెప్పుడు. వాళ్ళ అన్నం సున్నం కంపుకొట్టింది. నేను మంగను ఏలను" అన్నాడు. దానికి తల్లి "వాళ్ళేమిజేసు వాళ్ళధనమేమిజేసు? మంగ మనఇంటికొస్తే అన్నీ మనమే నేర్పుకుంటా" మంది. ఇది తలకెక్కలేదు వెంకన్నకు. ఏడుకొండలపైకి ప్రయాణమయ్యాడు. చుక్కలగిరిపర్వతం చూసేడు. నాలుగడుగాలలకీ త్రొక్కిచూసాడు. కాలుకింద ఏకొండా యిమడలేదు. చలువరాతి కొండపైకి ఎక్కాడు. విమలగిరిపర్వతం ఎక్కాడు. దానిపైన కడిమి చెట్టుంది, దానిక్రిందకూర్చున్నాడు. వాళ్ళక్క దుర్గక్క జ్ఞప్తికొచ్చింది. గొంతెత్తిపిలిచాడు, "తమ్ముడా వస్తున్నాను భయంలేద"ని ప్రత్యక్షమై

ఏమి ! నిన్ను మామ మాటన్నాడా ? అత్త తిట్టిందా ? పెద్దన్న గోవిందు ఏమన్నా అన్నాడా ? చేతికంకణాలు చేతినేవున్నాయి. నుదుటిపాసికం నుదుటనేవుంది. కట్టినబట్టలే విడువలేదు. కారణమేమి''టంది. "కొట్టడానికి తిట్టడానికి వాళ్ళెంత ? వారిని నేనే తిప్పికొడతాను. విషయం అదికాదు. నా దగ్గర రొఖంలేదు. అందుకవసరంగా నిన్ను తలచా"నన్నాడు. దానికి దుర్గ నిన్నగాక మొన్న పెళ్ళయినతమ్ముడు చీరయిస్తాడుకాబోలని నేచూస్తే నువ్వనన్నే డబ్బులడుగుతున్నావేంటని హాస్యమాడి. యిదెంతభాగ్యమని చెప్పి తెస్తానని వెళ్ళింది. చెన్నపట్నంనుంచి ఎడ్లబేరగాళ్ళు వస్తున్నారు. మారుబేరగాళ్ళు కోటప్పకొండకు యెదురుగుండా మందవేశారు. ఆ మంద చుట్టూ వాళ్ళుపడుకున్నారు. అర్ధరాత్రివేళ నిద్రపొద్దువేళ దుర్గ ఆ మంద చుట్టూ తిరిగి మధ్యకువెళ్ళి చేతిలోనివిభూతి గోరెడుచల్లింది. వెన్ను చరిచి మాయమయ్యింది. వెంటనే దూళ్ళనోటికి సలుపులు, కాళ్ళకు గాళ్ళుతగిలాయి. బేరగాళ్ళుచూసి బేరమన్నారు. ఇవి ఎవరెట్టిన జబ్బులని విస్తుపోయారు. ఇంతలో కోటప్పకొండకి ఓ గొల్లపిల్ల చల్లలు పెరుగులు అమ్మదెచ్చింది. కోటప్పదేవుడు మారువేషంలో చల్లుందా గొల్లపిల్లా అని దరిచేరుతుంటే హడలిపోయి ఆపిల్ల మందలోపడింది - కోటప్ప ఆవేశంపొందింది. అప్పుడు అక్కడివారంతా పసుపునీళ్ళు దిష్టితీసి, పచ్చని అక్షతలువేసి, కోటప్పమీద కాసులు ముడుపుకట్టుతుంటే పూనకంలో ఆమెద్వారా కోటప్పచెప్పాడు వారికి "పేరిందేవి కొడుకుపేరు వెంకన్న ఏడుకొండలమీద క్రొత్తగా వెలిసాడు. వాడికి తెల్లవారగానే పసుపుగుడ్డల్లో పచ్చనిఅక్షతలు, బండెడుకాసులు ముడుపుకట్టండి. దూడలు ఆరోగ్యంగా వుంటాయి"అన్నాడు. తెల్లవారగానే వారావిధంగాచేసి పడిపడి దండాలుపెట్టుకుంటూ "మామంద అంతా చల్లగా వుంటే వచ్చిన లాభం అంత మీకేఅర్పిస్తాం" అనిమ్రొక్కి బెజవాడసంతకు తోలుకెళ్లారు. అమ్మకం కాసులు రాసులుపడుతున్నాయి. ఇంతలో ఒకడు అన్నాడుకదా ఏడుకొండలవాడికిడబ్బెందుకు మూడుచూపాయల అరిటిగెల యిద్దాం, ఆరగిస్తాడు అన్నాడు. అంతే వాళ్ళ అమ్మకాలు చల్లబడ్డాయి. అప్పుడు అందులో పెద్దన్న అన్నాడుకదా "వడ్డీకాసులు తెచ్చి వడ్డీకడతాము, మా లాభాలు సజంగా మీకే అర్పిస్తాము'' అని మళ్ళీమ్రొక్కి కాళహస్తి సంతకు తోలుకెళ్ళారు. మళ్ళీ అమ్మకాలు కాసులు రాసులే.. వెంటనే ఏడుకొండలవాడిదగ్గరకెళ్ళి అమ్మకంలాభాలు ప్రోగులేసి "నీమొక్కునీకిచ్చాము,

మా యిళ్ళకు మేము వెళుతున్నాము" అని వెళ్ళిపోయారు. ఇదితెలిసిన గోవిందరాజు భార్యతో "విన్నావాలక్ష్మి ! – మా తమ్ముడు వెంకన్న దేవుడయ్యాడు. నేవెళ్ళి చూసొస్తా"నని ఏడుకొండలపైకివెళ్ళాడు. ఇక్కడ చేరగాళ్ళుపోసిన కాసులరాసులు చూశాడు. పనసపాడువెళ్ళి పనివాళ్ళను తెచ్చి తమ్ముడు వెంకన్నకు గుళ్ళుకట్టమన్నాడు. వాళ్ళు బజారుకెళ్ళారు. బంగారం తెచ్చారు. శంకుస్థాపనచేశారు. నల్లరాళ్ళు తెచ్చి బాడితలతోచెక్కి మలుపులు తీర్చికట్టారు. మండపాలచుట్టూ సున్నంతో కట్టిన గోడలప్రాకారాలు తీర్చారు. గుడికట్టి గుడిమీద శిఖరాలుపెట్టేరు. పైన పసిడికుండపెట్టారు. ఎదుట గరుడస్థంభాలెత్తారు. ఏడురోజుల మధ్యాహ్నానికి గర్భగుడికట్టారు. ఆగుడిలో వెంకన్న ప్రతిమనుంచారు. పనిజరుగుతున్నంతకాలం చెల్లమ్మ కోడలు గొల్ల అచ్చమ్మ పనివాళ్ళకు చల్లమోసేది. ఆపని అయిపోయింది. పనసపాడుపనివారు వెళ్ళిపోతూ "నీచేతి ఫలహారానికి ఋణపడి ఉన్నాము. వెళ్ళిపోతున్నా"మని చెప్పుతుంటే గొల్ల అచ్చమ్మ వారిని తనపేరుమీద గర్భగుడికెదురుగా మండపం కట్టమనికోరింది. అప్పుడువారు "నువ్వుముందు చెప్పలేదు. ఉన్న సొమ్మంతా అయిపోయింది. ఇక ఏంచెయ్యగలం ?" అన్నారు. ఇదివిన్న గొల్లఅచ్చమ్మ "ఓ అన్నలారా ! ఉలి, బాడిత పట్టుకొని నాతోరండని రాతిశిలలదగ్గరకి తీసుకెళ్ళి తెగ్గొట్టమంది. అవి తెగ్గొట్టగానే అందులో బంగారం 750 కాసులుంది. అమ్మగారింటికెళ్ళి 200 తెచ్చింది. ఈ 950 తీసుకొనివెళ్ళి బాడితలతో బండరాళ్ళు చెక్కేరు. మండపంకట్టి గర్భగుడి ఎదురుగా గొల్ల అచ్చమ్మపేరువేశారు. ఆడకోతుల్ని మొగకోతుల్ని వేశారు. కోతులకోనలాతయారయ్యింది. ఇక ఏవేపుచూసినా ఎవరూ కనబడరు.

ఇదిలావుండగా ఆప్రాంతాన ఒకపల్లెలో బీబమ్మపుట్టింది. బీబమ్మ పుట్టగానే తల్లిదండ్రులు చనిపోయేరు. ఆమె ఎదిగింది. అప్పుడు ఆమె అన్నలు పాంచాలి ఫకీరు ఆమెనుతీసుకొని ఆవూరు వదలి అర్థానపడవికి వచ్చారు. కడిమిచెట్టుక్రింద మకాంపెట్టి ఉట్టెలు సట్టిలు చెట్టుకికట్టేరు. అదే మువ్వలంవారితోట. చెల్లెలిని అక్కడ ఒంటరిగావుంచి పాంచాలి ఫకీరు వేటకెళ్ళి ఏపూటకాపూట శేరుబియ్యం, కొట్టినపిట్టమాంసం తెచ్చి యిస్తుంటే ఆమెవండిపెడుతుండేది. ఈతోటలో కన్నెకాడు వేల్పువెంకన్న. ఒకరోజు తెల్లవారగట్టే పాంచాలి ఫకీరు వేటకెళ్ళిన సమయంచూసి మూడుపోగుల

జందెం ముందుకేసుకొని, అంగవస్త్రంకట్టి, వొళ్ళంతా విభూతిపూసుకొని, తులసితావళములు ధరించి, చేతితో సితారుమీటుతూ ఆమెదగ్గరకెళ్ళి "ఓచిన్నదానా! ఈఅడవిలో ఏముంటావు? నువ్వు ఆడదానివికావా? భయంలేదా? ఈపులులు సింహాలు నిన్నుతినేస్తాయి. ఈ బండరాళ్ళమీద ఏముంటావ్? అదిగో అదేనాఅద్దాలగుడి. అటుచూడు. నాకూడావస్తావా - బంగారుతీగలు నీమెడలోవేస్తా, పట్టుచీరలిస్తా, నిన్ను రాణీనిచేస్తా - నేరాజునౌతా. నా బంగారపుకోనేట్లో స్నానమాడిస్తా, భక్తుల బుర్రలు గొరిగించి దక్షిణగా చేస్తా. ఇకముందు ఇది పెద్ద తీర్థమవుతుంది. వాలుజడలవాళ్ళు మంగచుట్టాలు. బోడిగుళ్ళన్నీ నీకుచుట్టాలు. నీకు వళ్ళంతా వజ్రదేహముచేస్తా రా.......అంటుంటే దానికి బూబి అలాంటి ఆశలేంవద్దని పొమ్మంటూ "నేనుఘోషాచిన్నదాన్ని. నన్నంటుకోరాదు. నా అన్నలు పాంచాలి, ఫకీరు వస్తే నిన్ను నిలబెట్టి ప్రాణంతీసేస్తారు. పచ్చిరక్తంత్రాగే కసాయివాళ్ళు - నిన్నుబాకుతోను, బల్లెంతోను పొడిచేస్తారు. వారువచ్చేసమయమయింది. వెంటనే పో" అంది. దానికి వెంకన్న "నేను పోను. వాళ్ళు నీకు అన్నలయితే నాకు బావలే - నిన్ను విడిచి నేను నిమిషముండలేను" అంటుండగా వారువచ్చారు. వేయి మాయలవెంకన్న జాతికొంగ అవతారంఎత్తి ఆచెట్టుపై ఉన్నాడు. అల్లంత దూరాన అన్నల్నిచూసినబూబి బులిబులిదుఃఖాలుతీస్తూకూర్చుంది. వారు చెల్లెల్ని "ఏవమ్మా ఎందుకేడుస్తున్నావు? ఈ అర్ధానపడవికి ఎవరైనా వచ్చారా? నీకు అమ్మజ్ఞాపకం వచ్చిందా? బాబుజ్ఞాపకంవచ్చాడా? నీకు వస్తువులుకావాలా? సొమ్ములుకావాలా? నాతో చెప్పు చెల్లెమ్మా" అని సముదాయిస్తుంటే చెల్లెలు అన్నలతో చెప్పిందియిలా. "నల్లనల్లనివాడు. నామాలుకలవాడు. నన్నుదుర్భాషలాడి వెళ్ళేడు" అనగానే అన్నలు కోపంతో "వాడేమన్నాడు? ఆనవాళ్ళేమిటి?" అని గద్దించారు.

దానికామె "అతనివొళ్ళంతా వజ్రదేహం. ముఖానముత్యం కనబడు తోంది" అంది. దానికాతడు అర్ధంచేసుకొని "అతడు పేరుందేవికొడుకు, పేరు వెంకన్న. మేము కలిసిచదువుకున్నాం. మాపేరుచెబితే నీదగ్గరకు రాడులే. నీకు భయంలేదులే" అన్నాడు.

ఆమరుసటిరోజు వేకువను మరల అన్నలు వేటకెళుతుంటే చెల్లెలు "నిన్న వచ్చినవాడు మళ్ళీవస్తాడు. నన్నిలాగవదలివెడితే మీకుదక్క-

నేమో, కడిమిచెట్టుక్రింద గొయ్యితియ్యండి. ఆగోతిలో నన్ను దాచి పైన కడిమిఆకులుకప్పివెళ్ళండి" అంది. వారు ఆవిధంగాచేసి వేటకెళ్ళేరు. ఇప్పుడు వెంకన్న మామూలురూపంలోనికివచ్చేసి చెట్టుమీదనుంచి క్రిందకురికాడు. కడిమిఆకులు కాళ్ళతోతన్నేడు. అవి కాళహస్తి పాయను కలుసుకున్నాయి. గోతిలో బూబమ్మనోరు మూసి "నన్నంటరాదన్నావు - ముట్టరాదన్నావు - ఘోషాచిన్నదానన్నావు - ఇప్పుడేం చేస్తావ్" అంటే బూబమ్మ గోతిలో మిడిగుడ్లువేసిచూస్తోంది. అతను పైకి లేవదీసి ఏడుకొండల్లోకి ఎత్తుకు పోయాడు. గుడిలోకి ఏవరూరాకుండా రాగితలుపులు వేసేశాడు - వెండితలుపులు విడిరాకుండా చేశాడు. కంచుతలుపులు కదలకుండా వేశాడు. గుహ్లో బూబమ్మ ఘొల్లుమంది. అదిచూసి వెంకన్న ఓదార్చబోతే నా అన్నల్ని ఎప్పుడుజూస్తానంటూ ఏడవసాగింది. ఇకలాభంలేదని పాంచాలి ఫకీరును తీసుకువస్తానని మూడుపోగులజందెం ముందుకేసుకుని, రాగిబుడ్డిముంత చేత్తోపట్టుకుని, అరిగినగంటం, చిరిగిన పుస్తకం చంకనపెట్టుకుని జేబులో చిటికెడు విభూతి వేసుకుని బయలుదేరి వెళ్ళి గుమ్మందగ్గరకూర్చున్నాడు.

అక్కడ కడిమిచెట్టుక్రిందకువచ్చిన పాంచాలి ఫకీరు గోతిలో చెల్లెలు లేకపోవడంతో ఉగ్రకోపి అయినాడు. కళ్ళు ఎరుపెక్కేయి. "ఇది వెంకన్న పనే - వాడి అష్టాలగుళ్ళు బ్రద్దలుకొడతాను. ఈ దెబ్బకు వాడిగుళ్ళన్నీ దద్దరిల్లుతాయి - ఆగుళ్ళన్నీ నాగలోకంవెళతాయి." అని గుడివేపుకు వస్తుంటే వెంకన్న ముసలిబ్రాహ్మణునిలా ఎదురెళ్ళాడు. ఈ ముసలిబ్రాహ్మణ్ణి ఏమన్నా అంటే పాపంఅని వారు అతనికిదారిచ్చారు. వెంటనే వెంకన్న దారట్టువెళ్ళినట్టేవెళ్ళి జేబులోని విభూతితీసి గుప్పెడు చల్లేడు. వారు జోడు బోడిగుళ్ళయ్యారు. ఆ బోడిగుళ్ళను దెచ్చి బూబమ్మకు చూపి "ఇదుగో నీ అన్నగార్లు - ఏడవకే" అన్నాడు. వారిని బంగారపుకోనేట్లో స్నానమాడించి చూపాడు. అప్పుడు ఆమె సుఖంమానింది. వెంకన్న అన్నంవండమంటే సామానుతెమ్మంది. వెంటనే కుమ్మరిగొల్లయ్యను కేకేశాడు. ఏడుకుంచాల బియ్యం వానతెమ్మన్నాడు. చాకలి సర్వయ్యవచ్చాడు. బజారుకెళ్ళొచ్చి బియ్యంతెచ్చేడు. ఆమెబియ్యంలోనివడ్లు, బెడ్డ ఏరకుండానే బియ్యంబుట్టలో పోసి బంగారుకోనేట్లో ఒకమునుముంచి ఏడుకుంచాలకు ఎసరెట్టి అందులో పోసింది. అది ఉడికిందాక మెతుకు ఉడకందాక మెతుకు-దాన్నిచల్లారబోసింది.

బంగాళాదుంపపోపెట్టింది. చితుకుచితుకు చింతకాయకూరొండిది. మొత్తంఏడు ముద్దలుచేసి వెంకన్నసుపిలిచి "నీకు కానికూడుదొరికింది కడుపునిండాతిను" అంది. తొలిముద్ద, మలిముద్ద, మూడు నాలుగుముద్దలుతిన్నాడు. అయిదో ముద్ద దగ్గరుంది. "మరి నా అన్నగార్లను నేను మరచియున్నాను. నువ్వు మంగనుకూడా అలాగే మరచివుండాలి. అలావుంటానని చేతిలో చెయ్యి వెయ్యి" అంది. దానికాతడు "తీర్థాలు యాత్రలు యిక్కడ సాగుతాయి. ఏడుకొండలకొచ్చినవాళ్ళ బుర్రగొరిగించికొండదింపుతాను. వచ్చేవాళ్ళువస్తుంటారు – వెళ్ళేవాళ్ళు వెళుతుంటారు. వాలుజడలవాళ్ళు మంగకుచుట్టాలు, బోడిగుళ్ళవాళ్ళు నీకుచుట్టాలు" అని చెప్పబోతుంటే మాటల్లోపెట్టి అసలు సంగతి మరిపించకని తానడిగినదానికి సమాధానం సూటిగాచెప్పమంది. ఇంతలో మంగను తెస్తానో లేనో నేను చెప్పలేను అన్నాడు.

ఇక అక్కడ మంగమ్మకు 18 సం॥లు వయసొచ్చింది. మంగ వెండిమొండిచేట, దొడ్డికర్ర, చంకన ఇత్తడిబాల్చి, జాలారిబొమ్మలతో తోటిపిల్లలతో ఆడుతోంది. ఆటలలో ఆవుపాలుతీసి అన్నాలువండి బాలలకు వడ్డిస్తోంది. లక్కపిడతలుపెట్టి గుజ్జనగూళ్ళాడుతోంది. అంతలో ఒక పిల్ల ప్రక్కపిల్లతో అన్నదిగడా "పెద్దక్కా ! విన్నావా ? మంగమ్మ మొగుడు తురకకూడుతిని దుష్టుడయిపోయాడు. కులభ్రష్టుడయ్యాడు" అంది. దానికి ప్రక్కపిల్ల ఆమాట మంగకు చెప్పొద్దంది. మరొక కొంటె పిల్ల మంగమ్మ ఏడిస్తే ఎలాగుంటుందోచూద్దాం – చెప్పుదామంది. దానితో వారంతా మంగతో యీ విషయంచెప్పి నీకోసం యికరాడని, నిన్నేలడని చెప్పేశారు. ఈమాటవిన్న మంగమ్మ ఆనాడే ఆటచాలించింది. పుట్టింది మొదలు తండ్రిగదిలోనికి అడుగిడని మంగ విసురుగా తండ్రిగదిలోకి పరుగు తీసింది. మంచంమీదకూలబడింది. మువ్వల దుప్పటి ముసుగెట్టింది. ఘొల్లుమని గోలెట్టసాగింది. ఈసంగతి తెలియని ఇనుదేవి వెండిగిన్నెలో వెన్న పైడిగిన్నెలో పాలు పట్టుకొని ఆడడానికి వెళ్లిన మంగకోసం ఎదురు బయలు దేరింది. ఎక్కడా మంగకనబడలేదు. ఆశమ్మను పోశమ్మను అడిగింది. "మీపిల్లలతో మంగ ఆడుతోందా" అని. వాళ్లు లేదన్నారు. మాపిల్లలతో రాలేదన్నారు. ఆమె వీధివీధీతిరిగింది. జాడ తెలియలేదు. ఇంటిలో ఉందేమో వెతకమన్నారు. తనఇల్లు వెతకసాగింది. చివరికి భర్త పడుకునే

గదిలోకిచూసింది. బిడ్డనుచూసి ఘొల్లుమంది. ఇరుగుపొరుగువారికి విన బడింది. ఆలంవారియింట్లో ఎవరుపోయారో అని విస్తుపోయేరు. మంగమ్మ తల్లితో చెపుతోంది. "నేను తమ్ముడిలాగ మగవాడినయితే నాకింతకష్టం లేకుండాపోను. నాకీ దుఃఖంలేకుండాపోను - ఎందుకొచ్చినబ్రతుకు నాబ్రతుకు? అడవిలో మానయిపుడితే మెరుగు - మీరిస్తానన్న కట్నం యివ్వలేదు. తురకకూడు తింటున్నాడు - నాకోసం యికరాడు - నాకు సారె చీర కట్టి సాగనంపండి" అంది. ఇనుదేవి ఆలమందారకుడికి కబురెట్టింది. వెంటనే ఆల మందారకుడు కచేరీకట్టేసి వచ్చేశాడు. "వాడు ఏలితే ఎంత? ఏలకుంటే ఎంత - నేను బంగారుకొట్టులు విడగొట్టాను. వెండికొట్టులుగూడ విడగొట్టాను. కావలసినంత ఐశ్వర్యం - వాడులేకపోతే ఎంత" అన్నాడు. దానికి మంగ "సర్వం తెలిసినవారు. మీకు నేను చెప్పదగినదాన్నికాను - నా ఏడుకొండల వారు నాకు కావాలి గాని మీడబ్బేంచేస్తుంది? నాకు సారె చీర పెట్టిసాగనం పండి - ఏడుకొండలికి నేవెళ్ళిపోతా - లేదా నేను నూతిపాలో గోతిపాలో అవుతాను" అంది. ఆ మాటలువిన్న ఆలమందారకుడు తక్షణం కమ్మర్లకు కబురెట్టాడు. ఉల్లిపొరలాంటి ఊక - మంచిగంధం మంట. ఉదేతిత్తులు ఊదుతున్నాయి. సమ్మెటపోటులు - కాగేయిత్తడి - మల్లెపువ్వుఛాయ చెంబులు, బిందెలు, గాబులు తయారయ్యాయి. ఏడుకావిళ్ళసారె, మంచాలూ కుంచాలూ, నెయ్యిన్నొక్క- కావిడిబయలుదేరాయి. బొడ్డున భాగ్యంతెలిపే గంటలతో సన్నకొమ్ముల దోరఆవులు, పిక్కలుసన్నని పిడిగొడ్యల ఆవులు - నడుమునన్నని నాగబొల్లావులు తోలుకుని వెంటబయలుదేరాడు పింగళకుడు. వెళ్ళేమంగను విడువలేక ఏడుస్తూ "అమ్మా! నా ముద్దుల గుమ్మా! నువ్వెళతావా? నాకు ఆడపిల్ల లేకుండాచేసి వెళతావా? శివరాత్రి రోజున శివజాగారాలుచేసేను - మాఘస్నానాలుచేసేను - ఇవే నాకు నిధులు. పెళ్ళిలేని బ్రాహ్మలకు పెళ్ళిళ్ళు చేసేను - వడుగులేని బ్రాహ్మణులకు వడుగుచేసేను - నూతులులేనిచోట నూతులు త్రవ్వించాను - అన్నసత్రాలు పెట్టించాను - ఇన్ని మంచిపనులు ఫలితంగా నువ్వుపుట్టావు. ఇంతకాలం వెన్నలో, పాలకుండలో పెంచి బండపెంటడికి పెళ్ళిచేసి గోతిలోకి తోసేశాం. నేతిలో గరిటలా నిన్ను పెంచా - నూతిలోచేదలాగ పారువాడతారు. పొద్దు పోయి పొరుగింటికెళ్ళవోకమ్మా, ఒకరిపిల్లలజోలికి వెళ్ళొద్దమ్మా. వాళ్ళం

దరూవచ్చి నిన్నాడతారు. అక్కడ నీకు దిక్కేమిటితల్లీ ! వాల్చినరోకళ్ళు దాటబోకమ్మా. నువ్వువెళ్ళేవి చీకటి గుళ్ళు. చీకటిపొద్దునేలేచి సిరిముఖం కడుగు" అని "ఇకయిక్కడ నాయింట్లో తద్దెవరుంటారు ? గుజ్జనగూళ్ళెవ రాడతారు ?" అని చెలపోతూ "నీ తండ్రిని చూసినట్లు మామనుచూడు. నన్నుచూసినట్లు అత్తనుచూడు. నీ తమ్ముల్ని చూసినట్లు బావల్ని చూడు" అనిబిడ్డను కౌగలించుకొని చెప్పింది.

మంగమ్మ జతగాళ్ళందరూ "అక్కా ! నువ్వెడతావా" అని దీనంగా ముఖాలేసి బావనడిగామని చెప్పమన్నారు. పెద్దవాళ్ళందరూ "ఆడదాని బ్రతుకు అరిటాకులాంటిది. ముల్లువచ్చిమీదపడినా తప్పు అరిటాకుదే అంటారు. మేమంతా నీదేవుని అడిగామనిచెప్పు" అని హితోక్తులుపలికారు. "నీ అన్నగారు చుక్కల్లో చంద్రుడివంటివాడు. నీ తల్లిదండ్రులు ఆకాశం, భూదేవి లాంటివాళ్ళు. కీర్తిగల యింటబుట్టావు. కీర్తితేతల్లీ ! నిన్ను గన్న ఋణం తీరుతుంది" అని సాగనంపారు. ప్రయాణం ప్రారంభమయింది. ఆలంవారిపట్నంలో ఎత్తినసారికావిళ్ళు విపులగిరిపర్వతం దాకావున్నాయి. ఇదిచూసిన వెంకన్న బూబమ్మతో "నీకెతురాలు మంగమ్మవస్తోంది. మీ కిద్దరికీ అంటుకుంటే నేనిలువలేను. నేను మళ్ళీ అవతారం దాల్చాలి" అని చాకలి సర్వయ్య, మంగలి పీరేసు, కుమ్మరి గురవయ్య ముగ్గురునొకర్లనూ ముందంపేడు. మూడుపోగులజందెమేసుకున్నాడు. ముఖాన విభూతిరేఖ పెట్టాడు. కాషాయిపంచెకట్టేడు. అరిగిన గంటం, చిరిగినపుస్తకం, రాగిబుడ్డి ముంత పట్టుకొని ముసలి బ్రాహ్మణుడిగా తయారయి మంగాదేవికెదురె ళ్ళాడు. మంగమ్మ ఆముసలిబ్రాహ్మణ్ణి చూసింది - పల్లకీలోంచి గభాలున ఉరికి దండాలు తాతయ్యా దండాలంది. ఆముసలిబ్రాహ్మడు తాను వెంకన్న గుడిదగ్గర నైవేద్యం చెల్లించే బ్రాహ్మణుడనని ఎరుకపరచుకొన్నాడు. తను తెచ్చినసారెకు ఏలోటన్నా ఉన్నదా అని, ఏమైనాలోటైతే తెచ్చుకుంటానని చూడమంది.

"మంగమ్మా ! నువ్వెంతసారితెచ్చినా నీమొగుడు నీగొడవ విన డమ్మా, నీవూసుతేడు. బూబీబూబీ అంటాడేకాని నిన్నేలడమ్మా - అత్త మీద కాపురంకూడా నువ్వుచెయ్యలేవే. ఏడు కొండలమీద అన్నంవండాలి, ఆ అన్నాలు నువ్వుండలేవు" అంటుంటే, "నేను అత్తమీద కాపురం

చెయ్యగలనని, అన్నాలువండగలనని మంగమ్మ ధీమాగా సమాధానమిచ్చింది. దానికతడు సారెపెట్టాముమ్మారుతిరిగి ముందుకువచ్చి "సారెలో కరివేపాకు లేదన్నాడు. నీకుకాపురంలేదన్నాడుపైగా అప్పారిలో ఎక్కడా కరివేపాకులేకుండా లద్దెపురుగై నాకేశాడు.

అప్పుడు మంగమ్మ బ్రాహ్మణవీధికెళ్ళి బ్రాహ్మణక్కల్లారా కొంచెం కరివేపాకు ఇవ్వండంది. వారుచూసి లద్దెపురుగువచ్చి నాకేసిందని చెప్పారు. కాపువారివీధికెళ్ళింది. అక్కలారా! అమ్మలారా! మీదొడ్లో కరివేపాకు కొంచెంఇస్తారా? అంటే నువ్వుచూసుకోమంగమ్మా చూసుకో అన్నారు. కావాలంటే మొగకుమొగ్గే చూసుకుపోయింది. కమ్మరివీధికెళ్ళింది. కరివేపాకుచెట్లు పుల్లరేగుచెట్లయ్యాయి. దేవి మంగమ్మ అడవిలో అష్టపడింది. నడిచేకాళ్ళకు పుళ్ళుపడ్డాయి. చేతులకు రక్తాలుచిమ్మాయి. ఎందుకొచ్చిన బ్రతుకు నాబ్రతుకనుకొంది. అద్దానపడవిలో ఘొల్లుమంది. ఆయేడుపు గోవిందరాజులకు వినిపించింది. భార్య లక్ష్మితో అంటున్నాడు. "విన్నావా లక్ష్మీ! మామరదలు మంగమ్మ సారట్టుకొస్తోంది. నేను ఎదురెళతా" అని బయలుదేరాడు. అతనిరాకనుచూసిన మంగమ్మ "నేను మావాపగారికళ్ళ బడను, అమ్మా భూదేవీ! నాకుదారియ్యి" అని ప్రార్థించింది. భూమి భళ్ళున రెండుగా బ్రద్దలయింది. గజంలోతులో మంగకాలువ్వతీరింది. పైన గజనిమ్మలు కమ్మేశాయి. ఆదారిన వెళుతూ గోవిందరాజులు సందుసందులోనూ తొంగిచూశాడు. అప్పుడు కోపంతో మంగమ్మ బావగారితో అంటుంది "మీ పేకసతమ్ముడికి పెళ్ళెలాచేశారు? అక్కరలేనివాడికి ఎందుకుచేశారు?" అంటే గోవిందరాజువిని బాధపడి "నాతమ్ముడు వెంకన్న ఏలితేఎంత? ఏలకుంటేఎంత? నాకూడారావమ్మా! నేనుచూసుకుంటా కన్నకూతురులా" అన్నాడు. దానితో మంగమ్మ వెనక లేచివస్తుంటే గోవిందరాజు ముందు నడుస్తున్నాడు. ఉప్పుకోనేరుదగ్గరకువచ్చారు. గుడిలోనుంచి లక్ష్మి పసుగెత్తుకొచ్చి మంగను రమ్మనిపిలిచి "నామరది వెంకన్న ఏలితేఎంత ఏలకుంటే ఎంత? కన్నకూతురులా చూసుకుంటా" అని కావలించుకుంది. కాని మంగమ్మ ఎందుకొచ్చినబ్రతుకు నాబ్రతుకని ఉప్పుకోనేట్లో దబ్బున ఉరికింది. గంగాదేవిపాపాలు బ్రద్దలయ్యాయి. పటాపంచలై పారిపోయాయి. మొగకెరటమొచ్చి ముంచేసింది. ఆడకెరటమొచ్చి పసుపు, కుంకుమ

రవిక, చీర యిచ్చి లక్ష్మీదేవిఒడిలోపడేసింది. మంగా లక్ష్మీ కలిసి ఉంటు న్నారు.

చెన్నపట్నంకోమట్లు మంగపేరుచెప్పి బొమ్మలవ్యాపారాలు మొదలు పెట్టారు. చిన్నవ్యాపారం పెద్దదయింది. కనకసిరి లక్షలు కురిపించింది. ఆకోమట్లు చందనంకర్రలు తెప్పించారు. మంగమ్మ రథాలుచేయించారు. గుళ్ళూ గోపురాలూ కట్టించారు. పసిడికుండలెత్తారు. మంగమ్మ చెరువు త్రవ్వటానికి మంగాపురం ఉప్పర్లువచ్చారు. చద్దికూ వేళ్ళకు సగంత్రవ్వేరు. సాయంత్రంవేళకి పూర్తిగాత్రవ్వేరు. చెరువులో స్థంభాలెత్తారు. మంగమ్మ పట్నం కట్టించారు. గుళ్ళో మంగమ్మనుపెట్టారు. మంగమ్మతీర్థాలు సాగించారు.

ఒకనాడు అర్ధరాత్రివేళ నిదురపొద్దువేళ వెయ్యిమాయలవానికి మంగమ్మజ్ఞాపకంవచ్చింది. వెంటనే బయలుదేరివచ్చాడు. మంగమ్మ నిద్రపో తోంది. "తలుపుతియ్యిమంగా! తలుపుతియ్యి" అని పిలిచాడు. మంగమ్మ మేనుమరచి నిద్రపోతోంది. సేవచేస్తున్న ఏడుగురు మందరలు "అర్థరాత్రి దొంగపై వచ్చావా దొరపై వచ్చావా దోచుకుపోవడానికి? తెల్లవారిప్రొద్దున మాతల్లి మేల్కొంటుంది. ఇవాళపోయి రేపురా. నువ్వు ఇప్పుడుపోకుంటే మాఏడుగురం ఏడురోకళ్ళతో నిన్ను చింతపండులాదంచుతాం పో" అన్నారు. అప్పుడు వెంకన్న "విన్నావా మంగా! ఇవాళపోతే రేపుపోతానా? ముగ్గురు నౌకర్లను ముందేసుకొని మందుగుండుసామాను వెంటదెచ్చి నీగుళ్లూ గోపు రాలూ కొట్టిపారేసి కాళహస్తిపాయలో కలపకపోతానా? అలాచెయ్యకుంటే గోవిందరాజు తమ్ముణ్ణేకాను" అని ప్రతిజ్ఞచేసి వెళ్ళిపోయాడు.

తెల్లవారాక ఆమెమేల్కొనగానే ఏడుగురు మందరలు ఆమెవద్దచేరి "మంగమ్మతల్లీ! ఇదివిను. రాత్రి నీదేవుడు నీగుళ్ళోకొచ్చాడు. నువ్వు ఒళ్ళుమరచి నిద్రపోతివి తల్లీ. నిదురలేపటానికి మావశముకాక పొమ్మ న్నాము" అని చెప్పేరు. ఆమాటవిన్న మంగమ్మ నొచ్చుకుంది. వాళ్ళు చేసినపనికి బాధపడి "నాభర్తను నేనుచూసుకోకుండా చేశారు. ఆయన మందుగుండుసామాను తెస్తారు. ఈ గుళ్ళూ గోపురాలూ కొట్టించేస్తారు" అని కంగారుపడింది. గోవిందరాజులకు కౌగితంమీద కాటికగోటితో చీటీ

వ్రాసిపంపింది. ''బావగారూ! రాత్రి మీతమ్ముడు నాగుర్కొస్తే తలుపు తియ్యకపోవడం నాదేతప్పు. దానికతడు ఈగుమ్మ పగలగొట్టరానివెళ్ళేడు'' అని వ్రాసింది. దానికి గోవిందరాజు "ఈనేతప్పుకి మాతమ్ముడు నిన్ను ముక్కముక్కలుగా కండలుకోసి కాకులకీ, గద్దలకి ఎగరేస్తాడు. మేమేం చెయ్యలేం. వాడుసామాన్యుడుకాడు. నీదేతప్పు. అతనినెలాగోలాగ నువ్వే సరిదిద్దుకోవాలి" అని కబురెట్టాడు.

అప్పుడు ఆమె అయిదుగురుబాలల్ని చెరువుదగ్గరెట్టింది. ఏడుకొండల వాడొచ్చాడు. మొదటిబాల్ణ్ణడిగాడు మంగమ్మపట్నం ఎలాగుంటుందని. మంగమ్మపట్నం మస్తాబయిందన్నాడు రెండోవాణ్ణడిగాడు. మామంగమ్మ పట్నం కొబ్బరిపండిళ్ళతో నిండిపోయిందన్నాడు. వెంకన్నకు కోపం దిగిపోయింది. మూడవవాణ్ణడిగాడు – ''ఆపట్నంలో ఏమంకమూసినా ఏకపెండివంటలే" అన్నాడు. నాలుగోవాణ్ణడిగాడు – "మీ పెద్ద మాపెద్ద గంగబొల్లెమ్మ కిళ్ళమ్మచెరువుకి నీళ్ళొచ్చాయి. తాతగారొచ్చి తన్నిపోడిచింది – మావగారొచ్చి మంత్రమేసింది" అన్నాడు. అయిదవవాణ్ణి అడిగాడు "గారెలూ, బూరెలూ మాఅమ్మవండింది. దాసకెట్టకుండా మాకెట్టింది. ఏడుకొండలవాడు మాఅక్క మొగుడు" అన్నాడు. దెబ్బకు కోపం పూర్తిగా దిగిపోయింది, వెంకన్న మంమగుండుసామాను పారేసి ముందుకెళ్ళాడు.

ఇక అక్కడ మంగ జిలుగుపట్టులు, జిల్లేడిగొళ్ళు ధరించింది. వెండి తలగడ మంచాలపై వాళ్ళు వత్తకుండా మల్లెలుపోసింది. దేవిడీతలుపులు బారెట్టింది. వంటింటిగదిలోకి కుక్కవెళ్ళినట్లు వెంకన్నవెళ్ళి పట్టిమంచం మీదపవళించిన మంగనుచూసి ముగ్ధుడైపోయి ''మంగా ! యీ పూలదండ తీసుకుని వేసుకో" అని యిచ్చాడు. దానికి ''మంగ మీరు ఇన్నాళ్ళదాకా దేనికిచ్చారో దానికేయివ్వండి" అంది. "మంగా ! ఇదిగో పట్టుచీరకట్టుకో మనఏడుకొండల్లోకి వెళ్ళిపోదాం రా" అన్నాడు. దానికి మంగ "నేను అక్కడికిరాలేను. నేనువస్తే నాపట్నం పాడైపోతుంది. నా తీర్థాలుఆగిపోతాయి'' అంది. కోపంవచ్చింది వెంకన్నకు. కళ్ళెర్రబడ్డాయి. 'నువ్వు నామాట వినకుంటే నీగుళ్ళూగోపురాలూ కొట్టిపారేస్తాను. కాకపోతే సిపాయిలో కలిపేస్తాను. నేను గోవిందరాజు తమ్ముణ్ణి – రే' అన్నాడు. మంగ భయపడింది. బయలుదేరింది. చింతనున్న గ్రాముపాముతోక గిరగిర

త్రిప్పి ఒకదెబ్బకొట్టేడు. ఏడునిమిషాలకి ఎగిరెళ్ళిపోయారు. లోపలికెళ్ళి బీబీనిపిలిచాడు. మంచిమంచిపువ్వులు వొళ్ళోపోసుకుని పరుగెత్తుకొచ్చింది బీబీనాంచారమ్మ. వెంకన్న కుడివేపుతొడమీద కూర్చుంది. నేను రానంటే బలవంతంగా తీసుకొచ్చావు నా సంగతేమంది మంగమ్మ. మంగమ్మకు ఎడమతొడచూపి కూర్చుండబెట్టుకుని శిలలై పోయారు. ఆనాటినుండీ వేల్పులై భక్తులకోర్కెలు తీరుస్తున్నారు. ఇదీ ఆ జానపదగాథ.

దీనికిసాక్ష్యంగా తిరుమలలోని కోనేటిని అలంవారికోనేరుఅనీ (దీనిని మామగారయిన అలమందారకుడు త్రవ్వించారనీ) కథలో చెపుతారు. తిరుచానూరును మంగమ్మపట్నం అనీ, శ్రీలక్ష్మి భూలక్ష్మి దేవీలను మంగమ్మా, బీబీ నాంచారమ్మలనీ, ఆఏడుకొండల్నీ యీకథలో చెబుతున్నట్టు మోకాటి పర్వతం, చుక్కలగిరిపర్వతంవంటి పేర్లతో యీనాటికీ పిలుస్తుండడంకద్దు. ఆలయంలో ముఖమండపం గొల్లచ్చమ్మ కట్టించిందని కథలోచెబుతారు. ఇప్పటికీ దీనిని గొల్లచ్చమ్మ మండపం అనడం ఉంది. ఈ కథని 'వెంకన్న బాబు సేవ' అని కోలసంబరంపాటగా పాడతారు.

ఇలాంటికథలు పెద్దదేవుళ్ళపైనేకాక గ్రామాల్లోని చిల్లరమల్లర దేవుళ్ళపైనకూడా వినిపిస్తుంటాయి. అయితే యివి కాలగర్భంలో కలిసి పోతున్నాయి. పరిశోధకులు వీనిపై దృష్టిసారిస్తే తెలుగు జానపదసంపద మరింత సుసంపన్నంకాగలదు.

## వీధి నాటకాలు

తెలుగుదేశపు జానపదకళలలో నాటకం కూడా ఒకటి. ఆదినుండీ ఇది ఏదోరూపాన తెలుగు పల్లెల నడివీధుల్లో నడయాడుతూనే ఉంది. ఒక నాడు అది ప్రత్యేకించి వీధిభాగవతులచేతుల్లో వివిధ రీతులా పోషింపబడేది. వీరి తోలుబొమ్మలాటలూ జముకుల కథలూ ఇతర కళారూపాలూ యక్ష గానాలూ నాటకప్రక్రియకు సంబంధించినవే. అందుకే వీనిని వీధినాటకా లన్నారు. 20వ శతాబ్ది పూర్వార్థంలోకూడా ఈ ప్రదర్శనలు అక్కడక్కడ కనిపిస్తూనేవుండేవి.

ఈభాగవతులు బృందాలుగాబయలుదేరి ఊరూరా సంచారంచేస్తూ ప్రదర్శనలిచ్చేవారు. గ్రామాల్లోప్రజలు చందాలువేసుకొని ఆదరించేవారు.

భాగవతులకు యింటికొకమనిషికివంతున భోజనాలుపెట్టి ప్రదర్శన అనంతరం పాతబట్టలు, పారితోషికాలు ఇచ్చి ఎన్నో పెట్టుపోతలతో ఆదరించేవారు.

ఈదేశంలో కళలకు సంబంధించి ప్రత్యేకంగా చరిత్ర వ్రాయబడ నందున వీనిపుట్టుపూర్వోత్తరాలు తెలిసికోవడానికి సాహిత్యచరిత్ర ఒక్కటే దిక్కు. దానిలోచొరబడిశోధిస్తే క్రీ.శ. 10వ శతాబ్దికిచెందిన చాళుక్యరాజు కుళోత్తుంగచోళునిశాసనంలో కుమార శ్రీ కంఠనటుడు "ఆర్య క్రీడ" అనే నాటకం ప్రదర్శించినట్లుంది. 11వ శతాబ్దిలోని భారతావతారికలో రాజరాజు "ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కుచూచితి"అన్నాడు. 12వ శతాబ్దిలో పాలకురికిసోమనాధుడు బసవపురాణంలో "కరమర్థి నూరూర సిరి యాళచరిత పటు నాటకంబులు నటియించువారు" అని చెప్పాడు. ఇందు సోమనాధుడుపేర్కొన్న సిరియాళచరిత్ర తెలుగుయక్షగానంగనుక ఆ కాలంలో ఖచ్చితంగా తెలుగునాటకప్రదర్శనలున్నట్లు నిర్ధారణగాచెప్పవచ్చు.

* "16వ శతాబ్దిలోని తాయికొండ నాటకసమాజంలో ఒకస్త్రీపాత్రను స్త్రీయే ధరించినట్లు తెలుస్తుంది. తాయికొండ నాటకసమాజం యక్షగానసమాజ మని ఊహించడానికి అవకాశంలేదనీ అది ఒకవీధినాటకమే అయివుంటుం దనీ డా. యస్.వి. జోగారావుగారు తమ యక్షగాన వాఙ్మయంలో తెలియ జేశారు". నాటకానికి ఆయువుపట్టులు పాత్రోచిత వేషధారణ (ఆహార్యం), భాషణ, వాచకం సందార్భానుసారంగా అంగప్రత్యంగ కదలికలు (ఆంగికం) హృదయానుభూతివలనకలిగే రోమాంచకంపస్వేదాదులు (సాత్వికం)అనేవి. ఇవే చతుర్విధాభినయాలు. రసోద్దీపనకై సంగీతం, నృత్యంకూడా జోడింప బడేవి. పరిశీలించిచూస్తే ప్రాచీన తెలుగునాటకప్రక్రియలలో ఇవి పుష్క లంగా కనిపిస్తాయి.

తోలుబొమ్మలాట, జముకులకథ, యక్షగానాలలో యీ నాటక ప్రక్రియ నిండుగావుంది. కూచిపూడిభాగవతులు, తూర్పుభాగవతులు, యానాదిభాగవతులు, దేవదాసీలు, మాదిగభాగవతులు దీనిని బాగా పెంచి పోషించారు. ఎర్రగొల్లలు మరింతముందుకు తీసుకుపోయారు.

---

* మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, వీధినాటకవ్యాసం. నాట్యకళ. ఫిబ్రవరి - మార్చి 1970 పు. 84

## తోలుబొమ్మలాట

దీనిలో వాచకం, ఆహార్యం, ఆంగికం ప్రదర్శితమౌతున్నాయి. తోలు బొమ్మలకు మనుషులగొంతులుజోడించి పాటలూ పద్యాలూ దరువులూ సంభాషణలతో ఆయాపాత్రలకు వాచికప్రయోగం జరుగుతుంది. మగబొమ్మలకు పురుషులు, ఆడబొమ్మలకు స్త్రీలు తమగొంతులు జతచేస్తారు. బొమ్మలకు ఆయాపాత్రలరూపధారణ రంగుల్లోచేసి ప్రదర్శించడంవల్ల ఆహార్యం పోషింపబడినట్లే. పాత్రల సంభాషణలనుబట్టి బొమ్మలచేతులూ, కాళ్ళూ, మొండెం, శరీరంమీది యితరఅవయవాలూ కర్రలసహాయంతో కదిలిస్తూ అంగికాభినయాన్నిసృష్టిస్తారు. ఇవి బొమ్మలుగనుక సాత్వికాభినయానికి అవకాశంలేకపోయినా నేపథ్యంలోవారు చేసే సంభాషణలూ, కీర్తనలూ, రాగాలాపనలూ రసస్ఫోరకమై సామాజికులలో రోమాంచకం పశ్వేదాదులు కలిగిస్తుంటాయి. వీరికి రంగస్థలం నడివీధిలో పందిరి. ఆ పందిరికి ముందు భాగం పల్చని, తెల్లనిచీర యీతముళ్ళతోకుట్టి, కట్టి, మిగతామూడువైపులా గోనెబరకాలతో మూసేస్తారు. లోపల బొమ్మలనాడించేవారూ, పాడేవారూ, వాయిద్యాలవారూ ఉంటారు. తెరమీద బొమ్మలునిలిపి, బొమ్మలవెనుక ఆముదందీపాలుపెట్టి, పొడవాటికర్రలతో బొమ్మలనుకదిలిస్తూ తెల్లవార్లూ ప్రదర్శిస్తారు. యుద్ధఘట్టాలలో దరువులకు సరిపడగా అరుపులు, బల్లలపై చరుపులు బొమ్మలకదలికలు నిజంగానే యుద్ధంజరుగుతున్నదా! అనిపించేలాచేస్తారు. ఈ బొమ్మలాటలువేసేవారు ఆరేమరాఠీలు. తెలుగునాట హాస్యానికి పేరెల్లిన గాండోలిగాడూ, బంగారక్కా, కేతిగాడూ, జుట్టుపోలిగాడూ వీరిసృష్టే.

## జముకుల కథలు

మాలదాసరులనే ఒకతెగవారు ఇవిచెప్పేవారు. గుమ్మడికాయ బుర్రతోచేయబడిన తంబూరా శ్రుతి. జముకులు ఒకరిద్దరు వాయిస్తుంటారు. కుంచానికి ఒకవైపు మేకతోలుతోమూసి అతికించి దానిమధ్య ఏకునారత్రాడు కట్టి, ఒకచేత్తోలాగిపెట్టి, రెండవచేతి బొటనవ్రేలితో మీటుతుంటే 'ఝుమ్ ఝుమ్" అనే శబ్దం వస్తుంది. జముకంటే ఇదే. వీరుచెప్పే కథలలో "సారంగధర" "దేశింగురాజుకథ" మంచిప్రసిద్ధి. ఇందులో నాటకప్రక్రియఏమిటంటే జముకులువాయించేవారు కథాకథనంచేస్తుంటే ఆ కథలోని ప్రధానపాత్రల

వేషాలలో కొందరు రంగప్రవేశంచేసి నృత్యంతో పాడుతూ డైలాగులు చెబుతూ అభినయిస్తుంటారు.

ఈరచయిత సుశీలారాణి, కొవ్వూరి రామకృష్ణారెడ్డి వర్గీరాలతో బృందంగాఏర్పడి 'సుభాస్‌చంద్రబోస్' జముకులకథ జముకువాయిస్తూ చెబుతుంటే జనం తోసుకుమరీ ముందుకువచ్చేసేవారు వేషాలు చూడాలనీ దగ్గరుండి కథవినాలనీను.

## యక్షగానాలు

ఇవి ప్రదర్శించే భాగవతులలో కూచిపూడిభాగవతులు, గొల్లభాగవతులు, యానాదిభాగవతులు, తూర్పుభాగవతులు అని అనేకవిభాగాలున్నాయి. వీరందరూప్రదర్శించేవి యించుమించు సంగీతనృత్యనాటకాలే. వీనినే యక్షగానాలన్నారు. నటీనటులు వేషాన్ని ధరించి భావాన్ని ఆంగికంతోనూ సాత్వికంతోనూ పాటలతోనూ మాటలతోనూ ప్రదర్శిస్తారు. నాటకానికి కావలసిన సర్వలక్షణాలూ ఇందులో భాసిస్తాయి. చాలవరకు వచనాన్ని కూడా రాగయుక్తంగాచదివి అర్థవివరణచేస్తుంటారు. ప్రతిపాత్రా తన్నుగూర్చి పరిచయం ఒకదరువులోపాడుతూ రంగప్రవేశం చేస్తుంది. "సూత్రధారీ వచ్చె చూడండిజనులారా" అనే దరువుతో విదూషకుడు, "రాజువెడలె రవితేజములలరగ" అనే దరువుతో రాజుపాత్ర ప్రవేశిస్తాయి. దీనికి నట్టువాంగం మద్దెలగాడూ, తిత్తిగాడూ (శ్రుతి), ఒకరిద్దరు వంతపాటకులు. తెలుగుదేశంలో పేరువిన్నంతనే ఫక్కునవ్వు తెప్పించేపాత్రలు సింగి, సింగడు, చోడిగాడు యిందులోవే. వీనిని కురవంజిలనేవారు. ఇది యక్షగాన రూపానికి తొలిరూపం.

## కూచిపూడి భాగవతులు

భాగవతులలో కూచిపూడివారిబాణీ వేరు. వీరికి మూలపురుషుడు సిద్ధేంద్రుడు. ఆయన ఏర్పరచిన సంప్రదాయంప్రకారం స్త్రీవేషాలుకూడా పురుషులేవేసేవారు. ఇందులోని నృత్యరీతులు, అభినయభంగిమలు, ముద్రలు శాస్త్రీయ పడికట్టులోఉంటాయి. నట్టువాంగం రంగంమీదేఉంటుంది. 'భామనే సత్యభామనే' అనే దరువుతో సత్యభామ రంగప్రవేశం, సత్యభామ జడవర్ణన వీరి భామాకలాపంలో మంచి పట్టుగల అంశాలు.

"గొల్లభామా వచ్చేనే చల్లోయని" అనే దరువుతో ప్రవేశిస్తుంది గోపిక. ఇందులో జీవాత్మ, పరమాత్మ, పిండోత్పత్తి, సృష్టి వగైరా లోతైనవిషయాలు గొల్లభామ, బ్రాహ్మణ పాత్రల సంభాషణలో చమత్కారాలతో సరళసుందరంగా సుబోధకంచేస్తారు. ఇందులో గొల్లభామ "ఆ....అయ్యవారు ! అనే తీగడతోచెప్పే ఒక మాండలిక సంబోధనలోని మాడ్యులేషన్ ఈ కలాపానికి జీవం. వీరు ఉషాపరిణయం, భక్తప్రహ్లాద, విప్రనారాయణ వంటి కండగల యక్షగానాలుకూడా ప్రదర్శిస్తారు.

## తూర్పుభాగవతులు

తూర్పుభాగవతులు విజయనగరం ప్రాంతాలవారు. స్త్రీ పాత్రలు స్త్రీలేవేస్తారు. మద్దెల, తాళం, తిత్తి మామూలే. పాట, మాట మాత్రం తూర్పుయాసలోఉంటాయి. రాగంతోలుబొమ్మలాట రాగాలనుపోలిఉంటుంది.

"చిటపట చినుకులు దుప్పటి తడిసెను తలుపుతీయవే భామా" అనే కృష్ణగోపికా సంవాదం, 'ఏదిరా లక్ష్మణా సీతా ? పర్ణశాలలో లేదెందు సేతా' అనే రామలక్ష్మణుల సంవాదం వీరిదే. ఏడువారాల నగలుధరించే వీరి సత్యభామను చూసితీరవలసిందే. నృత్యంలో పెద్ద శాస్త్రీయనిబద్ధత ఉండదు. వీరు గొల్లకలాపం, భామాకలాపం, కురవంజిలు ఎక్కువగా ఆడతారు. ఒక దళం విజయనగరందగ్గర లక్కవరం గ్రామంలో ఇప్పటికీ ఉన్నారు.

## దేవదాసీలు

దేవదాసీలు కూడా భాగవతుల ఫక్కీలో కలాపాలు ప్రదర్శించేవారు. దేవుడుకళ్యాణాలకు పల్లెటూళ్ళలో భోగంమేళాలుపెట్టేవారు. సంబరంఅయిన మరునటిరోజురాత్రి ఆ మేళంలోనివారు భామాకలాపమో, గొల్లకలాపమో ప్రదర్శించేవారు. ఒకనాడు అన్నాబత్తుల చిట్టి, అన్నాబత్తుల బులివెంకటరత్నం, నాయుడుసత్యం ఇందు పేరెన్నికగన్న నట్టువరాండ్రు. వీరి నృత్యరీతి, ముద్రలు, భంగిమలు కూచిపూడివలె శాస్త్రబద్ధం. రాగాలాపనమాత్రం జానపదం - తూర్పుభాగవతులపట్టు.

## యానాదిభాగవతులు

యానాదిభాగవతులను నక్కలభాగవతులనికూడా అనేవారు. వీరు ప్రశస్తంగా వేసేవి 'కచదేవయాని' 'చెంచులక్ష్మి' నాటకాలు. 'చెట్టులెక్కగలవా నరహరి పుట్టలెక్కగలవా' అనేపాట వీరి చెంచులక్ష్మినాటకంలోనిదే. నృత్యం, పాట, మాట అన్నింటిలో ఈనాటకం సంపూర్ణమైన జానపదరీతి. గంగిరెద్దు మేళాలుకూడా ఈ నాటకాన్ని ప్రదర్శించేవారు.

యానాదిభాగవతులలో స్త్రీపాత్రలు స్త్రీలేవేస్తారు. పురుషపాత్రలు పురుషులేవేస్తారు. దాదాపు జట్టులోని వారంతా ఏదో ఒక వాయిద్యమో, తాళమో, వంతపాటపాడడమో చేస్తారు. ఉషా పరిణయం, కృష్ణలీలలు, సావిత్రి నాటకాలకు కూడా వీరు ప్రసిద్ధి. అద్దకం, గంగసింధూరం, కాటుక దుస్తులు, పూసలదండలు అట్టకిరీటాలు వీరి నాటకాభరణాలు.

## భజన నాటకాలు

ఇలాంటి ప్రక్రియలు యింకా పరిశీలిస్తే పల్లెపట్టుల్లో భజన నాటకాలు కనిపిస్తున్నాయి.

చిన్నసైజు చిప్పలతాళాలు వాయిస్తూ మధ్యలో వొత్తులువెలిగించిన ఇత్తడి"సెమ్మె" పట్టుకుని, దానిచుట్టూ భజనబృందం వర్తులాకారంలోనిలబడి గాని, కూర్చునిగానిభజనచేస్తుంటారు. వీరుచేసే సప్తతాళాలభజనఅద్భుతంగా వుంటుంది. వలయంలో వేషాలుధరించిన పాత్రలు సంవాదంగా కీర్తనలుపాడుతుంటే ఆ బృందం రెండుగాచీలి కొంతమంది ఒకపాత్రకూ మరికొంతమంది మరోపాత్రకువత్తాసుగాపాడుతుంటారు. వీరు ఏభాగవతులూకారు. రాగజ్ఞానం కలిగిన ఉత్సాహవంతులైన గ్రామీణజనులు భజనజట్టుగాకూడి ఈనాటకాలు నేర్చుకుని ప్రదర్శించేవారు. వీటిలో "లంకాదహనం" ప్రసిద్ధి. "ఎక్కడివాడవురా ! ముక్కడివానర నీవెక్కడివాడవురా?"అంటే, "రామునిబంటునురా నీమోముగాల శ్రీరాముని బంటునురా" అనిపాడే వీరిరావణ, ఆంజనేయుల సంవాదం ఆరోజుల్లో పల్లెటూళ్ళల్లో పశువులగాచే పిల్లలదగ్గరనుంచీ పెద్దవాళ్ళదాకా ప్రతినోటా నానేది. అలాగే అశోకవనంలో సీతను చూసిన హనుమంతుడు "ఎవ్వారమ్మా చెట్టూక్రిందా? ఇటులశోకించానేలమ్మా చెప్పా

బంగారుబొమ్మా" అనేపాట వ్యాప్తిలోఉండేది. ఆరోజుల్లో యిందుకోసం నల్లమిల్లి రామిరెడ్డిగారు "పాండవవనవాసం" నల్లమిల్లి బసివిరెడ్డిగారు "భక్తరామదాసు", "భక్తప్రహ్లాద"వంటి ఎన్నో భజననాటకాలు వ్రాశారు. కొంకుదురులో కొప్పూరి చినసూరన్నగారు కుర్రవాళ్ళను కూడ గట్టి యీనాటకాలకు తర్ఫీదుయిచ్చి ఊరూరాతీసికెళ్ళి వేయించేవారు. శ్రీ కర్రి విశ్వనాథరెడ్డి రాముడుగా శ్రీ పడాల రామిరెడ్డి (మిరపకాయల రామిరెడ్డి) లక్ష్మణుడుగా వారి వేషాలుచూసి ప్రేమించి ధనవంతులపిల్లలు వాళ్ళను పెళ్ళి చేసుకున్నారు.

## చంపూ నాటకాలు

ఇక్కడివరకూ రంగస్థలానికి బల్లలుఏర్పాటులేదు. చాపలూ, బరకాలే క్రిందవేసిఆడేవారు. ఆతరువాత మాదిగభాగవతులనే సంచారదళం చంపూ నాటకాలు మొదలుపెట్టారు.

వీరినాటకానికి చిన్న పందిరివేసి, పందిట్లోబల్లలువేసి, స్టేజికట్టి, ముందొకతెర, వెనకొకతెర వ్రేలాడదీసి పెట్రోమాక్సులైట్ల వెలుతురులో ఆడేవారు. వీరి "శశిరేఖాపరిణయం" ప్రదర్శన గొప్పగాప్రశంసలుపొందింది.

## ఎర్రగొల్లల నాటకాలు

ఆతర్వాత పల్లెప్రాంతాలలో వీధినాటకాలకు ఒకఊపు తెచ్చినవారు ఎర్రగొల్లలు. వీరితో పౌరాణికనాటకరంగం ఊరూరా పరవళ్ళుతొక్కింది. కృష్ణలీలలు, కనకతార, కాంతామతి, జయంతజయపాల, గయోపాఖ్యానం, ఉద్యోగవిజయాలు వగైరానాటకాలు వీరు ప్రదర్శించేవారు. ఈ ఎర్రగొల్లల ట్రూపులో కర్రి అబ్బులు, కంచర్ల వెంకన్న కృష్ణార్జునులుగావేసే గయోపాఖ్యానంనాటకం ఏఊరవేసినా చుట్టుపట్ల పది పదిహేనుమైళ్ళదూరంలో ఉన్న ఊళ్ళవారుకూడావెళ్ళి గడగడవణికించేచలిలోకూడా కూర్చుని కోడికూతవేళవరకూ చూస్తూనేఉండేవారు. అలాగే వీరి కురిక్షేత్రంకూడా. వీరినాటకాలు నాలుగువీధులకూడలిలో పెట్టేవారు.నాలుగువీధులూకూడాజనంనిండిపోతే ముందుతెరా వెనకతెరాకూడా పూర్తిగాఎత్తేసిఆడేవారు. అందుకే ఇప్పుడుకూడా ఎవరయినా తెరఎత్తేసిఆడుతుంటే "ఎర్రగొల్లలనాటకంలా అడేమిటిరా?"

అంటుంటారు. రంగానికీ రంగానికీ మధ్య నాటకానికిసంబంధంలేని కొన్ని కామిక్ వేషాలువచ్చి చమత్కారమైన పిట్టకథలు, పొడుపుకథలుచెప్పి హాస్యాన్నిఅందిస్తూ నవ్వించి వెళ్ళేవి. నిజానికి ఈ వేషాలుకూడా జనాన్ని బాగాఆకట్టుకొనేవి. అలాగే సీనుకీ సీనుకీమధ్య "ఇంటర్‌వెల్‌సాంగ్స్" అని తెరలో "నెరానెరా నెరబండి" "ఛల్ మోహనరంగా", "గుత్తివంకాయ కూరోయిబావా" లాంటి పాటలు పాడి జనానికి విసుగురేకుండాచేసేవారు. నేటి వీధినాటకాల పద్యాల దీర్ఘరాగాలాపనపద్ధతి యిక్కడనుండేప్రారంభ మయింది. ఇది మరేభాషలోనూ లేదు.

ఇలా వికసించిన వీధినాటకం అబ్బూరి. షణ్ముఖుల ప్రవేశంతో హాలులోకిచేరి, క్రమంగా కంట్రాక్టర్లచేతుల్లో చితికి, మరల దేవుళ్ళపుణ్యమా అని గణపతిరాత్రి పందిళ్ళలోనూ, దేవీనవరాత్రి పందిళ్ళలోనూ, శ్రీరామ నవమి పందిళ్ళలోనూ దర్శనమిస్తోంది. ఇప్పుడు మరల నడిరోడ్డుమీద 16. ఎమ్. ఎమ్. సినిమాదెబ్బకి దిక్కుతోచక బక్కచిక్కి కుక్కిమంచం ఎక్కబోతుంది. ప్రభుత్వంవెంటనే యీ నడిరోడ్డుమీది సినిమాను అరికట్ట కుంటే కొద్దికాలానికి ఈ సంపద అవశేషాలుకూడా మిగలకుండా నశించి పోయే ప్రమాదం ఉంది.

## కామిక్ వేషాలు

మొదటకూచిపూడివారియక్షగానాలలో అవాంతరవేషాలపేరుమీదయివి కనిపించేవి. కూచిపూడివారు పగటివేషాలుకొన్నింటిని కథకుసందర్భం లేక పోయినా రంజకత్వంకోసం ఘట్టానికీ, ఘట్టానికీమధ్య ప్రవేశపెట్టేవారు. అవి గొల్లబాయుడు - గురువు, దేవాంగి, ఫకీరు, బుడబుక్కల, బైరాగి, జంగం, వైష్ణవ గురువు-శిష్యుడు, లింగబల్లి, కోమటి మొదలగు వేషాలు. క్రమంగా ఆప్రక్రియ 'కామిక్'ల పేరుతో వీధినాటకాలలోకికూడా ప్రాకింది. సీనుకీసీనుకీ మధ్యవిరామంలో ప్రేక్షకులకు విసుగుకలగకుండా యీపాత్రలు జోకర్‌రూపంలోనో, వెర్రిగొల్లవేషంలోనో, శ్రోత్రియబ్రాహ్మణవేషంలోనో, మరోరూపంలోనో ప్రవేశించి హాస్యప్రధానంగానడిచి కడుపుబ్బనవ్వించేవి. వీనిలో దేవాంగి కామిక్ సుప్రసిద్ధం.

## దేవాంగివేషం

అంగవస్త్రంకట్టుకుని, తలకు రుమాలుచుట్టుకొని, మెడలో లింగకాయ

ముఖాన విభూతిరేఖలు ధరించి, భుజాన చిన్నబట్టలమూట, చేతిలో గజం బద్దతోవచ్చి తనవృత్తిగురించి, తనకులం గురించి, తనగురించి ఏకపాత్రాభినయంతో యిలాచెప్పేవాడు. "అయ్ చీరలు, పంచిలు సాపులు, జాకెట్టుగుడ్డలు, దుప్పట్లోయ్" అని కేకతోప్రవేశించి జనందృష్టిని తనవైపుకు మళ్ళించుకుని చెప్పడం ప్రారంభించేవాడు.

''అంగవాఁ జంగవాఁ లింగవాఁ దేవాంగవాఁ అన్నారండి. పెంచింది పెద్దాపురవండి — ఉలికి ఉప్పాడండి - కాపరం ద్వారపూడండి. నాపనితనం చెప్పమంటారాఁడి? ఓసారి సొంతంగా నేనే నేసేనండి కాశ్మీరు శాలువా. కాకినాడ పట్టుకెళ్ళేనండి - కళ్ళుజిగేలుమని సూడలేకపోయారండి. ఏలూరు పట్టుకెళ్ళేనండి, ఇలువలేదన్నారండి. అంటే అదినాసిరకంఅని కాదుసుమండీ దానిపనితనానికి ఖరీదు కట్టలేవఁని. నా ఎదురు నేతలోఉందండి నామజాకా. గుంటకాడకూకుంటే బట్టయ్యేదాకా లెగనండి. ఇప్పుడు సీమపోగునూలొచ్చిందగ్గరనుంచీ పలకమీద దట్టింపుపోయిందండి. అందుకనిబాబయ్యా! మాయింటిగొయ్య మాతమ్ముడికొప్పజెప్పేసి ఊళ్ళమీదికి లంకించుకున్నానండి బట్టలేపారానికి. బాబయ్యా! మాఇంటిగొయ్యంటే ఏదన్నా అనుకునేరు - మగ్గంగొయ్యండి. ఇలాఊళ్ళమీదపడి లంకించుకుంటే పంచిల్లో మాలావుగావొచ్చిందండి. ఆపంచిల్లో వచ్చింది చీరల్లోదూరిందండి. దాన్ని కూడదీసుకోడానికి మళ్ళీ జాకెట్టుల్లోలాగాల్సొచ్చిఁదండి. ఈబట్టలమ్మకాల్లో ఓరోజు చిక్కుల్లోపడ్డాయిందండి. ఉండిపోడావా అనుకున్నానండి - నాకక్కడో కాతావుంది లెండి. చీరలూ జాకెట్లూ నేనేయిత్తాన్లెండిఆరికి వతనగా. తీరాఎత్తే ఆవిడ ఆళ్ళ బావగారొచ్చారు కాశీలేదందండి. ఆవిడిదిఒక్కటే గదండి. మరింకేంజెయ్యను? ఆ అర్ధరాత్రిబయల్దేరి పెద్దకత్తిమొల్లోదోపుకుని దోరపూడి బయల్దేరేనండియింటికి. అసలే అది అర్ధరాత్రి. చూస్తే దొంగలరోడ్డు. ఆపైనచిమ్మచీకటి. అనపర్తిదాటాక ఒకదొంగ తలకితెల్లటిగుడ్డచుట్టుకుని దారిప్రక్కనకాసుకూకున్నాడండి ఎవడొత్తాడాఅని - అప్పుడేంజేసేనంటే బట్టలమూటపక్కనెట్టి ఎనకమాలుగాఎల్లి కత్తితో తలమీదొక్క ఏటేశానండి. దెబ్బకి రెండుముక్కలయిందండి. ఏవిఁటీ? కత్తి! కత్తిరెండుముక్కలవ్వడమేవిటనుకుంటున్నారా? అది మనిషయితేగా! మైలురాయండి. ఓసారండి ఎంబెళ్ళ నరసింగరావుపంతులుగారు తాసిల్దారుగా వచ్చేరండి. అప్పుడునేను సూరుమగ్గాలకు సేనాపతినండి - అందుకని ఆరిసరసికెళ్ళి

కూకున్నానండి. సాయిబ్బుంట్రోతొచ్చి సాగదీసినాలుగుచ్చు కున్నాడండి చెంపమీదలెంపకాయులు. చేతిదెబ్బలుగనుక పరువుదక్కిందనుకున్నాను - చెప్పుదెబ్బలైతే చెప్పుకునేదేవుందండీ ! నాకు నలుగురుకొడుకులండి. పెద్దోడు పెద్దపోకిరోడండి. రెండోవోడుకొంచెం అక్కరకొచ్చేడండి. ఆడు శివలిం గానికి గొప్పగా పూజ్జేత్తాడండి. ఆడిపూజంటే అబిసేకవేనండి. ఆడు లింగ పూజసేత్తుంటే పీఠం గజగజలాడిపోవలసిందే.

దేవతలకి మేం అంగోత్రంయిచ్చావండి. అందుకేమమ్మల్ని ద్రేవాంగులన్నారండి. మాకులం బలేకులవండి. కొంచెం యీమద్దె మెతక తనం వచ్చిందనుకోండి. మొగోళ్ళేమో తాగుబోతులయిపోతున్నారండి - ఆడోళ్ళేమోబాబయ్యా ఏరుపిడకలకెళ్ళి ఎత్తిపెట్టించుకుంటున్నారండి. మరేంలేదుబాబయ్యా తట్టనెత్తిమీదకండి."

ఇలా రెండర్థాలువచ్చేలామాటాడుతుంటే జనం పగలబడినవ్వేతుండే వారు. ఈ వేషం కొంకుదురు మంత్రిప్రగడ రామదాసుమేష్టారు అద్భుతంగా వేసేవారు. నవ్వలేక కడుపు చెక్కలయిపోయేది.

## కొలికిముత్తుం వేషం

కొలికిముత్తుం కోమట్లకుర్రాడు. అతనిఅమాయకత్వంలో గడుసు మాటలు, అతితెలివి, పిసినితనం హాస్యాన్నికలిగిస్తాయి. ఒకరోజు సాయంత్రం బఠానీలుతింటూ రోడ్డునవెళుతుంటాడు. అతనికూడావస్తున్న స్నేహితుడు తనక్కూడా కొంచెంపెట్టమంటాడు. ఊహూ నేపెట్టనంటాడు. అయితేకూడారానంటాడా స్నేహితుడు. పోతేపో అంటాడు కొలికిముత్తుం. దారిలోదెయ్యముందని బెదిరిస్తాడు. దెయ్యమంటే నాకేంబయ్యువా ? నేనుమాత్రం నీకొక్కగింజకూడా పెట్టనంటాడు. స్నేహితుడు వెనక్కి వెళ్ళిపోతాడు. కొంతదూరంవచ్చాక నిర్మానుష్యంగాఉన్నచోట చెట్టు నుంచి దెయ్యమొచ్చి మీదపడుతుంది. కొలికిముత్తుం వెనక్కిచూడకుండా స్నేహితుడేఅనుకొని పో అవతలికి - దెయ్యవంటే నాకేం బయ్యుంలేదు అని వెనక్కిచూసి బేరమంటాడు. దయ్యంవదిలేసి పోతుంది. స్నేహి తుడొచ్చి చూసి ఏరా ఏడుస్తున్నావంటే ఉట్టినే సరదాకని గుట్టు చెప్ప

కుండా తనదగ్గరున్నబటానీలు అతనికిపెట్టి కూడారమ్మని ప్రతిపాలతాడు, ఇక్కడ నటనంతా బలేతమాషాగాఉంటుంది.

తరువాత తండ్రి చిల్లరకొట్టుమీద కొలికిముత్తాన్నికూర్చోబెట్టి ఇంట్లోకిభోజనానికివెళతాడు. పంచదారసీసాలోకి చీమలు ప్రాకుతుండడం చూస్తాడు కొలికిముత్తుం. మిరపకాయలడబ్బామీద చీమలులేవు - వెంటనే ఆలోచించి చీమలుదులిపేసి పంచదారసీసామీద "మిరపకాయలు" అనిరాసి చీటి అంటించేస్తాడు. తండ్రివచ్చి ఇదేవిట్రాఅంటే చీమలుపట్టకుండా మిరప కాయలని రాసేసేనంటాడు. ఇలాంటి ఎన్నో విషయాలు కడుపుబ్బ నవ్వి స్తాయి. ఇది బలభద్రపురం వెంకటరెడ్డిగారు ప్రసిద్ధిగా వేసేవారు. ప్రారం భంనుంచి ముగింపువరకూ ప్రేక్షకులు అలానవ్వుతూ ఉండవలసిందే.

## "గురువు - గొల్ల" వేషాలు

వీళ్ళసంభాషణ గొప్పచమత్కారంగాఉంటుంది ఇలాగ -

గొల్ల : బాబూ ! మిమ్మల్నేవనిపిలవాలి ?

గురువు : మమ్మల్ని నువ్వు ఏమండీ అనాలి, నిన్ను నేను ఏవిరా అనాలి, తెలిసిందా ?

గొల్ల : ఆఁ తెల్సిందండి. మమ్మల్ని నువ్వు ఏమండీ అనాలి. నిన్ను నేను ఏవిరా అనాలి. అంతేగదండీ !

గురువు : కాదురానాయనా !

గొల్ల : కాకపోవడమేటయ్యా. ఉప్పుడు నువ్వన్నమాటేగదా ! పోనీ కాకెక్కువా బేమ్మడెక్కువా సెప్పు.

గురువు : వర్ణానాం బ్రాహ్మడే ఎక్కువ.

గొల్ల : మరైతే సచ్చిపోయినోళ్ళకి గతులుకోసం మదురుమీద కూడెట్టి కాకి ముట్టాలంటారుగానీ బేమ్మడుముట్టాలంటారా ? అందుకే బేమ్మడుకంటే కాకే ఎక్కువంటాన్నేను. అదిసరేగాని జంతు వుల్లో ఏది సెండాలంజంతువో సెప్పు. (ఛండాలం)

గురువు : గాడిదరా.

గొల్ల : గాడిదెక్కువా ? బేమ్మడెక్కువా ?

గురువు : బ్రాహ్మడేఎక్కువ.

గొల్ల : కాదు గాడిదేఎక్కువ, శ్రీకుట్నుడు (శ్రీకృష్ణుడు) పుట్టినప్పుడు వసుదేవుడు గాడిదకాళ్ళట్టుకున్నాడా బేమ్మడికాళ్ళట్టుకున్నాడా ? కాబట్టి బేమ్మడికంటే గాడిదేఎక్కువ. కోపగించుకోకండి బాబయ్యా !

గురువు : నాకు కోపంరాదురా.

గొల్ల : ఛీ దైద్రుడా ! (దరిద్రుడా) నువ్వు బేమ్మడువేనా ?

గురువు : దొంగవెధవా ! ఏవన్నావ్ ?

గొల్ల : మరిమీకు కోపంరాదన్నారుగదండీ ? ఓడిపోయారోచ్.

ఇలాచమత్కారసంభాషణ గమ్మత్తుగా నడుస్తుంది.

## ఫకీరు వేషం

ప్రేక్షకుల్లో ఒకరినిపిలిచి యిలా జోస్యంచెబుతాడు. అతనిచెయ్యి చూస్తూ "మీరు తలంచినకార్యం తప్పకఅవుతుంది. మీ కుడికంట్లో భాగ్య రేఖవుంది. ఎడమకంట్లో లక్ష్మివుంది. తలచినతలపు, కోరినకోరిక కొన సాగుతాయి. వశీకరణరేఖవుంది. ధాన్యరేఖవుంది. ధనరేఖవుంది. మీలో కొచ్చేవుంది. ఏమివచ్చేనని అడిగారు మీరు. అదే మంచిఆలోసన. ఒక జంగంవచ్చినా, ఒకజోగివచ్చినా, ఒకఫకీరువచ్చినా యిద్దామని మనస్సులో కొచ్చివుంది. ఇదిగో హుస్సేన్ హుస్సేన్ బారాబాహిషూం. ఒక రాత్రి నాకు పీరు కనిపించాడు. నాటినుండి తిననివ్వడు. ఆకలి కానివ్వడు. దేశ దేశాలంట త్రిప్పుతుంటాడు. జోస్యాలుచెప్పమంటాడు. వెండిముట్టవద్దన్నాడు. రాగిపుచ్చుకో వద్దన్నాడు. బంగారమైతే పుచ్చుకోమన్నాడు. అంచేత మీరు బంగారంయిస్తే నాకభ్యంతరంలేదు తీసుకోవడానికి" అని యాసతో మాటాడు తుంటే ఆతెలుగు యాసకూ అంతర్గతమైన అతనికోరికచెప్పేతీరుకూ నవ్వు వస్తుంది.

## * వైష్ణవగురువు, శిష్యుడు వేషాలు

వీరి సంభాషణలు విజ్ఞానాత్మకంగా ఉంటాయి. మచ్చుకుకొన్ని -

శిష్యుడు : గ్రామంలో గాలిగోపురం పెద్ద, జంతువులలో నందిపెద్ద, మృగములలో ఏనుగుపెద్ద. వృక్షాలలో తాళవృక్షంపెద్ద,

* "కూచిపూడి యక్షగానసాహిత్యము సంప్రదాయము ప్రయోగము" నుండి. డా. చింతా రామనాథం.

పక్షులలో రాబందు పెద్ద, భూమికి పర్వతం పెద్ద, తమరు మాకు పెద్ద - కదూ స్వామీ !

గురువు : కాదు నాయనా ! పెద్దలు వేరేఉన్నారు. పరమభాగవతులు. మాతృద్రోహి, పితృద్రోహి, భ్రాతృద్రోహి, తదైవచ కులద్రోహి, పంచైతే వీరవైష్ణవాః

శిష్యుడు : అమ్మబాబోయ్ - మాఅమ్మా, నాయనా, అన్నా, కులమూ పదికాలాలపాటు చల్లగాఉండాలంటే మీవద్ద శిష్యరికంమానేసి వెళ్ళిపోతానుగాని యిటువంటిబోధలు వినలేను స్వామీ. మీకు వేయినమస్కారాలు.

గురువు : కంగారుపడకురాశిష్యా నేచెప్పేదివిను. మాతృద్రోహిఅంటే తల్లినిచంపినవాడు-పరశురాముడు. పితృద్రోహిఅంటే తండ్రిని చంపినవాడు-ప్రహ్లాదుడు. భ్రాతృద్రోహిఅంటే అన్ననుచంపిన వాడు - విభీషణుడు. కులద్రోహిఅంటే కులమును నాశనం చేసినవాడు - ధర్మరాజు. వీరేగదరా మనపెద్దలు ?

ఇలా విమర్శనాత్మకంగా ఎన్నోవిషయాలు మాట్లాడతారు యీ గురుశిష్యులు.

ఇక సోమయాజులు, సోమిదేవమ్మ, చాకలి, అనుమానపుభర్త వేషాలలో బండెడుహాస్యం పొంగిపొరలుతుంటుంది. ఇవేగాక త్రాగుబోతువేషంలోనూ, ముష్టివాడివేషంలోనూ సమాజంమీద ఎన్నో విసుర్లతో పాటు హాస్యజనకమైనపాటలూ, మాటలూకూర్చుకుని ప్రదర్శిస్తుంటారు. ఈకామిక్ వేషాల మాటలు నిర్ణీతమైలేవు. నటుని బట్టి, నటునిసామర్థ్యాన్ని బట్టి అక్కడిపరిస్థితినిబట్టి మారుతుంటాయి. కొందరు ఊళ్ళోవిషయాలను ముందుగాసేకరించి అవికూడాకలుపుకొని మాట్లాడడం కద్దు. ఆవూరివిషయమే హాస్యంగా వాళ్ళకళ్ళముందుకుతెస్తే మరీమజాగాఉంటుంది. ఒక్కొక్కసారి అసలు నాటకంకంటే యీ స్పెషలువేషాలే ఎక్కువ మన్ననపొందుతుంటాయి.

# జానపదుల అభిమాన నాటకాలు

సహజంగా జానపదులు అభిమానించేవి పద్యనాటకాలే. అందులో ముఖ్యంగా హరిశ్చంద్ర, చింతామణి, గయోపాఖ్యానం నాటకాలపట్ల వీరి అనురాగం అపరిమితం. ఈఅనురాగాన్ని ఆసరాగా తీసుకుని ప్రదర్శకులుచేసే తప్పులు అనంతంగా పెరిగిపోతున్నాయి. ఈనాటకాలు జానపదులకు ప్రీతిపాత్రములు గనుక యీ ప్రదర్శనలుకూడా పరామర్శించడం సముచితం.

## హరిశ్చంద్ర నాటకం

తెలుగునాటకాలలో లక్షలాదిప్రతులుఅమ్ముడుపోయి వేలాది ప్రదర్శనలుపొందిన నాటకం బలిజేపల్లివారి హరిశ్చంద్ర. పుట్టిననాటినుండీ నేటి వరకూ మకుటాయమానంగా విరాజిల్లుతున్న యీనాటకం పట్టుకొనని నాటక సమాజంలేదు-ప్రదర్శింపబడని వూరులేదు-చూడని జానపదుడూలేడు. ఆదర్శాలపట్ల జానపదులకున్న మక్కువ చాలాఎక్కువ. జానపదహృదయం కరుణరసానికి ఇట్టేకరిగిపోతుంది. ఇది ఈ నాటకానికి జీవం.

కాని యీనాటి హరిశ్చంద్రప్రదర్శనలుచూస్తుంటే నాటకం సత్యప్రబోధానికా అసత్యప్రబోధానికా అనేప్రశ్న ఉదయిస్తోంది. అసలే నాటకం పెద్దది. ప్రదర్శన నాలుగుగంటలుపడుతుంది. దీనికితోడు కొందరునటులు తాలూకు స్పెషల్స్ జోడించగానే అది ఆరుగంటలకు చేరుతుంది. దానితో ప్రేక్షకులు హరిశ్చంద్రుడి రాజభోగం, రాజ్యదానం, అడవిలోకష్టాలు, కాశీలోఅమ్మకం అయిపోగానే లేచిపోతున్నారు నిద్రకు ఆగలేక. ఇక్కడి వరకూ కనబడేవి సత్యానికిపట్టిన కష్టాలేగనుక యీతరం జనం సత్యపాలన అరిష్టదాయకమనే విపరీతధోరణిలోపడేప్రమాదముంది. నిజానికి "సత్యమేవ జయతే" అనేసందేశం నాటకాంతందాకాకూర్చున్నవాళ్ళకే అందుతుంది. సత్యనిష్ఠాగరిష్ఠుడైనహరిశ్చంద్రునికి ఓడిపోయిన విశ్వామిత్రుడు తనుసంపాదించుకున్న యావత్తపఃఫలంధారబోయడం, శాశ్వతకీర్తినిప్రసాదించడం, పార్వతీ పరమేశ్వరులు దర్శనమిచ్చి దీవించడంవంటి సత్యపాలన సత్ఫలితాలు జనం

చూడకుండా వెళ్లిపోవలసివస్తోంది. దానితో అబద్ధంఆడకుంటే అన్నీ అనర్థాలే అనే అపార్థం వచ్చిన స్తే నిజంచెప్పరాదనేనిశ్చయానికివస్తే అది ప్రేక్షకుల తప్పుకాదు - ఆరుగంటలసేపుప్రదర్శించే ప్రదర్శకులతప్పు. చేంతాడురాగాలతో నాటకాన్ని గానసభగామార్చి కలహకంఠి, కాలకౌశికుడు, శిష్యులు. వీర బాహుడు పాత్రలు విశేషంగాపెంచేసి సాగదీసిలాగేసరికి అనవసరంగా నాటకం రెట్టింపై ప్రేక్షకులఓర్పునుపరీక్షించి అసలుసందేశఘట్టంసమయానికి అందరూలేచిపోవడం యిప్పుడు జరుగుతున్న సంగతి.

## అబద్ధాంకం

తృతీయాంకంలో హరిశ్చంద్రుడు అరణ్యానికి వేటకువచ్చినప్పుడు నేటిప్రదర్శకులు మాతంగకన్య నొకదానిని ప్రవేశపెడతారు. ఆమె జయమాలినిలా సెక్సీగా నృత్యంచేస్తూ ఆడి, పాడి హరిశ్చంద్రుణ్ణి తనను పెళ్ళాడమనికోరగా అతడునిరాకరిస్తాడు. దానికామెకోపించి తండ్రియైన విశ్వామిత్రునితీసుకువస్తుంది. విశ్వామిత్రుడామెను పెండ్లాడమనగా హరిశ్చంద్రుడు "సిగ్గేలాగునలేకపోయె తనకున్" అనేపద్యంలో "ఎగ్గాహింపక మాలకన్నియల దోయింబొంది అర్కాన్వయం బగ్గిందోసె నటంచుఛీయనరె నన్నాబాల గోపాలమున్" అంటాడు. ఇక్కడ "మాలకన్నియలదోయిం" అంటే ఇద్దరు మాలకన్నియలు అని అర్థం. ఎదురుగా ఒకతేవుంటే హరిశ్చంద్రుడు ఇద్దరనడం అబద్ధానికి ప్రత్యక్షసాక్ష్యంకాదా ? బలిజేపల్లివారు వ్రాసినది మాతంగాంగనలు ఇద్దరే. అందుకే "దోయిం" అని వ్రాసారు. ధనభావంవల్లో, నటీమణుల కొరతవల్లో ప్రదర్శకులు ఒక్కతెనే ప్రవేశపెట్టి ఆ పద్యం మార్చకుండా హరిచంద్రునిచేత అలాగే చదివించి ఆదిలోనే ఆపాత్రనోట అబద్ధం పలికించడం అన్యాయం. ఇక్కడ దీనితోనే విశ్వామిత్రుడు నెగ్గేస్తున్నాడు. ఇక మిగిలిననాటకం అనవసరం. అందువల్ల ఇది సరిచేసుకోవాలి.

ఇక ఇదే అంకంలో విశ్వామిత్రునికీయవలసిన సొమ్ము విషయంలో హరిశ్చంద్రుడు "ఒక్కమాసంబు గడువాసంగిన నేపాటునసై నంబడి మీ సొమ్ము చెల్లించెదను" అంటాడు. అప్పుడు విశ్వామిత్రుడుకూడా శిష్యునితో

"నక్షత్రకా ! ఈతడు మనకీయవలసిన రొక్కము నెలదినములలో నిచ్చె నట" అంటాడు. కాని కాశీసీనులో నక్షత్రకుడు హరిశ్చంద్రునితో "నీవడుగుకొనిన నలుబదిదినములు నేటితో తీరుచున్నవి. ఇంతదనుక నీవు" నాకిచ్చిన దొక్కకాసైనలేదు" అంటాడు. మాసముఅంటే 30 రోజులేగా ! అప్పుడే 40వ రోజుకూడా దాటిపోతోందే ! మరి మాటతప్పినట్టేగా ! ఒక వేళ పుస్తకంలో నలుబదిదినములుఅనేది అచ్చుతప్పుఅయితే సరిచేసుకుని మాట్లాడాలి. లేకుంటే హరిశ్చంద్రుడు తననోటచెప్పిన మాసం గడువు దాటి పోయి మాటతప్పినట్లవుతుంది. ఇది నాటక లక్ష్యానికే భంగం.

## హరిశ్చంద్ర పాత్ర

విశ్వామిత్రుడు మాతంగాంగనల పరిణయమాడమన్నప్పుడు హరిశ్చంద్రుడు తనప్రాయమునుగూర్చి "వయః పరిపాకము తప్పుచున్నయది" అంటాడు. దీనివల్ల ఇతడు వయసుమీరినవాడే అని తెలుస్తుంది. అటువంటప్పుడు కుర్రవాడిలాకనిపించే పిల్లవాళ్ళూ, రాచఠీవి బొత్తిగాలేని బక్కవాళ్ళూ, పొట్టివాళ్ళూ ఈపాత్రనిర్వహణకు సిద్ధపడడం మంచిదికాదు.

హరిశ్చంద్రుడు సుక్షత్రియుడు - మహోదారుడు - ధీరోదాత్తుడు. తన సకలాంబోధి పరీతభూవలయమెల్ల "భావంబందొక శంకలేకొసగితిన్ బ్రహ్మార్పణంబంచు" అని తృణప్రాయంగా దానంచేసిన త్యాగి. ఈపాత్ర ధరించేవారు యీ విషయం గ్రహించాలి. తన భోగభాగ్యాలుపోయినందుకు "శ్రేయోబంధుర సార్వభౌమపద విశ్లేషంబు ప్రాప్తించె బో" మొదలగు అనేకపద్యాలదగ్గర విచారిస్తున్నట్టునటించడం ఆపాత్రకు అవమానం. అంతకంటే దారుణం భార్యనమ్మినతరువాత విడిపోయేటప్పుడు భోరుమని ఏడవడం, "కొడుకా కష్టములెన్ని వచ్చినను" పద్యం పాడుతూ కన్నీరుకార్చడం. ఈ ఏడ్పులుచూస్తుంటే గొప్పకి రాజ్యం యివ్వడమెందుకు తరువాతఇలాఏడవడమెందుకు అనాలనిపిస్తుంది. కాబట్టి యీ పద్యాల్లోని భావప్రకటన ఎంతో గంభీరంగా చెయ్యవలసివుంది. ఘొల్లుమనిఏడవవలసింది తనుకాదు, సామాజికులు అనేది యీ పాత్రధారులు గుర్తించడం అవసరం.

## కలహకంఠి ఎవరు ?

నాటకాంతంలో విశ్వామిత్రుడు హరిశ్చంద్రునితో "పనిగత్తెగ నీ వనితను గొనినాతడు బాలచంద్రకోటీరుడు" అంటాడు. అంటే చంద్రమతిని బానిసగకొన్న కాలకౌశికుడు పరమేశ్వరుడు. దీనివల్ల అతని భార్యయైన కలహకంఠి పార్వతీదేవి అని తెలుస్తోంది. నేటి ప్రదర్శనల్లో యీ కలహకంఠిమాట్లాడే బూతులు చింతామణిలో శ్రీహరి బూతుల్ని తలదన్నుతున్నాయంటే అతిశయోక్తికాదు. రచయిత వ్రాయని ఒకబండెడు స్వగతం బట్టీపట్టుకొచ్చి, ఎకసక్కేలాడుతున్నారంటూ ప్రక్కింటివాళ్ళనీ, పిల్లలుపుట్టించలేని అసమర్థుడని మొగుణ్ణీ తిడుతూ హాస్యం పేరుతో అశ్లీలం పలకడం ఆపాత్రకు అన్యాయం. పోనీ యీమాటలు చంద్రమతిఉండగా అంటే ఆమెవద్ద అట్లు నటించవలసిన అవసరంవుందిగదా అని సరిపెట్టుకోవచ్చు - కానీ ఎవరూ లేకుండా తను ఓ అరగంట అశ్లీలపదాలతో ఏకపాత్రాభినయంచెయ్యడం పార్వతీదేవికి అపచారం. రచయిత ఆమెను గయ్యాళిగా చూపినది చంద్రమతి సమక్షంలోమాత్రమే. ఇది గమనించకుండా పాత్రదారులు నటిస్తుండడం శోచనీయం.

## వీరబాహుడు విలపించడం దేనికి ?

అసలు వీరబాహుడెవరు ? చివరకు విశ్వామిత్రుడు చెపుతాడు హరిశ్చంద్రునితో "నినుదాసునిగగొన్న కాటిరేడు యముడుగాని కడజాతివాడు కాదు" అని. ఈనాడు చేస్తున్న ప్రదర్శనలలో వీరబాహుడుపాత్రధారులు హరిశ్చంద్రునికి కుండ, కర్ర యిచ్చి కాటికాపరిగా పంపి హరిశ్చంద్రుని తను కష్టపెడుతున్నానని పరితపిస్తూ గంపెడు స్వగతంతో పశ్చాత్తాపం ప్రకటిస్తూ కన్నీరుమున్నీరుగా విలపిస్తున్నారు. తను పెట్టే కష్టాలకు తట్టుకొనికూడా సత్యంకోసం నిలబడగలడాలేడా అనే పరీక్షచెయ్యడానికిదిగివచ్చినవేల్పు యముడు. అంటే ఒక ఉద్దేశంతో ఆ కష్టాలు తనే కల్పిస్తున్నాడు. అటువంటప్పుడు తనేఏడవడమేమిటి ? పశ్చాత్తాపం దేనికి ? ఇది చాలా అసంబద్ధం. రచయిత అలా వ్రాయలేదు. పరీక్షమేరకే ఆపాత్ర వ్రాశాడు. దానికి స్వంతపైత్యం కల్పించేసి ఓ అరగంటపైగా యముణ్ణి మనముందు ఏడ్పించడంవల్ల కథకుకలిగిన బలమేమిటి ? "క్లయిమాక్సు"లో అసలుకథ వేగంపుంజుకుంటుంటే దాన్ని ఆపుజేసి

నాటకంనిడివి నిర్దాక్షిణ్యంగా పెంచేసి కాలాతీతంచేసి ప్రేక్షకుల్ని చివరి సీనుదాకా కూర్చోలేకుండా చేస్తున్నవి యిలాంటి అనవసరపు కల్పనలే. వీరబాహుడు యముడుఅనేది యీ కథలో "ట్విస్టు". అది చివరిదాకా గుప్తంగావుండి ఆఖరునతెలిస్తేనే సరిగా నిర్వహింపబడినట్లు. అందుకే రచయిత యిది చివరన తెలిపాడు. ఇది ఆ స్వగతంలో ముందే చెప్పేయడంవల్ల కావలసిన సస్పెన్సుపోతోంది. రచయితప్లాను దెబ్బతింటోంది. ఇక యీనాటకంలో ముఖ్యమైనఅంశం ఆఖరున పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై హరిశ్చంద్రునిమెచ్చి వరములనీయడం వగైరా. ఈ భాగాన్ని ఎవ్వరూ ప్రదర్శించకపోవడంవల్ల సత్యవాక్కుకువచ్చిన సద్యఃఫలం చివరికి మిగిలిన కొద్దిపాటిప్రేక్షకులకుకూడా తెలియడంలేదు.

అందువల్ల నేటి పరిణామవేగాన్ని, వాతావరణాన్నీ అనుసరించి షేక్స్పియర్ "హేమ్లెట్," "మేక్బత్" వగైరానాటకాలు ఎబ్రిడ్జిచేసి ఎలా వేస్తున్నారో అలాగే ఈనాటకాన్నికూడా ఆక్కరలేనిభాగాన్ని తగ్గించి మొత్తంనాటకాన్ని రెండున్నరగంటలకు కుదిస్తే ప్రేక్షకులు మధ్యలో లేచి పోయేరన్నబాధ ప్రదర్శకులకూ ఉండదు, నాటకం అసాంతం చూడలేక పోతున్నామన్నబాధ ప్రేక్షకులకూ ఉండదు.

## చింతామణి నాటకం

ప్రాచీననాటకాలలో యీనాటికీ జానపదులలో సజీవంగా నిలబడ గలిగిన నాటకాలలో కాళ్ళకూరి నారాయణరావుగారి "చింతామణి" ఒకటి. దీనికి కారణం యిందులోని కథాసంవిధానం, సార్వజనీనము, సార్వకాలిక మూనయిన సాంఘిక ప్రయోజనంగలయితివృత్తం, కండపుష్టికలిగిన పద్య రచన, రచనాశిల్పం, రసపోషణ, అలంకారప్రయోగం, చతురోక్తులు, హాస్యోక్తులు కలిగిన సన్నివేశాలు, భిన్నమనస్తత్వాలుగల తారాతోరణం ఈనాటకాన్ని పండిత పామర జనరంజకంగా చిరంజీవిని చేశాయి.

ఇందులో ముఖ్య పాత్రలు బిల్వమంగళుడు, భవానీశంకరుడు, సుబ్బిశెట్టి, దామోదరుడు, శ్రీహరి, చింతామణి, చిత్ర, రాధ.

నాటకం దృశ్యకావ్యంగదా ! దీనికి ముందుగా పాత్రల వయస్సులు, స్వభావాలు నిర్ధారించుకోనిదే ఆహార్యం, వాచికం సరిపెట్టడం సాధ్యంగాదు. ఇందులో ఆ పాత్రల వయస్సులూ, స్వభావాలు తెలిసికోవాలంటే నాటకం లోని వివిధవిషయాలఆధారంగా యీ నిర్ణయం చెయ్యవలసి ఉంటుంది.

బిల్వమంగళుడు, భవానీశంకరుడు సహాధ్యాయులుగాన వీరిరువురిదీ ఇంచుమించు ఒకేవయస్సు అయివుండాలి. బిల్వమంగళుడు, దామోదరుడు మిత్రులుగనుక వీరిరువురిదీకూడా దాదాపు ఒకటే వయస్సుగా భావించవచ్చు. అంటే ఈ ముగ్గురూ సమ వయస్కులు. వీరికందరికీ భార్యలున్నట్లు చెప్పాడేగాని ఏఒక్కరికీ పిల్లలున్నట్లు ఎక్కడా చెప్పలేదు. అంటే వీళ్ళంతా గొడ్రాళ్ళే అనుకోలేంకదా! అందుచేత వీళ్ళకి పెళ్ళిళ్ళయి యింకా ఎంతోకాలంకాలేదనిమాత్రం మనంఅనుకోవాలి. ఆరోజుల్లో మగవాళ్ళ పెళ్ళి వయస్సు సాధారణంగా 20–25 సంవత్సరాలమధ్య వుండవచ్చు.

ఇక సుబ్బిశెట్టి– ఇతనినిగురించి చింతామణితో శ్రీహరి అన్న మాట "అతడీమధ్య తండ్రికన్నులలో కారంచల్లి కాసులకుకాసులుతెచ్చి ఖర్చు పెట్టుచున్నాడనికూడావిన్నాను". అంటే యితను తండ్రిచాటు బిడ్డన్నమాట. డబ్బు స్వేచ్ఛగాఖర్చుచేసుకొనే అవకాశంరాని వయస్సు. దీనిని బట్టి ఆలో చిస్తేస్థూలంగా అతని వయస్సుకూడా 25–27ల మధ్యే ఉండవచ్చు. మరి ఆ పాత్రలు ఆరుపదులుదాటి పళ్ళూడిపోయిన ప్రముఖులు వేస్తుంటే ఔచిత్యం సంగతేమిటి?

ఇక శ్రీహరివయస్సు చెప్పడానికి శ్రమపడనక్కరలేదు. ఆమెను గురించి దామోదరుడుచేసిన వర్ణనునుబట్టి ఆమె 70 ఏండ్ల పైబడ్డముసలిది అని తెలుస్తోంది. కవిచెప్పినవాలకం ఇంత స్పష్టంగావుండగా కొందరు శ్రీహరిపాత్రధారులు నడివయస్సుపిల్లలాతయారై బండబూతులుమాట్లా డుతూ బిగిసడలని భరతనాట్యాలుకట్టడం మరీవిడ్డూరం. పైగా స్వగతాల రోజులుపోయి దశాబ్దాలుగడిచిపోయినా నాటకంలో వ్రాసిన స్వగతాలు చాల వన్నట్లు రచయితకవిత్వానికి వీరిపైత్యంకూడాజోడించి చేంతాడు లాంటి స్వగతాలు ,పుట్టలకొద్దీవాగెయ్యడంచూస్తే యిది "చింతామణి" నాటకమా "శ్రీహరి, సుబ్బిశెట్టి" నాటకమా అనిపిస్తుంది.

ఇక చింతామణి - ఈమె పరువంలోవున్నపడుచు, సుందరాంగి అనేది బిల్వమంగళుని యీ క్రిందిపద్యంలో మనకు కళ్ళకుకట్టినట్లు కనబడుతోంది.

బిల్వ :- "ఓహో ఏమి సౌందర్యము !

ఉ. "రెప్పలు వాల్పకుండిన ధరిత్రిని పాదము లంటకుండినన్
దప్పకరంభయో, ఘృతాచియొ, మేనకయోయంటచునీ
కప్పురగంధిపట్ల భ్రమకల్గకపోవునె? యాలకింపలే
డిప్పురమందె యిట్టిజలజేక్షణ యున్నదటంచునెప్పుడున్ "

స్త్రీకి యీలాలిత్యం, లావణ్యం, సోయగం సాధారణంగా 18-28 ఏండ్లమధ్యనేఉంటుంది. కాబట్టి ఈమెకూడా 24-26 ఏండ్లమధ్య నవనవ లాడుతూ నాజూగ్గా వుండివుండాలి. కాని నేటికాలంలో యీపాత్ర వల్లమాలిన వొళ్ళుపెంచుకుని వయసుమీరినవనితలు వేస్తున్నారు.

ఇక రాధ : ఈమె బిల్వమంగళునిభార్యకావడంవలన హైందవసంప్రదాయానుసారం ఆమె అతనికంటె ఎంతోకొంత చిన్నదైఅయివుండాలి. కనుక ఆమె వయస్సు 20-24 సంవత్సరాలుగా చెప్పవచ్చు. భవానీ శంకరుడు చింతామణితో బిల్వమంగళునిగురించి చెప్పేటప్పుడు "అతని భార్య భూలోకరంభ" అంటాడు. అంటే యీమెకూడా అద్వితీయ సౌందర్యవతి అని తెలుస్తోంది. అతను ఆమాటప్రయోగించిన సందర్భమును బట్టిచూస్తే ఆమె యించుమించు చింతామణికంటే సౌందర్యవతి కావచ్చునేమో అనిపిస్తుంది. అటువంటి పాత్రను నేడు నాటకాలలో ధనాభావంవల్లనో, తగుశ్రద్ధలేకనో, నటీమణులు లభ్యంకాకనో మొక్కుబడిగా ఎవరో మొగంముడతలుపడిన ముసలమ్మతోనో, రూపురేఖలులేని అనాకారితోనో వేయించి తంతునడిపేస్తుండడం చాలా అన్యాయం.

చివరిపాత్ర చిత్ర : ఈమె మాటల్లోని అమాయకత్వం వయస్సురాని ఎదిగిఎదగని కసుగాయమనస్తత్వాన్నిసూచిస్తుంది. ద్వితీయాంకంలో ప్రవేశిస్తూ "అమ్మా! ఎవరో సుబ్బిశెట్టిగారంట, పెద్దిశెట్టి గారికొడుకంట, లోపలకొచ్చి అక్కయేంచేస్తోందని అడిగారు. మేడమీదున్నాదనిచెప్పేను ఆమటునఅదేంసెప్మా...." అనిఆలోచిస్తుంది. ఈ మరుపుధోరణి ఎదగని

మనస్తత్వాన్ని తెలుపుతుంది. అంతేగాకుండా ద్వితీయాంకంలో చిత్రలోపల నుండివచ్చి వెకిలినవ్వుతో "మాయక్క పక్కనున్నంచుంటే మాబావగారి మొహానికెంతెలుగొచ్చిందో ?" అనేమాట అపరిపక్వస్థితిని తెలుపుతుంది.

ఆడవారివిషయంలో ఎదిగీ ఎదగని వయస్సు అంటే 12-15 సంవత్సరములమధ్యనే, ఇలాంటివేషానికి 10ఏండ్లుకూడా పూర్తిగారాని పసిపిల్లనో, లేక పాతికేండ్లుదాటిన మధ్యవయసుమనిషినో ఎన్నుకోవడం ఔచిత్యం లేనిపని.

చింతామణి స్వగతంలోనిమాటలవల్ల చివరికి చిత్రఎవరో మనకు స్పష్టంగాతెలుస్తోంది. "పాపము - పూలదండకిది యెంత మొగమువాచి యున్నదో ! భగవంతుడేమిపాపముచేసినకన్నెలకు పడుపుగత్తెలయింట దాస్యమును, కోడరికము ప్రాప్తింపచేయునోగాని

గీ॥ "సానికిని జారులకు మితిలేనిసేవ,
కూరయును, నారయునులేని కూడు, సాని
కట్టి చింపిన పుట్టము - కటిక నేల
పడక, నిలువెల్ల కోతలు - వాతలు గద"

అంటుంది చింతామణి. దీనినిబట్టి చిత్ర యింటికోడలయినాకావాలి, లేదా దాసియైనాకావాలి. కోడలుకాదుగనుక దాసీపిల్ల అని నిర్ధారణగా తేలుతోంది. ఇప్పుడయినా యీామె ఆహార్యమెలావుండాలనేది గ్రహించాలి యీామె చేత పెరికాట్, షెర్లిన్ చీరలుకట్టించే సమాజాలు.

## చింతామణి దైవభక్తురాలా ?

చింతామణి మొదటినుండీ దైవభక్తురాలనీ, కాబట్టే చివర విరాగిని అయిపోయిందనీ కొందరు అంటుండడం వింటుంటాం. అలాభావించిన కొందరునటీమణులు ఈ పాత్ర ప్రవేశందగ్గరనుంచీ వీలుదొరికినప్పుడల్లా మీరాబాయిలా భక్తిగీతాలు దంచేస్తుంటే ఈమె నిజంగా ఆదినుండీభక్తురాలేనేమో అనేభావం కలుగుతుంది. కాని కవి ఈమె తొలుతనుండీ కృష్ణభక్తురాలని ఎక్కడాచెప్పలేదు. కవివ్రాసిన ఆమెమాటలనుబట్టికాని,

ఆమెనుగురించి ఇతరులుచెప్పినమాటలనుబట్టిగాని ఆమె ఆదినుండి భక్తి తత్పరతగలిగినవనితగా ఎక్కడా కానరావడంలేదు. కాకపోతే వేశ్యావృత్తి మీద అప్పుడప్పుడు అసహ్యపడుతున్న వేశ్యగామాత్రం కనబడుతుంది.

ఇలా అసహ్యించుకోవడం "భక్తురాలుగనుక" అని భావించడం హేతుబద్ధంకాదు. సానివృత్తి ఆమెకు యిష్టంలేదని, సంసారిగా బ్రతకాలనీ అంతరాంతరాల్లో ఆమె మనస్సు కోరుతోందనీమాత్రం ఎవరయినా అంటే ఒప్పుకోగలం. ఇంతేకాదు — శ్రీహరి భవానీని బయటకుత్రోలివేయమనిచెప్పినప్పుడు చింతామణి "అంతసొమ్ము పెట్టినవానిని ఇంతలోనే అవతలకుకొట్టలేక చూచుచున్నానమ్మా" అని చెప్పేమాటలవల్ల ఆమెలోని మానవత్వం మనకుకనిపిస్తుంది. కాని అది దైవభక్తికాదు. ఒకవేళ ఆమె భక్తురాలేఅయితే అసలామె వ్యభిచారంఅనే సేవపుపని చెయ్యనేచెయ్యదు. అలాచేస్తూ భక్తిగీతాలుపాడుతూవుంటే అది దొంగభక్తే అవుతుందిగాని నిజమైనభక్తి అనిపించుకోదు.

అయితే ఈమె ఆఖరున హఠాత్తుగా భక్తురాలుగామారుట ఎలా సంభవమనేది ప్రశ్న. విజ్ఞులైనవారు ఏదోఒకసంఘటనపూలంగా చకితులై అలామారినఉదంతాలు లేకపోలేదు. ప్రాచీనకాలంలో వేమన, అర్వాచీన కాలంలో ఏలం యిలామారినవారే. ఈమెనుకూడా ఆ కోవలోకి చేర్చడంలో తప్పులేదు. కారణం ఈమెకూడా ఉద్దండపండితురాలుగనుక. అయితే ఈమెలో ఈమార్పురావడానికి యీ నాటకంలోచూపిన కృష్ణాష్టమినాడు ఏప్రేరణాలేకుండానే కృష్ణభక్తిలోపడిపోయినట్లు చెప్పడం అర్థవంతంకాదు. కలలో శ్రీకృష్ణుడుకనపడి ఆమెనుమార్చివేసేడంటే అది వ్వేరేవిషయం. ఆమె పూర్వజన్మవాసనవల్ల అలామారిపోయిందని అలౌకికవాదంచేస్తే వారికి ఇక చెప్పేదేమీలేదు. కాని హృదయమున్న మనిషిమారడానికి ఈ కృత్రిమపద్ధతి ఏమీఅక్కరలేదు. తనమీదమమకారంతో గాలివానలోతడిసిపోయి, రక్తపుమరకలతో, హోరుగాలిలో తండ్రిశవాన్ని విడిచి, భార్యాశవాన్ని తెప్పగాజేసికొని ఏరుదాటివచ్చిన ప్రియుణ్ణిచూసినప్పుడు ఇంతటిదారుణానికి ఘోరపతనానికీ ఇంతటి భీభత్సానికీ తానేకదాకారణమనేభావనవస్తే అది మానవత్వంగల ఆమెహృదయాన్ని కలచివేసి, నిలువునాదహించివేసి నిజంగా విరాగినిచేస్తుంది. ఇలాచూపిస్తే వాస్తవికపోకడకూడా అవుతుంది.

# దామోదరుడు గాయకుడా ?

ఈ వేషంవేసేవాళ్ళు సాధారణంగా నారదునిపాత్రలాగ తెగపాడే యడమే ప్రధానంగాపెట్టుకుని వేస్తుండడంవల్లా, ఎప్పుడూ హాస్యపుమాట ఉచ్ఛరించడమేఎరుగనివాళ్ళూ, పద్యాలు కర్రాడిలానిలబడి బడిపిల్లాడిలా దడదడాఅప్పగించేసి, చేంతాడురాగం తీసిపారేసేవాళ్ళూ ఇంతవరకు ఈపాత్ర వెయ్యడంవల్లా ప్రేక్షకులలో దీనికి గాయకుడుగా ముద్రపడిపోయింది. వాస్త వానికి పాత్రయొక్క వచనంలో సున్నితమైన హాస్యముంది. రేడియో బావ గారిలా మాటవిరిచి చక్కగా హాస్యపూరిత అభినయంతో అంటే యిది అన్నిటినిమించిన సున్నితమయిన కామెడీరోల్ అవుతుందనేదినిస్సందేహం.

తొలిరంగంలో దామోదరుని ఒక భక్తునిగా చూపాలనేది భావం. దానికోసం తెరముందుకువచ్చి తిక్కనగారిపద్యం "అరయన్ శంతను పుత్రుపై" అనేమత్తేభంఅంతాచదివి ఆ పైన బోలెడురాగంతీసి బల్ల మీదున్న రాధ, బిల్వమంగళ పాత్రలను బలితీసుకోవడం నాటకానికి లక్షణంకాదు. వాళ్ళు 4 నిమిషాలసేపు నిర్వికారంగా కూచోవడం నాటక రమ్యతను చెడ గొడుతోంది. దానికి బదులు ''హరేరామ హరేరామ రామరామ హరేహరే, హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే" అంటూ ప్రవేసిస్తే దామోదరుని భక్తిభావం యిట్టే అర్థమవుతుందిగదా ! దీనివల్ల పక్క పాత్రలు దెబ్బ తిననక్కరలేదు కూడా.

ప్రవేశంలో సుబ్బిశెట్టి చింతామణిని చూడగానే వెర్రిమొగం వేసి అదిరిపోతున్నట్లూ, బెదిరిపోతున్నట్లూ, ముట్టుకుంటేనే మతిపోతున్నట్లూ, వెకిలి అభినయంతో గంటన్నర తినేసే హాస్యనటులు ఒక్కసంగతి గుర్తుంచు కోవడం అవసరం. ఇతడు పచ్చి వ్యభిచారి. రంగనాయకి అనే సానింటికి 7, 8 సార్లు వెళ్ళానని తనే ఒప్పుకుంటాడు. ఇక తెలుగే సరిగారాక అత్తమ్మను "లత్తప్ప" ని నాటుగా మాట్లాడే యీసెట్టి పాత్రకు పాత్ర ధారులు స్వచ్ఛమైన ఇంగ్లీషు మాటలుకూడా జోడించి గుప్పెయ్యడం ఏమి న్యాయం ? హాస్యాన్ని సృష్టించడంకోసం నాటకం ఆపేసి స్వంత డైలాగులు అసందర్భంగా తట్టలకొద్దీ వాగెయ్యడం కాదు సమర్థత. పాత్ర స్వభావాన్ని కనుగొని వీలైనంతవరకూ అందులోని మాటలతోనే మెరుగు తేవడం, అందునుంచి అభినయంతో హాస్యం పుట్టించడం ఉత్తమ నటుల లక్షణం.

ఉన్న టెక్స్టును వదిలేసి నాటకం నడవకుండా గంటలకొద్దీ స్వగతంతో ఏక పాత్రాభినయంలా చేసేస్తూ స్టేజినీ, టైమునీ మింగేస్తూ, పచ్చి బూతులు మాట్లాడేస్తుంటే గవర్నమెంటు నిషేధించవలసింది భోగం మేళాలకంటే ముందు చింతామణి నాటకాన్ని అని చెప్పవలసివస్తుంది. శ్రీహరి, సుబ్బిశెట్టిలిద్దరూ ఈ నాటకాన్నిలా సజీవసమాధి చేయడం క్షంతవ్యం కాదు.

## గయోపాఖ్యానం

ప్రాచీన తెలుగు నాటకాలలో విశేష ప్రశస్తిగన్న మేటి నాటకం చిలకమర్తివారి గయోపాఖ్యానం. లక్ష ప్రతులకుపైగా అమ్ముడుపోవడమే దీని విశిష్టతకు ప్రత్యక్ష తార్కాణం. ఆంధ్రదేశంలో యీ ప్రదర్శన జరగని ఊరూ లేదు, ప్రదర్శించని పౌరాణికనాటకసమాజమూ లేదు. జానపదులకు యిది ఎంతో ప్రీతిపాత్రము.

ఈ ప్రాచీన నాటక సమీక్షకు ఆధునికపు తూకపురాళ్ళు వాడితే విమర్శనా పద్ధతికే విరుద్ధం. దీని కొలబద్దలు వేరు. సంస్కృత నాటక లక్షణాలతో వ్రాయబడ్డ దృశ్యకావ్యం. బెర్నార్డ్‌షా ప్రొలోగ్స్‌లాగ, నేటి ముందుమాటలాగ, నాడు నాందీ ప్రస్తావనలు ఉండేవి.

నాటకం ప్రారంభించడానికి ముందు ఆచరించే కర్మ విశేషం నాంది. ఇది పూర్వరంగం, ఉత్తరరంగం అని రెండు భాగాలు. పూర్వరంగం అనేది నేపథ్యంలో చెప్పబడే ఆశీస్సు. అది యిందులో 'బ్రహ్మ నయమ్మ నోముతన్' అనే వాక్యం అంతంగాగల పద్యం. ఉత్తరరంగంలో సూత్రధారుడు, నటి ప్రవేశించి నాటకాన్ని గురించి రచయితను గురించి, ప్రదర్శన గురించి చేసే ప్రసంగం, ఋతువర్ణన అనంతరం పాత్రప్రవేశం సూచించడం "ప్రస్తావన" అంటారు. ఇందులో నాటక రచయిత 'చిలకమర్తి' అని, యితివృత్తం "వసుదేవాత్మజ పాండునందనుల సంవాదంబె" అని చెప్పి వసంత ఋతువర్ణనచేసి సూత్రధారుడు నటితో "సాత్యకియు, కౌశికుడు తెరచాటు నుండి చూచుచున్నారు మనవంక సుదతిరమ్మ" అని పాత్రప్రవేశం సూచించి నిష్క్రమిస్తారు. ఇలా లక్షణ బద్ధంగా ప్రారంభమవుతుంది యీ నాటకం.

ఇక యితివృత్తానికొస్తే ఆధునికంగా యీ కథ యిలా చెప్పవచ్చు. గయారావు అనే ఒకాయన కారులో వెళుతూ బయటకు ఉమ్మేశాడు చూడ

కుండా. అది ఆరోడ్డుప్రక్క నిలబడ్డ కృష్ణమూర్తి అనే కామందుమీద పడింది. ఆయనకు కోపంవచ్చింది. కారులోవెళ్ళేవారెవరో తెలుసుకుని 48 గంటల్లో ఆ గయారావుని "మర్డర్" చేస్తానని ప్రతిజ్ఞచేశాడు. ఇది గయా రావుకితెలిసి హడలిపోయి మండల ప్రెసిడెంటుగారి దగ్గరికెళ్ళి రక్షించ మన్నాడు. ఆకృష్ణమూర్తి బలంతోనే నేనుప్రెసిడెంటయ్యాను, నావల్ల కాదన్నాడు. గయారావు బెంబేలెత్తిపోయి తిరుగుతుంటే నారయ్యనేఆసామీ ఓచిట్కా చెప్పేడు. ప్రక్క ఊరిలో కృష్ణమూర్తిబావ అర్జునరావున్నాడు. అతనికాళ్ళమీదపడి రక్షిస్తానంటేగాని విడిచిపెట్టకు. బావగారితోతగువుకు కృష్ణమూర్తిసిద్ధపడడు. దానితో నిన్నొదిలేస్తాడు. నువ్వు ముందుమాత్రం విషయంచెప్పకుండా వాగ్దానంపుచ్చుకో అని సలహాయిస్తాడు. గయారావు సరిగ్గా అలాగేచేస్తాడు. అర్జునరావు అభయమిస్తాడు. కృష్ణమూర్తి పుట్టింటి దగ్గరున్నచెల్లెలు సుభద్రమ్మనిపంపిస్తాడు యీగొడవలోకిరావద్దని భర్తకు చెప్పమని. అర్జునరావు ఆమెమాట వినలేదు. కృష్ణమూర్తి స్వయంగావచ్చి నయానాభయానాచెప్పిచూస్తాడు. అర్జునరావులొంగకుండా గయారావుని రక్షిం చడంకోసం పోరుకుసిద్ధపడ్తాడు. అప్పుడు మంత్రి శివయ్యగారొచ్చి దెబ్బలాటఆపుచేసి, క్రిందకిచూసుకోకుండా ఉమ్మివేయడం గయారావు తప్పనీ, తెలియకఉమ్మేసినదానికి ఏకంగా చంపెయ్యడానికేపూనుకోవడం కృష్ణమూర్తితప్పనీ, ఆలోచించకుండా అభయంయివ్వడం అర్జునరావుతప్పనీ చెప్పి, ఇద్దరూ కావలసినవాళ్ళూ, బంధువులూ, ఒకేపార్టీ వాళ్ళు కావడంవల్ల దెబ్బలాటతగదనీ, గయారావుకూడా వారి వర్గంవాడేననీ, నిజాయితీఅయిన కార్యకర్తఅనీ తెలిపి తగువు పరిష్కారంచేస్తాడు. అప్పుడు కృష్ణమూర్తి మావూళ్ళోఅందరిముందూ నేను గయారావుని చంపకపోతే వాసుదేవరావు కొడుకునేకానని ప్రతిజ్ఞచేశానే ?అన్నాడు. దానికిశివయ్యగారు నువ్వు నిజంగా వాసుదేవరావు కొడుకువికావుగా ! దత్తుడివిగా ! అందుచేత ఆమాటకిబ్బం దేమీలేదని సర్దేస్తాడు. దీన్నిపురాణపాత్రలలోనికి జాగ్రత్తగామలిచి కృష్ణుడు యమునానదిలో సూర్యునకర్ఘ్యమిస్తుంటే బ్రహ్మలోకంనుంచి విమానంలో వెళుతున్న మణిపురాధీశుడైన గంధర్వరాజు గయుడు నిష్ఠీవనమ్ము విడువగా అది కృష్ణునిదోసిలిలోపడింది. దానికి కృష్ణుడు ఉగ్రుడై అతనిని సంహరింప ప్రతిజ్ఞబట్టి చక్రాయుధాన్ని విడిచిపెడతాడు. ఇది

విన్న గయుడు తనను రక్షించమని బ్రహ్మదగ్గరికివెళతాడు. విష్ణువు గర్భం నుంచి పుట్టినవాణ్ణినేను, ఈ విషయంలో సాయంచెయ్యలేనంటాడు. గయుడు ఎక్కడా ఆశ్రయందొరక్క తిరుగుతుంటే నారదుడుకనుపించి ద్వైతవనంలో వున్న అర్జునుడు ఒక్కడే నిన్ను కావగలడనిచెప్పి ముందు అసలువిషయం చెప్పకుండా శరణు వేడమనీ, అభయమిచ్చినతరువాత అసలుసంగతి చెప్ప మనీ ఉపదేశిస్తాడు. ఆప్రకారం అర్జునుని శరణువేడడం, అర్జునుడు అభయ మివ్వడం, కృష్ణునికితెలిసి అతనిని విడిచిపెట్టమని సుభద్రను పంపడం, అర్జునుడు నిరాకరించడం, కృష్ణార్జునయుద్ధం, శివుడువచ్చి వారివారి ఒప్పు తప్పులుచెప్పి గయుడు కూడా వారిభక్తబృందంలోనివాడేఅని విశదపరచి రాజీచెయ్యడం కథాంశం.

ఇందులో నాటకీయతంతా కృష్ణునిశపథం, దానికి శివుడుచెప్పిన నిర్వ చనంమీదే ఆధారపడివుంది. కృష్ణుడు బలరామునితో చేసిన శపథం - యిది.

"ఈ విధి నద్దురాత్ము వధియింపక పోవుదునేని దేవకీ
దేవికి పుణ్యమూర్తి వసుదేవునకున్ తనయుండ గానికన్
ధీవినుత ప్రభావులగు దేవరకే ననుజుండ గానికన్
పావనమైన యట్టి యదువంశమునన్ జనియింప లేదికన్".

ఈ ప్రతిజ్ఞకు ఆఖరున పరమేశ్వరుడు కృష్ణా ! నువ్వు నిజంగా దేవకీ వసుదేవుల పుత్రుడవుకావు, స్వయంభుడివి. బలరాముడు నీకు సోదరు డేమిటి ? నీ పాన్పుగాని - (ఆదిశేషువు). వీళ్ళు నిజంగా యాదవులా ! దేవతలుగాని - కనుక నీమాటలు పొల్లుకాలేదని విడమర్చి చెబుతాడు.

ఇక కవితాఛాయలకొస్తే అందమైన అలంకారప్రయోగాలు ఎన్నో కనిపిస్తాయి. నాందిలో సూత్రధారుడు ప్రదర్శనలోని మంచిచెడ్డలు గురించి యిలాఅంటాడు.

"నిండు దివ్వెలతోడ క్రీనీడలట్లు
అలరుగురివెంజపూసల వలువులట్లు
గుణగణముతోడ దోషముల్గూడియుండు
ప్రాజ్ఞులుక్షమింతురితరులు పరిహసింత్రు"

కృష్ణుడు సూర్యోదయాన్ని వర్ణిస్తూ -
"అబ్జహితుడను కారాగృహాధికారి
కిరణమను తాళపుజేతకీలెదల్చి
దళములను తలుపులనుతీయ వెలికివచ్చు
తుమ్మెదలు తమ్మిచెఱనుండి దొంగలట్లు"
అంటాడు.

ఇది కాళిదాసు ప్రయోగమేఅయినా రమ్యంగా సందర్భశుద్ధితో చక్కగా అనువదించి చూపేరు. సాత్యకి చంద్రాస్తమయ, సూర్యోదయాల్ని వివరిస్తూ కలువలను, పద్మాలను గురించి అర్థాంతరన్యాసంలో యిలా అంటాడు.

"ఒక్కచో పుట్టి పెరుగుచున్నవయ్యు
ఒండొరుల పొడల్కిట్టకయున్న వకట !
కలువ పూల్దమ్మిపూవులు, కాలవశత
జ్ఞాతివైరముండును పుష్పజాతికైన."

తెల్లవారుజామున పిట్టల అరుపుల్ని కృష్ణుడు పోల్చినతీరు మరీ అందంగా ఉంటుంది. "కమలబాంధవుడను పుత్రుకనెడువేళ, తూర్పుదిక్కను చూలాలి దుస్సహంపు. ప్రసవవేదనగతి వినంబడెడు చెవికి, గుములుగూడి కూసెడి పులుంగులయెలుంగు" అని. కథలో అన్ని రసాలూకూడా పుష్టిగా పోషింపబడ్డాయి. కౌశికుడు హంసపదికను మేల్కొలుపుటకు చేసిన ప్రయత్నంలో "పోయి హంసపదిక నెట్లు మేల్కొలుపుదునని ఇంచుక విచారించి ఆమె మంచంక్రింద దూరి కుక్క మొఱిగినట్లు మొఱుగనారంభించితిని.

ఆమెయు అదిరిపడిలేచి రెండుమూడు నిమిషములాలోచించి, మంచం క్రింద మెఱుగుచున్నది కుక్కకాదని నిజము గ్రహించి ప్రక్కనున్న బెత్తమును పుచ్చుకొని నాకు నాలుగు వాతలు తగులనిచ్చెను. అప్పుడు నేను "నేను కుక్కనుగానే, కొట్టకే, కొట్టకే" అని మొఱుగుటమాని మొఱపెట్టితిని. అప్పుడది "ఛీ — నీవు కుక్కవే – మాటలునేర్చిన కుక్కవుసుమీ అని తన పనిని రెట్టించెను. అంతటనేను దెబ్బలుతినలేక యివతలకువచ్చి గోళ్ళతో దానిఒడలు బరికి పండ్లతో దానిబుగ్గలు కొరికి ప్రాణములుదక్కించుకుని యివతలబడితిని" అంటాడు. సరసం మోటుగాఉన్నా హాస్యశృంగారాలకిది ఆటపట్టు. జానపదులకవ్వించే రసపట్టు.

హంసపదిక రుక్మిణీ సత్యభామలతో ఏదో చెబుతుంటే అదేమిటని కౌశికుడు ప్రశ్నిస్తాడు. దానికామె "నీ కడుపులో అనుమానం పీడించు చున్నదిగాని, నీ విషయము నేనెవ్వరితోనేమియూ జెప్పలేదు. అనేక అవతారములెత్తిన శ్రీమన్నారాయణుని చెలికాడవగుటచేత నీవును కొన్ని అవతారము లెత్తనేర్చితివనిమాత్రము వీరితో చెప్పదలచితిని" అన్నది. దానిపై కౌశికుడు 'ఏమి అవతారము లెత్తనేర్చితిని ? అని దబాయించగా, ఆమె "ఆయన నరసింహావతారమెత్తెను, నీవు గడియక్రింద గ్రామసింహావ తారమెత్తితివి" అంటుంది. ఇలాంటి సాహిత్య ఛలోక్తులతోకూడిన సుతి మెత్తని హాస్యంకూడా ఉంది.

గయుని సంహరింప విష్ణుచక్రమువచ్చుచున్నదని ఆకాశవాణి చెప్పి నప్పుడు —

"నా మనోహరుగాచి నన్ను రక్షింపరే
పుణ్యులార, పుడమి వేల్పులార"

అని రోదించే చిత్రరేఖావిలాపం, గయుడు విష్ణుచక్రం బారినుండి తప్పించు కోవడానికి పలువురిని ఆశ్రయించి విఫలుడై "పాతాళమునకేగి బ్రతుక

వచ్చునటన్న బలిచక్రవర్తినన్ పట్టియిచ్చు" అంటూ దీనంగా విచారించే ఘట్టం ప్రతివారిచేతా కంటతడిపెట్టిస్తుంది. ఇక్కడ కరుణరసం ఏరులై పారుతుంది.

"శరణుశరణు" అని కాళ్ళమీదపడినగయుని అభయమిస్తూ అర్జునుడు "నిటలాక్షుం డిపుడెత్తివచ్చినసురాని" అని పలికే వీరాలాపములు వీరరసాన్ని ప్రస్ఫుటింపచేస్తాయి. చేతిలో నిష్ఠీవనంబు పడినప్పుడు ఉగ్రుడయిన కృష్ణుడు "శ్రీమచ్చతురానన, పంచానన, షడానన, సహస్రావన, వజ్రాయుధ, పంచాయుధ, సిద్ధ, సాధ్య యక్షగరుడకిన్నర కింపురుష విద్యాదరాద్యఖిల ఖేచర సమూహంబులు ప్రతిఘటించినిల్చిన నిల్తురుగాక" అని చేసిన ప్రతిజ్ఞలో భయానకరసం పరాకాష్టనందుతుంది. అలాగే కృష్ణుడు సూర్యునకుఅర్ఘ్యమిచ్చుచుండ 'తమ్ముల పుటుమ్మి పడియె హస్తంబునందు' అనే దానిలో చేతిలో ఉమ్మిపడుట జుగుప్సను కలిగిస్తోంది. ఇది భీభత్సరసానికిస్థాయి. కృష్ణార్జునుల యుద్ధఘట్టంలో కృష్ణుడు –

'తలపవైతివినీకును నాకును గలుగుచెలిమి తలపనైతివి చుట్టరికపు ధర్మమైన, ఫాలనేత్రునిగెలిచిన బంటవగుట, తలచినాడవుకాబోలు దర్పమొకటే"

అనేదానిలో క్రోధం కనిపిస్తుంది. ఇది రౌద్రరసానికి స్థాయి. ఇక్కడే కృష్ణుడు అర్జునునితో తమ గతజన్మలోని నరనారాయణ వృత్తాంతము తెలుపుచూ "అందు నరాంశమున నీవును, నారాయణాంశమున నేనును పాండవ యాదవ వంశములందు క్రమంబుననుదయించితిమి. నా వాక్యములయదార్థమువెరుంగగోరెదవేని చూడు" అని కనులుతుడిచి అదృశ్యము అర్జునునికి జూపినపుడు అద్భుతరసం పోషింపబడింది.

చివరకు నాటకం సుఖాంతమై పరమేశ్వరుని యొక్కింది ఆశీస్సుతో శాంతరసంలో పర్యవసిస్తుంది.

"పాడియు పంటయుంగలిగి భాగ్యముతో తలతూగుచుండి
నూరేడులు నిన్ను గొల్చుచు మహీజనముల్ సుఖియింతుర్గాక".

భర్తకు సుభద్ర అన్ననుండి సందేశంతెచ్చినప్పుడు –

'ఆడుచున్నవాడె అభిమన్యుడలపోక తండ్రి నెన్నడైన తలచునొక్కొ' అనే అర్జునుని కుశలప్రశ్నలలో వత్సలరసం ఉట్టిపడుతోంది.

యుద్ధఘట్టంలో కృష్ణునికాళ్ళకు అర్జునుడు నమస్కరిస్తున్నప్పుడు కృష్ణుడు 'నీ ముఖదర్శనము పాతకహేతువు, నీవావలకుపొమ్ము' అని తన్నగా అర్జునుడు 'గజ్జలందియలును ఘల్లుఘల్లనిమ్రోయ నహిమౌళి తాండవం బాడెనెద్ది ?'

'అట్టినీపాదపంకజంబ మలచరిత నాకఠినదేహమునుదాకినవసియుండు"
'కావున నీచరణారవిందము నేనొత్తెదదేవా యిటు తెమ్ము' అనే
చోట భక్తిరసం పొంగిపొరలుతోంది.

ఇంతేకాకుండా సంభాషణా చాతుర్యం యీ నాటకానికి జీవగర్ర. అందులో ముఖ్యంగా యుద్ధరంగంలో కృష్ణుడుప్రయోగించిన సామదాన భేద దండోపాయములు, వానిని అర్జునుడు త్రిప్పికొట్టినవిధము మనోహరములు.

కృష్ణ :– "అర్జునా ! అనేకోపకారములొనర్చిన నన్నీసమయమందు నిరాకరించిన జనంబులు నిన్నాచంద్ర తారార్కము విశ్వాసఘాతుకుడని నిందింతురు. కావున గయుని విడువుము.

అర్జు :– "గయున్ వర్జింతునేనిన్ జనుల్ హావివ్వచ్చుడధర్మచిత్తుడనరే ఆచంద్రతారార్కమున్".

ఇది సామముతో సాధింపచేసినప్రయత్నానికి ప్రత్యుత్తరం.

కృష్ణ :– "అర్జునా ! ఈ అల్పుని నిమిత్తమై నాతో వివాదమునకిచ్చ కొంటివేని నీకుతానున్నలాభములు అనేకములుచెడిపోవును. ఈ సమయంబున నన్నుమెప్పింతువేని ఈ ధరామండలమంతయు పట్టంబుగట్టెద"

అర్జు :- "మాధవా ! మహేంద్రసమానభోగికైనను శరణాగత సంరక్ష ణాది ధర్మకార్యాచరణమునకలిగినంత ఆనందము సర్వంసహా పరిపాలనమొనర్చునపుడుకూడా కలుగదు. నామనంబు ధర్మేతర వృత్తికొప్పదు బావా !"

ఇది దానప్రయత్నమునకు ప్రత్యుత్తరం.

కృ :- "నీవును నేనును ప్రాణమిత్రులము, బంధువులము కదా !"

అర్జు :- "ఆమాటయందబద్ధమేమున్నది బావా !"

కృ :- "అట్టియెడ నాకపకార మొనర్చినదుర్మార్గుడు నీకు కూడా అప కారము చేసినట్లుకాదా !"

అర్జు :- "నీవానతిచ్చినది నిజమేకాని అధర్మమువలన నేను భయపడు చున్నాను."

ఇది భేదోపాయమునకు ప్రత్యుత్తరము. ఇక దండోపాయము-

కృ :- "ఇదిగో - నాతోడ సురాసుర యక్షరాక్షస కిన్నర సిద్ధసాధ్య విద్యాధర గంధర్వ గరుడులైన సంగ్రామమునకియ్యకొనరు. నీవు బాలుడవు. ప్రాణంబుండగా చూచుకొమ్ము."

అర్జు :- "ఫాలనేత్ర విజయములగు దారుణాస్త్రంబులు నాయొద్దనున్నవి. ఆతడిచ్చిన పాశుపతాస్త్రమిదిగో."

కృ :- "నిండు మగతనము లేక సగమాడుదియగు మహేశ్వరుడు ప్రసాదించిన అస్త్రములా మమ్ము వెఱపించునవి ?"

అర్జు :- "రుద్రుడు నిండుమగతనము లేనివాడా ! తాను సగమాడుదియే యగునుగాని నీవు పూర్ణముగా ఆడుదానవగుదువు. నిరంతర నారీలోలుడవుకదా !"

కృ :- "ఓయీ మూర్ఖుడా ! మృగములనుజంపు కిరాతువిధమున విల్లు చేబూనిన మాత్రమున ఎవరికి వెఱపుకలుగును ?"

అర్జు :- "నే గిరాతుడనూ, నీవు గారడీ విద్యలవాడవు. అందుచేతనే గారడీవాని కరమునందుండు పెనమువంటి చక్రము ధరించిన

నీవును, హాలికుని విధముగ నాగలి భుజమున దాల్చు నీ సహోదర వీరుడు బలభద్రుండును నాకు వెఱపు గలిగింప లేరయ్యా.''

కృ :- ''ఓరీ ! లోకైకపూజ్యుడగు మాయన్న మాటలిచ్చట దడవనేల? మీయన్నవలె మాయన్న జూదరికాడు."

అర్జు :- ''మాయన్నకు మీయన్నకు ఏఅంశమునందు సాటియేలేదు సుమీ, మాయన్న ధర్మరాజగు మీయన్న అధర్మరాజు మృష గాదు హరీ."

కృ :- ''పేరు ధర్మరాజు, పెను వేపవిత్తండు, మాట తేనెతేట, మనసు విషము, నేతిబీరకాయ నీయుధిష్ఠిరశబ్దమెఱుకలేనివారి యెదుట హొగడు".

అర్జు :- ''చిరపరిచుతుడవయ్యు మత్సోదరుల సౌజన్యము గ్రహింపజాల వైతివి. వేయేండ్లు తపస్సుచేసినను మాకు మీరు సాటిరారు."

కృ :- ''నిజము - ఏలనందువా ? ''నీచముచ్చములేక రాచపాడిదొఱంగి బిడియమించుకలేక బిచ్చమెత్త, జన విరుద్ధంబుగ నైదోడు లేవురు వెలదినొక్కర్తునే పెండ్లియాడ".

అర్జు :- ''అవును మరి - మీరుచేయుపనులు మేము చేయగలమా బావా ! అల్లుడారమ్మని ఆదరమ్మున పిల్వపంపు మామను బట్టి చంప గలమే !'' ఇలాగ తగువులొచ్చినపుడు జానపదుల బావామర దుల దెప్పుళ్ళు, వెటకారాలు, వెక్కిరింపులు, హేళనలు ఎలా ఉంటాయో సరిగ్గా అలా చిత్రించడంతో యీ నాటకంలోని సంవా దాలూ, పద్యాలూ జానపదులలో బాగా నాటుకుపోయాయి.

కృష్ణుడికిమీసాలుంటాయా అనే మీమాంస యీనాటకంలోనేవచ్చింది బెల్లంకొండ సుబ్బారావుగారు మీసాలతోనే కృష్ణుడు వేషం వెయ్యడంతో. ఆమధ్య ఒక ప్రదర్శనలో గయుడు వేషధారి "పాతాళమునకేగి బ్రతుక వచ్చునటన్న" అనే పద్యం చదువుతూ చెయ్యిపైకెత్తి చూపిస్తుంటే "అదేం టండి అలాచూపిస్తాడూ పాతాళం పైనున్నట్లు?" అన్నారట శ్రీవాత్సవగారు. "పాతాళం తెలుగునాటకరంగానికిపైనే ఉందిగనుక" అన్నారట శ్రీశ్రీగారు. 'పంపుమామ', 'గయుడాభయమువలదు' వంటి సాహిత్య చెణుకులుకూడా యీనాటకంనుండి వెలువడ్డవే. జానపదుల్ని ఆకట్టుకున్న తీరుచూసి (పురాణాలలో లేకపోయినా) యిదేమూసలో రామాంజనేయ యుద్ధం నాటకం రావడం, ప్రజలు ఆహా! అని చప్పట్లుకొట్టే 'బభ్రువాహన'లోని యుద్ధ సీను కూడా దీనికి అనుకరణే కావడం దీని గొప్పతనానికినిదర్శనం.

* ఇంతకీ గయోపాఖ్యానంనాటకం ఎఱెండ్లగోపయ్య అనే పూర్వకవి కావ్యం ఆధారంగా వ్రాయబడినదని "తెలుగు పౌరాణికనాటకాలు" వ్యాసంలో శ్రీ ఎ. శ్రీరామమూర్తిగారు వ్రాశారు.

## గోదావరిసీమలో ప్రసిద్ధులైన పౌరాణిక నటులు

ఈ ప్రాంతంలో పల్లెసీమల్లోకి ప్రవేశిస్తుంటే పొలాల్లోనుంచి "చెల్లియో చెల్లకో", "అలుగుటయే యెరుంగని", "జెండాపై కపిరాజు" అంటూ పద్యాలు వినిపిస్తుంటాయి చల్లబాటువేళ. విద్యాగంధం లేని పశువులుకాచే పిల్లవాళ్ళకు కూడా యివి నోటబడి ఆలపింపజేస్తున్నాయంటే జానపదులలో యీ నాటకంమీద మక్కువకి యింతకంటే నిదర్శనం ఏం కావాలి? ఆ నాటకం కురుక్షేత్రం, చింతామణి, హరిశ్చంద్ర, గయో

---

* సమాలోచన పత్రిక. 1-5-86 పు. 6

పాఖ్యానాలతోపాటు కురుక్షేత్రం (పాండవోద్యోగ విజయాలు), బొబ్బిలి యుద్ధం, రంగూన్‌రౌడీ, రామాంజనేయయుద్ధం కూడా యిక్కడిజానపదులను విశేషంగాఆకర్షించిననాటకాలు. ఈ నాటకాలలో తమ మహోన్నత నటనతో కీర్తిగన్న గోదావరిసీమ నటరత్నాలు ఎన్నో !

1. వై. భద్రాచారిగారు.

మండపేటలో మకాంఉండేవారు. హరిశ్చంద్రుడువేషానికి యీయనపేరు జగద్విదితం. కాటిసీనులో జనం ఘొల్లునఏడ్చేసేవారట. అంత రసస్ఫూర్తికలిగించేవారన్నమాట నటనతో. పైగా తనకంచు గాత్రంతో పద్యంపాడుతుంటే ప్రేక్షకులు పరవశించిపోయేవారు. కుచేల వేషంకూడా అంతగొప్పగానూ ఉండేదట.

2. దామ్మేటి సూర్యనారాయణగారు.

వీరిది కోనసీమ. రంగూన్‌రౌడీలో రౌడీవేషానికి ఆదిపురుషుడీయనే. క్రూరత్వంచూపించడంలోనూ, భీభత్సరసాన్ని పోషించడంలోనూ అందె వేసినచెయ్యి. ఆయననటన పరాకాష్టకుచేరుకుని పండితపామరులందరిచేతా ఛాలెంజిరౌడీ అని పిలిపించుకున్న మహానటుడు.

3. జేతా వెంకట్రావుగారు.

వీరిది రాజమండ్రిదగ్గర గండేపల్లి. రామాంజనేయయుద్ధం నాటకంలో ఆంజనేయపాత్రకు వీరు పెట్టిందిపేరు. కుప్పిగంతులు, చిలిపిచేష్టలు, కోతి కూతలరాగాలతో ఆ నాటకానికే వన్నెతెచ్చారు. ''హాలు నిండినవెనుక ఆయాతరగతులగట్లపై కూర్చుండవలెను" అనే ప్రకటన వీరినాటకానికే ఎక్కువ వర్తించేది. అంత మనోజ్ఞంగా నటించేవారు. ఆంజనేయస్వామి ప్రత్యక్షంఅయినట్లే ఉండేది. వీరునాటకంలో ఒకనాడుస్టేజి మీద ఆంజనేయుడుగా రామరామఅంటూ ప్రాణాలువిడిచారు.

4. బందా కనకలింగేశ్వరరావుగారు.

వీరిది ఏలూరు. వృత్తిరీత్యా న్యాయవాది. ప్రవృత్తిరీత్యా కళారాధకులు. కురుక్షేత్రంలో కృష్ణుడు వేషానికి రంగస్థలంలో బందాగారిది ఒక పంథా. రాగం అంతంతమాత్రంగాతీస్తూ భావానికి, భాషకీ అధిక ప్రాముఖ్యమిచ్చి పద్యం పాడేవారట. చింతామణిలో బిల్వమంగళుడుగా చివరిసీనులో పశ్చాత్తాపంతో కళ్ళు పీకేసుకుంటూచేసే నటనకు అందరూ జోహార్లు అర్పించవలసిందే. ఉత్తమ నటుడుగా రాష్ట్రమంతా అవార్డులు పొందారు.

5. గండికోట జోగినాధంగారు.

వీరిది కాకినాడ. 5 దశాబ్దాలు ఆంధ్రనాటకరంగాన్ని ఏలిన సాటిలేని మేటి హాస్యనటులు. చింతామణిలో సుబ్బిశెట్టి పాత్రకు వీరికి వీరే సాటి. దేశంలో ఎన్నో ప్రదర్శనలిచ్చి హాస్యనటశేఖర, హాస్యనటకాగ్రణి, హాస్య నటకావతంస, హాస్యకళానిధి, హాస్యరసచక్రవర్తి బిరుదులు పొందారు. మంచి సమయస్ఫూర్తిగల నటులు.

6. షణ్ముఖి ఆంజనేయరాజుగారు.

వీరి నివాసం, తణుకు. కురుక్షేత్రంలో కృష్ణుడు పాత్రకు తిరుగులేని పేరు. రాయబారంసీనులో "చెల్లియో చెల్లకో" పద్యాలుపాడుతుంటే అన్నీ వన్స్‌మోర్‌లే. రాగాలాపనలో ఒకకొత్తవరవడి సృష్టించారు. వీరు చింతామణిలో బిల్వమంగళుడు, హరిశ్చంద్రలో నక్షత్రకుడు, రామాంజనేయ యుద్ధంలో రాముడు వేషాలుకాడావేస్తూ యావదాంధ్రదేశంలో ప్రఖ్యాతి పొందారు. వీరిబిరుదు 'ఆంధ్రగంధర్వ'.

7. యన్. వి. యల్. నరసింహాచారిగారు.

వీరిది కోరుకొండ. కురుక్షేత్రంలో దుర్యోధనుడువేషం వీరిది చూసి తీరవలసిందే. ప్రత్యేకించి మయసభసీనులో నటన, వాచకం అద్భుతం.

ఈసీను చూడడానికి దూరాభారాలుకూడా లెక్కచేయకుండా జనం తండోప తండాలుగా వచ్చేవారు.

8. కె. ఆర్. రెడ్డినాయుడుగారు.

రామచంద్రపురం వాస్తవ్యులు. హరిశ్చంద్రలో వీరబాహుడుగా వీరినటన అమోఘం. పాత్రచిన్నదయినా ప్రేక్షకహృదయాల్లో శాశ్వతంగా నిలిచిపోయేలా నటించేవారు. ముఖ్యంగా హరిశ్చంద్రునికి కఱ్ఱ, కుండ చేతికిచ్చి పంపించేస్తూ తనఅకృత్యానికి చింతిస్తూచేసే నటన నాటకానికి వన్నె తెచ్చేది.

9. కొవ్వాడ సూర్యనారాయణగారు.

కాకినాడ. రంగూన్‌రౌడీలో రౌడీవేషంతో దేశమంతా ఒకవెలుగు వెలిగారు. సిగరెట్‌పొగ త్రాగడం, బ్రాందిత్రాగినట్టు నిషాగా మాట్లా డడంలో ఒకప్రత్యేకతతో ప్రేక్షకులదృష్టినాకర్షించి చక్కని నటనచూపి మెప్పించేవారు. వీడేరౌడీ, కొవ్వాడరౌడీ, ఛాలెంజిరౌడీ అని స్టేజిమీద తొడగొట్టి సవాలుచేసేవారు.

10. దొమ్మేటి సత్యనారాయణగారు.

రాజమండ్రి మకాం. రంగూన్‌రౌడీలో రౌడీవేషం, చింతామణిలో బిల్వమంగళవేషం వీరికి ప్రసిద్ధి. గాత్రం మెటాలిక్‌టోన్. చాలా శ్రావ్యం గానూ, గంభీరంగానూ ఉండేది. వీరుకూడా రౌడీవేషంలో దొమ్మేటిరౌడీ, ఛాలెంజిరౌడీ అని ముందు కరపత్రాలలోనే ఛాలెంజి విసిరేవారు.

11. యం. జి. ఆచారిగారు.

వీరిది అన్నవరం. హరిశ్చంద్రలో నక్షత్రకవేషానికి గొప్పపేరు. పాటలోనూ, మాటలోనూ, నటనలోనూ, వేషధారణలోనూ తనదయిన ఒకబాణీనిప్రదర్శించి ప్రజాహృదయాలలో మిగిలిపోయిన నటుడు.

12. కొచ్చెర్లకోట సత్యనారాయణగారు.

ఏలూరు. మధురగాత్రం. వినేకొద్దీ వినాలనిపించే ఆలాపన వీరిపాత్ర లకు జీవం. కురుక్షేత్రంలో అర్జునుడుగానూ, గయోపాఖ్యానంలో కృష్ణుడు గానూ, చింతామణిలో భవానీశంకరుడుగానూ దేశప్రఖ్యాతి పొందిన నటులు.

13. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.

కాకినాడ. హరిశ్చంద్రపాత్రకు ఆంధ్రదేశంలో ఎంతోకీర్తిపొందిన వ్యక్తి. రాగంలో, పాటలో, మాటలో, ఆహార్యంలో అన్నింటా రమణీ యంగా పాత్రపోషించి తనకొక విశిష్టత నార్జించుకున్నారు. వీరితో సుప్రసిద్ధ రంగస్థలనటి పువ్వుల అనసూయ చంద్రమతిగా వేసేది. వీరి ప్రదర్శన ఒక సుందర స్వప్నం.

14. కలపర్రు వెంకటేశ్వర్లుగారు.

ఏలూరు. చింతామణిలో భవానీశంకరుడు, హరిశ్చంద్రలో నక్షత్ర కుడు, గయోపాఖ్యానంలో కృష్ణుడువేషాలలో తన గానమాధుర్యంతో ప్రజల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపోయారు. అందరూ వీరిది గాంధర్వగానం అనేవారు.

ఈ గ్రంథరచయిత ఆంధ్రదేశంలో అనేకచోట్ల భవానీశంకరుడు. నక్షత్రకుడు వేషాలు వేసినప్పుడు ప్రేక్షకులు అభినందించడానికి వచ్చి మళ్ళా కలపర్రునుచూస్తున్న ఆనందంకలుగుతుందనేవారు.

15. కర్రి విశ్వనాథరెడ్డిగారు.

కొంకుదురు. అందమైనవిగ్రహం. తేనెలూరే మధురగాత్రం. సారంగధరలో సారంగధరుడు, భక్తకుచేలలో కుచేలుడు, గయోపాఖ్యా నంలో కృష్ణుడు, చింతామణిలో బిల్వమంగళుడు, పాదుకాపట్టాభిషేకంలో రాముడు ఇలా ఎన్నో వేషాలువేశారు. ఏ వేషంవేసినా సరిగా నప్పేవారు. సహజనటులు. కుచేలుడుగా ఆయనతో ఎవ్వరూ పోటీలేరనిపించేది.

తను ఎంతోమంది నటులకు తర్ఫీదుయిచ్చి తయారుచేశారు. వారిలో యీ రచయిత ఒకరు.

16. సంపదనగరం లక్ష్మణరావుగారు.

వీరిది రాజానగరందగ్గర సంపదనగరం. రామాంజనేయయుద్ధంలో ఆంజనేయునిగా యీయన నటన, పాట అద్భుతం. 6 1/2 శృతిలో తారస్థాయిలో అన్ని పద్యాలూ అలుపులేకుండా పాడేస్తారు. ఇది అనితర సాధ్యం. వీరి నాటకంఅంటే జనం తండోపతండాలుగా వచ్చి చూస్తారు. బేతా వెంకట్రావుగారిశిష్యుడు — గురువునుమించిన శిష్యుడయిన నటుడు.

17. కె. తలుపులరావుగారు.

మకాం రామచంద్రపురం. చింతామణిలో భవానీశంకరుడు, పద్మ వ్యూహంలో అభిమన్యుడు, హరిశ్చంద్రలో నక్షత్రకుడు, రంగూన్‌రౌడీలో రౌడీ ఆయనకు పేరుతెచ్చిన పాత్రలు. పద్యాన్ని చక్కగా విరిచి చద వడం, రాగాన్ని ఆధునికంగా మలిచిపాడడం యీయన ప్రత్యేకతలు. రంగూన్‌రౌడీనాటకంలో రౌడీపాత్ర చూసితీరవలసినంత గొప్పగా వేసే వారు. ఈ రచయిత వీరి రౌడీనాటకంలో "జయరాం" పాత్ర వేసేవారు.

18. మంత్రిప్రగడ రామదాసుగారు.

మకాం కొంకుదురు. చక్కని హాస్యనటులు. రంగూన్‌రౌడీలో గంగారాంసేట్ వేషానికి ఆయనతరువాతే ఎవరయినా. వరవిక్రయంలో పెళ్ళిళ్ళపేరయ్య, పద్మవ్యూహంలో సైంధవుడు, సక్కుబాయిలో అత్త, "పెట్టమారిమగడు" నాటకంలో వెర్రిబుర్రల వెంగళప్ప, చింతామణిలో సుబ్బిశెట్టి వేషాలు కడుపుబ్బనవ్వుతెప్పించేవి. అసలు ఆయన ప్రవేసిస్తుం టేనే జనం ఘొల్లున నవ్వేవారు. అంతటి హాస్యనటులు. దేవాంగి కామిక్ చేస్తుంటే జనం నవ్వులకు తెరవుండేదికాదు.

19. అప్పల వీరవెంకటజోగయ్యశాస్త్రిగారు :-

వెదురుపాక. వీరుకేరక్టర్ ఏక్టరు. ఏపాత్రవేసినా ఆపాత్రలో జీవించడం, సెహబాష్ అనిపించుకోవడం వీరిప్రత్యేకత. చింతామణిలో భవానీ శంకరుడు, పద్మవ్యూహంలో దుర్యోధనుడు, వరవిక్రయంలో సింగరాజు లింగరాజు, ప్రతాపరుద్రీయంలో యుగంధరుడు చాలాసహజంగా చేసేవారు. అందులో ముఖ్యంగా సింగరాజు లింగరాజు పాత్రకు మరొకరు సాటిలేరు. యుగంధరుడుగా ఆయననటన రంగస్థలికి కలికితురాయి.

20. కొవ్వూరి సత్యనారాయణరెడ్డిగారు :-

వెదురుపాక. వీరు ఆడ, మగ అనేవివక్షతలేకుండా అన్నివేషాలూ వేసి జనాన్ని మెప్పించేవారు. రంగూన్‌రౌడీలో ప్రభావతి, చింతామణిలో చింతామణి, గయోపాఖ్యానంలో గయుడు, పాదుకాపట్టాభిషేకంలో రాముడు, కురుక్షేత్రంలో అర్జునుడు, బొబ్బిలియుద్ధంలో విజయరామరాజు యిలా ఎన్నోనాటకాలు, ఎన్నో ప్రదర్శనలిచ్చిన మేటినటులు. నిజమైన కళాసేవకులు. సుమధురగాత్రం - సుందరవిగ్రహం - తేటమాట - జానపదులహృదయాలలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్న నటులు.

21. కొవ్వూరి బులి వీర్రెడ్డిగారు :-

కొంకుదురు. తూ. గో. స్త్రీ పాత్రలకు స్త్రీలు విరివిగా దొరకని రోజుల్లో చింతామణిలో రాధ, హరిశ్చంద్రలో చంద్రమతి, వరవిక్రయంలో కాళింది. రంగూన్‌రౌడీలో అన్నపూర్ణ పాత్రలు అత్యద్భుతంగా పోషించేవారు. పాత్రపోషణలో అచ్చం స్త్రీయే అని భ్రమింపజేసేవారు. పై వేషాలలో కరుణరసపోషణ చేస్తుంటే ప్రేక్షకులు కన్నీరు కార్చవలసిందే.

22. బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు :-

రాజమండ్రి. హరిశ్చంద్రలో హరిశ్చంద్రుడు, బొబ్బిలియుద్ధంలో రంగారావు వేషాలువేసేవారు. వీరిపాత్రపోషణలో అసలురంగారావును కళ్ళెదుట పెట్టేవారు.

23. మద్దాలి శేషగిరిరావు :-

రాజమండ్రి. చిత్రనళీయంలో నలుడుగానూ, బాహుకునిగానూ అద్భుతంగా నటించేవారు. బొబ్బిలియుద్ధంనాటకంలో పాపారాయుడు పాత్రకు తనకు సాటిలేరనిపించేవారు. కమ్మనిస్వరం. స్ఫుటమైన వాచకం. నటనలోదిట్ట. ద్రౌపదీవస్త్రాపహరణంలో భీమునిపాత్రకు ఆయనకాయనే సాటి. "పందెమిడిన ఆబాహుపటాపంచలుగచేయన్" అని పాడుతూ క్రోధాన్ని అభినయిస్తుంటే ప్రేక్షకులు గుడ్లప్పగించి చూస్తూ ఉండి పోయేవారు.

24. వెల్లంకి వెంకటేశ్వర్లుగారు :-

రాజమండ్రి. బొబ్బిలియుద్ధంలో వెంగళరాయుడుపాత్ర అసమానంగా పోషించేవారు.

25. నిడుముక్కల సుబ్బారావు :-

రాజమండ్రి. సావిత్రిలో సత్యవంతునిగా సమర్ధవంతంగా నటించేవారు.

26. ముప్పిడి జగ్గరాజుగారు :-

రాజమండ్రి. హరిశ్చంద్రలో చంద్రమతిపాత్రధరించి అందులో లీనమై నటించేవారు. శ్మశానంసీనులో దుఃఖంఆగక గ్లిజరిన్ అక్కర లేకుండా నిజంగానే ఏడ్చేసేవారట. ఒకోసారి దుఃఖంఆపుకోలేక గ్రీన్‌రూమ్ లోకిపోయి అది ఆగిపోయినతరువాత మళ్ళీవచ్చి నటించేవారట.

27. బెల్లంకొండ సుబ్బారావుగారు

ఏలూరు. న్యాయవాది. కురుక్షేత్రంలో కృష్ణుడుగానూ, గయోపాఖ్యానంలో కృష్ణుడుగానూ చాలా పేరుతెచ్చుకున్నారు. వీరు మీసాలు తియ్యకుండానే కృష్ణుడువేషం వేసేవారు. అందువల్ల వీరిని మీసాలకృష్ణు డనేవారు.

28. పేకేటి వీరభద్రంగారు

కొంకుదురు. చిన్నప్పుడు వై. భద్రాచారిగారి ట్రూపులో లోహితాస్యుడు వేషంతో ప్రారంభించి ఎదిగాక చింతామణి, వరవిక్రయంలో కమల మొదలగు ఆడవేషాలు బ్రహ్మాండంగా పోషించేవారు. తీయనిగొంతు ఖంగుమని మోగేది. మైకులులేనిరోజుల్లోకూడా ఆపాట ఆమడదూరం వినిపించేది.

29. మాష్టర్ కళ్యాణిగారు :-

రాజమండ్రి. నారదునిపాత్ర ఎంతో ప్రతిభతో నటించేవారు. వీరు కళ్యాణిరాగానికి పేటెంటు.

30. ఆచంట వెంకటరత్నంనాయుడుగారు

భీమవరం. కురుక్షేత్రంలో దుర్యోధనుడు, తులసీజలంధరలో జలంధరుడు పాత్రలు విశిష్టంగావేస్తారు. జలంధరుడుగా దేశంలో ఆయనకు గొప్పపేరు.

31. కొచ్చెర్లకోట రంగారావుగారు

వీరిది రాజోలుదగ్గర తాటిపాక. రంగూన్‌రౌడీగా బాగాపేరు సంపాదించారు. రౌడీలకెల్ల రౌడీ, వీడే కొచ్చెర్లకోటరౌడీ, ఛాలెంజిరౌడీ అనితొడ కొట్టేవారు. ఓస్లిడాటర్‌లో "రంగడంటెరంగడా, మల్లెపూలరంగడా, కొచ్చెర్లకోటరంగడా" అని పాడుతుంటే జనం కేరింతలు కొట్టేవారు.

32. మేడిశెట్టి వెంకట్రావుగారు

పెద్దాపురం. మాయాబజారులో అభిమన్యుడుగా, వీరాభిమన్యలో సైంధవుడుగా చాలా ప్రదర్శనలిచ్చి గంభీరనాదంతో, నిండైన విగ్రహంతో పుష్టికర సంవాదంతో చక్కని పేరు తెచ్చుకున్నారు.

33. మద్దాలి రామారావుగారు

తాడేపల్లిగూడెం. బాలనాగమ్మలో ఫకీరు, మైరావణలో మైరావణ పాత్రకు దేశప్రసిద్ధిగన్నారు. దుర్యోధనుడు, కీచకుడువంటి దుష్టపాత్రలు పోషించుటలో పేరుగన్న నటుడు.

34. పసల సూర్యచంద్రరావుగారు

తాడేపల్లిగూడెం. రామదాసునాటకంలో తానీషాకు గొప్పపేర. వీరు ఆంధ్రఅసెంబ్లీలో డిప్యూటీ స్పీకరుపదవి నిర్వహించినవారు.

35. యం. వి. నరసింహాచారిగారు

రాజమండ్రి. చాణక్యపాత్రకు పేరెల్లినవారు. వీరు అభినవ చాణక్యుడుగా కీర్తి గడించారు.

36. మూర్తిశ్రీగారు

కాకినాడ. యస్.యఫ్. ఆడిటర్‌గా ఉద్యోగం. అందమైనవిగ్రహం. మల్లాది సూర్యనారాయణగారి బాణీలో హరిశ్చంద్రుడు వేషంచేస్తూ ఆయన్ని జ్ఞప్తికి తెస్తారు. తులాభారంలో కృష్ణుడు. చింతామణిలో భవానీశంకరుడు పేటంటుగా చేసే యితర వేషాలు.

37. వేదనభట్ల నరసింహమూర్తిగారు

కాకినాడ. రాగాన్ని ఎంతసేపయినా సాగదీసి పాడగలదిట్ట. నారద పాత్రకు పేరుగన్నారు.

38. కె. రామకృష్ణారెడ్డిగారు

వెదురుపాక. హరిశ్చంద్రలో హరిశ్చంద్రుడు, విశ్వామిత్రుడు పాత్రలు పోషించేవారు. బొబ్బిలియుద్ధంలో పాపారాయుడు బాగావేసేవారు.

39. బేతా రామచంద్రరావుగారు

రాజమండ్రి. బేతా వెంకట్రావుగారిపుత్రుడు. ఆయన అడుగుజాడల్లో రామాంజనేయయుద్ధంనాటకంలో ఆంజనేయపాత్ర పోషించేవారు.

40. సత్తి సత్తి (రెడ్డి) రాజుగారు

కొమరిపాలెం. హరిశ్చంద్రలో హరిశ్చంద్రుడు, రంగూన్ రౌడీలో తులసీరాంపాత్రలు జనరంజకంగా పోషించేవారు.

41. ద్వారపూడి సూర్యారావుగారు

ద్వారపూడి. చింతామణిలో బిల్వమంగళ పాత్రతో దేశమంతా ప్రఖ్యాతి పొందారు. నిండయిన విగ్రహం. చక్కగా పాడతారు.

42. దేవులపల్లి పద్మనాభశాస్త్రిగారు

పిఠాపురం. వీరు రామదాసు పాత్రలో లీనమై నటించేవారు. "సీతమ్మకుచేయిస్తి చింతాకుపతకము" అనే పాటకు వీరి అభినయం, నటన ఓసారిచూసినవారు మరచిపోలేరు.

43. యస్. పి. లక్ష్మణస్వామిగారు

కాకినాడ. తులాభారంలో నారదుడు, గయోపాఖ్యానంలో అర్జునుడు, చింతామణిలో భవానీశంకరుడు, రామదాసులో కబీరు, సక్కుబాయిలో జ్ఞాన యోగి సమర్థవంతంగా పోషించేవారు.

44. కాగిత సుబ్బారావుగారు

భీమవరం. స్త్రీ పాత్రలు వేస్తారు. నర్తనశాలలో సుధేష్ణగానూ, చింతామణిలో రాధగానూ, హరిశ్చంద్రలో చంద్రమతిగాను చక్కని హావ భావ నటనలు ప్రదర్శిస్తారు.

45. ఇళ్ళ వెంకట్రావుగారు

తాడేపల్లిగూడెం. కర్ణుడు, కృష్ణుడు, యయాతి, గయుడు చక్కగా నటించే గాయక నటుడు.

46. వల్లా వేంకటేశ్వరరావుగారు

తణుకు. అర్జునుడు పాత్రపోషణలో అతనికతనే సాటిగా నటించే వాడు. వందలాది ప్రదర్శనలిచ్చిన నటుడు.

47. కర్రి అబ్బులుగారు

అత్తిలి దగ్గర పాలంకి గ్రామం. ఉద్యోగ విజయాలు, గయోపాఖ్యానం నాటకంలోని కృష్ణపాత్ర, రామాంజనేయ యుద్ధంలో ఆంజనేయ పాత్ర ఎంతో చక్కగా పోషించేవారు. ఎర్రగొల్లల నాటకాలలో వీరున్న నాటకానికి జనం తండోపతండాలుగా వచ్చేవారు.

48. కంచర్ల వెంకన్నగారు

మారంపల్లి. ప.గో. ఈయనకూడా ఎర్రగొల్లల నాటకాలలో పేరెన్నికగన్న నటుడు. కర్రి అబ్బులు కృష్ణుడు, కంచర్ల వెంకన్న అర్జునుడు కాంబినేషన్ చూడడానికి జనం ఎగబడేవారు. బ్రహ్మంగారి చరిత్రలో వీర బ్రహ్మంగా గొప్పపేరు తెచ్చుకున్నారు.

49. మహాశివభట్టు వెంకట్రాజుగారు

వీరిని వెంకంగారనేవారు. రామదాసు, క్రూరసేనుడు, కంసుడు, పాపారాయుడు ప్రసిద్ధిగా వేసేవారు. వీరు క్రూరపాత్ర ధరించినపుడు భయపడనివారు, విషాదపాత్ర ధరించినపుడు దుఃఖించనివారు ఉండేవారుకారు. చక్కని కేరక్టరుయాక్టరు.

50. మహాశివభట్టు అమ్మిరాజుగారు

తాడేపల్లిగూడెం. లవకుశలో లవుడు, కృష్ణలీలలలో కృష్ణుడు మొదలగు బాలవేషములలో పేరుగాంచి ఎదిగాక బలరాముడు, అర్జునుడు, భవానీశంకరుడు, వీరబాహుడు వేషాలలో పేరెన్నికగన్నారు.

51. ఉల్లింకల సూర్యారావుగారు

ఏలూరు. మధురగాయకుడు, అర్జునుడు, కబీరు, నక్షత్రకుడు, నారదుడు, గయుడు బాగా పోషించి పేరు తెచ్చుకున్నారు.

52. పి. వెంకటాద్రిరాజుగారు

ఎర్రంపేట (కొయ్యలగూడెంమండలం). పాపారాయుడు, దుర్యోధనుడు, యయాతి, గయుడు, క్రూరసేనుడు, కంసుడు మొదలగు ఎన్నో పాత్రలు చక్కగా పోషించినదిట్ట.

53. బండారు వెంకటేశ్వర్లుగారు

తాడేపల్లిగూడెం. స్త్రీపాత్రలుమాత్రమే పోషించేవారు. చంద్రమతి, రాధ, బాలనాగమ్మ, రుక్మిణి, ద్రౌపది పాత్రలు నిజంగా స్త్రీలాగే నటించి ప్రేక్షక హృదయాలను దోచుకున్న నటుడు. తుకారాంలో జిజయాబాయి, రామదాసులో కమల, వెంకటేశ్వర మహాత్యంలో 'నకుళ' పాత్రలుకూడా అతనికి పేరు తెచ్చాయి.

54. ముంజులూరి కృష్ణారావుగారు

ఏలూరు. కళాప్రపూర్ణ బిరుదాంకితులు. ప్రతాపరుద్రీయంలో యుగంధర పాత్రతో అఖండ యశస్సు ఆర్జించారు. ఆరోజుల్లో ఉద్యోగవిజయాల్లో కృష్ణపాత్రకు ఆయనదే పేరు.

55. మజ్జి రామారావుగారు

ఏలూరు. 12వ ఏటనే భక్తనందనార్ పాత్రనటించి అనేక బహుమతులు పొందారు. తారాశశాంకంలో చంద్రునిగా "పృధ్వీరాజ్" ప్రశంశలు పొందారు. కృష్ణ, సారంగధర, బిళ్వమంగళ, భవానీ పాత్రలు కూడా పోషించి "రంగస్థలరవ్వ", "నటరత్న" బిరుదులుకూడా పొందారు.

## నటీమణులు

1. అమ్మాణీబాయిగారు :-

మండపేట వాస్తవ్యులు. భద్రాచారిగారితో కలిసి హరిశ్చంద్రలో చంద్రమతివేషం వేసేవారు. వీరినాటకాలలో ప్రముఖ సినీనటులు అక్కినేని నాగేశ్వరరావుగారు మాతంగివేషంవేసేవారు. ఈమె చంద్రమతిగా పిడకల సీనులోనూ, కాటిసీనులోనూ చేసేనటనకు కంటతడిపెట్టని ప్రేక్షకుడుండేవాడు కాదట. తానులీనమైనటిస్తూ ప్రేక్షకుల్నికూడా లీనంచేసేదట. అలాగే కుచేలలో వామాక్షిపాత్రకూడా.

2. మాణిక్యకుమారిగారు :-

రాజమండ్రి. చింతామణి నాటకంలో చింతామణిగా ఎంతో మోహనంగా నటించి పేరుగడించిన నటి. శృంగారాభినయం యీమెసొత్తు. చివర

సన్యాసిగా మారిన వేషంలో కాషాయ బట్టలతో వచ్చి బిల్వమంగళుని "ఏమీచూసీ నను మోహిస్తివీ దేహమేలాంటిదని ఆలోచిస్తివీ" అని పాడు తుంటే ప్రేక్షకుల మనస్సుల్లోకికూడా ఆ వేదాంతభావం దూసుకుపోయి ఓహోఓహోఅని మళ్ళీమళ్ళీ పాడించుకునేవారు.

3. ఆర్. కోటీశ్వరిగారు :-

ఏలూరు. మల్లాదివారి 'పేదపిల్ల'నాటకంలో పేదపిల్లగా భారతదేశ మంతా అన్నిరాష్ట్రాలలో వేయిపైనే పదర్శనలిచ్చిన మహానటి. హరి శ్చంద్రలో యీమె 'చంద్రమతి'పాత్ర నిర్వహణ అమోఘం. ముఖ్యంగా కాటిసీనులో లోహితుణ్ణి పడుకోబెట్టి, పైన పిడకలుపేర్చి చితిఅంటించే స్తుంటే పేక్షకులు ఉత్కంఠ, సానుభూతి పొంగిపొరలి జలజలా కన్నీళ్ళు కార్చేసేవారు. ఆ సీనంతా ప్రేక్షకుల చెంగుమాళ్ళతో కళ్ళద్దుకుంటూ ఉండే వారు. నటన, పద్యపఠన ప్రేక్షకుల హృదయాల్ని దోచుకుంటాయి. సమయస్ఫూర్తిగల నటి.

4. రెడ్డి రత్నంగారు :-

కాకినాడ. స్ఫురద్రూపి. మధురగానం. చింతామణి నాటకంలో చింతామణివేషానికి చాలాప్రసిద్ధి. ఆట, మాట, పాట సమపాళ్ళలో రంగరించి ప్రదర్శించేనటి. గాత్రం, రూపం యీమెకు పెట్టనిసొమ్ములు. "తనకుగల్గినదెల్ల ధారబోసినయట్టి" అనేపద్యం తప్పకుండా వన్సుమోర్లు తీసికొనేది. "మందారగంధమిదే" అనేపాటతో సుబ్బిశెట్టిని ఆటపట్టించే సన్నివేశంలో ఈమెనటన నాటకరంగంలో మైలురాయి.

5. రజనీకాంతంగారు :-

కాకినాడ. చింతామణిలో రాధపాత్ర మకుటాయమానంగా నటిం చేది. "వచ్చుచేటే కష్టమావనితను విడనాడి" అనేపద్యం మాండురాగంలో పాడుతూ కంటనీరెడుతుంటే ప్రేక్షకహృదయం తరుక్కుపోయేది. కరుణ రసపోషణలో దిట్ట.

6. వై. బి. అన్నపూర్ణగారు :-

కాకినాడ. ఈమె అమ్మాణీబాయిగారి కుమార్తె. హరిశ్చంద్రలో చంద్రమతివేషం చక్కగాచేస్తూ తల్లిని మరపిస్తుంది. చింతామణిలో రాధవేషం, తులాభారంలో సత్యభామ వేషాలుకూడా ధరిస్తూ పద్యం పాడడంలో తారస్థాయినికూడా అధిగమించి పేరు తెచ్చుకున్న నటి.

7. నాగమణిగారు :-

పసలపూడి. కురుక్షేత్రంలో కృష్ణుడువేషంవేసి "బావా ఎప్పుడు వచ్చితీవు"వంటి పద్యాలు పాడుతుంటే ఆ గంభీర మృదుమధుర స్వరానికి అందరూ ముగ్ధులుకావలసిందే. సాయిబురెడ్డిగారి దళంలోచేరి ఆదిపరాశక్తి ప్రదర్శనలు దేశంలో వేలమీదయిచ్చి పేరుగడించిన గొప్ప నటి. బాలనాగమ్మలో బాలనాగమ్మవేషంకూడా సమర్ధవంతంగా పోషించేది.

8. శేషుకుమారిగారు :-

రాజమండ్రి. బాలనాగమ్మలో యీమె సంగువేషం నవరసభరితం. వయ్యారాలొలికించడంలోనూ, తియ్యగా పాడడంలోనూ యీ వేషానికి యీమెకు పోటీలేదనిపించేది. కొన్ని నాటకాలలో నారదుడువంటి మగ పాత్రలుకూడావేసి సెహభాష్ అనిపించుకున్న నటి.

9. సుభాషిణిగారు :-

భీమవరం. నిండైన విగ్రహం, వీనులవిందైనగాత్రం, చింతామణి వేషంలో ఆధునికంగా ఆమె పద్యాలు, నటన, ఆమె అందంతో పందెం వేస్తాయి. ఈమె స్టేజీమీదకు రాగానే అందరూ అదిగోవాణిశ్రీ అంటుంటారు.

10. సి.హెచ్. రాజేశ్వరిగారు :-

కాకినాడ. రేడియోఆర్టిస్టు. చింతామణిలో రాధవేషం యీమె సొత్తు. మృదువైన కంఠం, వింటుంటే ప్రేక్షకులకు ఏదో దేవగానం వినిపిస్తున్నట్టుంటుంది. ఆ మధురగాత్రం రంగస్థలంమీద ఆమెకు పెద్దఆస్థి. చింతామణిలో చింతామణిగానూ, హరిశ్చంద్రలో చంద్రమతిగాను విరివిగా ప్రదర్శనలుచేస్తున్న వర్ధమాన నటీమణి.

11. కుమారి రాఘవ :-

కాకినాడ. హరిశ్చంద్రలో కలహకంఠి, చింతామణిలో శ్రీహరి పాత్రలకు తనకు సాటిలేదనిపించుకునే నటి. 4 దశాబ్దాలుగా నాటక కళారాధన పరమావధిగా ఎంచుకున్న నటీమణి.

12. శేకి అనసూయగారు :-

ఏలూరు. సక్కుబాయిలో సక్కుబాయి, హరిశ్చంద్రలో చంద్రమతి, చింతామణిలో చింతామణి, తులాభారంలో నారదుడు వేషాలు వేసేది. ముఖ్యంగా తులాభారంలో నారదుడుగా తరంగాలు, కీర్తనలు మధురంగా పాడి ప్రేక్షకులను మైమరపించేది.

13. శ్రీమతి ఆపేటి పూర్ణిమగారు :-

ఏలూరు. సురభి నాటకసంఘ సభ్యురాలు. వనారస గోవిందరావుగారి అమ్మాయి. చిత్రాంగి, చింతామణి, సుభద్ర, ద్రౌపది, సత్యభామ, బాలనాగమ్మ, రాధ, మల్లమదేవి యీమె ప్రసిద్ధిగా వేసిన వేషాలు. గుర్తింపు తెచ్చుకున్న కళాకారిణి. మధురమైన కంఠస్వరం, మంచినటన ఆమె ప్రత్యేకత.

14. శ్రీమతి శ్యామలగారు :-

నిడదవోలు. సైరంధ్రి, చంద్రమతి, మండోదరి పాత్రలు మనోహరంగానటించి ప్రేక్షక హృదయాలలో చెరగనిముద్రవేసుకున్న నటీమణి.

15. శ్రీమతి కోడూరి లక్ష్మీకాంతంగారు :-

తాడేపల్లిగూడెం. రౌడీలో అన్నపూర్ణ, హరిశ్చంద్రలో చంద్రమతి, సక్కుబాయి, బాలనాగమ్మ, శాంతిమతి పాత్రలు వందల సంఖ్యలో నటించిన నటీమణి.

16. శ్రీమతి సురభి భారతిగారు :-

తాడేపల్లిగూడెం. సుభద్ర, చంద్రమతి, రాధ, సత్యభామ, మల్లమదేవ, కైక పాత్రలు చక్కగా పోషించిన నటి.

17. శ్రీమతి విజయాంబగారు :-

ఏలూరు. చక్కని గాయని. చంద్రమతి, ద్రౌపది, రుక్మిణి, సావిత్రి పాత్రలకు పేరుతెచ్చుకున్న నటి.

18. రాయవరం లక్ష్మిగారు :-

ఇంటిపేరు మర్ల. రాయవరం. చింతామణిలో చింతామణి, రాధ వేషాలు, బొబ్బిలియుద్ధంలో మల్లమాంబ, హరిశ్చంద్రలో మాతంగి, కలహకంఠి ప్రసిద్ధిగాచేసిన నటి. సుకుమారమైన గాత్రం, స్ఫురద్రూపం యీమెకు దేవుడిచ్చిన ఆభరణాలు.



# జానపదులు - రామాయణాలు

తెలుగుజానపదులకు రామాయణం అత్యంత ప్రీతిపాత్రం. దీనిని ఎన్నిసార్లుచెప్పినా ఆప్యాయంగా, భక్తిగా, ఆసక్తిగా ఆలకిస్తూనేఉంటారు. తెలుగులో నిర్వచనోత్తరరామాయణందగ్గరనుంచినేటిరామాయణకల్పవృక్షం వరకూ ఎన్నోరామాయణాలొచ్చాయి. ఎందరెందరో వ్రాసారు. అందులో భాస్కరరామాయణం, గోపీనాథరామాయణం, మొల్లరామాయణం, ఆధ్యాత్మికరామాయణం, చిత్రరామాయణంలాంటివి పండితాభిరుచికే పరిమితమై పోయాయి. జానపదరామాయణం అని పేరే ఒక రామాయణంఉంది. అది కూడా జానపదులను పట్టుకోలేదు. కాని జానపదుల హృదయపీఠాన్ని అధిష్టించింది రంగనాథరామాయణ కథమాత్రమే. కాబట్టి జానపదుల మనసుల్లో అంతగాఢంగా ముద్రవేసుకున్న రంగనాథ రామాయణాన్ని పరామర్శించకుండావదిలేస్తే జానపదులఅభిరుచిని సక్రమంగా దర్శించినట్లుకాదు. అందువల్ల జానపదజనరంజకమైన రంగనాథరామాయణాన్నికూడా స్థాలీపులాక న్యాయంగానైనా పరిశీలించడంఅవసరం.

## రంగనాథ రామాయణం

ఈదేశంలో నిజమైనరాజులు ముగ్గురేనట. ఒకరుత్యాగరాజు, రెండవ వారు పోతరాజు, మూడోవారు గోపరాజు. "నిధి చాలసుఖమా రాముని సన్నిధి సుఖమా" అని తనగానామృతంతో రాముని పాదాలనభిషేకించిన రామభక్తుడు త్యాగరాజు. "పలికెడిది భాగవతమట, పలికించెడివాడు రామభద్రుండట" అని తనభాగవతాన్ని రామాంకితంచేసిన మహాభక్తుడు పోతరాజు. (బమ్మెర పోతన) "ఏతీరుగ నను దయజూచెదవో ఇన వంశోత్తమ రామా" అని తనజీవితాన్ని రామమయం చేసుకున్న రామదాసు గోపరాజు. ఈకోవలోవాడే రంగనాథరామాయణకర్త బుద్ధరాజుకూడా.

పూర్తిపేరు గోన బుద్ధారెడ్డి. రామచరితను తెలుగులో వెలయించి తెలుగుజానపదులహృదయాలలో శ్రీరాముని సుప్రతిష్ఠుని చేసిన కవిరాజు ఆయన.

"వేదం ప్రభు సమ్మితం, పురాణం సుహృత్ సమ్మితం, కావ్యం కాంతా సమ్మితం". వేదం ప్రభువులా శాసిస్తుంది. "సత్యం వద ధర్మం చర" (సత్యం చెప్పు, ధర్మం ఆచరించు) అనేది ఆజ్ఞ. ఆజ్ఞను పాలించడం బానిస ప్రవృత్తిగా భావించి కొందరిమనసులు ఆచరణకు నిరాకరించవచ్చు. అందుకని పురాణ పురుషులజీవితాలకు ఆసద్గుణాలు ఆపాదించి కథలుగా మలిచారు. హరిశ్చంద్రునికథలో సత్యంకోసం హరిశ్చంద్రుడు నిలిచిన తీరూ, దానివలనపొందిన సత్కీర్తి వింటుంటే ఒకస్నేహితుడు సత్యంచెప్పు మేలుకలుగుతుంది, సత్యంచెప్పు మేలుకలుగుతుంది అని హితబోధచేస్తున్న ట్లుగా ఉంటుంది. విషయాన్ని మరింతప్రీతిపాత్రంగా చెబుతుంది కావ్యం. ప్రియురాలు పడకటింటిలో భర్తకు హృదయరంజకంగాచెప్పే మధురోక్తి లాంటిదిఅది. రసమో, అలంకారమో, వ్యంగ్యమో దీనికిఆలంబనం. "నా దేశానికి అర్ధరాత్రి స్వాతంత్ర్యం వచ్చింది, ఇంకా తెల్లవారనేలేదు." అనే దానిలో ఉన్న వ్యంగ్యం నలుబది సంవత్సరాల దేశదీనచరిత్రను గుండెకు హత్తుకొనేటట్టుచేస్తుంది. ఇది కావ్యతత్వం. 'నానృషిః కురుతే కావ్యం' అన్నారు పెద్దలు. వాల్మీకి ఋషిగనకనే శ్రీమద్రామాయణకావ్యాన్ని అంతలోకోత్తరంగా వ్రాయగలిగాడు. నారదుడు వాల్మీకిఆశ్రమానికి వెళ్ళినప్పుడు సకలసద్గుణసంపన్నుడు, మనసా వాచా కర్మణా సత్యవాది అయిన నాయకుడెవరైనా ఉన్నారా అంటే ఉన్నారని అతడే అయోధ్య నేలుతున్న రాముడని రామచరిత్ర వివరించి వెళ్ళిపోయాడు. నాటినుండీ వాల్మీకి దృష్టి రామునిపైనేఉంది. ఒకరోజుఉదయం తమసానదిఒడ్డున నడిచివెళుతూ ఒకబోయవాడు చెట్టుపైనున్న క్రౌంచపక్షులజంటలో ఒకదానిని కొట్టగా అదిక్రిందపడి విలవిలతన్నుకొని ప్రాణాలువిడిచింది. దానికోసం రెండవపక్షి వలవలఏడుస్తోంది. అదిచూసిన వాల్మీకిహృదయం శోకంతోనిండి పోయింది. ఆశోకమే ఒకశ్లోకమై అతని నోటినుండి శాపంగా వెలువడింది.

"మా నిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీ సమాః
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితం."

"ఓ బోయవాడా కామ మోహితుడవై ఆ పక్షిజంటను వేరుచేశావు. నీవు వృద్ధినిపొందవు" అనిశపించాడు. కట్టె, కొట్టె, తెచ్చె అన్నట్టు రామాయణమంతా ఈచిన్నిశ్లోకంలోనే యిమిడిఉంది. పక్షిజంట సీతారాము

లకు, బోయవాడు రావణాసురునికి ప్రతీకలు. కవిత్వమంటే Emotions recollected in Tranaility అంటాడు వర్డ్సువర్తు. అలా ఉద్రేకపడిన వాల్మీకిహృదయం శాంతిపొందినతరువాత ఆనిశ్చలసమాధిస్థితిలో అంత వరకూ అంతరాంతరాల్లో సుడులు తిరుగుతున్నరామకథ క్రమరూపంపొంది కావ్యంగావెలువడించి. 'ఏకోరసః కరుణమేవ' అంటాడు భవభూతి. రామాయణమంతా కరుణరసప్రధానమే. అందుకే అది అజరామరమై ప్రపంచంలో గొప్పకావ్యాలుగా పరిగణించబడే "ఇలియడ్", "ఒడిస్సే"లకంటే ప్రఖ్యాతి పొందింది.

ఇది ఇతిహాసమా, పురాణమా, జరిగిందా, జరగలేదా, జరిగితే శిధిలాలెక్కడ అని వెతుక్కోవడం అనవసరం. ఏదైతేనేమి? మానవజాతి మనుగడకుకావలసినధర్మాలను కాంతాసమ్మితంగాచెప్పిన మహాకావ్యం. It is a message to man అంటాడు కె.యమ్.మున్షీ. సుఖమయజీవితానికి కావలసిన ధర్మప్రబోధం, ఆదర్శవ్యక్తిత్వం, పాతివ్రత్యం, ఏకపత్నీవ్రతం, భాతృప్రేమ, పితృవాక్యపాలన ఇలా ఎన్నోనిబంధనలను మృదువుగా అందించిన ఉత్తమగ్రంధం. నిజానికి ఇన్ని కులాలున్నా, ఇన్ని ప్రాంతాలున్నా, ఇన్ని భాషలున్నా ఈనాడు ఈదేశాన్ని ఏకత్రాటిపై నడిపిస్తున్నవి రామాయణ భారతాలే. ప్రతిమనిషిలోనూ రాముడూఉంటాడు రావణుడూఉంటాడు. ప్రతి స్త్రీలోనూ సీతాఉంటుంది, శూర్పణఖాఉంటుంది. మనలో రావణపాలు, శూర్పణఖపాలు ఎంతవున్నదో చూసుకొని తగ్గించుకోవడానికి అద్దంలా ఉపయోగపడుతుంది రామాయణకావ్యం. రామాయణంలో "ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనం" అన్నారు పండితులు. ఒక్క రామశబ్దం తీసుకుంటే అది 'అష్టాక్షరి', 'పంచాక్షరి'లలోని అగ్ని, వాయు బీజాక్షరాలసంపుటిఅని తెలుస్తుంది. "నమోనారాయణాయ"లోని 'రా', 'నమశ్శివాయ'లోని 'మ' కలిపి 'రామ' నామం ఏర్పడిందన్నారు తాత్వికులు. అందుకే "రమేతి రమః రామః"అని నిర్వచించారు. ఈ రామాయణం ఎన్నో భాషలలోకి అనువదింపబడింది. ఈ అనువాదాలలో యథామాతృకానువాదంకాకుండా ఆయా దేశ కాల ఆచార వ్యవహారాలనుబట్టి అక్కడి జననాడినిబట్టి అనేక మార్పులు చేర్పులు చేసుకున్నారు ఆయా రచయితలు.

భారతదేశంలో వివిధభాషలలోకీ అనువదింపబడినా హిందీలో తులసీ రామాయణం, తమిళంలో కంబరామాయణం, తెలుగులో రంగనాథరామాయణం ప్రజల్లోకి బాగా చొచ్చుకుపోయాయి. దీనికి కారణం పండితపరంగానేకాకుండా పామరజనరంజకంగాకూడా ఆలోచించి ఏవేవిచెప్పితే జనులంతాఅనురక్తులుకాగలరో అటువంటివన్నీ చేర్చి పాఠకులను భక్తిభావ సముద్రంలో ఓలలాడించారు ఈకవిపుంగవులు. నిజానికి వాల్మీకికావ్యంలోని రాముడు ఉత్త(మ) మానవుడు మాత్రమే. కాని బుద్ధారెడ్డిరాముడు దేవుడు. తెలుగువారికి దైవభక్తి ఎక్కువ. ఈ నాడితెలసిన బుద్ధారెడ్డి కరుణరసంతో పాటు భక్తిరసాన్నికూడా ప్రవహింపచేసి పామరజనాన్ని పరవశింపజేసాడు. భారతానువాదం 11వ శతాబ్దంలో ఆరంభమైనా రామాయణాన్ని మాత్రం 14వ శతాబ్దివరకూ ఎవరూ ముట్టుకున్నట్టులేదు. ఈ శతాబ్దంలో వీరశైవ విజృంభణను చూశాడు బుద్ధారెడ్డి. సాహిత్యపరంగా చైతన్యవంతులను చేస్తున్న వారి "దేశీ"ప్రక్రియను పరికించాడు. స్త్రీల దంపుళ్ళపాటలు, ఏల పాటలు, జోలపాటలువంటి జానపదులరసనాగ్రాలమీద నడుస్తున్న పదజాలంచూశాడు. వాటిని సంధించాడు. దేశీఛందమైన ద్విపదను తీసికొని జానపదుల పదజాలంతో సరళసుందరంగా, తేటతెల్లంగా, సామాన్యుడికి అర్థమయ్యేపాటలా వ్రాశాడు రామాయణం. అందుకే తోలుబొమ్మలాట వాళ్ళు దీనిని చేబట్టారు. వీరు ప్రదర్శించేది రంగనాథరామాయణమే. మన ఇళ్ళల్లో స్త్రీలుపాడే 'ఊర్మిళాదేవినిద్ర', 'లక్ష్మణరేఖ'వంటివి ఇందులోని ఘట్టాలే. వాల్మీకిరామాయణంలో అసలు ఇవిలేనేలేవు.

లక్ష్మణరేఖవిషయం వాల్మీకంలో ఎక్కడాకనిపించదు. కాని దీన్ని రంగనాథరామాయణంలో ప్రవేశపెట్టి జానపదుల హృదయాలను ఆకట్టుకొనేటట్టు చేశాడు. మారీచుడు రాముని స్వరంతో "హా లక్ష్మణా" అని కేక పెట్టినప్పుడు రామునికేదోప్రమాదం జరిగిందనిభయపడి సీత లక్ష్మణుని వెళ్ళమని బలవంతంచేస్తుంది. గత్యంతరంలేక కుటీరంముందు మూడుగీతలు గీసి "ఏపరిస్థితిలోనూ వీటిని దాటకువదినా" అనిచెప్పి వెళతాడులక్ష్మణుడు. రావణసన్యాసికి భిక్షవెయ్యడానికి ఆమూడుగీతలూ దాటిరాకుంటే సీత కడగండ్లపాలయ్యేదికాదుగదాపాపం అని ఎంతో నొచ్చుకుంటుంటారు కథ

వింటున్న జనం. ఈ చిన్నఅతుకు కథకు అంతప్రాణప్రదంగా నిలిచిందన్న మాట. రామాయణంలో ఇది ఎంతబలంగా అతుక్కుపోయిందంటే మూలంలోలేదని ఎంతమొత్తుకున్నా ఎవ్వరూ నమ్మేటట్టులేదు. ఇది అప్పటికే జానపదులలో మంచిప్రచారంలోఉన్న బాలనాగమ్మ కథలోనిది. కార్యవర్ధిరాజు యుద్ధానికి వెళుతూ బాలనాగమ్మను దాటవద్దని గుమ్మంలో మూడుగిరులు గీచివెళతాడు. మాయలఫకీరుకు ముష్టివెయ్యడానికి ఆమె అవి దాటిరావడంతో కథమలుపుతిరిగి ఉత్కంఠనురేకెత్తించి ఆద్యంతం ఆసక్తితో వినేటట్టుచేస్తుంది. రామాయణంలోకూడా అలాచేస్తే పామరజనాదరణ పొందుతుందని ఆ సంఘటనను ఇక్కడచొప్పించి ఉండవచ్చు.

ఇలాగే అహల్యాశాపఘట్టంలోచేసిన చిన్నమార్పు సహజంగా ఉండటమేకాకుండా మూలానికే మెరుగుదిద్దింది. వాల్మీకిరామాయణంలో గౌతముడు వేకువనేలేచి నదీస్నానానికివెళతాడు. ఇంద్రుడువచ్చి అహల్యను అనుభవిస్తాడు. కాని రంగనాథరామాయణంలో ఇంకా రెండుఝాముల ప్రొద్దుండగానే ఇంద్రుడు కోడై కూస్తాడు. తెల్లవారబోతోందని భ్రమసి గౌతముడు నదీస్నానానికి వెళ్ళిపోతాడు. పల్లెలలో జారులు తమకడ్డుగా ఉన్న పెద్దవాళ్ళను మభ్యపెట్టడానికిచేసే పన్నాగాలెన్నోచూసి దీన్ని ప్రవేశపెట్టిఉంటాడు. ఈ చమత్కారకల్పన రామాయణతల్పానికి సొగసు కూడా తెచ్చిపెట్టింది. వాల్మీకిరామాయణంలో గౌతముడు అహల్యను "శిలాను ప్రాప్య" అని, అంటే రాయికమ్మని శపిస్తాడు. మరి రాయికి కష్టాలేముంటాయి! బాధలేముంటాయి! రంగనాథరామాయణంలో అహల్య ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ చలిలో వణుకుతూ- ధూళిదూసరితాంగియై అగతికయై పడియుండమని శపిస్తాడుగౌతముడు. ఇప్పుడది శాపం అనిపించుకుంటుంది విమర్శనాదృష్టితోచూస్తే. ఇలాంటిదే 'జంబుమాలిని'వృత్తాంతం కూడా. శూర్పణఖభర్తను రావణుడుచంపించి ఆమెను దండకారణ్యానికి పంపించివేశాడు. అప్పుడామె గర్భిణి. జంబుమాలిని అనేకొడుకునుకని రావణునిచంపి ప్రతీకారం తీర్చుకోమన్నది. అతడు రావణునిచంపే అస్త్రాల కోసం సూర్యునిగూర్చి ఘోరమైనతపస్సుచేస్తుంటే పైన పొదలుపెరిగిపోయాయి. ఆతపస్సుకుమెచ్చి ఒకనాడుసూర్యుడు ఆకాశంనుంచి ఒకఖడ్గాన్ని పడవేశాడక్కడ. అదేసమయానికి అక్కడికివచ్చిన లక్ష్మణుడు ఆఖడ్గంతీసి

పదునుపరీక్షిద్దామని ప్రక్కనున్నపొదను ఒక్కవ్రేటుతోనరికాడు. ఆదెబ్బకు పొదలోనున్న జంబుమాలినిశిరస్సు ఖండింపబడింది. తరువాత అక్కడికి వచ్చిన శూర్పణఖ విషయంతెలిసికొని రోషారుణనేత్రాలతో రామునిదగ్గరకు వచ్చి ఆ సుందరాకారంచూసిమోహిస్తుంది. మిగిలిన కథ తెలిసిందే. ఈ కల్పనవల్ల శూర్పణఖరాకకు కార్యకారణసంబంధం ఏర్పడింది.

ఇక సుందరకాండలో ఆంజనేయుడు రావణకొలువులో తనవాలాన్ని పెంచి రావణునికంటె ఎత్తునకూర్చొని తన ఆధిక్యాన్ని ప్రదర్శించాడనేది కూడా బుద్ధారెడ్డికల్పనమాత్రమే. జానపదులు హనుమంతుని అభిమానిస్తారు గనుక అతనిచేత ఇలా చిత్రాలుచేయిస్తే రామాయణం బాగావారినిఅలరిస్తుం దనే ఉద్దేశ్యంతో ఈవిచిత్రకల్పన చేసిఉంటాడు. అలాగే రామయణంలోని "ఉడత"కూడా తెలుగు ఉడతే. ఈ చిన్నిసంఘటనతో జానపదులహృదయా లలో భక్తిబీజాన్ని బలంగా పాదుకొల్పాడు.

యుద్ధకాండలో రావణుని తలలూ చేతులూ ఎన్నిసార్లు ఖండించినా మళ్ళీమళ్ళీ మొలుస్తున్నాయట. అప్పుడు విభీషణుడు చెబుతాడు రావణుని నాభిదగ్గర అమృతభాండం ఉన్నదనీ దానిని పగలగొట్టితేగాని అతడు చావ డనీను. ఏడేడుసముద్రాలకవతల మర్రిచెట్టుంది, ఆమర్రిచెట్టుతొర్రలో చిల కుంది, ఆ చిలకబొందిలో ఫకీరు ప్రాణముంది అని బాలనాగమ్మ కథచివర కథకుడుచెబుతుంటే జనంవిస్తుపోయి ఆసక్తిగావినడం చూసుంటాడుబుద్ధారెడ్డి. దానిని ఇలా నాజూగ్గామార్చి రావణునిప్రాణానికితగిలించిఉంటాడు. ఉత్సు కతను రేకెత్తించే అద్భుతకల్పనయిది. వాల్మీకి రామాయణంలో ఈ ఘట్టంలో ఇంద్రసారధి 'మాతలి' రాముని బ్రహ్మాస్త్రంప్రయోగించమంటాడు. రాముడలాచేయగా రావణుడు చస్తాడు. కాని బుద్ధారెడ్డిమలుపు కథకు మంచి మసాలా. ఇదే జానపద కథలలోని పట్టు.

ఊర్మిళాదేవినిద్రకూడా ప్రత్యేకించి జానపదస్త్రీలనాకర్షించడానికిచేసిన మరోఅద్భుతకల్పన.

"పదునాలుగేండ్లును పగలును రేయి
నిదురవోవకనుండ నియమంబు సేసి
ఆరాత్రి నిద్ర మాయారూపు దాల్చి
ధీరుడా లక్ష్మణ దేవుని చేరి

ఏను నిద్రాదేవి ఏర్పడదెల్పు
విధివిధించెను వెంటవెంట వర్తింప
విధమేది నిన్నునే విడుచుటకింక
అనిన ఊర్మిళయందు అహరహమ్ములును
జనియుండుమంత యీసమయంబుతీర్చి
వచ్చినగైకొందు వరుస నిన్ననిన
నిచ్చనౌగాకంచు ఏగె నిద్రయును".

ఈ విషయంకూడా అవాల్మీకమే–అయినా కాదంటే నమ్మేవారులేరు. ఇలాంటి కల్పనలేగాకుండా పాత్రలనుకూడా తెలుగువారి మనోభావాల కను గుణంగా తీర్చిదిద్దాడు బుద్ధారెడ్డి. భర్తయైన వాలిని చంపిన రాముని తన దగ్గరకువచ్చి తార యిలా నిలదీస్తుంది.

"జననాధ యీవాలి చంపనేమిటికి ?
వెరవొప్ప నీరాజ్య విభవంబుగొన్న
భరతుడే రఘురామ పరికింపవాలి ?
చెనటియై నీభార్య చెరగొనిచన్న
దనుజుడే రఘురామ తలపోయవాలి
నీయట్టికారుణ్య నిధికిట్లుతగునె ?
జనకజతోకూడి చనియెనాఎరుక ?"

ఏమయ్యా రామా ! నీరాజ్యాన్ని అపహరించిన సీతమ్మడు భర తుడుకాడే వాలి ! నీభార్యనెత్తుకొనిపోయిన రావణుడుకాడే వాలి ! నీకేం అపకారంచేసాడనిచంపావు ? నీజ్ఞానమంతా సీతతోనే ఎగిరిపోయిందా ? వాలి లేకుండా నేను బ్రతకగలనా ! నన్ను కూడాతెగటార్చు అనే మాటలతో తార పాతివ్రత్యాన్ని ప్రతిష్ఠాపించాడు. వాల్మీకంలో తార జరిగిందేదో జరిగి పోయిందిఅనే సామాన్య స్త్రీ మోస్తరుగానే కనిపిస్తుంది.

వర్ణనలలో అలంకారాలుకూడా జానపదులకు పరిచితమైన విషయాల మీదే అమర్చాడు. ఋష్యమూకపర్వతందగ్గరకు రామలక్ష్మణులురాగానే ఆ కొండపొందినఆనందము ఎంతోనిండుగా ఉత్ప్రేక్షిస్తాడు—

"త్రైలోక్యవిభులైన తమరాకచూసి
ఆలోన మదిపొంగి ఆనందమంది

అనయంబు నొప్పెడు అశ్రుపూరంబు
లన సేలయేరుల నలరెడు దాని"

అని సెలయేళ్ళ ప్రవాహాన్ని పర్వతునియొక్క ఆనందబాష్పాలుగా అభివర్ణిస్తాడు.

జానపదులు తమయిళ్ళల్లో ఎవరయినా చనిపోతేవారితాలూకు చేష్టలూ, మాటలూ, వారితోపొందిన అనుభూతులూ, వారిస్మృతితో కలిగిన వెలితి తలుచుకు తలుచుకు ఏడుస్తారు. సీత కనిపించకపోయేసరికి ఆమె చచ్చిపోయి ఉంటుందనిభావించిన రామునిచేతకూడా అలాగే విలపింపజేస్తాడు-మగవాడు గనుక కొంచెం సున్నితంగా –

"ఇది మహారణ్యమై యిప్పుడుతోచె
ఇది పర్ణశాలయై యిప్పుడుతోచె
ఇదినాకు తపమని యిప్పుడు తోచె
ఇదినాకు దుఃఖమై యిప్పుడు తోచె
చల్లని ముఖదీప్తి చంద్రునికిచ్చి
తెల్లని నగవు చంద్రికలకునిచ్చి
చెలువంపుపలుకుల చిలుకలకిచ్చి
నిన్ను దైవము మ్రింగెనే నేడుసీత" !

ఇలాగ తెలుగుజానపదుల భావాలూ, రీతులూ, ఆచారాలూ, అలవాట్లు, పడికట్లు అన్నీ జతచేసి సీతను తెలుగుజానపదుల ఆడబడుచుగానూ, రాముని తెలుగుజానపదుల దేవుడుగానూ తీర్చిదిద్ది రామాయణాన్ని తెలుగు జానపదుల హృదయాలలో చిరస్థాయిగా నిలబెట్టాడు బుద్ధారెడ్డి. తెలుగు పల్లెలలో పేటపేటకూ కనిపించే రామాలయాలు, ఇంటింటావినిపించే సీతారాముల పేర్లు ఈ జానపదరామాయణప్రభావమే.



# క్రీడలు (ఆటలు)

సీ. వేగిరాజ్యపు పల్లెవీధుల 'చెడుగుళ్ళ'
రిపుల కవ్వించు నేరుపులు తెలిసి
ఎగురు 'గోడీబిళ్ళ' సొగసులో రిపు శిర
స్సుల బంతులాడు శిక్షకులకు డాసి
'చెడ్డాడ' యుప్పుతెచ్చిననాడె శాత్రవ
వ్యూహముల్ వగిలించు నొరపు గఱచి
'కోతికొమ్మచ్చి'లో కోటగోడల కెగ
ప్రాకి లంఘించు చంక్రమణ మెఱిగి
గీ. తెనుగులంతడ్డె యవినేర్చుకొనియ యుందు
రెన్నగా తెల్గుతల్లులు మున్ను శౌర్య
రసమొడిచి ఉగ్గుపాలతో రంగరించి
బొడ్డుకోయని కూనకే పోయుదురట.

విశ్వనాథ సత్యనారాయణగారు తమ "ఆంధ్ర ప్రశస్తి" గ్రంథంలో "వేగిక్షేత్రం" ఖండికలో మనజానపదుల ఆటలనలా అభివర్ణించారు.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు తమ 'అమృతానందం'లో ఆనాటి పిల్లల ఆటలనిలా వివరించారు.

గీ. 'గుడు గుడు గుంచములు', 'బిళ్ళ కుందనగరి'
'కాళ్ళ గజ్జెలు', 'చిపచిప గోళ్ళు', 'వాన
లప్ప', 'చెమ్మచెక్క', 'వెన్నెల కుప్పలు' మొద
లైన మేలాట లాడెదు నపుడు బాల.

## ఆటలు

సీ. * "చిట్లపొట్లాకాయ సిరిగంగణావర్తి,
గుడుగుడుగుంచాలు, కుందెనగుడి
డాగిలి, ప్రుచ్చులాటలు, తన్నుబిళ్ళ,
తూరనతుంకాలు, గిరనగింజలు

* ధూర్జటి. శ్రీ కాళహస్తి మహాత్మ్యము. ఆ. 3, పద్యం 33.

పిల్ల దీపాలంకి, బిళ్ళగోడు,
చిడుగుడవ్వలపాటి చెండుగట్టినబోది
యల్లి, యుప్పన బట్టె, లప్పళాలు
చిక్కనా బిల్లలో టిల్లు బిందరాది
యైన శైశవ క్రీడావిహారసరణి
చెంచుకొమరులతోడనుద్దించుకాడు
తిన్నడభినవ బాల్యసంపన్నుడగుచు"- అని వర్ణించాడు
ధూర్జటి శ్రీకాళహస్తి మహాత్మ్యంలో-

** "దినముల్ కొన్నిచనంగనంత కడు
నర్థిన్ బొమ్మపెండ్లిండ్లు, గు
జ్జెనగూళ్ళచ్చనగండ్లు, పింపిణులు, కుచ్చిల్, గిరసగింజ, లో
మనగుంటల్, కనుమూసి గంతనలు, కంబాలాటలోనైన ఖే
లనముల్ మీరగ బోంట్లతో నలరె బాలారత్నమెల్లప్పుడున్"
అని వర్ణించాడు పింగళిసూరన కళాపూర్ణోదయంలో-

౧౫౦ ఏండ్ల క్రిందట నారాయణకవి నాటిఆటలను యిట్లు
తెలిపినాడు_

సీ. "దూచియు జాబిల్లి బూచి కన్నుల కచ్చి
గుడిగుడికుంచంబు కుందెనగరి
చీకటి మొటికాయ చింతాకు చుణుదులు
పులియాటలును చిట్ల పొట్లకాయ
తూరన తుంకాలు తానిగ తానిగ
చిడుగుడు మొకమాట చిల్లకట్టె
దాగిలి మూతలు తనుబల్ల యాలంకి
గుప్పట గురిగింజ కొండకోతి
చిక్కణబిల్లయు, జెల్లెము గొడుగును
బల్లదీవులు లక్క బిక్కదండ
గద్దెన బోడి యొక్క సికొక్క బరిగాయ
పోటు గీరివ గింజ బొంగరములు (౩-౧౪౭)

*"ఉప్పెన బట్టెలు (ఉప్పట్లు) చెడుగుడాట, బొంగరాలయాట, గాలిపటము ఎగురవేయుట, అచ్చన గండ్లయాట, ఓమనగుంటలు, జూదము, పులిజూదము, చదరంగము మొదలైనవి ఆరేడువందల సంవత్సరములకు పూర్వమునుండి ఉన్న యాటలు."

పల్లెలలోకూడా నవనాగరికత ప్రబలడంతో జానపదుల ఆటలూ పాటలూ చాలావరకు తెరమరుగునపడ్డాయి. ఆనాటి ఆటలూ, క్రీడలూ సహజసిద్ధమైనవి. ఖర్చులేనివి. చిన్నతనంనుండీ మనిషిలో సంఘీభావాన్నీ సఖ్యతనూ సహజీవనాన్నీ విజ్ఞానాన్నీ సహృదయతనూ శౌర్యాన్నీ సాహసాన్నీ వివేకాన్నీ పెంపొందింపచేయడమే వాని లక్ష్యం. చిన్నపిల్లల ఆటలదగ్గర్నుంచీ పెద్దవాళ్ళ క్రీడలవరకూ అన్నింటా ఏదో ఒక ప్రయోజనం ఇమిడిఉంటుంది.

## పిల్లల ఆటలు - బువ్వాలాట

దీనినే "గుజ్జన గూళ్ళాట" అనికూడా అంటారు. కొందరు పిల్లలు ఒకచోట చేరతారు. తమ యిండ్లనుండి ఒక్కొక్కరూ ఉప్పో, పప్పో, చింతపండో, ఉల్లిపాయలో, బియ్యమో, కారమో ఏదోఒకటితెచ్చి సఖ్యంగా తమ లక్కపిడతలలోనో చిన్నిగిన్నెలలోనో వాళ్ళేవండుకొని తింటూ "బువ్వాలాట" ఆడుతుంటారు. తరువాత "అమ్మా-నాన్న" ఆటఅనీ, బొమ్మల పెళ్ళిళ్ళనీ ఇంట్లో పెద్దవాళ్ళ పనిపాటలు, నిత్యకృత్యాలు, ఆచార వ్యవహారాలు అన్నీ చక్కగాఅనుకరిస్తూ వినోదిస్తారు. ఇది వారి రేపటి సంసారపుజీవితానికి ప్రాథమికపాఠశాల అన్నమాట.

** ఈ గుజ్జనగూళ్ళఆటను రుక్మిణియు, గిరికయు ఆడినట్లు భాగవతమునందును, వసుచరిత్రయందును వర్ణితమైనది.

## బొమ్మల పెళ్ళిళ్ళు

పిల్లలు తాటాకులతో ముఖము, చేతులు, పొట్ట, కాళ్ళు వచ్చేలా బొమ్మలుచేసి వానిని ఆడ, మగ బొమ్మలుగా విడదీస్తారు. మగబొమ్మ

---

* విజ్ఞాన సర్వస్వం తెలుగు సంస్కృతి ౧ (ఆటలు, వేడుకలు) పు. 23

** తెలుగు విజ్ఞాన సర్వస్వం (తెలుగు సంస్కృతి) క్రీడలు. పుట. 1443 ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ.

లను పొడుగ్గాను, ఆడబొమ్మలను కొంచెం పొట్టిగానూచేస్తారు. ఆడబొమ్మలకు కళ్ళకుకాటుక, బుగ్గనచుక్క, కళ్యాణంబొట్టూ పెట్టి చిన్న గుడ్డపీలిక చీరలాసింగారించి తలకు వెనకజడకట్టి చేతులకుగాజులు, మెడలో పూసల పేర్లు వేసి అందంగాసింగారిస్తారు. మగబొమ్మలకు ముఖాన కళ్యాణం బొట్టూ, బుగ్గనచుక్క పెట్టి చిన్నగుడ్డముక్క పంచిలాకట్టి, భుజంపై మరో గుడ్డముక్క ధోవతిలావేస్తారు. పిల్లలు రెండుజట్లుగావిడి ఒకరు ఆడపెళ్ళి వారుగను, ఒకరు మగపెళ్ళివారుగను ఆ బొమ్మలు తీసుకొని ఇళ్ళల్లో తాముచూసి అవగాహన చేసుకొన్న పెండ్లి తంతులన్నీ నడుపుతూఆ బొమ్మలకు పెండ్లిండ్లుచేస్తారు. ఈ పిల్లల్లో ఒకరు బ్రాహ్మణవేషంవేసుకొని పెళ్ళిమంత్రాలు "అశింతాయనమః, బుసింతాయనమః" అని మంత్రాల్లా అంటూ అక్షతలుజల్లుతూ పెండ్లిజరిపిస్తారు. కట్నాలు, కానుకలు, చదివింపులు యివి ముఖ్యంగా అనుకరిస్తారు.

ఈ ఆట చిన్నపిల్లలకి లోకవ్యవహారాలు అవగాహనచేసుకోడానికి తోడ్పడుతుంది. ఇందులో పిల్లలుపొందేఆనందం అనిర్వచనీయం.

* తెలుగుభారతంలో ఉత్తర తనబొమ్మలపొత్తికలకు చిత్రవర్ణమైన భాసురములైన కౌరవవీరులకోకలనుతెమ్మని అర్జునునకు చెబుతుంది.

** "బొమ్మరిండ్లు కట్టి.................బొమ్మలుచేసి పెండ్లి" అనే విషయం నన్నెచోడుని కుమారసంభవంలోకూడా ఉంది.

"బొమ్మల పెండ్లిండ్లు బువ్వంపు బంతులు
పుణికిళ్ళు నిట్టెక్కి బొమ్మరిండ్లు"

అని ౧౩౦ ఏండ్లక్రిందట నారాయణకవి (౫-౧౪౭) వ్రాసినాడు.

## నూకలాట

మరీ పసిపిల్లలు వారిజ్ఞానపరిధిలో సంభాషణాత్మకంగా ఆడుకునే శ్రమలేని చిన్ని ఆటయిది. ఒకర్ని మరొకరు –

"నూకలిస్తా మేకల్నికాస్తావా ?" అంటారు.

"కాస్తాను" అని రెండవవారి సమాధానం.

---

* శ్రీ మదాంధ్ర మహాభారతం, విరాటపర్వం, 4వ ఆశ్వాసం 47వ పద్యం.

** కుమార సంభవం. ఆ. ౩ పద్యం. 36

"పెద్ద పులొస్తే జడవ్వు కదా?" అని అడుగుతారు.

"జడవను" అని అనగానే 'ఉష్' అని కళ్ళల్లోకి ఊదుతారు. అలా ఊదినప్పుడు కనురెప్పలు సహజంగా మూసుకుంటాయి గదా! అలా ముయ్యగానే 'మరిజడిశావేం?' అని ఓడినట్లు చప్పట్లుకొడతారు అడిగినవాళ్ళు. ఆతరువాత మళ్ళా అలాగ మొదట ప్రశ్నించిన వారిని రెండవ వారు ప్రశ్నిస్తారు. ఇలా ఆపసిపిల్లలు ధైర్యాన్ని పరీక్షించుకుంటూ ఆడుకునే ఆనందవల్లరియిది. అలా ఊదడంలో కళ్ళకు చల్లనిగాలితగులుతుందేమో హాయిగా ఉంటుంది. కళ్ళలో ఏదైనా బూడిదలాంటిదిపడితే పోతుంది.

## అప్పడప్పడతాండ్ర

నలుగురైదుగురుపిల్లలు వరుసగా గుండ్రంగా కూర్చుని ప్రతివారూ తమ రెండుఅరచేతుల్నీ తిరగేసి ఒకదానిమీద ఒకటి పెడతారు. కూర్చున క్రమంలో వారు ఒకరిచేతులమీదఒకరు పెడతారు. అన్నిటికన్నాపైనచెయ్యి ఉన్నవారు (వీళ్ళే సాధారణంగా ఉన్నవాళ్ళలో పెద్దవాళ్ళయిఉంటారు. లేదా మాటచలామణిగలవారు అయ్యుంటారు) పైనున్న తనచేయితీసి ఆ క్రింద నున్నచేతులమీద ఒక్కొక్కదానిమీదా చేతితో అప్పడంలా చిన్నగా వాయిస్తూ ఈ క్రిందిరీతిపాడతారు.

"అప్పడప్పడ తాండ్ర
ఆవకాయ తాండ్ర
మావాళ్ళ దొడ్డిలో
మామిడికాయ తాండ్ర
చిలకముక్కు
చెవి పట్టుకో"

అనిపాటముగియగానే ఆతట్టబడ్డచెయ్యి వారు ఆ చేతితో ప్రక్క వారి చెవిపట్టుకుంటారు. ఇలాగ అనేకసార్లుపాడి ప్రతివారూ ప్రక్కవారి చెవిపట్టుకునేదాకా పాడతారు. ఆతరువాత అలాచెవులుపట్టుకుని జోజోఅంటూ అందరూతూగుతూ ఊగుతూ ఆనందతీరాల తేలిపోతారు. కొంతమంది కొంటెపిల్లలు పట్టుకున్న చెవులు చిలిపిగా గిల్లుతారుకూడా. గిల్లబడ్డపిల్ల

తగువెడుతుంది. దాన్ని రెండుగుంజీలు తియ్యమనో, మూడుగుంజీలు తియ్యమనో శిక్షించి పరిష్కరిస్తారు. దీనివల్ల తగువు, పరిష్కారం, శిక్ష అనేవి బాల్యంనుండీ అవగాహనలోకి వస్తాయి.

## గుడుగుడుగుంచం

పిల్లలు ఇద్దరుముగ్గురుచేరి పిడికిళ్ళుముడిచి, ఒకరిపిడికిలిపై మరొకరి పిడికిలిపెట్టి, పై పిడికిలి మధ్యకాళీలో ఒకరు చూపుడువేలు పెట్టి త్రిప్పుతూ "గుడుగుడుగుంచం, గుండారాగం, పాములపట్నం, పగడారాగం. కత్తెయ్యనా ? బద్దెయ్యనా ? వేన్నీళ్ళెయ్యనా ? చన్నీళ్ళెయ్యనా?" అనిపాడుతూ వేణ్ణీలన్నవారిపిడికిలిగట్టిగానూ, చన్నీళ్ళన్నవారిపిడికిలిచిన్నగానూ గిచ్చుతూ అన్ని పిడికిళ్ళనూ అలాగే పూర్తి చేస్తారు. ఇందులో వేళ్ళుత్రిప్పేటప్పుడు కలిగేగిలిగింత ఆపసిహృదయాలలో చక్కిలిగింతలుపెడుతుంది.

అలాగిచ్చినప్పుడు ఆపిల్లలు తమచేతులు వెనక్కిపెట్టేసుకుంటారు. అప్పుడు చేతులుగిల్లిన పిల్ల చేతులు వెనక్కిపెట్టుకున్న పిల్లల్ని ప్రశ్న రూపంలోఅడుగుతుంటే ఆపిల్లలు వానికిసమాధానాలుచెబుతూ తీగలాగ సాగిస్తారు. ఇది చిత్రమైనమాటల ఆట—

"పిల్లీ నీ చేతులేవి ?
పిల్లెత్తుకుపోయింది
ఎక్కడదాకా ఎత్తుకుపోయింది ?
గోలుకొండదాకా.
గోలుకొండేమిచ్చింది ?
గుడ్డిగవ్వ.
గుడ్డిగవ్వేంచేశావు ?
కుమ్మరికిచ్చాను.
కుమ్మరేమిచ్చాడు ?
కుండ.
కుండనేంచేశావు ?
మాతాతకిచ్చేను.
మీతాతేంచేశాడు ?
ముడ్డికడుక్కోబోయి నూతిలో పడేశాడు.

నుయ్యేమిచ్చింది ?
నీళ్ళు.
నీళ్ళేంచేశావు ?
మొక్కలకిపోశాను.
మొక్కలేమిచ్చాయి ?
పువ్వులు.
పువ్వులేంచేశావు ?
మాయప్ప కొప్పులో పెట్టేను.
కొప్పేమిచ్చింది ?
పేను.
పేనేం చేశావు ?
గడపమీద కుక్కేను.
గడపేమిచ్చింది ?
చెక్క.
చెక్కేంచేశావు ?
పొయ్యిలో పెట్టేను.
పొయ్యేమిచ్చింది ?
బూడిద.
బూడిదేం చేశావు ?
పెంటమీదేశాను.
పెంటేమిచ్చింది ?
ఎరువు.
ఎరువేంచేశావు ?
చేనుకేశాను.
చేనేమిచ్చింది ?
పచ్చగడ్డి.
గడ్డేం చేశావు ?
ఆవుకేశాను.
ఆవేమిచ్చింది ?
పాలు.
పాలేం చేశావు ?

పరమాన్నం వండేను.

పరమాన్నం ఏంచేశావు ?

ఉట్టిమీదెట్టెను.

నాక్కొంచెం పెట్టవా ?

లేదు. మావాళ్ళ పిల్లొచ్చి ఆయింతా నాకిపోయిండి

అనగానే అందరూ కిలాకిలానవ్వుకుంటారు. ఇది చాలావరకు ముక్తపద గ్రస్తంకావడంవల్ల ఎంతచేంతాడైనా గుర్తుంచుకోవడంసులువు. దీనివల్లచిన్న పిల్లలకు ధారణ, భాష అలవడ్డమేకాకుండా వస్తువులూ అవి చేసేపనులూ అవగతమవుతాయి.

## చెమ్మచెక్క

ఇద్దరుగాని, ముగ్గురుగాని ఆడపిల్లలు ఎదురుబొదురు నిలుచుని ఒక లయప్రకారం వెనక్కీముందుకీఎగురుతూ తమరెండుఅరచేతులనూ ఎదుటి వారిఅరచేతులకుతాకిస్తూ "చెమ్మచెక్క, చారడేసిమొగ్గ, అట్లుపొయ్యంగ, ఆరగించంగ, ముత్యాల పందిట్లో ముగ్గులెయ్యంగ, రత్నాల పందిట్లో రంగు లెయ్యంగ" సుబ్బారాయుడు పెళ్ళి, చూసీ వద్దాంరండి, అమ్మానాకూబువ్వ, అరిచేతిలో గవ్వ" అంటూ పాడుతూ గెంతుతుంటారు అలసిపోయేవరకూ. ఇది శారీరకపరిశ్రమేగాకుండా నాట్యారంభానికి అంకురార్పణకూడా. అంతే గాకుండా ఈచేతులుతాకించడంలో తాళం, పాడడంలో గానం మిళితమై ఉండడంతో వానిఅభ్యాసానికికూడా ఇది ప్రథమ సోపానమని చెప్పవచ్చు.

## ఒప్పులకుప్ప

ఇద్దరుఆడపిల్లలు ఎదురెదురుగానిలుచుని ఒకరికుడిచేతిని మరొకరు ఎడమచేతితోనూ, ఒకరిఎడమచేతిని మరొకరుకుడిచేతితోనూ గట్టిగాపట్టు కుని, పాదములు ఎదురెదురుగా దగ్గరగాపెట్టి, కొంచెంబిగువుగావుండేలా వెనక్కివాలి, గుండ్రంగాతిరుగుతూ, "ఒప్పులకుప్పా, వయ్యారిభామా, శాయి పప్పు, సన్నబియ్యం, సోట్లోతవుడు నీమొగుడెవరు?'' అనిపాడుతూ గిర్రునతిరుగుతూ గాలిలోతేలిపోతున్న అందాల ఆనందానుభూతిని పొందు తారు. పెళ్ళికానిపిల్లలకు మొగుడు అనేమాట ఒకపులకరింత.

## త్రాడుఆట (skipping)

ఆడపిల్లలు దాదాపు తమ పొడవుగల త్రాడును చేతులతో తమ కాళ్ళ క్రిందనుంచి తలపైకి త్రిప్పుతూ, కాళ్ళకు తగలకుండా గెంతుతుంటారు. అలా ఏకబిగిని ఎవరు ఎక్కువసార్లు త్రిప్పితే వారు గెలిచినట్లు.

దీనితోనే మరొక ఆటకూడా ఆడతారు. పిల్లలందరూ ఒకే చోట ఒకే సారి ఇలా గెంతుతూ బయలుదేరి నిర్దేశించుకున్న స్థలానికి ఎవరుముందు చేరితే వాళ్ళు గెలిచినట్టు.

ఇది కాళ్ళకూ, చేతులకూ, ఏకాగ్రతకూ సంబంధించిన పరిశ్రమ. చక్కని పోటీ మనస్తత్వం, పురోగతిపై ఆకాంక్ష కలిగిస్తుంది ఈ ఆట.

## కాళ్ళాగజ్జి

పిల్లలందరూ వరుసగా కూర్చొని కాళ్ళు బారజాపుకుంటారు. అందులో ఒకరు ఎదో ఒకకాలిదగ్గర ప్రారంభించి "కాళ్ళాగజ్జీ, కంకాళమ్మా, వేగూ చుక్కా, వెలగామొగ్గా, మొగ్గాగాదు, మోటికినీరు, నీరూకాదు, నిమ్మల పండు, పండూకాదు, పాపాయికాలు, కాలూతీసి, గట్టుమీదెట్టు" అని పాడుతూ ప్రతికాలునూ స్పృశిస్తూ చివరకంటూ వెళ్ళి ఇంకామిగిలిపోతే మరల వెనక్కి పాడుకుంటూ వస్తారు. కొన్నిచోట్ల ఈ పాటకుబదులు "అంటిపండంటి పండమ్మనముద్ద, పేపేముద్ద, ప్రధానముద్ద, లంకాసామీ, లాలిపిచూ, శాంతికొమ్మా, సోమాలింగం, అత్తాచెవిలో, ముత్యాలోసి ఆడుకురారా పండెన్నా" అని పాడతారు. పాట ఏకాలుమీద పూర్తయితే ఆకాలు పండిందన్నమాట. అది వెనక్కి ముడుచుకుంటారు. ఇలా అని కాళ్ళూ పండించి చివరికాలును భూమినొకకాలుగా స్పృశిస్తూ పండిస్తారు. ఇది కాలికి చిన్న పరిశ్రమేగాక అచిన్నారిమనస్సుల్లో చిత్రమైన ఉల్లాసాన్ని కలిగిస్తుంది.

ఇక కొంచెం ఎదిగినపిల్లలదగ్గరకొస్తే వాళ్ళ ఆటలు కొంత మేధస్సుకు కొంత శరీరపరిశ్రమకు సంబంధించి ఉంటాయి.

## ఒక్కొక్క మెతుకు

ముగ్గురుపిల్లలుకలిసి పంటలువేసికొని ఒకరిని పండిస్తారు. "పంట అంటే ముగ్గురు వలయంగానిలచి ఒకరిఅరచేతులు మరొకరిఅరచేతులకు తగిలించి పట్టుకొనిపై కెత్తి ఒక్కసారిగావిడిచిపెట్టి ఎవరిచేతులువారు ప్లస్గా గాని, లేక నమస్కారంపెడుతున్నట్లుగాగాని పెడతారు. ముగ్గురూఒకేలాగ పెడితే మళ్ళీపంటలువేసుకోవాలి. అందులోయిద్దరుఒకలాగ ఒకరు మరొకలాగ పెడితే ఆఒక్కరు పండినట్టు. మిగిలినయిద్దరూ ఒకరిది కుడిచెయ్యి, రెండవ వారిది ఎడమచెయ్యి వ్రేళ్ళలోకి గుచ్చి క్రిందికిదించి ఉయ్యాలలాపట్టుకొనగా, పండినవారు తన మోకాలుమడిచిదానిమీదపెట్టి రెండవకాలుజారవిడిచి, వారి యిరువురిభుజాలమీదాచేతులుమోపిఆనితే ఆమోసేవాళ్ళు -

"ఒక్కొక్క మెతుకు - గుక్కెడేసి గంజి
గాదికిందెలక - గైరమ్మ పెళ్ళి
గూటిల్లోరూపాయ్ నీ మొగుడు సిపాయ్".

అని ఒకరు ముందుచరణం, రెండవవారు రెండవచరణం పాడుతూ వాళ్ళు ముందునిర్ణయించుకున్నస్థలంవరకూ తీసుకెళ్ళిదింపుతారు. మరల అక్కడ పంటలువేసికొని ఎవరుపండితేవారిని మళ్ళీమోస్తుంటారు. తాము ఎన్నుకున్నవ్యక్తిని అందలమెక్కించిగౌరవించడమనే జనస్వామ్యశిక్షణగరు పుతుంది ఈఆట.

## వెన్నెల్లో గిలగిచ్చ

వెన్నెలరాత్రులలో పిల్లలు చీకటివెన్నెలలమధ్య ఈఆట ఆడతారు. పంటలువేసికొని దొంగనునిర్ణయిస్తారు. ఈదొంగ "వెన్నెల్లో గిలిగిచ్చా వెన్నముద్దలు తిన్నాము" అనిపాడుతూ వెన్నెలలో వాళ్ళునిర్ణయించుకున్న పరిధిలో ఈకొసనుంచిఆకొసకుతిరుగుతుంటే మిగిలినపిల్లలు వెన్నెట్లోకి, చీకట్లోకి పరుగులెడుతుంటారు. ఇలాపాడుతూతిరుగుతూ వెన్నెట్లొఉండగా దొంగ ఎవరినయినాపట్టుకోగలిగితే వాళ్ళుదొంగగాతిరగాలి. ఈఆట పిల్లలలో ఆహ్లాదాన్నీ, చురుకుదనాన్నీ, అలతిఅలతి దేహపరిశ్రమనూ కలిగిస్తుంది.

## నాలుగుస్తంభాలాట

దీనికే "గొల్ల చల్లాట" అనికూడా పేరు. పంటలువేసికొని అందులో ఒకరుదొంగకాగా మిగిలిననలుగురూ నాలుగుస్తంభాలూ పట్టుకొనిఉంటారు. (సాధారణంగా గుమ్మాలముందు వేసేపెళ్ళిపందిళ్ళలో యీ ఆటఆడేవారు) దొంగ "చల్లోయమ్మ గొల్లచల్ల" అంటూ నెత్తిమీదచేతులుపెట్టుకొని ఆ కొసనుంచి ఈకొసకీ, ఈకొసనుంచి ఆకొసకీ తిరుగుతుంటే స్తంభాలుపట్టు కున్నవాళ్ళు దొంగను దూరంపోనిచ్చి ఒక స్తంభంనుంచి మరో స్తంభానికి అటూ ఇటూ మారుతుంటారు. ఈ మారడంలో తానువదిలేసిన స్తంభానికి మరొకరుగాని, తిరిగి తానుగాని పట్టుకునేలోపున దొంగఆ స్తంభాన్ని ముట్టు కుంటే ఆ స్తంభం ఆదొంగది. అప్పుడు స్తంభంలేకుండా మిగిలిపోయినవ్యక్తి దొంగ. ఈఆటపిల్లలలో నిశితమైనచూపు, ముందుజాగ్రత్త నేర్పుతుంది. ఈదొంగను 'గొల్లభామ' అంటారు. ఈగొల్లభామ 'చల్లోయమ్మ' గొల్లచల్ల అని పాడుతూ —

"నాలుగు స్తంభాలాట నడిమికి తొడిమికి
తానక తప్పక తన పేరేమిటి
ఉట్టిమీదబెల్లం, పొట్టికాకరకాయ"

అంటూకూడా పాడుతూ కాళీ స్తంభంకోసం వెతుకుతూ తిరుగుతుంటుంది. ఈ ఆట నేటి మ్యూజికల్ఛైర్సుకి దాదాపు ప్రతిరూపమే.

## దుక్కుడుపుల్లాట

ఇసుకతెచ్చి చిన్న గట్టుమాదిరిగాపేర్చి, ఎదుటివారుచూస్తుండగానే ఒకరు చిన్నపుల్లముక్క ఆయిసుకలోదూర్చి, లోపల దానిని ముందుకూ వెనక్కూనడుపుతూ "దుక్కుడుపుల్ల, దూదుగపుల్ల, పొయ్యిలోపెడితే పందుగపుల్ల" అని పాడుతూ తనుఎక్కడపుల్లఉంచాడో తెలియకుండా పైన యిసుక కప్పేస్తాడు. రెండవవ్యక్తి తనరెండు అరచేతులనూ వ్రేళ్ళల్లోకిజొనిపి ఆ పుల్లవున్నభాగంపై పెట్టాలి. చేతులుఆన్చినభాగంలో పుల్లఉంటే పుల్లపెట్టినవారు ఓడినట్టు. అప్పుడు ఎదుటివానికి పుల్లపెట్టే అవకాశంవస్తుంది. చేతులుఆన్చినభాగంలో పుల్లలేకుంటే మరలపుల్ల పెట్టినవానికే అవకాశం. ఈఆటలో విశేషం పుల్లఒకచోటపెట్టి వేరేచోటపెట్టి

నట్లునటించడం. ఈ మర్మాన్ని ఎదుటివాడు పసిగట్టి సరిగ్గా ఆ పుల్లపెట్టిన చోటునుపట్టుకోవడం. ఈ ఆటవల్ల మోసాన్ని కనిపెట్టే శక్తిఅలవడుతుంది. ఈ విధముగా 5గాని, 7గాని, 9గాని ఆటలు ఎవరుముందుగెలిస్తే వారు పూర్తిగా గెలిచినవారిక్రిందలెక్క. ఒక్కొ-ఆటలోగెలిచినప్పుడల్లా గుర్తు కోసం వారిప్రక్కన ఒక్కొ-చిన్న ఇసుకప్రోగు పెడుతుంటారు. గెలిచిన వారు తమ ఇసుకపోగులు ఓడినవారిదోసిటలోపోసి ఆపులముక్కను ఆ దోసిటలోని యిసుకలో పెట్టి వారికండ్లకు గుడ్డకట్టి, లేదా తనచేతులతో అతని కళ్ళుమూసి, ఆటఆడినస్థలమునుండి దూరంగాతీసుకుపోయి ఎక్కడోఒక చోట దోసిట్లోనిఇసుకను పుల్లముక్కతోసహా క్రిందపోయించేసి, కళ్ళు అలా మూసిఉంచే ఆటఆడినస్థలందగ్గరకు తీసికెళ్ళి కంటిగుడ్డ విప్పేస్తారు. కళ్ళు మూసి తీసికెళ్ళేటప్పుడూ, తీసుకొచ్చేటప్పుడు ఒకేత్రోవలో తీసుకెళ్ళకుండా ఆనవాళ్ళు దొరక్కుండా ఉండడానికి అటూయిటూ వెనక్కి ముందుకి త్రిప్పు తారు. గంతలు విప్పాక ఆవ్యక్తివెళ్ళి తానుపోసిన ఇసుక, పుల్ల గుర్తుపట్టి తీసుకురావాలి.

## గట్టూమీదా కోడి

పిల్లలు రెండువరసలుగా విడిపోతారు. ఒక్కొ-జట్టూ ఒక్కొ- నాయ కుని ఎన్నుకొన్నతర్వాత ఉభయజట్లులవారూ సుమారు గజందూరంలో ఎదురెదురుగాకూర్చుంటారు. ఒకజట్టు ఎదుటిజట్టుకు కనిపించకుండా ఉండే టట్లు చేతులు వెనక్కి-పెట్టుకుని చిన్న దూదిఉండగాని, పుల్లముక్కగాని చేతుల్లో ఒకరినుండి మరొకరికి నడుపుతూ "గట్టూమీదాకోడి, గవ్వల్లాకోడి, తొక్కితేతొంబయ్యి పిల్లల్లాకోడి, అల్లల్లాకోడికీ అకూమీరియమ్మో, పిల్లల్లా కోడీకి పిండీమిరియమ్మో, అడుక్కో-బుడుక్కో- సంబారుబుడ్డి"అని పాడి అందరూగుప్పెళ్ళుముడిచిముందుకుచాపి ఎవరిచేతిలోవుందోచెప్పుకోమంటారు. రెండవజట్టువారు తమలోతాము సంప్రదించుకుని తమనాయకునిద్వారా చెప్పి స్తారు ఫలానావారిదగ్గరఉందని. సరిగ్గా వాళ్ళుచెప్పినవారిచేతిలోనే వుంటే ఆపుల్ల రెండవజట్టువారిచేతికి వస్తుంది. వాళ్ళూ అలాగే చేస్తారు. ఒకవేళ తప్పుచెబితే ఎదుటిజట్టువారు సరిగ్గా చెప్పేవరకూ మొదటిజట్టు చేతుల్లోనే ఆ పుల్ల తిరుగుతుంటుంది. ఈఆట ఆయాసం, ఆలోచన అక్కరలేనిదయినా ఎదుటివారిచేష్టలనుబట్టి పసిగట్టేజ్ఞానాన్ని కలిగిస్తుంది. సంప్రదింపులద్వారా నిర్ధారణ అనే ప్రజాస్వామ్యపుపద్ధతిని పిల్లలకునేర్పుతుంది.

## సర్లా, టిక్కలాట

ఇది మరీతేలికైనఅట. సీతాఫలాల గింజలుప్రోగుచేసితెచ్చుకుని స్త్రీలు ఎదురెదురుగా కూర్చుంటారు. ఒకరు తమగుప్పెట్లో కొన్నిగింజలు దాచి ఎదుటివారిని అవి 'సర్లా' 'టిక్కలా' అనిఅడుగుతారు. 'సర్లు' అంటే సరిసంఖ్య అనీ 'టిక్క' లంటే బేసిసంఖ్య అనీ అర్థం. ఎదుటివారు 'సర్లు' అంటే గుప్పెట్లోవిలెక్కపెట్టిచూసి అవి సరిసంఖ్యలోఉంటే ఆ గుప్పెట్లో ఉన్నన్నిగింజలూ ఎదుటివారు ఇచ్చుకోవాలి. తరువాత మళ్ళీ అదే విధంగా ఎదుటివారుచేస్తారు. చివరికి ఎవరికిఎక్కువగింజలులాభిస్తే వారు గెలిచినట్టు. ఇది ఖరీదులేనినిజూదం- కలహాలులేని కాలక్షేపం - పెండ్లిండ్లలో పానుపువేసి వధూవరులచేతకూడా రూపాయలతో ఈ ఆట ఆడించేవారు వాళ్ళను దగ్గరచేయడానికి.

## గెచ్చనరాళ్ళాట

దీనినే గెచ్చనకాయలాట అనికూడాఅంటారు. * "పూర్వమీయాటను 'షత్పాషాణక' మని పిలిచేవారట". సిమ్మెంటురంగులో పచ్చని చిన్న చిన్న నునుపైన గుండ్రనిరాళ్ళు గంగిరెడ్లస్త్రీలువీధుల్లోతిరుగుతూ అమ్ముతుంటారు. వాటికి గెచ్చనరాళ్ళు అనిపేరు. ఆడపిల్లలు పదకొండురాళ్ళు తీసికొని కూర్చుని ఒకరాయినిపైకివిసురుతూ క్రిందరాయినొకదాని గుప్పెట్లోకి అందు కుంటారు. ఇలా చేసేటప్పుడు మామూలుగా ఒకటి. రెండు మూడు అని లెక్కించడానికి బదులుగా "ఒక్క ఓచెలియ, రెండూ రోకళ్ళా, మూడూ ముచ్చిలకా, నాలుగూ నందెన్నా, అయిదూ చిట్టిగొలుసూ, ఆరుందారాలు, ఏడుం బీడీలు, ఎనిమిదివెన్నముద్ద, తొమ్మిదితోకుచ్చు, పదీపట్టీడ" అని పాడుతూ పదీ లెక్కిస్తారు. పదివరకూ ఆడితే ఒకఆట. ఎక్కడయినా పైకి వేసినరాయి చేతిలోపడకుండా క్రిందపడితే అక్కడ ఆట అయిపోయినట్టు. వెంటనే రెండవవారు ప్రారంభిస్తారు. అదేవిధంగా ఎవరుఎక్కువ ఆటలు కొడితే వాళ్ళగొప్ప. ఇది ఏకాగ్రతకు, వ్రేళ్ళపరిశ్రమకు సంబంధించిన అట.

---

* వాత్స్యాయన కామసూత్రాలు - కన్యాసంప్రయుక్తాధికరణము బాలోపక్రమోద్యధ్యాయ పు. 7 (3-3-7)

ఇది మరోరకంగాకూడా ఆడతారు. ఐదు గెచ్చనకాయలను చేతితో పట్టుకొని వానిలో ఒకదానినిపై కెగరేసి ఆకాయ క్రిందకిదిగేటంతలో చేతి లోని నాలుగుకాయలూ నేలమీదవిడిచి క్రిందకువచ్చినకాయను పట్టుకొని ఆ కాయనే మరలఎగరవేసి క్రిందికాయలను ఒక్కొక్కపర్యాయము మూడు కాయలు, ఒక్కొక్కపర్యాయము రెండేసిచొప్పున రెండుమార్లుగా నాలుగు కాయలు, ఒక్కొక్కమారు ఒక్కొక్కటిచొప్పున విడివిడిగా నాలుగు కాయలు చేతిలోనికిజరుపుకొని పై కెగరవేసిన కాయనందుకుంటారు. ఆడే టప్పుడుగాని, కాయలను ఎగరేసి పట్టుకొనేటప్పుడుగాని, జరుపుటలోగాని తప్పిపోతే ఆటతప్పినట్లు. ప్రక్కవారికి ఆటకి అవి యిస్తారు.

** "ఈ ఆట ప్రసక్తి హంశవింశతి. కళాపూర్ణోదయం, భోజరాజీయాది అనేకకావ్యములందుకలదు".

## చింతపిక్కలాట

ఇద్దరుగాని, ముగ్గురుగాని, నలుగురుగాని, స్త్రీలు తమయిండ్లనుండి చింతపిక్కలుతెచ్చుకుని సమానభాగాలుగాకలిపి గుట్టపోసి తమమధ్య పెట్టు కొనికూర్చుని ఆ పిక్కలతోఆడతారు. ఈపిక్కలలెక్కకువీరువాడేమానం "పుంజీ", "కచ్చటా", "గుర్రం"అని, నాలుగుగింజలు ఒకపుంజీ, రెండు పుంజీలు ఒకకచ్చటా, అయిదుకచ్చటాలు ఒకగుర్రం. ఒకరు మొదట చింతపిక్కలుతీసికొని కుడిచేయివెనక్కిత్రిప్పి ఆవ్రేళ్ళమీద వానినినిలిపి, పైకిఎగురవేసి దోసిట్లోకి అందుకుంటారు. దాన్నేపట్టుపట్టడం అంటారు. అప్పుడువానిని కుడిచేయిగుప్పెటలోకితీసుకొని ఒక్కొక్కసారి ఒక్కొక్క పుంజీచొప్పున కుడిచేతివ్రేళ్ళసహాయంతోనే గుప్పెటబయటకులాగి, ఎగరేసి ఎడమచేతిలోకి అందుకోవాలి. ఎగరేసినప్పుడు ఒక్కపిక్కకూడా క్రింద పడకూడదు. పిక్కలుసరిగ్గాపుంజుడూలాగాలి. లాగేటప్పుడుకూడా పిక్క క్రిందపడకూడదు. ఇలా నాలుగు పిక్కలుచొప్పునతీసికోవడంలో ప్రమాద వశాత్తు 3గాని, 5గాని పిక్కలు రెండవచేతిలోకివస్తే తనఎడమ చేతిపైపు

---

** విజ్ఞానసర్వస్వము - తెలుగుసంస్కృతి. పు. 1440

వారిని "ఆటా? నూటా?" అని అడగాలి. 'ఆట' కావాలంటే పట్టుపట్టిన పిక్కలు యివ్వాలి. 'నూట' కావాలంటే రెండవచేతిపిక్కలు యివ్వాలి. చేతిలోఉన్నవన్నీ అయిపోయినతర్వాత గుట్టలోపిక్కలుతీసిపరచి గెచ్చన రాళ్ళలోలాగే ఒకపిక్కను పైకి ఎగరేసి అందుకుంటూ క్రింద పిక్కను బొక్కుతూ, పుంజుడుకాగానే ఎగరేసి ఎడమచేతితోపట్టుకొని తమపక్కన పెట్టుకుంటారు. ఆటపిక్క చేతిలోనేఉంటుంది.

ఎగరేసినపిక్కను అందుకోలేకపోయినా, క్రిందపిక్కను బొక్కలేక పోయినా, పిక్కనుబొక్కేటప్పుడు ప్రక్కపిక్కకు వ్రేలుకంగినా ఆటపోయి నట్టె. అప్పుడు మరల రెండవవారూ మిగతావారూ ఇదేవిధంగా ఆడతారు. మొదటిఆటకుపోసినపిక్కలుఅయిపోయినప్పుడు ఆఖరివారిది చేతిపట్టు అవు తుంది. మరల మనిషికొకగుర్రంచొప్పున పోసి మళ్ళా ఆటమొదలెడతారు. చేతిపట్టువచ్చినవాళ్ళు గుర్రంపైన ఒకపుంజీ ఎక్కువపొయ్యాలి. ఎవరి దగ్గరయినా గుర్రానికి తక్కువపిక్కలుంటే మిగతావారందరూకూడా అన్నే పోస్తారు. ఈవిధంగా ఆట మరలామరలా ఆడతారు. పిక్కలు అయి పోయినవారికి మిగిలినవారు తలొకమూడుపుంజీలు అప్పుయిస్తారు. వీటిని "గొద్దిపుంజీ" అనీ "గోకుడుపుంజీ" అనీ అంటారు. ఈపిక్కలను తీర్చలేని వారు ఓడినట్టు. ఈఓడించడానికి "గొద్దిపెట్టుట" అంటారు.

ఆఖరున ఎవరు ఎక్కువగుర్రాలుసంపాదిస్తే వాళ్ళుమేటి. ఇదికూడా ఏకాగ్రతకూ వ్రేళ్ళ పరిశ్రమకూ సంబంధించినదే. కష్టపడి ఆర్జించడమనేది యీఆటనేర్పే సుగుణం.

## తక్కెడాట

సుద్దముక్కతో నేలమీద ఒకదానిలోఒకటిచొప్పున మూడుచదరాలు గీసుకొని మధ్యలో నిలువుగానూ, అడ్డుగానూ పై చదరంనుండి లోపల చదరంవరకూ నాలుగువైపులా నాలుగు గీతలుగీసి, దానితో మూడు చద రాలనూ కలుపుతారు. దీనితో ఏగీతమీదచూసినా మూడుమూలలు కని పిస్తాయి. చిన్నచిన్న రాళ్ళుగాని, చింత పిక్కలుగాని, సీతాఫల గింజలు గానీ యిద్దరూ చెరొకరకం పదకొండేసి తీసుకొని ఒకరి తరువాత ఒకరు

ఎదుటివారికి తక్కెడకాకుండాచూసుకుంటూ తనకుతక్కెడయ్యేటట్లు ఒక్కొక్క గింజామూలల్లో పెడుతుంటారు. ఏగీత మీదయినా ఒకేరకం గింజలు మూడు వరుసగావస్తే తక్కెడఅయినట్టు. అప్పుడు గీతలో పెట్టబడ్డ ఎదుటివారి గింజనొకదానినితీసేసుకుంటారు. అలాపెట్టడంలో ఏగీతమీదా తక్కెడ కాకుంటే అవి ఒకరితరువాతఒకరు తమగింజలు ముందుకీ, వెనక్కీ, పైకి, క్రిందకీ కాళీలలోనికి జరుపుతూఆడతారు. ఈజరపడంలోకూడా తక్కెడ కావచ్చు. కొన్నిప్రదేశాలలో దీన్ని "దాడాట" అంటారు. ఇది మేథాశక్తిని పెంపొందించే ఆట.

## పులి - మేక

దీనికికూడ నేలమీద సుద్దతోగాని, మసిబొగ్గుతోగాని ఒక సున్న చుట్టి దానికిదిగువన ఒకచదరంగీసి, ఆ చదరంలో మధ్యగా ఒక అడ్డు గీత గీసి, సున్నానుండి ఏటవాలుగా మూడుగీతలు ఆ చదరంగుండా క్రిందికిగీసి, ఆమూడిటినీ క్రిందమరొకగీతతో కలుపుతారు. మూడు పెద్దరాళ్ళు పులులు- పదిహేను చిన్నరాళ్ళు మేకలు. ఒకరు పులిరాళ్ళు, రెండవవారు మేకల రాళ్ళు గీతలమూలలలోనూ, గీతలుకలిసినచోటా పెడుతూ, జరుపుతూ ఆడతారు. ఎక్కడైనాఒకమేకవుండి దానిక్రిందగాని, ప్రక్కనగాని, పైనగాని పులివుండి, ఆవరుసలో మేకప్రక్కగడికాళీగాఉంటే పులి ఆమేకనుమ్రింగేసి ఆకాళీగడిలోకిజరుగుతుంది. పులి ఉన్నచోటునుంచి ఎటుచూసినా వరుస రెండుచోట్లా మేకలుండి కట్టేస్తే పులిఆట కట్టే. 'బలవంతమైన సర్పము చలిచీమలచేత చిక్కిచావదె సుమతీ".

దీనినిగూర్చి ద్వాత్రింశతికారుడుకూడా ప్రస్తావించియున్నాడు.

* "తగులు విరవిమైస కడుమె
చ్చుగనాడుదు పులులయాట, జూదంబులలో
మిగలక నేర్పరి బాగిడి
తిరుటన్ సొగటాల నేవతి పొర్చిఘుండన్"

---

* సింహాసన ద్వాత్రింశిక. కొరవి గోపరాజు.

## వైకుంఠపాళీ

వ్యావహారికంలో దీన్ని గవ్వలాట అనడం కద్దు. "పరమపదసోపానపరం" అనేఒక అచ్చుకాబడినచిత్రపటంలో ఒకచదరపుటంగుళం పై వైశాల్యంగల 132 గడులు 13 నిలువువరుసలు, 11 అడ్డువరుసలుగా ఉంటాయి. ఒక్కొక్క గడిలో జంతువులు, చేపలు, పాములు, మనుషులు, రాక్షసులు, దేవతలు, ఋషులు, సప్తలోకాలు, మనోవికారాల బొమ్మలు ముద్రింపబడి ఉంటాయి.

పాములతలలు పై వరుసగడులలో ఉండి, తోకలు క్రిందివరుసగడుల లోకి ఉంటాయి. నిచ్చెనలు క్రిందివరుసగడులలో ప్రారంభమై చివరలు పై వరుసగడులలోకి వెళతాయి. ఈఆట ఆడేవాళ్ళందరూ తలొకరాయి తమకుగుర్తుగా పెట్టుకుంటారు. వీనినే "పావులు" అంటారు. నాలుగుగవ్వలు తీసికొని చేతిలో గిలకరించి నేలమీదపోస్తారు. అందులో కొన్ని బోర్లాపడతాయి, కొన్ని వెల్లకిలాపడతాయి. ఎన్ని వెల్లకిలాపడతాయో అన్ని గడులు పటంలో ఒకటినుంచిలెక్కించి ఆవేసినవారి 'పావు' నునడిపి ఆగడిలోనుంచుతారు. అలానడిపేటప్పుడు అది నిచ్చెనగడి దగ్గరఆగితే ఆనిచ్చెనకి పై గడిఎక్కడో అక్కడికిఆపావునుఎక్కించేస్తారు. అది పాముతలదగ్గరఆగితే ఆపాముతోక చివరిగడిదాకా క్రిందికిదించేస్తారు. ఇలా 132 గడులూదాటాక చివరివరుస బొమ్మలలో మధ్యనున్న శ్రీ మహావిష్ణువు బొమ్మమీదనిలువుదల ఎవరికై తేదొరుకుతుందో వారు పండిపోయినట్టు.

ఈ గవ్వలుగిలకరించిపొయ్యడంలో ఒక్కగవ్వతిరగబడితే "కన్ను" రెండుపడితే 'ద్వయం'. నాలుగుపడితే "చెమ్మ" అంటారు. ఒక్కొక్కసారి నాలుగుగవ్వలూ బోర్లాపడతాయి - దానిని "అష్ట" అంటారు. అంటే ఎనిమిది. ఇలా 'అష్ట' పడినా, "చెమ్మ" పడినా ఆ వ్యక్తి మరొకసారి గవ్వలుపోసుకోవచ్చును. ఇందులో పాములుమ్రింగడాలూ, నిచ్చెనలెక్కడాలూ చిత్రవిచిత్రంగాఉంటాయి. జీవితంలోవలెనే ఈ ఆటలో ఏదీ అనుకున్నట్లునడవక ప్రతినిమిషం సంభ్రమాశ్చర్యాలు కలుగుతుంటాయి. ఇది పూర్తిగా వినోదప్రధానం. నవ్వుల పువ్వుల హరివిల్లు.

డా. యస్. వి. జోగారావుగారు "పరమపదసోపానపటం" ఖండికలో పెద్దపాము మ్రింగడాన్ని గురించి యిలా వ్రాశారు మనిషిగతాన్ని జ్ఞాపకం చేస్తూ -

* " మన పునర్జన్మాధికారం
మానవ ప్రథమావతారం" అని.

అవును మరి, పెద్దపాము నోట్లోపడితే క్రిందికి మొదటిగడిలోకొస్తాం. ఆ గడిలో ఉన్న బొమ్మ కోతి. మానవుడి ప్రథమావతారం కోతేగా !

## వామనగుంటలాట

నేలమీద వరుసగా ఏడుచిన్నగుంటలు పెట్టి, వానికిదిగువగా అదే విధంగా మరో ఏడుగుంటలు పెడతారు. కొందరు నేలకుబదులు చిన్నబల్ల చెక్కమీద యిలా గుంటలు ఏర్పాటుచేసుకుంటారు. ఒక్కొకగుంటలో పదమూడురాళ్ళుపోస్తారు. ఆటఆడేయిద్దరిలో ఒకరివి పై వరుసగుంటలు. రెండవ వారివి క్రిందవరుస గుంటలు. మొదటివారు పై వరుసలో గల ఒకగుంటలోని రాళ్ళుతీసికొని అక్కడనుండివరుసగా మిగిలినగుంటలలో ఒక్కొక్కటి చొప్పునవేసుకుంటూవెళ్ళి అవిపూర్తయినపిమ్మట ఆ ప్రక్కనే పైనా, క్రిందాగల రెండుగుంటలలోనిరాళ్ళు తీసుకుంటారు. అనంతరం రెండవ వారు క్రిందవరుసనుండి ఏదోఒకగుంటలోని రాళ్ళుతీసుకొని మొదటివారి లాగేచేస్తారు. రాళ్ళుతీసికొనేటప్పుడు గతంలోకాళీ కాబడ్డగుంటల్లో తను వేసినరాయితోకలిపి నాలుగురాళ్ళుఅయితే ఆ నాలుగు రాళ్ళూకూడాతీసేసుకోవచ్చు. ఈ నాలుగునే "ఆవు" అంటారు.

ఈ విధంగా ఆడగాఆడగా చివరికి ఎవరికి ఎక్కువరాళ్ళు వస్తాయో వారుగెలిచినట్టు. ఇది సమయస్ఫూర్తికిసంబంధించినఆట. ఏ గుంటలోవి తీసుకొనిపంచితేఎక్కువ లాభంవస్తుందో సెకండ్లమీదఆలోచించిఆడటం గెలుపునకు కీలకం. ప్రత్యేకించిదీన్ని బ్రాహ్మణస్త్రీలు యింటింటా విశేషంగా ఆడేవారు. సీతమ్మవారుకూడా యీ వామనగుంటలాటఆడిందని మన జానపద రామాయణాల్లోఉంది.

---

* పంచకళ్యాణి. పు. ౦౭౬

* ఈ ఆటను కళాపూర్ణోదయ, హంసవింశతికారులు పేర్కొనియున్నారు

** 'సరిలేని ఎంచి సొగలూ
అరుదగు జూదంబు నెత్త మచ్చన గండ్లున్
దిరముగు నోమనగుంటలు
సరసత మీనాడుమన్న సతులంగనిమెన్'

## తొక్కుడుబిళ్ళాట

నేలమీద సుద్దతో దాదాపు అయిదుమీటర్ల పొడవుగీతగీసి, దానికి సమానాంతరంగా ఒకమీటరుదూరంలో మరోగీతగీసి, వానిమధ్యకాళీని అయిదు సమభాగాలుగావిభజించిగీతలుగీస్తారు. రెండవజాగాలోనూ, నాలుగవజాగాలోనూ మధ్యగా నిలువుగీతగీసి వానినిమరల రెండేసిభాగాలుగా విభజిస్తారు. ఈ భాగాలకు 'కానా' లని, 'జాగలని', "కాళీ"లని పర్యాయపదాలు. గీతలకు 'గిరి', 'బిరి' అని పరిభాష. ఆట ప్రారంభించేవ్యక్తి మొదటిజాగాకు ఈవలనిలిచి వెనక్కితిరిగి, తనతలమీద నుంచి ఒకపెంకుముక్కను ఈ జాగాలోకివిసురుతారు. (ఈపెంకుముక్కే "బిళ్ళ") అది ఏజాగాలోనూ పడకుండా బయటపడినా, గీతమీదపడినా తనఆటపోయినట్టే. మొదటిజాగాలో పడితే రెండవజాగాలోవున్న రెండు భాగాలలోకీ రెండుకాళ్ళూపడేటట్టు గెంతి అక్కడనుంచి మూడవజాగాలో ఒంటికాలు,నాలుగవజాగాలోని రెండుభాగాలలోరెండుకాళ్ళు, అయిదవజాగాలోఒంటికాలు వేసి, వెనక్కితిరిగి, వెళ్ళిన రీతిగానే మరలగెంతుతూ వచ్చి ఒకటవకానాలోనిబిళ్ళమీద ఒంటికాలువేసి, దానినితీసి ముద్దిడుకొని గిరిదాటివస్తారు. ఇలాగెంతేటప్పుడు ఏగిరిమీదా కాలు పడకుండా, ఎక్కడావరుసతప్పకుండాచేస్తే మొదటికానా తనకుపండిందన్న మాట. ఇలాగే అన్ని కానాలూ పండించాలి. ఎప్పుడు తప్పుఆడితే అప్పుడు ఆటపోయినట్టు. అప్పుడు రెండవవ్యక్తి మొదటివ్యక్తిపండించిన కానాలో అడుగుపెట్టకుండా అవతలకానాలోకిదుమికి మిగిలివున్న కానాలు పండిస్తారు. ఒకవ్యక్తి పండించినదానిలో రెండోవ్యక్తి కాలిడరాదు. అలా ఎవరు ఎక్కువకానాలు పండించి ఎదుటివారిగమనాన్ని ఆప

---

* క్రీడలు పు 1442 ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

** భోజరాజీయము.

వాళ్ళదేగెలుపు. ఈఆటలో ఒంటికాలితోనూ, రెండుకాళ్ళతోనూ గెంతుతుండడం వల్ల కాళ్ళకు పరిశ్రమకలుగుతుంది. సరిగ్గా తాము అనుకున్న కానాలోకి చూడకుండాబిళ్ళ విసరడం చీకటిలోకూడా లక్ష్యంమీదికిగురి పెట్టిసాధించడం అలవడజేస్తుంది.

## తుమ్ముండ

పిల్లలందరూకలిసి పంటలువేసుకొని దొంగను నిర్ణయిస్తారు. ఆదొంగ మిగతావారెవరయినానిలబడిఉండగాముట్టుకుంటే వాళ్ళు దొంగఅన్నమాట. అందువల్ల వాళ్ళుదొంగకుదొరక్కుండా తప్పించుకు తిరుగుతూ దొరికిపో తామనుకున్నప్పుడు కూర్చుండిపోతారు. ఆ కూర్చున్న వారినెత్తిమీద చెయ్యిపెట్టి దొంగ "తుమ్ముండ" అంటుంది. ఆ తరువాత నిలబడిఆడుతున్న వారెవరైనావచ్చి ఆకూర్చున్నవాళ్ళనెత్తిమీద చెయ్యివేసి "లే" అంటేనే లేవాలి. అలాలేచి మళ్ళీ ఆటలోపాల్గొన వచ్చును. ఎవరూవచ్చి వాళ్ళను లేవదీయకుండాచూసుకుంటూ దొంగఇతరలనుముట్టుకోవడానికి ప్రయత్ని స్తుంది. ఇందులో దొంగకు దొరక్కుండాతిరిగేచాకచక్యం, వేగవంతమైన పరుగు అనుకోకుండాఅలవడతాయి.

## చాకలిబాన ఆట

పిల్లలు ఒకవలయంగా, తమవెనుకఏంజరుగుతుందో తెలియకుండా, ముఖాలు క్రిందికివంచుకునికూర్చుంటారు. వాళ్ళు "పంటల" ద్వారా నిర్ణయించు కున్నవ్యక్తి వారివెనుక చుట్టూతిరుగుతూ తెలియనివ్వకుండా ఎవరొకరి వెనుక రుమాలు చుట్టగాపడవేస్తాడు. అది ఎవరివెనుకపెట్టబడిందో ఆవ్యక్తి అదిగ్రహిస్తే వెంటనేఆరుమాలుతీసుకొని దానితో ఆ దొంగను తనుకాళీ చేసినస్థలంలోకివచ్చి కూర్చునేవరకూ తరిమితరిమి కొడుతుంటాడు. ఒకవేళ తనవెనుక రుమాలుపెట్టినట్టు అతనుచూసుకోకుంటే ఆపెట్టినవ్యక్తి చుట్టూ తిరిగివచ్చి ఆ కూర్చునివున్నవ్యక్తిని ఆరుమాలుతో అతనులేచి వలయం తిరిగివచ్చి తనయథాస్థానంలో కూర్చునేదాకావెంబడించికొడతాడు. ఇలాగ మరొకరివెనుక రుమాలు పెడుతూ ఆట మంచిరంజుగా సాగిస్తారు. రుమా

లుతో వీపుమీద బాదడం బట్ట చాకలిబానమీదవేసికొట్టడంలా ఉంటుంది. కనుక దీనిని చాకలిబానఆట అన్నారు. ఇందులో మనిషి తనకై తీసుకోవలసిన జాగ్రత్త, అనుశీలన, పరిశీలన అలవడతాయి. దీనినే కొన్నిచోట్ల "చెండాట" అంటారు.

## కంచి మేక ఆట

ముందుగా పిల్లలు తమలో ఒకరిని, పులిగానూ, ఒకరిని మేకగానూ నిర్ణయించుకుంటారు. మిగిలినవాళ్ళంతా చేతులు బారజాపి ఒకరిచేతులు ఒకరుపట్టుకొని వలయంగానిలబడతారు. ఆవలయంలో "మేక" ఉంటుంది. వలయానికి బయట పులి చుట్టూతిరుగుతూ "కంచిమేకను కాస్తాన్" అంటుంటే మిగతావాళ్ళు "కాలిరగేస్తాం" అంటూకోరస్‌గా పాడుతుంటారు. ఇలా తిరుగుతూతిరుగుతూ పులి సందుచూసుకుని లోనికిజొరబడడానికి ప్రయత్నిస్తుంటే వలయంగాఉన్నవాళ్ళు చేతులు అడ్డుపెట్టేసిఆపుచేస్తుంటారు. ఇంకా బలవంతంగాగెంటుకుని పులి లోపలికివెళ్ళిపోతే లోపలున్న మేకను బయటకొదిలేసి మరల పులిని లోనించిబయటకురాకుండాకాస్తారు. పులి బయటకొస్తే మేకలోపలికి పోతుంటుంది. ఎంతసేపటికీ దొరక్కుంటే పులి ఓటమి ఒప్పేసుకోవాలి. ఇది బలవంతులనుండి బలహీనులను రక్షించాలనేనీతిని ప్రబోధించడమేకాక వినోదంకలిగిస్తుంది.

## దాగుడుమూతలు

ఇవి రెండు మూడు రకాలుగా ఆడతారు. పంటలువేసుకొని దొంగను ఎన్నుకొంటారు. దొంగకు కండ్లుమూయడానికి ఒకరిని తల్లిగా నియమిస్తారు. తల్లిపిల్లలందర్నీ ఎదుటనిలబెట్టి దొంగకుకళ్ళుమూసి "వీరి వీరి గుమ్మడిపండూ వీరిపేరెవరు ?" అని పాటలాపాడుతూ వారిలో ఒకరిని చూపిస్తుంది. వారు దొంగముక్కుమీద చిన్నగాగిల్లుతారు. దొంగ వారిపేరు చెప్పలేకపోతే తల్లి "వీరీ నువ్వు పారిపో" అంటుంది. అలాగే ఒక్కొక్కరినీచూపి అడుగుతుంది. ఎవరయినా చెప్పగలిగితే వాళ్ళు దొంగగామారతారు. ఎవరినీకూడాచెప్పలేకపోతే తల్లి 'పిల్లి వచ్చే ఎలకాహత్, ఎక్కడిదొంగలక్కడే, గప్‌చిప్' అంటుంది. అందరూ

పోయి దాక్కుంటారు. తరువాత దొంగ వాళ్ళను వెతికిముట్టుకోవాలి. అలా వెతుకుతుంటే దాక్కున్నవాళ్ళువచ్చి తల్లినిముట్టేసుకుంటారు. ఎవ రయినా తల్లిని ముట్టుకొనేలోగా దొంగముట్టేసుకుంటే వాళ్ళు దొంగగా మారతారు. లేకుంటే మొదటిదొంగకే మళ్ళీకళ్ళుమూసి ఆడతారు. కొన్ని చోట్ల వాళ్ళఅసలుపేర్లుకాకుండా ముందుగానే చామంతి, బంతి, గులాబి అని మారుపేర్లు పెట్టుకుని ఆ పేర్లతోఆడతారు. దొంగ గుర్తుగా ఆపేర్లే చెప్పాలి.

ఈఆట స్పర్శజ్ఞానాన్నీ, ధారణశక్తినీ కలుగజేస్తుంది.

* ఈ ఆటను 'సునిమీలితము' అని వాత్స్యాయనుడు పేర్కొన్నాడు.

## పందిమురిగిందాట

పిల్లలు రెండుజట్లుగావిడి, ఒకజట్టువారు దూరంగావెళ్ళి చాటున కూర్చుంటారు. రెండవజట్టువారు తమలోఒకరినిపడుకోబెట్టి కనిపించకుండా పైన దుప్పటికప్పేసి మిగిలినవారంతాదాక్కుంటారు. అవతల జట్టువారు 'పంది మురిగిందా?' అంటే ముసుగులోమనిషి గొంతుమార్చి "మురిగింది" అంటుంది. అప్పుడాజట్టువాళ్ళువచ్చిచూసి ముసుగులోని మనిషిఎవరో చెప్పుకోవాలి. 'మురిగింది' అనివచ్చిన స్వరాన్ని బట్టీ, మనిషి సైజును బట్టీ ఆజట్టంతా ఆలోచించుకొని ఫలానావ్యక్తి అంటారు. అది సరి అయితే ఆజట్టునెగ్గినట్టు. అప్పుడు రెండవజట్టు "ముసుగుపార్టీ"గా మారతారు. స్వరాన్నిబట్టిపోల్చడం, ముసుగుస్వరూపాన్నిబట్టి ఊహించడం అనేవి పిల్లలలో ఉత్సుకతనురేకెత్తించడమేగాక విశితపరిశీలననూ, సమిష్టి బాధ్యతనూ అలవరుస్తాయి.

## కుర్చీలాట

నీళ్ళతోగాని, ముగ్గుతోగాని ఒక పెద్దవలయంచుట్టి, ఆ వలయంలో ఆడేపిల్లలుఎంతమందిఉన్నారో అంతకుఒకటితక్కువగా సున్నలు (మనిషి కూర్చోవడానికి సరిపడినంత) చుట్టి ఒకరు నిర్వాహకునిగాబయట నిలిచి గంటకొడుతుంటారు. గంటకొట్టినంతసేపూ పిల్లలు వలయంచుట్టూ

* వాత్స్యాయన కామ సూత్రములు (4-3-77)

ఒకరివెనుకఒకరు పరిగెడుతూ. గంటఆగగానే లోపలిసున్నాలలో ఒక్కో దానిలో ఒక్కొక్కరుకూర్చోవాలి. ఇలాకూర్చోగానే ఒకరుమిగిలిపోతారు. అతన్ని ఆటనుంచితప్పించి ఒకసున్న చెరిపేస్తారు. మళ్ళీమళ్ళీ ఇలాగే ఆడిస్తూ, ఒక్కొక్కసున్నా చెరిపేస్తూ ఒక్కొక్కరినీ తప్పిస్తుంటారు. ఇలాగచేస్తూపోగా చివరికి ఒక్కరుమాత్రంమిగులుతారు ఆఖరుకుర్చీలో. వారు పండినట్టు. కూర్చునే ఈసున్నలను కుర్చీలుగాభావిస్తూ దీనిని "కుర్చీలాట" అన్నారు. ఈఆటలోమనసు త్వరగానిర్ణయంతీసుకోవడం, కాళీకుర్చీలను ఒకకంటకనిపెట్టుకుంటూపరుగుపెట్టడం ప్రాముఖ్యంవహిస్తాయి.

ఇప్పుడు కుర్చీలాటంటే నిజమైన కుర్చీలాట. అంటే కుర్చీలు ఒకరి మీదఒకరు విసురుకోవడం. పిల్లలు యిలాకుర్చీలతో కొట్టుకుంటుండడం చూసిన ఒకతల్లి "ఆదేవిటర్రా అలా కొట్టుకుంటారు!" అని అడిగితే ఇది 'అసెంబ్లీ ఆటమ్మా' అన్నారట.

## కొక్కో

ఒకచోట ఒకరాయిపెట్టి దానికి పదిపదిహేనుఅడుగులదూరంలో మరొకరాయిపెడతారు. పిల్లలు రెండుజట్లుగావిడి ఆరాళ్ళమధ్య ఒక జట్టు వారుముందుకి ఒక జట్టువారు వెనక్కి చొప్పున దూరదూరంగా కూర్చుంటే రెండవజట్టువారు వీరికిమధ్యమధ్య అక్కడక్కడ నిలుచుంటారు. మొదటి జట్టులోఒకరుదొంగగా అటూయిటూతిరుగుతూ నిలుచున్నవాళ్ళను ముట్టు కోవడానికి ప్రయత్నిస్తుంటారు. వాళ్ళుదొరక్కుండా అపెడకూ, ఈ పెడకూ తప్పుకుంటుంటారు. ఎవరైనాముట్టుకుంటే వాళ్ళుఅవుటన్నమాట. ఆటనుంచి తప్పుకోవాలి. దొంగ అలాతిరుగుతూ కూర్చున్నవారిలో ఎవరికైతే రెండవజట్టుమనిషిదగ్గర ఉన్నారో వారివీపుతట్టి "కొక్కో" అంటుంది. ఆ వ్యక్తిలేచి రెండవజట్టు మనిషినిముట్టుకుంటే వారు అవుటు. ఆతరువాత వ్యక్తికూడా మొదటిదొంగలాగే తమజట్టులోనిఇతరులకు కొక్కో పెడుతుంటారు. అందరూ అవుటయిపోయాక మరల రెండవజట్టువారు కూర్చుంటే మొదటిజట్టు నిలబడిఆడతారు.

ఈ ఆటలో నిలుచున్నవాళ్ళు దొంగనుచూసుకుంటూతిరగడం కూర్చున్నవాళ్ళు ఎప్పుడుతనకు 'కొక్కో' పెడతారోఅని ఏమరుపాటు లేకుండా చూసుకుంటుండడంముఖ్యం. ఇదినేడు కొన్నిమార్పులు చేర్పులతో "కో" ఆటగా అంతర్జాతీయప్రసిద్ధిపొందింది. నిజానికి యివి ఆడపిల్లల ఆటలేఅయినా కొన్నిచోట్ల మగవాళ్ళు, కొన్నిచోట్లపెద్దవాళ్ళూకూడాఆడేవారు.

## ఆకుఆట

సాధారణంగా పంటలువేసుకొని దొంగనునిర్ణయిస్తారు. మరో పద్ధతికూడా ఉంది. "ఆకు, పాకు, కరేపాకు, ఢాం, ఢూం, ఛీ" అని పాడుతూ ఒక్కొమాట ఒక్కొమనిషిమీదలెక్కిస్తూ చివరిమాటపడినవారిని పండిపోయినట్టు ప్రకటిస్తారు. దానికిమారుగాకొందరు "అగ్గిపెట్టి, గగ్గిపెట్టి, కోడి, కొంగ, ఫిరంగి, పిల్లి, పిద్" అని పాడి పండిస్తారు. ఈపాటకు బదులుకొన్నిచోట్ల "ఉడుం, తుడుం, తుపేల్, మపేల్, పాం, పరంగ్, రూట్, మాట్, చేట్, దెబ్బ" అనికూడాపాడతారు. ఈ విధంగా అనేక సార్లుపాడుతూలెక్కించి పండించగా మిగిలిపోయిన చివరివ్యక్తి దొంగ. అతనిని ఫలానాచెట్టుఆకుతెమ్మంటారు. అతడు దానికోసంవెళ్ళగానే మిగిలిన వారంతాదాక్కుంటారు. దొంగ ఆ ఆకుతో వచ్చి వీరిలోఎవరినయినాముట్టుకుంటే ఆ ముట్టుకోబడ్డవ్యక్తి దొంగగా మారతాడు. కొన్నిచోట్ల ఇద్దరు దొంగలనుకూడా నిర్ణయిస్తారు. తాము ఎదుటివారికి కనబడకుండా మసల డానికి కావలసినమెలకువలూ, అన్వేషణకుకావలసిన పట్టుదల నేర్పుతుంది ఈ ఆట.

## ఈత్రాలాట

ఇది నీటిలో ఆట. చెరువులలోగాని. కాలవలోగాని పిల్లలు ఇవతల గట్టున ఒకేసారి బయలుదేరి ఈదుకుంటూవెళ్ళి కాలువలోఅయితే అవతలి గట్టునూ, చెరువులో అయితే మధ్యస్థంభాన్ని ముట్టుకుని ఎవరైతే ముందు వస్తారో వారుగెలిచినట్టు.

ఇందులో మరొకఆటకూడావుంది. నీటిలోదిగి తమమధ్య ఒక ఆకును పెట్టి దానిని అందరూ చేతులతో తపాతపా కొడతారు. నీరు అలలు అలలుగా చెదిరిపోయి ఆకు ఎటోపోతుంది. దానిని వెతికి పట్టుకున్నవాడు చేతితో పైకెత్తి చూపగానే మిగిలినవాళ్ళందరూ నీటిలో మునిగి అడుగు నున్న మట్టిని తీసి చూపాలి. అలాచూపించేవరకూ ఆకుగలవారు ఆ వ్యక్తులను కొడుతుండవచ్చు.

ఈ ఆట నీటిలో ఈతనేర్పుతుంది. నీటిలోపడిపోయిన వస్తువులను మునిగి వెదికేపద్ధతి తెలుస్తుంది. మునిగినపుడు కావలసిన వాయు స్తంభన అలవాటుచేస్తుంది.

## టెంకలాట

ఇద్దరుగానీ, ఇంకా ఎక్కువమందిగానీ కలసిఆడే ఆటఇది. ఎవరి మట్టుకువారు మామిడిటెంకలుతెచ్చుకొని, చిన్నవలయంగా ఒకగిరిగీసి అందులోఅందరూసమానంగా ఇన్నేసిటెంకలని పెడతారు. ఈ గుట్టపేరు "గుడి". దానికిదాదాపు 15 అడుగులదూరంలో అందరూఒకే వరుసలోనిలిచి ఒక్కొక్కరూఒక్కొక్క టెంకను గుడిదగ్గరకువిసరాలి. ఎవరిటెంక గుడికి ఎక్కువదగ్గరపడితే ఆవ్యక్తి దానితో ఆటెంకలగుట్టను కొడతాడు. ఆకొట్టడంలో ఎన్నిటెంకలు బిరిదాటివస్తే అన్నీఅతనివే. అవి వస్తున్నంతసేపూ కొట్టవచ్చు. కొట్టినప్పుడు ఒకటెంకకూడా బిరిదాటిరాకపోయినా, కొట్టేటెంక బిరిలోఉండిపోయినా అతని ఆటపోయినట్టే. అప్పుడు తరువాతదగ్గరవానికి అవకాశంవస్తుంది. అలాగే క్రమంగా అందరికీను. గుడిలో ఇంకాటెంకలుండగానే అందరూ అవుటయిపోతే మరలమొదటిలాగే టెంకలువిసిరిఆడతారు. అవిఅయిపోతే మరల సమవాటాలుగాటెంకలు గుట్టలోపెడతారు. ఇందులో ఎవరుఎక్కువ టెంకలుగెలిస్తే వాళ్ళుగొప్ప. ఈ ఆటలో మనిషికి గురి అలవడుతుంది. నేటి "బచ్చాలాట"కి యిదేమూలం.

## కుప్పతన్నులాట

టెంకలాటలోలాగే ఆరడుగులవ్యాసార్ధంతో ఒకవలయంగీసి, అందులో మధ్యగా ఇసుకకుప్పపెట్టి, దానిలో చిన్నరాయిపెట్టికప్పెడతారు. దానికి పదిఅడుగులదూరంలో ఒకసంకేతంపెట్టి, పంటలువేసికొని దొంగను నిర్ణయిస్తారు. దొంగ కుప్పచుట్టూఉన్నవలయంమీదతిరుగుతుంటాడు. మిగిలినవారు అతనికిదొరక్కుండా వలయంలోకివెళ్ళి కుప్పనుతన్నుతుండాలి. అలా తన్నినప్పుడు కుప్పలోనిరాయిబయటికివస్తే దొంగనిర్ణీతసంకేతాన్నిముట్టుకు వచ్చేదాకా అతన్ని వీపుమీద గుద్దులు గుద్దుతుంటారు. దొంగ అదిముట్టుకు

వచ్చేలోగా ఆరాయిని కుప్పలోపెట్టి కప్పెయ్యాలి. అలా కప్పెట్టేలోగా దొంగ సంకేతాన్ని ముట్టుకు వచ్చేసి ఎవరినైనాముట్టుకుంటే వాళ్ళుదొంగ. కుప్పను తన్నేటప్పుడు వలయంలో దొంగ ఎవరినైనా ముట్టుకోగలిగితేకూడా వారుదొంగే. ఈ ఆట మనిషిచురుకుదనాన్నీ, మెరుపుదాడుల్నీ నేర్పుతుంది.

## బొంగరాలాట

కర్రతోచేయబడ్డబొంగరాలు యిప్పటికీ తీర్థాలలో అమ్ముతుంటారు. గుండ్రంగా, తలభాగం పెద్దదిగా (గోపురం పోలిగ్గా), మధ్యభాగం మూడు నాలుగు మెట్లుగా తగ్గుకుంటూవచ్చి, క్రింద చిన్న బొడిపెంవంటిది ఉండి, దానిఅడుగున మధ్యలో ఒక ఇనుపముల్లుఉంటుంది. ఆ ముల్లుదగ్గరనుంచి మెట్లచుట్టూ తలవరకూ నులకత్రాడుగానీ, నవారుత్రాడుగానీ చుట్టి, త్రాడు చివర చూపుడువ్రేలుకీ బొటనవ్రేలుకీమధ్య పట్టుకుని లాఘవంతో క్రిందికి విసిరితే అదిక్రింద గిర్రునతిరుగుతుంది. వేంకటపార్వతీశ్వర కవులచేతుల్లో కవితావస్తువుగా ఇది ఎలా తిరిగిందో చూడండి.

"రింగు రింగున తిరుగు నా బొంగరంబు
ఏమియో వ్రాయుచున్నదీ యిసుకలోన
బడికిపోలేదు హస్తంబుపట్టలేదు
ఎట్లువచ్చినదో దీనికింతచదువు" అంటారు.

ఈ బొంగరాలతోఆట బలేగమ్మత్తుగా వుంటుంది. ఆడేవాళ్ళంతా వాళ్ళ బొంగరాలకు త్రాళ్ళుచుట్టి సిద్ధంగాఉంటారు. ఒకరు ఒకటీ, రెండూ, మూడూ అనగానే అందరూఒకేసారి బొంగరాలు నేలబారున విసిరి అవి తిరుగుతుంటే ఎవళ్ళమట్టుకువాళ్ళు తమబొంగరాల్ని తమత్రాళ్ళతో పైకెగరేసి ఎవరయితే ముందు అందుకుంటారో వారుగెలిచినట్టు. మిగతావాళ్ళంతా తమబొంగరాలు నేలమీద తగుమోస్తరు వలయంగీసి అందులో పెడతారు. ఈ నెగ్గినఆటగాడు తనబొంగరానికి త్రాడుచుట్టి వానిమీదకి విసురుతాడు. దానిముల్లు అక్కడకొన్నింటికి కన్నాలు పొడిచి తిరుగుతుంటుంది. దాన్ని మరల ఆ బొంగరండారుడు త్రాడుతో పైకిఎగరేసిఅందుకోవాలి. అలా అందుకోలేకపోతే మళ్ళీ ఆట మొదటికివస్తుంది. అలా పొడిచినకన్నాలను

"పుచ్చా"లంటారు. ఒక్కోసారి ఆబొంగరం తగలడంతో ఆవలయంలోని కొన్ని బొంగరాలు గీతదాటి బయటకు వచ్చేస్తాయి. అప్పుడు ఆబొంగరాల తాలూకువాళ్ళుకూడా తొలివ్యక్తిలాగే వలయంలోని బొంగరాలను కొడుతూ ఆడవచ్చు. అన్ని బొంగరాలూ బయటికివచ్చేస్తే అందరూ నేలబారున బొంగరాలను త్రిప్పి మొదటిలాగే ఆడతారు.

ఈ ఆటకు బొంగరం త్రిపడ్డంలో నేర్పరితనం, గురిచూసి కొట్టగల గడం, అవకాశం ఎప్పుడువస్తుందాఅని ఏమరుపాటులేకుండా చూచుకుంటుం డడం ముఖ్యం. ప్రఖ్యాత జానపదకథ ''రాములమ్మకథ"లో ఈబొంగరమే కథను క్లయిమాక్సుకుతీసుకెడుతుంది. శ్రీనాథుని పల్నాటి చరిత్రలో బాల చంద్రుని యుద్ధోన్ముఖుని చేసిందికూడా ఈ బొంగరాలాటే.

## గోళీకాయలాట

అంతరిక్షంలో గ్రహాలగమనంపరికిస్తే ఆకాశంలోదేవుడు గోళీకాయ లాడుతున్నాడా ! అనిపిస్తుంది.

గట్టిసిమ్మెంటుతోచేయబడ్డ గుండ్రని నునుపైన గోళీకాయలు ఫేన్సీ షాపుల్లో అమ్ముతుంటారు. ఆటగాళ్ళు రెండు జట్లుగావిడి నేలమీద ఒక చిన్నవలయంగీసి, దానికిసుమారు ముప్పది అడుగులదూరంలో ఒక గిరి గీస్తారు. బొమ్మా, బొరుసువేసుకొని బొరుసువచ్చినజట్టు తమగోళీకాయలు ఆవలయంలోపెడతారు. రెండవజట్టు గిరిమీదనిలిచి వానిదగ్గరకు తమగోళీలు విసిరి అక్కడనుంచి ఆవలయంలోని గోళీలన్నింటినీ తమగోళీలతోకొడుతూ గిరిదాటించాలి. కొట్టడంఅంటే మామూలుగాకొట్టడంకాదు. చూపుడువ్రేలుతో గాని, నడిమివ్రేలుతోగాని పైభాగంచివర గోళీపెట్టి రెండవచేతితో వెనక్కి లాగి బాణంలా ఎక్కుపెట్టి వదలాలి. ఈఆటలో చూపుడువ్రేలుకు మరో పేరు "లాడితేలు". తనగోళీదగ్గరనుంచి ఒకజానదూరంకొలిచి అక్కడనుంచి అవతలగోళీని కొడతారు. ఇందులో గోళీలను కాయలని పిలుస్తారు. ఆ కాయకు తనగోళీదూరంగా ఉంటే "కావన్నారి" అంటూ దానిదగ్గరకువిసిరి, అక్కడనుంచి దానిని ఎదటికికొడతారు. ఈకావన్నారిని ఒక దెబ్బకుముందు ఒక్కసారిమాత్రమే వెయ్యాలి. అవతలకాయి దగ్గరగాగానీఉంటే "అక్కడి

కక్కడ కావన్నారీ" అనితిన్నగాదెబ్బకొట్టేస్తారు. ఎప్పుడుకాయను కొట్ట లేకపోతే అప్పుడు అతడు అవుటు. ఇలాగ ఆజట్టువాళ్ళు అవతలిజట్టువారి అన్నికాయలను బిరిడాటిస్తే తరువాతఆటకూడా మళ్ళీవాళ్ళదే. ఏఒక్కటి మిగిలిపోయినా అందరూ అవుటయిపోయినా వాళ్ళ ఆటపోయినట్టే. అంతే కాకుండా కొట్టేవానికాయ బిరిడాటితేకూడా ఆకొట్టినవ్యక్తి అవుటయిపోతాడు. దీన్ని "కావన్నారి" ఆట అంటారు.

ఇందులో గుంటలాట మరొకటిఉంది. ఒకచోట చిన్నగుంట త్రవ్వి దానికి ఇరవయిబారలదూరంలోగీతగీసి అందరూ అక్కడినుండి తమ గోళీ లను విసురుతారు. గుంటలకు ఎవరు ఎక్కువదగ్గరపడితే వారు ఒక జాన దూరంకొలిచి అక్కడినుంచి వ్రేలుతో గోళీని గుంటలోవేయడంగానీ, ప్రక్క కాయను కొట్టడంగానీ, లేదా "కావన్నారి" అని గుంటదగ్గరకు వెయ్యడం గానీ చెయ్యాలి. అది గుంటలోపడినప్పుడూ, కాయనుకొట్టినప్పుడూ ఒక్కొ మార్కు వస్తుంది. పదిమార్కులుతెచ్చుకుంటే తను పండినట్టు. ఇలా పండినవాళ్ళు తప్పుకుంటూ మిగిలినవాళ్ళు ఆడుతుంటారు. ఇక్కడ లెక్క లలో ఒకవిశేషముంది. కాయను రెండుసార్లు గుంటలోవేసి, ఆ వచ్చిన రెండుమార్కులూ చెల్లుచేసుకుని గోళీనికాడితే అయిదుమార్కులువస్తాయి. ఇలా చెల్లుచేసుకుని గోళీని కొట్టలేకపోతే మొదటి రెండుమార్కులూకూడా పోతాయి. అయిదుతర్వాత గోళీనికాడితే తొమ్మిదిమార్కులు. ఆ తర్వాత పదవమార్కు గుంటలోవేసి తెచ్చుకోవాలి. మరోనియమం ఏమిటంటే గుంటలో గోళీని తొమ్మిదిసార్లువేసి తొమ్మిదిమార్కులు సంపాదిస్తే పదవ మార్కుకు మాత్రం గోళీనికొట్టాలి.

ఇలా ఆడగాఆడగా చివరకు ఒకరుమిగులుతారు. అతను పండిన వాళ్ళందరికీ ఒకరితర్వాతఒకరికి "పిలికీలు" పెట్టాలి. "పిలికీ" అంటే పండిన వాడు గుంటదగ్గర తనగోళీఉంచికూర్చుంటాడు. ఓడినవాడు గీత అవతలికి వెళ్ళి ముందుకువంగి తనరెండుకాళ్ళమధ్యనుంచీ గోళీవిసిరి అక్కడినుంచి గుంటవేపు అరచేతితోనూ, మోచెయ్యితోనూ గెంటుతారు. దీన్ని "దేకడం"

అంటారు. దేకేటప్పుడు ఆకాయవెళ్ళి గుంటదగ్గరకాయను తగలదంగాని, గుంటలో పడదంగాని జరగాలి. అలా జరక్కుంటే గుంటదగ్గరున్నవాడు తనకాయతో ఆదేకబడ్డకాయను మరింతదూరంగా కొడుతుంటాడు. ఆ దెబ్బ గానీ దీనికి తగలకుంటే యితను తనకాయ మరల ముందుకుదేకుతాడు. ఈ పిలికిల్లోనేఉన్నది ఆటమజా.

మొత్తంమీద ఈ గోళీకాయలాట మనిషికి నిదానం, గురినేర్పుతాయి.

## గూటీబిళ్ళాట

ఈ ఆటను హిందిలో 'గిల్లీదండా' అంటారు. నాచనసోముని ఉత్తరహరివంశంలో దీనిని 'గిల్లదండ' అని వాడేడు. ఒకచోట మూడు అంగుళాలలోతుగుంటను చిన్నగాడిలాత్రవ్వి, ఆగాడిమీద ఆరంగుళాలపుల్ల అడ్డుగాపెట్టి (దీనినే బిళ్ళఅంటారు). ఒకగజంకర్రముక్కతో ఒకరుదానిని గుంటలోనుంచి ఎదుటికిగూటతారు. ఆయెదుట ఒకరు గాని ఇద్దరు గాని ప్రతిపక్షంవారుకాసి దానిని చేతులతోఅందుకుంటారు. అలా అందుకుంటే గూటినవాడుఓడినట్టు. అదివాళ్ళకుదొరక్కుండా క్రిందపడితే పడినదానినితీసి గుంటదగ్గరకువిసురుతారు. అలా విసరగావచ్చేబిళ్ళను ఆటగాడు తిరిగి కర్రతో ఎదుటికికొడతాడు. అప్పుడు అది కర్రకు తగలకుండాగాని, తగిలి గాని క్రిందపడి గుంటనుంచి ఒక కర్రకొలతకంటేతక్కువవుంటే ఆటగాడు ఓడినట్టు. ఎక్కువవుంటే అక్కడినుంచి గుంటదగ్గరకు కర్రతో కొలుస్తారు. ఈ కొలతను ఒకటి, రెండు, మూడు అనికాక "కర్ర, కండీ, నర్ర, నడ్డీ, మూల, ముడ్డి" అని చిత్రమైన మాటలతో లెక్కిస్తారు. అలా పదికర్రలుంటే ఒక 'లాల'. లాలకు ఒక దెబ్బచొప్పున పడివున్నబిళ్ళచివర కర్రతోకంగించి పైకిలేవగొట్టి దూరంగాకొడతారు. ఆబిళ్ళపడినచోటునుంచి ప్రతిపక్షంవ్యక్తి 'అల్లి బిల్లి చెంగన్నారి కీర్, కీర్, కీర్' అంటూ గుక్కతిప్పకుండా కూస్తూ గుంటదగ్గరకువస్తాడు. మధ్యలో కూత ఎక్కడయినా ఆగితే

అక్కడనుంచిమళ్ళీ యిందాకటిలాగానే ఆబిళ్ళను కర్రతోకొడతాడు ఆటగాడు. మళ్ళీ అక్కడనుంచికూస్తూ గుంటదగ్గరకురావాలి. ఈబిళ్ళను గూటినప్పుడు గానీ, పైకిలేవదీసినప్పుడుగానీ ఎదుటివారు ఆబిళ్ళను క్రిందపడకుండా పట్టేసుకున్నా, గుక్క ఆగకుండా "కీరు" కుంటూ గుంటదగ్గరకువచ్చేసినా ఆటగాడుఅవుటే. ఈ ఆట ఎక్కువగా దమ్మునిలబెట్టడాన్నీ, ఎదురువచ్చే వస్తువును యిట్టేపట్టేసుకోవడంలోకౌశలాన్నీ నేర్పుతుంది.

ఎదుటినుంచివిసిరేబిళ్ళను కర్రతోకొట్టడంతీరూ నేటి క్రికెట్ఆటలో ఎదరనుండివిసిరేబంతిని బేట్తోకొట్టడంతీరూ పరికించిచూస్తే ఈరెండింటికి "వంశవృక్షం" ఒకటే అనిపిస్తుంది.

* "ఈ ఆటను బుద్ధఘోషకవి ఇంచుమించు ౧౪౦౦ ఏండ్లనాడు "ఘటికా ఖేలనము" అని వర్ణించాడు. ఘటిక అనగా చిన్నకర్రపుల్లను పెద్దకర్రపుల్లతోకొట్టుట అని కవి వర్ణించాడు.

## కోతికొమ్మచ్చి

హిందీలోదీనిని "ఝాడ్ బందర్" అని పిలుస్తారు. ఇది తోటల్లోనూ చెట్లువున్నప్రదేశాలలోనూ ఆడతారు. "పంటలుద్వారాగానీ, ఆకులాటలో చెప్పిన యితరపద్ధతులద్వారాగాని దొంగనునిర్ణయిస్తారు. మిగతావారిలో ఒకరు ఒకపుల్లను దూరంగా విసిరేశాక, ఆడేవాళ్ళందరూ చెట్లెక్కేసి కొమ్మల్లో దాక్కుంటారు. దొంగవెళ్ళి ఆపుల్లనుతెచ్చి నిర్దేశించినచోటు వద్దపెట్టి, చెట్టెక్కి వాళ్ళను ముట్టుకోవడానికి ప్రయత్నిస్తాడు. ఈలోగా ఎవరొకరు దొంగకుదొరక్కుండాచెట్టుదిగేసి ఆపుల్లనుముట్టుకొని దానిని చెట్టుమీదున్నమిగతావాళ్ళందరికీ ఒకరినుంచొకరికిఅందిస్తారు. ఇకఆపుల్లను ముట్టేసుకున్నవారిని దొంగముట్టుకున్నా ప్రయోజనంలేదు. పుల్లముట్టనివారిని మాత్రం ముట్టుకుంటే ఆవ్యక్తి దొంగఅవుతాడు. ఇక్కడ దొంగ తాను పెట్టినచోటుపుల్లముక్క ఎవరూతాకకుండాచూసుకుంటూ ఇతరులను

---

* ఆంధ్రుల సాంఘిక చరిత్ర. సురవరం ప్రతాపరెడ్డి.

ముట్టుకోవాలి. ఈఆటవల్ల చెట్లు ఎక్కడంలోనూ దిగడంలోనూ ప్రావీణ్యంఅలవడుతుంది. ఈఆటకు స్పృశిస్తూ ఆడపిల్లలు పాడే పాటొక టుంది -

"తరువుల చాటున దాగుదామా
కోతి కొమ్మచ్చాడుదమా
కొమ్మలచాటున దాగుదమా"

ఇలా ఈఆట రీతి యీపాటలో చెప్పబడింది.

## కర్రిలాట

కాలువగట్లమీద, పుంతగట్లమీద, రోడ్లమీద పశువులుకాచేపిల్లలు దూడలు గడ్డిమేస్తుంటే తమదగ్గరనున్నకర్రలతో ఈఆట ఆడుతుంటారు. ఒకచోట దారికడ్డుగాఒకగీతగీసి దానికిదాదాపు పదిమీటర్ల దూరంలో మరొక గీతగీస్తారు. బొమ్మా, బొరుసూవేసుకుని బొరుసువచ్చినజట్టు మొదటిగీత మీద తమకర్రలుపండుకోబెడతారు. బొమ్మవచ్చినజట్టు రెండవగీతదగ్గర నుంచి తమకర్రలు ఆ కర్రలఆవలకు విసరాలి. విసిరినకర్ర ఆకర్రలమీద పడిఆగిపోయినా, కర్రలకు ఈవలపడినా ఆ కర్రదారుడు అవుటు. ఇలా అవుటుకాకపోతే తమకర్రలమొనలతో ఆ కర్రలను ముందుకుకొడుతూ బిరిదాటించాలి. అలాకొట్టినప్పుడు ఆ కర్రలమీద తనకర్రఉండిపోతేకూడా కొట్టేవాడుఅవుటే. ఆ బిరిని ఎన్నిసార్లుదాటిస్తే అన్నిఆటలు నెగ్గినట్టు. ఒక్కోఆటకు ఒక్కో "కొత్తెం" యివ్వాలి. "కొత్తెం" అంటేఆటకొట్టినవారు తమకర్రతోఅవతలికర్రను తమకిష్టమొచ్చినచోట ఒకపోటుపొడవడం, ఒక లక్ష్యాన్ని సూటిగాకొట్టడం యిదినేర్పుతుంది.

## ఉప్పట్టి

నీళ్ళతోగాని, ముగ్గుతోగాని నాలుగుబారలవెడల్పున, రెండు బారలఎడముతో నాలుగుగీతలు పోస్తారు. ఈగీతలనే "పట్టెలు" అంటారు. మొదటిపట్టెనూ చివరిపట్టెనూ కలుపుతూ ఆచివరాఈచివరా గీతలుపోసి వానిని కలుపుతారు. అప్పుడుఅవి మూడుకానాలుగాఏర్పడతాయి. ఈ

కొనాలలో మళ్ళీ మధ్యగా మొదటిపట్టైనా, చివరిపట్టైనా కలుపుతూ ఒక పట్టైపోస్తారు. జట్టుకు అయిదుగురుచొప్పున రెండుజట్లుగావిడిపోతారు. ఒకజట్టు పట్టైకుఒక్కొక్కరుచొప్పుననిలబడి అటూయిటూ పారజాస్తూరెండవ జట్టువాళ్ళని అవిడాటివెళ్ళనివ్వకుండా కాపలాకాయాలి. మధ్యపట్టి ఈకొన నుంచి ఆకొనకు ఒకరే కాపలా. ఈ ఆటలో "దూరింగు బుడత" అని ఇరుపక్షాలకూయిష్టమైనవ్యక్తిని అదనంగాపెడతారు. అతను ఎప్పుడూ దూరే జట్టులోనేఉంటాడు. దీనితో దూరేవారుఆరుగురు, కాసేవాళ్ళుఅయిదుగురూ అవుతారు. దూరేటప్పుడు కాసేవాళ్ళుముట్టుకుంటే దూరేవ్యక్తిఅవుటయి పోయినట్టు. దూరేవారిలో ఏఒక్కరు చివరికెళ్ళితిరిగిరాగలిగినా వాళ్ళుఆట నెగ్గినట్టు. అయితే ఆవ్యక్తే తిరిగి చివరికంటూ రానక్కరలేదు. వెనక్కి వచ్చేటప్పుడు మూడవగడిలోనున్న తన జట్టువాణ్ణి కలిస్తే, అతను ఒకటవ గడిలోనివాణ్ణికలిస్తే, ఆ ఒకటవగడిలోనివాడు బయటకురాగలిగినాజయమే. దీన్నే "ఉప్పు అందివ్వడము" అంటారు. అలాచేయలేకపోతే మరలరెండవ జట్టుకు దూరేఅవకాశంవస్తుంది. ఇందులో మనిషి లోపలికిచొరకుండా తీసు కోవలసిన జాగ్రత్తలు, కాస్తున్నవాడికిదొరక్కుండా లోనికిప్రవేశించేనేర్పూ అలవడతాయి. కొన్నిప్రాంతాలలో దీనికి "చెట్టాట" అనిపేరు.

* "ఉప్పెనబట్టైలాడునెడ నుప్పులుదెత్తురుగాక యాదవుల్" .

## చెడుంగుడు

ఈ ఆటలో ప్రత్యేకత కొంగుతిరగడమనేది. ఇటూ అటూ రెండు జట్లూ సరిసమానంగానిలిచి అవతలజట్టునుంచి ఒకడు యివతలికొంగులోనికి వచ్చికూస్తుంటే ఇవతలజట్టువాడొకడు అవతలికొంగులోకివెళ్ళి కూస్తుం టాడు. దీన్నే కొంగుతిరగడమంటారు. ఇందులోవిచిత్రం ఇవతలికొం గులోకూసేవాడు నేర్పుగావెనక్కివచ్చి అవతలికొంగులోకూస్తున్నవానిని పట్టేస్తే మిగిలినవాళ్ళు కదలకుండానొక్కేస్తారు. అతను అవుటు. కూతకు వెళ్ళినవానిని అవతలజట్టుపట్టేసుకున్నా అతను కూతఆపకుండా ఎలాగోలాగ

---

* ఉత్తరహరివంశం. నాచన సోమనాధుడు.

విడిపించుకొని కొంగు ముట్టేసుకుంటే ఆ పట్టుకున్నవాళ్ళంతా అవుటు. ("కొంగు" అంటే రెండుజట్లకూ మధ్యగీసిన సరిహద్దుగీత). కూత ఆపి నప్పుడు ఆ కొంగులోవాళ్ళు అతన్ని ముట్టుకుంటేచాలు కూసేవాడు అవుటు. ఇప్పటి "కబాడి" ఆటలాగ మార్కుల పద్ధతిగాక అవుటయినవాళ్ళని పూర్తిగా ఆటనుంచి తప్పించడం దీనిలోనిపద్ధతి. ఇందులో బలహీనంగా ఉన్నపక్షానికి ఒకమనిషిని అదనంగాయిస్తారు. ఇతన్ని 'సత్రకాయ' అంటారు.

కూత 'అరిబలి చెడుగుడు చెడుగుడు చెడుగుడు' అంటూ దమ్ము ఉన్నంతవరకూ ఆగకుండాకూయాలి. కొంతమంది 'చెట్టుగొట్టగా పాలు గారగా చెన్నాపట్నం దుర్రిచ్చి, దుర్రిచ్చి' అనికూస్తారు.

## కుండ పగులగొట్టుట

కళ్ళకుగంతలుకట్టి, చేతికి కర్రయిచ్చి యిరవై ఆరడుగుల దూరంలో ఒక కుండను పెట్టి పగులగొట్టమంటారు. చీకటిలోకూడా లక్ష్యాన్ని చేరి గురి తప్పకుండా కొట్టగలగడం యిదినేర్పే కౌశలం.

## గోనెసంచులాట

ఒకొక్కరూ ఒక్కోగోనిసంచిలో కాళ్ళుపెట్టుకొని, దానిఅంచులు పట్టుకొని అందరూ ఒకేసారి బయలుదేరి ఎగురుతూవెళ్ళిపదిబారల దూరంలో ఉన్న గమ్యాన్నిచేరాలి. ఎవరుముందుచేరితే వారువిజేత.

## మూకాళ్ళలాట

ఇద్దరేసిమనుషులు జట్టుగా ఒకరికుడికాలు, రెండవవారి ఎడమకాలు మడమలదగ్గర రుమాలుతో గట్టిగాకట్టుకొని పరుగుపెట్టాలి. ఇలా కొన్ని జట్టులు ఏర్పరచి అందరినీ ఒకేసారివదులుతారు. వీరిలో ఎవరయితే నిర్ణీత స్థలాన్ని ముందుచేరతారో వారిదే బహుమతి.

## వొంగుదూకుళ్ళు

ఒకరుకూర్చొని ఒకకాలు చాపుతారు. మిగిలినవాళ్ళు దానిని దాటాలి. తరువాత ఆకాలిబొటనవ్రేలిపై రెండవకాలిమడమ పెడతారు. అదిడాటితే దానిపై కుడిచేయివ్రేళ్ళుచాపి జానపెడతారు. అదీదాటితే

దానిపై ఎడమచేతి వ్రేళ్ళుజానపెడతారు. అదీదాటితే కూర్చున్న మనిషిలేచి కాలిబొటనవ్రేలిని చేతినడిమివ్రేలుతో తాకుతూ వంగుంటాడు. దానిపై నుంచి కూడాదాటితే మోకాళ్ళమీదా, ఆ తరువాత తొడలమీదా చెయ్యివేసికొని వంగుంటాడు. ఆ తరువాత చేతులుకట్టుకుని మెడవంచుకొని నిలబడతాడు. ఇక్కడికిసుమారు అయిదడుగులఎత్తు వస్తుంది. ఈ భంగిమలు వివిధ స్థాయిలలో ఎత్తునుపెంచుకొనిపోవడమన్న మాట. ఈ దాటేటప్పుడు కాళ్ళు ఎక్కడా వంగినవ్యక్తికి తగలకూడదు. వంగున్నప్పుడుమాత్రం అతనిమీద చేతులువేసి దాటవచ్చు. ఏస్థాయిలో కాళ్ళుతగిలినా, దాటలేకపోయినా మొదటి వ్యక్తికి బదులు తనుకూర్చొని యీభంగిమలు పెడుతుంటే మిగిలినవారు దాటుతుంటారు. ఇది ఆనాటి "హైజంప్".

జానపదుల ఆటలు, క్రీడలు ఇటువంటివి ఎన్నోఉన్నాయి. ఆది నుండీ యివి మౌలికంగానేవచ్చాయితప్ప ఎక్కడా లిఖితంకాలేదు. ఇప్పుడు క్రమంగా కాలగర్భంలో కలసిపోతున్నాయి. పరిశోధకులెవరైనా ప్రయత్నించి దేశవ్యాప్తంగా వీనినిసేకరించి భద్రపరిస్తే ముందుముందు క్రీడారంగ చరిత్ర వ్రాయడానికి ఉపయుక్తంకాగలదు.



# వివాహ వేడుకలు

"పప్పుధప్పళాల్ మంచి
అప్పడాల్ భేష్ భేష్"

ఇవి ఒకనాటి జానపదులపెళ్ళిభోజనాలు. పప్పు, చారు, ధప్పళం, అప్పడం, వడియం, బూరె, ఆవకాయ, అరిసె యివన్నీ ఆకులో ఉండవల సిందే. పాశ్చాత్యనాగరికతాప్రభావంతో యిప్పుడవన్నీ పోయాయి. పెళ్ళి ళ్ళకు పల్లెల్లోకూడా పలావుభోజనమే ఫేషనయింది. ఇలాగే పెండ్లితంతులు కూడా మారిపోయాయి. ఒకనాడు తెలుగుజానపదుల పెళ్ళిళ్ళు దాదాపు పది, పదిహేనురోజుల ముచ్చట. అది ఆయింటికేకాదు, ఆ వీధికి, ఆవాడకు - ఇంకా స్తగొప్పవాళ్ళ పెళ్ళయితే ఆఊరికే వేడుక.

పెళ్ళికి పది, పదిహేనురోజులముందు ఒకశుభముహూర్తాన పసుపు కొట్టడం అనేకార్యక్రమంతో వేడుకలకు అంకురార్పణజరిగేది. ఆరోజు పసుపుకొమ్ములురోటిలోవేసి ఊరిలోముత్తయిదువుల్ని పిలిచేవారు పేరంటా నికి. ఒక్కొక్కరూవచ్చి రోకటిలో మూడుపోట్లువేసి తాంబూలాలుతీసికెళ్ళే వారు. ఆరోజుల్లో శుభలేఖలు, ప్రింటింగు వగైరాలులేక లగ్నప్రచారానికి యిదిఒకసాధనంగావుండేది. ఈపసుపుకొడుతూ పేరంటాండ్రు మంగళకర మైన సీతారాములపెండ్లివైభవం రోకటిపాటగా పాడేవారు. అలాగ సీతా రాముల్లాగ అన్యోన్యదంపతులుకావాలని కాంక్షిస్తూ.

తరువాతతంతు పెళ్ళికూతుర్ని చెయ్యడం, పెళ్ళికొడుకును చెయ్య డం. ముఖానికి కళ్యాణంబొట్టు, బుగ్గనుచుక్క, కళ్ళకుకాటుక, కాళ్ళకు పారాణి, చేతులకుగంధం, కొత్తబట్టలు, సెంటువాసనలు వారికి నూత నోత్సాహాన్ని కలిగించేవి. తనకు పెళ్ళికాబోతోందని నలుగురకూ చాటి చెప్పే రెండవ ప్రచారసాధనంయిది. ఈరోజునుంచే వారికి మన్ననలు పెరుగుతాయి. వారిలో ఒక మానసికఉదాత్తత అసంకల్పంగా పెరుగు

తుంది. ఊరూరావున్న బంధువులందరికీ మనుషుల్ని పంపి కబుర్లుపెట్టేవారు. ఫలానారోజు పెళ్ళి, రావాలి అని. సాధారణంగా పెళ్ళి పెళ్ళికూతురింట చెయ్యడమేరివాజు. పెళ్ళికొడుకుయింట చెయ్యడంకూడా కొన్నిచోట్ల వుంది.

పెండ్లి జరిగేయింటిముందు తాటియాకు పందిరివేసి, *మామిడాకు తోరణాలుకట్టి, స్థంభాలకు కొబ్బరిఆకులుచుట్టి ఆ ప్రాంగణానికి పచ్చదనం, చల్లదనం తెస్తే ఆ పందిట్లో స్త్రీలు రకరకాలముగ్గులతో రంగవల్లులు తీర్చిదిద్దేవారు. కొందరు పందిట్లో పలురకాల కాగితపుబుట్టలుకూడా వ్రేలాడ దీసి మరింత శోభాయమానంగా అలంకరించేవారు. ఇది ఆయింటిలో పెళ్ళి జరగబోతోందనిచెప్పే మూడవ ప్రచారసాధనం. (ఈమధ్య మైకులు వచ్చాక యీపందిళ్ళలో "పాడు జీవితమూ యవ్వనం మూడునాళ్ళా ముచ్చటలోయి" వంటివాటలుకూడా వినిపిస్తున్నారనుకోండి). పెళ్ళినాటికి బంధుమిత్రులంతా సపరివారంగా కుటుంబాలతో తరలివచ్చేవారు. పిల్లల దగ్గరనుంచి పెద్దవాళ్ళవరకూ ఎవరినిచూసినా ఖరీదయిన బట్టలూ, సెంటు వాసనల ఘుమఘుమలతో ఇల్లంతా కలకలలాడిపోయేది. ప్రత్యేకించి స్త్రీలు పట్టుచీరలుధరించి కంటె, కాసులపేరు, వడ్డాణం, నాను, నాగరం, మురుగులు, దండకడియాలు వంటి బంగారుఆభరణాలు వొంటినిండా దిగబోసుకుని (ఎరువుతెచ్చుకొని అయినాసరే) పెళ్ళికళను యినుమడింపజేసేవారు.

జానపదుల విశేషం కష్టాల్లోనూ, సుఖాల్లోనూ ఒకరికొకరు సాయపడడం, పెండ్లి ఖర్చు కొంత తాముకూడా భరించడానికి బంధుమిత్రులు పెళ్ళికొడుకునుచేస్తామనీ, పెళ్ళికూతుర్ని చేస్తామని వాళ్ళయిళ్ళకు తీసుకువెళ్ళి విందుచేసి, అత్తరూ పన్నీరూచల్లి, గంధంపూసి, కొత్తబట్టలూ, కొంతకొంతసొమ్ములూ చేతికిచ్చిపంపించేవారు ఉచితంగా. పైగా పెళ్ళిభోజనాలకు కావలసిన బియ్యం దంచడంలోనూ, (ఆరోజుల్లో బియ్యంమిల్లులు లేవు) పిండివంటలు తయారుచెయ్యడంలోనూ, భోజనాల వడ్డింపుల్లోనూ ఎంతగానో సహకరించి చాలాఖర్చును తగ్గించేవారు.

---

* మామిడాకుల్లో ఆక్సిజన్ ఎక్కువగా ఉత్పత్తిచేసే గుణముందట.

# అవిరేడు

ఇక పెళ్ళినాడు మంగళవాయిద్యాలతో ఊరేగింపుగావెళ్ళి మొదట గ్రామదేవతలకు పానకాలుపోసేవారు. ఈ ఊరేగింపులో ఒక * శాలువాను నాలుగుమూలలా నలుగురుపట్టుకోగా మధ్యలో కర్రతోగొడుగులా ఒకరు పైకెత్తిపట్టుకొనినడుస్తుంటే పిల్లలందరూదానిక్రిందచేరి బలేసంబరపడిపోయే వారు. దీనినిబట్టే యిది పెళ్ళిఊరేగింపని చూడగానే తెలిసిపోయేది. దీనిని కొందరు అయిరేడనీ కొందరు అయిలేడనీ అంటుంటారు. తరువాత దఫ దఫాలుగా యిలాగే ఊరేగింపుగా పళ్ళేలనిండా బియ్యం, స్వయంపాకాలూ తీసికెళ్ళియిచ్చి కుమ్మరియింటినుండి అవిరేడుకుండలు, పూజారియింటినుండి బాసికాలు, చాకలియింటినుండి మధుపర్కాలు, పూసలాళ్ళయింటినుంచి నల్ల పూసలూ లక్కజోడు, కంసాలియింటినుండి మంగళసూత్రాలూ తెచ్చేవారు. ఊరందరికీ తెలియజేయడానికిగాను యీ ఊరేగింపు ఒకోసారి ఒకోవీధంట వెళ్ళేది. వీనిలో అవిరేడుకుండలు తెచ్చేటప్పుడు బహుచోద్యంగాఉండేది. ఈకుండలపై నలుపు, తెలుపు, పచ్చ, బ్రౌన్‌రంగులలో అందమైన డిజైన్లూ బొమ్మలూ వేయబడివుండేవి. ఒక్కొక్కరూఒక్కొక్కకుండ మూతివైపు ఛాతీకి ఆనించుకుని వెనుకవైపు చేత్తోపట్టుకుని నడుస్తుంటే రంగురంగుల హరివిల్లులా ఊరేగింపు రమణీయంగావుండేది. ఆఖరున వచ్చేపెళ్ళివారికి ఎదురుసన్నాహంగా ఊరిపొలిమేరదగ్గరకు బాజాభజంత్రీలతో వెళ్ళేవారు. ఈబాజాభజంత్రీలలో ముఖ్యంగావుండేవి దూదేకులవానిబాకా, పీరుసాయిబు తాసా, మంగళ్ళవీరణాలు, రామడోలుమేళం, సన్నాయిమేళం, మాదిగ డప్పులు, ఆ డప్పులమధ్య ఎరుకలవాని నాటుతుపాకీపేల్పులు. వీనితో ఊరంతా మారుమ్రోగిపోయేది. అవతలినుంచివచ్చేది పెళ్ళికొడుకయితే ఒక టాపులేనిపల్లకీలోనూ, పెళ్ళికూతురయితే సవారీలోనూ (మీనా) కూర్చుండ బెట్టితీసుకొచ్చేవారు. వీరితో ఒకతోడగుఱ్ఱమెకూడా వచ్చేది.

---

* పండితులు దీనిని "ఉల్లభం" అంటారు.

ఈపల్లకీ సవారీలు వోం వోం వోం ఓహో అంటూ చాకళ్ళు మోసు కొచ్చేవారు. సవారీప్రక్కన సాయిబు తూ...... అంటూ పిల్లసన్నాయి ఊదుతూ నడిచేవాడు. ఇలాగ యించుమించు ఊరిలో అన్నికులాలవారూ యిందులో పాల్గొనడం యీపెళ్ళిళ్ళ విశేషం. కొందరు ఈ ఊరేగింపును "ఊరేగింపు"గా పేర్కొన్నారు. అంటే ఊరికి ఆ వధువు లేక వరుని పరిచయంచెయ్యడమన్నమాట. పెండ్లికొడుకుయింటపెండ్లయితే పెళ్ళికూతురు వారు తోడుగా సారెకూడాతెచ్చేవారు. అది కొబ్బరికాయలు, అరటిగెలలు, గుమ్మడికాయలు, పసుపు, కుంకుమ, బియ్యం, అపరాలు, పట్టుచీరలు, పంచెలజామార్లు వగైరా ఇవి కావిళ్ళకు అటూయిటూ కనబడేలా కట్టుకొని కూడామోసుకువచ్చేవారు వారివెనుక. ఇవన్నిటితో యీఊరేగింపు (ఊరెరిగింపు) ఒక అందమైనఆకృతిలో మహోత్సాహంగా సాగేది.

ఊరేగింపు యిల్లుచేరగానే కూడా వచ్చినవారందరికీ విందుభోజనాలు ఏర్పాటుచేసేవారు. కొందరు ఊరేగింపుకి ముందుగానే భోజనాలుపెట్టేసేవారు. (దానిపేరే ఊరపంక్తి). ఈ భోజనాలదగ్గర బావామరదుల వరుసలవారూ, వదినామరదళ్ళ వరుసలవార్లూ ఒకరికొకరు కొసరికొసరి వడ్డించుకుంటూ ఒకరిమీదఒకరువిసిరే చెణుకులు మంచి చమత్కారంగా వుండేవి.

## కాశీయాత్ర

ఇక పెళ్ళితంతులదగ్గరకొస్తే పెళ్ళికిముందు(వడుగుదగ్గర)బ్రాహ్మణ, విశ్వబ్రాహ్మణాదికులాలలో విడిదిలోంచి పెళ్ళికొడుకు పావుకోళ్ళు తొడుక్కొని, తాటియాకుగొడుగు చేతబట్టుకుని సన్యాసం పుచ్చుకుంటానని కాశీకి బయలుదేరేవాడు. అతడు అలా వీధంటకొంతదూరంవెళ్ళగానే బావమరదులు వెళ్ళి తమసోదరినిచ్చిపెళ్ళిచేస్తామని వెళ్ళవద్దని గెడ్డంక్రింద బెల్లంముక్క పెట్టి బ్రతిమాలి వెనక్కి తీసుకొచ్చేవారు. ఇదంతా చూస్తుంటే తెలియని వారికి గొప్ప థ్రిల్‌గా ఉంటుంది. నాటకంగావడిచే చిత్రమైనవేడుకఇది.

## కాళ్ళగోళ్ళుతియ్యడం

పెళ్ళికిఒకగంటముందు వధూవరులకు కాళ్ళగోళ్ళు తియ్యడం అనే కార్యక్రమం పెట్టేవారు. పెళ్ళిలో వధూవరులచేత ఒకరిపాదాలు ఒకరిచేత త్రొక్కిస్తారుకదా! అప్పుడు కాళ్ళకుగోళ్ళుగానీవుంటే ఒకరికొకరివి గుచ్చు కొని క్రొత్తతగువులొచ్చే ప్రమాదముంది. ముందుజాగ్రత్తగా (అలాగని చెప్పకుండా) గోళ్ళు తియ్యడమనేదాన్నికూడా ఒకవేడుకగాచేసి డబ్బులు దిగదుడిచి మంగలిపళ్ళెంలోవేసి మంగళస్నానాలు చేయిస్తారు.

## పెండ్లితంతు

అనంతరం పెండ్లిపీటలమీద కూర్చోబెట్టి ఒకరికొకరుకనిపించకుండా యిద్దరిమధ్యా తెరఅడ్డంగాపెట్టేవారు. ఈ తెర వధూవరులలో ఒకరినొకరు చూసుకోవాలనే ఉత్సుకతనురేకెత్తించి అనురాగఅంకురాన్ని ఇనుమడింప జేస్తుంది. పురోహితుడు వేదమంత్రాలతో పుణ్యాహవాచనం, వివాహ దీక్షాకంకణం, యజ్ఞోపవీతధారణం, మధుపర్కధారణం, కన్యాదానం ఒక క్రమంలో జరిపిస్తూ మధ్యమధ్యభజంత్రీలను వాయించమంటుంటాడు. ఈ బాజాలు ఎప్పుడెప్పుడువాయించమంటాడయ్యా అంటే ఒకాయన చెప్పేడు పురోహితుడు మంత్రాలుమరచిపోయినప్పుడల్లాఅని. (అదినిజంకాకపోవచ్చు లెండి).

## కన్యాదానం

అత్తమామలు అల్లునికాళ్ళుకడిగి తమకూతుర్ని కన్యాదానంచెయ్య డంలో అల్లుడు దానగ్రహీత అయ్యాడు. అత్తమామలు దాతల స్థాయికి ఎదిగారు. అంటే అల్లునికివారు ఆరాధ్యులని చెప్పకచెప్పడం దీనిలోనిభావం. అంతేగాని అల్లునికాళ్ళు కడగడంతో అత్తమామలస్థాయి అడుగున పడి పోయిందనేభావం సరికాదు. ఇచ్చేవాడు గొప్పా? పుచ్చుకునేవాడు గొప్పా? నిజానికి అత్తమామలఔన్నత్యాన్ని అల్లునిహృదయంలో బలంగా ప్రతిష్ఠా పించే విశిష్టఘట్టం యీదానవిశేషం.

## సుముహూర్తం

పురోహితుడు జీలకఱ్ఱ, బెల్లం వధూవరులచేత ఒకరినెత్తిమీద ఒకరిచేత పెట్టించి –

"ధృవంతే రాజా వరుణమ్
ధృవందేవో బృహస్పతిః
ధృవంత ఇంద్రశ్చాగ్నిశ్చ
రాష్ట్రంధారాయాతా ధృవమ్"–

అని మంత్రాలుచదివేసమయమే సుముహూర్తం. ఇప్పుడుకూడా బాజాలు వాయింపచేస్తాడు. (ఇది మాత్రం మంత్రం మరచిపోయికాదు, ఎవరైనా తుమ్మితే వినబడకుండేటందుకు మాత్రమే) ఇదేలగ్నం. ఇప్పుడు అడ్డుతెర తొలగిస్తారు. వధూవరులు ఇంతసేపూ ఉత్కంఠతతో ఎదురు చూస్తూ మరులుగొన్న మనసులతో ఒకరినొకరుతొలిసారిచూసుకున్న మధుర క్షణంఅది. పూర్వం పెళ్ళికూతుర్ని పెళ్ళికొడుకుగాని, పెళ్ళికొడుకును పెళ్ళి కూతురుగాని ముందు చూసుకోవడాలు ఉండేవికావు. పెద్దవాళ్ళే చూసి వివాహం నిర్ణయించేవారు. అందువల్ల యిదేవారికి తొలిచూపు. అంతేగాక కళ్యాణకళతో కలకలలాడుతూ ఒకరిప్రక్కఒకరు ఆనందంగా కనిపిస్తుంటే అందరిహృదయాలూ తీయనితలపులతో ఒక్కసారి పులకరించిపోయేవి. (వారి గతస్మృతులు మరల జ్ఞాపకంవచ్చి). అనంతరం అందరూ అక్షతలు జల్లి వధూవరులనాశీర్వదించేవారు.

## మాంగల్యధారణం

పెళ్ళితంతు ఒకవైపున యిలాజరుగుతుంటే మరొకవైపున మంగళ సూత్రాన్ని ఆహూతులైన ముత్తయిదువుల మెడలకుతాకించీ, పురుషుల చేతులకు తాకించీ పునీతంచేసి పురోహితునికి యివ్వగా అతడు అవితెచ్చి నాగలికాడికికట్టి చివరగల పలుపుకన్నంలోంచి వ్రేలాడదీసి పసుపు,కుంకుమ, అక్షతలతో పూజచేసి మంత్రాలతో వానికి పవిత్రత ఆపాదిస్తారు. జాన పదులు సాధారణంగా వ్యవసాయమే వృత్తిగా జీవించేవారు గనుక వారికి నాగలి ఇలవేల్పు. ఆనాగలికాడికి తాళి తగిలించి పూజించడం తమ ఇల వేల్పుసుకూడా సాక్షిని చెయ్యడమే.

తరువాత పురోహితుడు -

"మాంగల్యం తంతునానేనా మమజీవనహేతునా
కంఠే బధ్నామి శుభగేత్వం జీవవరదాం శతం"

అని మంత్రంచదువుతూ వరునిచేతవధువుమెడలో ఆ శతమానాల్ని కట్టించి మూడుముళ్ళువేయిస్తాడు. నూరేళ్ళు ఇరువురిజీవితాలూ మమతాను రాగాలతో సుఖశాంతులతో ఒకటిగా కలిసిమెలసిబ్రతకాలనే ఆకాంక్షలతో బంధించే సూత్రంయిది. ఆపైన వరునిచేత "ధర్మేచ, అర్థేచ, కామేచ, మోక్షేచ, నాతి చరామి" అనిపిస్తాడు. పెండ్లికూతురుచేత భర్తచేతికి కంకణం కట్టిస్తాడు. ఇది వారిరువురిమధ్య అధికన్యూనతాభేదాలు లేకుండా సమానాధి క్యత, ఆరాధనాభావాలు కలుగజేసేసంధానం. అందుకే ఆనాడు పెళ్ళంటే నూరేళ్ళపంట అన్నారు. (ఇప్పుడు నూరేళ్ళవంట అంటున్నారనుకోండి).

## బ్రహ్మముడి

"ఏడేడూజన్మల నుండీ
పడివుండీ బ్రహ్మముడీ"

నేటివివాహం గతఏడుజన్మల అనుబంధంఅని మనవాళ్ళవిశ్వాసం. నేటినుండి వారిద్దరూఒకటిగాఅనుసంధింపబడిరను అంతర్లీనభావానికి దృశ్య రూపమైనసంకేతం యీబ్రహ్మముడి. ఇదే కొంగుముడి. పెండ్లికూతురు చీరచెంగూ, పెండ్లికొడుకుపంచెకొంగూకలపిముడివేసి పురోహితుడు వారి చేతులకలిపి ఏడడుగులు నడిపిస్తాడు. ఇదే సప్తపది. ఆపైన హోమ గుండంచుట్టూ ముమ్మారు ప్రదక్షిణంచేయిస్తారు అగ్నిహోత్రునికూడా సాక్షిని చేస్తూ. చిలకమర్తివారి గయోపాఖ్యానం నాటకంలో -

"అగ్నిసాక్షిగ గొన్న అంబుజాక్షిని గాని
కలనైన పరకాంత దలచి యెరుగ"

అని గయునిచేతచెప్పించడంలో అగ్నికూడా పెండ్లికిసాక్షి అనేది విదిత మౌతోంది.

## తలంబ్రాలు

అనంతరంజరిగే తలంబ్రాల కార్యక్రమం అందరినీ అలరించే వినోదాత్మకమైనవేడుక. పురోహితుడు ఇరువురిచేతుల్లోనూ కొబ్బరికురిడీచిప్పలు పెట్టి వానిలో పళ్ళెంలోని బియ్యంపోసి వధూవరులచేత ఒకరినెత్తిమీద మరొకరితో అటూయిటూ మూడుసార్లు పోయిస్తాడు. తరువాత ఆపళ్ళెంలోని బియ్యం వధూవరులిద్దరూ దోసిళ్ళతో ఒకరినెత్తిమీద ఒకరు ఉత్సాహంగా పోసుకుంటుంటే చూసేఅందరివదనాలూ దరహాసంతో వికసించవలసిందే. పెళ్ళితంతులన్నిటిలో ఇదే గొప్పసందడి. ఇక్కడ సీతారాముల పెళ్ళి తలంబ్రాలవిషయమై చదవబడేశ్లోకం గమనార్హం.

"జానక్యాః కమలామలాంజలి పుటేయాః పద్మరాగాయితాః
న్యస్తారాఘవమస్తకేచ విలసత్కుంద ప్రసూనాయితాః
స్రస్తాశ్యామల కాయకాన్తి కలితాః యాయింద్ర నీలాయితాః
ముక్తాస్తాశ్శుభదా భవంతు భవతాం శ్రీరామ వైవాహికాః"

అంటే — సీతారాముల కళ్యాణానికి మంచిముత్యాల తలంబ్రాలు ఆనందోత్సాహాలతో ఒకరినెత్తిమీదఒకరు పోసుకుంటుంటే అవి సీతమ్మ దోసిట్లో ఎఱ్ఱగాఉన్నాయట. రాముని తలమీదపడగానే నల్లగా మారిపోతున్నాయట. అవి రామునిశరీరంమీదికిజారగానే నీలిరంగులోకి మారుతున్నాయట. ఇది విచిత్రంగాలేదూ! కాని అలామారడానికికారణంసీతమ్మవారిచేతులు ఎరుపుగనుక ఆముత్యాలుఆమెచేతిలో ఎఱ్ఱగాఉన్నాయి. రాముని జుట్టు నలుపుగనుక తలమీదపడగానే నల్లగా కనుపించాయి. రాముడు నీలమేఘశరీరుడు గనుక అతనిదేహంమీద పడగానే నీలంరంగులో కనిపిస్తున్నాయి. ఆ పుణ్యమూర్తులతలంబ్రాలు మీకు శుభము కలుగజేయుగాక అనేఆశీస్సు బాహ్యార్థం. అంతర్థానమేమిటంటే మనస్సు మంచిముత్యం లాంటిదనీ, దానిలోనికి ఏభావంచొప్పిస్తే అదే ప్రతిఫలిస్తుందనీ, అందువల్ల వధువుమనస్సు వరునిరూపంతోనూ, వరునిమనస్సు వధువు రూపంతోనూ నింపుకొని పదిలపరచుకోండని పరోక్షంగా చెప్పడం.

## ఉంగరాలుదేవడం

ఇట్లాంటి ఆనందకరమైన కార్యక్రమమే అవిరేడుకడవలో ఉంగరాలు దేవడం. ఈ కడవనే 'గరికిముంత' అంటారు కొన్నిచోట్ల. కడవలోనీళ్ళు పోసి పురోహితుడు బంగారుఉంగరాలు, కాలిమట్లు అందులోవేస్తాడు. వధూవరులు ఆకడవలోచేతులుపెట్టి అవిదేవితియ్యాలి. అవి ఎవరైతే ముందు చిక్కించుకునితీస్తారో వారుగెలిచినట్లు. ఈదేవడంలో కుండలో యిరువురి చేతులూ స్వేచ్ఛగా కలుస్తాయేమో, పైగా అదిఎవరికీ కనుపించనిచోటేమో అప్పటివరకూ బిగబట్టుకొనివున్న ఉత్సాహం కట్టలుతెగి పారి కొంటెగా చిటికెనవ్రేలుగిల్లుకోవడాలు (ఒకరిచేతిలోనివి ఒకరు కాజేయడానికి) బలే ఆహ్లాదంగాఉంటాయి. అనంతరం పెండ్లికూతురుకూ, ఆమె ఆడబడుచులకు కూడా యీఉంగరాలుదేవడంపెడతారు. ఈ ఉంగరాలు వెదికేటప్పుడు వదినామరదళ్ళ ఆత్మీయమైన సంవాదాలూ, సరసోక్తులూ, మధురోక్తులూ వధువులో అత్తవారి క్రొత్తదనంహరింపజేసి వారిలో ఒకరుగా కలిసిపోయే ప్రేరకంగా ఉపకరిస్తుంది.

## పాదం త్రొక్కించడం

నూతనవధూవరుల్ని దేహరీత్యా మరింతసన్నిహితంచేసే దైహికమైనవేడుకయిది. ఒకరిపాదంమరొకరిచేత త్రొక్కిస్తారు సానమీదపెట్టించి. ఇది తొలిస్పర్శేమో ఒక్కసారిగా ఒళ్ళు గగుర్పొడిచి మనసుల్ని ఆనంద డోలికల్లో ఓలలాడిస్తుంది. ఇక్కడ అటువారూ, ఇటువారూ ఆమెత్రొక్కేస్తోందని అతను గట్టిగా త్రొక్కేస్తున్నాడనీ ఫిర్యాదులుచేసుకుంటూ ఎకసక్కేలాడుకుంటూ ఆఘట్టాన్నికూడా వినోదభరితంచేస్తారు.

## అరుంధతీనక్షత్రం

వివాహాలలో సీతారాములకు ఎంత ప్రాముఖ్యముందో వశిష్టుని భార్య అరుంధతికి అంతకంటెఎక్కువ ప్రాముఖ్యముంది. పెళ్ళిళ్ళలో ఆమెదే పెద్దపీట. కారణం — ఎప్పుడూ పతి ఎడబాటుఎరుగని పతివ్రత ఆమె. అందుకే పెద్దముత్తయిదువామె. రాత్రులు ఆకాశంలోకి చూస్తే

సప్తర్షిమండలంలో వశిష్ఠునిప్రక్క కనిపిస్తుందీనక్షత్రం మిలుకు మిలుకు మంటూ. పార్వతీపరిణయ సమయంలో శివుడుకూడా తనతరుపున సంధాన కర్తలుగా సప్త ఋషులతోపాటు స్త్రీలలో యీమె ఒక్కతినే పంపించాడు పెద్దపేరంటాలుగా. పతి ఎడమెరుగని ఆదర్శదాంపత్యానికి యీమె వేగు చుక్క. అందుకే వివాహానంతరం పురోహితుడు వధూవరులను వాకిట్లోకి తీసికొచ్చి ఆకాశంకేసిచూపిస్తూ అదుగో అరుంధతీనక్షత్రం అంటాడు. (పట్టపగలు కూడా అలాగే చేస్తాడనుకోండి) దీనిమీదమంచి జోక్‌కూడా వుంది. పూర్వం ఒక వరుణ్ణి అరంధతీ నక్షత్రంఅదిగో కనిపిస్తోందా అంటే అరుంధతీనక్షత్రంకాదుగాని ఆరువేలు అప్పుమాత్రం కనిపిస్తుందన్నాడట. బహుశా అవి కన్యాశుల్కంరోజులై ఉంటాయి. పిల్లనుకొనుక్కోవడంలో అప్పులపాలైపోయుంటాడు. ఇప్పుడైతే ఆమాట పెళ్ళికూతురు తండ్రంటాడు కట్నాలతోనూ ఖర్చులతోనూ నడుంవిరిగిపోయి.

## తలుపుదగ్గర పేర్లు

వివాహాల్లో మరోమంచివినోదం తలుపుదగ్గర పేర్లుచెప్పించడం. గుమ్మంతలుపువేసేసి, పెళ్ళికూతురుఆడపడుచులు లోపలుండి, వధూవరుల్ని "ఎవరెవరొచ్చారు?" అని అడుగుతారు. ఇక్కడ పెళ్ళికొడుకు భార్య పేరుచెప్పి ఆమెతో కలిసివచ్చాననిచెప్పాలి. అలాగే పెళ్ళికూతురుకూడా. సహజంగా సిగ్గుదొంతర్లలో పెండ్లికూతురు వరునిపేరు చెప్పడానికి వెను కాడడం, ఎలాగో బలవంతంగా ఆమెచేత కనీసం మూడుసార్లయినా చెప్పించి తలుపులుతీయడం బలే సరదాగావుంటుందిఅందరికీ. ఇదికూడా వధూవరుల్ని సన్నిహితంచేయడానికిపెట్టినవేడుకే. ఇక్కడ తలుపులువేసి ఆవలున్న ఆడబడుచులకీ, వధూవరులతోపాటు తలుపు యీవలున్న వధువుతరపువారికీ జరిగేసంవాదాన్ని తలుపుదగ్గరపాట అంటారు. అది -

"ముత్యాలావానాకురిసే ముగ్ధామీవదినాతడిసే
తలుపూతియ్యండమ్మల్లారా తగవూలెందుకూ
ముత్యాలవానకురియాలేదు ముగ్ధావదినా తడియాలేదు
తలుపుతియ్యము అన్నా మేము తగవూలెందుకూ-"

ఇక్కడే ఆడబడుచులు తమకోరికలన్నీ తెలుపుతారు. అవి అన్నగారు ఒప్పుకున్నాక తలుపుతీస్తారు.

## పాన్పు వెయ్యడం

పట్టిమంచంమీద తెల్లనిదుప్పటిపరచి మంచానికి అచివరా యీచివరా ఎదురెదురుగా వధూవరుల్నికూర్చోబెట్టి పెళ్ళిపాటలు "విందూచేసినారూ వియ్యాలవారింటా, పప్పూఉడకలేదూ, కూరావేగలేదు"అంటూ పెళ్ళికొడుకు తరుపువారు, "మగాపెళ్ళివారూ మర్యాటములతీరు" అంటూ ఆడపెళ్ళివారు ఒకరినొకరు వేళాకోళం చేసుకుంటున్నట్లు సరదాగాపాడి హాస్యవల్లరి సృష్టిస్తారు. ఒకపెళ్ళిలో ఒకఅలివేణినిపాటపాడమని బలవంతంచేస్తే "పన్నెండుస్తంభాలా పందీటిలోనా లచ్చన్నా దరిగోళ్ళా పట్టీమంచాలు" అని వాడి "అయ్యో! పొయ్యిమీద పప్పుమాడిపోతోంది" అందట. కొంతమంది లేచి వెళ్ళారటకంగారుగా. మళ్ళీ "పన్నెండూ స్థంభాలా పందీటిలోనా'' అని అందుకుని ''అయ్యో! అన్నం చిమిడిపోతోంది'' అందట. మరికొంతమంది పరిగెట్టారట. ఇలా ఆఒక్కచరణంపాడి ఏదోఒకటిఅంటుండేసరికి ఒకామె ఉండబట్టలేకగాడికొట్టిన రికార్డులా అక్కడే ఆగిపోతావేం, మిగిలినచరణాలు కూడాపాడు అందట. ఆమె షకాలుననవ్వి 'అవిరాకేగదాయీపాట్లు' అనేటప్పటికి అంతా ఘొల్లున నవ్వేశారట. (పప్పుమాడడం, అన్నంచిమడడం అన్నీ అబద్ధాలేనన్నమాట) ఇలాంటి తమాషాలు ఎన్నో !.

ఈపానుపుమీదజరిగే మరోవినోదం వధూవరులచెండాట - అదే బంతులాట. పువ్వులు బంతిగాకట్టి ఒకదోసిట్లోకి మరొకరు విసురుతారు. (అంటే అవిమన్మథబాణాలన్నమాట) అలాగే వెండిరూపాయలు, బంగారు

కాసులపేర్లు విసురుక్కోవడం వుంది. (ఇవి సిరికే ప్రతిరూపాలు గదా! మరి సిరులేకదా మరులుగొలిపేవి!). అనంతరం ఆ పాన్పుమీదే వారిరువు రికీ జూదమాట పెడతారు. వధువు కొన్నిరూపాయలు తనగుప్పిట్లోముడిచి, ముడిచినపిడికిలి ముందుకుచాపుతుంది. అవిఎన్నో వరుడు చెప్పుకోవాలి. చెప్పేసుకుంటే అవి అతనికి యిచ్చేస్తుంది. చెప్పుకోలేకపోతే అన్నిరూపా యలు వరుడామెకివ్వాలి. అలాగే వరునిగుప్పెట్లో రూపాయలు వధువు చెప్పుకోవాలి. ఈ జూదంలో వధువుతరపువారు వధువుకీ, వరునితరపువారు వరునికి వత్తాసుగానిలిచి సలహాలిస్తూ వారి ఓటమి, విజయాలలో వారు కూడా కలిసిపోయి కేరింతాలుకొడుతూచేసే అడావిడి చాలా మనోహరంగా వుంటుంది.

## వసంతోత్సవం

ఇదికూడా వినోదభరితమే. ఇద్దరుమగవాళ్ళు (పెద్దవాళ్ళు) ఒకరు పెళ్ళికొడుకునీ, ఒకరు పెళ్ళికూతుర్నీ ఎత్తుకుని పగలువీధిలో పందిట్లో వీరణాలవాయింపుల కనుగుణంగా ఎగురుతుంటే, కొందరు పళ్ళేలనిండా బుక్కాపోసుకుని పెళ్ళికూతురుకీ, పెళ్ళికొడుక్కీ అందిస్తుంటారు. వారు ముసిముసినవ్వులతో ఆబుక్కా ఒకరిమీదఒకరు చల్లుకోవడంకాగానే ముంత లతో యిరువురూ ఒకరిపై ఒకరు వసంతం (రంగునీళ్ళు) చల్లుకుంటారు. ఇందులో ఆటుతరుపువారూ ఇటుతరుపువారూకూడా ఉత్సాహంగా పాల్గొని వారుకూడా ఒకరిపై ఒకరు చల్లుకుంటూ దీన్నికూడా గొప్పవేడుకగా మార్చేస్తారు.

## జాజాలు చల్లడం

లోపలివాకిట్లో వరునిచే తప్పుకోలతో నేలత్రవ్వించి వధువుచే నీరు పోయించి, అందులో యిద్దరిచేతా నవధాన్యాలు చల్లిస్తారు. అప్పుడే ఆడబిడుచు సోదరుని "పడుచునిస్తావా? పాడావునిస్తావా?" అని అడుగు తుంది. అంటే దానిలోనిభావం తొందరగా ఆడపిల్లనుకని తనకొడుక్కి

యివ్వమని. సాధారణంగా ఆదంపతులు రెండూ యిస్తామంటారు. ఆడపడు చుకు ఆవును అరణంయివ్వడం ఆరోజుల్లో ఆచారమేగా!

## ఊరేగింపు

కలిగినవారు ఒకరాత్రి ఊరేగింపు పెట్టేవారు. పెండ్లి కొడుకునూ, పెండ్లి కూతుర్నీ మెడలో కర్పూరపుదండలతో ముస్తాబుచేసి, ముత్యాలపల్ల కీలో కూర్చుండబెట్టి, ఆ పల్లకీముందు భోగంమేళం, కారువా. (ఇది బ్యాండుమేళంలాంటిదేగాని కొందరు ఆడ, మగ బఫూన్ వేషాలతో మధ్య గంతులేస్తుంటారంతే), సన్నాయిమేళం, రాండోలుమేళం, పీరణాలు, మాదిగడప్పులు, అవుట్లు, తారాజువ్వలు వంటి మందుగుండు పేల్పులలో ఆరాత్రంతా ఊరంతా ఊరేగించేవారు. కొందరు పల్లకీముందు భట్రాజుల పొగడ్తలుకూడా పెట్టేవారు, పెట్రోమాక్సులైట్లు, కాగడాల కాంతుల్లో యీ ఊరేగింపు సాగుతుంటే ఊరంతటికీవేడుకే. పల్లకీలో పెళ్ళికూతురు రాత్రంతా తలవంచుకునే కూర్చునేది సిగ్గుతో. ఈ తలవంచుకోవడాన్ని గురించి చింతామణినాటకంలో దామోదరుడు ఒక విపరీతార్ధంచెబుతాడు. తనభార్య తనవి చప్పిదవడలనీ, గుంటకళ్ళనీ, బొంగ్రముక్కనీ అంటుందనీ పెళ్ళినాడు తాను పల్లకీలో తలవంచుకుకూర్చున్నది వదిపాళ్ళిందుకేనట అంటాడు హాస్యధోరణిలో. (ఇప్పుడెవరూ అది హాస్యపాత్రలా చెయ్యడంలేదుపెండి స్వారస్యం తెలియక).

## ఒప్పగింతలు

సన్నివేశం విషాదభరితమైనా యిదీ ఒకవేడుకే. పిల్లను అత్తవారింటికి సాగనంపేటప్పుడు పితంగ్రిహృదయం ద్రవించదు! శకుంతలను పంపించేటప్పుడు కణ్వుడంతటిమహర్షే ద్రవించిపోయాడు. కలకాలం పెంచినప్రేమ కరుణరూపంలో కట్టుబాత్రెంచుకు ప్రవహిస్తుంది. ఇది చూసినవాళ్ళకు 'కాళిదాసు ఆ సన్నివేశాన్ని ఎంతసహజంగావ్రాసాడు!' అనిపిస్తుంది. అందుకే 'కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలః'

అంటారు. ఆ శకుంతలనాటకంలోకూడా కణ్వుడు శకుంతలను అత్తవారింటికి సాగనంపే సన్నివేశమే గొప్పదన్నారు. ఆ కణ్వహృదయము ఏతల్లిదండ్రులదైనా — ఇక్కడ.

"ఒప్పగించితమ్మా, ఒప్పులాకుప్పానిన్నొప్పగించితమ్మా
మాచెట్లకూ నీరు ఎవరూపోతురమ్మా,
మాపూలచెట్లానూ ఎవరూసాకెదరమ్మా,
మాగోవులాపాలూ ఎవరూతీతురమ్మా,
మాలేగలన్నిటినీ ఎవరూసాకెదరమ్మా"

అంటూ ఆమెపుట్టింటిదినచర్యలన్నీతలుపుకుతెస్తూపాడే ఒప్పగింతల పాట ప్రతిహృదయాన్నీకదలిస్తుంది. అందులోనూ "పుట్టినింటినిపొగడకు, మెట్టినింటిని తెగడకు" అనీ, "అరిటాకువంటిదీ ఆడజన్మంబు, ఎవ్వరేమన్ననూ ఎదురాడబోకే"అనే హితోపదేశాలు విషాదంలోకూడా వికాసాన్ని ద్యోతిస్తాయి. కాళిదాసు అభిజ్ఞానశాకుంతలంలో కణ్వుడు కూడా శకుంతలకు "శుశ్రూషస్వగురూన్‌కురు ప్రియసఖీవృత్తిం సపత్నేజనే" అని బుద్ధులు గరిపి పంపుతాడు.

పూర్వం యీతంతులన్నీ అయిదురోజులకు విభజించి పెళ్ళిరోజనీ, బూర్లాయితనీ, కంకణాలువిప్పేరోజనీ, టెంకినీళ్ళు దిష్టితీసేరోజనీ, వసంతోత్సవదినమనీ, ఒప్పగింతలనీ, నాగవిల్లనీ ఒక్కోప్రాంతంలో ఒక్కోపేరుతో ఐదురోజులు వేడుకగాచేసేవారు. అవకాశంలేనివాళ్ళు అన్నీ కలిపి ఒకేరోజు 'ఏకరాత్రి'పెళ్ళి చేసేవారు.

ఏమైనా ఈవేడుకలన్నీ అపరిచితులైన వధూవరులను అత్యంత సన్నిహితులనుచెయ్యడానికి, మమత, ఆప్యాయత, అనురాగం ఆ సంసారంలో బలంగా పాదుకోవడానికి గట్టిగావేసేముడులు. నాటిపెళ్ళిళ్ళలో అన్నీ వేడుకలే. అందరికీ వేడుకలే. నేటిపెళ్ళిళ్ళలో ఒక్కటేవేడుక—ఒక్కడికే వేడుక. ఆ ఒక్కటే వరకట్నం - ఆఒక్కడూ పెండ్లికొడుకు.

# సంక్రాంతి వేడుకలు

* "Festival is a complex unit of customs and other Folklore to celebrate a special occasion usually, and of Public interest".

పండుగలు సమాజంలోని సభ్యులనడుమ సమైక్యతని పెంపొందిస్తాయి.

** "మిరపపండ్లకు కుంకుమ మెరపుదాల్చి
బంతిపూవుల మొగము లల్లంత విచ్చి
మనగృహమ్ముల ధాన్యసంపదలు నిల్చి
సరస మధురమ్ము పుష్య మాసంబువచ్చె"

పుష్యమాసం వచ్చిందంటే తెలుగుపల్లెలు ధాన్యరాసులతో గలగల లాడుతుంటాయి. గాదులునిండినరైతన్న పేదసాదలకు సమారాధన ప్రారంభిస్తాడు. ధనుర్మాసప్రారంభంరోజును పల్లెజనులపరిభాషలో నెలపట్టడం అంటారు. నెలపట్టినట్టుసంకేతంగా ఆరోజుఉదయం దేవుడిగుళ్ళో బాజాలు వాయిస్తారు. స్త్రీలు వీధుల్లో గుమ్మాలముందు ముగ్గులతో సంకురుడుపెట్టడం ప్రారంభిస్తారు. అంతకంటే ఇంటింటికీతెలిసేమరో సంకేతం సాతానుజియ్యరు యాచనారంభం.

ఈ జియ్యరునుగురించి 'కాటూరి, పింగళి' తమ 'తొలకరి' గ్రంథంలోని "సంక్రాంతి" ఖండికలో ఇలాఅంటారు. –

"కోడితోమేలుకొని తానమాడి నుదుట
తిరుమణియు తిరుచూర్ణము తీర్చిదిద్ది
ఒక్కకేలను తంబుర ఒక్కకేల
చిరుతలంబూని నున్నని శిరముపైని
తొలగకుండగ అక్షయపాత్ర నిలిపి
మేలుకొలుపులంబాడి వీధివీధులను దిరిగి
యనుపదమ్మును రంగరంగా యటంచు
గడపగడపకునేగి భిక్షమ్ముగొనుచు
చేరవచ్చెను సాతానిజియ్యరడిగో".

* S. D. Fml, Boggs Vol II P. 1144.
** పింగళి - కాటూరి 'తొలకరి' నుండి

నెత్తిమీద అక్షయపాత్రపడిపోకుండా తలచుట్టూగుడ్డచుట్టి, భుజాల నుంచిక్రిందికి వ్రేలాడేలా అంగీ, కాళ్ళకుగజ్జెలు, కాగితంపూలదండలూ, బంతిపూలదండలూ మెడలోనూ చేతులకూ ధరించి, సెంటువాసననిండిన గంధం పూసుకుని, కీర్తనలుపాడుతూ, ప్రతిగుమ్మందగ్గరా ఆగుతాడు. ఇంటివారు దోసిటబియ్యం తేగానే వారికిఅక్షయపాత్రఅందేలా మోకాళ్ళ మీదవంగి "కృష్ణార్పణం" అంటూలేచి, "హరిలో రంగా హరి" అంటూ తనచుట్టూతను ఒకప్రదక్షిణచేసి సాగిపోతాడు. ఈ హరిదాసులో విశేష మేమిటంటే అక్షయపాత్ర నెత్తినఉన్నంతసేపూ ఎవరితోనూ మాట్లాడడు. ఇది దేహీ అని నోరువిప్పి అడగని యాచన. ఇది పల్లెజనులు ప్రథమంగా ప్రారంభించే సంక్రాంతి సమారాధన.

## భోగిమంటలు

నెలపట్టినదిమొదలు కనుమవరకూ పుణ్యదినాలుగాభావించి పల్లె ప్రజలుఎంతో భక్తితత్పరతతో దానధర్మాలుచేస్తారు. ఈ రోజుల్లో గుమ్మం లోకివచ్చిన ఏముష్టివాడినీ లేదుపొమ్మనరు. ముఖ్యంగా భోగి, సంక్రాంతి, కనుమ, ముక్కనుమ రోజులలో మరీను. సంక్రాంతినే పెద్దపండుగ అంటారు. భోగిదగ్గరపడేముందు వీధివీధికీ పిల్లలు జట్లుజట్లుగాకూడి ఒకగంపపట్టుకుని -

"ఎప్పుడెప్పుడుపండుగు? ఏడాదిపండుగు
అల్లుడెందుకొచ్చాడు? అరిశలుతిన్నాకొచ్చాడు
కూతురెందుకొచ్చింది? కుడుములుతిన్నాకొచ్చింది.
దండమ్మాదండ దండగుచ్చులదండ
వేసినోళ్ళపుణ్యం వెయ్యనోళ్ళపాపం".

అని చరణంలో మొదటిభాగంఒకళ్ళంటుంటే, రెండవభాగం మిగిలిన వాళ్ళు కోరస్‌గాపాడుతూ గుమ్మంగుమ్మానికీ పిడకలుదండుతారు భోగి మంటకోసం. కొందరిదగ్గర తాటిదుంగలుకూడా సేకరిస్తారు. అంతేగాక ప్రతి యింటా పిల్లలు ఆవుపేడతో భోగిపిడకలు చిట్టిగారెల్లాచేసి దండలుగుచ్చి దాన్ని భోగినాడుతెల్లవారుజామునేతలంటుకొని ప్రోగుచేసిన పిడకలూ, దుంగలతో భోగిమంటలువెలిగించి, అందులో భోగిదండలువేసి అవి

ఘనంగా వెలుగుతుంటే చుట్టూనిలిచి చూస్తూ ఆనందిస్తారు. ఇది రావణాసురుని కాష్టమని, పండుగనాలుగురోజులూ ఆరకుండా మండిస్తారు. ఇది రెండవ సమారాధన.

ఇక మూడవ సమారాధన భోగినాటినుంచి ముక్కనుమవరకూ వివిధ రకాలయిన బిచ్చగాళ్ళకువేసే ముష్టి. సంవత్సరంఅంతటిలో వీళ్ళు అప్పుడప్పుడువస్తుంటే పెద్దవిశేషంగాఉండదు. కాని ఈ పండుగనాలుగురోజులూ అందరూ మందగావచ్చేస్తుంటే పెద్దకోలాహలంగాఉండి అరుగుమీద బుట్టలతోబియ్యంపట్టుకొని పిల్లలు, పెద్దలు తెరపిలేకుండా వచ్చే ముష్టివాళ్ళందరికీ ఎంతోఆనందంగావేస్తుంటారు దోసిళ్ళతో బియ్యం.

## గంగిరెద్దువాళ్ళు

ఒకరు తూతూ తూతూ అని సన్నాయివంటి బూరా ఊదుతుంటే, ఒకరు తూ........ అని శ్రుతిబూరా ఊదుతుంటే, ఒకరు డోలుకొడుతుంటే, గంగిరెద్దుల్ని వెంటబెట్టుకువస్తారు గంగిరెద్దులవాళ్ళు. 'డూడూ డూడూ బసవన్నా అయ్యగారికీ దణ్ణంపెట్టు' అంటూ ఎడమచేతిబొటనవ్రేలికి తగిలించుకున్న కంచుపళ్ళెంమీద* చూపుడువ్రేలూ నడిమివ్రేలూ మధ్యనున్న పుల్లముక్కతో తాళంకొడుతూ పాటలాఅంటుంటే పిల్లలు ఆనందభరితులై వాళ్ళజోలెలో బిచ్చంవేస్తారు వచ్చినప్రతిమనిషికీ గుప్పెడు గుప్పెడూ ఎద్దుకు మరోగుప్పెడూ చొప్పున. ఈ ఎద్దుమీదవేసినఊలుకంబళీ పీలికతీసి ఇస్తుంటారుపిల్లలకు. అది మొలత్రాడుకుకట్టుకుంటే పిల్లలకు శుభమట. దానికి మరోదోసెడుబియ్యం పెడతారు. కొందరు పాతబట్టలుకూడా ధర్మం చేస్తారు. మామూలురోజుల్లోఅయితే పిల్లలు అయిదుపైసలిస్తే తాళంమీద పాడుతున్నట్టు మాటలంటూ బలేగమ్మత్తుగా పొగుడుతారు ఇంటిపేరూ, పాపపేరూ అందులోఇమిడ్చి -

"వెలగలవారీ లోగిలి పెద్దది
పాడీపంటా పుష్టిగగలిగి
కలెక్టరంటీ మొగుడేవచ్చి
పిల్లాజెల్లా సల్లంగుండి
కలకలలాడుతు గృహమెలగాలి"

---

* ఈ కంచుపళ్ళెన్ని 'జాగిటి' అంటారు.

అనిపాడుతూ "అయిదుగురు కుమారులు, నలుగురు కుమార్తెలు, మొత్తం తొమ్మండుగురుసంతానంకలిగి, సిరీసంపదాకలిగి, ఇల్లంతా కలకల లాడిపోవాలి" అని దీవిస్తుంటే పిల్లలూ, పిల్లలతల్లిదండ్రులూ ఆపొగడ్త లకు ఆకాశంలో తేలిపోతుంటారు ఆపిల్లభవిష్యత్తు అదేఅన్నట్టు. (నేటి కుటుంబ నియంత్రణప్రకారం ఈమాటలు వీళ్ళుసవరించుకోలేదింకా). క్రొత్తగా పెళ్ళయిన ఇళ్ళల్లో పెళ్ళిబాసికాలు, పసుపుబత్తులు (పసుపుబట్టలు) గంగిరెడ్లవారికిఇచ్చి, ఎద్దుకుకుంచెడువడ్లు చేటలోపోసి తినిపిస్తారు. ఈగంగి రెడ్లవారివేషాలగురించి "పింగళి - కాటూరి" తమ "తొలకరి" ఖండికలో యిలావర్ణిస్తారు.

"తమ్ముడారమ్మ గంగిరెద్దుదాసుడడుగో
వెండిబిళ్ళలమొలత్రాడు దండకడెము
ముక్కునన్ పైడికాడయు మోమునందు
పంగనామమ్ములును వెంట గంగిరెద్దు
చేతమునికోల తనపేరు చెప్పుచుండ
ఊరినడివీధి నాడుచు నుండెరమ్మ".

ఇక గంగిరెడ్లస్త్రీలు పసిపిల్లల్ని చంకనెత్తుకుని, గిన్నె చేత్తోపట్టుకుని "బిచ్చమెయ్యండమ్మా" అని పిడికెడువెయ్యగానే "పిల్లకెయ్యండమ్మా" అని మరోపిడికెడువేయించుకుంటారు. (ఆపిల్ల పాలుత్రాగే పసికందయినా సరే) మామూలురోజుల్లో వీళ్ళు బుట్టచంకనబెట్టుకుని "అమ్మా.... ఎండుబు గాయలు, కరక్కాయలు, జీడి గింజలు, కుంకం, సూదులోయ్" అని కేక పెడుతూ వీధులంటతిరుగుతూ అవి అమ్ముతుంటారు. కొందరు జోలె చంక నేసుకుని "అమ్మగారీఇళ్ళు ధర్మలోగిళ్ళు" అని పాడుతూ అడుక్కుంటారు.

## మైదెరకలవాళ్ళు

తలకు కొప్పు పెట్టుకుని, నెత్తినబుట్టపెట్టుకుని, ఒకప్రక్క బిడ్డను పైటచెంగుతోనడుముకుకట్టుకుని అడుక్కోవడానికివస్తారు మైదెరకలవాళ్ళు. వీళ్ళు తాటియాకుగిలకలు, చిన్నచిన్న బుట్టలూకూడా తెచ్చి అరిశలు, పాకుండలు, సున్నుండలకు అమ్ముతుంటారు.

మామూలురోజుల్లోపీళ్ళు అడుక్కోడానికితిరుగుతూ వీధుల్లోని కోళ్ళపై మత్తుమందుచల్లి ఎవరూలేకుండాచూసి వానినిబుట్టలోవేసుకు పోతారని ప్రతీతి.

## చెంచువాళ్ళు

పాలపిట్టఈకలు, నెమలిఈకలు, ఇతరపక్షులఈకలు తలపై పెట్టుకుని, తలకు పాగాచుట్టుకొని, చేతిలో చిన్న కంచుపళ్ళెంపై పుల్లతో కొడుతూ "ఏవూరు ఏపల్లె చెంచీత, ఎక్కడికి వెళతావె చెంచీత" అంటూ చెంచుపాటలు పాడుతూ, మధ్యమధ్య నోటితోపిల్లనగ్రోవిఊదుతుంటారు చెంచువాళ్ళు. కొన్నిపిల్లనగ్రోవులు అదనంగా సంచిలోఉంటాయి. అవి అరిశలు, పాకుండలు, మిఠాయుండలు, చక్కిలాలకు అమ్ముతుంటారు. పల్లెటూరివారు చేతధరించేవెదురుకర్రలను పదునుచేసే ప్రక్రియ చెంచువారికి తెలిసిన గొప్పవిద్య. వెదురును కొలిమిపై కాల్చి (చక్కని డిజైన్లలో) తెచ్చి యీ పండుగరోజులలో పాకుండలకు, అరిశలకు అమ్ముతారు. పిల్లలు ఎగబడికొంటారు ఆనందంగా.

## జంగందేవరలు

జంగమదేవరలు రెండుమూడు రకాలు. ఒకతెగ మగవారు జెమినీ వారి బాలనాగమ్మసినీమాలో గోవిందరాజులసుబ్బారావుగారువేసిన జంగమ వేషం వేసుకునివస్తారు. అంటే రంగురంగులగుడ్డలతోకుట్టిన నిలువుటంగీ, చేతులకు సీవెండి మురుగులూ, చేతిలోకర్ర, తలకు టోపీలాంటిపాగా. ఆ పాగాకు ఎదుటిభాగం అట్టలతోకుట్టిన రంగురంగుల గుడ్డపై ఇత్తడితో చేసిన సర్పాలుకలిగి శైవాన్నిప్రకటిస్తుంటాయి. భుజంమీదనుండి వ్రేలాడుతున్న శంఖం, చంకక్రింద వ్రేలాడు వెదురుగొట్టంబూర, మెడలో తెలుపూ నలుపూ పసుపూ పూసలహారాలూ నుదుటా కనుకొనలా విభూతిరేఖలూ ధరించి -

"మహాదేవోయ్ మహాదేవ, మహాదేవోయ్ మహాదేవ
పాడిపంటా కలగాలి, మహాదేవోయ్ మహాదేవ
పిల్లాజెల్లా పెరగాలి, మహాదేవోయ్ మహాదేవ"

అంటూ చేతితోగంటవాయిస్తూ మధ్యమధ్య భం భం అని శంఖం ఊదుతూ; అప్పుడప్పుడు వెదురుగొట్టంబూరకూడాఊదుతూ పిల్లల్ని ఆనందపెడుతూ గుమ్మంగుమ్మానికీతిరుగుతారు భిక్షకోసం. కొన్ని ఇళ్ళ వాళ్ళు మామూలుముష్టి వెయ్యడంకాకుండా చేటలో ఉప్పు, పప్పు, చింత పండు, మిరపకాయలు, బియ్యం పోసి ఇస్తారు. వీరికి పొగడ్త మరికొంత పొడిగిస్తారు.

వీళ్ళు శైవతీర్థాలలో స్నానఘట్టాలచుట్టూనూ, పుష్కరాలరేవుల లోనూ గంటవాయిస్తూ తిరుగుతూ యాత్రికులవద్దచేరి వారితాలూకు చనిపోయిన వారికి శ్రాద్ధాలు పెట్టిస్తుంటారు. విధవస్త్రీలు తమభర్తలకు శ్రాద్ధం పెట్టే టప్పుడు ఈ జంగం ఆమెముందు నిలిచి గంటవాయిస్తూ "మహదేవోయ్ మహదేవా, మహదేవోయ్ మహదేవ! పోయినోడే జంగమయ్య, ఎదరోడే నీమొగుడు" అని పాడేపాట యీజంగాలప్రసక్తివచ్చినప్పుడు జనం చెప్పు కొనినవ్వుకొనే పెద్దజోక్.

వీరి మరొకతెగ తంబురతో బాలనాగమ్మ, సన్యాసమ్మ, కాంభోజ రాజుకథలు పాడుతూ ఇంటింటికీ యాచన చేస్తుంటారు.

ఇంకొకతెగవారిలో పురుషులు వేషమేమీలేకుండా మామూలుదుస్తు లతో నుదుటవిభూతిరేఖలు, భుజానశంఖం, చంకనసంచి ధరించి ఒకచేతితో గంటవాయిస్తూ –

"సంకురాత్రిపండుగొచ్చె సిద్ధేశ్వరా
తల్లిపిల్ల చల్లగాను సిద్ధేశ్వరా
సాంబమూర్తి కరుణకలిగి సిద్ధేశ్వరా
కలకాలం వర్ధిల్లాలి సిద్ధేశ్వరా
పాడీ పంటా కలగాలి సిద్ధేశ్వరా
పరమేశ్వర దీవెనా సిద్ధేశ్వరా"

అని పాడుతూ భిక్షాటనకువస్తారు. ఈ సంక్రాంతిపర్వదినాన వీరికి వీరభద్రుడుపేరుచెప్పి, చనిపోయిన పెద్దలపేర్లుచెప్పి, శేరుబియ్యం ఉప్పూ, పప్పూ, చింతపండూ, తమలపాకులూ, అరటిపండ్లూ అరటి ఆకుల్లో పెట్టి

పొత్తర్లిస్తారు. పొత్తర్లంటే స్వయంపాకాలు. ఈ జంగమ స్త్రీలు కొందరు పుణ్యస్త్రీలుచనిపోయినప్పుడు దినకార్యమురోజున రేవులో పేరంటాళ్ళగా వచ్చి చనిపోయినామె పేరుమీద మూసివాయినాలుపుచ్చుకుంటారు. మూసి వాయనమంటే చీర, చేట, రవికలగుడ్డ, పసుపు, కుంకుమ, బియ్యం, దక్షిణలతో సమాదరణ. ఈ మూసివాయనాలనే మూసేనాలంటారు.

## కోయవాళ్ళు

కోయస్త్రీలు పండగలలో అందరితోపాటు మామూలుగా అడుక్కోవ డానికివస్తారు. కాని మామూలురోజుల్లోవీళ్ళు "జున్ను, పావుడార, రొయ్యి పీత, గోరోజనం, చెవిలోపోటు, కంటిలోపోటు, నడుముపోటు మందు లున్నాయి మందులు" అంటూ వీధులంటతిరుగుతుంటారు. గృహిణులు వారిదగ్గర గచ్చాకుపుచ్చాకుమందులు బియ్యంపోసి కొంటుంటారు.

## పాములవాళ్ళు

పాములవాళ్ళలో మగవాళ్ళు పెద్దపాగాచుట్టుకొని, పాములబుట్ట నెత్తినపెట్టుకొని, నోటితో ఆనబకాయబుర్రతోచేసినబూరతో నాగస్వరం ఊదుతూ ప్రతిగుమ్మందగ్గరా బుట్టదింపి, మూతతెరచి పామునాడిస్తుంటే అందరూ వినోదంగాచూసి బియ్యంవేస్తారు. అలాఆడించేటప్పుడు పాము అప్పుడప్పుడు నాలుకబయటపెట్టి బుస్సుమంటుంది. అతను ఒకవేరుముక్క వేళ్ళతోపట్టుకొని దానిమూతిమీదపెట్టగానే అది చప్పగాచల్లబడి తలదించేసు కుంటుంది. అది తెల్లవీసరనిచెబుతాడు. అలాంటివి తనదగ్గర ఇంకా ఉన్నాయని తీసిచూపించి, రెండేసిదోసిళ్ళబియ్యానికి ఒక్కోవేరుముక్క చొప్పున అమ్ముకుంటాడు. ఆఅమ్మేవి మామూలుపుల్లముక్కలే. అతని చేతిలోదికూడా పచ్చివసముక్కట. దానివాసనకి త్రాచుపాము రోషంపోయి నీరసపడిపోతుందట. ఇదీ గమ్మత్తు. "కూటికోసం కోటివిద్యలు".

## హరిదాసులు

బుక్కావాళ్ళలో మగవాళ్ళు ముఖానికీ, గుండెలకూ, భుజాలకూ వైష్ణవనామాలూ, చేతిలో చిడతలు, చంకలో నెమలిఈకల్ల కట్ట, మెడలో

పూసలదండలు ధరించి కాళ్ళకుగజ్జెలుకట్టుకుని, సీతారామలక్ష్మణుల బొమ్మలతికినఒకఇత్తడిసెమ్మెలోఒత్తులేసి నూనెపోసివెలిగించి, "సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము"వంటి రామదాసుకీర్తనలుపాడుతూ నృత్యంతో అభినయిస్తూ గుమ్మంగుమ్మందగ్గరాఆగుతుంటే భక్తితో ఆ సెమ్మెలో నూనె వడ్డిస్తూ ఆసెమ్మె అడుగునగలమసితీసి బొట్టుపెట్టుకుని దోసిళ్ళతో బియ్యం వేస్తుంటారు. వాళ్ళు నెమలిఈకలకట్టతో నెత్తిమీదరాసి దీవిస్తుంటారు.

వీళ్ళస్త్రీలు అద్దాలు, దువ్వెనలు, నల్లపూసలు, లక్కజోళ్ళు, ముగ్గు గొట్టాలు వగైరా తట్టలోపెట్టుకునినెత్తికెత్తుకుని వీధుల్లోతిరుగుతూ అమ్ముతుంటారు. పెళ్ళిళ్ళలో పళ్ళాలతో వీళ్ళఇళ్ళకుబియ్యంతీసుకువెళ్ళిఇచ్చి నల్లపూసలు, లక్కజోడులు తెచ్చుకుంటుంటారు పల్లెజనాలు.

## కొమ్మదాసరి

గొల్లబాలుడువేషంలాగ నుదుట, చేతులకు, గుండెలమీదా పంగనామాలుపెట్టుకుని, కురచలాగు తొడుక్కుని నెత్తికిజోకర్‌టోపీ పెట్టుకుని, చెట్టుకొమ్మచేత్తోపట్టుకునివచ్చి నాలుగురోడ్లసెంటరులో క్రిందరుమాలు పరచి దగ్గరున్న చెట్టుపైనగానీ పిట్టగోడపైనగానీ ఎక్కికూర్చొని -

"పడిపోతున్నా నప్పయ్యోయ్
కొమ్మదాసరి నండప్పయ్యోయ్
కొమ్మదిగితే కోటివేలిచ్చినా పుచ్చు
కోనండప్పయ్యోయ్
ఎర్రికోక కట్టుకున్నప్పయ్యోయ్
సూరమ్మప్పయ్యోయ్, సుబ్బమ్మప్పయ్యోయ్
కాంతమ్మప్పయ్యోయ్, పడిపోతా, పడిపోతా" -

అంటూఅరుస్తూ ఆ చుట్టుపక్కలవారందరిదృష్టి తనవైపుతిప్పుకుంటాడు కొమ్మదాసరి: అతనిమాటలకు నవ్వుకుంటూ స్త్రీలు అతనిరుమాలు మీద దోసిళ్ళతోబియ్యంతెచ్చివేస్తుంటారు. ఇదో విచిత్రమయిన యాచన.

## కాశీకావిడి

కాశీకావిడి భుజానవేసుకొని, తలకుగుడ్డ, భుజంమీద రుమాలుతో బ్రాహ్మణుడు వస్తాడు. కాశీ రామేశ్వర క్షేత్రాలుదర్శించి గంగాతీర్థం తెచ్చానంటూ గుమ్మాలదగ్గరకావిడిదింపి కావిడికిరుపైపులా ఉన్న సంచుల నుంచి చిన్నచిన్న భరిణలుతీసి, ఆభరిణల్లో ద్రావములోతేలుతున్న బొమ్మలు చూపుతూ చేపఉన్న భరిణచూపి అదిమత్స్యావతారమనీ, తాబేలున్న భరిణ చూపి అదికూర్మావతారమనీ చెబుతాడు. మరొక భరిణిలో ఒక స్త్రీబొమ్మ తేలుతుంటుంది. ఆమె సీతాదేవి, ఒకవైపు రామునిబొమ్మ, ఒకవైపు రావణునిబొమ్మ వేసివున్నబిళ్ళను ఆమె ముఖానికి అభిముఖంగాచూపెడు తుంటే రావణాబ్రహ్మవచ్చినప్పుడు ఆ స్త్రీబొమ్మ ముఖం వెనక్కితిరిగి పోతుంది. రామునిబొమ్మ చూపినప్పుడు నిలిచిపోయి చూస్తుంది. అది మనకు విచిత్రంగా కనిపిస్తుంది. (దానిలోని కిటుకు ఆ బిళ్ళలోఉన్న అయస్కాంతం) ఈ చోద్యానికి అచుట్టుప్రక్కలవాళ్ళంతా చేరతారు. అలా చేరగానే ఒకగొట్టంలోనుంచి చుట్టివున్నబొమ్మలపటం తీసివిప్పి ఒకపేము బెత్తంతో అందులోనిబొమ్మలు చూపిస్తూ వానివిషయం వివరిస్తుంటాడు. ఆ పటంలో పాపాలుచేసినవాళ్ళు నరకంలో ఏపాపానికి ఎలాంటిశిక్షలుఅనుభ విస్తున్నారోచూపేబొమ్మలు పైనుంటాయి. అందులో పరమలోభి ఇల్లో నారాయణమ్మ భర్తనుపెట్టినబాధలూ, గయ్యాళితనంతో ప్రజల్ని పెట్టే హింసలూ వర్ణించిచెప్పి, నరకంలో ఆమె అనుభవిస్తున్నశిక్షలు చూపిస్తాడు. ఈ పాపాలకుశిక్షలు చాలాభయంకరంగా ఉంటాయి. వ్యభిచారిణిని అగ్నిలోకాలుతున్నఉక్కుస్థంభానికి కౌగలింపచెయ్యడం, ఇతరపాపాలకు సలసలమరిగేనూనెలో పడెయ్యడం లాంటివిచూపిస్తుంటే పాపంఅంటే భయ మేస్తుంది.చివర దానధర్మాలుచేసి పుణ్యాన్ని సంపాదించుకున్నవాళ్ళు స్వర్గంలో ఎలాసుఖాలు అనుభవిస్తున్నారో బొమ్మలుచూపుతూచెబుతుంటే అప్పుడే అతనికి ధర్మంచేసేసి పుణ్యంమూటగట్టేసుకోవాలనేటంతఆవేశంపొంది పళ్ళేలనిండాబియ్యం తెచ్చి అతనిజోలె నింపేస్తారు.

## గుంపోళ్ళు

గుంపోళ్ళు పూర్వంవచ్చేవారు — సంక్రాంతి నెలలోనే, యిది దొంగలముఠా, వీళ్లు ఊరిలోకి వస్తున్నారంటే అందరికీ హడలే, అందుకని

మునసబుకరణాలు గ్రామనౌకర్లనుజోడిచ్చి ఇంటింటికితిప్పేవారు. ఇంటికో తవ్వెడుబియ్యం, పావలాడబ్బులు మామూలు. ఇప్పుడు ఈ బాపతు సంపోళ్ళులేరు. అందరిలాగే వీరుకూడా కూలీ, నాలీ చేసుకు బ్రతుకు తున్నారు. పనిచేయలేనివాళ్ళు మామూలుముష్టివాళ్ళలాగే అడుక్కుంటు న్నారు ఎవరిమట్టుకువాళ్ళే.

## మా ది గ జ ట్టు

కొన్నిచోట్ల ఈ పండుగనాలుగురోజులూ ఊళ్ళో మాదిగలు జట్టుగా కూడి కొందరు డప్పులువాయిస్తుంటే, కొందరు కాళ్ళకు గజ్జెలుకట్టుకుని "లేలే లేలే లేల్లేలయో రామారాఘవా లెల్లేలయో" అంటూ తుమ్మెద పదాలూ, వెన్నెలపదాలూ పాడుతూ గుమ్మాలముందు ఎగురుతుంటారు. ప్రతివారూ చేటనిండా ధాన్యంఇస్తారు. ఆ చేట చేత్తోపట్టుకుని "పెద్దకాపు గారు, పెద్దదొరగారు, పెద్దమారాజులు, సిరితో వర్ధిల్లాలి, పిల్లాజల్లాతో భాగ్యవంతులయి, శుభోజ్జయంగా వర్ధిల్లాలిలోహోయ్" అంటూ ప్రతిమాట తరువాతా డప్పుమీద ఒకదెబ్బకొడుతూ దీవిస్తూవెళుతుంటారు.

## మా ల ల జ ట్టు

మాలలజట్టువాళ్ళు ఒకఆబోతును బంతిపూదండలతోఅలంకరించి, దాని మెడకు మువ్వలూ, గంటలూకట్టి, ఇద్దరుముగ్గురు ఇత్తడితాళాలతో వాయిస్తూ 'శ్రీరామా రామారామోరామా రామయ్యా హరిరామా రామరామయివోధ్యా రామా" అనిపాడుతూ ఇంటింటికి తిరుగుతుంటే వారికికూడా చేటనిండా ధాన్యం పెడతారు.

## చా క ళ్ళ జ ట్టు

చాకళ్ళు జట్టుగా బల్లలపండుగచేసుకుంటామని ఇంటింటికీ తిరిగి బియ్యంపోగుచేసుకుంటారు. (బల్లలపండగంటే చాకిలేవుబల్లకు కోడిని గాని, మేకనుగాని కోసి పండుగగాచేసుకుంటారు. సంక్రాంతిపండుగ వెళ్ళిన దగ్గరనుంచీ బల్లలపండుగరోజువరకూ బట్టలుతకరు. ఈ బల్లల పండుగ మరునాటినుండి బట్టలుతకడం ప్రారంభిస్తారు. ఈ పండుగవారు సామూహికంగా చేసుకుంటారు.

బుడబుక్కలవాళ్ళు, బోడమ్మ, పిట్టలదొర వేషాలవాళ్ళు, దిక్కు లేని కుంటి, గుడ్డి, అవిటివాళ్ళు ముష్టికిరావడం ఈ పండుగలకు ఎక్కువ.

## దశమ గ్రహం

ఇది ముఖ్యంగా అల్లుళ్ళ సమారాధనపండుగ. క్రొత్తల్లుడయితే రాజభోగమే. పండుగనాడు ఖరీదయినకొత్తబట్టలు, పండగనంతరం వెళ్ళేటప్పుడు జేబునిండాడబ్బు ఎంతలేనివాళ్ళయినా ఎలాగోసరిపెట్టవలసిందే. ఈ వడకడం ఇంచుమించు వాళ్ళకు పిల్లలుపుట్టేవరకూ జరిగేదే. ఏ పండక్కి పిలుపురాకుంటే ఆపండక్కే అల్లుడు అలక. కూతురికి కోత. అందుకే అల్లుణ్ణి దశమగ్రహమన్నారు. ఈమధ్య పెళ్ళికట్నాలకు చట్ట పరమైననిషేధాలువచ్చాయిగాని ఈకొసరుకట్నాలకు మాత్రంనిషేధంలేదు. కాషువా గారిలా అంటారు —

"అలుడననినిక్కిన నా కలుదొకడు
దాపురించి అధికారముతో
నిల్లుంజొచ్చెం నేనిపుడల్లుండనుగాను
మామనయికూర్చుంటిన్". అని —

సుమతీశతకాడు అల్లునిగురించి యిలా అన్నాడు —

క. అల్లుని మంచితనంబును
గొల్లని సాహిత్యవిద్య, కోమలి నిజమున్
బొల్లున దంచిన బియ్యము,
తెల్లనికాకులునులేవు తెలియుము సుమతీ.

మంచితనంగల అల్లుడు, పండితుడైన శూద్రుడు, సత్యముచెప్పే ఆడది, పొల్లునతీసిదంచిన బియ్యము, తెల్లగానుండు కాకులు ప్రపంచమందు లేవు అని. ఇప్పుడివన్నీ ప్రపంచంలో కనిపిస్తున్నాయిగాని అల్లునిమంచి తనం మాత్రమే అరుదు.

కాలక్రమేణా పల్లెలలోకూడా పట్టణనాగరికత ప్రబలుతుండడంతో దానధర్మాలు తగ్గి యీసంక్రాంతిబిచ్చగాళ్ళుకూడా పలచబడిపోతున్నారుఒక్క జామాతలు తప్ప. ఇప్పుడు సంక్రాంతిశోభ పేకాటవైపూ సారాబుడ్ల వైపూ మళ్ళీ రాత్రిపూట నడిరోడ్డుపై 16 ఎం. ఎం. సినిమా వినోదంతో తేలియాడుతోంది.

ఇక ఈ సంక్రాంతివేడుకల్లో కోడిపందేలు, పొట్టేళ్ళపందేలు, ఎడ్ల పందేలు విశిష్టమైనవేడుకలు. ఈ పందేలు ఊరి బయట పెడతారు. చుట్టు

ప్రక్కల పడిపడి హేనుగ్రామాలప్రజలు వచ్చి తీర్థంలాచూసి ఆనందిస్తారు. వీనిలో పందెలకంటే పైపందేలజోరు హెచ్చు.

## కోడిపందేలు

"దక్షిణముపై పన్నిదములొడ్డి హూత్సర్య
గతి కోడె పందెముల్ కట్టువారు".
(వైజయంతి ౩౯౫)

కోడిపుంజులకాళ్ళకు కత్తులుకట్టి ఎదురెదురుగా నిలబెడతారు, పైకెగురుతూ ఒకదాన్నొకటి పౌరుషంగా పొడుచుకుంటాయి. పల్నాటియుద్ధం, బొబ్బిలియుద్ధంలకు ఈ క్రీడయేకారణం. సంక్రాంతి పండుగకు పల్లెల్లో ఇది చాలాచోట్ల కనబడుతుంది. సుప్రసిద్ధకవులు "కాటూరి పింగళి" తమ "తొలకరి" ఖండికలో సంక్రాంతిపర్వదినాన పందెంలో పౌరుషంతోపోరాడి బరిమీద ప్రాణాలువిడిచిన పుంజునుద్దేశించి —

"కుక్కుటమ నీవు సుకృతివి కోరియుసిని
బెట్టుకొన్నను చావు లభింపదుత్త
రాయణమ్మున సంక్రాంతి వేళ
కత్తిదెబ్బకు శిరమొగ్గి కదన నిహతు
లైనవీరులక్షే భోగ్యమై తదన్య
దుర్లభంబగు దివి చేరుదువు కదన్న".

అంటూ ఈ పందెంలో చచ్చినపుంజుకి వీరస్వర్గం చెప్పారు.

"కోడిపంధెములు మనదేశములో ఇప్పటికి వేయి సంవత్సరముల పూర్వమునుండి వాడుకలోనుండినాయట. దీనిని పదునయిదవ శతాబ్దములో ప్రాగ్దేశములను దర్శింపవచ్చిన విదేశయాత్రికులుకూడా వర్ణించియున్నారు".

కోడిపోరు పూర్వపుసంస్థానాధీశులకు చాలాప్రియమైన వేడుకలలో ఒకటి. పెద్దాపురసంస్థానపు కోడిపుంజులకథ అందరెరిగిందే. బొబ్బిలి, పలనాటి చరిత్రలలో యుద్ధాలకు కారణం యీకోడిపందేలే.

---

* విజ్ఞాన సర్వస్వం (తెలుగు సంస్కృతి ౧)
(ఆటలు, వేడుకలు, వినోదములు, మల్లంపల్లి సోమశేఖరశర్మ).

ఇప్పటికి 900 ఏండ్లక్రిందట మానసోల్లాసకావ్యంలో వీనిని ఒక ప్రకరణంనిండావర్ణించారు. దండి క్రీ. శ. ౭౫౦ ప్రాంతమువాడు. తన దశకుమార చరిత్రములో కోడిపందెంవర్ణించాడు. అందునారికేళజాతి ఒక జాతికోడిని గెలిచెనని వ్రాసేడు. అభినవదండియగు కేతన తెలుగులో దశ కుమారచరిత్రము వ్రాసినప్పుడు కోడిపందెంను చాలా విస్తరించివ్రాసేడు - మచ్చుకి యీ క్రిందిపద్యంచూడండి.

"ఎదిరిన కోడి మున్నెనసి యారెడు మెడ
నెసగాడ నురవడి వ్రేసి వ్రేసి
గెలిచెనాయాట దగనారి కేళజాతి"

## పొట్టేలుపందేలు

గొఱ్ఱెపొట్టేళ్ళకి కోడిపుంజుల్లాగే పౌరుషంఎక్కువ. అవి ఢీకొనడం మొదలుపెడితే తలనుంచిరక్తం ఏరులై పారినా లెక్కచేయవు. ఈ ఢీకొన టంలో ముందుగా తర్ఫీదుయిస్తారు. మొదట గొఱ్ఱెతలకు దగ్గరగా అరచేయి పెట్టితాకిస్తూ వెనక్కినెట్టుతూ క్రమంగా దూరంగానిలిచి "డుర్‌చిప్" అని అరచేయిచూపిస్తాడు. అది పరుగుపరుగునవచ్చి అరచేయిని ఢీకొంటుంది. ఆ తరువాత చేయికిబదులు చెక్కనుపెట్టి గట్టిదెబ్బకు అలవాటుచేస్తారు. వానిని బలంగామేపి పండుగల్లో పందానికిఉసిగొలిపి వదులుతారు. అవిరెండూ ఇరువైపులకూ దూరంగావెళ్ళి పరుగుపరుగున వచ్చి ఒకదానితలనొకటి ఢీకొంటూ వీరోచితంగా పోరాడతాయి. పొట్టేలుపందెంఅంటే చూడ్డానికి చుట్టుప్రక్కల పదిపన్నెండుగ్రామాలప్రజలు తీర్థంలావచ్చి చూసివినోదించే వారు.

## ఎడ్లపందేలు

ఇది బలప్రదర్శనకు సంబంధించినది. బండి చక్రాలు తిరగకుండా వానినితొట్టికికట్టేసి ఎడ్లుకట్టిలాగిస్తారు. ఏబండి ముందుగమ్యంచేరితే ఆఎడ్ల జత నెగ్గినట్టు. ఈపని కొన్నిచోట్ల ఇసుకలోచేయిస్తారు. కొన్నిచోట్ల బండిలో బరువుబస్తాలుకూడావేస్తారు. ఈ పండగనాలుగురోజులూ జానపదులకు ప్రతి రోజూవేడుకే. జానపదులు తాము యితరులకు ధర్మంచేయడంలో గొప్ప ఆనందంపొందుతారు - అదివారికి మనస్సు నిండినవేడుక.

# పర్వదినవేడుకలు

ఆదినుండీజానపదులు తిధివారనక్షత్రాలపడికట్టుతోనే ముఖ్యకార్యక్రమాల కుపక్రమించడంకద్దు. అందులోనూ తిధికిప్రాముఖ్యం మరీ ఎక్కువ. జానపదులు తిథులకు కొన్నివిధులనునిబంధించి ఒక్కో తిథికి సంవత్సరంలో ఒకటిరెండు రోజులలో ప్రత్యేకతసృష్టించి విశిష్టనామాలతో వానిని సుప్రతిష్టితంగావించి పండుగలుగానూ, పర్వదినాలుగానూ రూపొందించుకున్నారు. వీనితేదీలు పంచాంగంలో తెలుగునెలల నడకల్నిబట్టీ, గ్రహాల గమనాన్ని బట్టీ స్థిరీకరించబడతాయి.

## ఉగాది

పల్లెలలో దీనివాడుకపేరు సంవత్సరాది. చైత్రశుద్ధ పాడ్యమిరోజిది. వేపపువ్వుపచ్చడి దీనిప్రత్యేకత. ఉదయంఅందరూ తలంటుకొని, క్రొత్తబట్టలుకట్టుకొని పరగడుపున వేపపువ్వు పచ్చడితింటేగాని ఏమీతినరు. వేపపువ్వు, కొత్తబెల్లం, చింతపండు, అరటిపండు, శనగపప్పు, కొబ్బరిముక్కలు, పచ్చిమామిడికాయముక్కలు ఈపచ్చడిలోకలిపేపదార్థాలు. ఇది తియ్యతియ్యగా, పుల్లపుల్లగా, వగరువగరుగా బలేరుచిగా వుంటుంది. (చెయ్యడంచేతకాకపోతే చేదుగాకూడాఉంటుందనుకోండి).

ఈ వేపపువ్వుపచ్చడి కడుపులోని నులిపురుగుల్నిచంపుతుంది. (అంటే యిందులో ఒకఆరోగ్యసూత్రం యిమిడిఉందన్నమాట). ఈరోజు ఎలాగడిపితే సంవత్సరమంతా అలాగే నడుస్తుందని జానపదుల నమ్మకం.

మధ్యాహ్నం గ్రామచావిడివద్దగాని, దేవుడిగుడిలోగాని పురోహితుని పంచాంగపఠనంఉంటుంది. ఆ సంవత్సరమంతటిలో గ్రహాధిక్యములూ, తత్ఫలితాలూ, అతివృష్టి, అనావృష్టి, పంటలదిగుబడి, దేశకాలపరిస్థితులు వగైరా పంచాంగంలోవ్రాయబడ్డవి చదివి వివరిస్తాడు. తారాబలం చదువుతుంటే తత్సంబంధిత నక్షత్రాలవారు ఆ సంవత్సరంలో తమజీవితపు హెచ్చుతగ్గుల్ని అంచనావేసుకుంటారు. అందరూ అడిగితెలుసుకునేవి ముఖ్యంగా మూడు. ఆదాయవ్యయాలూ, రాజపూజితావమానాలూ, తమనక్షత్రానికి

చెప్పబడ్డ సున్నలూను. ఈ సున్నాల్నిబట్టేవారి ఆరోగ్యస్థితిగతుల మదింపు జరుగుతుంది. దీనినే "కందాయ ఫలమ్" అంటారు. ప్రతితారకూ దానిస్థితిని బట్టి సున్ననుండి ఏడుసంఖ్యలవరకూగల అంకెలలో ఏవోమూడుఅంకెలు వరుసగావ్రాయబడతాయి. ఫలితాలు ఈసున్నలస్థానాన్నిబట్టి చెబుతారు.

"ఆదిశూన్యే మహావ్యాధి,
మధ్యశూన్యే మనోవ్యధా
అంత్యశూన్యే ఫలం స్వల్పం.
త్రిశూన్యే నిష్ఫలం భవేత్"

ఇవన్నీ తెలుసుకుని పురోహితునికి సంభావనలిచ్చిసత్కరిస్తారు.

## యమద్వితీయ

ఇక విదియదగ్గరకొస్తే కార్తీకశుద్ధవిదియను యమద్వితీయఅంటారు. ఈరోజు బ్రాహ్మణకుటుంబాలలో కొందరుభక్తితో యమునిపూజించి భగినీ హస్తభోజనం చేస్తారు (సోదరి చేతి భోజనం) దీర్ఘాయువుకోసం. ఈరోజు శ్రీకృష్ణుడు సుభద్ర చేతిభోజనం చేశాడట.

## అట్లతద్ది

తదియకు ప్రాముఖ్యం సంవత్సరంలో రెండుసార్లువస్తుంది. మొదటిది ఉండ్రాళ్ళతద్ది. భాద్రపదబహుళతదియ ఉండ్రాళ్ళతద్ది. రెండవది అట్లతద్ది. ఆశ్వయుజబహుళ తదియ అట్లతద్ది. ఇందులో అట్లతద్దిది అగ్రస్థానం. ఈ రోజున వేకువజామునేపిల్లలులేచి జట్టులు జట్టులుగాకూడి "అట్లతద్దోయ్ ఆరట్లోయ్, ముద్దపప్పోయ్ మూడట్లోయ్" అంటూఅరుస్తూ వీధులంటతిరుగుతూ ఊరందర్నీ మేలుకొలుపుతారు. ఇదిపూర్తిగా స్త్రీలకు సంబంధించినది. ఈ తద్దెలఉపవాసం బలేతమాషాగాఉంటుంది. స్త్రీలు కోడికూతతోలేచివంటలు చేసికొని తెల్లవారకుండా భోజనంచేసేస్తారు. మళ్ళీ రాత్రి చంద్రునిచూసిన తరువాతే భోజనం. అంటే పగలంతా పచ్చిమంచినీళ్ళుకూడాముట్టరన్నమాట. ఏమీ తినరు. తింటే ముసలిమొగుడొస్తాడట. దీనికొక కథకూడా చెబుతారు ముసలమ్మలు. ఒకప్పుడు బాపనారకమ్మ, రాచవారకమ్మ,

కోమటోరక్కమ్మ యీ వ్రతం పట్టేరట. రాచవారక్కమ్మ సుకుమారి కావడంతో ఆకలికితాళలేక గిలగిల్లాడిపోతుంటే అన్నలు అద్దంద్వారా చంద్రుణ్ణిచూసినట్లు భ్రమింపజేస్తే ఆమె భోజనంచేసేసింది అసలుచంద్రుడు పొడవకముందే. ఆమెకు ముసలిమొగుడొచ్చాడట. చంద్రునివంటి అందగాడు మొగుడుకావాలని కాంక్షతోచేసే వ్రతమిది.

అట్లతద్దినాడు నూతనవధువుచేత ముత్తయిదువలకు వాయినాలిప్పిస్తారు. పదకొండు అట్లు, పసుపు, కుంకుమ, తాంబూలం, రవికలగుడ్డ చీర చెంగులోపెట్టియిస్తుంటే ముత్తయిదువ తనచీరచెంగుపట్టిఅందుకుంటుంది. ఈమె 'ఇచ్చేనమ్మా వాయనం' అంటే, ఆమె 'పుచ్చుకున్నానమ్మా వాయనం' అంటుంది.

ఉండ్రాళ్ళతద్దినాడు ఉండ్రాళ్ళూ, అట్లతద్దినాడు అట్లూ వండి గౌరీ దేవికి నైవేద్యం పెడతారు. ముంజేతికి మామిడాకుతోరంకట్టుకుని (కంకణం) తమ్మలపాకుమీద పసుపుముద్దతోగౌరీదేవినిచేసి (సన్నికల్లులాగ) పత్రి, పూలుతెచ్చి వధువుచేతపూజచేయించి. "ఇరుగుపచ్చన, పొరుగుపచ్చన, మాయిల్లుపచ్చన" అని ప్రార్ధనచేయిస్తారు (పండితులు "సర్వేజనాః సుఖినో భవంతు" అనేదాని భావమే యిది) సాయంత్రం ఆపత్రి, పూలూ, పసుపూ వగైరాలను ఎత్తివేసి 'పాలల్లో గౌరమ్మా నీలల్లోగౌరమ్మా' అంటూ దగ్గరలోనున్న నూతిలోగాని, చెరువులోగాని, కాలువలోగాని కలిపేస్తారు.

ఈతద్దెలకు చెట్లకుఉయ్యాలలువేసి ఎంతోఉత్సాహంగాఊగుతారు పెద్దవాళ్ళుకూడా వయస్సుభేదంమరచి.

## వినాయకచవితి

"ఓ బొజ్జ గణపయ్య నీబంటు నేనయ్య
ఉండ్రాళ్ళమీదకు దండు పంపు"

భాద్రపదశుద్ధచవితి వినాయకచవితి. ఈనాడు తెలుగుపల్లెలలో ప్రతియింటా ఆడామగా పిల్లాపాపా అందరూ ఉదయమే తలారాస్నానం చేసి నేరేడు, మారేడు, ఉత్తరేణి, జమ్మి, అశ్వద్ధ వగైరా రకరకాల

పత్రి, కలువ, చెంగల్వ, తామర, మందార, జాజి, గన్నేరు మొదలగు నానావిధపరిమళపుష్పములు పూజకై తెస్తారు. వినాయకుని మట్టిబొమ్మ చేసి, పీటమీద క్రొత్తగుడ్డపరచి, దానిపై బియ్యంపోసి, దానిపై వినాయకునిబొమ్మపెట్టి, పైన ఒక నలుచదరంగా పాలవెల్లికట్టి వ్రేలాడదీసిదానికి మామిడాకులుమడిచితొడిగి, కలువపూలూ, తామరపూలూ, మొక్కజొన్న పొత్తులూ, వెలక్కాయలూ, బత్తాయికాయలూ, మారేడుకాయలూ, జామికాయలూ వ్రేలాడదీస్తారు. కుడుములూ, ఉండ్రాళ్ళూ, జిల్లేడుకాయలూ వండి నైవేద్యంపెడతారు. ఊరిపురోహితుడువచ్చి గణపతి పూజ చేయించి చవితిచంద్రునికథ చెబుతాడు. ఆరోజు చంద్రునిచూడరాదట. చూసినందువల్ల శ్రీకృష్ణుడంతటివాడుకూడా ఎలా నీలాపనిందలపాలయ్యేడో చెప్పి (శమంతకమణి కథ) ఉపసంహారంలో ఎవరయితేనేడుగణపతిని పూజించి కథవిని అక్షతలునెత్తినవేసుకుంటారో వారు చంద్రునిచూసినా నీలాపనిందలు రావని ఫలశ్రుతి చెబుతాడు.

విద్యార్థులు గణపతిపీఠంమీద తమపుస్తకాలుంచి పూజిస్తారు విద్య, విజ్ఞానాలనిమ్మని కోరుకుంటూ. అలాగే అందరూ తమతమవృత్తులకు వాడే పరికరాల్నికూడా పూజిస్తారు. ముఖ్యంగారైతులు తమగాదుల్లో వినాయక ప్రతిమనుపెట్టిపూజిస్తారు ధాన్యవృద్ధికోసం.

గ్రామాల్లో ఉత్సాహవంతులు విరాళాలుప్రోగుచేసి ఒకచోట పందిరి వేసి గణపతినినిలిపి తొమ్మిదిరోజులు పూజలుసలుపుతూ ఉత్సవాలుచేస్తారు. ఆరోజుల్లో ప్రతిరోజూ ఒకనాటకమో, నృత్యమో, పురాణమో, హరికథో, బుర్రకథో ఏదోఒకటి పెట్టేవారు. అలాగ వేలాదికళాకారులకు భిక్ష పెట్టే వాడువినాయకుడు. (ఇప్పుడు 16 ఎం. ఎం. సినిమాలు వీనిస్థానంలోకొచ్చి కళాకారుల కడుపుకొట్టినాయనుకోండి). ఆఖరురోజున మేళతాళాలతో గణపతిని ఊరంతాఊరేగించి దగ్గరగలనదిలోనో, కాలువలోనో నిమజ్జనంచేసి ఆమరుసటిరోజు పేదసాదలకు అన్నదానం చేసేవారు.

ఈపూజకువాడే ఆకులకూ, ఫలములకూ వైద్యరీత్యా మంచి ప్రాముఖ్యముంది. మారేడుఫలము రసము (మాదీఫలరసాయనం) పైత్య హారి. నేరేడుఆకులు ఎండబెట్టి కాల్చినబూడిద కాలినబొబ్బలమీద రాస్తే యిట్టేమాడిపోతాయి. ఉత్తరేణిపుల్లతోపండ్లుతోముకుంటే దంతవ్యాధులురావు.

## నాగులచవితి

జానపదులు విశేషప్రాముఖ్యమిచ్చేచవితి మరొకటుంది. అదేనాగుల చవితి. ఇది దీపావళివెళ్ళిన నాలుగవరోజున వస్తుంది. ఈరోజు ఆడామగా బిడ్డలతోసహా అంతలూ ఉదయమేస్నానంచేసి పాముపుట్టలున్న చోటికివెళ్ళి ఆపుట్టకలుగుల్లో పాలుపోసి, కోడిగ్రుడ్లువేసి, బుర్రగుంజు, తేగముక్కలు, చలిమిడి, చిమ్మిలినైవేద్యంపెట్టి పసుపు, కుంకుమ, అక్షతలతోపూజిస్తారు.

"దిగుదిగు నాగన్న దివ్య సుందరి నాగ
నాగా దిగరా నాయన్నా దిగరా శేషా దిగరా"

అంటూ పాటలతో మంగళహారతులిస్తారు.

* "నాగరాజునుపూజించి వనితలిట్లు మ్రొక్కుతారు. నాగేంద్రుడా! ఫణీంద్రుడా! మావాళ్ళు చీకట వాకట తిరుగుతారు. నడుమ త్రొక్కితే నా వాళ్ళనుకో. పడగత్రొక్కితే పారిపో" అని. ముఖ్యంగా రైతులూ, కూలీలూ రాత్రింబవళ్ళు పొలాల్లోతిరుగుతుంటారుగదా! ఇలా పూజిస్తే అవి కనికరించికరవవని నమ్మకం. నాగేంద్రుడు దేవుడుగా మనకు ఎన్నో జాన పదకథలున్నాయి. ఈభూభారాన్ని మోస్తున్న ఆదిశేషుడనీ, మహా విష్ణువుపాన్పు నాగరాజేఅని పురాణాలు చెబుతున్నాయి. చరిత్రరీత్యాచూస్తే ఆదినుండీ మానవుడు నాగుపామును దేవతగాఆరాధించినట్లు ఆనాటిశిలలపై చెక్కిన శిల్పాలద్వారా తెలుస్తోంది.

కొందరుగొడ్రాళ్ళు పిల్లలకోసం ఈరోజున నాగులకోకలని ఒకరకం చీరలు ధరిస్తారు. కొందరు సూరుబిందెల నీళ్ళతో అభిషేకిస్తారు పుట్టని.

---

* ఆంధ్రులచరిత్ర - సంస్కృతి. పు. 59
ఆచార్య ఖండవల్లి లక్ష్మి నిరంజనంగారు.

(పాముగాని పైకొచ్చింఛా అంతేసంగతులనుకోండి). కొందరు నాగరాజు మీదభక్తికొద్దీ పిల్లలకు నాగులు, నాగమయ్య, నాగయ్య, నాగమ్మ, నాగరాజు, నాగన్న అని పేర్లు పెట్టుకుంటారు. చెముడున్నవాళ్ళు మొక్కుకుని యీనాగపూజచేస్తే చెముడు పోతుందట.

ఇంతకీ వైద్యరీత్యా సర్పగరళం చాలావిలువయినది. ఒక్కోసారి పోయేప్రాణాన్నికూడానిలబెడుతుంది. అందువల్ల నాగుపాముల్ని చంప వద్దని పరోక్షంగా చెప్పడమే యీనాగపూజ. (అయినా యిప్పుడు పుట్టలు త్రవ్వి పట్టుకుపరీచంపేస్తున్నారనుకోండి వీనితోళ్ళకు విదేశాల్లో మంచి గిరాకిఉండడంవల్ల ధనాశతో).

ఈ నాగులచవితినిగూర్చి శ్రీనాథుని "శివరాత్రిమహాత్మ్యం"లో యిలా స్పృశించబడింది.

"చలి ప్రవేశించు నాగులచవితి నాడు" అని

## ఋషిపంచమి

వినాయకచవితిమరుసటిరోజు పంచమి ఋషిపంచమి. పల్లెలలో స్త్రీలు ఈరోజు నోములుపడతారు. నోములు తీర్చుకుంటారు. పేరంటం, పారాణి యిందుప్రత్యేకతలు. బ్రాహ్మణ, వైశ్య కుటుంబాలలో సప్తఋషు లను వ్రతములోచెప్పినవిధముగా పూజించి ఉద్యాపనము చేస్తారు. కొన్ని నెలలముందుగనే యీవ్రతము సంకల్పిస్తారు. సప్తఋషులకు ఇష్టమైన ఫలపుష్పశాఖములతో నైవేద్యం పెడతారు.

## సుబ్బారాయుడు షష్ఠి

సుబ్రహ్మణ్యేశ్వరుని జానపదులు సుబ్బారాయుడుఅని పిలుస్తారు. ఇదికూడా నాగపూజే. కానియిది ఆలయంలో ప్రతిమనుపూజించడం. సాధారణంగా ప్రతి మూడునాలుగుగ్రామాలకూ ఈగుడిఉంటుంది. ఈ రోజు ఉదయం స్నానాలుచేసి ఆవూరిజనం, పొరుగూరి జనాలూకూడా వచ్చి గుడి బయటఅమ్మేపూవులూ, పగడలూ (వెండివి) కొని, ఆరటిపళ్ళూ వానితో పాటు దక్షిణగాడబ్బులూ స్వామిపళ్ళెంలోవేసి నమస్కరించి ప్రసాదం తీసుకుని, ఏకభుక్తంతో ఉపవసిస్తారు. ఆదేవాలయంముందు అనేకవిధాలయిన పళ్ళదుకాణాలు, ముఖ్యంగా ఖర్జూరందుకాణాలు హెచ్చుగావుంటాయి.

ఆరాత్రి భోగంమేళం, బేండుమేళం, సన్నాయిమేళం, రాండోలు మేళం, వీరణాలు, కాగడాలు, కళ్ళుమిరుమిట్లుగొలిపే బాణాసంచాకాల్పులతో దేవునిఊరేగింపు వైభవంగాజరిపేవారు. మలిరోజురాత్రి, మూడవరోజు రాత్రి గొల్లకలాపం, భామాకలాపంవంటి యక్షగాన ప్రదర్శనలు ఉండేవి. ఈషష్ఠిసంబరాలు ఆ రోజుల్లో ఆరాధనాభావంతోచేసినా గొప్పవేడుకగా వుండేది. అందుకే "సుబ్బారాయుడిపెళ్ళి చూసివద్దాం రండి" అనేది పిల్లల పాటల్లో పెద్దగాచోటుచేసుకుంది.

ఈ షష్టిఉత్సవాలకు బిక్కవోలు, మహేంద్రవాడ, పందలపాక, కొంకుదురు, సంగం, రాగంపేట, దివిలిదగ్గర సుబ్బారాయుడుపేట, మల్లాం దగ్గర సుబ్బారాయుడుపేట, గొల్లప్రోలుదగ్గర తాడిపర్తి, చేబోలుదగ్గర మల్లవరం, గొల్లపాలెందగ్గర గొర్రిపూడి, ఈంద్రపాలెం గ్రామాలుప్రసిద్ధి.

## రధసప్తమి

ఇదిప్రత్యేకించి స్త్రీలకు సంబంధించినది. మాఘబహుళ సప్తమి రోజునవస్తుంది. ఇది సూర్యారాధనకుద్దేశింపబడిన కార్యక్రమం. స్త్రీలు ఉదయమేనెత్తిమీదతెల్ల జిల్లేడాకుపెట్టుకుని దానిపై రేగుపండుపెట్టి, దానిపై చెంబుతో నీళ్ళుపోసుకుంటూ శిరస్నానంచేసి ఏరుపిడకలతో (ఆవు పేడ గోడనుచంపకుండా వేసినపేడకడి వేసింది వేసినట్టేతీసి ఎండబెడతారు. ఇదేఏరుపిడక). దాలివేసి (దాలిఅంటే పిడకల్ని హెచ్చుతగ్గులేకుండా బయట గుండ్రంగాపేర్చడం) దానికి అగ్నిముట్టించి, దానిమీద చెంబుతో ఆవుపాలు పోసిపొంగిస్తారు. పొంగుపొంగుకీ గుప్పెడుబియ్యం చొప్పున మూడుపొంగు లలోవేసి "నీపాలు మేము పొంగిస్తున్నాం, మా సంసారం నువ్వుపొంగించు తండ్రీ" అంటూ పరమాన్నంవండుతారు. చిక్కుడుకాయలు చీపురుపుల్లలతో రథాలుగాగ్రుచ్చి, దానిపై తమలపాకుపరచి, దానిమీద ఆపాయసంపోసి సూర్యభగవానునికి నైవేద్యంపెట్టి, రథాలు సూర్యాభిముఖంగా ఎండలోలాగు తారు. (దేహంమీద ఎండపడడంకూడా ఆరోగ్యరీత్యా అవసరంకదా!)

అయినాఆదిలో ప్రకృతిశక్తులన్నీ ఆరాధ్యదైవాలే! జిల్లేడుపత్తి ఒత్తి పాలతోఅద్ది, తలమీద తెగినచోటపెట్టిరాస్తే నొప్పి తగ్గుతుందట. తెల్ల జిల్లేడాకురసం చంటిబిడ్డలనొప్పులకు గొప్పఔషదం. రేగుకాయ 'సి' విటమిన్ నిండుగాకలగినఫలం.

రథసప్తమినిగురించి శ్రీనాధుడు శివరాత్రిమహాత్మ్యంలో "మెఱయు వేసవి రథసప్తమీ దినమున" అని వ్రాశాడు.

ఆంధ్రదేశంలో సూర్యదేవాలయాలు మూడుచోట్లేఉన్నాయి. 1) అర సవిల్లి 2) గొల్లలమామిడాడ 3) పెద్దాపురం పాండవుల మెట్టమీద గొల్లలమామిడాడలో సూర్యునికి ఉత్సవాలు యీసప్తమికి ప్రారంభించి భీష్మఏకాదశివరకూ అయిదురోజులూ అద్భుతంగా చేస్తారు.

## కృష్ణాష్టమి

"కస్తూరి రంగరంగా,
నాయన్న కావేటిరంగరంగా"
"అష్టమీ దినమందునా
కృష్ణావతారుడై జన్మించెను"

శ్రావణబహుళఅష్టమి శ్రీకృష్ణునిజన్మదినం. ఇదే కృష్ణాష్టమి. కృష్ణుడు ద్వాపరయుగం అంతటినీ ప్రభావితంచేసిన గొప్ప మహాత్ముడు.

"పరిత్రాణాయ సాధూనాం,
వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే."

అనేది గీతావాక్యం. కంసాది రాక్షసులను గూల్చి, దుర్యోధనాది దుర్మార్గులనుశిక్షించి ధర్మరాజువంటి సన్మార్గులకండగానిలిచి ధర్మసంస్థాపనము గావించినాడు. అందుకే అతడుదేవుడు. ఆదేవుడు పుట్టినరోజు పల్లెజనులకు పెద్ద పండుగ. బాలకృష్ణుడు చిలిపిచేష్టలతో గొల్లపల్లెనంతటినీ అలరించాడు. గొల్ల భామలు పైనఉట్టెలలోదాచుకున్న కుండలలోని పాలు, పెరుగు, వెన్న ఎగిరిఅందుకొని తినెయ్యడం ఓముచ్చట. గొల్ల కాంతలు యశోదదగ్గరకొచ్చి -

"ఓయమ్మ నీకుమారుడు
మా యిండ్లను పాలుపెరుగు మననీడమ్మా
పోయెద మెక్కడికయినను"

అని ఫిర్యాదులు చేసేవారు. కోపంగాకాదు - ముద్దుగా. ఆముద్దు చేష్టలు జ్ఞప్తికివచ్చేలా ఆరోజున గ్రామాల్లో ఉట్లసంబరంచేస్తారు. ఉట్ల సంబరమంటే ఆసాయంకాలంవేళ రోడ్డుకిరువైపులా రెండురాటలుపాతి, దానికి కొబ్బరిఆకులుచుట్టి, పైని రెంటినీకలుపుతూ అడ్డుగా మరొకరాట కట్టి దానికి మామిడాకుతోరణాలుఅమరుస్తారు. ఉట్టిలో కుండనుంచి ఉట్టికి పొడుగాటిత్రాడుకట్టి పై రాటమీద అవతలవైపునుండి వ్రేలాడేటట్టుచేసి ఆవలి వైపు త్రాడుచివరబట్టుకొని దూరంగానిలిచి ఒకరు క్రిందకీ మీదికీ లాగు తుంటారు. ఒకగొల్లబాలుడు దానిక్రింద అటూయిటూ తిరుగుతూ దానినందు కోవడానికి ప్రయత్నిస్తాడు. త్రాడు పట్టుకున్నవారు ఉట్టి అతనికి అందేలా ఓంచుతూ అతను పరుగెత్తికెళ్ళి పట్టుకోబోగా గభాల్న దాన్ని పైకి లాగేస్తుం టారు.ఇలాఅతను పట్టుకోవడానికి ప్రయత్నించేటప్పుడు చిన్నపిల్లలువెదురు బొంగుతోచేసిన పిచికారీగొట్టాలతో అతనిపై నీళ్ళుకొడుతుంటారు. కొంత సేపటికి ఎలాగోలాగ అందేసుకుంటాడు. (అలసిపోతే వాళ్ళే అందుకొనే లాగ వదులుతారనుకోండి). ఇక్కడ అతడు గొల్లకృష్ణుడుగానూ, ఆఉట్టి లోనిచిన్నికుండ చల్లకుండగానూ భావన. ఆకుండలో పెరుగు, వెండిరూపా యలు వుండేవి. అవి అతనికి సత్కారమన్నమాట. ఇలా చిన్నికృష్ణుని క్రీడ మళ్ళీ తమకళ్ళముందు ప్రత్యక్షంచేసుకుంటున్నఆనందం ఆపల్లీయులది.

## శ్రీరామనవమి

"సీతమ్మ పెళ్ళికూతురాయెనే మన
రామయ్య పెళ్ళికొడుకాయెనే
ఆనంద మానందమాయెనే"-

అసలు సీతారాములపెండ్లి తలంపే జానపదులకి పెద్దపులకిరింపు. నిజానికి సీతారాములు తెలుగువాళ్ళేమోఅన్నంత గట్టిగాహత్తుకుపోయేరు తెలుగుహృదయాలలో. ఎక్కడి త్రేతాయుగం! ఎక్కడీ కలియుగం! నాడు దుష్టశిక్షణకై పుట్టినరాముడు కలియుగంలో తెలుగింటిబిడ్డలాగ తెలుగు ప్రజలచే ఏటేటా వైభవంగా వివాహవేడుక జరిపించుకుంటున్నాడు. ఆనాడు చైత్రశుద్ధనవమిరోజున వారివివాహం జరిగిందట. అదేరోజు ఆనందంతో ప్రతిరామాలయంలోనూ జరిపిస్తారు సీతాకళ్యాణం వేదోక్తంగా. ఒకభార్యాభర్తలజంట పీటలమీదకూర్చుంటే పురోహితుడు వివాహంతంతు జరిపిస్తాడు. ఈపెళ్ళికి ప్రత్యేకించి ఏలకులపొడి, మిరియాలపొడి, కొత్త బెల్లం కలిపిన పానకం, చలిమిడీ, వడపప్పు ప్రసాదం ప్రత్యేకత.

వివాహవేడుకలుగా అయిదురోజులూ రాత్రులు వినోదకార్యక్రమాలు (సినిమాలు కావులెండి) నిర్వహించేవారు. ఈ నవమికి "అడనేముక్కాని ఈడనేగడవేసి పడవెక్కి భద్రాద్రిపోదామా, చలిగంగస్నానాలుచేదామా" అంటూ మాత్రగా యువజంటలూ "పదవే భద్రాద్రికి పాపిష్టిఘటమా" అంటూ వృద్ధులూ "అదిగో భద్రాద్రిగౌతమి యిదుగోచూడండి'' అంటూ భక్తులూ భజనలుచేస్తూ లాంచీల్లోనూ, పడవల్లోనూ, నడకల్లోనూ జట్లు జట్లుగాకూడి భద్రాచలంవెళ్ళి వైభవోపేతమైనఆకళ్యాణంచూసి తమజన్మ ధన్యమైనట్లు మురిసిపోయేవారు. సీతారాముల పదములసవ్వడిలో పవిత్ర మైన ఆప్రదేశంచూసి పుణ్యంసంపాదించుకొన్నామనేది వాళ్ళసంతృప్తి.

## విజయదశమి

"మహిషాసుర మర్దించి మహిళఖ్యాతిగన్నరోజు.'' స్త్రీ వంటింటి కుందేలుకాదు, సర్వశక్తిస్వరూపిణి అనేపదానికి సంకేతం దుర్గ మహిషా

సురుని సంహరించి విజయంపొందినరోజు. అర్జునుడు భారతయుద్ధానికి విల్లంబులు అందుకున్నరోజు. ఈరోజు శమీవృక్షంనుండిఅస్త్రాలుతీసి సంధించి భారతయుద్ధంలోవిజయుడయ్యాడు. అందుకే ఈ దశమిని విజయ దశమి అన్నారు. గ్రామాల్లోయీరోజుమధ్యాహ్నం దుర్గాలయంవద్ద పురోహితుడు దేవీపురాణంచెబుతాడు.

"శమీ సమయతే పాపం
శమీ శత్రువినాశనీ
అర్జునస్య ధనుర్ధారీ
రామస్య ప్రియదర్శనీ."

అనే శ్లోకం వ్రాయబడ్డచీటీనితీసికొని ప్రతిఒక్కరూ జమ్మిచెట్టు కొమ్మలకు గ్రుచ్చుతారు. ఇది ఆశ్వయుజశుద్ధదశమిరోజు. దీనికిముందు పాడ్యమినాటినుండి శరన్నవరాత్రులుప్రారంభం. ఇవే దసరాలు.

ఈరోజుల్లో బడిపిల్లలు గిలకలబద్దలుచేతపట్టుకుని ఉపాధ్యాయులతో కలిసి ఊరంతాతిరుగుతూ ఆయావిద్యార్థులయిళ్ళకువెళ్ళి -

"ఏదయా మీదయా మామీదలేదు
ఇంత సేపుంచుటా యిది మీకుతగునా
ఆకళ్ళతోటి మీ వాకిళ్ళలోనా
ఉంచుటా యిదిమీకు ధర్మంబుకాదు
రేపురా మాపురా మళ్ళిరమ్మనక
యీమారువచ్చితే యిప్పింతుమనక
యిరుగు పొరుగులవారు యిస్తారుసొమ్ము
గొప్పగా చూడండి తప్పకనుమీరు
పావలాబేడయితె పట్టేదిలేదు
అర్ధరూపాయిస్తె అంటేదిలేదు
ముప్పావలాయిస్తె ముట్టేదిలేదు

అయ్యవారికి చాలు అయిదువరహాలు
పిల్లవాళ్ళకుచాలు పప్పుబెల్లాలు
జయాభిజయభవా, దిగ్విజయీభవ."

అంటూ దసరాపాటలుపాడుతూ పాటఆనంతరం గిలకలలో పువ్వులు, బుక్కా దట్టించి అందరూఒక్కసారిగాకొడుతుంటే చూడముచ్చటగా ఉంటుంది. ఆయింటివారుసాదరంగా పిల్లలకు పప్పుబెల్లాలుపెట్టి (బొటానీలు, బోడశనగలు, మరమరాలు, కొబ్బరిముక్కలు వగైరా బెల్లంకలిపినవి), ఉపాధ్యాయులకు అయిదో పదో రూపాయలుయిచ్చి సత్కరించేవారు. (ఆరోజుల్లో ఉపాధ్యాయులకు అదే బోనస్సు.)

ఈ దసరారోజుల్నే దేవీనవరాత్రులంటారు. గ్రామస్తులు తమలో తాము చందాలు వేసుకొని యీ తొమ్మిదిరోజులూ అమ్మవారికి పూజలు జరిపిస్తూ రాత్రులు వినోదకార్యక్రమాలు (డిస్కోడ్యాన్సులు, కేబెరాడ్యాన్సులు లాంటివికావు) భక్తిప్రదమైనవిజరిపిస్తూ ఊరంతటికీ పండుగుగాచేసేవారు.

ఆఖరిరోజున దేవీనినిలిపినపీఠం ఎత్తేసి ఊరేగింపుగా తీసికెళ్ళి జలనిమజ్జనంచేసి మిగిలిన డబ్బుతో పేదసాదలకు సంతర్పణచేసేవారు. (ఇప్పుడీ ఉత్సవాలునడపడం కొందరికి వ్యాపారంగా మారిందనుకోండి)

## భీష్మఏకాదశి

ఉత్తరాయణపుణ్యకాలంలో మహాపుణ్యదినమిది. భారతంలో భీష్ముడు వశ్యమృత్యువరప్రసాది. (తనచావు తానుకోరుకున్నప్పుడే వస్తుంది.) అంపశయ్యపై ఈరోజువరకూఆగి యీరోజు మృత్యువును ఆహ్వానించిపరమపదించాడు. అందుకేదీనిని భీష్మఏకాదశి అన్నారు. ఇది మాఘశుద్ధ ఏకాదశి. అసలు ఏకాదశులే పర్వదినాలు. ఉత్తరాయణకాలంలో రావడంవల్ల యిది మరింత పుణ్యదినం. స్త్రీ పురుషులు ఈరోజు స్నానంచేసి, దేవునిపూజించి, అన్నపానాలువిడిచి ఉపవసించి రాత్రంతా భజనలతో, దైవధ్యానంతో జాగరణచేసేవారు. కొన్నిచోట్ల తీర్థాలు కూడా చేస్తారు. గొల్లలమామిడాడలో యీతీర్థం గొప్పగాఉంటుంది. ఇలాంటిదే ముక్కోటి ఏకాదశికూడా.

# చిల్కుద్వాదశి

దీనినే క్షీరాబ్దిద్వాదశి అంటారు. ఇది కార్తీకశుద్ధద్వాదశి. ఈరోజు జరిగేది ద్వాదశిపారాయణం. ముందురోజు కార్తీకఏకాదశిరాత్రి జాగరణ చేసి ఈ పగలు బ్రాహ్మణులకు స్వయంపాకాలుయిస్తారు. ఈసాయంత్రం జరిగేది లక్ష్మీనారాయణపూజ. తులసికోటలో విష్ణుతులసి (ఎఱుపుకాండము కలిగినది) లక్ష్మీతులసి (తెలుపుకాండము కలిగినది) కలిపి పాతుతారు. దానిలో చెరుకుగడలు, కాయలతోనున్న ఉసిరికొమ్మ తెచ్చి ప్రక్కనేనిలుపుతారు. పైన కొబ్బరిఆకులపందిరివేసి దానిని బృందావనంగా ఆవాహన చేస్తారు. తులసికోటలో దీపారాధనచేసి (జానపదుల భాషలో తల్లికిలెత్తి) ఆతులసిమొక్కలకు పూజచేస్తారు. అటుకులూ, బెల్లం పూజానంతరం పంచే ప్రసాదం. ఆతులసిమొక్కలు రెంటినీ పూజించడమంటే లక్ష్మీనారాయణులను పూజించడమన్నమాట. లక్ష్మీనారాయణులు వర్షాకాలంలో యోగనిద్రలో నిమగ్నులవుతారు. ఉత్తైనేకాదశినాడు (ఈరోజుకు ముందురోజే) మేల్కొంటారట. ఈ మేలుకోవడాన్ని నన్నెచోడుడు కుమారసంభవంలో ఇలాఅంటాడు-

"జలవాసులయిన హరిలక్ష్ములు
వర్ష నిశావసానమున మేల్కని,
కన్నులువిచ్చి చూచునట్టుల
జలజోత్పలరుచులువెలసె శారదవేళన్"

కార్తీకమాసంలో ద్వాదశినాడు ఉసిరిచెట్టుక్రింద వనభోజనాలుఅని కొన్ని చిన్న చిన్న కుటుంబాలు జట్టులుజట్టులుగా ఉసిరిచెట్టున్న దిమ్మల మీదికివెళ్ళి భక్తిశ్రద్ధలతో అక్కడ లక్ష్మీనారాయణులనుపూజించి ఉసిరి చెట్టుక్రిందవంటలుచేసుకునిభోజనాలుచేస్తారు పుణ్యమని. (ఇప్పుడు వన భోజనాలంటే ఉసిరిచెట్టుతోపనిలేదు. త్రాగడానికీ, పేకాడుకోవడానికి అనుకూలంగా వుండాలంతే)

ఉసిరికలోని విటమిన్ 'సి' రక్తశుద్ధికీ, మేహశాంతికీ మంచు.

# మహాశివరాత్రి

"శివ శివ యనమేలు తుమ్మెదా
శివ యంటేనె వినమేలు తుమ్మెదా"

ఇది శివపరంగా గొప్ప పర్వదినం. మాఘబహుళ త్రయోదశినాడు వస్తుంది. ఈరోజున శివాలయాల్లో లక్షపత్రీపూజలు, అభిషేకాలూ జరిపిస్తారు. రోజంతా ఉపవాసముండి రాత్రంతా నిద్రపోకుండా జాగరణచేస్తే (పేకాటలాంటి వాటితోకాదు) శంకరుడు గొప్పపుణ్యం యిస్తాడట. ఈరోజు శివప్రసాదం దొంగలించితిన్నా పుణ్యలోకప్రాప్తి కలుగుతుందని ఒక పురాణగాథవుంది. ఒకచోరుడు ఒకరాత్రి ఒకరియింట్లో దొంగతనం చేసిపారిపోతుంటే రక్షకభటులు వెంబడిస్తుంటే ఒక శివాలయంలో దూరి దాక్కున్నాడట. అర్ధరాత్రి ఆకలి వేసింది. ఆ చీకట్లోవెతుక్కుంటూ గర్భగుడిలోకివెళ్ళి దేవునికి నైవేద్యం పెట్టిన అరటిపండుతీసుకుతిని క్షుద్బాధ తీర్చుకున్నాడు. అది శివరాత్రిరోజు. తరువాతకొన్నాళ్ళకు అతను చచ్చిపోయాడు, యమభటులువచ్చారు. వెంటనే శంకరుని కింకరులూవచ్చారు. ఇతను దురాత్ముడు, దుష్టుడు, చోరుడు. ఇతను రావలసింది నరకంలోకి అని యమభటులంటే, శివరాత్రినాడు శివసన్నిధిలో నిద్రమేల్కొనివుండి శివప్రసాదం తినడంవల్ల కైవల్యప్రాప్తివుంది అని కైలాసానికి తీసుకుపోయారట శంకరుని కింకరులు. ఇదీదీని ప్రాశస్త్యం. అందువల్ల చాలా గ్రామాల్లో జాగరణలతో, ప్రసాదాలతో ఇది తీర్థంలాచేస్తారు. ఈతీర్థానికి కోటిపల్లి, ద్రాక్షారామ, కొంకుదురు, సామర్లకోట దగ్గర భీమవరం ప్రసిద్ధి.

# నరక చతుర్దశి

ఆశ్వయుజబహుళ చతుర్దశిని నరకచతుర్దశి అంటారు. సత్యభామ నరకాసురుని సంహరించిన దినమిది. మహిళ అబలకాదు, సబల అని నిరూపించుకున్న రోజు. ఆనందంతో అందరూ అభ్యంగనస్నానాలుచేసి

కూతుళ్ళనూ, కొత్తఅల్లుళ్ళనూ రప్పించి షడ్రసోపేతంగా భోజనాలుపెట్టి కొత్తబట్టలుపెట్టి సంక్రాంతిలా సత్కరిస్తారు.

## దీపావళి

మరుసటిరోజు దీపావళి అమావాస్య. లోకకంటకుడయిన నరకాసురుని మరణానికి ఆనందిస్తున్నట్లు ఆరాత్రి మతాబాలూ, చిచ్చుబుడ్లూ, కాకరపువ్వొత్తులూ, టపాకాయలూ, తారాజువ్వలూ కాల్చి వేడుక జరుపుకుంటారు. కొందరు పిల్లలు బొగ్గు, ఉప్పు, కొబ్బరిపొట్టు కలిపి గుడ్డతోచుట్టి ఉప్పొట్లాలుకట్టి దానిలో నిప్పులువేసి గిరగిరత్రిప్పుతుంటే చుట్టూ చక్రంలా ముత్యాలురాలుతుంటే చూడ్డానికి బలేతమాషాగా ఉంటుంది. ఇనుముతో రోలులాగా, రోకలిలాగా చిన్నవి తయారుచేసి వానిని ఒక ఇనుపఊచకు ఇరువైపులా బిగించి ఆ రోలులో రోకలి దూరేలా అమరుస్తారు. ఆ తరువాత పొటాష్, గంధకం కలిపి అది చిటికెడుతీసి రోలు కన్నంలో వేసి దానిలో ఆ రోకలి చొప్పించి, రోకలి క్రిందకుండేటట్లు పట్టుకుని రాయిమీద కొడితే "టప్"మని పేలుతుంది. పిల్లలకు అది ఆనందం. ఖర్చుతక్కువ. పూర్వం జానపదులలో పిల్లలు దీపావళికి 10 రోజులు ముందునుంచే యిలా పేలుస్తుండేవారు. బాణాసంచా కాల్చడంవల్ల హానికరమయిన క్రిమికీటకాదులు నశిస్తాయని ఆరోగ్యసూత్రం. ప్రతియింటా అరుగులమీద ప్రమిదలలో నూనెపోసి పోటాపోటీగా దీపాలువెలిగించి, వీధులను దీపాలమయం చేస్తారు. ఈ దీపాలకు పురుగులు చేరతాయి. ఈ పురుగులు బాణాసంచాలోని గంధకం, సూరేకారం పొగకు చచ్చిపోతాయి.

సింహాసన ద్వాత్రింశికలో దీపావళిని "దివ్వెల పండుగ" అన్నారు.

## పోలాలమావాస్య

అమావాస్యల్లో ప్రసిద్ధిగన్న మరోఅమావాస్యయిది. పోలిస్వర్గాని కెళ్ళినరోజు, కార్తీకమాసం చివరిరోజు, కార్తీకమాస మంతా భక్తి

శ్రద్ధలతో తెల్లవారుజామున స్నానంచేసి దీపారాధనచేసి ఉపవసించినవారికి పొందిత్రోక్త కైలాసం వస్తుందని కార్తీకపురాణంలో చెప్పబడింది. ఒకఅత్త గారు కార్తీకమాసమంతా ప్రతిరోజు స్నానానికికాలువకువెళ్ళి దీపారాధన చేసివచ్చేది — కాని కోడలిని రానిచ్చేదికాదట. (ఆమెకెక్కడ పుణ్యం వచ్చేస్తుందో అని) కోడలు అత్తగారు వెళ్ళగానే యింటివద్దే స్నానంచేసి నిష్ఠతో దీపారాధనచేసి అత్తగారికి తెలిస్తే కోప్పడుతుందని కనిపించకుండా పైనతట్ట మూతపెట్టేదట. రోజంతా మనసులో దైవాన్ని స్మరిస్తూ ఉపవసించేది. ఆమె పేరుపోలమ్మ. చివరిరోజున ఈ అమావాస్యనాడు దీపారాధన పూర్తికాగానే అత్తగారు యింటికి వచ్చేసరికి దేవదూతలు పోలమ్మను పూలవిమానంలో ఎక్కించుకుని ఆకాశమార్గాన స్వర్గానికి తీసుకెళుతున్నారట. అత్తగారుచూసి ఆశ్చర్యపోయింది. తనకు రావలసింది ఆమెకొచ్చిందేమిటని ! అందుకే వేమన్నగారన్నారు "చిత్తశుద్ధిలేని శివపూజలేలయా విశ్వదాభిరామ వినురవేమ" అని.

## కార్తీకపూర్ణిమ

కార్తీకంలో అన్నిరోజులూ దైవారాధనకు పుణ్యదినాలే. చాలా మంది యీ నెలరోజులూ వేకువజామునేలేచి ఉషస్సుగడియలు దాటకుండా దగ్గరున్న కాలువలో స్నానంచేసి అరటిదొన్నెలలో ఆవునేతిలో ముంచిన వత్తులువేసి వెలిగించి కాలువలో వదలిపెడతారు.

ఆసంధ్య చీకట్లలోఅవిచూస్తుంటే కాలువలో నక్షత్రాలు ప్రయాణిస్తున్నట్లు కనులవిందుగా కనిపిస్తాయి. ఇంటిదగ్గర సందకాడ (సాయం సంధ్యకు జానపదులు వాడే పదం ఇది) ఆకాశదీపాలు పెడతారు. వాటిని ఒక రాటకు పుల్లీకట్టి దానిలోంచి ఒకతాడు లాగి ఆ తాడుకున్న ఒక చివర చుట్టూ చిన్న చిన్న చిల్లులుగల ఇత్తడి బరిణలో ప్రమిద పెట్టి దానిలో నూనె, వత్తులువేసి వెలిగించి త్రాడు రెండవ చివర పట్టుకు లాగితే ఆ బరిణపైకి రాటచివరికిపోతుంది. — అక్కడ బరిణకన్నాలలో

మంచి మినుకుమినుకుమంటూ వెలుతులు కనిపిస్తుంటే అదో చిన్న నక్షత్ర మండలంలా ఉంటుంది. ఈ భరిణనే ఆకాశదీపమంటారు. ఇవన్నీ పుణ్య సంపాదన ప్రక్రియలలో భాగాలే.

ఈ రోజు నవవధువులు ఉపవాసముండి దేవునిగుళ్ళో కందపిలకలు, పసుపుచెట్లూ అర్పణగా ఇస్తారు పిల్లలు తొందరగాకలగాలని. దేవునిగుడి ముందు రాత్రి జ్వాలాతోరణం కడతారు. జ్వాలాతోరణం అంటే రెండు రాటలు దూరంగాపాతి, ఆ రెండిటినీ కలుపుతూ పై నవట్టిగడ్డి (ఎండుగడ్డి) వెంటుతోకట్టి, దానిపై ఒకమోపువట్టిగడ్డి వేలాడదీస్తారు. దేవుడు ఊరు తిరిగిరాగానే ఆ పల్లకీ దానిక్రింద మూడుసార్లు అటూయిటూ త్రిప్పికాగ డాతో ఆ మోపుకు అగ్నిముట్టిస్తారు. అది అంటుకుపోతుంటే అందరూ ఎగబడి ఆగడ్డిలాగేసుకుంటారు. ఆగడ్డి పశువులకువేస్తే పాలెక్కువిస్తా యని విశ్వాసం.

ఈ జ్వాలాతోరణానికిముందు పల్లెజనులలో యువకులు మర్రిచెట్టు ఊడలుతెచ్చి ఏవీధివారు ఆవీధి జట్టుగా ఏర్పడి, ఒకవైపు ఒకవీధివారూ, రెండోవైపు మరోవీధివారూ లాగుతూవుంటారు. ఆ ఊడ ఏ వైపుకు లాక్కుపోతే ఆవీధివారు గెలిచినట్టు. తోరణం వెలిగించేవరకూ గ్రామాల్లో వెన్నెట్లో బలప్రదర్శన సంబంధించిన కాలక్షేపం క్రీడయిది.

ఇలాగ ఈ తిథులకు పుణ్యం, పురుషార్థం ఆపాదించి ఆయాకార్య క్రమాలు నిర్వహింపజేసేవారు. వీనికి పైకి భక్తిపరంగానో, వేడుకపరం గానో అర్థాలుచెప్పినా ప్రతిదానివెనుకా వైద్యం, ఆరోగ్యం, శుచి, శుభ్రత ఆప్యాయత. మమతవంటి ఏదోవక శాస్త్రీయభావన యిమిడివుంటుంది. శాస్త్రసత్యాన్ని ప్రత్యక్షంగా చెబితే సామాన్యుడు స్పందించక పోవచ్చు. అందునాటికి సరిపడేసరీతిలో యిలా పరోక్షంగా ఆచరింపచెయ్యడం వీని పరమార్థం. ఇదే కాంతాసమ్మితోపదేశమంటే.



# ఉపసంహారం

ఆంధ్రజాతీయసంస్కృతికి ఈ జానపద కళలు, క్రీడలు, వేడుకలు చేసిన దోహదం గణనీయం. ఇందులో చెప్పబడినవన్నీ గోదావరిసీమలోని కళాకారులు ప్రదర్శించినవో లేక ఇతర ప్రాంతకళాకారులచే గోదావరిసీమలో ప్రదర్శింపబడినవో మాత్రమే.

విద్యాలయాలులేని ఒకనాడు ఈజానపదకళలే విజ్ఞానప్రదాయినులుగా భాసిల్లాయి. అక్షరజ్ఞానంలేకున్నా, విచక్షణాజ్ఞానాన్ని కలిగించాయి. నీతి, నియమం, సదాచారం, సద్భావం ప్రోదిచేసి కలతలూ కలహాలూలేని వాస్తవ జగత్తులో నివశింపచేశాయి. ఆచారవ్యవహారాల పేరుతో ఉత్తమరీతుల్ని ఉద్బోధించాయి. నాటి క్రీడలు, వేడుకలు ఖర్చులేకుండా మానవుని మానసిక, శారీరక వికాసానికీ, వినోదానికీ ఎంతో దోహదంచేశాయి. పేరుకు కులమతాలున్నా చేతలలో దానికిఅతీతంగానడిపించి సామరస్యజీవనకాముకాలయ్యాయి. విషయపరిజ్ఞానం, వ్యవహారరీతి సుగమగతిలో శరీరంలోనిఅణువణువుకూ అందించి మనిషి పుట్టుకనుండిచావువరకూ జీవితాన్నితీర్చిదిద్దాయి. "ఆనందో బ్రహ్మ" అనేది మూలసూత్రముగా యివన్నీఅల్లబడ్డాయి. అందుకే ఆరోజుల్లో చిదానందంగా బ్రతకగలిగారు. ఉన్నంతలో తృప్తిపడి, కలిగినంతలో ప్రక్కవానికిపెట్టి ఆనందించారు. "కర్మణ్యే వాధికారస్తే, మాఫలేషు కదాచన" అన్న గీతాకారుని వాక్యానికి అనుసరణగా "గాలిలో దీపంపెట్టి దేవుడా ! నీదేభారం" అనకుండా తనవంతు కర్తవ్యం తనునిర్వర్తించి, చైతన్యవంతమైన సమాజాన్ని సృష్టించుకొని బ్రతికిఉన్నకాలాన్ని బంగారుమయంచేసుకొని, తానింతతిని, పదుగులకింతపెట్టి ఆదర్శంగా భాసించగలిగారు.

కాలగమనంలో వీరిఅభిరుచులూ, ఆచరణలూ ఆనాగరికంగా భావించబడ్డాయి - ఆచారాలు మూఢాచారాలని నిరసించబడ్డాయి. దానితో ఈ కళలు కూడా నిరసపడ్డాయి. ఇలా యీ జానపదసంపద తీవ్ర తిరస్కారానికి గురికావడంతో వారిఉత్తమపద్ధతులుకూడా తెరమరుగుకుపోయాయి. దేనిలో

నైనా మంచి చెడ్డలు సహజం. అందులో చెడ్డనువదిలేసి మంచిని గ్రహించడం ఉత్తమలక్షణం. అంతేగాని ఏవో కొన్ని లోపాలుచూపి ఆవ్యవస్థనే సమూలంగానాశనంచేయడం సంస్కృతికీ, సమాజ అభ్యున్నతకీ క్షేమంకాదు. "పాతరోత, క్రొత్తవింత" ధోరణి ప్రబలడంశోచనీయం. మన సంస్కృతిలోనివిజ్ఞానాన్నీ, వినోదాన్నీ ఏకానిలాదైనాఎవరిదయినా మనంవినియోగించుకొని లబ్ధిపొందడం విజ్ఞత. డబ్బాపాలు రుచిమరిగి తల్లిపాలనుద్వేషించడం బిడ్డ ఆరోగ్యానికి శ్రేష్ఠంకాదు. చెట్టునుకాసినపండుకంటే ఆరోగ్యంకావు వండుకున్న పదార్థాలు. కాబట్టి మన సంస్కృతిప్రసాదించిన సహజ విజ్ఞాన నిధుల్ని భూస్థాపితంచేసుకుంటే అది జాతికేనష్టం. ఆలస్యంగానయినా ఈ సంగతిగ్రహించిన విశ్వవిద్యాలయాలూ మేధావులూ ఇప్పుడు జానపద కళా సంపదపై దృష్టిసారించి పరిశోధనకు పూనుకొనడం, పురికొల్పడం శుభ పరిణామం.

ఈకళావిజృంభణతో దేశంలో సాంస్కృతికవిప్లవంవచ్చి నాగరికత పేరుతో కృత్రిమవాతావరణంలో, యాంత్రికజీవితంతో మనిషిపట్ల మనిషికుండవలసిన మమతానురాగాల్నీ ప్రేమాభిమానాల్నీ కోల్పోయి, నైతిక విలువలుపడిపోయి, పతనమౌతున్న సమాజానికి "తానెవరో" తెలిపి పూర్వపు ఔన్నత్యానికి పూలబాటవేస్తుందని ఆశిద్దాం. "తానెవరో" తెలుసుకొనడానికి అతనిసంస్కృతిని కళ్ళెదుటబెట్టటమే ఈ పరిశోధన లక్ష్యం.



# పరిశీలన గ్రంథాలు


1. "నాట్యకళ" ఫిబ్రవరి - మార్చి 1970 సంచిక.
2. ఆంధ్రుల జానపద విజ్ఞానము - డా.ఆర్.వి.యస్. సుందరంగారు
3. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి - ఆచార్య ఖండవల్లి లక్ష్మీనిరంజనంగారు.
4. విజ్ఞాన సర్వస్వము - సంస్కృతి -
5. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర - ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు.
6. జానపద గేయసాహిత్య వ్యాసావళి - నేదునూరి గంగాధరంగారు.
7. జానపదగేయాలు - సాంఘికచరిత్ర - డా. బిరుదు రామరాజుగారు డా.నాయని కృష్ణకుమారిగారు
8. నాట్య శాస్త్రము అనువాదము - డా. పోణంగి శ్రీరామ అప్పారావుగారు.
9. కళాకారుడు - సమాజము వ్యాసం - శ్రీ మారేమళ్ళ నాగేశ్వరరావుగారు.
10. కావ్యాలంకార సంగ్రహము - రామరాజ భూషణుడు.
11. చలం - కళ - శ్రీ గుడిపాటి వెంకటచలంగారు
12. భారతీయ జానపద నృత్యాలు -
13. జానపద కళాసంపద - ఆచార్య తూమాటి దోణప్పగారు
14. రూపకళ - విద్వాన్ సహదేవ సూర్యప్రకాశరావుగారు.
15. చలం సాహిత్యావలోకనం - శ్రీమతి యస్.యన్.లక్ష్మిగారు
16. తెలుగు జానపద గేయగాథలు - డా. నాయని కృష్ణకుమారిగారు
17. తెలుగుసామెతలు - జనజీవనం - డా. పి. నరసింహారెడ్డిగారు.
18. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు.
19. యక్షగానాలు - జాతీయాచార్య డా. యస్. వి. జోగారావుగారు.
20. తెలుగు హరికథా సర్వస్వం - ఆచార్య తూమాటి దోణప్పగారు
21. ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము - శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు.
22. క్రీడాభిరామం -

23. తెలుగునాటక వికాసం - డా. P.S.R.అప్పారావుగారు
24. భీమేశ్వర పురాణం - శ్రీనాథుడు
25. సత్యహరిశ్చంద్రీయము - నాటకం - శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు
26. చింతామణి నాటకం - శ్రీ కాళ్ళకూరి నారాయణ రావుగారు.
27. గయోపాఖ్యానం నాటకం - కళాప్రపూర్ణ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు.
28. పాండవోద్యోగ విజయములు నాటకం - తిరుపతి వెంకటకవులు.
29. రంగనాథరామాయణం - గోన బుద్ధారెడ్డిగారు
30. సమాలోచన - ది. 1-5-86 సంచిక
31. శ్రీకాళహస్తి మహాత్మ్యము - ధూర్జటి
32. క్రీడలు - శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు.
33. శ్రీమదాంధ్ర మహాభారతం విరాట పర్వం - తిక్కన
34. కుమారసంభవం - నన్నె చోడుడు
35. వాత్స్యాయన కామసూత్రాలు -
36. సింహాసన ద్వాత్రింశిక - కొరవి గోపరాజు
37. భోజరాజీయము -
38. ఉత్తర హరివంశం - నాచన సోమనాధుడు
39. మహాప్రస్థానం - శ్రీశ్రీ
40. లోకోక్తి ముక్తావళి - విద్వాన్ పి. కృష్ణమూర్తిగారు
41. కూచిపూడి యక్షగానసాహిత్యము సంప్రదాయము, ప్రయోగము - డా. చింతా రామనాథంగారు
42. అభినయం - 28,29, డిశంబరు 1980, సంచిక
43. పంచకళ్యాణి - డా. యస్.వి. జోగారావుగారు
44. తొలకరి - కాటూరి - పింగళి
45. పాండురంగమహాత్మ్యం - తెనాలిరామకృష్ణుడు
46. గణపతి - చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు.